శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# శ్రీ నీలకంఠీయ

## శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

ఆంధ్రీకరణము—సమగ్రము

ACC NO. 21803

1395 / 244 IIC
ROP

THIS BOOK IS PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF TIRUMALA TIRUPATI DEVASTANAMS UNDER THEIR SCHEME "AID TO PUBLISH RELIGIOUS BOOKS."

అనువాదకులు-ప్రకాశకులు

విద్యాభూషణ, సాహిత్యరత్న, శైవవాఙ్మయార్ణవాధ్యక్ష,

ఆచార్య, శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు

శివాద్వైత విజ్ఞాన (సర్వమంగళా) సదనము

184/A, వెస్ట్ మారేడుపల్లి, (నెహ్రూనగర్)

సికిందరాబాద్, 500 026. ఆం. ప్ర.

ప్రథమ ముద్రణ నవంబరు, 1994;
భవనామ సం॥ కార్తిక పూర్ణిమ, శుక్రవారము
ప్రతులు 1000
సర్వస్వామ్యము నిర్మల శంకరశాస్త్రి

181.4.2
N95

వేములవాడ శ్రీరాజరాజేశ్వరస్వామి దేవస్థానమువారి
యథోచిత ధనసహకారమున ప్రథమాధ్యాయము ముద్రితము.

ACC No-21803

వలయువారు
**ఆచార్య, శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు,**
శివాద్వైత విజ్ఞాన (సర్వమంగళా) సదనము,
184/A, వెస్ట్ మారేడుపల్లి
సికింద్రాబాద్-500 026 ఆం.ప్ర.

దీనిని ముద్రించుటకు శైవమహాపీఠమువారి సౌజన్యము తోడుపడినది.

పండితప్రకాండులకు, చందాదారులకును ఉచితము.
తదితరులైన జిజ్ఞాసువులకు 116 రూ॥లు.
వర్తకులకు కమీషను ఇవ్వబడును.

ముద్రణ :
శివాజీ ప్రెస్, గంజ్‌బజార్, సికింద్రాబాదు-3.

శ్రీ శివాద్వైత సిద్ధాంతో విజయతేతరామ్.

జన్మ సమయము :
శ్రీ స్వభాను సం॥ చైత్ర శుద్ధ దశమి, పుష్యనక్షత్రం, సోమవారము



అవతార శుభ సమయము :
కలియుగాదినుండి 2044 సంవత్సరములు

భాష్యకర్తలు-

## శివశ్రీ॥ గౌతమ, నీలకంఠ శ్రౌత శైవాచార్యులవారు

భస్మత్రిపుండ్రాంకిత దివ్యమూర్తిః–రుద్రాక్షకంకణ
లసత్ కరదండయుగ్మః । షట్కాల సంపూజిత
స్వేష్టలింగః-తం నీలకంఠబుధదేశిక మానతో ఒస్మి ॥

శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీ నీలకంఠశ్రౌతశైవాచార్య పరిచయాదికము

ద్వాదశారాధ్యులలో నాచార్యత్రయమున చేరిన శ్రీ నీలకంఠాచార్యులు-గౌతమస గోత్రికుడని, భారద్వాజస గోత్రికుఁడని, చెప్పువాదము నిష్కర్షితము ఇప్పటికిని కానులేదు. గౌతమస గోత్రికుఁడనుటకు- కొన్ని ఆధారములను నా ప్రథమ ముద్రిత భాష్యమున ముందుమాటలో గాననగును.

శ్రీ నీలకంఠాచార్య శివయోగీంద్రులు - గౌరీ విశ్వేశ్వరులనఁబడు మాహేశ్వర (ఆరాధ్య) దంపతులకు శ్రీ కాశీశ్వరస్వామివారి అనుగ్రహమున - నీలలోహిత రుద్రాంశతో - జన్మించిరి. "నీలకంఠుఁడు ప్రస్థాన (ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత అనువాని భాష్య) త్రయకర్తయై శైవారాధ్యమత ప్రచారముఁ గావించియు జగద్గురుపదవి నధిష్ఠించు"నని కాశీశ్వరుఁడు వరము నొసఁగెను.

స్వభాను సంవత్సర చైత్రశుద్ధ దశమి సోమవారమున శుభగ్రహస్థితి గల కర్కాటక లగ్నమున గౌరీదేవియందు జన్మించి దిన దిన ప్రవర్ధమానుఁడగుచుండెను.

కలి యుగాది 2044 సంవత్సరమున శ్రీవారి ప్రాదుర్భావమైనది.

ఇందుకు శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రికృత నీలకంఠ విజయమున దిగువ విధము ప్రమాణమును గాననగును.

శ్లో॥ చతుశ్చత్వారింశదాత్త - సహస్రద్వితయాత్మసు, (2044)
కలౌ వర్షేషు వృత్తేషు - స్వభాను శుభవత్సరే ॥ 1

మాసిచైత్రే వళక్షే హి- పక్షేఽథ దశమీతిథౌ,
పుష్యమ్యా మిందువారే చ - లగ్నే కర్కటకాహ్వయే ॥ 2

గురౌ కర్కటరాశిస్థే - కుజే మీనంగతేఽపి చ ।
మేషే రవౌ బుధయుతే - వృషే మందయుతే కవౌ ॥ 3

అభినంద్య సుతం జాతం - సన్నిభం జాతవేదసా ।
గౌరీ విశ్వేశ్వరౌ ధన్యౌ - భూత్వా ముద మవాపతుః ॥ 4

జన్మలగ్నచక్రము

| | | | |
|---|---|---|---|
| 9<br>కు. | 10<br>ర.బు. | 11<br>శ.శు. | |
| 8 | కర్కాటకము<br>జన్మలగ్నము | | 1<br>చం.గు. |
| 7 | | | 2 |
| 6 | 5 | 4 | 3 |

"కైలాసమున హిరణ్యమంటపములో హరిబ్రహ్మాది దేవగణసహితంబుగ పార్వతీ పరమేశ్వరులు - రత్నఖచిత ఇంద్రనీల మణిమయ పీఠమునందు సుఖాసీనులై యుండుతఱి. నారాయణుఁడు "మహేశ్వరా ! భూలోకమున నానాటికి తగ్గుచున్నట్టి శివభక్తి నుద్ధరించుటకు వ్యాససూత్ర యథార్థమును ప్రవచించు మహాపురుష నొకనిని నియోగింపుఁడు"అని ప్రార్థించెను. "కేశవా! సర్వంబు విదితము; విఘనుఁడు బాదరి యనువారు నావలనఁబొందిన తమ తమ ప్రచారసామర్థ్యమునకు అవసానము అసన్నమైనది. కావున మాయావాద మోహితుల యవివేకమును పోగొట్టి శ్రౌతశైవారాధ్యమతము నుపపాదించుటకు నీలలోహితరుద్రు నాజ్ఞాపించుచున్నానని" శ్రీ పరమేశ్వరుఁడు అనుగ్రహించెననియు, నీలలోహితరుద్రుఁడే నీ కుమారుఁడుగ నవతరించెననియు, ఇది యంతయు దివ్యదృష్టితో కనుగొంటి

ననియు శ్రీ బోధాయన మహర్షి- వక్కాణించి - వెనువెంటనే శ్రీ గౌరీవిశ్వేశ్వరులతో సహా - శ్రీ నీలకంఠాచార్యుని - వారాణసీక్షేత్రమున నివసించు శ్రీ శ్వేతాచార్యుని సన్నిధిఁజేర్చెను.

శ్వేతాచార్యులు నీలకంఠునకు ఉపనయన సంస్కారమును గావించి శాంభవ దీక్ష నొసఁగియు సర్వదర్శనములయందు అసాధారణ పండితునొనర్చిరి. మరియు అఘోరవిద్య నుపదేశించి "గృహస్థుఁడవై శివాద్వైత సంప్రదాయ ప్రచారమును భువిఁ గావింపు"మని యాదేశించిరి.

ఆ తరువాత గౌరీ విశ్వేశ్వరులు నీలకంఠుని తోడ్కొని కాళేశ్వరముఁ జేరి- హరితస గోత్రోద్భవుఁడైన వీరభద్రారాధ్యుల పుత్రికయగు సర్వమంగళతో వివాహమును నెరవేర్చిరి. ఆ సమయముననే శ్రీ కాళేశ్వరస్వామివారి వరమున కుబేరాంశతో జన్మించిన విక్రమాంక మహీపాలుఁడు - శ్రీ నీలకంఠాచార్యులవారి యమోఘపాండిత్య వైభవము నాకర్ణించి- శ్రీవారికి కాంచనభూషణ వస్త్రాదివస్తు సమర్పణ పురస్సరముగ విధేయుఁడయ్యెను.

శ్రీ నీలకంఠాచార్యుని చెంత భాష్యాంతము పఠించిన శిష్యులలో దాక్షిణాత్యుఁడైన హరదత్తుఁడు; ప్రతీచ్యుఁడగు సోమశేఖరుఁడు: ఉదీచ్యుఁడైన భవదేవుఁడు; ప్రాచ్యుఁడగు భీమేశ్వరుఁడును ప్రఖ్యాతులై స్వగురువిరచిత ప్రస్థానత్రయమును నలుదిసలయందు ప్రచార మొనర్చిరి.

శ్రీవారికి సర్వమంగళాదేవియందు - సోమేశ్వరుఁడు, అఘోరనాథుఁడు, కాళేశ్వరుఁడు, శ్రీగిరీశ్వరుఁడు నను నలుగురు కుమారులు జన్మించి పెంపొందినవారై తమ వంశములను విస్తరింపఁజేసిరి. "కాళేశ్వరం" అను ఇంటిపేరు గలవారు - శ్రీవారి వంశీకులని తోచెడిని. అంత శ్రీవారు - జైన బౌద్ధ చార్వాకాది అవైదికమతములను ఖండించి వైదిక మూర్ధన్యమగు శైవమత సిద్ధాంతమును ప్రతిపాదించుచు కాశీక్షేత్రముఁ జేరి గొప్ప విద్వాంసుల సభలలో పూర్వపక్షములను నిరాకరించి "శివుఁడొకఁడే - ఆరాధ్యదైవము, శివాద్వైత సిద్ధాంతమే ప్రామాణికంబు"నని ప్రవచించుచుండగా- ఇదియే యథార్థమని - విశ్వనాథ మందిరమున కొడుపు లేని గంట- ప్రణవనాదముఁ జేయుచుండెను.

అట్టితఱి కాశీపండితులు శ్రీవారి నోడింపలేక- ''దేవీ పాదపద్మసన్నిధిని-

వేదాంతగ్రంథముల నన్నిటి నుంచెదము. దేనిని దేవి శిరమునఁదాల్చునో అది-సర్వజనాంగీకృతంబగును" అని వచించి భాష్యముల నన్నిటిని దేవిమ్రోల నునిచి ముహూర్తకాలము కాగానే ద్వారముఁ దెఱచి చూడగా- శ్రీ నీలకంఠభాష్యమే దేవీ శిరమున నున్నట్లు గాంచి- మీ భాష్యమే సర్వబుధజన సమ్మతంబైనదని- యంగీకరించి శ్రీవారికి- విజయపత్రమును సమర్పించిరి.

## స్వవిషయము

ఇట్టి యనుపమ భాష్యము దురవగాహ మగుటచే-మహోపాధ్యాయ, శ్రీ శివయోగి, ముదిగొండ నాగలింగారాధ్యశాస్త్రులు — "శివచింతామణిప్రభ" అను సంస్కృతవ్యాఖ్యానమును వ్రాసి-కోవిదులకు భాష్యార్థమును విశదీకరించిరి. ఇట్టి వ్యాఖ్యయు శైవులకు తెలియదేమోనని ఈ యనువాదమును వ్రాయవలసివచ్చినది.

దీని ననువదించుమని- నిరతాన్నదాతలు, శరభేశ్వరాలయ జీర్ణోద్ధారకులు, శివభాగవత శ్రేష్ఠులు నగు లోకారాధ్యులైన శివశ్రీ॥ (కీ.శే.) ఘట్టేపల్లి నాగమల్లయారాధ్యులవారు (సిద్దిపేట) ప్రేరేపించినందున ఈ యనువాదము నొనర్చితిని.

షట్ దర్శనపారీణులగు శ్రీమదాత్రేయ లక్ష్మణశాస్త్రులఁ గారి చెంత నోరుగల్లుపురసీమ శ్రీ పణికెల రామలింగేశ్వరస్వామి సన్నిధిని- మాజీ పీఠాధిపతియగు శివశ్రీ (కీ.శే.) ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారి ప్రోత్సాహమున శ్రీయుత (కీ.శే.) రామిణి రాజమౌళిశ్రేష్ఠిగారి ఆశ్రయమున- భాష్యముల నధ్యయనముఁజేసి శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రులఁ గారిచే పరీక్షితుఁడనై - ప్రథమ శ్రేణియందు ఉత్తీర్ణుఁడ నైతిని.

ఈ యాంధ్రీకరణము యథామతి - దాదాపు పన్నెండేండ్లు వ్రాసి మహామహుల అండదండలకై ప్రయత్నించితిని. తథాపి తదా సాఫల్యము లభింపలేదు.

సంప్రతి- మూడు సంవత్సరములనుండి - శైవమహా పీఠాధ్యక్షుఁడనై పీఠ ప్రముఖులయొక్క- పునః పునః ప్రోత్సాహముతో శివానుగ్రహమువలన వదాన్యుల ఆర్థికసహకారమును పొందుటయే గాక శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి ప్రబలసాహాయ్యమున మరియు శ్రీ వేములవాడ - రాజరాజేశ్వర దేవస్థానము వారి సహకారమున తదితర అభ్యర్థిత సంస్థల తోడ్పాటువలనను నా యనూదిత భాష్యమును సమగ్రముగ ముద్రింపఁజేసి చరితార్థుఁడ నైతిని.

ఆర్థిక శారీరక సహకారము నొనర్చి నా నిరుత్సాహమును పోగొట్టిన సహృదయులకు ఆత్మీయులకును అభినందనలు; తమ సదభిప్రాయముల నడుగుట తోడనే వ్రాసి ఇచ్చిన పండితప్రకాండులకు కృతజ్ఞతలు; తదితరులకు శుభాశీస్సులు;

ఎట్టి అవశ్యక స్ఖాలిత్యములను పడనీయక - సర్వాంగ సుందరముగ నేతద్గ్రంధమును సరసమైన తగ్గింపు రేటునకు ముద్రించి సకాలములో అందఁజేసిన శివాజీప్రెస్ ప్రెసిడెంటుగారు, పర్యవేక్షకులు, కర్మచారులును ప్రశంసనీయులగుచున్నవారు.

ఈ నా యనువాదమునకు "శివచింతామణి ప్రభామయూఖము" అను పేరిడుట- సముచితమేనా ?

ఇప్పుడు నా వయస్సు 78 సంవత్సరములు; శాలివాహన శకము 1839, శ్రీ పింగళనామ సం॥ శ్రావణ బ॥ ద్వాదశి - మంగళవారము (14-8-1917) సాయంత్రం 4 గం॥ 33 ని॥ ధనుర్లగ్నమునందు - త్రిలింగదేశమున ఆదిలాబాద్ జిల్లా, తాలూకా నిర్మలయందు సోమవారంపేటలో స్వగృహమున జన్మించితిని.

జనకులు :— అంతర్ముఖులు శివయోగనిష్ఠాగరిష్ఠులు వేదాంతవిజ్ఞాన పరిపూర్ణులు, శ్రౌత శైవారాధ్యప్రవరులు, అనన్యసామాన్య మహాయాగకర్తలు, గౌతమసగోత్రికులు, శ్రీ మల్లికార్జున పండితారాధ్య వంశీయులు, తమ యమోఘ ప్రబోధ ప్రతిభచే అసంఖ్యాత శిష్యుల నాకట్టుకొని గురుపదవిని సార్థకము నొనర్చినవారు నగు శివశ్రీ॥ నిర్మల రామనాథారాధ్యులవారు;

జనని :— దైవాంశ సంభూతురాలు, నిష్కపట హృదయురాలునగు అన్నపూర్ణాంబగారు; అగ్రజులు - కాశీక్షేత్రమున లింగైక్యముఁ జెందిన పుణ్యాత్ములు; అగ్రజ పుత్రపౌత్రులు నన్ను అవ్యాజముగ నాదరించువారు; అనుజుఁడు - సరళ హృదయుఁడు, అనుజ నందనులు తత్పుత్రులును ఆప్యాయతఁగలవారు: భగిని అతివృద్ధురాలగు భోళాశంకరురాలు; సౌ॥ ప్రథమపత్ని శివసాయుజ్యముఁ జెంది సౌమంగళ్యమును సంతరించుకొనినది. చి॥సౌ॥ ద్వితీయపత్ని; చి॥శ్రీ॥ పుత్రీకృత దౌహిత్రుఁడు, చి॥సౌ॥ దౌహిత్రపత్ని, చి॥శ్రీ॥ జామాత, చి॥సౌ॥పాలితపుత్రికయు

నా వార్ధకమును గమనించుచు కష్టసుఖములలో పాలుపంచుకొని నన్ను కాపాడు సత్కుటుంబమగుటచే- నేనెంతో మురియుచు తృప్తిపడుచున్నాను. చి॥ దౌహిత్రు నకుఁజెందిన నా వంశాంకురము త్వరలో జన్మింపనున్నదని తెలుపుటకు సంత సించుచు, అట్టి వంశాంకురము - దీర్ఘాయురారోగ్య భాగ్యాదులతో పెంపొందవలె నని పరమేశ్వరుఁ బ్రార్థించుచున్నాను. నా ఏకైక ఔరస పుత్రిక- కుమారుఁ గని మాకు దత్తపుత్రునిగ సమర్పించి కైలాసప్రాప్తురాలై మరుపురానిదైనది.

శ్రీ శివమహాపురాణ వచనానువాదము మొదలగు నా రచనలు - దాదాపు ఏబది (50) గలవు. వానిలో చాలవరకు ముద్రితములైనవి. శ్రీ నందికేశ్వరపురా ణము సార్థముగ నాచే వ్రాయఁబడి - ముద్రణకు ముందున్నది. శ్రీ నీలకంఠీయ భగవద్గీతాభాష్యము ననువదించుచు నవమాధ్యాయములో ఉన్నాను. ముఖ్య ఉపని షత్తులకు పదార్థమును భావమును వ్రాయుమని పురికొలుపు మహామహుల సూచన నంగీకరించి వ్రాయుటకు - శివానుగ్రహము దక్షిణహస్తదార్ఢ్యము అపేక్షింపఁబడు చున్నవి.

శివాద్వైత వేదాంత గ్రంథములలో బ్రహ్మసూత్రభాష్యము ముఖ్యమగునది. ఇందు- జీవేశ్వరుల యథార్థస్వరూపము, పరమేశ్వరుని లీలావిలాసమగు జగత్తు సత్యమనుటయు, శ్రీ విష్ణు విధి దేవేంద్ర వాయు అగ్ని జీవాత్మాదులు జగత్కారణ ములు కారనుటయు, అణుకారణవాదమును క్షణికవాదమును నిమిత్త కారణవాది పాశుపతమును జీవోత్పత్తివాది పాంచరాత్రమును ప్రధానకారణవాదమును ఖండిం చుటయు, ఉపనిషద్వాక్యములలో గల పరస్పర విరోధమును పరిహరించి వేద వేదాంతాది వాఙ్మయమంతయు తాత్పర్య లింగ సమన్వయముతో పరశివునే ప్రతి పాదించునని నిరూపించుటయు, శూన్యవాదమును నిర్గుణవాదమును నిరాకరించు టయు, నిమిత్త ఉపాదానోభయకారణవాది శైవమతమే - శాంభవదీక్షను స్వీక రించి ఇష్టప్రాణ భావలింగముల నుపాసించుచు బహిర్లింగధారణతో నిత్యము ఇష్ట శివలింగమును పూజించుచు శమదమాది సంపత్తి మొదలగు సాధనచతుష్టయ సాహిత్యమున నిష్కామ్య నిత్యనైమిత్తిక కర్మల నాచరించుచు చిత్తశుద్ధి గల వారై భావలింగ సాక్షాత్కారమును పొందు నవకాశముండుటచే - శ్రుతిసూత్ర విహితమై భోగమోక్షముల నొదవఁజేయుటవలనను - ప్రామాణిక మూర్ధన్యమై శిష్టాచరితంబునని నిర్ధారించుటయు; కామ్యముగనైన శివు నారాధించి కైలాసమున దివ్యసుఖముల ననుభవించి- విరాగులై- మహాకైలాసముఁజేరి శివానందము ననుభ

వించుచు పునరావృత్తిరహితముగ కలకాలము శివసములై నివసింతురని విశదీకరించుటయు, తదితర ఆవశ్యక ఉపాసనా విధుల నుల్లేఖించుటయు గలవు.

సావధానముగ నీ తెలుగుభాష్యము నొకసారి విని పఠించినచో బాగుగ నర్థమగును. ఇట్లు చేసినచో ఐహికభోగములయందు విరక్తి గలిగి శివారాధన దార్ఢ్యముతో ప్రారబ్ధాంతమునందు శివసాక్షాత్కారము వలన ముక్తులగుదురని నా దృఢ విశ్వాసము.

భాష్యము తదర్థంబు నెందుకని ప్రశ్నించువారు-దీనిని విని చదివినయెడల-సరియైన సమాధానముఁబడయుదురు. పండిత పామరులందరు దీని నవగాహనఁ జేసికొని తరింపగలరనియు, ఈ నా కృషి సఫలము, మరియు నిది ఆచంద్రార్కము స్థిరపడినదై జిజ్ఞాసువుల కుపయుక్తము కావలెనని కాంక్షించుచున్నాను. ఇది అందుటతోడనే- శ్రమ యనుకొనక-అందినదని వ్రాయుచు తమ సంతృప్తిని తెలుపగలరని కోరుచున్నాను.

అల మతివిస్తరేణ

నిర్మలశంకరశాస్త్రి-ఆరాధ్యులు

---

ఈ ముద్రణకు- మొదటినుండి ప్రోత్సాహమును కలుగఁజేయుచు అమితమైన ధనసహకారమును సకాలములో అందఁజేసిన ఆనంద హృదయులు-

1. శ్రీ నడిపినేని చలమయ్యగారు, బిఇ.డి.ఐ.ఎమ్.ఎమ్.ఐ.ఇ సూపరెంటింగ్ ఇంజనీయర్, ఎ.పి.ఎస్.ఐ.డి.సి.ఎల్. మైత్రీవనం, హుడా కాంప్లెక్స్, హైదరాబాద్ 38.
2. శ్రీ నడిపినేని కొండయ్య, సౌ॥ మహాలక్ష్మమ్మగారల - జ్ఞాపకార్థము- శ్రీ నడిపినేని సూర్యనారాయణగారు, ఎమ్.ఎ. లెక్చరర్, 21-5-35/1, సిరినగరు, కందుకూరు, 523 105.
3. లో. శివశ్రీ॥ ముదిగొండ మార్కండేయగారు, 43 వెస్ట్‌మారేడువల్లి, ప్రధానకార్యదర్శి- శైవమహాపీఠము. (అతులిత మేధాసంపన్నులు)

శ్రీ మహాగణాధిపతయే నమః

ఏతన్ముద్రణ ధనదాతలు దిగువ వ్రాయబడిన పుటలలో- తమ శుభనామము లను చదివి - సంతోషింపగలరు!

46 పేజీలో 1 నుండి 9 వరకు
64 ,, 10నుండి 17 వరకు,
73 ,, 18నుండి 28 వరకు,

28 నెం. సవరణ- "బొణ్ణం" అనుచో "గుణ్ణం" "అప్పాల" అనుచో "అప్పల" అని ప్లాట్ 110, స్నేహపురి కాలనీ అనియు గ్రహింపవలెను.

130 పేజీలో 29 నుండి 32వరకు,
172 ,, 33నుండి 35వరకు,
333-336 ,, 1నుండి 24 వరకు,
స్వవిషయము 6వ పేజీ

## ప్రకటనలు

1. రెండవ అధ్యాయం శ్రీ నీలకంఠ భగవద్గీతా భాష్యాంధ్రానువాదము (వ్రాతలో) ముద్రణ సహకారాభ్యర్థన పేజీ 32
2. శ్రీ దేవీ నవరాత్ర పూజావిధానము, మరియు గురువార ఏకాదశీ వ్రతము-వ్రాయబడినందున—ముద్రణకై ఆర్థిక సహకారము నభ్యర్థించుట. పేజీ 66
3. శ్రీ నందికేశ్వర పురాణము - శైవోపయుక్తము సముల్లిఖితము, సార్థము, ఆర్థికసహకారాభ్యర్థన పేజీ 97
4. భాష్య ద్వితీయాధ్యాయ సారాంశము పేజీ 113
5. శ్రీ శివసహస్రనామ రహస్యార్థము, ముద్రితము. పేజీ 130
6. శ్రీ శివమహాస్తోత్రము, ముద్రితము పేజీ 167
7. శివతత్త్వరహస్యము, ముద్రితము పేజీ 215



RASHTRAPATI BHAVAN,
NEW DELHI-4.
राष्ट्रपति भवन,
नई दिल्ली-4

August 29, 1963.

Dear Sri Sastri,

Thank you for your letter and the book. It is a valuable piece of work, explaining the significance of the first four sutras.

With the best wishes,

Yours sincerely,

(S. Radhakrishnan)

Sri Sankar Sastri 'Nirmal'
184, Marredpalli,
Secunderabad(Andhra Pradesh).

శ్రీ మహాగణాధిపతయే నమః

# విషయసూచిక

2)

***

## పత్రికాభిప్రాయములు



## నా విరచితములు

| | గ్రంథము | వెల | స్టాక్ ఉన్నవి |
|---|---|---|---|
| 1. | విదురమహానీతి | 2-00 | ,, |
| 2. | సహస్రకమలార్చన | 2-00 | ,, |
| 3. | వైదికమతసామరస్యము | 3-00 | ,, |
| 4. | శ్రీ రాజరాజేశ్వరభజన (శ్లోకములు) | 1-00 | ,, |
| 5. | పార్థివలింగస్తోత్రము (హిందీలిపి) | 1-00 | ,, |
| 6. | గురుశిష్యసంవాదము | 2-00 | ,, |
| 7. | శివపూజామంత్రార్థము | 3-00 | ,, |
| 8. | సంతోషిణిమాత-వ్రతము | 6-00 | ,, |
| 9. | గీతాసారసంగ్రహము | 2-00 | ,, |
| 10. | వైదికశివపూజావిధానము | 2-50 | ,, |
| 11. | కఠోపనిషత్తు-ప్రథమభాగము | 5-00 | ,, |

32. కఠోపనిషత్తు-ద్వితీయభాగము
33. దేవీనవరాత్ర సంక్షిప్తపూజావిధానము అమాసోమవారవ్రతముతో,
34. శిష్యసంచార పరమార్థము
35. నందికేశ్వరపురాణము
36. భగవద్గీతాభాష్యాంధ్రానువాదము

## ముద్రితములై స్టాకులో లేనివి

37. శ్రీ శివారాధనము
38. దేవీ కుంకుమార్చన
39. దక్షిణయాత్రాదర్పణము
40. ఉత్తరయాత్రాపరిచయము
41. బదరీకేదారయాత్రాసూచిక

ఇంకా జ్ఞాపకము లేని చిన్ని చిన్ని రచనలు గలవు.

ఒకేసారి అన్నిటిని తెప్పించుకొనువారికి 20శాతం కమీషను ఇవ్వబడును. వర్తకులకు కమీషను 25శాతం ఇవ్వబడును. పరిమితమైన స్టాక్ కలదు.

వలయువారు

శివశ్రీ ఎన్. హరదత్త శర్మ
S/o శ్రీ నిర్మల శంకరశాస్త్రి
సర్వమంగళా-శివవిజ్ఞాన-సదనము,
184/ఎ, వెస్ట్‌మారేడుపల్లి,
సికిందరాబాద్-500026, ఆం.ప్ర.

శ్రీః

# పీఠిక

## శ్రీ విశిష్ట శివాద్వైతము మరియు భాష్య సారాంశము

షడ్దర్శనములలో ప్రధానమైనది ఉత్తర మీమాంసాదర్శనము. ఉపనిషదర్థ నిర్ణయమునకై బాదరాయణ విరచితములగు బ్రహ్మసూత్రము లీదర్శనమునకు మూలభూతములు. శ్రీ కంఠాచార్యులు ఈ సూత్రములపై భాష్యమును రచించి శివాద్వైతమును స్థాపించిరి.

శ్రీకంఠాచార్యుల కాలమును నిర్ణయించుటకు తగు ఆధారములు లేవు. ఈయన రామానుజాచార్యులకు పూర్వికుడు కావచ్చుననియు, ఈయన శివపరముగ ప్రతిపాదించిన విశిష్టాద్వైతమునే రామానుజాచార్యులు విష్ణు పరముగ సమన్వయించి వైష్ణవ విశిష్టాద్వైతమును స్థాపించెననియు కొందరి అభిప్రాయము.

ఈయన తన సూత్రభాష్యోపక్రమమున పూర్వాచార్యులచే కలుషితమగు వ్యాస సూత్రనయనమును పునఃప్రసన్నము చేయుటకై తాని భాష్యమును వ్రాయుచున్నట్లు చెప్పికొనెను:-

"వ్యాససూత్రమిదం నేత్రం - విదుషాం బ్రహ్మదర్శనే.
పూర్వాచార్యైః కలుషితం - శ్రీకంఠేన ప్రసాద్యతే."

శ్రీకంఠాచార్యులు వేదములకును అగమములకును తుల్యమగు ప్రామాణికత్వమును అంగీకరించి, వేదములు త్రైవర్ణిక మాత్ర పఠనీయములై యుండ ఆగమములు సర్వజనసాధారణము లనియు, ఆ రెండును ప్రతి పాదించు శైవ మతమున భేదమేమియు లేదనియు నిరూపించి, వేదాగమప్రోక్తములగు శైవముల నడుమ సమన్వయము సంపాదించెను:-

"వయంతు వేదశివాగమయోర్భేదం న పశ్యామః వేదేఽపి శివాగమ ఇతి వ్యవహారో యుక్తః, తస్య తత్కర్తృకత్వాత్, అతః శివాగమో ద్వివిధః త్రైవర్ణిక

విషయః సర్వవిషయశ్చేతి: వేదః త్రైవర్ణిక విషయః, సర్వవిషయ శ్చాన్యః, ఉభయోరేక ఏవ శివః కర్తా. "ఈశానః సర్వవిద్యానామ్" "అస్యమహతో భూతస్య నిఃశ్వసితమ్" ఇత్యాది శ్రుత్యా.

అష్టాదశానా మేతాసాం విద్యానాం భిన్నవర్త్మనామ్
ఆదికర్తా కవిః సాక్షా చ్ఛూలపాణి రితి శ్రుతిః"

ఇతి స్మృత్యా చ వేదే తస్య కర్తృత్వ మవగతమ్, అన్యత్రాపి తస్యైవ పరమేశ్వరస్య; అతః కర్తృసామాన్యాదుభయమప్యేకార్థపరం ప్రమాణమేవ" (శ్రీ.భా.)

కాశ్మీరదేశమున ప్రచారములో నున్న త్రిక సిద్ధాంతము ప్రకారము గూడ ఆగమములకు వేదతుల్యమగు ప్రామాణము గలదు.

వేదాన్త ప్రతివాద్యమగు పరబ్రహ్మము శివుడే; ఆతడే పరమాత్ముడు. ముముక్షువులు ఆతనినే సేవింపవలెను. చేతనాచేతన సంమేళన సమరసీ భూత ప్రపంచ విలాసమునకు సంబంధించిన జన్మ స్థితిప్రళయ తిరోభావాను గ్రహ రూపమగు కృత్య పంచకమును సాధించునది ఈ పరమశివతత్త్వమే. ఈ శివుడు అనంతగుణగణములు కలవాడు. అపరిమిత శక్తిశాలి. దోషరహితుడు, భక్తానుగ్రాహకుడు. అహంపదార్థభూతుడు, సచ్చిదానందమూర్తి. ఈతడు సర్వదేశ కాలావస్థితుడగుటచే 'భవుడు'. సర్వ సంహారకుడగుటచే 'శర్వుడు'. సకలజీవులకు నధిపతి అగుటచే 'పశుపతి'. లోక దుఃఖ వినాశకు డగుటచే 'రుద్రుడు'. నిరస్త సమస్త సంసారకళంకుడై నిఖిల మంగలాధారు డగుటచే 'శివుడు'. అత్యంతోత్తమమగు పరమానందానుభవమున రమించుటచే 'మహాదేవుడు'. "అథ కస్మాదుచ్యతే మహాదేవః, యస్సర్వాన్ భావాన్పరిత్యజ్యాత్మజ్ఞాన యోగైశ్వర్యే మహతి మహీయతే తస్మాదుచ్యతే మహాదేవ ఇతి" (అథర్వశిరోపనిషత్) ఈతడు అపాంచభౌతికమగు దివ్యశరీరము కలవాడు. దృశ్యప్రపంచకమునకు సంబంధించిన జన్మ స్థిత్యాదులకు ఈతడు కారణభూతుడైనను తదతీతుడు. అనగా జగజ్జన్మాది కర్తృత్వము శివుని తటస్థ లక్షణమే గాని స్వరూపలక్షణము కాదు. 'చంద్రుడు చెట్టుకొమ్మపై ఉన్నాడు,' అని చెప్పినపుడు శాఖాగ్రస్థితి వాస్తవమున చంద్రునకు సంబంధించిన నిత్య లక్షణము కాదు. అది కేవలము చంద్రుడు ఆకాశముపై ఏ ప్రదేశమునం దున్నాడో సూచించుటకై చెప్పబడినది. అట్లే శివుని విషయమున చెప్పిన జగజ్జన్మాది కర్తృత్వము కూడనని గ్రహింపవలెను.

ఈశ్వరేచ్ఛావశముచే మాయ జగద్రూపమున పరిణత మగుచున్నది. ఇట్టి మాయతో నిత్యసంబద్ధుడగుటచే శివుడు ఈ విశ్వమునకు ఉపాదాన కారణ మైనాడు. అయినను అతడు మాయాతీతుడు. జగత్తునకును జీవులకును గూడ అతీతుడు. జగత్తునకు ఉపాదాన కారణమును నిమిత్త కారణమును గూడ ఈ శివుడే. అయినను వాని గుణదోషములచే ఆతడు లిప్తుడు కాడు. (ఘటమునకు ఉపాదానకారణము మట్టి; కులాలదండ చక్రాదులు నిమిత్త కారణములు. కాని ప్రపంచము విషయమున శివుడు అభిన్న నిమిత్తోపాదాన కారణము) బ్రహ్మము (శివుని) విషయమున ఉపయుక్తములగు 'సత్', 'చిత్', 'ఆనంద' మొదలగునవి ఆ శివ తత్త్వమునకు గల గుణములను తెలుపునవి. బ్రహ్మము చిద్రూపమైనను జడరూపముగ గూడ మారవచ్చును. బ్రహ్మము అనపేక్షిత బాహ్యకరణమై తన శక్తిని ప్రసరింప చేయుచుండును. బ్రహ్మ కూటస్థ నిత్యము. కాని అతని శక్తిమాత్రము జగత్సృష్టి ప్రలయాది వికారములకు లోనగుచుండును. అనగా బ్రహ్మయందున్న శక్తి చిదచిత్ప్రపంచ రూపమైనది. ఏతాదృశ శక్తివిశిష్టత్వము బ్రహ్మకు స్వాభావికము.

మహాప్రళయ సమయమున సూర్యచంద్రులు గాని, దివారాత్రులు గాని, నామరూపములుగాని, చేతనా చేతన పదార్థములుగాని ఉండవు. అంధకారము తక్క మరేమియు ఉండదు. ఈ ప్రపంచము నంతను తనలో ఉప సంహరించుకొనిన ఒక్క శివుడు (బ్రహ్మ) మాత్రము ఉండును. అతని యందు జ్ఞానశక్తి ఆవిర్భవింపగనే అంధకారమంతయు తొలగిపోవును. అపుడు తనను తాను బహురూపముల సృజించుకొనవలెనని అతనిలో నొక ఇచ్ఛ ఉదయించును. దీనితో అంతవరకు అవ్యక్తముగనున్న జడచేతనరూప జగము ఆవిర్భవించును చిదచిద్రూపమగు ఈ ప్రపంచమును కార్యమనియు అకార్యమనియు కూడ చెప్పవచ్చును. ఇది సూక్ష్మరూపమున (అవ్యక్తరూపమున) శివునియందు సృష్టికి పూర్వము కూడ ఉండుటచే అకార్యము. వ్యక్తరూపమున ఆవిర్భూతమగుటచే కార్యము. జగత్తునకును శివునకును గల సంబంధము శరీరమునకును ఆత్మకును గల సంబంధము వంటిది. లేదా గుణమునకును గుణికిని లేదా కార్యమునకును కారణమునకును గల సంబంధము వంటిది. ఆత్మశరీరములును, గుణగుణులును, కార్యకారణములును ఒక దానిని విడచి ఒకటి ఉండజాలవు. అట్లే బ్రహ్మము కూడ, శక్తిరూపమున తనతో నిత్య సంబద్ధమగు జగత్తును విడచి ఉండజాలదు.

ఉష్ణత్వమును విడచి అగ్నియు, నీలత్వమును విడచి నీలోత్పలమును వేరుగ ఉండగల్గునా? మృణ్మయ ఘటము మృత్తును విడచి ఉండజాలనట్లు ప్రపంచము గూడ బ్రహ్మమును విడచి వేరుగా ఉండజాలదు. ఈవిధము ప్రపంచ బ్రహ్మలకు అనన్యత్వము సిద్ధించును. ఇచట అనన్యత్వ మనగా వినాభావరహితత్వమే గాని అత్యంత తాదాత్మ్యము కాదు. వినాభావ రహితత్వమనగా ఒకదానిని విడచి ఒకటి ఉండజాలక పోవుట. ఇట్టి వినాభావ రాహిత్యముచే జగద్బ్రహ్మల నడుమ ఒక విధముగా ఏకత్వ మేర్పడుచున్నది.

బ్రహ్మయే చేతనాచేతన జగన్నియామకము. జ్ఞాతృ జ్ఞానోభయ రూపము. చిజ్జడములు రెండును బ్రహ్మయొక్క శక్తులే. చిచ్ఛక్తి జ్ఞాన - ఇచ్చా - క్రియా రూపమైనది. జడశక్తి పంచ భూతాత్మకమైనది. అష్టవిధములగు ఈ చిజ్జడశక్తులు బ్రహ్మకు శరీరము కావున బ్రహ్మము ప్రపంచ రూపము. వెనుక చూచిన విధముగ శివుడే (బ్రహ్మమే) ఈ ప్రపంచమునకు ఉపాదానకారణము, నిమిత్త కారణముగూడ. ఇచ్ఛాశక్తిద్వారా జగదుపాదాన మగు స్థితియందు శివుడే నారాయణ విష్ణ్వాది నామములను ధరించును. ఈ నారాయణుడు శివాభిన్నుడైనను శివుని క్రిందివాడు. "యతో విష్ణు శివయో రుపాదాన నిమిత్తయో రవస్థాభేదమన్తరేణ స్వరూపభేదోనాస్తి" (నీ.భా.) సకలకార్య ప్రపంచ సమష్టిరూపుడగు హిరణ్యగర్భునికంటె నారాయణుడు పరుడు, నారాయణునికంటె శివుడు పరుడు. సకల కార్యసమిష్టి రూపాద్ధిరణ్యగర్భాత్, పరో నారాయణః, తదుపాదానత్వాత్; తతోఽపి పరం శివాఖ్యం నిమిత్తం విరూపాక్షం పరం బ్రహ్మ......శివసంకల్పోపనిషది — "పరాత్ పరతరో బ్రహ్మ తత్పరాత్ పరతో హరిః, తత్పరాత్ పరతోఽధీశః" ఇతి. అన్యత్రచ—"నారాయణపరం బ్రహ్మ" ఇతి నారాయణాత్ పరత్వేన బ్రహ్మాభిధాయ తత్ కీదృశ మిత్యాకాంక్షాయాం "ఋతం సత్యమ్, ఇతి మంత్రేణ సర్వజ్ఞతయా మనోవాగ్వ్యవర్యాసరహితం, స్వశక్తిమరీచిభిః సకల జగత్పూరకం. స్వావిభక్తయా పరప్రకృతిరూపయా పరమానంద చిదేకరస పరమాకాశ లక్షణయా, స్వావస్థాభేద పరమచేతన నారాయణారబ్ధ హిరణ్యగర్భాది సకల కార్య ప్రపంచయా పరమశక్త్యా ఉమయా శబళితరూపం నిర్వికారం త్రిలోచనం పరబ్రహ్మ సర్వోత్తరమితి నిరూపితం।" (శ్రీ. భా.)

శివుడు (బ్రహ్మ) జగత్తునకు అభిన్న నిమిత్తోపాదానమని చెప్పుటచే బ్రహ్మ జగద్రూపమున పరిణమించినదని తేలినది. కాని తావన్మాత్రముచే శివునియందు వికారముగాని దోషాంతరముగాని సంక్రమించునను సందేహమునకు అవకాశము

లేదు. జగదాకారమున పరిణత మగుట అనునది కేవలము శివుని చిచ్ఛక్తికి మాత్రము సంబంధించినది. ఈ చిచ్ఛక్తికే 'మాయ' 'ప్రకృతి' మొదలగు నామాంతరములు. ఈ విధముగ మాయాసహితుడగు శివుడు—అనగా సూక్ష్మ చిదచిద్విశిష్ట బ్రహ్మము—జగత్తునకు—అనగా స్థూల చిదచిద్విశిష్ట బ్రహ్మమునకు—కారణము. "సూక్ష్మ చిదచిద్విశిష్టం బ్రహ్మ కారణమ్; స్థూల చిదచిద్విశిష్టం తత్ కార్యం భవతి" (శ్రీ. భా).

బ్రహ్మ జగద్రూపమున పరిణమించుచున్నదనగా క్రొత్తమార్పును చెందుచున్నదని యర్థము కాదు. అంతకుపూర్వమే సూక్ష్మరూపమున నున్న చేతనాచేతన రూపజగత్తు స్థూల నామరూపాదులతో నావిర్భవించుచున్నది. అంతవరకును లేని వస్తువేదియు క్రొత్తగ జనించుట లేదు. ఈ విధముగ శివుడు-జీవుడు దేహముతో కూడియున్నట్లు చిదచిద్రూపజగత్తుతో సర్వదా (అది స్థూలరూపమున నుండనిండు లేదా సూక్ష్మరూపమున నుండనిండు) కూడియున్నాడు. జగత్తు చిచ్ఛక్తిద్వారా బ్రహ్మతో సంబంధించి యుండుటచే బ్రహ్మయందున్న సత్త్వ చిదానందాంశములు దానియందుగూడ భాసించుచున్నవి.

శ్రీకంఠాచార్యులు శరీరముతో కూడిన శరీరికి (శరీరశరీరులకు) ఏకత్వము నంగీకరించిన విధముగను, నీలత్వముతో కూడిన ఉత్పలమునకు (నీలవర్ణోత్పలములకు) ఏకత్వమును అంగీకరించిన విధమునను ప్రపంచ బ్రహ్మలకు అభేదము నంగీకరింపవలెను గాని, అత్యంత భేదమునుగాని, అత్యంతాభేదమును గాని ఏకతరమిథ్యాత్వమునుగాని, భేదాభేదములనుగాని అంగీకరింపరాదని స్పష్టీకరించి యున్నారు. ఇదియే విశిష్ట శివాద్వైతము. "బ్రహ్మ ప్రపంచయోర్న వయం అత్యన్త భేద వాదినః; ఘటపటయోరివ తదనన్యత్వ పరశ్రుతి విరోధాత్. న చాత్యన్తాభేదవాదినః న వా శుక్తిరజతయో రివైకతరమిథ్యాత్వవాదినః తత్స్వాభావిక గుణభేద పరశ్రుతి విరోధాత్ న చ భేదాభేద వాదినః; వస్తువిరోధాత్. కిన్తు శరీరశరీరిణోరివ, గుణగుణినోరివ చ విశిష్టాద్వైత వాదినః (శ్రీ. భా.)

బ్రహ్మయందలి ద్విముఖమగు శక్తి చిచ్ఛక్తి రూపమున చేతన ప్రపంచమునకును, జడశక్తి రూపమున జడ ప్రపంచమునకును మూలకారణ మగుచున్నది. కార్యభేదము ననుసరించి ఈ భేదకల్పనము గాని వాస్తవమున ఈ చిజ్జడశక్తులు రెండును ఒక్కటే. బ్రహ్మ ధర్మభూతములగు ఈ శక్తులకు బ్రహ్మనువిడచి

స్వతంత్రముగ ఉనికి లేదు. చేతనము (అనగా జీవుడు) నిత్యమగు సత్యపదార్థము. కర్తృత్వ భోక్తృత్వ, జ్ఞాతృత్వాది ధర్మవిశిష్టము. జీవుడు అణుపరిమాణుడు. ఈ కర్తృత్వాది ధర్మములు బంధమోక్ష సమయములు రెండిటియందును జీవునితో సంబంధించియే యుండును. జీవునకు జ్ఞాతృత్వ మున్నను సర్వజ్ఞత్వము లేదు. ఆతడు కించిద్జ్ఞత్వాది దోష విశిష్టుడు. ఈ విధముగ జీవాత్మ పరమాత్మలకు భేదమున్నను వారు అత్యంతభిన్నులు కారు. జీవునకు జ్ఞానమనునది నిత్యధర్మమే యైనను ఆతడు జ్ఞానస్వరూపుడు కాడు. జీవుడు వస్తుభూతమగు బ్రహ్మాంశమే కాని అవిద్యాదేహాద్యుపాధి పరికల్పిత మిథ్యాస్వరూపుడు కాడు. ఆతడు కర్తృత్వమున స్వాతంత్ర్యము కలవాడు. పరమేశ్వరుడు - జీవుల కోరికలు సఫలమగుటకు కేవలము సహాయకుడుగ నుండును.

శివుడు కృపాళువే యైనను తనంత తానుగ జీవులను బంధముక్తులను చేయజాలడు. జీవుడు స్వప్రయత్నముచే అనగా- శాంభవదీక్షచే పరిపూతుడై అజ్ఞానావరణమును తొలగించుకొనినప్పుడు శివుడాతనిని భవబంధమునుండి విముక్తుని చేయును. నిష్కామ కర్మాచరణముచే మనఃశుద్ధి కలిగిన పిదప జ్ఞానోదయమగును. జ్ఞానపరిపూర్ణతను ధ్యాననిష్ఠను ప్రసాదించును. తద్ద్వారా మోక్షము లభించును.

ధ్యానములోకూడ అనేకరకములు కలవు. సాక్షాత్ సదాశివుని ధ్యానించుటచే వెంటనే ముక్తి లభించును. నేను వేరు, శివుడు వేరు అను భేదబుద్ధితోకాక 'నేనే శివుడను' అను అభేదబుద్ధితో శివధ్యానము చేయవలెను. భేదబుద్ధితో ధ్యానము చేయునంతవరకు బంధమోచనము కలుగదు. నారాయణుని ధ్యానము చేయువారు మొదట నారాయణుని చేరి పిదప శివుని చేరగల్గుదురు.

ఈశ్వరానుగ్రహమువలన గాని మోక్షము లభింపదు. బంధావస్థలో అజ్ఞాన పాశబద్ధుడై పశువువలె శివుని అధీనములోనున్న జీవుడు ఆ పాశమువిచ్ఛిన్నము కాగా పశుత్వము కూడ తొలగి స్వతంత్రుడగును. అపుడాతనికి సర్వజ్ఞత్వము లభించును. దోషములన్నియు తొలగిపోవుటతో మంగళగుణములకు నిలయమగును. అపుడు ఆ జీవుడు శివ సాయుజ్యమును పొందును. జీవుడు శివ సాయుజ్యమునుపొంది శివునితో కలసి దివ్యసుఖముల ననుభవించును. దివ్యములగు బుద్ధీంద్రియాదులతో స్వాతంత్ర్యము ననుభవించుచుండును. కాని జగత్సృష్టిస్థిత్యాది

నిర్మాణశక్తి మాత్రము ఆతనికి లభింపదు. ముక్తుడు సర్వదా శివసాక్షాత్కార సౌఖ్యము ననుభవించును. శరీరము లేకుండగనే బుద్ధిమాత్రముతో వివిధ సుఖానుభూతులను పొందగల్గును. ఇచ్ఛానుసారముగ ప్రకృతి నియమాతీతములగు శరీరములను సృజించుకొనగల్గును. ఆతడు కర్మబంధాతీతుడు. సర్వదా అత్యున్నతానంద శరీరములపై విహరించుచుండును. ఇట్టి ముక్తి శరీర పాతానంతరమే లభించును గాని ఈ భౌతిక శరీరముండగనే ముక్తిని పొందుట-అనగా జీవన్ముక్తి-అనునది లేదు.

ఈ విధముగ శివుడే ఉపనిషత్ప్రతిపాదితమగు పరతత్త్వము. శక్తి విశిష్టుడగు శివుడు చిదచిదాత్మకమగు ఈ జగమునంతను సృజించి దానికి అభిన్న నిమిత్తోపాదానకారణముగ నున్నాడు. ఆతడు సగుణుడు. సన్మంగళమూర్తి. శివతత్త్వ మెట్లు సత్యమో చిద చిద్రూప జగము కూడ అట్లే సత్యము. సువర్ణ పరిణామ విశేషములగు కటక కుండలాదులకు కటకత్వకుండలత్వాది ధర్మములను పురస్కరించుకొని భేదమున్నను, సువర్ణత్వరూపమున అవి అభిన్నములే. అట్లే జగత్తును, జీవులను, శివుని వేరువేరుగ గ్రహించినపుడు వాటియందు భేదము గోచరించినను జగజ్జీవ విశిష్టరూపమున శివుడు అద్వైతమూర్తియే కాని భేదములు లేవు. ఇదియే శ్రీకంఠాచార్య స్థాపితమగు విశిష్టశివాద్వైతము. భాష్యసారాంశమును.

**డా. పుల్లెల శ్రీరామచంద్రుడు**
వేదాన్తశిరోమణి, వేదాన్త విశారద, విద్వాన్,
M, A. Ph. D. (Skt.) M. A. (Eng.) M. A. (Hindi)
Reader భారత సంస్కృతి శాఖ,
ఉస్మానియా విశ్వ విద్యాలయము,
హైదరాబాదు.



శ్రీ మహాగణాధిపతయే నమః

ఏతద్భాష్యానువాదమును పరిశీలించి తమ అమూల్యమైన అవగాహనను అందఁజేసిన పండితప్రకాండుల సదభిప్రాయములు.

శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రిగారు విశిష్టశివాద్వైతసిద్ధాంత ప్రతిపాదకమగు శ్రీ నీలకంఠీయ బ్రహ్మసూత్రభాష్యమును ఆంధ్రభాషయందు అనువదించి ఆంధ్రులకు అందజేయుట - ఎంతయు ముదావహము. వీరు గ్రంథమునంతను క్రమక్రమముగ అనువదించి ప్రకటింపగలరని ఆశిస్తున్నాను.

ఎన్నియో శాస్త్రీయపరిభాషలతో గంభీరార్థముగల శ్రీ కంఠభాష్యమువంటి ఉద్గ్రంథమును జ్ఞానకింపచా (స్వల్పజ్ఞా)నులకు గూడ సువేద్యమగునట్లు అనువదించుట యనిన అందరికిని సాధ్యముకాదు. ముందు అనువాద్యగ్రంథార్థమును బాగుగ గ్రహించి పూర్తిగ స్వాయత్తము చేసికొనఁగలిగిన శ్రీ శాస్త్రిగారివంటి వారికి మాత్రము సాధ్యమగునది. ఈ విషయమున శ్రీ శాస్త్రిగారికి పూర్తి సాఫల్యము లభించినదని చెప్పుటలో సందేహము లేదు-

ఇందు అవశ్యకస్థలములలో పారిభాషికపదముల యర్థమును వివరించుచు భాష్యసూచితములును, తదర్థగ్రహణావశ్యములు నగు ఎన్నియో అంశములను శివార్కమణిదీపిక శివచింతామణిప్రభ అను సంస్కృతవ్యాఖ్యలనుండి గ్రహించుచు తమ రచనను నడిపినారు. ఈ దృష్టితో చూచినచో ఈ గ్రంథము కేవలము శ్రీ కంఠ భాష్యానువాదమని కాక శ్రీ కంఠభాష్యాంధ్రవ్యాఖ్యానమని యనవలెను. స్థాలీపులాక న్యాయమున శ్రీ శాస్త్రిగారు అనువదించిన కొన్ని పద్ధతులను క్రింద చూపుచున్నాను.

జన్మాద్యధికరణ ప్రారంభమున 56వ పేజీలో "బ్రహ్మవిదాప్నోతిపరం" మొదలగు వివరణమును మరియు జన్మస్థితిలయ తిరోభావ అనుగ్రహపదముల యర్థమును గూడ వ్రాసియున్నారు. ఇట్లే భాష్యప్రయుక్తములగు "వికల్ప, వ్యవస్థిత వికల్ప, సముచ్చయ" ఇత్యాది పారిభాషిక పదములకు గూడ వ్యాఖ్యానము చేసినారు. ఈ వివృతి లేనిచో అనువాదము అగ్రాహ్యముగ నుండిపోవును.

62వ పేజీలోని "ఇమారుద్రాయ" మొదలగు భాగమున శివునకు సకల శబ్దవాచ్యత్వము కలదనియు, ఆశ్వలాయనుఁడు గూడ "సర్వాణి హ వా ఏతస్య నామధేయాని" అని నిర్వచించె ననియు, భవాదినామాష్టకము- ఆపస్తంబీయ మంత్రముల యందు శూలగవహోమమునందు మహాదేవుని ప్రతిష్ఠావిధియందు నిత్య పూజావిధియందును వ్యవహరింపఁబడుచున్నదని శ్రీ అప్పయ దీక్షితేంద్రుల శివార్కమణిదీపికా ప్రతిరూపమగు "మహోపాధ్యాయ శివశ్రీ ముదిగొండ నాగ లింగశాస్త్రిగారి," శివచింతామణిప్రభనుండి సంగ్రహించినారు. "శామ్యంత్యస్మిన్ దోషా ఇతి శివః" ఇత్యాది నిర్వచనముతో శివశబ్దనిష్పత్తిని ఇందు పొందుపరచి నారు. "యదా తమః" ఇత్యాది మంత్రమున శివపరత్వసమర్థనమును కూర్మ పురాణవచన సమర్థితములగు ఈశ్వరశబ్దాది నిర్వచనములను పై వ్యాఖ్యలనుండియే గ్రహించినారు. ఇంతియే గాక ఇందుగల అతివిస్తృత వ్యాఖ్యాభాగముల సారమును గూడ శాస్త్రిగారు వివరించినారు.

వీరి గ్రంథమంతయు ఈ విధముగనే నడచినదని చెప్పుటకు కొన్నిటి నిట నుదాహరింపవలసివచ్చినది. ఇట్లు శ్రీశంకరశాస్త్రిగారు భాష్యార్థమును ఏమాత్రము విడువక సుబోధమగు నాంధ్రభాషలో రచించిన ఈ మహాగ్రంథము- తత్త్వజిజ్ఞాసు వుల కెంతయు నుపకరింపఁగలదని నా దృఢవిశ్వాసము.

డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడు
వేదాంతశిరోమణి, వేదాంతవిశారద, విద్వాన్,
ఎం.ఏ. పి.హెచ్.డి (సంస్కృతం),
ఎం.ఏ. (ఇంగ్లీషు), ఎం.ఏ. (హిందీ)
రీడర్, భారత సంస్కృత శాఖ,
ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాద్.

18-7-1973

నివాసము - నందనం,
7-1-32/4 P2,
లీలానగర్, బేగంపేట,
హైదరాబాద్.

శ్రీ లోకారాధ్య నిర్మల శంకరశాస్త్రిగారు రచించిన శ్రీ నీలకంఠ భాష్యాంధ్రీకరణమునందలి ప్రథమ, ద్వితీయ సంపుటములను జదివి యానందించితిని. శ్రీ నీలకంఠాచార్యులవారు సుప్రసిద్ధులైన పంద్రెండుగురారాధ్యులలో నొకరగుటయే కాక అతిప్రాచీనులును శివాద్వైతప్రతిపాదన దక్షులలో నగ్రగణ్యులునై యున్నారు. వారు బ్రహ్మసూత్రములపై రచించిన భాష్యము మూలరహస్య నివేదకమును, ప్రామాణికమును, ప్రౌఢమునై యలరారుచున్నది. కీ॥శే॥ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు నీలకంఠీయ భాష్యమునకు శివచింతామణిప్రభ యను వ్యాఖ్యానమును సంస్కృత భాషలో రచించిరి. సంస్కృతభాషానభిజ్ఞుల కది యందుపాటులో లేనికారణమున శ్రీ శంకరశాస్త్రిగారు దాని ననుసరించుచు నీలకంఠీయ భాష్యమును సర్వసుబోధమగు భాషలో నాంధ్రీకరించి యుండిరి. మొదట చతస్సూత్రీభాష్యాంధ్రీకరణము కలదు. శ్రీ శాస్త్రిగారి ఆంధ్రీకరణము మూలమునుసన్నిహితముగా ననుసరించుచు క్లిష్ట భాగములను వివరించుచు బ్రహ్మసూత్రతత్త్వము నెఱుంగఁగోరు జిజ్ఞాసువులపాలిటి కల్పవల్లియై యొప్పారుచున్నది. వీరి భాష లలితమును, సులభమును, సరళమును, నిర్దోషమునై పఠితృజన ప్రశంసాపాత్రమై పరిఢవిల్లుచు తత్త్వజిజ్ఞాసువులకు సాధారణముగను శైవులకు ప్రత్యేకముగను పరమానందమును కలుగఁజేయునదియని ఆశంసించుచున్నాను.

డా॥ దివాకర్ల వేంకటావధాని (కీ. శే.)
ఎం.ఏ. (ఆనర్స్), పి. హెచ్. డి.
మాజీ ఆంధ్రశాఖాధ్యక్షుడు - ఉస్మానియా విశ్వవిద్యాలయము,
హైదరాబాదు.

# శ్రీ నీలకంఠ భాష్యమ్

శ్రీ మద్భిః నిర్మలాభిజన శంకరశాస్త్రిభి ర్విరచితం నీలకంఠభాష్యాంధ్ర వివరణం యత్రతత్ర సూక్ష్మేక్షికయా సపరిశీలనం సందృష్టం మయా. శ్రీ శాస్త్రిభిః మహతా క్లేశేన భాష్యహృదయ మాంధ్రజిజ్ఞాసుభ్యః ప్రకటీకృత్య శైవ

సిద్ధాంతం కరబదర సమానంచ కృతమ్. గీర్వాణభాషాఽనభిజ్ఞాః అనభ్యస్త శాస్త్రాశ్చ ఆంధ్ర మహాజనాః పరిచితపదజాలైః లలితలలితైః సుస్పష్టరీత్యా విరచితమిద మాంధ్రవ్యాఖ్యానం ప్రపఠ్య శ్రీ నీలకంఠాచార్యాణాం హృదయం సుగమతయా సంబుధ్యేయురితి అహం విశ్వసిమి. ఏవమేవ సమగ్రంభాష్యగ్రంథ మాంధ్ర్యామనూద్య శ్రీ శాస్త్రి మహోదయాః ఆంధ్రాణాం కృతజ్ఞతాపాత్రం భూయాసురితి భగవంతం భూతభావన ముమానాథం కృతాంజలిః ప్రార్థయామి.

1. శ్లో॥ పరిచిత వదజాలైః ప్రౌఢభాష్యార్థ జాలం
లలితలలితభావం నీలకంఠోక్తి దీప్తం ।
నయతి గహన హృద్యం నిర్మలోపాహ్వ ఆంధ్రాన్
సురగిరిచతురః శ్రీ శంకర శ్చాంధ్రవాణ్యామ్.

2. శ్లో॥ దీవ్యతాం జగతి గ్రంథ ఆచంద్ర రవితారకం ।
ఆహిమాద్రే రాచకన్యాకుమార్యాః వ్యాప్నుతా దయం ॥

హైదరాబాద్ నగరం,
6-4-1973

ఇతి
శిరోమణిః ఆంధ్రబిల్హణః బ్రాహ్మీభూషణం
సుధీంద్ర మౌళిః
కప్పగంతుల లక్ష్మణశాస్త్రి (కీ.శే.)

సామాన్యులకు సైతము బోధకమగునట్లు ఇంత సులభశైలిలో వేదాంత భాష్యమును తెనిగించిన కీర్తి ఒక్క నిర్మల శంకరశాస్త్రిగారికే దక్కినది. శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారి తరువాత అంతటి వైదుష్యము, బోధనాశక్తియు గలవాడు శ్రీ శంకరశాస్త్రిగారు ఒక్కడే అనునది ఈ నీలకంఠ భాష్యానువాదమున దృఢపడినది. శాస్త్రాధ్యయనము చేయుట ఒక యెత్తు. అధీతమును విడమఱచి కరతలామలకముగా ప్రజలకందించుట ఒక యెత్తు ఈ రెండవ శక్తిలేని శాస్త్రి రాణింపడు. వీరికి వీరి పేరిటి దేవుడు రెండు సామర్థ్యములను ప్రసాదించినాడు. మాకు ధన్యత్వమును ప్రసాదించినాడు.

1-12-1972
హైదరాబాద్

ముదిగొండ వీరభద్ర మూర్తి (కీ.శే.)

శ్రీ శివాయ గురవే నమః

బ్ర॥ శ్రీ॥ లోకారాధ్యులైన శ్రీ కంఠ విద్యాభూషణ బిరుదాంకితులైన నిర్మల శంకరశాస్త్రుల వారిచే నాంధ్రీకరింపబడిన ప్రథమ ద్వితీయ సంపుటములం జదివితిని. గురువర్యులును మన్మాతులులు నగు శ్రీ శివయోగి. నాగలింగారాధ్యుల వారిచే ప్రోద్గీతమగు శ్రీ కంఠభాష్య వ్యాఖ్యయగు "శివచిన్తామణిప్రభ"నుశుద్ధప్రతిగా లిఖించి మున్ముందుగ ముద్రణ కందించియుంటిని. వ్యాఖ్యానసరణి సులభ గ్రాహ్యముగనే యున్నను, సంస్కృతభాషాభినివేశము గలవారికి మాత్రమే ఉపా దేయము కాగలదేమో యను సందియముం జూప "కాలోహ్యయం నిరవధిర్వి పులాచ పృథ్వీ"యను భవభూతి యాశయమునుచదివి. ఈ మాత్రపుటవకాశమును పుణ్యవంతుల కొసగదలచినట్లు చెప్పిరి. అదే విధమున నేటికి వారి యాశీర్వాద ఫలమే శ్రీ శ్రీ నిర్మల శంకరశాస్త్రుల వారికి చెంది శివచిన్తామణిప్రభా వ్యాఖ్యాన ముందగు ఆంధ్రీకరణమున సర్వులకు కరతలామలకముగ నొనర్పంబడినది. వీరి ద్విభాషా పాండిత్యము ఎట్టి దోషములకుం ద్రావివ్వక సర్వజనుల నానందపరచిన దనుట కెట్టి సందియమూ లేదు. పరమేశ్వరానుగ్రహమువలన ఇది ఆచంద్రార్కము విలసిల్లు గాక.

ఇట్లు
**మల్లంపల్లి జ్వాలా వీరభద్రశాస్త్రి,**
పమిడిముక్కల, కృష్ణాజిల్లా.

శ్రీ శివాయ గురవే నమః

నిర్మల శంకరశాస్త్రీ జయతు చిరం స్థిరతరాయురారోగ్యః।
శ్రీ నీలకంఠ భాష్యాఽనువాదచతురం మనస్తు యస్యాఽసీత్ ॥ 1

గాయత్రీపీఠాధ్యక్షా అధ్యక్షా ఇహేతి సంపన్నమ్।
భాష్యాఽవిష్కరణమిదం పరమామోదస్సువర్ణస్య ॥ 2

తద్బ్రహ్మసూత్ర మానస జాతం పూతం విభిన్నపథయాతం ।
ద్వైతాఽద్వైతవిశిష్టాద్వైతమతాఖ్యం సరిత్త్రితయమ్ ॥ 3

విశ్వజనీనం యత్తత్ వైయాసిక సౌత్ర లక్ష్యసర్వస్వమ్ ।
బోధాయనఋషిగదితం ప్రతిబించిత నీలకంఠ గురుహృదయమ్ ॥ 4

అప్పయదీక్షితసువచో దర్పణగత మమలభావ సందీప్తం ।
శ్రీ నాగలింగ గురుణా వ్యాఖ్యాతం వ్యాససూత్ర నిజహృదయమ్ ॥ 5

నిర్మలశంకరవిదుషా త్రిలింగభాషానువాద పరికలితమ్ ।
ఇదమస్తు సకలవిదుషాం ముదే సదాఽపి చ సదాశివకృపాయాః ॥ 6

నిర్మలశ్శంకరః శాస్త్రీ నీలకంఠపథవ్రతః ।
మల్లికార్జునవంశ్యోఽయం జయతాత్ శరదాంశతమ్॥ 7

శ్రీభోగసోమలింగారాధ్యకృపా జాహ్నవీ సదా జయతాత్ ।
నిర్మల శంకర విదుషే సర్వాభీష్టార్థ విజయఫలదాత్రీ ॥ 8

నీలకంఠాచార్యనిర్ణీత సిద్ధాంత పరిమళసంభార పరిథవమ్ము
లింగధారణచంద్రికాంగీకృత త్ర్యక్ష నందీశ వాగ్ఝర స్పందనమ్ము
అపరశంకరమల్లికార్జున పండితారాధ్యాంఘ్రి నల సమారాధనమ్ము
నాగభూషోష్ణీష నాగలింగారాధ్య లేలిహానఫణాభిచాలనమ్ము
రక్షకమ్ములు విమతాభితక్షకములు శిక్షకమ్ములు గాఁగ నీ చేయునాంధ్ర
సూత్రభాష్యమ్ము సంస్తుతి పాత్రమగుత సహజ నిర్మల శంకర శాస్త్రిహేళి.

శివమ్.

మల్లంపల్లి వీరేశ్వర శర్మ (కి. శే.)
ప్రిన్సిపల్
యస్ వి. యస్.ఎ కాలేజి, వరంగల్. 1-12-1968
అభినవశ్రీనాథ, హరితకవి, అభినవసూరి, అభినవపెద్దన,
ఆంధ్రకాంచీఖండచతురానన.

బ్రహ్మశ్రీ నిర్మల శంకర శాస్త్రిగారు రచించిన శ్రీ నీలకంఠ భాష్యాను వాదమును, నే నచ్చటచ్చట ఘట్ట స్థలములందు జూచితిని. శాస్త్రిగారు మృదు మధురమయిన ఆంధ్రభాషతో నాధ్యాత్మిక విషయమును ప్రమాణబద్ధముగ సుబోధ ముగ నిరూపించిరి.

శ్రీ శాస్త్రిగారు నీలకంఠబాష్యము నామూలాగ్రము చదివి, చక్కని యను భవమును సంపాదించినారను విషయము యీ గ్రంథపరిశీలనమును బట్టి యెల్లర కును విశదము కాగలదు.

శ్రీ శాస్త్రిగారు నాకు చిరపరిచితులు- సహజ పాండితీప్రతిభాశాలురు. శమాదిగుణసంపన్నులు- నిగర్వశిఖామణులు- సంతతదైవచింతనపరులు- అనేక ఆధ్యాత్మిక గ్రంథానువాదకులు.

వీరు రచించిన ఈ యనువాదగ్రంధము విశిష్టశివాద్వైత సిద్ధాంతము నరసి తరింపగోరు వారికి అత్యంతోపకారకమని నా యభిప్రాయము.

శ్రీ శాస్త్రిగారిని కైలాసాధిపతియగు నుమాపతి ఆయురారోగ్యైశ్వర్యముల నొసగి రక్షించుగాకయని యభిలషించుచున్నాను.

ఇట్లు

**మల్లావఝ్ఝుల వేంకట సుబ్బ రామశాస్త్రి**

త్రిపురా భవనం, దీనాబాద్ కాలనీ,

వరంగల్లు.

# విజ్ఞాపన

పామర జనులలో కొందరకు ఈ గ్రంధమును ఎవరు చదవాలి? ఎవరు అర్థం చేసుకోవాలి? ఎవరెట్లాచరించాలి? అనే నిర్లక్ష్య భావము కలుగవచ్చును. కాని ఎన్నటికైనా ఆ కుటుంబములో ఒక సత్పురుషుడు పుట్టి గ్రంధములోని ప్రతిపద అర్థములను అవలోకన మొనర్చుకొని తాను తరించి ఇతరులను తరింపజేయడా? ఉదాహరణకు ఇంటిలో ఒక అమృతకలశం ఉండగా పరంపరగా ఇంటివారెల్లరు దానిని తాకనైనా తాకక ప్రతినిత్యము పూజిస్తూఉంటే ఆ ఇంటిలోనే ఒక సత్పురుషుడు జన్మించి దానిని ఆమూలాగ్రముగా తెరచి చూచి అందులోని అమృత బిందువులను తాను సేవించి ఇంటివారెల్లరిని సేవింపజేసి ఆయురారోగ్య అష్ట సంపదలతో అందరి జీవితములను సుఖమయ మొనర్పగలడు.

గురుమూర్తి శివశ్రీ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులవారు ప్రజానీకము యొక్క సంక్షేమము ఎరిగియే ఈ గ్రంధము నిట్లు ఆవిర్భవింపజేసినారు గావున సురక్షితసంక్షేమముల నాకాంక్షించు ఆర్త ప్రజానీక మెల్లరు గ్రంధమును కలిగియుండుట అత్యావశ్యకము.

ఆర్త జన విధేయుడు
**అరుణార్తుల శంకరయ్య గుప్త**
4-2-260, మహాకాళి వీధి, సికిందరాబాద్ ఆం. ప్ర.

---

19వ పేజీ తరువాయి గ్రంధములు

| గ్రంధము | వెల | స్టాక్ ఉన్నవి |
|---|---|---|
| 12. మహామంత్రయంత్రశాస్త్రము హిందీ అనువాదము | 10-00 | ,, |
| 13. శివతత్త్వరహస్యము | 10-00 | ,, |
| 14. శివసహస్రనామరహస్యార్థము | 21-00 | ,, |
| 15. వీరభద్రవ్రతము (రామాబుక్ డిపో) | 10-00 | ,, |
| 16. శివమంత్రదీక్షావిధానము (శివజ్యోతిలో) | — | |
| 17. బ్రహ్మపథానువాదము-శైవమతప్రకాశికలో | — | |
| 18. శ్రౌతశైవత్రికాలసంధ్యావందనము | 2-00 | ,, |

శ్రీ నీలకంఠ భగవత్పాదులవారు రచించిన శారీరక బ్రహ్మమీమాంసా సూత్ర భాష్యాన్ని ఆంధ్రీకరించి శ్రీ నిర్మల శంకర శాస్త్రి ప్రచురిస్తున్న మహా గ్రంథం ఇది, "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను మొదటి సూత్రంనుండి "తత్తు సమన్వయాత్" అను నాలుగవ సూత్రమువరకు భాష్యానువాదము ఇంతకు పూర్వం వెలువడి పండిత ప్రశంసలను అందుకొన్నది.

ప్రథమాధ్యాయములో "ఈక్షతే ర్నాశబ్దమ్" అను ఐదవ సూత్రమునుండి తదధ్యాయ పరిసమాప్తి రూపమైన "ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః" అను సూత్రమువరకు భాష్యానువాదము వెలువడినది. రెండవ అధ్యాయమునుండి భాష్యాంతమువరకు ప్రచురించాలని అనువాదకుల సంకల్పము ఫలించుగాక!

శ్రీ నీలకంఠ శివాచార్య శ్రీ శంకరాచార్యుల సూత్రభాష్యములలో ముందు వెనుకలు ఏదైనప్పటికి ఉభయ భాష్యములు అపారవేద విజ్ఞాన సమన్వితములు, తార్కిక ప్రజ్ఞావిస్ఫారితములు, తాత్త్వికచింతనాపరులకు శిరోధార్యములు.

గీర్వాణభాషా ప్రవేశములేని ఆంధ్రజిజ్ఞాసువులకు ముఖ్యంగా శివాద్వైత సిద్ధాంతాభిమానులకు ఈ అనువాద గ్రంథము అవశ్యపఠనీయము. జటిలమైన భావములను కఠినమైన మాటలనుండి వేరుచేసి తేటతెనుగులో పాఠకులకు అందించడం- మాటలతో పనికాదు. ఉభయభాషలలోనూ పండితులైన శ్రీ నిర్మల శంకరశాస్త్రిగారు శ్రీ కంఠుల ఒరవడి తప్పక భాష్యజ్యోత్స్నలను కీనీడలులేకుండా అందించి ఆంధ్రపాఠక లోకానికి అపారమైన సేవచేశారు.

ఆంధ్రభూమి, 28-5-1972 ఆదివారము.

# శ్రీ నీలకంఠ భాష్యము

(అనువాదకులు, ప్రకాశకులు: శ్రీ నిర్మల శంకరశాస్త్రి, ప్రతులకు: శ్రీ నిర్మల శంకరశాస్త్రి 184-ఎ, సర్వమంగళాసదనము, నెహ్రూనగర్ (మారేడుపల్లి), సికిందరాబాదు.

వేదవ్యాసులు ప్రవచించిన బ్రహ్మసూత్రాలకు మతత్రయ వ్యవస్థాపకులైన

శంకర, రామానుజ, మధ్వాచార్యులు భాష్యాలను రచించి ఉన్నారు. అవి ప్రసిద్ధములై శతాబ్దాల తరబడి బహుళప్రచారాన్ని పొంది ఉన్నాయి. మతత్రయం వారివలెనే శైవమతప్రచారకులూ మహా విద్వాంసులూ అయిన శ్రీ నీలకంఠ శివాచార్యులు (నీలకంఠీయ) భాష్యాన్ని రచించి ఉన్నారు. అది శైవాగమవేత్తలకు ప్రమాణ గ్రంథం, శైవ సాంప్రదాయికులకు శిరోధార్యం, దురవగాహమైన ఈ భాష్యం వ్యాఖ్యానాపేక్షితం కావడంవల్ల ఇదివరలో శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు వ్యాఖ్య రచించినారు. అది సంస్కృతంలో ఉండడంవల్ల ప్రయోజనం పరిమితమయి ఉన్నది. దీన్ని గ్రహించి శ్రీ శంకరశాస్త్రి గారు అందరికీ అందుబాటులో ఉండేటట్లు నీలకంఠ భాష్యాన్ని అనువదించారు.

మొదట "అథాతో బ్రహ్మజిజ్ఞాసా, జన్మాద్యస్యయతః, శాస్త్రయోనిత్వాత్, తత్తు సమన్వయాత్" అనే నాలుగు సూత్రాల భాష్యానువాదం ఉన్నది. ఆ పిదప ఈక్షత్యధికరణం మొదలు సర్వవ్యాఖ్యానాధికరణంవరకు మిగిలిన ప్రథమాధ్యాయ సూత్ర భాష్యానువాదం విపులంగా ఉన్నది. ప్రశ్నోత్తరాలు సులభశైలిలో కూర్పబడినందువల్ల దురవగాహమైన విషయాలుకూడా సుబోధాలుగా ఉంటున్నవి.

మతాలు వేర్వేరుగా ఉన్నా వాటి లక్ష్యం ఒక్కటే. అది పరతత్త్వ నిరూపణమూ, ముక్తిమార్గ బోధనమున్నూ- అందువల్ల ఏ సంప్రదాయానికి చెందినవారైనా ఇతర సంప్రదాయాలను తెలుసుకోవడం అవసరం. దానికి ఈ గ్రంథం బాగా ఉపయోగపడుతుంది.

శైవాగమంలో నిష్ణాతులైనవారూ, ఆ అగమ తత్త్వాన్ని తెలుసుకున్నవారూ అయిన విద్వాంసులు ఎంతో మంది దీనిని మెచ్చుకున్నారు. వారిచ్చిన ప్రశంసాపత్రాలు, అభిప్రాయాలు ఇందు చేర్చబడ్డాయి. కొందరు ఉదారులు దీని ముద్రణకు ద్రవ్యసహాయం చేశారు.

బ్రహ్మసూత్రాలకు శైవసంప్రదాయం ప్రకారం గ్రహించదగిన విషయాన్ని తెలుసుకోవడానికి ఈ ఆంధ్రానువాదం ఉపయోగకరం.

72 ఆంధ్రప్రభ, సచిత్రవారపత్రిక

ఆయాస్య

# శ్రీ నీలకంఠ భాష్యము

(ఆంధ్రీకరణము)

అనువాదకులు, ప్రకాశకులు : శ్రీ నిర్మల శంకరశాస్త్రిగారు
శివాద్వైత విజ్ఞానసదనము 184/ఎ, వెస్టుమారేడుపల్లి, సికిందరాబాద్-500026.

కృష్ణాపత్రిక, 11-11-1967, సంపుటము 66, సంచిక 40.
ప్లవంగ నామ సం॥ కార్తీక శుద్ధ దశమి, శనివారము.

శ్రీ శివాద్వైత సిద్ధాంతపరముగ బ్రహ్మసూత్రములకు భాష్యము వ్రాసిన శ్రీ నీలకంఠ శ్రౌతశైవాచార్యులవారు భాష్యకర్తలందరిలో పూర్వులనియు, శ్రీవారి భాష్యమే శ్రీ శంకర రామానుజ మధ్వాచార్యులకు పూర్వమగుటచే సూత్రానుగతమైనదనియు విశ్వాసము కలదు.

బ్రహ్మసూత్రములు ఉపనిషదర్థ ప్రతిపాదకములు. ఉపనిషత్తుల సమన్వయముతో బ్రహ్మసూత్రములను వ్యాఖ్యానించుట- భాష్యమనఁబడును. సంస్కృత భాషాపరిజ్ఞానపరిపూర్ణత లేనివారికి ఉపయోగించుటకై మహోన్నతభావములు కలిగి, అతిగంభీరములై పారిభాషిక శబ్దజాలభూయిష్ఠములైన బ్రహ్మసూత్ర భాష్యములు- నేడు దేశభాషలోని కనువదింపఁబడుచున్నవి. ఈ అనువాదములు కూడా ప్రజోపయుక్తములుగ నున్నవనుటకు పాఠకులే సాక్షులు.

శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి గారు- అపర నీలకంఠ శ్రౌతశైవాచార్యులనుటలో సందేహము లేదు. శ్రీవారు స్వకీయమగు సూత్రభాష్యమును ఇతరమతనింద లేకుండ- స్వమతసిద్ధాంతము విశదమగునట్లు వ్రాసినారు.

బ్రహ్మనిరూపణలో గల శివ విష్ణు పరమేశ్వర నారాయణశబ్దములు- పరశివపరములన్నను దోషము లేదు. కామకళావిలాసగ్రంథమున శ్రీ పుణ్యానంద మునీశ్వరులు "శివశక్తిమిథునపిండః-కబళీకృతభువనమండలో జయతి" అన్నారు. ఏతదనువాదము సరళశైలిని హృదయాహ్లాదకరముగ విరాజల్లుచున్నది.

యువనాశ్వ

అస్మచ్ఛ్రీబ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో పరమగురుభ్యో నమః

శ్లో॥ సదాశివ సమారంభాం-శ్రీకంఠాచార్య మధ్యమాం,
అస్మదాచార్య పర్యంతాం-వందే గురుపరంపరామ్ ॥



సర్వతంత్ర స్వతంత్రులు, శతాధిక గ్రంథకర్తలు, శివాద్వైత విజ్ఞాన పరిపూర్ణులు, శివయోగనిష్ఠాగరిష్ఠులు, శాంభవ దీక్షితులు, భరద్వాజసగోత్రికులు, మత్పరమ గురువులు ఏతద్భాష్యవ్యాఖ్యానకర్తలునగు మహోపాధ్యాయ

ముదిగొండ నాగలింగశాస్త్రిలవారు (తెనాలి)

# శ్రీ శైవమహాపీఠము-పరిచయము

భాష్యాంధ్రీకరణావశ్యకత

వైయాసిక బ్రహ్మసూత్రములకు శ్రీనీలకంఠ శివారాధ్యులవారిచే విరచింపఁబడినఁ నీలకంఠభాష్యము జగద్విదితము, శైవమతానుయాయులకు శిరోధార్యము.

శ్రీశైవమహాపీఠాధిపతులు, పండిత శిరోమణులు, శివపూజాదురంధరులు త్రిలోకగురు మల్లికార్జున పండితారాధ్యవంశీయులునగు శ్రీనిర్మల శంకరశాస్త్రిగారిచే నీలకంఠీయ బ్రహ్మసూత్రభాష్యమాంధ్రభాషలోని కనువదింపబడుట శైవ మతస్థుల యదృష్టము. శ్రీ పీఠాధిపతుల యాదేశానుసారము శ్రీశైవమహాపీఠస్థాపన మొదలగు విషయములను నాకు తెలిసినమేరకి నాలుగు పంక్తులను వ్రాయుటకు సాహసించినందుకు సహృదయులైన పాఠకులు మన్నించెదరుగాక.

శైవమతోద్ధరణము, సంస్కృతభాష నభ్యసించు శైవ విద్యార్థుల కుపకార వేతనములందజేయుట ఇత్యాది ముఖ్యోద్దేశములతో 1909 సంవత్సరములో, అపర శంకరులు షట్కాల శివపూజా నియమతత్పరులు, నిరతాన్నదాతలు, త్యాగ మూర్తులునైన శ్రీ ముదిగొండ శంకరారాధ్యులవారి యధ్యక్షతన శైవమహాసభ స్థాపించబడినది. విశ్వదాత కళాప్రపూర్ణ, దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వర రావుగారు; ప్రముఖన్యాయవేత్తలు శ్రీ కొంపల్లి కోటిలింగముగారు; తత్త్వశాస్త్ర వేత్తలు శ్రీ శివలెంక అమృతలింగం అయ్యవార్లుగారు; శైవమతాభిమానులు సంపన్నగృహస్థులు శ్రీ సింగరాజు వెంకట సుబ్బారావుగారును ఈ శైవమహా సభాస్థాపనకు ముఖ్య కారకులు; ప్రోత్సాహకులును శైవమహాసభా ప్రథమ సమా వేశము 25-12-1909 తేదీన వరంగలు పట్టణమున జగత్పూజ్యులగు శ్రీ ముదిగొండ శంకరారాధ్యులవారి యగ్రాసనాధిపత్యమున జరిగినది. తదాదిగ నీమహాసభ లించు మించు ప్రతిసంవత్సరము ఆంధ్రదేశమందలి పలుప్రాంతములలో మహావైభవముగ జరుగుచువచ్చినవి. మతవిషయక చర్చలు, మతగ్రంథచర్చలు, మతాభివృద్ధికి దోహదముఁజేయు తీర్మానముల నామోదించుట-ఈ మహాసభా కార్యక్రమ విశేష

ములు. శైవమతాభిమానుల యభిమతానుసారము శ్రీ ముదిగొండ శంకరారాధ్యుల వారే వారి జీవిత పర్యంతము శైవమహాసభాధ్యక్షపదవి నలంకరించినారు. శివభక్తి నుద్దీపింపజేయు శివభజన కీర్తనలతోను, వందలాది పద్యములతోను, హృదయములను రంజింపజేయు మృదు మధురభాషణములతోను, సహస్రాధిక శిష్యులకు శివలింగధారణఁజేయుటతో మరియు మహాశివపూజా వ్రతకార్యక్రమములతోను, శైవమత ప్రాశస్త్యమును దేశము నలుమూలలకు చాటి శైవమతమున కెనలేని సేవజేసిన శ్రీ ముదిగొండ శంకరారాధ్యులవారు కారణజన్ములు చిరస్మరణీయులు.

శైవమతప్రాశస్త్యము నన్నిప్రాంతములవారికి తెలియజేయుటకై "శైవమత ప్రకాశిక" యను మాసపత్రిక స్థాపించబడినది. పలువురు మహనీయుల సంపాదకత్వమున మతపరములైన అనేకానేక విశేషములతోను, ఆధ్యాత్మిక సాహిత్య వ్యాసములతోను, పాఠకులకు విజ్ఞానప్రబోధకమై ఈ పత్రిక చాలకాలము ప్రకటింపబడుచుండెను.

1936 సంవత్సరము కృష్ణాజిల్లా యెలకుఱ్ఱు గ్రామములో జరిగిన మహాసభలో, శివయోగి మహోపాధ్యాయ బిరుదాంకితులు విద్వచ్ఛిరోమణులునైన శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారిచే సంస్కృతభాషలో రచింపఁబడిన బ్రహ్మపథము, వ్యాసపథము మున్నగు కొన్ని యమూల్యగ్రంథములను ముద్రించుటకై తీర్మానింపబడినది. ఆ ప్రకారము గ్రంథములను ముద్రింపజేసి, మనదేశమునందును జర్మని మొదలగు పాశ్చాత్యదేశములలోనున్న సంస్కృత పండితులకు పంపుటయును, వారందఱి ప్రశంసల నందుకొనుటయు జరిగినది. శైవమతావలంబులకు శ్రీకరభాష్యము ప్రమాణమా లేక నీలకంఠభాష్యము ప్రమాణమా యను నంశముపై జరిగిన చర్చల ఫలితముగా శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారి శివాద్వైత సిద్ధాంతానుసారము నీలకంఠభాష్యమే ప్రమాణ గ్రంథమని తీర్మానింపఁబడినది.

ఇతర మతములలో పీఠములుండుటయు, శైవమతములో నట్టి పీఠము లేకుండుటయు కొంత లోపమను తలంపుతో 1943 సంవత్సరములో విజయవాడలో జరిగిన మహాసభలో శైవమహాసభను శైవమహాపీఠముగ మార్చుటకు తీర్మానము చేయబడినది. ఇందుకు తగిన నిబంధనావళిని రూపొందించి శైవమహాపీఠమును చట్టరీత్యా రిజిష్టరుచేయుట జరిగినది. ఈ నిబంధనావళిని తత్కాలానుగుణముగ రూపొందించిన ఆనాటి ప్రధానకార్యదర్శి ప్రముఖన్యాయవేత్త శ్రీ కందు

కూరి భైరవమూర్తిగారు గణనీయులు. కొంతకాలమునకే నిబంధనావళిని సుగమము చేయుటకై కొన్నిమార్పులు చేయబడినవి. ప్రస్తుత కాలమాన పరిస్థితుల కనుగుణముగ నిబంధనావళిలో నింకను కొన్నిమార్పులు చేయవలసియున్నవని కొందఱు ప్రముఖులు చేసిన సూచన పరిశీలనలో నున్నది.

శ్రీ శైవమహాపీఠమునకు శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు ప్రథమ పీఠాధిపతులుగ నెన్నుకొనబడి జీవితాంతము పీఠాధిపతులుగనుండిరి. శైవమత ప్రకాశికకుకూడ శ్రీ శాస్త్రిగారే బహుకాలము సంపాదకులుగనుండి పత్రికాభివృద్ధికి నెంతేని తోడ్పడినారు. అద్వితీయరచనా కౌశలముతో గీర్వాణాంధ్రభాషలలో ననేక మత గ్రంథములనే కాక సాహిత్యగ్రంథములనుగూడ రచించి, అట్టి యమూల్య రచనలతో శైవమతమునకు మహోపకారమును చేసిన మహాగ్రహులు-శ్రీ నాగలింగ శాస్త్రిగారు. స్వప్రమాణములైన వారి విశిష్టరచనలవలననే శైవమతస్థులకు ప్రమాణ గ్రంథముల కొఱత తీరినదని చెప్పుట యతిశయోక్తి కాదు. మఱియు నీ రచనలన్ని యొకయెత్తు కాగా, నీలకంఠీయ బ్రహ్మసూత్రభాష్యమునకు శ్రీ శాస్త్రిగారు రచించిన శివచింతామణి ప్రభయను వ్యాఖ్యానము మఱొకయెత్తు. అనంతరాచార్యుల భాష్యములకు ఆదర్శమగు నసామాన్యరచనాప్రౌఢిమతో వారు వ్రాసిన శివచింతామణి ప్రభావ్యాఖ్యానము శైవమతస్థుల కెంతయు గర్వకారణము. ఈ యుద్గ్రంథము 1940 సంవత్సరములో ముద్రణ భాగ్యము నొందినది. గ్రంథముద్రణమునకు ప్రధాన హేతుభూతులు భాష్య పీఠికారచయితలు, అప్పటి శైవమహాపీఠాధిపతులు విద్యాప్రవీణ, విద్వాన్, శివయోగి, శ్రీ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు. ఈ మహనీయుని ప్రోత్సాహమువలననే, వరంగలు వాస్తవ్యులు వదాన్యులు శ్రీ ఆకారపు నరసింగముగుప్తగారు గ్రంథముద్రణమునకు వలసిన ధనసహాయము చేసి కృతార్థులైనారు. దేవనాగరిలిపిలో ముద్రింపబడిన యీ భాష్యగ్రంథము ప్రపంచఖ్యాతినొంది వేదాంత విజ్ఞానసర్వస్వమున చిరస్థాయిగ నిలచినది.

శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారి తరువాత శ్రీ ముదిగొండ వీరేశలింగ శాస్త్రిగారు, శతావధానులు శ్రీ ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రిగారు బహుభాషా కోవిదులు శ్రీ ఇవటూరి సానందారాధ్యులవారు శ్రీ మూలంపల్లి రాజశేఖరశాస్త్రిగారు శైవమహా పీఠాధిపతులుగనుండి శైవమతోద్ధరణ కెనలేని సేవచేసిన పుణ్యమూర్తులు. వీరియనంతరము శ్రీ శ్రీపతి పండితారాధ్యుల శరభారాధ్యులవారు పీఠాధి

పతి స్థానము నలంకరించి త్ర్యంబకభాష్యాద్యనేక గ్రంథముల రచించి శైవమతము నకు చేసిన మహోపకారము మరువజాలనిది.

శైవమహాపీఠ స్వర్ణోత్సవ (ఏబదియవ) మహాసభలు శికింద్రాబాదులోని శ్రీ శంకరారాధ్య మతావరణమునందు జరిగినవి. ఆ సందర్భమున వ్యాసప్రోక్త శివ మహాపురాణమును తెలుగు పద్యకావ్యముగ ననువదించి యాంధ్రభాషా సరస్వతికి అభినవమణిహారముగ నలంకరించి చరితార్థులైన మా తండ్రిగారు శ్రీ ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారు రచించినశ్లోకము, నిందు పొందుపరచుచున్నాను.

శ్లో॥ గంగానిర్ఝరిణీం బిభర్తి శిరసా యో లీలయాఽబ్బిందువత్
యేనోరస్యుపవీతితో బహుఫణశ్శేషోఽహి చూడామణిః
యస్మైశ్రీదయితశ్చకార కమలైర్నేత్రేణ చార్చాం స్వయం
సస్వోమార్ధపరిష్కృతోఽవతు శివ శ్శ్రీశైవపీఠం సదా॥

శైవమత ప్రకాశిక తరువాత శైవమత ప్రబోధినియను మాసపత్రిక సమర్థ వంతమైన శ్రీ తాడికొండ నాగమల్లయ్యగారి సంపాదకత్వమున చాలకాలము జయ ప్రదముగ ప్రకటింపబడినది.

1990 సంవత్సరములో శికింద్రాబాదునందు జరిగిన శైవమహాపీఠ మహా సభలో పూజ్యులు శ్రీ నిర్మల శంకరశాస్త్రిగారు పీఠాధిపతులుగ నెన్నుకొనబడి యిప్పటివఱకు పీఠాధిపతులుగ నుండి శైవపీఠమునకు వన్నెను సమకూర్చినారు. అనర్గళములు రసవత్తరములైన యుపన్యాసములతోను, సర్వజనోపయుక్తములగు ననేకగ్రంథ రచనలతోను, అసంఖ్యాక శిష్యప్రశిష్యులకు నిరంతర శివలింగదీక్షా ప్రదానముతోను, దర్శనమాత్రముననే భక్తిభావమును రేకెత్తించు ప్రసన్నరూపము తోను శైవజనులందఱి హృదయములలో చిరస్థాయిగ నివాసమేర్పరచుకున్న విద్వద్వరేణ్యులు శ్రీ నిర్మల శంకరశాస్త్రిగారు. శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రి గారిచే గీర్వాణభాషలో రచింపబడిన నీలకంఠభాష్యగత శివచింతామణిప్రభా వ్యాఖ్యా నము పాఠకులకు సులభగ్రాహ్యము కావలెనను ఆశయముతో నా గ్రంథమును యథోచితముగ నాంధ్రభాషలోని కనువదించిన శ్రీకంఠ విద్యాభూషణులగు శ్రీ నిర్మల శంకరశాస్త్రిగారి అవిశ్రాంతమైన మహత్తర కృషిఫలితమే ఈ నీల కంఠీయ బ్రహ్మమీమాంసా సూత్రభాష్య ఆంధ్రీకరణము. శివతత్త్వమును శైవమత

సిద్ధాంతమును సులభశైలిలో ప్రబోధించు నీ భాష్యానువాదమును ప్రతి శైవుడును చదువవలసిన యవసర మెంతేని యున్నది. ముఖ్యముగ శ్రీ శాస్త్రిగారాంధ్రీకరించిన శివమహాపురాణము, విదురనీతి, కఠోపనిషత్తు మున్నగునవి బహుజనాదరణ నొందినవి. ఈ నీలకంఠభాష్యము నాంధ్రీకరించిన శైవమహాపీఠాధిపతులు శ్రీ నిర్మల శంకరశాస్త్రిగారు ధన్యజీవులు.

3-11-1994 శివ దీపావళి,
43, వెస్ట్‌మారేడుపల్లి, సికిందరాబాదు.

ముదిగొండ మార్కండేయ,
ప్రధాన కార్యదర్శి, శైవమహాపీఠము

---

(35వ పేజీ తరువాయి గ్రంథములు)

| గ్రంథము | వెల | స్టాక్ ఉన్నవి |
|---|---|---|
| 19. శ్రీ శివమహాపురాణము-సమగ్రము (శ్రీరామా బుక్ డిపోవారి ప్రచురణ) | 300-00 | ,, |
| 20. (i) శ్రీ నీలకంఠీయ బ్రహ్మసూత్ర భాష్యాంధ్రానువాదము సమగ్రము | 116-00 | ,, |
| 20. (ii) నీలకంఠీయ బ్రహ్మసూత్రభాష్యాంధ్రీకరణము (రెండవభాగము) | 16-00 | ,, |
| 21. భద్రకాళీపూజావిధానము | 11-00 | ,, |
| 22. మహాలక్ష్మీపూజావిధానము | 11-00 | ,, |
| 23. ఈశ్వరగీత-సాంధ్రతాత్పర్యము | 21-00 | ,, |
| 24. ప్రదోషతాండవము త్రిలింగలో | | |
| 25. శైవసిద్ధాంతము ,, | | |
| 26. శివకేశవభేదాభేద విమర్శాదులు-10 శైవమతప్రకాశికలో | | |
| 27. స్వార్థము పరార్థము ఇత్యాదులు 6 శ్రీశైలప్రభలో | | |
| 28. అష్టలక్ష్మీస్తోత్రార్థాదులు 5 శైవవాణిలో | | |
| 29. శివాద్వైతమేవశ్రౌతమ్ అయోధ్యా-సంస్కృతపత్రికలో | | |

## ముద్రణ కానున్నవి

30. ప్రబోధచంద్రోదయనాటకము
31. విదురమహానీతి-ద్వితీయభాగము

CHAGANTY SANKARASASTRY, M.A., B.L. Phone : 34897
Senior Advocate, Secretary 3-4-866, Barkatpura,
Sri Saiva Mahapeetham Hyderabad-27 (A.P.)
Date : 12-2-1967.

Appreciation of Neelakantha Bhasyam Translation

Author : Sri Lokaradhya Nirmala Sankarasastry

The author, Sri Lokaradhya Nirmala Sankarasastry, who belongs to an orthodox Aradhya Family of true piety and devotion to Parama Siva, a family which traces its descent from Sri Mallikharjuna Panditha, one of the Twelve distinguished Aradhyas of the Andhra Desa held in sublime reverence, is an erudite Sanskrit Scholar with profound proficiency in Saivaite Cult and religious lore. Sri Nilakantha-Acharya, himself one of the Historic Twelve Aradhyas is a superb exponent of Siva-Advitha Philosophy and Saivism, seated on a throne of unsurpassed fame, and adoration. His commentary on tee Holy Sage Vyasa's Brahma Suthras, the renowned Nilakantha Bhasyam which unfolds and upholds the Supremacy of the said Philosophy or Sidhanta and religion, is a treatise of highest authority, commanding high respect and reputation to the realm of religion, and is sovereign where it reigns His interpretations and Siddhanthas are indeed recognised by the Saivaites as the only correct ones. Sri Lokaradhya Nirmala Sankarasastry has rendered unique servic by his able and impressive translation of Sri Nilakantha's Brahma Sutra Bhasyam into Telugu, making the Divine Knowledge embodied therein accessible to all the Telugu-knowing people and also enriching the religious literature in general thereby. The first part of his work was published previously, and won wideapproval and appreciation. This second

second part is now ready, and I hope that the public will receive it with equal acclamation deriving therefrom the valuable enlightenment which it is certain to impart to whoever will endeavour to obtain it and avail himself of its spiritual treasures.

The public at large, inclusive of those who belong to different schools of thought, philosophy and religious practices, will without any detriment to or disparagement of their own cherished firm faith in them, have an insight into the intrinsic excellence of the great Saivaite doctrine, by a dispassionate study of these works. Since the testimony of disinterested thinkers of western culture invariably commands more respect and inspires belief in modern Times, and it will not be treated or under estimated as partisan, partial or blind, it may be advantageous to extract in this context a few such opinions as samples. "The philosophy (Saiva Sidhanta) offers an excellent example of a total philosophy. Both by definition and development the Saiva Siddhantha philosophy claims to be the acme of religious thought". (John H. Piet P H D.) "The Saiva Siddhantha System is the most elaborate, influential and undoubtedly the most intrinsically valuable of all the religions of India". (Dr. G. U. Pope 19 th Century).

Members of the Saiva Community in particular will do well to bear in mind that in the words of Rev. Goodle "This system of Saiva Siddhanta possesses the merit of great antiquity——. As a system of religious thought, as an expression of faith and life, Saiva Siddhanta is by far the best judged by its intrinsic merits the Siddhantha represents the high water-mark of Indian Thought and Indian Feeling". Such of them among us, who have the capacity to do so, therefore owe it to themselves and to the hoary community to which they belong, to examine this so highly admired Siddanta independently, be convinced of its infalibility and ardently practice as well as propagate the religion and the philosophy by making such contributions, as is done by our distinguished author Sri Lokaradhya Nirmala Sankarasastry and by his example, or as best as possible otherwise. Such of them among

us, who have not such capacity, owe it to their progeny, and are hereby exhorted, to implicitly respect their wise ancestors whose unswerving spiritualty and spiritual fervour are their safest guide and anchor at all tmes, and to transmit to that progeny the noble heldity and tradiion which those ancestors transmitted to themselves, by following and fostering that ancestral religion and philosophy, giving on room for its slightest disregard discard or desertion. It is essential for us to remember that what is one's own is always more conducive to happiness and harmogy, than any other one, borrowed from outside and external. In an illustrious article on research in Ayurveda written recently, a great scholar practitioner of Ayurveda of high ability and ardour for that ancient Science, Pandit Sri Srirangam Subbarao Doctor of Ayurveda brought to light an interesting eternal truth enunciated by our Divinely inspired Rishis. He wrote that it is embodied in Charka's Crisp dictum that.

యస్మిన్ దేశే హి యో జాతః
తస్య తజ్జౌషధమ్ హితమ్

Whoever is born in a particular country, to him the brug grown in his Native Soil is suitable". If drugs of one's Mother Earth are so efficacious in mending and weeding out dodily ills, religious faith, precept and practice, inhered from and nourished on the sacred soil of one's own mother pedigree, heredity and tradition, must undoubtedly be more efficacious and exclusively potential to eradicate all the accumalated spiritual ailments or sins, and confer the blessing of spiritual bliss of far greater moment on every such individual, and sect.

Turning once again to our learned Author Sri Lokaradhya Sankarasastry, on encomiumbestowed on, or encouragement extended to him will be an adequate acknowledgement of the deep debt of gratitude due to him for his valuable spiritual contributions. Finding none else batter, I blend both my palms to offer my Pranamams to him in humble rec-

ognition of his scholarship and service (to the Saiva Community as well as the wider humanity). That scholarship and service are both of high order for which these two parts of translation of Nilakantha Bhasyam and his other similar works of eternal worth and everlasting vitality will be self evident elequent proofs.

---

శుభాశంసనము.

నా శైవ వాఙ్మయకృషి నభినందించి నా గ్రంథములలో ముఖ్యాతిముఖ్యమగు శ్రీ నీలకంఠీయ బ్రహ్మసూత్రభాష్యము యొక్క, శ్రీ నాగలింగీయ శివ చింతామణిప్రభా వ్యాఖ్యానముయొక్కయు తెలుగుసేత- ఒకే సంపుటముగ ముద్రింపఁబడి - శైవారాధ్యులందరికి త్వరలో అందవలె నను సదభిప్రాయముతో నా నిరుత్సాహమును పోగొట్టి సముచిత సలహాల నొసఁగుచు నన్ను ప్రోత్సహించిన మహానుభావులను ఇందు ప్రకటించుట - నా కర్తవ్యము గదా!

1. శివశ్రీ॥ లో॥ కాశీనాథుని పూర్ణమల్లికార్జునుఁడు గారు, మచిలీపట్నం.
2. ,, ఎం.ఎస్ రాజలింగం గారు హైదరాబాద్.
3. ,, తాడికొండ వీరభద్రయ్య గారు ,,
4. ,, తాడికొండ లింగమూర్తి గారు ,,
5. ,, ములుగు హనుమంతరావు గారు ,,
6. ,, ముదిగొండ మార్కండేయులు గారు ,,
7. ,, తాడికొండ నాగమల్లయ్యగారు ,,
8. ,, శివలెంక శేఖర్ గారు, విజయవాడ.
9. ,, భండారు చంద్రమౌళీశ్వరరావుగారు వరంగల్.
10. ,, కొడిమేల నాగమల్లికార్జునశర్మగారు ,,
11. ,, అత్తలూరు మృత్యుంజయశర్మగారు ,,
12. ,, అన్నదేవర సుబ్బారావుగారు విజయవాడ
13. ,, డా॥ ముదిగొండ శివప్రసాద్‌గారు హైదరాబాద్

త్రయోదశశివగణాధ్యక్షులఁ బోలిన నీ పురుషోత్తములు దీర్ఘాయురారోగ్యములు గలవారై నా భవిష్యత్ గ్రంథముద్రణకు తోడుపడుదురు గాక!

నిర్మల శంకర శాస్త్రి

ఏతన్ముద్రణప్రకాశనములకై స్వసంతోషముతో తమ ఆర్థికసహకారము నందఁజేసిన పుణ్యాత్ములు-

25. శ్రీయుత మామిడి గంగారాంగారు,
(రిటైర్డ్ మండల విద్యాధికారి) గాంధీరోడ్ కోరట్ల

26. బ్రబ్రశ్రీ॥ వుండవల్లి హరగోపాలరావు. సౌ॥ శ్యామల గారలు.
కరస్పాండెంట్ విద్యాసాగర్ స్కూల్, ఈస్ట్ మారేడుపల్లి
సికిందరాబాద్-500026

27. శివశ్రీ॥ ముత్యంపేట లింగయ్యగారి జ్ఞాపకార్థము
వారి కుమారుడు శ్రీ ఎం. గణేశం గారు, వాణీనగర్ సికిందరాబాద్

28. శివశ్రీ॥ తాటికొండ దిగంబరం, సౌ॥ లలితగారలు
బెల్లంపల్లిరోడ్, 12-66 మంచిర్యాల్ 504208

29. శ్రీయుత సూర్యనారాయణరెడ్డి, సౌ॥ కుసుమకుమారి గారలు.
లాలాగుడ, 10-5-825/14డి. సికిందరాబాద్-500017

30. శ్రీయుత తురగా దుర్గాప్రసాద్‌గారు
కాంట్రాక్ట్, దిలసుక్‌నగర్ 12-90, హైదరాబాద్-500660

31. శివశ్రీ॥ లో॥ అన్నదేవరసుబ్బారావుగారు, 40-15-3
బృందావన గార్డెన్స్. లబ్బీ పేట, విజయవాడ 520010
తమ కుమారుఁడు శ్రీ॥ ఎ. చంద్రశేఖర్ ద్వారా గొప్ప విరాళం సమర్పించిన నవనీతహృదయులు.

32. శివశ్రీ॥ సాహిత్యాలంకార రామగిరి సిద్ధ రామేశ్వరశర్మగారు వారాసిగుడ.

ఇంక నెవరైన మహోదారులు విరాళాలు సమర్పించునెడల త్వరలో వెలువడనున్న మహాగ్రంథమునందు వారి శుభనామములు ప్రకటింపఁబడును

నిర్మల శంకర శాస్త్రి

శ్రీ

శివ ఏకో ధ్యేయః



గ్రంథకర్త

ఆచార్య, శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు

(శైవమహాపీఠాధిపతి)

శ్రీ పార్వతీ రాజరాజేశ్వరాభ్యాం నమః

# శ్రీ నీలకంఠ భగవత్పాదకృత

# శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

[అంధ్రీకరణము]

## చతుస్సూత్రి

*మంగళాచరణ శ్లోకములు :*

ఓ న్నమోఽహంపదార్థాయ-లోకానాం సిద్ధిహేతవే
సచ్చిదానందరూపాయ-శివాయ పరమాత్మనే. 1

నిజశక్తి భిత్తి నిర్మిత-నిఖిల జగజ్జాల చిత్ర నికురుంబః
స జయతి శివః పరాత్మా-సకలాగమసారసర్వస్వమ్. 2

భవతు స భవతాం సిద్ధ్యై-పరమాత్మా సర్వమంగళోపేతః
చిదచిన్మయః ప్రపంచః- శేషోఽశేషోఽపి యస్యైషః. 3

శ్రీ పరమేశ్వరేచ్ఛావశమున లోకకల్యాణార్థ మావిర్భవించినట్టి ద్వాదశాచార్యులలో ప్రధానులగు శ్రీ నీలకంఠ శివాచార్యులవారు వేదములను వేదాంగముల నభ్యసించి, శ్వేతాచార్యులవారివలన బ్రహ్మోపదేశముఁ బడసియు, తా నుద్దేశించిన బ్రహ్మసూత్రభాష్యము నిర్విఘ్న పరిసమాప్తిఁ జెందుటకుగాను శిష్టాచారము ననుసరించి మంగళము నాచరించియున్నవారు.

"అహంపదముతో చెప్పఁబడువాడు, మాహేశ్వరుల యుపాసనను సిద్ధింపఁ జేయువాడు, సత్యము-జ్ఞానము-ఆనందమున్ను స్వరూపములుగా కలవాడు, పరమాత్మయు ప్రణపవాచ్యుఁడు నగు శివునకు నమస్కారము."

ఆస్తికులందరికిని ప్రమాణమగు వేదరాశిఁదగు పూర్వభాగము ఇహలోక

ఫలములను పరలోక ఫలములను నిరూపించునట్టిది. ఉత్తరభాగము పరమపురుషార్థమైన మోక్షము నుపదేశించునట్టిది, ఉత్తరభాగ మనఁదగునుపనిషత్తుల సమన్వయ రూపమైన యర్థమును తెలుపఁదలచినట్టి శ్రీ వేదవ్యాస భగవానుడు రచించిన బ్రహ్మసూత్రములకు బోధాయనమహర్షి వృత్తిని (సంస్కృతములో సంగ్రహార్థమును) వ్రాసియుండెను.

బోధాయనుని తరువాత ననేకులు తమతమ యిష్టార్థములను కల్పించుటచే సూత్రములు కలుషితములైనందున కలిగిన వేదవ్యాసుని యావేదనఁ గుర్తెఱిఁగి పరమేశ్వరుఁడు శ్రీ నీలకంఠశివాచార్యరూపమైన అంశావతారమును పొందవలసి వచ్చెను.

అవతిధాతువునకు మన్ ప్రత్యయము వచ్చి పకారము లోపించియు ఉకారము అదేశము రాగా అవతి, అవమన్, అ. ఉ. మ్=ఓమ్ అని రూపనిష్పత్తి యగుచున్నది.

అహంపదార్థముతో-ప్రియతమమగు ఇష్టలింగమును; "ఓన్నమః" "శివాయ" అను పదముల యర్థముతో-శివషడక్షరీమంత్ర స్వరూపమగు ప్రాణలింగమును; పరమాత్మ పదార్థముతో - సర్వాంతరమగు భావలింగమును భావింపవలెనని నిరూపించినట్టి శ్రీ నీలకంఠాచార్యులు పాశుపత వ్రతనిష్ఠులని తెలియుచున్నది.

జీవునియందుపయోగింపఁబడు అహం పదము జీవాంతరాత్మయగు పరమాత్మయందు పర్యవసానముఁ జెందుచున్నది. మఱియు అహం పదము శక్తి శివుల కూడికయగు పరబ్రహ్మను బోధించును. ఇట్టి అహం పదార్థమగునట్టిదే అన్నమయమగు స్థూలశరీరమును జెందియుండు ఇష్టలింగమనఁబఱగుచున్నయది. ఇష్ట ప్రాణభావలింగానుసంధానముఁ జేయువారికి నభిషితలోకములందలి సుఖములఁ గలుగఁజేయువాడు శివుఁడని "లోకానాం సిద్ధిహేతవే" అను పదము తేటపఱచును.

లోకులనగా లింగాంగ సామరస్యము గలవారు. సిద్ధి యనగా ముక్తి; అద్దానిఁ బ్రసాదించువాడు శివుఁడనియు చెప్పవచ్చును.

సర్వోత్కృష్టమగు ఆనందము ననుభవించుట ముక్తిస్వరూపమనియు పరమేశ్వరుఁడు నట్టి యానందము కలవాడై సద్రూపమునందును చిద్రూపము

నందును వ్యాపించియుండు ననియు "సచ్చిదానందరూపాయ" అను పదము విశదపఱచుచున్నది.

"ఓమ్" అను బ్రహ్మవాచి శబ్దమువలన జగత్కారణము బ్రహ్మమని తెలియుచుండుటచే అణ్వాదికారణవాదంబును; "అహంపదార్థాయ" అనుటచే శివుఁడు శక్తి విశిష్టుఁడని విదితమగుటఁజేసి నిర్విశేషవాదంబును; "లోకానాం సిద్ధిహేతవే" అనుటవలన కర్మజ్ఞాన సముచ్చయఫలము నిరూపితమగుచుండుటచే కేవలకర్మవాదంబును; "సచ్చిదానందరూపాయ" అను పదము వలన శూన్య వాదంబును; "శివాయ" అను పదముతో పాంచరాత్రాదివాదంబులును త్రోసివేయఁ బడుచున్నవి.

సకల విద్యలందు నుత్కృష్టమగు శ్రుతిలో నుత్తమమగు రుద్రాధ్యాయమున మధ్య విరాజమానంబగు పంచాక్షరియందమఱియుండు "శివ" శబ్దమునకు పాప పరిహారమునందు ఎంత శక్తి కలదో అన్ని పాపములను చేయుటకు కలియుగమున శక్యముకాదు గావున నిట్టి మహోత్తమమైన శివశబ్దము నీ శ్లోకమునఁ జేర్చుటచే భాష్యార్థశ్రోతలకు వివిధ ప్రతిబంధములను తొలగించు శివనామశ్రవణము (ఇట) విహితమగుచున్నయది.

"శివ ఏకో ధ్యేయః శివంకరః సర్వమస్య త్పరిత్యజ్య" అను శ్రుతి నను సరించి "శివేతర దేవతలను విడనాడి యిహపరశ్రేయోదాయకుడగు శివునొకనినే పూజింపవలెను. ప్రార్థింపవలెను. ధ్యానింపవలె" నను నంశము బోధపడును.

ఏతద్భాష్యగత ప్రథమాధ్యాయమందలి సర్వవేదాంతసమన్వయము "ఓమ్" అనుటచే శివునందే కలదనియు; ద్వితీయాధ్యాయములోని శ్రుతి విరోధ పరిహారము "అహం పదార్థాయ" అనుటచే అహం పదముతో తెలుపఁబడు చిదచిత్తులను వ్యాపించు పరమాత్మ-సమస్త ప్రపంచరూపముగల శక్తితో కూడియుండు వాడని తెలుపఁబడుచున్నదనియు; తృతీయాధ్యాయగత సాధననిరూపణము "లోకానాం సిద్ధిహేతవే" అనుటఁజేసి - ముక్తిసాధనము శివానుసంధానమని - గావింపఁబడినదనియు; చతుర్థాధ్యాయ ప్రతిపాదితమగు ముక్తిఫలము "సచ్చిదానంద రూపాయ" అను పదముతో సచ్చిదానందప్రాప్తి యనియు సూచింపఁబడినవి.

పరమేశ్వరునకు నద్వితీయత్వము నంగీకరించునెడ ద్వైతశ్రుతివిరోధంబును సద్వితీయత్వముఁ గ్రహించునెడ నద్వైత శ్రుతివిరోధంబు నేర్పడును

కావున శివాద్వైతసిద్ధాంతము సర్వశ్రుతిసమన్వయముతో సమంజసమగునని విబుధులు గ్రహింతురు గాత!

## అణ్వాదికారణవాదము

"సృష్టి ప్రారంభమున రెండు అణువులుకూడి పెద్దవై క్రమముగా కూడుచు ననేకములై యీ ప్రపంచమును నిర్మించినవి" యని చెప్పునది.

## నిర్విశేషవాదము :

ఇద్దానినే యద్వైతమందురు. "గుణములు స్వరూపము మొదలగు విశేషములు బొత్తుగా లేనట్టి బ్రహ్మము - గుణములు రూపము గల జగమునకు కారణమైనది. నిర్విశేషమగు బ్రహ్మమునందు జగము నారోపించి జగద్రూపముఁ జూచుట భ్రాంతి యగును. ఇట్టి భ్రమను వీడి 'అహం బ్రహ్మాస్మి' యని భావించుట ముక్తి" యని నిరూపించునది.

## కర్మవాదము :

"జీవులాచరించు కర్మ యపూర్వముగా పరిణమించి స్వర్గనరకములందు సుఖదుఃఖముల ననుభవింపఁజేయును. ఇట్టి కర్మఫలమునకు భగవదనుసంధాన మనవసర"మని నిర్దేశించునది.

## శూన్యవాదము :

నిర్విశేషవాదముతో సరిదూగును. "బ్రహ్మము సచ్చిదానంద శివస్వరూపము గానిదై భూతాకాశము వలె శూన్యమైనట్టి"దని కందార్థములతో నార్భాటముఁ జేయునది.

## పాంచరాత్రవాదము :

పాంచరాత్రములనఁబడు ఆగమములకు ప్రాముఖ్యము నంగీకరించి "అంతస్తమో బహిఃసత్త్వః" అని చెప్పఁబడు నారాయణుఁడు - సర్వోత్తముఁడు మోక్షప్రదుఁడనియు చెప్పు వాదము.

2. నమస్కారరూపమైన మంగళము నుచ్చరించి వస్తునిర్దేశాత్మక మంగళము నాచరించియున్నవారు.

ఎల్లకాలము తన నాశ్రయించియుండు శక్తియనఁబడు గోడయందు సర్వవిధలోకముల సమూహము అనెడు చిత్తరువుల చేరికను నిర్మించువాడును, వేదములు, వేదాంగములు మొదలగు శివాగమముల సారములనఁదగు ఉపనిషత్తుల సర్వస్వమగువాడును (అనగా నవ్వానియందు బాగుగా నిరూపింపఁబడిన ముఖ్యాంశముఁ దగు సంపూర్ణ లక్షణము కలవాడును) జీవాత్మను నియమించువాడగుటఁ జేసి పరమాత్మ యనఁదగు శివుఁడు - తా సృష్టించిన చేతనాచేతన ప్రపంచమునకంటె నతిశయముగా విరాజిల్లుచున్నవాడు.

శివుఁడు సర్వోత్కర్షతో నుండువాడని చెప్పుటకు వేదాంతములు ప్రమాణములగుచున్నవి. శక్తియందు జగమును చిత్రించువాడగుటచే జగమునకు శక్తిగాక తానే కారణమగుచున్నవాడు. పరమాత్మ - అజ్ఞానములేనివాడగుట ననంత కల్యాణగుణములు గల పరిశుద్ధస్వరూపము గలవాడగుటను తత్త్వవేత్తలు శివుఁడని చెప్పుచున్నవారు. వేదాంతప్రతిపాదితసంపత్తి గలవాడగుటచే వేదాంత సర్వస్వము శివునియందే తాత్పర్యము గలది యగుచున్నది. పరమేశ్వరుఁడెల్లపుడు జీవభిన్నుఁడని "పరాత్మా"యను పదము తేటపఱచునది; జగమునకు చిత్రసామ్యము వలన జగము మిథ్యయని భావింపరాదు. చిత్రమువలె నానావిధమైన జగము సత్యమైనట్టిది. గోడ చిత్తరువుఁ గూడుట నిత్యము కానట్లు - అపరాప్రకృతి వికారములైన పృథివీజలాగ్నివాయ్వాకాశాద్యచేతనములందు పరాప్రకృతి సంబంధముగల చేతనులు (జీవులు) ప్రవేశించియుండుట మాత్ర మనిత్య మగుచున్నయది. శశవిషాణమువంటి మిథ్యావస్తువులు ఆభాసించుటకును వీలులేదు. భిత్తికి సుధాలేపనముతో చిత్రము అంతరించునట్లు జగము జ్ఞానదశయందు శూన్యమగునని కొందరు తలచెదరు. చిత్తరువు రంగులతో నేర్పడును గావున వర్ణరూపేణ సూక్ష్మస్థితిఁ బొందునట్లు జగము జ్ఞానికి సూక్ష్మచిదచిద్విశిష్ట బ్రహ్మముగ గోచరించునని భావము.

3. ఆశీర్వాదరూపమగు మంగళము నాచరించుచున్నవారు.

సర్వమంగళ యనఁబడు గౌరీదేవితో కల్యాణగుణములన్నిటితోడను కూడియుండువాడు; పగలు - రాత్రి, సత్తు-అసత్తు అనువాని వివేకము లేనట్టి

మహాప్రళయ సమయములో తనకంటె రెండవ వస్తువు (ప్రపంచము నధిష్ఠించు నది) లేనివాడు; ఉత్తమ పురుషుఁడు నగు సదాశివుఁడు-భాష్యార్థ శ్రవణముఁ జేయు మీ యందరి మనోఽభీష్టములను సిద్ధింపఁజేసి విజ్ఞానమును కలిగించు గాత!

చేతనులు, అచేతనములును నిండియుండు ప్రపంచమంతయు శేష మగు వాడు శివుఁడని గ్రహించునది. శేష మనగా పరార్థమైనది. అశేషము శేష మగుచున్నదని చెప్పుటయందాభాసించు విరోధము - ప్రాకృతదృష్టి గలవారికి ప్రపంచము అశేషముగ కనుపడినను అప్రాకృతదృష్టి గలవారికి పరమేశ్వర విభూతి లేశముగ స్ఫురించునని నిరూపించుటవలన - పరిహరింపఁబడును.

చేతనవర్గము-తమతమ యధికారము ననుసరించి కర్మజ్ఞానములతో శివు నారాధించుటకు ఉపయోగించును. భూజలాద్యచేతనవర్గము శివారాధన కాశ్రయ మగుటకు నుపకరించును. కావున చరాచర మంతయు శివునకు శేషమగు ననుట లో సందేహము లేదు.

సంసారులగు జీవులు పశువులనఁబడుదురు. జగము పాశ మనఁబడును. శివుఁడు పతి యనఁబడును. ఇతర ప్రభువులవలె గజాశ్వ సువర్ణాభరణాది పరిమితసంపద కలవాడు గాక, పశుపాశసమ్మిశ్ర మగు ప్రపంచము నంతయు శాసించు గొప్ప ఐశ్వర్యము కలవాడని భావము.

పాశుపతవ్రత దీక్షాప్రదానపూర్వక సమస్త వేదాంతార్థ బోధకుడైన తము ఆచార్యుని దిగువ శ్లోకముతో నమస్కరించుచున్నవారు.

నమః శ్వేతాభిధానాయ నానాగమ విధాయినే;
కైవల్య కల్పతరవే కల్యాణగురవే నమః. 4

అనేక వేదాంతములకు తోచెడు విరోధమును పోనాడి సరసమైన ఏకార్థ మును నిర్ధారించి యుపదేశించువారును, కైవల్యము (శివ సాయుజ్యము) నకు కల్పవృక్షమువంటివారును, భక్తి-జ్ఞాన-వైరాగ్యాది కల్యాణ గుణములు కల వారును, పాశుపతదీక్ష ననుగ్రహించినట్టి కల్యాణగురువులు నగు శ్వేతాచార్యుల వారికి నమస్కారము.

వేదవాక్యములందువలె నీ శ్లోకమున, శైవసమయము ననుసరించి శివస్తుతి

తన్న గురుస్తుతి యధికఫలప్రద మగుచున్నందున ఆదరాతిశయముతో రెండు మారులు నమఃపదము ప్రయోగింపఁబడెను.

శ్వేతాచార్యులవారు - వేదాంతములన్ని యెట్టి విరోధముఁగానక శివుని యందే తాత్పర్యము కలవని శిష్యులకు నుపదేశింప నవతరించినవారు. మరియు కల్పవృక్షము కాముకుల కోర్కెలను ఫలింపఁజేయునట్లు కైవల్య మహాఫలము నపేక్షించు ముముక్షువులకు జన్మరాహిత్యమును కలుగఁజేయువారు.

శ్రీ నీలకంఠాచార్యులకు విద్యాగురువులే గాక దీక్షాగురువులనియు "కల్యాణ గురవే" అను పదము తెలుపును. తమ కల్యాణగురువగు శ్వేతాచార్యులవలన శాంభవదీక్షితులై ఇష్టప్రాణభావలింగానుసంధానముతో సంప్రదాయబద్ధమైన ముముక్షుత్వము నవలంబించినవారని తెలియనగును.

వ్యాససూత్ర మిదం నేత్రం విదుషాం బ్రహ్మదర్శనే
పూర్వైః కలుషితం నీలకంఠేనాద్య ప్రసాద్యతే. 5

అంగములతో కూడిన వేదములను వేదాంతములను చదివి యర్వాని యర్థ మును గ్రహించుటవలన బ్రహ్మస్వరూపము మనస్సునందు తోచుచుండును. ఇట్టి జిజ్ఞాసువులకు "బ్రహ్మ యిట్టి"దని నిశ్చితబుద్ధి కలుగుటకై వ్యాసులవారిచే రచియింపఁబడిన ఈ సూత్రముల సముదాయము నేత్రమువంటిదనియు, ఇట్టి వ్యాససూత్రములను వ్యాఖ్యానించిన పూర్వాచార్యులందరును సూత్రార్థమును కలుషితముఁ గావించినవారగుటఁజేసి నీలకంఠ శివాచార్యుడ నగు నేను సూత్ర కారుని యుద్దేశము ననుసరించి సమన్వయముతో వివరించుచున్నవాడను.

లోకములో వస్తువులను కనుగొనుటకు కన్నువలె బ్రహ్మ దర్శనమునకు శ్రీ వేదవ్యాసప్రణీతమైన సూత్రజాతము నిరపేక్షసాధనంబని నేత్రమను పదము విశదపఱచును. మరియు కుత్సితవైద్యుల చికిత్సచే వికృతములైన నేత్రములు సద్వైద్యులచే బాగుచేయఁబడునట్లు పూర్వాచార్య కలుషితములైన వ్యాససూత్రము లను ప్రసన్నార్థ నిరూపణతో నుపాదేయములుగ నొనర్చినవారని గ్రహింప నగును.

కొందఱు అధ్యాసకల్పనతో కూడిన మాయావాదబలముతో జీవేశ్వరాభేద మును నిరూపించుటతోడను, మరికొందరు తర్కవితర్క బలముతో అనీశ్వరు

లందు ఈశ్వరత్వమును సాధించు దుష్టవ్యాఖ్యానములతోడను వ్యాససూత్రములను కలుషితములఁ గావించిరని "పూర్వైః కలుషితం" అను పదము తెలుపును.

భాష్యకర్తలందరు శ్రీ నీలకంఠ భగవత్పాదులవారి తరువాతివారైనను వారి యభిమతములను పూర్వపూర్వముగా తెలిపినవారందఱు నిచటి పూర్వ పదముతో చెప్పబడుచున్నవారు.

ప్రమితత్వాధికరణమునందు చెప్పఁబడు ఈశానశబ్దము యోగమువలనను రూఢివలనను శంకరునే బోధించుననియు నారాయిణాదులను బోధింపదనియు "శబ్దాదేవ ప్రమితః" అను సూత్రమునకు ఈశానశబ్దాశ్రయ శ్రుతియే విషయవాక్య మగుననియు ఇది మున్నగు నుపనిషత్తులన్నిటితో నారాయణపరత్వమును గాని జీవపరత్వమును గాని ప్రకృతిపరత్వమును గాని సాధించుటకు వలనుపడదనియు "ప్రసాద్యతే" అను పదము తేటపఱచును.

బ్రహ్మసూత్రం పయో గాంగం మలత్రయవిశోధకం
పరైః పంకిలితం నీలకంఠారాధ్యేన శోధ్యతే. 6

మలము అనగా అజ్ఞానము;

ఆణవమనియు, మాయికమనియు, కార్మికమనియు, త్రివిధమగునది.

ఆణవము ;

సృష్టిప్రారంభమున అణువుల కూడిక వలన ఏర్పడునది.

మాయికము:

ఈశ్వరు నెడబాయనట్టి మాయాశక్తివలన సంభవించునది.

కార్మికము :

సంచిత ప్రారబ్ధరూపములగు కర్మలఁ జెందునది.

ఇట్టి మలత్రయమును పోనాడునట్టి గంగోదకమువలె పవిత్రమైనట్టియు బ్రహ్మసూత్రసముదాయము నితరాచార్యులు నపార్థకల్పనతో మలినముఁ గావించిన

వారగుటచే నీలకంఠారాధ్యుడను పూర్వోక్తసదర్థముతో నిర్మలముఁ జేయుచున్న వాడను. కర్మజ్ఞానసముచ్చితమగు సమరసభావముగల శివభక్తియోగము జీవేశ్వర జగత్ప్రతిపాదనద్వారా బ్రహ్మసూత్రములందు నిరూపింపఁబడినదగుట వలన శివయోగులకి సూత్రార్థము పరమాదరణీయమగుచున్నయది.

నీలకంఠో వివృణుతే శ్రీకంఠోపసమాహ్వయః
బోధాయనోక్తి మాలంబ్య బ్రహ్మసూత్రం యథాశ్రుతి 7

శ్రీకంఠుడనఁబడు నీలకంఠశివాచార్యులు బ్రహ్మసూత్రములను శ్రుత్యనుకూలార్థముతో బోధాయనవృత్తి ననుసరించి వివరించుచున్నవారు. "శ్రీ భాష్యకారులు నీ బ్రహ్మసూత్రములను విష్ణుపరములుగ బోధాయనవృత్తి నవలంబించియే వ్యాఖ్యానించినవారని" చెప్పఁగూడదు. బోధాయనుఁడు శైవులలో నగ్రగణ్యుడగువాడు. మరియు భగవత్తత్త్వము శివరూపమని నిర్ధారించి మహాన్యాస రుద్రయాగాది కల్పముల నేర్పఱచియు విష్ణుపరత్వము నుపేక్షించుటవలన బోధాయనవిరచితమగు సూత్రవృత్తి శ్రీ భాష్యకారుల కుపయోగింపదనియు శ్రీ నీలకంఠ శివాచార్యులు శ్రీ రామానుజాచార్యులకన్న మొదటివారగుటచే బోధాయన వృత్తి శ్రీవారికే లభ్యమైయుండుననియు ఇందువలన శ్రీ భాష్యకారులు శ్రీకంఠ భాష్యగతమైన వృత్తిపద్ధతి నవశ్యముగా గ్రహించియుందురనియు శైవాచార్యుల యేకగ్రీవాభిప్రాయము

ఇట్లు తా రచించిన భాష్యమునందు పరభాష్యములకంటె నుత్కర్షమును నిరూపించినవారై ఇతరగుణములఁ దెలుపుటకై దిగువశ్లోకము నుదాహరించినవారు.

శ్రీమతాం వ్యాససూత్రాణాం శ్రీకంఠీయః ప్రకాశతే
మధురో భాష్యసందర్భో మహార్థో నాతివిస్తరః. 8

నిఖిలవేదార్థగర్భితములైన వ్యాససూత్రములకు శ్రీకంఠశివాచార్య ప్రోక్తమగు భాష్యసందర్భము మధుర (సరస)మై బ్రహ్మగుణములను బ్రహ్మతత్త్వమును నిర్ణయించుటకు వలయు న్యాయసహస్రముతో నిండియుండునదగుటఁజేసి గొప్ప యర్థము కలదై యనవసరప్రసంగములు లేనిదగుటచే మిక్కిలి విస్తృతము కానిదగుచున్నది.

సకలవేదార్థమును బాగుగా గ్రహించిన వేదవ్యాసులు రచించిన బ్రహ్మ సూత్రములకు బ్రహ్మ (వేద) శ్రీః సహజమని "శ్రీమతాం"అను పదము తెలుపు చున్నయది. రస మనగా పరమాత్మ; శ్రుతినిర్ధారితమై నిరతిశయానందరూప మగు పరబ్రహ్మను ప్రతిపాదించునది భాష్యమని "మధురః"అను పదము విశద పఱచును. "నాతివిస్తరః" అనుటచే పరభాష్యములందున్న శబ్దాడంబర మిందు లేదని తెలియుచున్నది.

ఇట్టి శ్రేష్ఠగుణములు గల భాష్యము సర్వగ్రాహ్యముకాదా యని శంకించి గ్రాహకుల యోగ్యత నీ క్రింది శ్లోకముతో నిరూపించి యున్నవారు.

సర్వవేదాంత సారస్య సౌరభాస్వాదమోదినాం
ఆర్యాణాం శివనిష్ఠానాం భాష్యమేత న్మహానిధిః.

వేదాంతములన్నియును పరమాత్మయందు తాత్పర్యము కలిగియుండుట యను పరిమళము నాఘ్రాణించుటచే సంతృప్తిఁబడునట్టి శివనిష్ఠులైన పూజ్యులంద రికి నీ భాష్యము మహానిధివంటిది.

శివనిష్ఠులనగా సర్వాంగలింగ సాహిత్యముతో సదాశివు నుపాసించు నిష్ఠ గల ఆర్యులు; "యదా తమ స్తన్నదివా న రాత్రి - ర్నసన్న చాసచ్ఛివ ఏవ కేవలః" ఇత్యాది శ్రుతివాక్యములకు రామానుజీయులు పాంచరాత్రాగమముల ననుసరించి విష్ణుపర్వతము నన్వయింపఁజాలరైరి. "ద్వాసుపర్ణా" మొదలగు వేదవచస్సులకు జీవబ్రహ్మైక్యము ప్రతిపాదింప శక్యముగానట్టిది; కాని సర్వశ్రుతి ప్రమాణ వాదు లగు శైవులకు సర్వశ్రుతిసమన్వయముగల ఈ భాష్యము పరమాదరణీయమగు చున్నది.

పూర్వసుకృతపరిపాకము గలవారికి ద్రవ్యనిధి ప్రకాశించునట్లు నిరంతర శివధ్యానముఁజేయు మహానుభావులకి సూత్రభాష్యము సకల వేదాంతార్థనిర్ణయ మును కలుగఁజేసి దర్శనమాత్రమున పరమానంద జనకమై సకలకల్యాణగుణ సంపన్నమగు శివరూపము నవగతముఁ జేయునదై యున్నది. మరియు పాపాత్ము లకు ఘోరసర్పాకారముతో గోచరించునదై దధీచి గౌతమాదిశాపదగ్ధులగు వారికి రుచింపనిదై యుండునది.

## జిజ్ఞాసాధికరణము

వేదము కర్మపరమనియు బ్రహ్మపరమనియు రెండు భాగములు కలిగి యుండునది; ఇట్టి వేదములోని యుపనిషత్తుల యేకార్థమును నిర్ణయించుటకు వలయు న్యాయములను సూత్రములు వెలిబఱచునవి. ఇట్టి సూత్రముల సముదాయము మీమాంసా (విచార) శాస్త్రమనఁబడుచున్నయది. వేదాంతములన్నిటిని వివరింప శక్యముకాదు గావున సూత్రములకు విషయములగు నుపనిషద్వాక్యములఁ జెందియుండు సంశయములు తొలగుటకై యీ మీమాంసాశాస్త్రము ఉపయోగించునట్టిది: అన్యోన్యవిరుద్ధములగు నర్థములను వోనాడి సద్వివరణమును తెలుపు బ్రహ్మసూత్రములన్నియు ముముక్షువులకు నత్యంతావశ్యకము లగుచున్నవి. అన్యమతములందభినివేశము గలవారికి సూత్రవివరణ రుచింపకుండును తటస్థులగు బుద్ధిమంతులకు మాత్రము తప్పక నవగతము కాగలదు.

"శబ్దాదేవ ప్రమితః" అను సూత్రమునకు గల "ఈశానో భూత భవ్యస్య అను విషయవాక్య మందలి యీశానశబ్దముఁబట్టి సూత్రగతమైన "శబ్దాదేవ" అనుదానికి "ఈశానశబ్దము వలననే'' యని యర్థము సంగత మగునది; అభిధానశ్రుతి ననుసరించి ఈశానశబ్దము-అంగుష్ఠ పరిమాణము గల పురుషుడు శివపరమాత్మ యని-శివపరముగ నిర్ధారణఁ జేయఁబడుచున్నది.

"భూతభవ్యమైన జగమునకు ప్రభువు" అను నర్థముఁబట్టి నారాయణ పర్వతమును సాధింపరాదు. సూత్రములో ఏవకార ముండుటవలన ఈశానశబ్దము వలననే యని యేర్పడుటచే శివపరత్వము సుసాధ్యమగుచున్నయది.

"పరిణామాత్" అను సూత్రాధికరణమునందు వివర్తవాదమును నిరూపింప వీలులేదు. ఇట పరిణామ శబ్దము కంఠరవేణ చెప్పఁబడినందున పరిణామవాదము సులభ మగునది; మరియు "కర్తా శాస్త్రార్థవత్త్వాత్" అను సూత్రవివరణయందు జీవాత్మకు కర్తృత్వము లేదని చెప్పగూడదు. శాస్త్రార్థమంతయు జీవునియందే ఉపయోగము కలదగుటచే జీవుఁడు కర్తయు, భోక్తయు నగుచున్నవాడు.

ఇట్లు భాష్యములు సూత్రకర్త్రాశయ విరుద్ధములగుటచేత నుపనిషద్గత సందేహములను వోనాడుటకు సూత్రకర్త యాశయము ననుసరించి మీమాంస (విచారము) యావశ్యక మగుటఁజేసి శ్రీ నీలకంఠ శివాచార్యులవారి కీ భాష్య మనివార్యముగ కర్తవ్యమైనది.

ఇట్టితఱి కొన్ని ప్రశ్న లుదయించును. ఎట్లనగా ?

1. మీమాంసా శాస్త్రమునకు ఫలితము ఎద్ది ?

ఎట్టి ఆశ్రయము లేని ప్రేమఁదగు సుఖము ప్రాప్తించుట, అథవా ద్వేష మూలమైన దుఃఖము బొత్తుగా తొలగుట ఫలితముఁ దగు స్వరూపము.

2. ఈ శాస్త్రమును చదువుటకు తత్ప్రకారము వర్తించుటకు నధికారి యెట్టి వాడు?

అర్థిత్వాదిగుణములు గలవాడు బ్రహ్మవిచార శాస్త్రపఠనాధికారి యగును.

3. మీమాంసకు విషయ మెట్టిది?

కొద్దిగా తెలిసి, పూర్తిగా తెలియనట్టిది సంశయముల చేరికఁ జెందియుండు నదియు విషయ మనఁబడును.

4. ఎద్దాని తరువాత నీ మీమాంసాశాస్త్రము నారంభింపవలెను?

ప్రారంభమునకు సమీపవర్తియగు నిశ్చిత సాధనము సిద్ధించిన తరువాత నని చెప్పవలెను.

ఇట్టి సందిగ్ధ ప్రశ్నలకు సమాధానముగ సర్వజ్ఞులలో శ్రేష్ఠుడైన వేదవ్యాస భగవానుఁడు మొదటిదగు బ్రహ్మజిజ్ఞాసాసూత్రము నవతరింపఁజేసినవారు. ప్రయోజనము, (ఫలితము) అధికారి, విషయము, సంబంధము అనఁబడు నాలుగు అనుబంధములును ప్రతిశాస్త్రమున కవసరము.

సంసారసుఖము లభించుటయు సంసారము తొలగుటయు నీ శాస్త్రమునకు ప్రయోజనము కాజాలవు.

స్వధర్మానుష్ఠానముతో నేర్పడు చిత్తశుద్ధి, వేదశాస్త్రవిజ్ఞానము, వేదశాస్త్రములచే నిషేధింపఁబడకుండుట, మోక్షాపేక్షయు ననునవి యధికారి గుణములు:

సూ. అథాతో బ్రహ్మజిజ్ఞాసా 1-1-1

అథ = ధర్మవిచారణ తరువాత, అతః = ధర్మవిచారముఁ జేసినందువలన, బ్రహ్మణః = పరమాత్మయగు సదాశివుని, జిజ్ఞాసా = తెలిసికొనఁగోరుట యనగా నుపనిషత్తులందు విషయమగు బ్రహ్మము నవగాహనజేసికొనుటయని సూత్రార్థము.

విషయము, సంశయము, పూర్వపక్షము (ప్రశ్న), సిద్ధాంతము, (ఉత్తరము) నిర్ణయము, సంగతి యనువాని కాధారమగునది యధికరణ మనఁబడును.

ఈ సూత్రములోని అథశబ్దమునకు ప్రారంభము మంగళము అను నర్థములు పొసగజాలవు. బ్రహ్మవిచారము ప్రారంభింపఁబడునది కాకుండుటను జిజ్ఞాసకు మంగళార్థమునకు నన్వయము కుదురకుండుటను "అనంతరము" అను నర్థమే పొసగునది.

ఇఁట సిద్ధాంతము నిర్ణయము అని నిర్ణయాంతము సిద్ధాంతమగు నను నుద్దేశముతో వేరు చెప్పఁబడినవి. "మిక్కిలి పొందబడునది" యను వ్యుత్పత్తి వలన నిర్ణయశబ్దమునకు ప్రయోజనమను నర్థంబు గ్రాహ్యమగును. సూత్ర ప్రారంభము నథయను నుచ్చారణవలన మంగళము ధ్వనించుచున్నది.

బ్రహ్మవిచారముఁ జేయువానిఁ జెందియుండునది. బ్రహ్మవిచార సాధనమైనదియు బ్రహ్మవిచారమునకు ముందు నియతము కావలెను. కూర్చుండుటకు ముందు భోజనము నడత అనువానిలో నెద్దియు నియతము కానట్లు బ్రహ్మవిచారమునకు ముందు ఏదే నొకటి యనియతమని చెప్పగూడదు. కావున అథ శబ్దమునకు నియతముగానుండుదాని పిమ్మటనని యర్థము నిర్వచింపవలెను.

## పూర్వపక్షము

బ్రహ్మవిచారమునకు ముందు వేదాధ్యయనము నియతము: ఎట్లనగా?

ఎనిమిది వత్సరములు మొదలగు ప్రాయమున బ్రాహ్మణాదివర్ణస్థులకు విహితమైన ఉపనయనముఁ గావించిన తరువాత నాచార్యుని సేవించుచు వారి ముఖమునుండి వెలువడు నక్షరములఁ గ్రహించి యవ్వాని యర్థమును తెలిసికొనవలసియుండును. ధర్మమువలె బ్రహ్మము వేదమునందు ప్రతిపాదింపఁబడుటచే వేదములఁ జదువనివానికి బ్రహ్మవిచారముఁ జేయవలనుపడదు గావున వేదాధ్యయనాంతరము బ్రహ్మ విచారము సమంజసమగుచున్నది.

అధ్యయనము నిత్యమగుటచే నధ్యయనాంగమగు నుపనయనంబు నిత్యమగునది. వేదముఁ జదువక నితర వాఙ్మయము నధిగమింప పరిశ్రమించు బ్రాహ్మణుఁ డీ జన్మయందే తన వంశముతో సహ శూద్రత్వమును

పొందునని ప్రమాణములు నిరూపించుటచే వేదాధ్యయనము తదంగమైన యుప నయనంబు నిత్యములగుచున్నవి.

"స్వాధ్యాయోఽధ్యేతవ్యః" అను వాక్యములోని స్వశబ్దముఁబట్టి స్వశాఖకుఁ జెందిన వేదమును తప్పక చదువవలెను. శుశ్రూషాది నియమములతోడ నాచార్యునిచెంత గావించు వేదాధ్యయనము, ఆచార్యుని అధ్యాపనంబు వేదార్థపరిజ్ఞాన మను నభ్యుదయమునకై యుపయోగించునట్టివి.

ఇట్లు వేదాధ్యయనము తప్పనిసరియై బ్రహ్మవిచారమునకు ముందు నియత మగుచున్నది.

## సిద్ధాంతము :

ఓయీ! నీవు చెప్పినట్లు వేదాధ్యయనము బ్రహ్మవిచారమునకు పూర్వము నియతమగుగాక! వేదములఁ జదివి ధర్మము ననుష్ఠింపవలెగదా; వేదాధ్యయనము లేనిది ధర్మ విచారము (అనుష్ఠానము) సాధ్యము కానిదని మాకును ఇష్టమేను;

ఉపాధ్యాయులచెంత వేదముఁ జదివినపిమ్మట ధర్మవిచారముఁ జేయవలె నని "అథాతో ధర్మజిజ్ఞాసా" సూత్రమును శ్రీ జైమిని మహర్షి ప్రదిపాదించినం దున వేదాధ్యయనానంతరము ధర్మవిచారంబనియు ధర్మవిచారానంతరము బ్రహ్మవిచారంబనియు గ్రహించుము!

ఉపనయనాంగమైన వేదాధ్యయనమునకు వేదార్థమును గుర్తెరుగుట ఫలమైనను వేదార్థజ్ఞానానంతరము ధర్మవిచారమే ప్రాప్తించును. కావున నుపనీతుఁడు వేదవేదాంగముల నభ్యసించినపిమ్మట ధర్మాధర్మములు మహాఫలముగల వని పెద్దలవలన కనుగొని వేదవాక్యముల సమన్వితార్థమును తెలిసికొనఁ బ్రవర్తించువాడగును.

విరక్తులకు నవిరక్తులకును కర్మానుష్ఠాన మత్యంతావశ్యకమగుటచే వేదములఁ జదివి ధర్మము నాచరింపవలెనని విశదమగును. ఐతే నెద్దాని తరువాత నీ శాస్త్రము నారంభింపవలె ననునెడ- ధర్మవిచారానంతరమని గ్రహించునది. ఎట్లనగా? ధర్మవిచారశాస్త్రమునకు బ్రహ్మవిచారశాస్త్రమునకును మిక్కిలి భేదమును పాటించువారము కాము. రెండు నొకే శాస్త్రమని నిరూపించువారము.

"అథాతో ధర్మజిజ్ఞాసా" సూత్రమునుండి "అనావృత్తిః శబ్దాత్" సూత్రము వరకు గల శాస్త్రార్థమంతయు నొకటియై ఆరాధనగానుండు ధర్మమును ఆరాధ్యంబగు బ్రహ్మమును పూర్వోత్తరభాగములతో ప్రతిపాదించుచున్నయది. ఇట్టి శాస్త్రమనఁదగు మీమాంసలో మొదటిభాగము ముగిసినపిమ్మట రెండవభాగమనను నర్థమును పురస్కరించుకొని "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యని యుత్తర మీమాంసలో మొదటి సూత్రము చెప్పఁబడినది. వేదముఁదగు పూర్వకాండ-ధర్మ విచారమనియు ఉత్తరకాండ బ్రహ్మవిచారమనియు, పూర్వోత్తరకాండలకు రెంటికిని నియతసంబంధము కలదనియు పూర్వోత్తరభాగములలో నవాంతరభేదముండుటచే "అత్యంత" అను పదము కించిచ్ఛేదమును సూచించునదనియు గ్రహింపవలెను. ధర్మప్రతిపాదకమగు వేదమంతయు బ్రహ్మమునందే పర్యవసానముఁ జెందునదగుటచే వేదమునందును వేదాంతములయందును బ్రహ్మమే ప్రతిపాద్యంబగుచున్నయది.

ద్వాదశలక్షణియొక్క పూర్వోత్తర షట్కములకు ప్రయోజన భేదమున్ననేకశాస్త్రమగుట యంగీకరింపఁబడినట్లు నభ్యుదయ నిఃశ్రేయసము లనఁబడు భిన్న ప్రయోజనములు గల పూర్వోత్తర మీమాంసలకు నేకశాస్త్రత్వ మనివార్యంబగుచున్నయది.

వామన జయాదిత్యులచే రచింపఁబడిన పాణినీయసూత్రముల పూర్వోత్తర వృత్తులకు మూలగ్రంథ మొకటి యగుటచే వ్యాఖ్యానముఁ గూడ నొకటియే వ్రాయబడినట్లు పూర్వోత్తరమీమాంసలకు జైమిని వ్యాసకర్తృకత్వభేదముఏకశాస్త్ర భంగకరము కాజాలదు.

ఇంతియేగాక వేదార్థపరిజ్ఞానసంపన్నుడై యాచరింపఁబడు ధర్మము బ్రహ్మబోధము నాపాదింపఁజేయున దగుటచే ధర్మవిచారమున కుపయోగించునట్టి శ్రుతిలింగాదులును, ప్రేరణ, అర్థవాదము, స్మృతి, వేదప్రామాణ్య నిరూపణ మొదలగునవియు బ్రహ్మవిచారోపయుక్తము లగుటఁజేసి ధర్మవిచారానంతర మవశ్యము బ్రహ్మవిచారము కర్తవ్యముగా నేర్పడుచున్నయది, సాధనంబగు ధర్మవిచారము లేనిది సాధ్యంబగు బ్రహ్మవిచారము సంభవింపదు గదా!

"తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసానాశకేన" బ్రహ్మనిష్ఠగల మహానుభావులు- యజ్ఞము, దానము ‑ నాపాది తప

శ్చర్య అనువానితో కూడియుండు ధర్మము నాచరింపవలెనని బోధించు వేదము నావర్తించుచు పరమాత్మఁ గుర్తెరుగుటకు బ్రహ్మము నుపాసింతురు" అను నర్థము గల పూజ్యమైన శ్రుతిప్రమాణము- ధర్మము బ్రహ్మబోధసాధనంబని- నిరూపించు చున్నది. "కర్మాచరణానంతరము బ్రహ్మజిజ్ఞాస" యని వృత్తికారులును చెప్పి యున్నవారు.

ప్రశ్న : బ్రహ్మబోధకు కర్మాచరణ సాధనమగుచో నట్టి ధర్మమునే యాచరించవలెను, కాని వేదాంతవాక్యములఁ బరామర్శించి బ్రహ్మజ్ఞానము నభ్య సించుట యనవసరము కాదా ?

ఉత్తరము : ఫలాపేక్ష లేనట్టి ధర్మాచరణము పాపములఁబోకార్చి చిత్త శుద్ధిని కలుగఁజేసియు బ్రహ్మజ్ఞానమునకు కారణమగుచున్నది గాన వేదాంత విచార మవసరమగుచున్నయది. మరియు "యస్యైతే చత్వారింశత్సంస్కారాః స బ్రహ్మణః సాయుజ్యం సాలోక్యం చ గచ్ఛతి" గర్భాధానము మొదలగు సంస్కా రములన్నియు పాపమాలిన్యమును పోగొట్టి సాలోక్యమును శివసాయుజ్యమును చిత్తశుద్ధిపూర్వక శివోపాసనద్వారా కలుగజేయునని గౌతమ స్మృతియు విశద పఱచునది.

ప్రశ్న : ఐహికములు ఆముష్మికములు నగు వరముల నొసగు పరమేశ్వ రుని సమీపదర్శనమునకు తపశ్చర్య కారణమగునట్లు మోక్షమును ప్రసాదించు శివుని సన్నిధానదర్శనమునకు యజ్ఞాది శ్రుతులు హేతువు లగుచున్నవి గాన నిట్టి తఱి వేదాంత విచారముతో ప్రయోజనము కనఁబడుటలేదు గదా?

ఉత్తరము : యజ్ఞాదిశ్రుతియే చిత్తశుద్ధిగలవాడై వేదాంతములను విచా రింపవలె ననుటకు ప్రమాణమగుటఁజేసి వేదాంతవిచారము తప్పనిసరియగుచున్న యది. మోక్షమునకు ముఖ్యసాధనమగు శివసాక్షాత్కారమున కాశ్రయమగు చిత్తము ద్రవ్యమనియు, మలాపకర్షణ మతిశయమనియు, మోక్షము కార్యమ నియు, విశదమగుచుండుటచే యజ్ఞాదికర్మలు చిత్తశుద్ధిజనకములై బ్రహ్మ బోధకు కారణము లగుచున్నవి.

ప్రశ్న : కర్మ లన్నియు చిత్తశుద్ధిజనకములగుచో వ్రీహిప్రోక్షణవలె సంస్కారకము లగును.

అట్టితఱి "కర్మలు పుణ్యలోకముల నొసగునవి" యని వేదమందు చెప్పఁబడు కర్మఫలప్రదాన మను స్వాతంత్ర్యము కొట్టుబడును గదా ?

ఉత్తరము : పుణ్యలోకముల నుద్దేశించి గావింపఁబడు కర్మలు స్వతంత్రములైనను ఫలాభిసంధిలేని కర్మలు చిత్తశుద్ధి యనెడు సంస్కారమును కలిగించును. మరియు నట్టి పురుషునకెద్ది జ్ఞానఫలమో అద్దియే కర్మఫల మగుచున్నయది దర్శపూర్ణమాసి యనఁబడు క్రతువునకుఁదగు స్వర్గప్రాప్తికి వ్రీహిప్రోక్షణ ముపయోగించునట్లు కర్మలన్నియు జ్ఞానప్రయోజకములై మోక్షప్రాప్తికి సాధనము లగుచున్నవి. కావున ఫలాభిసంధిరహితములన్నియు గుణకర్మలై జ్ఞానాంగము లగు నట్టివి.

ప్రశ్న : జ్యోతిష్టోమాది కర్మలు నిత్యవిధిప్రాప్తములై ఇతి కర్తవ్యత (తప్పనిసరిగా చేయుట)కుఁదగినవి గదా; ఇట్టి వన్నియు సంస్కారకములై గుణకర్మలగునెడ ఇతికర్తవ్యత కొట్టుబడును గదా ?

ఉత్తరము : "సౌత్రామణి" "బృహస్పతి" యను క్రతువులు ప్రత్యేకఫలము నుద్దేశించి చేయఁబడునెడ స్వతంత్రములై "అగ్నిచయనము" "వాజపేయము" అను క్రతువులకు పూర్వోత్తరములుగ నాచరింపఁబడునెడ తదంగములగునట్లు జ్యోతిష్టోమాదికర్మలు ఇతి కర్తవ్యతాప్రాప్తములైనను జ్ఞానాంగములగుటలో విరోధమేమియు లేదు. కావున జ్ఞానసమగ్రత కలుగువరకు కర్మలాచరణీయంబులని గ్రహింపవలెను.

సౌత్రామణియాగమునకు— మాతాపితౄణవిముక్తియు బృహస్పతిసవమునకు- బ్రహ్మవర్చస్సును ప్రత్యేకఫలములు.

అగ్నిచయనముఁజేసి సౌత్రామణి నాచరింపవలెను. వాజపేయమును యజించి బృహస్పతిసవము నొనర్పవలెను.

ఇట్లు రెండు విధముల నిర్దేశమున్నందున నొకేకర్మకు గుణత్వము ప్రాధాన్యంబు నొప్పారునని విశదమగుచున్నది.

ప్రశ్న : కర్మలు చిత్తము నాశ్రయించు మలమును పోగొట్టుట ద్వారా జ్ఞానసాధనములగుగదా ! వ్రీహ్యవహననము తుషవిమోకము వరకే గావింపఁబడునట్లు చిత్తశుద్ధిపర్యంతమే కర్మలు చేయఁదగినవి యని తోచుచున్నది.

ఉత్తరము : పొట్టు నూడిన ధాన్యమునకు మరల పొట్టుగూడునట్లు చిత్తశుద్ధి కలిగిన తరువాత జ్ఞానప్రతిబంధములు సంభవింపకుండునెడ చిత్తశుద్ధి పర్యంతమే కర్మలఁ జేయవచ్చును. శుద్ధచిత్తుడై జ్ఞానార్థము శ్రవణాదులఁ ప్రవర్తించువానికి జ్ఞానప్రతిబంధకదురితము లేర్పడును గావున జ్ఞానోదయమై సమగ్రత కలుగువరకు చిత్తశుద్ధిని కాపాడుకొనుటకై కర్మాచరణ మనివార్యంబగున్న యది.

ప్రశ్న : "వేదశాస్త్రవిచారము మొదలగువానితో పరమాత్మఁ గురైరుగుదు" రను శ్రుతివాక్యమువలన కర్మలు జిజ్ఞాస కలుగువరకే యాచరణీయములని తెలియుచున్నది గదా !

ఉత్తరము : జిజ్ఞాస - పురుషునకు సహజమై పురుషార్థము కానిదగుటచే కర్మలు బ్రహ్మజ్ఞానమును గలుగఁజేయు వేదాంతశాస్త్ర విచారమును ప్రారంభించుటకు సముచితములై యున్నవి. మరియు స్వర్గసుఖ ఫలప్రాప్తికై చేయఁబడు కర్మలకు స్వర్గప్రాప్తియే ఫలముగాని స్వర్గకామన ఫలము కాజాలదు. "అశ్వేన జిగమిషతి" "అసినా జిఘాంసతి" ఇత్యాది వాక్యములందును గమనాదులే ఫలములగుచున్నవి.

కర్మలు జ్ఞానమునకు సాక్షాదంగములు కానట్టివి. ఎట్లనగా ? పాపములు నశించునెడ జ్ఞానము గలుగునని ధర్మశాస్త్రము చెప్పుచున్నందున కర్మలు చిత్తశుద్ధిద్వారా జ్ఞానాంగములగునని గ్రహింపనగును.

ప్రశ్న : పూర్వజన్మయందలి సుకృతమున విశుద్ధచిత్తుఁడై వైరాగ్యము కలిగియుండు పురుషునకు మరల నీ జన్మయందు కర్మాచరణ మనవసరము గదా ?

ఉత్తరము : పూర్వజన్మ సుకృతము పూర్వజన్మయందే చిత్తశుద్ధిఁ గలుగజేసినను జీవితశేషము లేనందున మరుసటి జన్మయందు విరాగము కలవాడు కావచ్చును కాని చిత్తశుద్ధ్యనంతరము జ్ఞానోదయ పర్యంతము కర్మలాచరణీయములగుటచే కర్మలు జ్ఞానసమకాలమందును ప్రతిబంధ నివృత్తికై గావింపఁదగినవియేను.

ఒకానొకఁడు తన పూర్వసుకృత బలమున లభించిన భాగ్యమును కాపాడు

కొనుటకు ప్రకృతజన్మయందు వ్యవహారముఁ జేయునట్లు చిత్తశుద్ధికి భంగము రాకుండుటకు స్వవర్ణాశ్రమోచిత నిత్య నైమిత్తికాది కర్మల నవశ్యము గావింపవలసి యుండును.

అట్లు గానిచో- "కీటకముగాని, పక్షిగాని పరమేశ్వరానుగ్రహమున ముక్తులగుదురు" "వామదేవుఁడు గర్భస్థుడై జ్ఞానము కలవాడాయెను" ఇత్యాది ప్రమాణముల నాశ్రయించి నీ చెప్పరీతిగా - కర్మాచరణమే గాక బ్రహ్మవిచారంబు జ్ఞానసాధనము కానిదగును.

"ధర్మేణ పాప మపనుదతి" అను శ్రుతియు - ఫలాభిసంధి రహిత కర్మల నాచరించుటచే పాపములఁ బోనాడి జ్ఞానము కలవాడు కావలె- నని విశదపఱచునది గావున బ్రహ్మప్రాప్తికి సాధనమగు జ్ఞానమంతయు ఆశ్రమకర్మ నపేక్షించు ననియు అట్టి బ్రహ్మవిచార (జ్ఞాన) శాస్త్రమునకు ధర్మవిచార (కర్మ) శాస్త్రము పూర్వనియతమగునవియు సారాంశము.

ప్రశ్న : ధర్మవిచారమునకు, బ్రహ్మవిచారమునకును క్రమనియమమెట్లు పొసగును ? కర్త యొకడగుటచే పొసగునందురేని- యిట కర్త్రైక్యము ఎట్టిది ?

ఆహార దర్శపూర్ణమాసములవలె నంగాంగిభావము గలదా ? పంచప్రయాజములవలె ఏకాంగిప్రయుక్తములగు ననేకాంగములు గలిగి యుండునదా ? గోదోహనాదులవలె మరియొక ప్రయోజనము నుద్దేశించి చేయఁబడు విధానము గలదా ? షడ్యాగములవలె ఫలైక్యము గలదా ?

ఇవ్వానిలో నేదే నొక విధముగా కర్త్రైక్యమునకు శ్రుత్యాది ప్రమాణము గానరానందున ధర్మ బ్రహ్మవిచార శాస్త్రములకు క్రమనియమము కూడనిదగుచున్నది.

ఉత్తరము : శ్రుత్యాది ప్రమాణములు లేకుండునెడ నీవు చెప్పిన విధానముగ క్రమనియమము పొసగకుండును. "విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయం సహ, తేనైతి బ్రహ్మవి త్పుణ్యకృచ్చ, సత్యేన లభ్యస్తపసా హ్యేష ఆత్మా సమ్యగ్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్."

"కర్మజ్ఞానముల రెంటి నేక కాలమందభ్యసించు పుణ్యాత్ముఁడు కర్మజ్ఞాన సముచ్చయముతోడ బ్రహ్మవేత్త యగుచున్నవాడు. సత్యము తపస్సు బ్రహ్మ

చర్యము సమ్యగుపాసన యనువానితో నిత్యుడైన పరమాత్మఁ బొందగలుగును" ఇత్యాది - జ్ఞానకర్మ సముచ్చయవాదిశ్రుతులవలనను కర్మజ్ఞానములకు మోక్షమే ఫలము గావునను ధర్మబ్రహ్మ విచారములకు క్రమనియమము విహితమగుచున్న యది.

ప్రశ్న : ధర్మ బ్రహ్మవిచారముల క్రమనియమమునకు వలయు కర్త్రైక్యమునకు అంగాంగిభావము మొదలగు విధాన ముండవలెను. మరియు యాగము అపూర్వముద్వారా స్వర్గసాధనమైనట్లు ధర్మము చిత్తశుద్ధిద్వారా జ్ఞానజనకమగుటచే జన్మాంతర సుకృతశుద్ధచిత్తుడగు ముముక్షువునకు బ్రహ్మవిచారమునందే ప్రవృత్తి కలుగును కావున క్రమనియమ మెట్లు పొసగును ?

ఉత్తరము : చిత్తశుద్ధికొరకై ధర్మవిచారము నెవఁడు జేయునో నవ్వానికే బ్రహ్మవిచార మనివార్యమగుటఁజేసి కర్త్రైక్యము సంభవించునది. కర్మ సాధనముగాను జ్ఞానము సాధ్యముగా నంగాంగిభావము విహితమగుచున్నది. కర్మజ్ఞానముల వలె కర్మజ్ఞానవిచారంబులు నంగాంగిభావముఁ బొందునవి.

మరియు "విద్యాంచావిద్యాంచ" అను మంత్రమునందు చూపఁబడిన సహపదము బ్రహ్మోపాసనఁజేయు జీవితమునందే కర్మ ననుష్ఠింపవలెనని తెలుపునట్టిది.

"అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుతే" "శివోపాసన ప్రతిబంధములు మరియు ప్రమాదమున నేర్పడు దురితములును దూరమగుటకు కర్మల నాచరించుచు నుపాసనాత్మక జ్ఞానముతో మోక్షము నొందవలె" నని శ్రుతియు నుత్తరార్ధముతో కర్మజ్ఞాన సముచ్చయముఁ దగు ప్రయోజనము నుపదేశించి యున్నది.

వేదాభ్యాసము వేదాక్షరములఁ గ్రహించుటవరకే పర్యవసానముఁ జెందునని చెప్పు పక్షమునను ధర్మ బ్రహ్మవిచారముల కవకాశము కలుగుచునే యున్నది. ఎట్లనగా ? వేదముల సంగములతో కూడఁ జదువుటచే కలుగు పదార్థ స్ఫురణ వలన బ్రహ్మయొక్క స్థూలోపాసనములగు జ్యోతిష్టోమాది యాగములను విధించు వాక్యములకు, సూక్ష్మోపాసనమగు లింగాంగ సాహిత్యరూపమైన దహరవిద్య నుపదేశించు వాక్యములకు నాభాసించు విరోధమును పోనాడుటకై - మోక్షపురుషార్థముఁ

గోరు పుణ్యపురుషుఁడు ధర్మబ్రహ్మ విచారములందు స్వయముగా ప్రవర్తించును. కావున ధర్మబ్రహ్మవిచారము నిష్ప్రయోజనము కాజాలదు.

జ్యోతిష్టోమాది స్థూలోపాసనలు జ్ఞానముద్వారా ముక్తిప్రదములగుటచే బహిరంగము లనియు, దహరాది సూక్ష్మోపాసనలు సమీప సాధనములగుట నంతరంగములనియు గ్రహించునది.

## కర్మకాండ వాక్యములు ;

"చాతుర్మాస్యయాజికి నక్షయఫలము లభించును." "పుత్త్రుని సంపాదించి పుణ్యలోకమును పొందవలెను."

## జ్ఞానకాండ వాక్యములు .

"కర్మసంపాదిత లోకము క్షీణించున దగుటచే సంతానముతో శాశ్వత ప్రయోజనము సిద్ధింపదు" "ఆత్మకును సంతతికిని ఎట్టి సంబంధము లేదు."

ఇట్లానికి నాభాసించు విరోధమును పరిహరించుటకై ధర్మజ్ఞాన శాస్త్రములను విచారించుట యనివార్యమగుచున్నది.

ప్రశ్న : వాసిష్ఠాది కల్పములంటు విరోధములు తొలగింపఁబడి యుండుటచే నధ్యానితోడనే కర్మయందు నుపాసనయందును ప్రవృత్తి జనించు గావున విచార మనవసరము గదా!

ఉత్తరము : వేదార్థమును సంగ్రహించు పౌరుషేయ గ్రంథములఁ జదువునపుడు నభ్యుదయమందు నిఃశ్రేయస (మోక్ష) మందు నపేక్ష కలుగుటచేతను విచారములేనిది ధర్మబ్రహ్మనిర్ణయము గానందునను విచార మత్యవసరమగుచున్నది. మరియు వేదార్థమును గుర్తెరుగుటకు వేదాంగములైన వ్యాకరణాదులుపయోగించునవి కావున స్వాధ్యాయాధ్యయనము వేదార్థజ్ఞానమందు వినియోగము కలదగుచున్నది. ఇట్లు సాంగవేదాధ్యయనము వలన కలుగు సామాన్యజ్ఞానము గలవాడు నిర్ణీతమైన యర్థమునకై విచారము గలవాడగుటచేత వేదాధ్యయన విధి నీవు చెప్పినట్లు నక్షరగ్రహణోపయుక్తమైనను ధర్మబ్రహ్మ విచారములందు ప్రవృత్తిఁ గలుగజేయుచున్నది.

ప్రశ్న : "శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః"అను వాక్యము- వేదాంత శ్రవణమును సాక్షాత్తు విధించుచున్నది గదా ?

ఉత్తరము : విధి లక్షణముగల యుపపత్తి కనఁబడుట లేదు. ఎట్లనగా ? అపూర్వము, నియమము, పరిసంఖ్య యని విధి మూడు విధములు గలది:

1. కాలత్రయమందును మరియొక ప్రాప్తిలేనట్టిది యపూర్వ విధి;
2. ఒక పక్షమున భిన్నమైన నుపాయముతో ప్రాప్తిగలుగునది నియమ విధి ;
3. ఒకే పర్యాయము అనేక ప్రాప్తు లేర్పడుచుండ నవ్వానిని తొలగించి ప్రస్తుతమును నిరూపించునది పరిసంఖ్యా విధి ;

వేదాంత శ్రవణము- స్వవిషయమువలన పరిజ్ఞానమును వైద్యశాస్త్ర శ్రవణమువలె కలిగించునది గాన నిట్టి ప్రాప్తియు లేకుండినచో నపూర్వవిధి గోచరమయ్యెడిది.

వరిధాన్యపు పొట్టునూడదీయుటవలె ప్రత్యక్షఫల ప్రదర్శకమైన నుపాయాంతరము గలది వేదాంత శ్రవణమైనచో నియమవిధిఁ దగియుండెడిది.

వేదాంతములను వినుట చదువుట మొదలగునవి సమానములుగ నేర్పడుచుండ "వేదాంతములు వినదగినవే గాని చదువఁదగినవి కా"వని యంగీకరించి పరిసంఖ్యావిధిఁ జెప్పవలసియుండును.

వేదాంతములఁ జదువనిది వేదాంతములను విచారింపరాదు. "కర్మకాండను నిషేధించి వేదాంత శ్రవణమును పరిసంఖ్యావిధి విధించున"దని భావింపకూడదు. కర్మకాండ నిషేధింపఁబడినచో ధర్మవిచారము కూడనిదగును. కర్మాచరణలేనిది చిత్తశుద్ధి కలుగకుండుటచే జ్ఞానోదయము కాకుండును. గావున పరిసంఖ్యావిధియు సరిపడకున్నది.

అందువలన - "పురుషార్థముఁ గోరువాడు స్వయముగ వేదాంత శ్రవణమందు ప్రవర్తించు"నని చెప్పుటయే సమంజసమని గ్రహింపవలెను.

సకలచేతనాచేతన ప్రపంచముగ పరిణమించు చిచ్ఛక్తితో కూడి యుండు

అద్వితీయ వైభవము గలవాడును; నిఖిలవేదసారమగు సామరస్యమునకు నిధాన మగువాడును; భవ శివ శర్వ పశుపతి పరమేశ్వర మహాదేవ రుద్ర శంభు ప్రభృతి కములైన శ్రేష్ఠశబ్దములతో తెలుపఁబడు నుత్కృష్టమగు మహిమయొక్క విలా సము గలవాడును; స్వాధీనులైన జీవాత్మల యుపాసనల ననుసరించి ప్రసరించు నన్నుగ్రహముతో పురుషార్థములను సిద్ధింపఁజేయువాడు నగు పరబ్రహ్మను ప్రతి పాదించు నుపనిషచ్ఛాస్త్రము విచారింపఁ దగినదియేను.

పరమేశ్వరాజ్ఞారూపమైన ప్రేరణము లక్షణముగ గలదియు, పరమాత్మ నారాధించుటకు భిన్నభిన్న సాధనముల స్వరూపమగునదియు, మంత్రములచేత నర్థవాదములచేతను చూపఁబడిన యోగ్యతావిలాసము గలదియు, శ్రుతి మున్నగు సంగములతో నిండియుండునదియు తన ప్రమాణతను సమర్థించు మన్వాదిస్మృ తులు. మహాభారతాదీతిహాసములు, శైవాది పురాణములు, హైరణ్యగర్భాద్యాగ మములు, అభియుక్తసూక్తులు ననువాని సందర్భములతో చేయఁబడిన నుపబృంహ ణము గలదియు విధి (తప్పనిసరిగా చేయవలెననునది) నిషేధ (చేయకూడదని చెప్పునది) వికల్ప (రెంటిలో నేదేనొకదాని నంగీకరించునది) సముచ్చయ (ఇదియు నదియు గావింపవలెననునది) ఉత్సర్గ అపవాద బాధ అభ్యుచ్చయాది విశేషములు గలదియు, అర్థకామాది సకలపురుషార్థములకు సముద్రముఁ బోలినదియు, బ్రహ్మజ్ఞానమునకు సాధనమైనదియు, పరమపూజ్యంబునగు ధర్మమును విచారిం చిన తరువాత యని ''అథ'' శబ్దార్థము ప్రతిపాదింపఁబడినది.

సూత్రగత బ్రహ్మశబ్దముతో చెప్పఁబడు శివుఁడు సకలచిదచిత్ప్రపంచా కార శక్తివిశిష్టుఁడగువాడు. బృంహతిధాతు నిష్పన్నమైన బ్రహ్మము త్రివిధపరి చ్ఛేదములు లేనట్టిది. శివుఁడును దేశకాలాది పరిచ్ఛేదరహితుడై చేతనా చేతన సమ్మిశ్రమగు ప్రపంచమునకంటె విలక్షణుడు గావున బ్రహ్మంబని నిర్వచింపఁ బడు వాడు.

అద్వితీయంబైన వైభవము (బృహత్త్వము) గలది బ్రహ్మశబ్ద వాచ్యం బగుచున్నది. సమానజాతీయమగు రెండవ వస్తువు లేకుండుట వస్తుపరిచ్ఛేద రాహిత్యమనఁబడును. ఆకులు పుష్పములు మొదలగు లోని భేదమున్నను "ఇట నొకటే చెట్టు" అనునెడ సమానజాతీయమైన అన్యవృక్షము లేదని తెలియునట్లు

శివునకు శివుని విశేషణములగు చేతనాచేతనములకు నంతర్గత భేదమే గాని బాహ్య భేదము లేదు గావున శివుం డద్వితీయుండగుచున్నవాడు.

ప్రశ్న : ఓయీ? శక్తివిశిష్టుడైన శివున కద్వితీయత్వము ఎట్లు పొసగును? వేదాంతములందు నిర్విశేషమగు బ్రహ్మమే పరమార్థముగ నిరూపింపఁబడినదిగదా! "చిన్మాత్రమైన బ్రహ్మము సత్యమనియు, జ్ఞాత జ్ఞేయము జ్ఞానము మొదలగు భేదములన్నియు రజ్జువు (త్రాడు) నందు సర్పమువలె మిథ్యాభూతములనియు శ్రుతిసూత్రములు స్ఫురింపఁజేయునవి. "అనృతేన హి ప్రత్యూఢాః" మాయామాత్రంతు కార్త్స్న్యే నానభివ్యక్తరూపత్వాత్" "జీవాత్మలు అవిద్యతో కప్పఁబడునవి" "బ్రహ్మము మాయాపరిచ్ఛిన్న మగుటచే సంపూర్ణముగా విశదము కానట్టిది" "అస్థూలమనణ్వహ్రస్వమ్" "కేవలో నిర్గుణశ్చ" ఇత్యాది ప్రమాణములు బ్రహ్మము నిర్విశేషమని ప్రతిపాదించుచున్నవి. "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, ఏక మేవాద్వితీయం బ్రహ్మ" ఇత్యాది వాక్యములు- సజాతీయ విజాతీయ స్వగత భేదము లేనిదై సన్మాత్ర మగునది బ్రహ్మంబని చెప్పుటచే నిర్విశేషమైన బ్రహ్మమునకే నద్వితీయత్వము సరిపడునది.

ఉత్తరము : "ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం" ఒకటి తెలిసినచో నంతయు తెలియునను ప్రతిజ్ఞతో సద్వాచ్యంబగు పరబ్రహ్మము జగమున కుపాదానము నిమిత్తంబు నగునని తెలియుచున్నది. మరియు "సర్వంబు కనుగొనుట, సర్వవిధశక్తులు కలిగియుండుట, సత్యసంకల్పము, అన్నిటిఁ జేరియుండుట, సర్వాధారమగుట, సర్వమును నియమించుట. నిఖిల ప్రపంచ స్వరూపమగుటయు ఇత్యాది అనంత మాంగళ్యగుణములను బ్రహ్మమునకు చూపెట్టి "ఇట్టి బ్రహ్మస్వరూపము గలవాడవు నీవగుదువు" "తత్త్వమసి" అని శ్వేతకేతువున కుపదేశింపఁ బ్రవర్తించిన సద్విద్య- నిర్విశేషత్వమును సమర్థించుటలేదు.

ఎట్లనగా? ప్రారంభములో నుండు ఆదేశ శబ్దము—నిరుపాధికమైన ప్రశాసనగుణమును; "బ్రహ్మఁ దెలియుటచే విన నలవిగానిది విననగు"నని జగదుపాదానత్వ నిమిత్తత్వములను; అవ్వానికి సరిపడు సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్త్వాదులను; ఉపసంహారమున "తత్త్వమసి"యని సమానాధికరణ భావముతో జీవాంతర్యామిత్వమును సద్విద్య ప్రదర్శించుచున్నది. ఇట్టి యంశమునే పునః పునః ఆవర్తించుటచే నభ్యాసంబు సిద్ధమగుచున్నది. ఇట్లు జగత్కారణత్వాది గుణములు

అన్యప్రమాణముల యవసరము లేకయే ప్రతిపాద్యములగుచున్నందున నపూర్వత యేర్పడుచున్నది. "ఉపాసకునకు - స్వశరీర విమోచనమే తడవుగా మోక్షము సంభవించు''నని ఫలంబు చెప్పఁబడియెను. పితాపుత్ర సంవాదమగుటచేత నర్థవాదంబు సముచిత మగుచున్నది. మృత్పిండాది దృష్టాంతములవలన నుపపత్తియు చేకూరునది; ఇట్లు ఉపక్రమ ఉపసంహార అభ్యాస అపూర్వతా ఫల అర్థవాదము లనఁబడు షడ్విధ తాత్పర్య లింగములతో సద్విద్య- పరమేశ్వరునకు సవిశేషత్వమునే సమర్థించుచున్నయది.

"అట్టి బ్రహ్మము తేజస్సును సృజించెను"అని చెప్పఁబడినది కాని "బ్రహ్మము భ్రమించె"నని లేదు గాపున, "ఆ బ్రహ్మము స్వయముగ తనను విస్తరింపఁజేసె" నని శ్రుత్యంతరములందు కలదు గాని "వికారముఁజెందె'' నని లేదు గావునను, బ్రహ్మసూత్రములలో "పరిణామాత్" అని నిర్వచింపఁబడినది కాని ''వివర్తాత్" అని చెప్పఁబడలేదు గావునను బ్రహ్మము సవిశేషమై జగద్రూపముగ పరిణమించు నదగుచున్నది. మరియు మన బోంట్లకు గల ప్రాకృతములైన నింద్యగుణములను నిషేధించి ''నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం" ఇత్యాది వాక్యములతో నిత్యత్వ వ్యాపకత్వ సర్వగతత్వ సూక్ష్మత్వ భూతయోనిత్వ సర్వజ్ఞత్వాది మాంగళ్య గుణములను సత్యజ్ఞానాది గుణవిశేషములను ప్రతిపాదించినందున బ్రహ్మము సవిశేషమే నగుచున్నది.

అద్వితీయపదము - జగదుపాదానమగు బ్రహ్మమునకంటె నితరుడైన యధిష్ఠాత లేదని బ్రహ్మమునకు విచిత్రసామర్థ్యముఁ బ్రతిపాదించునది; "తదైక్షత బహు స్యాం ప్రజాయేయ" "తత్తేజో உసృజత" ఇత్యాది శ్రుతివాక్యములు సవిశేషత్వమును సమర్థించుచున్నవి.

సృష్టిఁ జేయఁదలచిన బ్రహ్మము - సృష్టికి పూర్వము సదాత్మకము గానే యుండెనని ఉపాదాన కారణముగ ప్రతిపాదింపఁబడినందున బ్రహ్మభిన్న కారణములను "అద్వితీయ'' పదము నిషేధించుచున్నది. మరియు నుపనిషత్తులలో సర్వశాఖాప్రత్యయ న్యాయము ననుసరించి బ్రహ్మమునందు సమన్వయింపఁదగిన సర్వజ్ఞత్వాది గుణముల నుపసంహారము నిర్విశేష పక్షమున విరుద్ధంబగుచున్నది.

జ్ఞాతయే జ్ఞానరూపుడగును. ప్రకాశాశ్రయములైన మణి సూర్యదీపాదులు

ప్రకాశరూపము లగునట్లు జలనిధియైన సముద్రము జలరూపమైనట్లును జ్ఞానాశ్రయుడగు పరమాత్మ- జ్ఞానస్వరూపుఁడగుట సముచితమే యగుచున్నది.

ప్రశ్న : సగుణ వాక్యములకు. నిర్గుణ వాక్యములకును విరోధమేర్పడును కావున సగుణ వాక్యములు మిథ్యావిషయకములని యంగీకరింతురా ?

ఉత్తరము : "అపహతపాప్మా" మొదలుకొని "అపిపాసః" వరకు ప్రాకృత గుణములను నిషేధించి "సత్యకామః సత్యసంకల్పః" అని కల్యాణగుణములను ప్రతిపాదించు శ్రుతియే నిర్గుణ సగుణవాక్యముల రెంటికిని సమంజసభావమును చూపెట్టుచున్నది. మరియు "భీషాఽస్మాద్వాతః పవతే" ఇత్యాది వాక్యములతో జగచ్ఛాసకత్వాది బ్రహ్మగుణముల నారంభించి క్షేత్రజ్ఞుఁడైన జీవాత్మకంటె నెన్నియోరెట్లు నతిశయమగు ఆనందమును నిరూపించియు "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ, ఆనందం బ్రహ్మణో విద్వాన్" అనుచో బ్రహ్మ గుణము లనంతములని (శ్రుతి) అత్యాదరముతో వక్కాణించినది.

బ్రహ్మము - నివరధికానందము కలదగుటచే ప్రాకృత సంస్కారములతో నిండియుండు మనస్సు గాని, వికారముగల వాక్కుగాని బ్రహ్మానందమును కనుగొనజాలవనియు ధీరుడు చేయు నుపాసనవలన ముక్తదశయందు బ్రహ్మానందము లభించుననియు గ్రహించునది. మరియు నిట గుణములను క్రమముగ తగ్గించి సర్వశూన్యమైన పర్యవసాన స్థితిని చూపక గుణములను వరుసగా హెచ్చించి వాఙ్మనోనివృత్తిఁ జూపుటవలన బ్రహ్మయొక్క మాంగల్యగుణములు ననంతంబులని విశదమగుచున్నయది.

ప్రశ్న : ఓయీ! "యస్యామతం తస్య మతం, అవిజ్ఞాతం విజానతాం" "ఎవనికి బ్రహ్మము ఇష్టమగునో నవ్వాని కొకప్పుడు బ్రహ్మము రుచింపకుండును. మరియు తెలిసికొనువారికి తెలియునది కాదు" అను వాక్యము మొదలుకొని బ్రహ్మము జ్ఞానవిషయము కాదని చెప్పఁబడుటచే నిర్విశేషము కానగును గదా!

ఉత్తరము : "బ్రహ్మవిదాప్నోతి పరం" "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" "బ్రహ్మఁ గురుతెరుగువాడు బ్రహ్మమును పొందగలుగును" "బ్రహ్మవేత్త బ్రహ్మతో సమాను డగును" ఇట్లు బ్రహ్మజ్ఞానమువలన మోక్షము లభించునని యుపదేశము వినఁబడుటచే బ్రహ్మము - ఉపాసనాత్మక జ్ఞాన విషయ మగుట పొసగుచుండు

టఁ జేసి సవిశేషము సగుణంబు నగుచున్నయది. మరియు నీ శ్రుతియందు "న దృష్టేర్ద్రష్టారం న మతే ర్మంతారం" అని జ్ఞేయమును తెలిసికొనునట్టి జీవాత్మను నిషేధించి ప్రాణులన్నిటి నంతరాత్మ యగు పరమేశ్వరునే యుపాసింపవలసినదని చెప్పినందున బ్రహ్మముఁ దగు జ్ఞాతృత్వము సిద్ధమగుచున్నయది. అట్లు కానియెడల - విజ్ఞాతార మరే కేన విజానీయాత్ - విజ్ఞాతయగు బ్రహ్మము నెట్లు తెలిసికొనవలెను - ఇత్యాది శ్రుతివాక్యములు విరోధించును.

ప్రశ్న : "యత్ర హి ద్వైతమివ భవతి" "నేహ నానాస్తి కించన" "మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూ త్తత్కేన కం పశ్యేత్" ఇత్యాదివాక్యములందు భేదము బహువిధములుగ నిషేధింపఁబడుచున్నందున బ్రహ్మము నిర్విశేష మగుచున్నది గదా!

ఉత్తరము : జగమంతయు బ్రహ్మకార్యమై బ్రహ్మ మంతర్యామిగ గలదగుటచే బ్రహ్మస్వరూప మగుటఁజేసి యద్దానికి విరుద్ధంబగు నానాత్వము మాత్రము శ్రుతులందు నిషేధింపఁబడుచున్నది. "ఏకధైవాను ద్రష్టవ్యం" అను వాక్యమందలి ఏకథా యను దానికి - ప్రపంచము పరమేశ్వర శరీరంబను నొకే రీతితో నని యర్థముఁ జెప్పవలెను.

"అహమేకః ప్రథమ మాసం వర్తామి చ భవిష్యామి చ, నాన్యః కశ్చిన్మత్తో వ్యతిరిక్తః" "నే నొకఁడను మొదట నుంటిని. ప్రస్తుతము ఉన్నాను. ఇక ముందుండగలను. నాకంటె నితరుఁడు విలక్షణుఁడు నగు ఎవఁడును లేడు."

"ఆత్మావా ఇద మేక ఏవాగ్ర ఆసీత్ నాన్యత్కించన మిషత్" "సృష్టికి పూర్వ మీ సమస్తంబును ఆత్మగానే యుండెను. మరియొకటేదియు స్ఫురింపకుండెను.ఇత్యాది వాక్యములయందు నిషేధింపఁబడు భేదము - ఏకత్వమును విధించుటకు శేషమగునది. కావున పరమేశ్వరునందెట్టి యైక్యము విహితమగుచున్నదో నట్టి ఏకత్వమును స్థిరపఱచునదిగ భేద నివారణ ముపయోగించునది.

మన్నే కుండ యనుచో - రెండు కుండలు లేవు అను నిషేధము మన్నుకుండ యొకటి యనుటకు నుపకరింపదుగదా! మరియు ఒక కుండ యనుచో కుండఁ జెందియుండు రూప పరిణామాది భేదమును తొలగించుట-ఘట మనఁబడు ధర్మి యొకటి యనుటకు నుపయోగింపదు. రూప పరిణామాది భేదము ఘటవస్తువుఁ దగు ఐక్యమునకు విరుద్ధము కానట్టిది.

మరియు "న చాస్య కశ్చి జ్జనితా న చాధిపః, న తత్సమ శ్చాప్యధికశ్చ దృశ్యతే" "ఈ పరమాత్మను పుట్టించు ఒకానొకఁడు గాని అధిపతి గాని సమానుఁడు గాని యధికుఁడు గాని కానరాడు" "ఏకః సన్ బహుధా విచారః" "పరమాత్మ యొకడై యుండియు ననేక విధములుగ సంచరించువాడు" "ఏకో దేవో బహుధా నివిష్టః" "దేవుం డొకఁడు నానారీతులుగ నుండువాడు" "త్వమేకోఽపి బహూ ననుప్రవిష్టః" "పరమేశ్వరా ? నీ వొకఁడవైన ననేకాత్మల ననుసరించి ప్రవేశించు వాడవు" ఏతాదృశవాక్యములు - పరమేశ్వరుని వివిధ లక్షణములను, నానా లక్షణములు గల పరమాత్మ యొకఁడే యగుటను, స్పష్టముగ ప్రతిపాదించుచున్నందున పరబ్రహ్మము సవిశేషమే యగుచున్నయది.

బ్రహ్మకు నానాస్వరూపములుండునని ప్రమాణములు నిరూపించుచుండగా అట్టి నానాత్వమే బాధింపఁబడుచున్నదని చెప్పుట హాస్యాస్పదమగును. కావుననే బ్రహ్మము శక్తివిశిష్టంబై అద్వితీయవైభవము కలదగుట సమంజసమగుచున్నయది.

ప్రశ్న : ఓయీ! "బ్రహ్మను ప్రతిపాదించు నుపనిషచ్ఛాస్త్రము విచారింపఁదగినది" అను ప్రతిజ్ఞ ననుసరించి యుపనిషత్తు లెవని నిరూపించునో నట్టివాడే బ్రహ్మశబ్దార్థంబగు గదా; ఇట్టి తరి నుపనిషచ్ఛాస్త్రము శివునిఁ బ్రతిపాదించునది కాదు. ఎట్లనగా! "వేదము లన్నియు నెవని స్థానమును వర్ణించుచున్నవో, తపంబులన్నియు నెద్దానిని సమర్థించుచున్నవో, ఎద్దానికై బ్రహ్మచర్యము నవలంబించువారో అట్టి పదమును నీకు సంగ్రహముగ చెప్పుచున్నా" నని యారంభించి మోక్షమార్గమున కంతమగు శ్రేష్ఠమైన విష్ణుపదము నుపాసకుఁడు పొందు" నని చెప్పు కఠవల్లీ శ్రుతియు "ఏ విద్యతో నక్షరుఁడైన పురుషుని గుర్తెరుగునో అట్టి బ్రహ్మవిద్యను యథార్థముగ చెప్పెద"నని ముండక శ్రుతియు, విష్ణు పురుషాది శబ్దములతో చెప్పఁబడు నారాయణునే ఉపనిషత్తులన్నియు ప్రతిపాదించునని తెలియుచుండుటచే నుపనిషత్ప్రతిపాద్య బ్రహ్మశబ్దమున కర్థము శివుఁడు కాదని తెలియుచున్నది.

ఉత్తరము : ఈ శంకను నివారించుటకై "సకల నిగమసార" ఇత్యాది విశేషణమును భాష్యమందాచార్యులవారు ప్రతిపాదించినవారు.

"విష్ణోః పరమంపదం" అనుచో పదశబ్దము స్థానముఁ జెప్పునది కాదు.

కఠవల్లియందు మొదట "అవ్యక్తాత్పురుషః పరః" అవ్యక్తమునకన్న పరుడగు వాఁడు పురుషుఁడని నిరూపింపఁబడు పరపురుషుఁడే పదశబ్దముతో చెప్పఁబడు వాఁడు. మఱియు పద్యతే - ప్రాప్యతే అను వ్యుత్పత్తివలన పదశబ్దము ప్రాప్యుఁడైన పురుషునే చెప్పునుగాని విష్ణ్వాదిదేవతలఁ జెప్పునది కాదు. ''విష్ణువునకు ముఖ్యముగ ప్రాప్యమగు పదమును" అని విష్ణుప్రాప్యత్వము పరమేశ్వరునకు నిరూపింపఁబడియెను.

మఱియు - పరమేశ్వరుని యొక్క శక్తి - వినియోగకాలమున నాలుగు విధము లగునది. భోగసమయమందు భవానిగాను, పురుషస్థితిని విష్ణువుగాను, క్రోధకాలమందు కాళిగాను, యుద్ధావసరమున దుర్గాదేవిగాను పరిణమించునని స్మృతి చెప్పుచుండుటచే శక్తి యవస్థావిశేషంబగు విష్ణువునకు గల పురుషావస్థ లయించుతరి స్వరూపమగు శైవీశక్తి ప్రాప్యంబగుటయు, శైవీశక్తిద్వారా ప్రాప్యత్వమునకు చివరి యవధి శివుఁ డగుటయుఁ జూడగా శివుఁడే విష్ణువునకు పరమపదము అనగా ముఖ్యప్రాప్యుఁడగుచున్నవాఁడని విశదమగుచున్నది.

"ఉభయ నిర్దేశే పంచమీ నిర్దేశో బలీయాన్". "పంచమీ షష్ఠీ విభక్తుల రెంటి కవకాశ ముండుతఱి పంచమియే బలవత్తరమగు" నను న్యాయము ననుసరించి "విష్ణోః" అను పదమునకు పంచమి గ్రహింపఁ దగినది. "సర్వే వేదా యత్పద మా మనంతి" అను నుపక్రమంబు శివవిషయక మగుట సముచితమగుచున్నది.

ఎట్లనగా ? ''శివో రుద్రో మహాదేవః-శంకరో బ్రహ్మ సత్పదం, ఏవమాదీని నామాని - విశిష్టాని పరస్యతు'' ''శివుఁడు, రుద్రుఁడు, మహాదేవుఁడు, శంకరుడు, బ్రహ్మ, సత్, పదము ఇత్యాది నామధేయములు పరమేశ్వరునకు ముఖ్యవాచకములుగ నొప్పారునవి" యని స్కాందమునందు చెప్పఁబడుటచే "తత్తే పదం సంగ్రహేణ బ్రవీమి'' అను నుపక్రమము. పదశబ్ద ప్రయోగమువలననే శివుని సమర్థించుచున్నదని తెలియుచున్నది. "విష్ణోః" అను పదమున కుత్తరముగ పరమ పద ముండుటచే పంచమ్యంతమే యుక్తమగునది. "యేనాక్షరం పురుషం వేద సత్యం'' అనుచో నక్షర పురుష పదములును శివునే చెప్పునట్టివి. "న క్షరతీ త్యక్షరః" అను వ్యుత్పత్తివలన చేతనమాత్రునియందు ప్రవర్తించు నక్షరపదమునకు శివవిష్ణువులు సాధారణులు కాగా "యః సర్వం యః సర్వజ్ఞః

సర్వవిత్"అను మంత్రమున సర్వజ్ఞపదముతో రూఢిగా బోధింపఁబడు శివునందే నక్షరపదము సమన్వయింపబడునది. ''సర్వజ్ఞ" పదము యౌగిక మగునెడ సర్వవిత్పదము నిరర్థక మగును. సర్వజ్ఞపదము రూఢమగుచో ప్రాకరణికము లగు నక్షరాదిపదములకు ప్రత్యేక దేవతాపరమైన ఆకాంక్ష కలుగగా రూఢితో నాకర్షింపఁబడు తాత్పర్యము గల పదమునందే ఇతర పదములన్నియు పర్యవసానముఁ జెందును గావున రూఢిపదముయొక్క వ్యుత్పన్నార్థముఁ దెలుపు పదము సార్థక మగునది. అనగా సర్వజ్ఞపదము రూఢమై అక్షరాదిపదముల నాకర్షించుచుండుటఁ జేసి సర్వజ్ఞపదార్థమును విశదీకరించుటకు సర్వవిత్పదము ఉపయోగించునదని భావము. "కుర్యాం హరస్యాపి పినాకపాణే ర్ధైర్యచ్యుతిం కే మమ ధన్వినోఽన్యే"అను కుమారసంభవ శ్లోకమందలి పినాకపాణి పదము-సారతతరమగు ఆయుధము కలిగి యుండుటను తెలుపుటకై ప్రయోగింపఁబడి యందలి యౌగికార్థముతో పినాకపాణి యగు శంకరునందే పర్యవసించుచున్నదై రూఢ్యర్థమునకై హరపదము ననువర్తించునది. అనగా హరపద ప్రయోగముచే పినాకపాణి పదముఁ దగు రూఢ్యర్థమైన శంకరత్వంబు, యౌగికార్థమైన సారతరాయుధము కలిగియుండుటయు నిరూపింపఁబడినవని తెలియునది." కావున నుదాహరింపఁబడిన వేదాంతవాక్యము లన్నియు శివపరములే యగుచున్నవి.

ప్రశ్న : ఓయీ! ఉపనిషత్తులన్నియు శివునిఁ బోధించునవికావు. "హిరణ్యగర్భః సమవర్తతాగ్రే" సృష్టి ప్రారంభములో చతుర్ముఖుడుండెను. "ఏకో హ వై నారాయణ ఆసీత్ '' పూర్వము నారాయణుఁడొకడే యుండెను. ఇత్యాది శ్రుతి వాక్యములందు అన్యదేవతాపరత్వము పొడగట్టుచున్నది గదా!

ఉత్తరము : ఈ శంకను నివారించుట కయ్యే "శ్రుత్యంతసారముఁదగు సమరసభావమునకు పెన్నిధివంటివా" డను విశేషణముఁ జెప్పియున్నవారు.

ఆపాతతః అన్యపరములుగా భాసించు వాక్యముల కొన్నిటిని బాగుగా విమర్శించినచో శివునందే తాత్పర్యము గలవని తేటపడును. మరియు వేదము లందు, వేదాంతములందు, పురాణములందు నితర దేవతాపరములుగ చెప్పఁబడు వాక్యములన్నియు సృష్టి స్థితి లయ తిరోధానానుగ్రహ పంచకృత్యములఁ జెందిన చరిత్రను తెలుపుచు ఆ యా స్వరూపముల నంతర్యామి యగు శివునందు పర్యవసానముఁ జెందుచున్నవని కేనోపనిషత్తు విశదీకరించుచున్నయది.

ఎట్లనఁగా? "బ్రహ్మ హి దేవేభ్యో విజిగ్యే" దేవతలందరి విజయమునకు బ్రహ్మ (శివుడు) కారణమగునది. దేవతలును, రాక్షసులును పోరాడగా అంతర్యామి యగు పరమాత్మ యనుగ్రహముచే దేవతలు గెలుపొంది- స్వసామర్థ్యము వలన, విజయమును భావించుచుండిరి. అట్టి తఱి శివుఁడు దేవతల గర్వమును పోగొట్టు నుద్దేశముతో యక్షరూపముతో నావిర్భవించి, అగ్ని-వాయువుల గర్వము నణచి యంతర్ధానముఁ జెందెను. అప్పుడు భగవతి పార్వతీదేవి యుపదేశించుట వలన "సకలప్రాణులలో నంతర్యామి యగు శంకరుని కరుణవలననే మనము గెలుపొందగలిగితి"మని మహేంద్రాదులు తెలిసికొనఁగలిగిరి. యక్షరూపముతో నావిర్భవించినవాడు మరియొక దేవత యగుచో, పార్వతీదేవి సాక్షాత్కరించుటకు వీలు లేదు. ఇట్టి యభిప్రాయమును పురస్కరించుకొనియే వేదాంతాది శబ్దరాశి యంతయు శివునే బోధించుచున్నదని "ఇమా రుద్రాయ స్థిరధన్వనే గిరః" "ఉపస్థితములగు నీ వాక్యము లన్నియు అనగా వేదస్మృతీతిహాస పురాణాది వాఙ్మయమంతయు స్థిరమగు ధనస్సుఁ ధరించు రుద్రునికొరకై నుపయోగించునట్టిది" అని మంత్రభాగము నిర్ధారించినది.

స్మృతయశ్చ పురాణాని భారతాదీని సత్తమ
శివమేవ సదా సాంబం హృది కృత్వా బ్రువంతి హి.

స్మృతులు, పురాణములు, మహాభారతము మొదలగునవియు శక్తివిశిష్టుడైన శివునే ఎల్లకాలము హృదయమందిడుకొని ప్రతిపాదించుచున్న" వని పూజ్యుఁడగు పరాశరమహర్షి వక్కాణించెను.

"వేదవిదులగు బ్రాహ్మణులారా? కొన్ని వేదవాక్యములు రుద్రమూర్తి నాశ్రయించియు, మరికొన్ని విష్ణుమూర్తి నాశ్రయించియు, తదితరములు కొన్ని బ్రహ్మదేవు నాశ్రయించియు, అన్యవాక్యములు కొన్ని అగ్ని నాశ్రయించియు, ఇంకకొన్ని సూర్యు నాశ్రయించియు, పరమకారణుడైన శివునందు పర్యవసానముఁ జెందుచున్నవి" అని స్కాందమహాపురాణమునందును కలదు.

ఇట్లు ఆ యా దేవతామూర్తులద్వారా ప్రతిపాదింపఁబడు మహాదేవుఁడు మూర్తుల నన్నిటి నంతర్యామి నుండువాడు గావున "సకల నిగమసార నిధానస్య" అని చెప్పుట సమంజసమైనది.

సామరస్య మనఁగా ? వేదాంతము లన్నియు తాత్పర్యముతో నేక ముఖము కలిగియుండుట యగును.

ప్రశ్న: ఓయీ? సర్వవేదాంత తాత్పర్య పర్యవసానము శివునందు పొసగకుండును గదా; "యః సర్వజ్ఞః సర్వవిత్" ఇత్యాది వాక్యము లనంతమాంగళ్య గుణరత్నాకరత్వంబు "యతో వా ఇమాని భూతాని జాయంతే" ఇత్యాది వాక్యములు జగజ్జన్మాదికారణత్వంబును, "అంతః ప్రవిష్టః శాస్తా జనానాం" ఇత్యాది వాక్యంబులు సర్వనియంతృత్వంబును, "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే'' ఇత్యాది వాక్యము లానందాత్మకత్వంబును, "స ఏకో బ్రహ్మణ ఆనందః" ఏవమాది వచస్సులు నిరతిశయానందము కలిగియుండుటను ప్రతిపాదించుచుండుటఁజేసి యిది యంతయు శివునం దెట్లు పొసగును?

ఉత్తరము : లోకవేదములందు ప్రసిద్ధములైన పరమేశ్వరుని నామములు ప్రవర్తించుటకుగల కారణములను గమనించినచో పూర్వోక్తమంతయు శివునందు సరిపడునని విశదమగును. ''ఈ పరమాత్మ వలన జగము ఆవిర్భవించుచున్నది" గావున భవుఁడనియు; "జగత్ క్షేమమును కలుగఁజేయువాడగుటను కల్యాణ గుణము లన్నియు కలవాడగుటను" శివుఁడనియు, ''జగమును హింసించువా'' డగుటచే శర్వుఁడనియు: "పశువులనఁబడు జీవాత్మలను గోవృషభాదులనువలె పాశములతో బంధించి స్వకార్యమును చేయించువాడు" గావున పశుపతియనియు; ప్రపంచమునంతయు శాసించుచు పూజ్యుఁ" డగుటచే పరమేశ్వరుఁడనియు; "సర్వేంద్రియానందము నతిశయించు గొప్పదైన స్వాత్మానందమునందు వెలుగొందువాడు గావున మహాదేవుఁడనియు; "భక్తులకు సంసారదుఃఖమును పోగొట్టువా" డగుటఁజేసి రుద్రుఁడనియు; "సుఖముఁ గలుగజేయువాడు" కావున శంభువనియు, సదాశివుఁడు పేర్కొనఁబడుచున్నవాడు.

శివశబ్దముతో నిఖిలమాంగళ్యగుణాకరత్వంబును, భవ శివ శర్వ పశుపతి రుద్ర పదములతో పంచకృత్యపరాయణత్వంబును, పరమేశ్వర పదముతో నంతర్యామిత్వంబును, శంభుశబ్దముతో నిరతిశయానందము కలిగియుండుటయు, నిర్వచింపఁబడుచున్నవి గావునను వేదాంతములన్నిటియందు బ్రహ్మలక్షణములఁ జెప్పునవిగ ప్రతిపాదింపఁబడు ముఖ్య నామధేయులకు నిధానమగుటచేతను శివుఁడే సర్వశ్రుతితాత్పర్యముఁ జెందువాడని తెలియుచున్నది.

ప్రశ్న: శ్రవణ మనన నిధిధ్యాసన సాక్షాత్కారములతో ప్రసన్నుఁడై మోక్షమును కలుగఁజేయువాడే "అథాతో బ్రహ్మజిజ్ఞాసా'' సూత్రగత బ్రహ్మ శబ్దమున కభిధేయమగువాడు. కావున "మోక్షమిచ్ఛే జ్జనార్దనాత్'' అను స్మృతి వాక్యము ననుసరించి నారాయణునకు మోక్షప్రదత్వము విహితమగుచున్నది.

ఉత్తరము: ఇట్టి శంకను నివారించుటకై "స్వశేషభూత..." అను విశేషణము నుపపాదించి యున్నవారు. ''ఫలమత ఉపపత్తేః" అను సూత్రాధికరణమున సకలపురుషార్థప్రదత్వంబును, "తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్'' ఇత్యాది సూత్రముల యధికరణములలో మోక్షప్రదత్వంబును శివునకు సమర్థింపఁబడును గాన నిట నుదాహరింపలేదు.

ప్రశ్న: ఓయీ! అనుగ్రహముతో పురుషార్థము సిద్ధించునెడ యత్నము లేకయే పురుషార్థము లన్నియు సిద్ధింపవలసివచ్చును. కపటరహితమైన దయకు నిధియై జీవులందరి ననుగ్రహించు శివున కెల్లకాలము ప్రసాదముండును గదా?

ఉత్తరము: ఈ సంశయమును తొలగింప ''సముపాసనానుగుణ సముదిత...'' అను విశేషణముఁ జెప్పియున్నవారు. శివుఁడందరి ననుగ్రహించువాడై యెల్లపుడు గలిగియుండు దయ-జీవులనాదికాలమునుండి చేయుచున్న నపచారము వలన వ్యక్తము గాకుండుటయు, కర్మజ్ఞానరూపమైన శివారాధన ననుసరించి జీవులలో వారివారియందు వ్యక్తమగుచు పురుషార్థములను సిద్ధింపఁజేయుటయు గమనింపఁదగినవి.

ప్రశ్న: ఓయీ! చేతనశబ్దమునకు ''నిఖిల'' పద ముపయుక్తము కాజాలదు. పశుపక్ష్యాదులకు కర్మజ్ఞానాధికారము లేదు గదా!

ఉత్తరము: చేతనులందరును తమతమ ప్రారబ్ధముల ననుసరించి వరుసగ గ్రహించు జన్మలలో మనుష్యాదిశరీరములఁ బ్రవేశించుతఱి కర్మజ్ఞానముల నాచరించుటకు నధికారము సిద్ధించుచున్నది. మరియు

మహాదేవే మహానందే మహాకారుణికోత్తమే
ప్రసన్నే సతి కీటో వా పతంగో వా విముచ్యతే.

గొప్ప యానందము, పెద్దదయ గలవారిలో శ్రేష్ఠతయు గల మహాదేవుఁడు

ప్రసన్నుఁడగునెడ కీటముగాని పక్షిగాని ముక్తిఁజెందు నను స్మృతిప్రమాణము— తిర్యక్ జంతువులందును పరమేశ్వరప్రసాదము సంభవించునని నిరూపించుచున్న యది. మరియు పాము ఏనుగ మున్నగు జంతువులలో నుపాసనాత్మకమైన జ్ఞానము చెప్పఁబడినందున నవ్వానియందును పూర్వజన్మ సంచితమగు జ్ఞానము నుపయోగించు యోగ్యత యుండునని తెలియునది.

ప్రశ్న : ఓయీ? పుష్పములు బిల్వము మున్నగువానిని సమర్పించుట క్షుల్లకమైనది గదా; ఇంతమాత్రమున శివుఁడెట్లు ప్రసన్నుడై గొప్ప పురుషార్థ ముల నిచ్చువాడు?

ఉత్తరము : ఈ శంకను నిరసించుటకే ''స్వశేషభూత...'' అను విశేషణ మును చేతనపదమున కనుసంధించి యున్నవారు.

ఒకానొక గృహస్థునకు భార్యాదులతోవలె చేతనులందరికి శివునితో ననాది కాలమునుండి శేష శేషి భావము సిద్ధించుచున్నది గావున నట్టి సంబంధముతో భక్తిపూర్వకమైన శివారాధన స్వల్పమైనను సంతసించువాడు పరమాత్మయని గ్రహించునది.

ప్రశ్న : త్రివిధ పరిచ్ఛేదము లేకుండుటను గుణములతో నిండియుండు టను జగజ్జన్మాది కారణత్వము వలనను శివుఁడే బ్రహ్మమగు నపుడు శివేతర దేవతలందు బ్రహ్మశబ్ద మెట్లుపయోగించును?

ఉత్తరము: ఇందుకే "పరబ్రహ్మణః" అని బ్రహ్మపదమునకు పర విశేష ణముఁ జెప్పియున్నవారు, శ్రుత్యాది ప్రమాణములఁబట్టి హిరణ్యగర్భునకు బ్రహ్మత్వ వ్యవహారమున్నను అపరబ్రహ్మ కాదగును. బ్రహ్మ శబ్దము ప్రవర్తిం చుటకు గల కారణముల పూర్ణత్వము శివేతర దేవతలందు గానరాదు.

"ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ" యని శంకరుఁడే పరబ్రహ్మగా వర్ణింపఁ బడుచున్నవాడు, "ఎందువలన పరబ్రహ్మమని చెప్పఁబడునని" ప్రశ్నించుకొని "పరబ్రహ్మ" యని యుచ్చరించుచుండగానే గొప్పయగుచు విస్తరింపఁజేయునది గావున పరబ్రహ్మమని చెప్పఁబడునని ప్రతిపాదించిన నథర్వశిరోపనిషత్తు శంక రునకు పరబ్రహ్మత్వమును నిర్ధారించుచున్నది.

ప్రశ్న : అథర్వశిరమునందు చెప్పఁబడిన నామధేయములు ఓంకారముఁ జెందినవి గదా!

ఉత్తరము : ఎయ్యది ఓంకారమో నయ్యది ప్రణవము, ప్రణవమే సర్వ వ్యాపి; సర్వవ్యాపి యనంతము: అనంతము తారము; తారమే సూక్ష్మము; సూక్ష్మము శుక్లంబు; శుక్లము వైద్యుతంబు; వైద్యుతము పరబ్రహ్మంబు; అట్టి వాడే యొకఁడగు రుద్రుడుగా, నీశానుఁడుగాను, భగవానుఁడుగాను, మహేశ్వ రుఁడుగాను, మహాదేవుఁడుగాను, పేర్కొనఁబడుచున్నవాడు" ఇట్లు ఓంకారము మొదలుకొని మహాదేవపదమువరకు గల నామములు ఒకే వ్యక్తిఁ జెప్పునవిగ నిర్వచింపఁబడినవి. మరియు

శివో వా ప్రణవో హ్యేష (ః) ప్రణవో వా శివస్తథా
వాచ్యవాచకయో ర్భేదో నాత్యంతం విద్యతే క్వచిత్.

"శివుఁడే (ఈ) ప్రణవముగాను, ప్రణవమే శివుఁడుగాను, వాచ్య వాచకము లగు శివప్రణవములకు మిక్కిలి భేదమెందును గానరాదు" అను శివపురాణవచ నము ననుసరించి ప్రణవనామములన్నియు నిట శివునందే పర్యవసానముఁ జెందుట సముచితమగుచున్నయది.

ఇందువలననే నథర్వశిఖయందు- "ఓంకార, ప్రలయ, ప్రణవ, సర్వదేవ వేదయోని, సర్వవాచ్య సముద్ధర్తృ, తార, విష్ణు, బ్రహ్మ, ప్రకాశ, విద్యుత్, వ్యాపి ఇత్యాధి నామములకు వాచ్యుఁడు మహాదేవుఁడని ప్రతిపాదింపబడినది. ఇట్లు బ్రహ్మదేవునకు విష్ణుమూర్తికిని చూపఁబడు పరబ్రహ్మత్వము గౌణమని విశదమ గుటఁజేసి పరబ్రహ్మమగు సదాశివుని నిరూపించు వేదాంతభాగము విచారణీయం బని "బ్రహ్మజిజ్ఞాసా" పథముతో ప్రదర్శించి అట్టి వేదాంతవిచారము ధర్మవిచా రానంతరకర్తవ్యమని అథశబ్దముఁదగు ఆనంతర్యార్థముఁ జూపెట్టియు "తన్ని యోగ..." అను పదముతో ధర్మము నుల్లేఖించియున్నవారు.

"తన్నియోగరూప...'' అని చెప్పుటచే ధర్మమునకుగల చోదనకు ప్రమా ణత్వంబు "తత్తదర్థవాద..." అనుటవలన మంత్రమునకు నర్థవాదమునకు ప్రామాణ్యంబు. ''స్వప్రమాణానుగణ.. " అనుటచే స్మృత్యాదులు ప్రమాణము లగుటయు, చూపఁబడినవి. మరియు "తదారాధన" ఇత్యాది విశేషణముచే ఇందలి

ద్వితీయాధ్యాయములో నుపాసనా భేదంబు ప్రదర్శింపబడెను. "శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే" "శ్రుతిస్మృతులు శివాజ్ఞలే" యనుటవలన వేదము, చోదనాత్మకమైన ధర్మంబు పరమేశ్వరుని శాసనము లగుటయు; "భోక్తారం సర్వయజ్ఞానాం" కర్మలన్నియు శివారాధనము లగుటయు; నిర్ధారింపఁబడుటచే కర్మానుష్ఠానరూపమగు ధర్మవిచారము చిత్తశుద్ధిద్వారా జ్ఞానజనకమగుటఁజేసి బ్రహ్మవిచారమునకు ముందు ధర్మవిచారముఁ సరిపడుచున్నయది ఇట్టితరి ఏతాపద్విశేషణములతో కూడిన ధర్మమును విచారించుటయే పుష్కలముగ బ్రహ్మవిచారమునకు సహాయపడును కాని నిరీశ్వరవాద్యభిమతమైన ధర్మమును విచారించుట బ్రహ్మవిచారసహాయకము కాజాలదని గుర్తెరుగవలెను.

ఈ "అతః శబ్దము- గడచినదానికి కారణత్వమును చూపెట్టునది. ఎందువలన వేదములఁ జదువుకొని ధర్మమును విచారించినవాడో అందువలన ధర్మానుష్ఠానముతో చిత్తశుద్ధి గలవాడై తత్కాలమందు కలుగు వివేకము మొదలగు గుణముల తోడ్పాటుతో నేర్పడు పరమ (ఏకాగ్ర) భక్తితో కూడియుండు పురుషుఁడు నిరతిశయమైన ఆనందము నాపాదించు పరబ్రహ్మ నవశ్యము విచారింపవలసినదేను.

ప్రశ్న ; ధర్మముల నన్నిటి నాచరించుట చిత్తశుద్ధ్యర్థము గాకుండుటను ధర్మానుష్ఠానము తప్పనిసరిగా చిత్తశుద్ధిని కలిగింపకుండుటను బ్రహ్మవిచారకారణము ధర్మవిచారము కాకుండును గదా!

ఉత్తరము : ధర్మవిచారముఁ జేయునపుడు పూర్వమీమాంసయందు చెప్పఁబడిన వేదచోదన మొదలగు వాని ప్రామాణ్యంబు, శ్రుత్యాదుల స్వరూపముఁదగు బలాబలంబులును ఉత్తరమీమాంసకువలయు పరిజ్ఞానము దృఢపడుటకు నుపయోగించును కావున ధర్మవిచారమంతయు బ్రహ్మవిచారమునకు ముందు నియతమై యుండుట సమంజస మగుచున్నయది. మోక్షఫలము నిత్యమనియు, సత్క్రియలకుఁదగు నభ్యుదయ ఫల మనిత్యమనియు, భావించుట- వివేకమనఁబడుచున్నది.

ధర్మవిచారానంతరము పరమేశ్వర ప్రీతిభావనతో గావింఁబడు కర్మల వలన చిత్తశుద్ధి గలుగునని యుద్దేశించి "తత్కాల సంపన్న..." అను విశేషణముఁ జెప్పియున్నవారు.

హింస్రాహింస్రే మృదుక్రూరే ధర్మాధర్మౌ ఋతానృతే
తద్భావితాః ప్రపద్యంతే తస్మాత్తత్తస్య రోచతే.

హింసించుటను, హింసింపకుండుటను; మృదుత్వమును, క్రూరత్వమును ధర్మమును, అధర్మమును; సత్యమును అసత్యమును పూర్వజన్మవాసన ననుసరించి కలిగియుందురు కావున నాయా చేష్టితములు నాయావ్యక్తులకు రుచించుచుండు నను స్మృతి ప్రమాణముఁబట్టి సహజశివభక్తి గలవారై పాశుపతవ్రతము నవలంబించు వారే నిజముగా నీ వేదాంతశాస్త్రమును విచారించుట కధికారము కలిగియుందురని విశదమగుచున్నది.

"తేషా మేవైతాం బ్రహ్మవిద్యాం వదేత - శిరోవ్రతం విధివద్యైస్తుచీర్ణమ్" శ్రు. "వ్రతం పాశుపతం చీర్ణం - యై ర్ద్విజై రాదరేణ తు; తేషా మేవోపదేష్టవ్య మితి వేదానుశాసనమ్"

"శిరోవ్రత మనఁబడు పాశుపత (శివలింగధారణ) వ్రతమును విధి యుక్తముగ నాచరించు ద్విజులకు మాత్రము బ్రహ్మవిద్యోపదేశముఁబడయ నర్హత కల" దను ప్రమాణములఁబట్టి శ్రీ మాధవాచార్యులవారు- ఏకర్షిహోమము శిరోవ్రతము మొదలగునవి అథర్వణికులకు మాత్రము అధ్యయన ధర్మంబులగు ననియు, ఇతరులకు శిరోవ్రత మనఁబడు పాశుపతదీక్ష మోక్షాంగమనియు సూత సంహితలో వ్యాఖ్యానించి యున్నందువలనను పూర్వోక్తమైన బ్రహ్మవిద్యాధి కారము శైవులకే సుసంగత మగుచున్నయది.

మరియు ముందు నధికరణములలో భాష్యకారులును పాశుపతవ్రత ధర్మము లైన భస్మోద్ధూళనాదులు ఉపాసనలన్నిటియందు సాధారణ కర్తవ్యము లనియు పాశుపతవ్రతమునకు ముక్తియే ఫలం బనియు నిర్ధారించియున్నవారు.

ప్రశ్న : పాశుపతవ్రతము - భస్మోద్ధూళనాదిరూపమే యని భాష్యకారులు నిరూపించుటవలన శివలింగధారులకు బ్రహ్మవిద్యాధికారము లేదని తెలియు చున్నది గదా!

ఉత్తరము : ప్రకృతభాష్యమునకు కారికను రచించిన శ్రీ నీలకంఠాచార్యుల వారు- భాష్యోక్తమగు పాశుపతము లింగధారణ దీక్షారూపంబని క్రియాసార మనఁ బడు నిగమాగమసార సంగ్రహమునందు అనేకాధికరణములలో నిశ్చయించియున్న

వారు. మరియు పాశుపతము లింగధారణాత్మకంబని శ్రీ ముదిగొండ నాగలింగా ధ్య శివయోగులవారు స్వవిరచిత లింగధారణ సర్వస్వమునందు బ్రహ్మపథము నందు వివరించియున్నవారు. సూతసంహితలోని పాశుపతమును వివరించుతటి ప్రమాణాంతరములఁబట్టి భస్మపదము- రుద్రాక్ష శివలింగములకు నుపలక్షకం బగునని గ్రహించునది,

బ్రహ్మజిజ్ఞాసా అను పదములోని బ్రహ్మశబ్దమునకు- బ్రహ్మను తెలిసి కొనుట యని షష్ఠికి కర్మార్థముఁ జెప్పవలెను.

"వేదములఁ జదివి ధర్మానుష్ఠానముతో శుద్ధచిత్తము గలవాడై యుండు బ్రాహ్మణుఁడు కర్మఫలములగు పుణ్యలోకంబు లనిత్యసుఖముల నిచ్చునట్టివని విమర్శించి నిత్యలోకము కృత్రిమకర్మతో ప్రాప్యము కాజాలదని నిర్వేదమును పొందవలెను. మరియు సమిత్ఫలాదులఁ గైకొని నిత్యలోక విరాజమానుండగు పరమాత్మను తెలిసికొనుటకు శ్రోత్రియుడైన బ్రహ్మనిష్ఠుఁడగు ఆచార్యు నాశ్ర యింపవలెను" అను శ్రుతివాక్యము విషయ మగుచున్నయది.

బ్రహ్మ విచారింపఁదగినది అవునా? కాదా? అని సందేహము కలుగు చున్నది.

ప్రశ్న : సందేహమున కవకాశము లేనందున బ్రహ్మ విచారణీయము కాదని తెలియుచున్నది. "అయమాత్మా బ్రహ్మ" యను శ్రుతి- "అయం" అను పదముతో ప్రత్యక్షసిద్ధమగు జీవాత్మనే బ్రహ్మగా నిర్దేశించుచున్నది. కావున బ్రహ్మ కొరకై సందేహకళంకముఁదగు ప్రసంగమున కవకాశము లేదు. మరియు విచార మునకు ఫలము - విచార్యవిషయజ్ఞానము గదా; జ్ఞానమనగా జ్ఞేయపరిచ్ఛేదము; వేదాంతవిచారమువలన కలుగు జ్ఞానము - బ్రహ్మను పరిచ్ఛిన్నముఁ గావించునా లేదా? పరిచ్ఛిన్నముఁ జేయునెడ బ్రహ్మ పరిచ్ఛిన్నము కానిది యను ప్రసంగము భంగపడునది. పరిచ్ఛిన్నముఁ గావింపని యెడల బ్రహ్మ-సంపూర్ణముగా తెలియ కుండును. "అయం"అని పరిచ్ఛిన్నమగు ఘటము విశదమగుచున్నది గదా! కావున బ్రహ్మజ్ఞానము సంభవించునది కాదు. ఐనను బ్రహ్మజ్ఞానమువలన నెట్టి ప్రయోజ నంబు గానరాదు. సంసారనివృత్తిరూపమైన మోక్షము ప్రయోజన మనునెడ సంసా రము అనాదికాలమునుండి సిద్ధమగుటచే ఎప్పటికిని తొలగునది కాదు.

ఈ ఆత్మ బ్రహ్మమని శ్రుతి చెప్పుటచే జీవుఁడే బ్రహ్మమని "అహం" అనుభవముతో ప్రత్యక్షసిద్ధం బగుచున్నది. బ్రహ్మ జీవభిన్నమనునెడ అట్టి బ్రహ్మను తెలిసికొనుటవలన ఫలము గానరాదు-సంసారము తొలగినచో నిరతిశయానందము ప్రాప్తించునట్టిది; బ్రహ్మపదార్థ జ్ఞానమువలన అనాదియగు సంసారము తొలగునది కాదు. జీవులందరికి నొకపర్యాయమే మోక్షము సంభవించునని చెప్పునెడ జీవులు గావించిన ఆనర్థంబులన్నియు నిష్ఫలములు కావలసివచ్చును.

కావున విషయప్రయోజనాదులు లేని యీ వేదాంతశాస్త్రము విచారింపఁ బ్రారంభింపఁదగినది కాదని యంగీకరింతురా ?

ఉత్తరము : ఉత్తరమీమాంస యనఁబడు బ్రహ్మవిచారశాస్త్రము అన్ని విధములను ప్రారంభింపదగినదై యున్నది. బ్రహ్మఁగూర్చి సందేహము కలుగుచుండుటఁజేసి యీ శాస్త్రమునకు బ్రహ్మ విషయంబగుచున్నది. అట్టి బ్రహ్మను నిర్ణయించుకొనుటయు సఫలంబగునది. "అయ మాత్మా బ్రహ్మ" యని యెందువలన శ్రుతి- యహంకారబద్ధుఁడగు సంసారిజీవునే బ్రహ్మగా జెప్పుచున్నదో అందువలననే సందేహము పొడముచున్నది.

"సమస్త బాధల కళంకములు లేనట్టి, నిరతిశయములైన జ్ఞానానందములు మొదలగువాని శక్తియొక్క మహిమాతిశయము గలిగియుండుట బ్రహ్మలక్షణం" బగు గదా!

"అనాదియగు అజ్ఞానముఁ దగు వాసనల యభివృద్ధిచేత వ్యాపింపఁబడు విచిత్రకర్మఫలముల యనుభవమునకు అనుకూలించు నానాశరీరములందు ప్రవేశించుటయు అవ్వానినుండి వెడలుట యను వ్యవహారమువలన పరవశుడై యనంత సంతాపమును సహించుట జీవలక్షణం" బగునది.

ఇట్లు పరస్పరము విలక్షణులైన జీవేశ్వరులకు శ్రుతులెట్లు ఐక్యమును ప్రతిపాదించునని సందేహ మెందుకు పొడమకుండును ?

అన్నము బ్రహ్మమనియు, ప్రాణము బ్రహ్మమనియు, మనస్సు బ్రహ్మమనియు, విజ్ఞానము బ్రహ్మమనియు, ఆదిత్యుఁడు బ్రహ్మమనియు, నారాయణుఁడు బ్రహ్మమనియు, ఇత్యాది వాక్యములు భిన్నభిన్న వస్తువును బ్రహ్మగా చెప్పుచున్నవి. ఇవ్వానిలో నెద్ది బ్రహ్మంబని యనేకవిధములు సందేహింఁబడు బ్రహ్మము- విచారింపఁదగినదే యగుచున్నది.

అట్టితటి - శ్రవణ మననాదులతో నిర్ణయింపఁబడునట్టి, భక్తిజ్ఞానముల యతిశయమున కభిముఖు డగునట్టి, వికార రహితమైన అనుగ్రహము గలిగినట్టి, గొప్ప యాచార్యుడై ముముక్షువుల నందరి ననుగ్రహించునట్టి శివాభిధేయమగు పరబ్రహ్మయొక్క కరుణాతిశయమువలన శమదమాది సంపన్నుడగు జీవాత్మకు కైవల్య (మోక్ష) మనెడు సంపద లభించుట ప్రయోజనం బగుచున్నది.

పాశముల సముదాయమును ఛేదించి, నిరతిశయిములైన జ్ఞానానందములను గోచరింపఁజేయు స్వరూపము గలిగినదియు, పరమేశ్వరుని యైశ్వర్యముతో సరిపడు గుణముల సారము గలదియు కైవల్యా మనఁబడును

ఇందువలన వేదాంతవిచారము విషయముతోడను, ప్రయోజనముతోడను కూడిన దగుమన్నయది.

వేదములఁ జదివిన పిమ్మట భార్యఁ బరిగ్రహించి ధర్మానుష్ఠానమునకు వలయు వేదార్థవిచారమునకై "అథాతో ధర్మజిజ్ఞాసా" సూత్రార్థముఁ దెలిసికొనుటకు స్వయముగ ప్రవర్తింతురు గావున ధర్మవిచార సమయమందు చిత్తశుద్ధి యపేక్షణీయము కాదు. పూర్వ పుణ్యబలమున చిత్తశుద్ధి గలవారు జ్ఞానసాధనమగు కర్మ నాచరించుటకు ధర్మవిచార మత్యవసర మగుటఁజేసి ధర్మము నాచరించుచు సర్వతోముఖమైన చిత్తశుద్ధి గలవారై బ్రహ్మసూత్రములఁ జదువుటవలన వివేక, వైరాగ్య, శాంతి, ముముక్ష లనఁబడు సాధనచతుష్టయము నవలంబించి సహజ శివభక్తి నభివృద్ధి పఱచుకొనియు బ్రహ్మవిచారమందు ప్రవర్తించువారగుదురు.

బహువిధ శ్రుతివాక్య శ్రవణమువలన ముముక్షుజ్ఞేయ మగు బ్రహ్మ యెట్టిదని నందేహము కలుగుటచే బ్రహ్మజిజ్ఞాస గలవాడై బ్రహ్మను నిర్దేశించు ఉత్తర మీమాంసా శాస్త్రశ్రవణమునందు ప్రవృత్తుఁడై వినుట కనుకూలించు ఉపపత్తుల ననుసంధించుకొనుచు స్వరూప, ప్రమాణ, సాధన, ఫలములవలన బ్రహ్మను నిర్ణయించుకొని భక్త్యతిశయముతో నిరంతర సేవనాత్మకమైన ఉపాసనఁ గావించు విశిష్టాధికారికి నిజసాక్షాత్కారము ననుగ్రహించి నిత్యసిద్ధమైన అపారకరుణతో నుద్ధరించుటయందభిరుచి గలవాడగుటచే బ్రహ్మవిద్య నుపదేశించుటకు పరమగురు స్వరూపముతో శ్రవణమననాదులఁ బ్రవర్తింపఁజేయు పరబ్రహ్మ - నిండు దయ గలవాడై తనతో నత్యంత సామ్యము నాపాదించు జ్ఞానానంద స్వరూపమగు మోక్షలక్ష్మిఁ బ్రసాదించుచున్నవాడు.

అనాది సంసారము నివర్తించునని "సంసార మోక్ష స్థితి బంధ హేతుః" ఇత్యాది ప్రమాణములు నిరూపించుచున్నవి. ఇప్పుడు పుట్టినవాని యజ్ఞాన మనాది యని విశద మగుచున్నను అట్టి యజ్ఞానము దూరమగునని యంగీకరింపబడినట్లు సంసారము అనాదియైనను తొలగునని గౌతమ సూత్రమునందు స్పష్టీకరింపఁబడి యెను. "సర్వానుగ్రాహకస్య" అని చెప్పుటచే ప్రసాదాతిశయము పరమేశ్వరుని నిత్యకర్తవ్యమని విదిత మగుచున్నది. "మహాదేశికస్య" అనుటవలన బ్రహ్మవిద్య నుపదేశించు గురుమూర్తి నధిష్ఠించి శ్రవణ మననాదులను సంపాదించుచు శివుఁడే మోచకుఁ డగువాడని తెలియుచున్నది.

ప్రశ్న : ఇట్లు పరమకారుణికుఁడు సర్వజ్ఞుఁడు సర్వశక్తిమంతుఁడు నగు పరమాత్మ అందరి నొకేమారు ముక్తుల నెందుకు చేయకుండును ?

ఉత్తరము : ఈ శంకను నిరసించుటకై "ప్రధ్వస్తపాశపటలా"అని చెప్పి యున్నవారు. పాశపటల మనగా ? పటలమువంటి పాశమగును.

వైద్యుఁడు మిక్కిలి దయగలవాడైనను పక్వభావమును కనుగొని నేత్రా వరణమును తీసివేయునట్లు పరమేశ్వరుఁడును జీవుల కర్మపరిపాకము ననుసరించి మలావరణములఁ బోగొట్టువాడు.

మలపాశ మనియు. మాయాపాశ మనియు, కర్మపాశ మనియు ఇవ్వాని సమూహము పాశపటల మనఁబడును. నైయాయికుల ముక్తివలె పాశపటలవినా శము స్వతఃప్రయోజనము కలది కాదు గావున "ప్రత్యక్షీభూత-" అను పదముచే ప్రయోజనము ప్రదర్శింపఁబడియెను. "తత్సమాన గుణసారా" అనుటవలన ముక్తి యందు బ్రహ్మానందానుభవము అను పరమపురుషార్థ సద్భావము సత్యసంకల్పాది బ్రహ్మగుణము లావిర్భవించుటయు విశదమగుచున్నవి.

ఇట్లు "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" సూత్రమువలన వేదాంతశాస్త్ర ప్రయోజన మును నిరూపించి సాధారణముగా తెలియునట్టి విశేషముగా తెలియనట్టి బ్రహ్మము జిజ్ఞాస్యమని వివరింపఁబడినది.

మరియు "అయమాత్మా బ్రహ్మ" అను వాక్యమే గాక "ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ" ఇత్యాది వాక్యంబులును బ్రహ్మ నిర్దేశముఁ జేయుచున్నందున బ్రహ్మ యెద్ది యను సందేహము సహజమగుటఁజేసి బ్రహ్మము జిజ్ఞాసావిషయంబగు చున్నది.

బ్రహ్మశబ్దమునకు గల అవయవశక్తిని విచారించుటచే బ్రహ్మము జీవ భిన్నంబనియు జీవుని పాశనివృత్తి బ్రహ్మానుగ్రహమునఁ గాదగుననియు విశదీ కరింపఁబడియెను.

ఎల్లకాలము తాపత్రయముతో బాధపడు జీవునకు బ్రహ్మత్వము గాని, నిర్దోషమంగళగుణాకరంబగు బ్రహ్మమునకు ఒకప్పుడు జీవత్వము గాని సంభ వింపఁజాలవు.

ఇట్లు బ్రహ్మము జీవభిన్నమని తెలియుచుండగా అట్టి బ్రహ్మము నారాయ ణుఁడా ? శివుఁడా ? అని సందేహము కలుగుట అనివార్యము గావున "జన్మాద్యస్య యతః" ఇత్యాది సూత్రములఁ జెప్పవలసివచ్చెను.

''జ్ఞానము-జ్ఞేయమును పరిచ్ఛిన్నముఁ జేయునదగుటఁజేసి అపరిచ్ఛిన్న మగు బ్రహ్మమును నిర్దేశింపఁజాలునది కా"దను శంక యవివేకపూర్ణమైనది.

"ఇది యిట్టి"దని బ్రహ్మపరిచ్ఛేదము పొసగకున్నను బ్రహ్మభిన్నములగు వస్తువులను నిరాకరించి చెప్పఁబడు లక్షణమువలన (పరిచ్ఛేదము) సంభవింప నగును. లక్షణముతో పరిచ్ఛేదమనగా లక్ష్యేతరములను నివర్తించుటవలన(కలుగు) లక్ష్యమును తెలిసికొనుట యగు గదా!

ఉద్దేశింపఁబడిన బ్రహ్మయొక్క లక్షణమును వేదాంత వాక్యములతో నిరూ పించి విమర్శింపగా అట్టి బ్రహ్మలక్షణము లేనట్టి బ్రహ్మసమానములు బ్రహ్మ భిన్నములు నగు సమస్త వస్తువులకంటె వేరైన స్వరూపము గలదియు బ్రహ్మంబని విశదమగును కావున బ్రహ్మఁగూర్చిన శాస్త్రమును ప్రారంభించుట సమంజసమగు చున్నది.

సందేహాస్పదము కానట్టి ప్రయోజనరహితమైన దానిఁగూర్చి బుద్ధిమంతులు విచారించువారు కారు. ఈ వేదాంతశాస్త్రమునకు బ్రహ్మము - ప్రమాణాభాసయుక్త్యా భాసములతో భాసించునదై సందేహింపఁబడునదగుటచే విషయంబగుచున్నది.

''బ్రహ్మవి దాప్నోతి పరమ్" "బ్రహ్మ నుపాసించువాడు పరమాత్మను పొందువాడు" "జ్ఞాత్వా శివం శాంతి మత్యంత మేతి" శివునిఁ గురుతెరిగి యత్యంత శాంతి యనఁబడు మోక్షమును పొందును" "ఈశం తం జ్ఞాత్వా హ్యమృతా భవంతి" "పరమేశ్వరుని తెలిసికొనినవారు ముక్తులగుచున్నవారు" "తమక్రతుం పశ్యతి

వీతశోకో ధాతుః ప్రసాదా న్మహిమాన మీశమ్" "శివానుగ్రహమువలన దుఃఖము లేనివాడై బంధరహితుఁడు గొప్ప మహిమగలవాడు నగు మహేశ్వరుని కనుగొనును'' "ఆత్మాన మరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్ - ధ్యాననిర్మథనాదేవ పాశం దహతి పండితః" "జీవాత్మను క్రిందియరణిగా ప్రణవము నుత్తరారణిగా గావించి ధ్యాన మనఁబడు మథనముఁజేయు విద్వాంసుఁడు పాశమువంటి సంసారమును దహించును'' "జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః" ''మహాదేవుని తెలిసికొనువాడు సర్వవిధపాశములనుండి విడిబడుచున్నవాడు" ఇత్యాది శ్రుతుల ననుసరించి జీవాత్మకు శివోపాసన వలన పాశములు విడిబడుట యనఁబడు మోక్షము ప్రయోజనంబగునని యీ మొదటి యధికరణమునందు ప్రతిపాదింపఁబడినది.

జీవభిన్నంబగు బ్రహ్మమును తెలిసికొనుటవలన ముక్తి యనఁబడు ప్రయోజనము నుపపాదించుటకు వలయు బ్రహ్మపరిచ్ఛిన్నత్వంబు, జీవుడే బ్రహ్మమనునెడ బ్రహ్మపరిచ్ఛిన్నత్వంబు నేర్పడుచున్నవి. జీవ బ్రహ్మైక్యవాదమున - పరిచ్ఛిన్న బ్రహ్మజ్ఞానమువలన నెట్టి ప్రయోజనము సంభవింపకుండును. పరిచ్ఛేదము రెండు విధములగునది.

కరతలామలకమువలె "ఇది యిట్టిదని" తెలియునది ప్రథమంబు, "ఇదమిత్థ" మని నిర్ణయము లేమిని ఇతర పదార్థములను నివర్తించి నిర్దేశించుట ద్వితీయంబు నగుచున్నవి ఇందు రెండవ పరిచ్ఛేదము - బ్రహయందేర్పడునది. సైన్యమధ్యమున రాజుఁ గనుగొనుటకు శ్వేతచ్ఛత్రమువలె వేదరాశియందు మంత్రములలో అర్థవాదములలోను ప్రసిద్ధమైన మహిమాతిశయము గల దేవతలలో జగత్కారణత్వము బ్రహ్మలక్షణముగా ఉపదేశింపఁ బడుచున్నది.

ప్రశ్న : పరిచ్ఛిన్న జ్ఞానముచేత బ్రహ్మప్రాప్తి యను ప్రయోజనము సిద్ధించునా ?

ఉత్తరము : బ్రహ్మమునకంటె వేరైన వస్తువులనుండి విలక్షణంబగుట యను పరిచ్ఛేదమునుమాత్ర మంగీకరించి యొక్కొక విద్యయందు నుపసంహరింపఁదగిన గుణములయొక్క పరిజ్ఞానముతో శ్రవణ మనన నిధిధ్యాసనములు ప్రవర్తించుచుండుటఁ జేసి బ్రహ్మసాక్షాత్కారమందు (ఇతర వ్యావృత్తత్వ మనఁబడు) పరిచ్ఛేదము సర్వథా అనివార్యంబగుచున్నది.

అపరిచ్ఛేదమును తెలుపు శ్రుతులు -

బ్రహ్మము మనోవాగతీతంబని విశదపఱచునవి; బ్రహ్మసాక్షాత్కారమగు నపుడు ఆవరణ రహితంబై సర్వతో ముఖమగు జ్ఞానముతో బ్రహ్మము పరిచ్ఛిన్న మగునంతమాత్రమున వస్తుతః బ్రహ్మమునకు గల యపరిచ్ఛేదము భంగపడునది కాదు.

ప్రాణిమాత్రము చూచుటకు నేత్రము సూర్యుఁడు నవసరమైనట్లు ముము క్షువు తనకై ప్రసరించు శివానుగ్రహమనఁబడు సూర్యకాంతిచే సుసిద్ధముగఁ జేయఁబడిన జ్ఞాననేత్రముతో శక్తివిశిష్టుఁడగు పరమేశ్వరు నవలోకించువాఁడు.

బ్రహ్మము జీవభిన్నమా ? అను సందేహము పొడముచున్నందువలననే ఈ శాస్త్రమునకు విషయము ప్రయోజనంబు నిరూపింప శక్యంబగుచున్నవి.

ప్రమాణాభాసములు :

నైయాయికులు చూపెట్టు అనుమానము మొదలగునవి. "మాయ భాసించు టతో జీవుఁడు ఈశ్వరుఁడును భాసించువారు. మాయావిద్యలు స్వయముగానే ప్రవ ర్తించునట్టివి" అనునవియు ;

యుక్త్యాభాసములు :

"యద్దృశ్యం తన్నశ్యం" "ఏద్ది కనఁబడు నది నశించునది" మొదలగునవి.

ప్రయోజనము :

అర్థప్రాప్తి, అనర్థ నివృత్తియని రెండు విధములగునది; ధ్యానము, శివాను గ్రహము, సాక్షాత్కారము అనునవి ముక్తి యనఁబడు ప్రయోజనమున కుపక రించునవి.

"బ్రహ్మవిదాప్నోతి పరం" అనుచో పరశబ్దమునకు నిరతిశయ బ్రహ్మా నందము ప్రయోజనంబని చెప్పఁగూడదు. పరమముక్తి - పరమేశ్వర సాయుజ్య రూపమగుటచే సాయుజ్యమనఁబడు అర్థప్రాప్తియు, "ఈశం తం జ్ఞాత్వా అమృతా

భవంతి'' ఇత్యాది శ్రుతివాక్యములు నిరూపించు జననమరణ రాహిత్యమనఁబడు అనర్థ నివృత్తియు ప్రతిపాదింపఁబడుచున్నవి.

ఈ సూత్రము కేవలాద్వైతులకు సంగతమగునది కాదు. ఎట్లనగా? బ్రహ్మము - ప్రత్యక్ష గ్రాహ్యమగు సన్మాత్రమగుటచే వేద్యము కానందున విషయము కాజాలదు. వాక్యజన్యజ్ఞానము సంసారబంధమును తొలగించునది కానిదగుటచే ప్రయోజనంబు సిద్ధింపకుండును. బంధనివృత్తి ద్వారా జ్ఞానసిద్ధితో మోక్షము సంభవించుట పరమప్రయోజన మగుగదా; వాక్యజన్య జ్ఞానము గల జీవాత్మలందరికి వసిష్ఠ పరాశర వ్యాసాదులకుఁబోలె నజ్ఞానము మున్ముందు నివర్తించుననిచెప్పునెడ శాస్త్రము నారంభించుట కవకాశమేర్పడకుండును. జ్ఞాతృజ్ఞేయభేదము అనివార్యమగుటచే సత్యమైన భేదజ్ఞానము ఏనాటికిని తొలగనిది కావున నవాంతర ప్రయోజనము గాని పరమ ప్రయోజనము గాని యద్వైతమునందు సిద్ధించునవి కావు.

మరియు నీ మతమున అధికారియు పొసగకుండును. జ్ఞాత - స్వవినాశము అపురుషార్థమగుటచే శ్రవణాదులందు ప్రవర్తించువాడు కాడు. సుఖప్రాప్తియు దుఃఖనివృత్తియు నగు పురుషార్థము 'అహం' పదమున కర్థము గదా! అట్టి పురుషార్థి యొక్క వినాశము పురుషార్థ మెట్లు కాజాలును? ఇట్లు విషయ ప్రయోజనములు అధికారియు సంగతములు కానందున ప్రకృతసూత్రము నిర్విశేషవాదులకు సంబద్ధము గాకున్నది

మరియు మధ్వరామానుజాదుల సిద్ధాంతమునందు నీ సూత్రముపయుక్తము కానిది; నిరుపపద (ఎద్దియు పైనలేనట్టి) బ్రహ్మశబ్దము శివునకు అసాధారణాభిధానమగుటచేత నితర దేవతలఁ జెప్పునది కాదు.

"ఏక మేవాద్వితీయంబ్రహ్మ" "ఏకఏవ రుద్రో న ద్వితీయాయతస్థుః" ఇత్యాది వాక్యములందు నిరుపపద బ్రహ్మశబ్దము, శివశబ్దంబును సమానార్థకంబులని విశదమగుచున్నది.

మరియు నీ మీమాంసాశాస్త్రకర్త వేదవ్యాస భగవానుఁడు - "యుధిష్ఠిరుఁడు ధర్మమయంబగు మహావృక్షము; అర్జునుఁడు మ్రాను; భీమసేనుడు శాఖలు; నకుల సహదేవులు- పుష్పఫలంబు"లని చెప్పి "మూలం కృష్ణో బ్రహ్మచ బ్రాహ్మణాశ్చ" అని నిరుపపదమైన బ్రహ్మశబ్దమును శివుని విషయమై ప్రయోగించెను.

"బ్రహ్మపదము - విష్ణువును బ్రాహ్మణజాతిని వేదమును తపస్సును చెప్పును'' గాన నిట శివవాచకంబగునని చెప్పుట యెట్లనగా ? కృష్ణశబ్దముతో విష్ణువు గ్రహింపఁబడి బ్రాహ్మణజాతియు వేరుగా చెప్పఁబడియెను. ఇట బ్రహ్మ శబ్దమునకు వేదంబనిగాని తపస్సనిగాని యర్థముఁ జెప్పుట కూడదు. వేదతపస్సు లచేతనములగుటచేత చేతనులగు కృష్ణబ్రాహ్మణుల మధ్య నుపపాదింపరాదు. ధర్మ రాజు మొదలుకొని కృష్ణునివరకు నుండు వారికంటె భిన్నుఁడగు శివుని యిట బ్రహ్మపదమున కర్థముగా చెప్పుట సమంజసమగుచున్నది.

ఇట్లు వేదాంతములు నిరూపించుటచేతను శ్రీ వేదవ్యాసుని మీమాంస మొదలగువానియందలి వ్యవహారమువలనను "బ్రహ్మజిజ్ఞాసా" గత బ్రహ్మశబ్దము శివునొకనినే తెలుపుచున్నందున - శివేతర దేవతాపరత్వముఁ జెప్పువారికి సూత్ర మసంగతంబగుననియే తెలియనగును.

ఇయ్యది
శ్రీ నీలకంఠ భగవత్పాదీయమగు బ్రహ్మసూత్ర భాష్యముఁదగు
"శివ చింతామణి ప్రభామయూఖము" అను ప్రథమాధ్యాయ ప్రథమపాదగత
ప్రథమ సూత్రాంధ్రీకరణము.

---

## ఏతద్గ్రంథమునకు యథాశక్తి సహకరించిన విజ్ఞానులు.

1. శివశ్రీ॥ రామగిరి సిద్ధప్రసాద్ గారు, వారాసిగుడ, సికింద్రాబాద్.
2. శివశ్రీ॥ చప్పి నాగలింగశర్మగారు, నాణీనగర్, మల్కాజిగిరి, హైదరాబాద్.
3. బ్రహ్మశ్రీ॥ బలిజేపల్లి వెంకట శ్రీరామచంద్రమూర్తిగారు, సిద్ధార్థనగర్, హైదరాబాద్.
4. శివశ్రీ॥ ముదిగొండ విద్యాధర్‌గారు, సరూర్‌నగర్, హైదరాబాద్.
5. శివశ్రీ॥ శివపురం స్వయంభువుగారు, హిందివీధి, గాంధీనగరం (మేడ పైన), విజయవాడ.
6. శివశ్రీ॥ ముదిగొండ మల్లికార్జునశర్మగారు, లచ్చుపేట, మెదకజిల్లా.
7. శివశ్రీ॥ చాగంటి రామలింగస్వామిగారు, నెహ్రూనగర్ కాలనీ, విశాఖపట్టణం.
8. ఆరాధ్య శ్రీమతి కొంపల్లి సుశీలమ్మగారు, సికిందరాబాద్.
9. శైవశ్రీ॥ కొత్తలంక శ్రీరామచంద్రమూర్తిగారు, శ్రీ శంకరప్రియగారి ద్వారా (విశ్రాంతోపాధ్యాయులు) శిల (గ్రామము)వయా- గొల్లపాలెం, తూ.గో.జిల్లా, 533 468.

శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య కృత

శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

ప్రథమాధ్యాయము

ప్రథమపాదము

ఆంధ్రీకరణము

# 2. జన్మాద్యస్య యతః

అస్య- ఈ ప్రపంచమునకు, యతః- ఎద్దానివలన, జన్మాది- ఉత్పత్తి స్థితి సంహార తిరోధాన అనుగ్రహంబులు నెరవేరుచున్నవో అద్ది బ్రహ్మంబని సూత్రార్థము. బ్రహ్మను నిర్దేశించు లక్షణముఁ జెప్పుటకు రెండవ సూత్రం అధికరణ మారంభింపఁబడియెను.

ప్రశ్న : లక్ష్యము తెలియుచుండగా లక్షణమును చెప్పుట నిరుపయోగమగుచున్నది. ఒకవేళ లక్ష్యము తెలియునది కానియెడల లక్షణముఁ గూర్చి యాకాంక్ష కలుగకుండు కావున నిట బ్రహ్మలక్షణముఁ జెప్ప ప్రసంగ మెట్లు పొసగును ?

ఉత్తరముః : వేదశాస్త్రముల నభ్యసించుటవలన బ్రహ్మము ఆపాతతః తెలియునదగుటచేతను పూర్తిగా తెలియనిదగుటవలనను బ్రహ్మ లక్షణముఁ జెప్పుట యుక్తంబగుచున్నది. జన్మాది- అస్య- యతః అని సూత్రపదచ్ఛేదము.

చేతనాచేతనములతో నిండియుండుటఁ జేసి సమరసంబగు ప్రపంచ విలాసముయొక్క ఉద్భవము, స్థితియు, సంహారము, తిరోభావము, అనుగ్రహము అను పంచకృత్యములఁ గావించునది బ్రహ్మంబగుచున్నయది.

''యతో వా ఇమాని భూతాని జాయంతే - యేన జాతాని జీవంతి, యత్ప్ర యంత్యభిసంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ ! తద్బ్రహ్మేతి"

"ప్రధానక్షేత్రజ్ఞపతి ర్గుణేశః సంసార మోక్ష స్థితి బంధ హేతుః"

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"

"ఋతం సత్యం పరంబ్రహ్మ - పురుషం కృష్ణపింగళం - ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమః"

ఇత్యాది శ్రుతివాక్యములు పైసూత్రమునకు విషయములు.

"ప్రాణులందరిని పుట్టించునదియు, బ్రతికించునదియు, తనయందు విశ్రాంతిని కలుగజేయునదియు బ్రహ్మంబని గుర్తెరుగుము!"

"సంసారమును విడిపించుటకు (మోక్షమునకు) సంసారమున బద్ధుఁగావించుటకును కారణమగు పరమాత్మ - గుణములకు ప్రకృతికిని జీవాత్మకు నధిపతిగ నుండువాడు."

"అపరిచ్ఛిన్నంబు, జ్ఞానగుణకము, సత్యరూపంబు నగునది బ్రహ్మంబగు చున్నది."

"పరమాత్మ - మనోవికారము వాగ్వికారంబు లేనివాడై పరిపూర్ణ స్వరూపము కలిగియుండు. మరియు కృష్ణ పింగళవర్ణములు గలవాడును విరూపాక్షుండును విశ్వరూపుండునగు. ఇట్టి పరమేశ్వరునకు నమస్కారము."

"బ్రహ్మవిదాప్నోతి పరం" ఇత్యాది వాక్యములను పఠించుటవలన బ్రహ్మము - స్వరూపగుణ మహిమలతో నిరతిశయప్రాభవముతోడ నొప్పునది కలదని ఆపాతతః తెలియుచుండుటఁజేసి యెద్ది యెట్టిదని శ్రుతులందు వెదకుచుండగా - మంత్రములు అర్థవాదములు మున్నగువాని యందు ప్రసిద్ధంబగు మహిమాతిశయము గలిగినట్టి బ్రహ్మ విష్ణు రుద్రాదులలో ఇద్ది బ్రహ్మంబని నిర్ధారణ గామిఁజేసి బ్రహ్మజిజ్ఞాస (బ్రహ్మఁగురుతెరుగుబుద్ధి) దృఢపడుచున్నయది.

"స్వయంవరమున రాజకుమారులనేకులాసీనులై యుండగా - ఆప్తులు వర్ణించిచెప్పిన స్వాభిమతగుణములుగల వరుని వరించు కన్యకవలె" యతో వా మొదలగు వాక్యములందలి లక్షణములు గల సాంబశివునందు ముముక్షువునకు బ్రహ్మబుద్ధి ప్రసరించుచున్నయది.

ఇట్టి బ్రహ్మబుద్ధి "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్'' మొదలగు వాక్యముల

వలన సందిగ్ధమగుచుండును కావున "శివుఁడే జగత్కారణమగు బ్రహ్మ'' మని దృఢపఱచు నుద్దేశముతో జన్మాద్యధికరణము నుల్లేఖించి యున్నారు.

1. జన్మ - ఉత్పత్తి ;

2. స్థితి - ఉదయమునుండి ప్రళయమువరకు ప్రపంచస్థితి ;

3. సంహారము - ప్రళయము ;

4. తిరోభావము - సమస్త సాంసారిక అనర్థములకు మూలమైన బంధమును నెలకొలిపి నిత్యసిద్ధమైన జ్ఞానక్రియాశక్తులు మొదలగు ఐశ్వర్యమును మఱుగుపఱచుట ;

5. అనుగ్రహము - మోక్షప్రదానము.

ప్రశ్న : అనుగ్రహమనునది పరమేశ్వరుని నిజధర్మము గావున నద్దానికి జగత్సంబంధ మెట్లు చెప్పనగును ?

ఉత్తరము : అనుగ్రహముతో లభించు బంధనివృత్తి సంసారులఁ జెందియుండున దగుటచే సృష్టిస్థితిలయతిరోధానములవలె ననుగ్రహంబు జగత్సంబంధము కలదని చెప్పఁబడియెను. మరియు సర్వజ్ఞుఁడగు పరమాత్మ జీవుల దుఃఖములను కనుగొని యొకేపర్యాయము విముక్తులఁగావింపగలిగినను సహజంబగు స్వకరుణ ప్రకాశించి భక్తులకు నిజసాక్షాత్కారోదయమగువరకు - ఆవరణముల ననువృత్తిసంకల్పము కలవాఁడగుటచే తిరోభావంబు పరమేశ్వరధర్మమే యగుచున్నది. ఘటాది స్థితికి మృత్తికాదుల స్థితి యావశ్యకంబగునట్లు జగదుపాదానకారణంబగు బ్రహ్మయొక్కస్థితి - ప్రపంచ స్థితికి కారణమగుటవలన స్థితియు బ్రహ్మధర్మంబగుచున్నయది.

జీవాత్మలు చేతనులనఁబడుదురు. పాషాణ వృక్షపర్ణాదు లచేతనములనఁబడును. శరీరములో శరీరి ప్రవేశించుటతో చేతనాచేతనముల మేళనము సంభవించునది ; ఇట్టి మేళనముతోడ నేకీభావమును పొందియుండు ప్రపంచము సమరసంబనఁబడుచున్నయది. ఏతాదృశప్రపంచము పరమేశ్వరునకు విలాసమువంటిది ; విచిత్రములైన అనంతంబులగు కార్యములతో నిండియుండు ప్రపంచమును పరమేశ్వరుఁ డొకడే నిర్మించువాడగుటచే ప్రపంచమునకు "అస్య" అని

ఏకవచనముఁజెప్పఁబడియెను. ప్రథమసూత్రగత బ్రహ్మపదముఁబట్టి ద్వితీయ సూత్రములోని "యతః" అను పదము ననుసరించిన "తత్" అను అధ్యాహారంబు నెరవేరుచున్నయది.

ఆత్మలకు ఆవిర్భావస్థానము, తనకుతానే జనకుఁడు నగు పరమాత్మ-క్షణాది కాలమును మృత్యుయమాదులను నియమించువాడై సత్యసంకల్పాది గుణములు కలిగి సర్వవిద్యాధిష్ఠాతయై ప్రకృతి పురుషులను నియోగించువాడై సత్త్వరజస్తమోగుణములను శాసించువాడుగ వర్ణింపఁబడుటచే పరమేశ్వరుని స్వరూప లక్షణమును ప్రదర్శించుటకై "సత్యం జ్ఞానం" "ఋతం సత్యం" అను శ్రుతి వాక్యములుదాహరింపఁబడియెను.

ప్రశ్న : ప్రపంచము యొక్క ఉత్పత్తిస్థితిలయములకు కారణమగుట బ్రహ్మలక్షణం బగునా కాదా యని సంశయము కలుగుచున్నది. ఎందుకనగా ? జగమునకు ఈశ్వరునకును సంబంధము లేనందున జగత్కారణత్వము బ్రహ్మ లక్షణము కాజాలదు. మరియు ''ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అనుచో ఆనంద మునకు జగజ్జన్మాదికారణత్వ లక్షణము సంగతమగునది. మరియొకచో "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్" అని సత్పదార్థము జగత్కారణముగ చెప్పఁబడియెను. ఒకచో "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ'' అని అపరిచ్ఛిన్నమగు జ్ఞానము బ్రహ్మం బని తెలియుచున్నది. అన్యత్ర "యదా తమ స్తన్నదివా నరాత్రి ర్నసన్న చాస చ్ఛివ ఏవ కేవలః" శివశబ్ద వాచ్యంబగునది జగత్కారణముగ చేతనాచేతన ప్రపంచమునకు ముందునుండు బ్రహ్మంబని విశదమగుచున్నది.

ఇట ఆనందము మొదలగువానిఁ గూర్చి చెప్పఁబడిన బ్రహ్మ భావమునకు వికల్పమా ? సముచ్చయమా ? వికల్పమనునెడ నొకదాని నాకర్షించి మరియొక దానిని వినవలెను గావున శ్రుతహాన్యాదిదోషములు సంభవించుటయు బ్రహ్మత్వ మునకు వ్యవస్థ లేకుండుటయు గమనార్హములు. వ్యవస్థిత వికల్పమును (ఒక దాని యనంతరము మరియొకటి యనునది) చెప్పనెడ బ్రహ్మలు అనేకంబులగు చున్నవి.

సముచ్చయము (అన్నియు కూడి) అని చెప్పనెడ-ఆనందము మొదలగు నవి బ్రహ్మధర్మములు గావున జగన్నిర్మాణమునకు వలయు నుపాయములను గురుతెరుగు మహిమాతిశయము గల బ్రహ్మము ఏర్పడకుండును.

ఇందువలన "మాయాం తు ప్రకృతిం విద్యాత్"అను శ్రుతి - అచేతనం బగు మాయ జగత్కారణంబని చెప్పుచుండుటచే నదియే సమంజసముగ తోచు చున్నది. జ్ఞానరూపంబగు బ్రహ్మము జగత్కారణంబని చెప్పునెడ "నిష్కళం నిష్క్రియం శాంతం" ఇత్యాది శ్రుతిభంగ ప్రసంగ మేర్పడుచుండుటఁజేసి సర్వ విధంబులను బ్రహ్మము జగత్కారణత్వాది లక్షణములుగలది యని చెప్పుటకు నశక్యముగనున్నది గదా ?

వికల్పము = ఇదిగాని అదిగాని యనునది ;

వ్యవస్థిత వికల్పము = ఒకటి కొంతకాలము, మరియొకటి కొంతకాలంబను వ్యవస్థ గలది :

సముచ్చయము = ఇదియు అదియు అన్నియు కూడి యనునది ;

**ఉత్తరము** : సృష్టి స్థితి లయాదులు వస్తుతః జగముఁజెందినవై బ్రహ్మ సంబంధము గలవి కాకున్నను జగజ్జన్మాది కారణత్వము,- తటస్థభావముతో బ్రహ్మ లక్షణముగ సంగతమగుచున్నయది.

ఎద్ది సర్వజ్ఞతాదివిశిష్టమై నామధేయాష్టక సన్నిహితంబగు శివతత్త్వమో అదియే జగత్కారణమగు బ్రహ్మంబని చెప్పఁబడుచున్నది.

ఆనందాది ధర్మములు బ్రహ్మమునందే పర్యవసానముఁ జెందునవి.

సర్వజ్ఞత, నిత్యతృప్తి, అనాదిబోధ, స్వతంత్రత, అలుప్తశక్తిమత్త్వము, అనంతశక్తిమత్త్వము - అనునవి బ్రహ్మమునకు సహజలక్షణములుగ పేర్కొనఁ బడుచున్నవి.

## 1. సర్వజ్ఞత ;

బాహ్యసాధనముల నపేక్షింపనట్టి నిష్కళంకానుభవమున సర్వవస్తువులు నిత్యప్రత్యక్షములగుచుండుట.

"యః సర్వజ్ఞః సర్వవిత్, యస్య జ్ఞానమయం తపః" ఇత్యాది శ్రుతులు బ్రహ్మము సర్వజ్ఞుఁడని ధ్రువపఱచుచున్నవి.

ఇట్లు బ్రహ్మము సర్వజ్ఞుఁడని చెప్పుటచే చేతనుల నానావిధకర్మఫలభోగమున కనుకూలములగు శరీరములను నిర్మించుటకు వలయు నుపాయంబగు సామగ్రీవిశేషమును గురుతెరుగు బ్రహ్మము జగన్నిమిత్త కారణంబగునని తేటపడుచున్నది.

## 2. నిత్యతృప్తత :

సర్వవిధబాధలఁజెందు కళంకము లేనట్టి నిరతిశయానందముతో పరిపూర్ణుడై యుండుట. ఇందువలననే "ఆనందో బ్రహ్మ" యని శ్రుతి ప్రతిపాదించినది. ''అన్యోఽంతర ఆత్మాఽఽనందమయః'' అని ప్రశంసించి ''సైషాఽఽనందస్య మీమాంసా భవతి'' అని యారంభించి యభ్యసించుటవలన నిరతిశయానందము ఉన్నతస్థానముగ కలవాడని ''స ఏకో బ్రహ్మణ ఆనందః" అని పరమాత్మ నిరూపింపఁబడియెను. బ్రహ్మము ఆనందపరిపూర్ణుఁడగుటఁజేసి యట్టి యానందమే బ్రహ్మంబని వర్ణింపఁబడుచున్నది. అట్టి యానందము ననుభవించు నైపుణ్యము గల బ్రహ్మము నిత్యతృప్తమనఁబడుచున్నది.

బ్రహ్మము మహానందము ననుభవించుట మనస్సుతోడనే యగును. అస్మదాదులవలె బాహ్యసాధనముల యవసరము బ్రహ్మానందానుభవమునకు లేకుండును.

"ఆకాశశరీరం బ్రహ్మ, సత్యాత్మ, ప్రాణారామం మనఆనందం శాంతిసమృద్ధ మమృతమ్''

"ఆ సమంతాత్ కాశత ఇత్యాకాశః" అను వ్యుత్పత్తి ననుసరించి అంతట వెలుగొందునది యగుటవలన ఆకాశ మనఁబడును. ఇట ఆకాశశబ్దవాచ్యము చిదంబరమగుటచే భూతాకాశము కానేరదు. ఎందుకనగా ? భూతాకాశమునందు ప్రకాశధర్మము లేకున్నయది. చిదంబర మనగా - సమస్తజగదండ సముదాయ మనఁబడు బుద్బుదసముదాయమునకు సముద్రమువంటిదియు, శ్రేష్ఠమైన ప్రకృతి స్వరూపము గలదియు పరమశక్తి యగును. ఇట్టి చిదంబరము శరీరముగా గల పరమాత్మ ఆకాశ శరీరంబగుచున్నది.

"సర్వాణి హ వా ఇమాని భూతాని ఆకాశాదేవ సముత్పద్యంతే ఆకాశం ప్రత్యస్తం యంతి। ఆకాశో హ వై నామ నామరూపయో ర్నిర్వహితా"

"ఈ ప్రాణులన్నియు ఆకాశమునుండియే పుట్టుచున్నవి. ఆకాశమును పొంది యస్తమించుచున్నవి. ఆకాశము ప్రపంచము యొక్క నామరూపముల నేర్పఱచునది" ఇత్యాది శ్రుతివాక్యములందు చిదంబరమునకు పరప్రకృతిత్వము (జగత్కారణత్వము) ప్రసిద్ధమైనది.

సత్యాత్మ యనగా - ఉనికి స్వరూపముగ గలది యగును.

ప్రాణారామం - సర్వాధారమగు చిదంబరశక్తియే ప్రాణమనఁబడును. స్వరూపంబగు నీ చిదంబరశక్తియందు సంతృప్తిఁబడయు బ్రహ్మము ప్రాణారామంబగునది.

బాహ్యసాధనములగు స్రక్ చందన వనితాదులందు గాక మనస్సునందే ఆనందము కలుగునది మన ఆనందమనఁబడును. ఇట ఆనందము చిదంబర ప్రకృతిగ చెప్పఁబడుచున్నయది. "కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనందో న స్యాత్" "ఈ చిదంబరరూపమగు ఆనందము లేనిచో ఎవఁడు జీవించును ? ఎవడు పెంపొందును ?" అను శ్రుతియు ఆనందము చిదంబరమగునని ప్రతిపాదించుచున్నది.

శాంతిసమృద్ధం - శివత్వముతోడ నిండియుండునది ;
అమృతం - అనాదికాలమునుండి ముక్తమై యుండునది ;

ఇఁట పరమాకాశమనఁబడు చిదంబరము స్వరూపముగ గల బ్రహ్మము - మనస్సుతోడనే స్వరూపమగు ఆనందము ననుభవించునట్టిదనియు, బాహ్యసాధనములందపేక్ష లేనిదనియు విశదమగుచున్నది.

"మన ఆనందం" అని చెప్పుటవలన బ్రహ్మభావమును పొందిన ముక్తులకు స్వరూపంబగు నిరతిశయానందము ననుభవించుటకు సాధనము అంతఃకరణము మాత్ర మగుననియు బాహ్యసాధనముల యవసరము లేదనియు తెలియుచున్నది.

కావున బాహ్యసాధననిరపేక్షంబగు శుద్ధజ్ఞానోచితసామర్థ్యముఁ గలిగి

యందు మనస్సుతో స్వరూపమైన అనంతానందము ననుభవించు బ్రహ్మము - నిత్యతృప్త మనఁబడుచున్నది.

## 3. అనాదిబోధత్వము :

సహజమైన నిరతిశయంబగు జ్ఞానము కలిగియుండుట - అనాదిబోధత్వమగుచున్నయది.

ఆనందానుభవసాధనంబగు అంతఃకరణముగ నుండు జ్ఞానము అనాదిసిద్ధమగుటఁజేసి సంసారదోషము ఎల్లకాలము లేనట్టి బ్రహ్మము - శాంతిసమృద్ధముగా నమృతంబుగాను వినఁబడుచున్నది.

## 4. స్వాతంత్ర్యము :

ఇతరుల యధికారమునకు లొంగుట బొత్తుగా లేక స్వేతరవస్తువులన్నియు స్వాధీనములైయుండుట - స్వాతంత్ర్యమనఁబడును.

"అజ్ఞుఁడగు జీవుఁడు పరతంత్రుఁడనియు, సర్వజ్ఞుడగు శివుఁడు స్వతంత్రుఁ" డనియు, "భోక్తయగు జీవుని, మరియు భోగ్యంబగు ప్రకృతిని ప్రేరేపించువాడు పరమాత్మ" యనియు "చేతనాచేతనములను శాసించు పరమాత్మ - చేతనాచేతనభిన్నుం"డనియు శ్రుతివాక్యములు - జడాజడ ప్రపంచమును ప్రవర్తింపఁజేయు బ్రహ్మమునకు స్వాతంత్ర్యమును సమర్థించుచున్నవి.

"జ్ఞాజ్ఞౌ ద్వావజా వీశానీశౌ"
"భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా"
"విద్యావిద్యే ఈశతే యస్తు సోఽన్యః"

ఇట్టి స్వాతంత్ర్యము సర్వవిషయములందు గల బ్రహ్మమునకు సర్వకర్తృత్వసిద్ధియు నేర్పడుచున్నది.

## 5. అలుప్తశక్తిమత్త్వము :

స్వాభావికంబగు శక్తి కలిగియుండుట - అలుప్తశక్తిమత్త్వమనఁబడును.

"పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే - స్వాభావికీ జ్ఞానబలక్రియాచ" శ్రు.

ఇట్లు చెప్పుటచేత చిదచిత్ప్రపంచరూపమైన శక్తితో కూడియుండుట - స్వాభావికంబగుననియు నిర్విశేషత్వము బ్రహ్మమునకు ఒకప్పుడు నుండజాల దనియు తెలియుచున్నది.

## 6. అనంత శక్తిమత్త్వము :

అపరిచ్ఛిన్నశక్తులతో కూడియుండుట - అనంతశక్తిమత్త్వ మనఁబడును. బ్రహ్మము - అనంతశక్తులతోడనే జగమును శాసించునదై జగజ్జనకంబగుచున్న యది.

"ఏక ఏవ రుద్రో న ద్వితీయాయ తస్థు స్తురీయ మిమం లోకమీశత ఈశనీయ ర్జననీయ ర్యః సర్వాన్ లోకా నీశత ఈశనీభి ర్జననీభిః పరమశక్తిభిః" శ్రుతి.

"సృష్టికి ముందు రుద్రశబ్ద వాచ్యుఁడగు పరమాత్మ యొకడే యుండెను. రెండవ వ్యక్తి లేకుండెను. నాలుగవదగు ఈ లోకమును శాసించువాడును పుట్టించువాడు నగు రుద్రుఁడు జననీశక్తులతోడను ఈశనీ శక్తులతోడను లోకముల నన్నిటిని శాసించువాడగును."

అనంతశక్తిమంతము గావున బ్రహ్మము - అపరిచ్ఛిన్న ప్రపంచమునకు ననువాయి కారణంబగును.

శ్రుతులందు చెప్పఁబడు జగత్కారణత్వమును గురించి విశేషాకాంక్ష యుదయింపగా - పంచకృత్యకారిత్వమును సమర్థించు సర్వజ్ఞతాదిషడంగములు శివునకు ప్రసిద్ధంబులనియు, భవాదినామధేయాష్టకము - జగజ్జన్మాదికారణత్వము నుపపాదించుననియు, శివశబ్దంబు జగత్కారణత్వార్థమును స్థిరపఱచుననియు గ్రహించునది.

"యదా తమః" అను మంత్రమునందు శివుని జగత్కారణత్వ ప్రాబల్య ముఁబట్టి సచ్చిదానందరూపత్వంబు శివునకే పొసగుచున్నదని "ఆనందాదీనాం" అను వాక్య ముపయుక్తంబయ్యెను.

ప్రాణులందరి కర్మోపాసనల ననుసరించి పక్షపాతము కఠినతయు లేకుండ ననాదికాలమునుండి ప్రవర్తించు సృష్ట్యాది పంచకృత్యముల కర్తృత్వము నందు సర్వజ్ఞత మొదలగు షడ్గుణములు ఉపయోగించుచున్నవి.

సృష్టి స్థితి లయ తిరోధానానుగ్రహపాత్రులగు వారి సమస్త విశేషములను అనాది సిద్ధజ్ఞానముతో నెల్లకాలము ప్రత్యక్షముగ గురుతెఱుగుచు తదనుకూల శక్తులతో ప్రపంచమునంతయు నధిష్ఠించుచు నిరతిశయానందముతో నిత్యతృప్తుడైయుండుకతన స్వతఃసిద్ధమైన యథార్థంబగు జ్ఞానము గలవాడగుటఁజేసియు భక్తులందనురాగము భక్తులు కానివారియందు ద్వేషము అను వ్యత్యాసము లేనివాడగు శివుఁడే పూర్వోక్తముగ సృష్టి స్థితి లయాది పంచకృత్యములఁ గావించుటకు సమర్థుఁడగుచున్నవాడు.

అలుప్తశక్తిమత్త్వము, అనంత శక్తిమత్త్వంబు - ఘటమునకు మృత్తికవలె బ్రహ్మము ప్రపంచమునకు ఉపాదానకారణంబగుటను సమర్థించునవి.

ఇట్లు భవాదినామధేయాష్టకమునందు శివశబ్దమునను పరమేశ్వరునకు జగజ్జన్మాది కారణత్వమును చూపుట భాష్యకర్తల యొక్క పరమోద్దేశంబైనది.

ఉప్పరాయి యందు మరియొక రసము బొత్తుగా లేనట్లు బ్రహ్మానందము-లేశమైనను దుఃఖసంబంధము లేనిదగుటచే నిరతిశయంబగుచున్నయది.

ప్రపంచమంతయు శరీరముగా గల పరమాత్మకు భూతాకాశము శరీరమని నిర్వచించుటలో విశేషము లేదు కావున చిదాకాశము స్వరూపముగ కలదని చెప్పుట సంగతమగునది.

చిచ్ఛక్తి - పరమేశ్వరునకు శరీరముగాను ఆనందముగాను ప్రాణముగాను చెప్పఁబడుచున్నందున ప్రపంచమునకు మూలకారణముగ నొప్పారుచున్నయది.

ముక్తపురుషులకు మనస్సు లేదనునెడ - సంకల్పసిద్ది యనునది సంభవింపకుండును గావున లింగశరీరము భంగపడుటయే మోక్షమని చెప్పు వాద మసంగతమని గుర్తెరుగునది.

పరబ్రహ్మము - భవ శర్వ ఈశాన పశుపతి రుద్ర ఉగ్ర భీమ మహాదేవ అను నామధేయాష్టకమునకు వాచ్యంబు అధికరణంబు నగునది; యద్యపి సకల శబ్దవాచ్యంబైనను పరత్వమును తెలుపునవగుటచే ముఖ్యములగు భవాది శబ్దము

లచే పరమాత్మ నిర్వచింపఁబడువాడు. ఇంత మాత్రమున నితర శబ్దములతో చెప్పఁబడడని గ్రహింపరాదు.

"ఇమా రుద్రాయ స్థిరధన్వనే గిరః"అను శ్రుతివాక్యము ననుసరించి శంభు శంకరాది నామదేయములన్నియు శివునిఁ బ్రతిపాదించునవియేను. "సర్వాణి హ వా ఏతస్య నామదేయాని" అని ఆశ్వలాయనుఁడును చెప్పియున్నవాడు.

కాని భవాది నామదేయములు - జగజ్జన్మాది కారణత్వలక్షణమును తెలుపునవి యగుటచేతను ఆపస్తంబీయ మంత్రసూత్రములందు ఈశానబలియందును బోధాయనాశ్వలాయనసూత్రములందును శూలగవహోమమునందును, మహాదేవ ప్రతిష్ఠా విధి యందును, నిత్యపూజావిధి యందును, హోమతర్పణాదులందును చెప్పఁబడి వినియోగము కలవి యగుటఁజేసియు ముఖ్యములగుచున్నవి.

## భవశబ్దార్ధము

"సర్వత్ర సదా భవతీతి భవశబ్దవాచ్యం బ్రహ్మ"

సర్వకాలములందంతట నుండునదగుటచే బ్రహ్మము భవశబ్దవాచ్యంబగునది; భూధాతువు సత్తార్థకమగుటవలన వస్తువుల నన్నిటి ననువర్తించు సద్రూపము బ్రహ్మంబని విశదమగుచున్నది.

"సదేవ సౌమ్యేదమగ్ర ఆసీ దేక మేవాద్వితీయమ్"

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"

"సత్యాత్మ ప్రాణారామం మనఆనందమ్"

"సన్మహః"

"ఓ సౌమ్యుడా ? పరిదృశ్యమానంబగు ప్రపంచము సృష్టికి పూర్వము సదాత్మకమై రెండవది (అసద్రూపము) లేనిదిగా ఏకరూపముగా నుండెను.

"బ్రహ్మము జ్ఞానపరిపూర్ణమైనదియు, అవధిలేనిదియు, సద్రూపంబు నగునది.

"సత్యస్వరూపము, ప్రాణమునందు క్రీడించునదియు, మనస్సు నానందము గలదియు బ్రహ్మంబగుచున్నయది."

"పురుషుఁడైన రుద్రుఁడు సద్రూపుఁడు తేజోమయుండును"

"సన్ ఘటః", "సన్ పటః" అని వస్తువుల నన్నిటి ననువర్తించు స్వభావము గల బ్రహ్మము జగమునకంతటికి నుపాదానకారణంబగుచున్నయది. మట్టితో నిండియుండు కుండ మున్నగువానికి మృత్తిక యుపాదానంబగు గదా !

ఇందువలన సద్రూపంబగు బ్రహ్మము భవశబ్దముతో నిర్వచింపఁబడుచున్నది.

భూధాతువునుండి అసధాతువునుండియు నిష్పన్నమైన భవశబ్దము సత్తార్థకంబగుటచే సచ్ఛబ్దమునకు పర్యాయంబగునది; "సదేవ" అను వాక్యమందలి సచ్ఛబ్దము - "పురుషో వై రుద్రః సన్మహః" అను వాక్యము ననుసరించి శివునందే పర్యవసానముఁ జెందునదగుటచే భవపదము సత్పదంబు నేకార్థకములగుచున్నవి.

### శర్వశబ్దార్థము :

"శౄ హింసాయాం" అను ధాత్వర్థము వలన శర్వశబ్దముతో బ్రహ్మము - సకలమును సంహరించునదిగ ప్రతిపాదింపఁబడుచున్నది

"తస్మా దుపసంహర్త్రే మహాగ్రాసాయ వై నమః"
"యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః"

"మహాగ్రాసము గల నిఖిలప్రపంచసంహారి యగు పరమాత్మకు నమస్కారము."

"బ్రాహ్మణక్షత్రియాదిజగము నాహారముగ గొనునది బ్రహ్మంబగుచున్నది.
ఇట్లు శ్రుతులందు బ్రహ్మము సర్వసంహర్తగ నిరూపింపఁబడుచున్నది.

ప్రశ్న : నిఖిలసంహారము తమోగుణకార్యమగుటచే బ్రహ్మలక్షణమగునా ?

ఉత్తరము : "సమస్తసాక్షిం తమసః పరస్తాత్" తమోఽతీతుఁడు స్వయంప్రకాశమానుండగు శంకరుఁడు - జీవుల విశ్రాంతికై స్థూలరూపములను విడదీయు సంహారకృత్యమును గావించుచు జీవుల ననుగ్రహించువాడు.

## ఈశాన శబ్దార్థము :

ఒకానొక ఆశ్రయము (ఉపాధి) లేనట్టి గొప్ప ఐశ్వర్యముతో కూడియుండు వాడగుటచే బ్రహ్మము ఈశానశబ్దవాచ్యంబగుచున్నది.

''య ఇమాన్ లోకా నీశత ఈశినీభిః'' శ్రుతి.

శాసించు శక్తులకు బ్రహ్మమునకు నవినాభావ (ఎడతెగని) సంబంధ ముండుటఁజేసి పరమాత్మయే లోకములను శాసించువాడని తెలియునది.

## పశుపతి శబ్దార్థము :

శాసించుటకు శాసింపఁబడువారు కావలయు గావున పరమేశ్వరుఁడు పశువులనఁబడు జీవాత్మలను నియమించువాడై పశుపతి యనఁబడగును.

"ఏషా మీశే పశుపతిః పశూనాం చతుష్పదా ముత చ ద్విపదామ్" శ్రుతి. నాలుగు పాదములు రెండు పదములు గల ప్రాణులను శాసించువాడు పశుపతి యగును.

పాశసంబంధమువలన పశుత్వము వ్యవహరింపఁబడుటచే పశువు పాశంబు గ్రహింపఁబడుచున్నవి. ఇట్లు చెప్పుటవలన చిదచిత్తులనఁబడు పశుపాశములను నియమించువాడు పరమాత్మయని విశదమైనది.

చేతనులపైన నచేతనములపైనను ఈశ్వరభావము (నియమించుట అథవా ప్రేరేపించుట) సమానమగుటచే చేతనాచేతనములు పశువులనంబడుచు పరమేశ్వరునకు పశుపతిలక్షణమును ద్రువపఱచుచున్నవి.

"బ్రహ్మాదులును సంసారవశవర్తులగుటచే దేవదేవుఁడగు శంకరునకు పశువులుగ చెప్పఁబడుదురు. అవ్వాని నియమించుటవలన శివుఁడు పశుపతి యనఁబడును" అని పురాణ ముద్ఘోషించుచున్నది. మరియు మలమాయాది పాశములతో జీవులను బంధించు పరమేశ్వరుని శక్తులు బాగుగా నుపాసించినయెడల నవ్వారి పాశబంధమును విడదీయువాడగును. పృథివ్యాది చతుర్వింశతి (ఇరువది నాలుగు) తత్త్వములు మాయాకర్మగుణంబులై జీవులను బంధించు పాశములగు

చున్నవి. మహేశ్వరుఁడు బ్రహ్మాదులను పాశములతో బంధించి స్వకార్యమును చేయించువాడు.

ఇఁట పశుశబ్దము గవాశ్వాదిపశువులను గాని ప్రమథగణములను గాని చెప్పునది కాదు. చేతనులందరినిఁ జెప్పునట్టిది. లోకమున గోవృషభాది పశువులను తనుగులతో బంధించి బండిలాగుట, భూమి దున్నుట మున్నగు పనులను గృహస్థులు చేయించునట్లు చేతనులందరును పాశబద్ధులై తమతమ యోగ్యత ననుసరించి శివారాధనకుపయోగించువారుగా నొనర్పఁబడుచున్నవారు. ఏవమాది సందర్భమువలన పశుశబ్దము జీవునియందు గౌణవృత్తిగ వ్యవహరింపఁబడియెనని విశదమగుచున్నది.

## రుద్రశబ్దార్థము :

సంసారదుఃఖమును పోగొట్టువాడు రుద్రుఁడనఁబఱగుచున్నవాడు. "తరతి శోక మాత్మవిత్" "పరమేశ్వరుని గురుతెఱుగువాడు దుఃఖమయమగు సంసార సముద్రమును దాటును".

## ఉగ్రశబ్దార్థము :

ఇతరుల సామర్థ్యములతో పరాభవింపఁబడునది కానిదగుటచే బ్రహ్మము ఉగ్రశబ్దవాచ్యంబగుచున్నయది. "న తత్ర సూర్యో భాతి న చంద్రతారకమ్" "సూర్యచంద్రనక్షత్రాది ప్రకాశములు బ్రహ్మపదమునందుపయోగము లేనివగుచున్న" వని శ్రుతియు వక్కాణించినది.

## భీమశబ్దార్థము :

చేతనాచేతనములను ప్రేరేపించువాడగుటను చేతనులందరిని భయపెట్టువాడగుటను పరమాత్మ భీమశబ్దముతో చెప్పఁబడువాడు. "భీషాఽస్మా ద్వాతః పవతే" ఇత్యాది శ్రుతియు-పరమేశ్వరునివలన భయపడి వాయువు వీచును అని నిరూపించుచున్నది.

## మహాదేవశబ్దార్థము :

శివుఁడు-గొప్పదనము గలిగి స్వయంప్రకాశమానుఁడగుటఁజేసి మహాదేవుఁడని చెప్పఁబడుచున్నవాడు.

"అథ కస్మా దుచ్యతే మహాదేవః? యః సర్వాన్ భావాన్ పరిత్యజ్యాత్మ జ్ఞానయోగైశ్వర్యే మహతి మహీయతే, తస్మా దుచ్యతే మహాదేవః"

(అథర్వశిరోపనిషత్).

"ఎందువలన మహాదేవుఁడని చెప్పఁబడును? ప్రకృతి సంబంధములైన రాగద్వేషాది భావములను విడనాడి శ్రేష్ఠమగు ఆత్మజ్ఞానము (నిజానందాస్వాదము) అనఁబడు యోగముఁజెందిన ఐశ్వర్యమునందు విరాజమానుండగుటవలన మహాదేవుఁడని చెప్పఁబడును.''

సర్వవిధములగు సంసారకళంకములు బొత్తుగా లేనట్టి సమస్తమంగళ గుణములకు ఆశ్రయ మైనట్టి శివతత్త్వము-శివాదిశబ్దములతో చెప్పఁబడిన లక్షణములు కలదగుటచే సర్వజగమునకు సృష్టిస్థిత్యాదికారణంబగుచున్నది. ఇట్టి మహిమ గల శివస్వరూపము జగమునకు ఉపాదానకారణంబు నిమిత్తకారణంబు నగుటఁజేసి బ్రహ్మంబని చెప్పఁబడుచున్నది. శివశబ్దవాచ్యంబగు బ్రహ్మమే ఆనందాదిధర్మములకు ఆశ్రయంబగునని యేర్పడుచున్నది. కావున ఆనందము మొదలగువానిఁ గూర్చిన వికల్పాదిచింత నిరర్థకంబగునది. "మాయాం తు ప్రకృతిం విద్యాత్" మహేశ్వరుఁడు మాయ నధిష్ఠించియుండువాడగుటచే పరమేశ్వరు నాశ్రయించినట్టి మాయకే ప్రకృతిత్వము (జగత్కారణత్వము) కలదని విశదమగుచున్నది.

సూక్ష్మ చిదచిత్తులతో కూడియుండు బ్రహ్మము కారణంబనియు, స్థూలచిదచిత్తులతో కూడియుండు బ్రహ్మము కార్యం బనియు ఏర్పడుటచే బ్రహ్మము జగజ్జన్మాదిస్వరూపము గలదగుచున్నదని సిద్ధాంతము.

శివశబ్దనిష్పత్తి : శమిధాతువునకు వన్ ప్రత్యయము రాగా శమివన్ అగు. వ్యాకరణశాస్త్ర నియమము ననుసరించి అమ్, న్, ఈ రెండు లోపించినందున శమి అనుదానిలో శ్ ఇ, వన్ అనుదానిలో వకారంబు నిలచినవి. ఇట్లు శివశబ్దము నిష్పన్న మైనది.

దోషములు లేనివాఁడు గుణములు గలవాడు నని అచ్ ప్రత్యయాంతమగు శివశబ్దము చెప్పుచున్నది.

జగమును హెచ్చుతగ్గులు కలదానిగా సృష్టించుటయు అద్దాని తారతమ్యమునకు వలయు పక్షపాతము లేకుండుటయు జగమునకు ఉపాదానంబు నిమిత్తంబు నగుటయు పరస్పర విరుద్ధంబులైనను సర్వసమర్థుండగు శివునకు చెల్లుచున్నవి.

ప్రశ్న : "యదా తమః" అను మంత్రమందలి యంశము సుబాలోపనిషద్గత వాక్యమునందును వర్ణింపబడుటఁజేసి యిందలి శివశబ్దము నారాయణ పరంబగును గాదా ?

ఉత్తరము: "సర్వాణి హ వా ఏతస్య నామధేయాని" నామధేయములన్నియు శంకరునివే యని ఆశ్వలాయనుఁడు చెప్పియున్నవాడు. మరియు హరివంశమునందు "గోవిందా ! ప్రపంచమున నిన్నుఁ జెందియుండు గొప్ప యభిధానములన్నియు నన్ను బోధించు"నని శివుఁడు కృష్ణమూర్తికి చెప్పినట్లు కలదు. కావున సుబాలోపనిషద్గతమైన నారాయణ శబ్దము శివపరంబగును కాని "యదాతమః" అను మంత్రమందలి శివశబ్దమునకు నారాయణార్థమును చెప్పుట సమంజసము కాదు.

కూర్మ పురాణమునందు - చేతనాచేతన ప్రపంచమును స్వాధీనపఱచుకొనువాడగుట వలన ఈశ్వరుఁడనియు; సర్వగతుండగుట వలన ఋషియనియు; దేవతా గణముల నన్నిటితో కూడియుండువాడగుటచే హరియనియు; అన్నిటికిని మొదటివారగుట వలన స్వయంభువనియు; ఉదకముల నాశ్రయించి యుండువాడగుటఁ జేసి నారాయణుఁడనియు; సంసార బంధమును తొలగించును కావున హరుఁడనియు; జగమునంతటను వ్యాపించువాడగుటచే విష్ణువనియు; నిఖిలమును గురుతెరగువాడగుట వలన భగవంతుఁడనియు సర్వజ్ఞుఁడనియు; సర్వవిధరూపములు గలవాడగుటచే సర్వుఁడనియు; రక్షించువాడగుటచే "ఓమ్" అనియు మలత్రయరహితుండగుటఁజేసి శివుఁడనియు; పరమాత్మ నిర్వచింపఁబడునని ప్రతిపాదింపఁబడియున్నది.

ఇందువలన నారాయణ శబ్దము శివుని సాక్షాద్బోధించునదని విశదమైనది. మరియు "స్థావర జంగమములన్నియు నశించి యొకే సముద్రముగ నున్నపుడు

వేయి తలలు, వేయి కన్నులు, వేయి కాళ్ళను కలిగిన బంగరువన్నె దేహముతో కూడిన పురుషుఁడు అతీంద్రియ స్వరూపముతో జలమందు శయనించియుండగా" నారాయణుఁడని పేరుఁగాంచెను. జగమును సృజించుటకు లయమొందించుటకును సమర్థుఁడగు పరమాత్మ చతుర్ముఖ బ్రహ్మయై నీటిని నిద్రించుకతన నారాయణుఁ డయ్యెను.

ఇట్లు కూర్మపురాణము చెప్పుట వలన నారాయణపదము బ్రహ్మనామ ధేయంబగుచున్నది. కారణవాక్యములన్నియు శివునియందు పర్యవసానముఁజెందుటను తెలుపు "యదా తమః"అను మంత్రము అనుగ్రాహ్య ప్రమాణముగ నొప్పారుచున్నది.

"సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్" ఏతాదృశములు కారణవాక్యములనఁబఱగుచున్నవి.

బ్రహ్మంబెట్టిదని పూర్వము ఋషులకు సందేహము కలుగగా వారు ధ్యానయోగముచే శివానుగ్రహముఁ బడసి "శివుఁడే బ్రహ్మం"బని నిర్ధారించుకొనిరి గావున క్షుల్లకబుద్ధితో కల్పింపబడు న్యాయములతో శివేతర దేవతలకు బ్రహ్మత్వము నిరూపింప శక్యము కానట్టిది.

సత్తు ఆనందము జ్ఞానము అనునవి వికల్పముగానో, సముచ్చయముగానో జగత్కారణములగుట పొసగనందునను పరమేశ్వరునితో వేరుగ నుండజాలని మాయయే జగదుపాదానమగుటను మాయావినాభావి పరమాత్మయే జగత్కారణ మగుచున్నవాడు.

బ్రహ్మము నాశ్రయించు మాయ- ఆకాశాద్యచేతన రూపముగ పరిణమించునది; బ్రహ్మమును జీవుల నాశ్రయించు చిచ్ఛక్తి - జ్ఞానరూపముగ పరిణమించునది.

ఇట్టితరి బ్రహ్మముఁదగు పరిణామంబెట్టిదనునెడ- మాయకుగాని చిచ్ఛక్తికిగాని బ్రహ్మము-ఆశ్రయపర్యవసాన భూమి యగుటచే బ్రహ్మ వరకు జగదుపాదా కారణత్వము చేకూరుచున్నది.

ఘటాశ్రయమగు మృత్తిక - పిండావస్థయందు కారణముగాను ఘటావస్థయందు కార్యముగా నగునట్లు - పరమేశ్వరుఁడు సూక్ష్మచేతనా చేతన విశిష్టదశ

యందు కారణమగుచున్నవాడు. స్థూలచేతనాచేతన విశిష్ట దశయందు కార్యంబు నగుచున్నవాడు.

ఇట్టి జగత్కారణత్వము - బ్రహ్మమునకు తటస్థ లక్షణముగాను, సర్వజ్ఞ తాది గుణములు కలిగి విరూపాక్షత్వాది విశేషములతో కూడి యుండుట- స్వరూప లక్షణముగాను విశదీకరింపఁబడుచున్నవి.

ఇయ్యది శ్రీ నీలకంఠ భగవత్పాదకృత శారీరక బ్రహ్మమీమాంసా
సూత్రభాష్యమున ప్రథమాధ్యాయ ప్రథమపాదగత
ద్వితీయసూత్రాంధ్రీకరణము.

---

ఏతద్గ్రంథ ముద్రణార్థము ఆర్థికసహకారమును యథా మతి
అందజేసిన సహృదయులు.

10. శివశ్రీ॥ అన్నదేవర సుబ్బారావుగారి సత్ప్రేరణతో
   1. శ్రీ డి. నారాయణరావుగారు, విజయవాడ.
   2. శ్రీ డి. రామకోటయ్యగారు, విజయవాడ.
11. శివశ్రీ॥ కీ.శే. ముదిగొండ గోపాలరావుగారు,
    శ్రీమతి- భార్య అనసూయమ్మద్వారా, పెదపాడు (మండలం),
    దామరాజువారి వీధి, వయా=ఏలూరు, ప గో.జిల్లా, 534 437.
12. శివశ్రీ॥ బండారు చంద్రమౌళీశ్వరరావుగారు, అడ్వొకేట్,వరంగల్.
13. శివశ్రీ॥ కొడిమేల నాగమల్లికార్జునశర్మగారు, గురుపీఠం, ,,
14. శివశ్రీ॥ డా. అత్తలూరు మృత్యుంజయశర్మగారు, (ఆత్మీయులు) ,,
15. శివశ్రీ॥ కీ.శే. ముదిగొండ శంకరశాస్త్రిగారి స్మృత్యర్థము
    శ్రీ డా.ఎమ్. వీరేశలింగం పూర్ణానందంగారలు (సోదరులు)వరంగల్
16. శివశ్రీ॥ ముదిగొండ వీరభద్రసేనానిగారు, వరంగల్.
17. శివశ్రీ॥ డాక్టర్ వీరభద్రం గారు, ,,

శ్రీ నీలకంఠారాధ్యకృత

శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యమున

ప్రథమాధ్యాయగత

ప్రథమ పాదమందలి

మూడవ సూత్రము.

## 3. "శాస్త్రయోనిత్వాత్"

లక్షణముఁబట్టి ప్రమాణము ననుసరించియు వస్తువు సిద్ధించునదగుటఁజేసి జగత్కారణంబగు బ్రహ్మము ఎట్టి ప్రమాణము గలది ? అను ఆశంకకు సమాధానముగ తృతీయ సూత్రము నవతరింపఁజేసినవారు.

సూత్రార్థము- శాస్త్రము - యోని = ప్రమాణముగ గలదగుటచే బ్రహ్మము జగజ్జన్మస్థితిలయములకు కారణ మగునది;

సందేహము - జగత్కారణమగు బ్రహ్మము శాస్త్ర మొకదానితోడనే తెలియునదా ? మరియొక ప్రమాణముతో విశద మగునదా ?

ప్రశ్న : "ఈ జగత్తు అవయవములతో కూడిన కార్యమేను, విచిత్రభావము గల జగము- తగు కర్తఁజెందియుండును" అను అనుమానముతో సర్వజ్ఞత్వాది గుణములు గల యొకానొక పురుషుడు జగత్కర్తగ కల్పింపఁ దగినవాడు. ఇట్టి జగత్కర్త- శాస్త్రైకగమ్యుడు కానందున శాస్త్రమునకు బ్రహ్మవిషయమై ప్రామాణ్యము గానరాదు. శాస్త్రమే ప్రమాణ మగునెడ ననుమానాది ప్రమాణాంతరములకు నవకాశ ముండకూడదు గదా ?

ఉత్తరము : జగత్కారణంబగు బ్రహ్మము - వేదాంతశాస్త్రము వలననే తెలియునట్టిది;

"నావేదవిన్మనుతే తం బృహంతం" "వేదములను వేదాంతములను గురుతెరగనివాడు గొప్పవాడగు పరమాత్మను భావింపఁజాలడు" ఇత్యాది వాక్యములందు వేదాంతవిజ్ఞానము లేనిది బ్రహ్మజ్ఞానము సంభవింపదని చెప్పఁబడియున్నది.

"జన్మాద్యస్య యతః" అను సూత్రముతో బ్రహ్మలక్షణమును నిరూపించి తాదృశబ్రహ్మలక్షణమునకు ప్రమాణము వేదాంతశాస్త్రంబని "శాస్త్రయోనిత్వాత్" అను సూత్రముతో తెలుపఁబడియెను.

ముముక్షువులు భావింపఁదగిన విశేషణములన్నిటితో కూడియుండు బ్రహ్మమును గురుతెఱుగుట - శాస్త్రభిన్నప్రమాణములతో కాజాలనట్టిది; మరియు నీవు చెప్పిన అనుమానము సమంజసము కానట్టిది;అనుమానముతోడనే జగత్కర్త సాధింపఁబడునెడ - నానావిధ నిర్మాణములు గల గోపుర ప్రాసాదాదులకు పెక్కురు కర్తలుందురనునది ప్రత్యక్షవిషయము గావున కర్తయొకడే యని సిద్ధింపకుండును. మరియు "కర్తయగువాడు కర్మపరవశుఁడగు" నను వ్యాప్తిఁదగు బలము వలన పరమేశ్వరుఁడును కర్మపరవశుడు కావలసివచ్చును. పక్షమైన జగము యొక్క ధర్మంబగు సకర్తృకత్వము వలన నొకానొక విలక్షణుఁడైన జగత్కర్త యుండునని యేర్పడుచున్నను నిమిత్తంబు నుపాదానంబు నగు సామర్థ్యముతో కూడిన కర్తయుండునని సిద్ధింపదు గావున బ్రహ్మము అనుమాన ప్రమాణముతో సాధ్యము గానిదై వేదాంతశాస్త్ర మొకదానితోడనే తెలియఁబడునదియు వేదాంతశాస్త్రమే ప్రమాణముగా కలదియు నగుచున్నది.

భూ వృక్ష సముద్రాది నానావిధ ప్రపంచము నిర్మింపఁబడుటకు వలయు కర్తృత్వమునకై అనుమానాది ప్రమాణములు ఉపయోగించునవి కావు. దేవాలయాదులు ననేకులచే క్రమముగ కట్టబడుచున్నందున నేక కర్తృకత్వము సిద్ధింపదు గదా !

వేదాంత ప్రతిపాదిత లక్షణములన్నిటిని బ్రహ్మమునకు సమర్థించుటకై కేవల తర్కరీతిని విడనాడి వేదాంతములనే తప్పక నంగీకరింపవలసి వచ్చును.

పూర్వాధికరణమునందు చెప్పఁబడిన జగత్కారణత్వమునకు వలయు సర్వజ్ఞత్వము "శాస్త్రయోనిత్వాత్" అను సూత్రముతో సిద్ధింపఁజేయఁబడుచున్నదని కొందరి యభిప్రాయము.

సూత్రము సూచనాత్మకమగుటచే ననేకార్థములు కలిగియుండు ననుటలో-శ్లేషకావ్యమందు వలె వాక్యభేదాది దోషములు సంభవింపవు గావున మరియొక యధికరణము ప్రస్తావింపబడుచున్నది.

"అస్య మహతో భూతస్య నిశ్వసిత మేత ద్యదృగ్వేదో యజుర్వేదః సామ వేదః" ఇత్యాది శ్రుతివాక్యములు విషయములగుచున్నవి.

సందేహము— బ్రహ్మము వేదములకు కర్తయగునా కాదా ?

ప్రశ్న : "వాచా విరూప నిత్యయా" అను ప్రమాణము ననుసరించి నానా రూపములు కలిగియుండు నిత్యమైన వాక్కునకు బ్రహ్మము కర్తయగుచో వేదము లనిత్యములు కావలసివచ్చును. మరియు వేదములు బ్రహ్మకార్యములగునెడ-పౌరుషేయములగుటచేసి యప్రమాణములగును. పురుషుడు వేదములను నిర్మించువాడని చెప్పుట వలన భ్రమ ప్రమాదముల వశమున లోపముగలవి యగును. బుద్ధమూర్తియు సర్వజ్ఞుడని బౌద్ధులు చెప్పినట్లు భగవంతుడు సర్వజ్ఞుడని చెప్పుట ప్రశంసామాత్రమగును. వేదములు నిత్యములగునెడ ఈశ్వర కర్తృకములు కాగూడదు. వేదకర్తృత్వమూలముగా పరమేశ్వరునకు సర్వజ్ఞతయు పొసగ జాలదు.

ఉత్తరము : బ్రహ్మకు వేదకర్తృత్వము విహితమేను; "వేదరాశి పరమాత్మ నుండి నిట్టూర్పువలె నప్రయత్నముగా నావిర్భవించినది" అని శ్రుతి ప్రమాణము చాటుచున్నది.

అష్టాదశానా మేతాసాం విద్యానాం భిన్నవర్త్మనామ్,
ఆదికర్తా కవిః సాక్షాత్ శూలపాణి రితి శ్రుతిః.

నాలుగు వేదములు; శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అను ఆరు వేదాంగములు; పురాణము, న్యాయశాస్త్రము, మీమాంస, ధర్మశాస్త్రము అను నాలుగు; ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వము, అర్థశాస్త్రము అనబడు నుపవేదములును కూడి పదునెనిమిది విద్యలగుచున్నవి. వేరు వేరు నంశములను పురస్కరించుకొని ప్రవర్తించిన నీ విద్యలకు శూలపాణి యగు పరమేశ్వరుడు ఆదికర్త యగుటచే కవి యని చెప్పబడువాడు.

సృష్టికి పూర్వము తనలో దాగియున్న వేదములకు - పూర్వ పూర్వాక్షర క్రమము ననుసరించు రచనతో ననంతరమును సర్వజ్ఞుఁడైన పరమేశ్వరుఁడు కర్త యగుచున్నవాడు. ఇందువలననే వేదములు సాధారణ పురుష విరచితములు గానందున నపౌరుషేయములగుటయు ఈశ్వరకార్యములగుటయు విశదమగు చున్నవి.

రాగద్వేషములు గలవారి వాక్యము ఒకప్పుడు ప్రమాణము గాకుండును కాని సమస్తదోష కళంకము లేనివాడు సర్వాధికంబగు నిర్వికార జ్ఞానమున భూత భవిష్యద్వర్తమాన వస్తువులను ప్రత్యక్షముగ ననుభవించు విలాసము గలవాడును స్వతఃప్రమాణమగువాడును ఆప్తులలో ముఖ్యుఁడును, సకలకామములను పొందిన వాడును, పరమేశ్వరుఁడును అగు శివునియొక్క వచనము ప్రమాణమగునట్టిదియేను.

"ఈశానః సర్వవిద్యానా మీశ్వరః సర్వభూతానామ్"

"స నో దేవః శుభయా స్మృత్యా సంయునక్తు"

అను శ్రుతివాక్యములు - సకలవిద్యా ప్రవర్తకత్వమును శుభస్మృతి కారణత్వ మును పరమేశ్వరునకు నిరూపించుచున్నవి. ఇందువలన సమస్త వస్తువులను ప్రకా శింపఁజేయు వేదములకు కర్తయగుటఁజేసి పరమేశ్వరుడు సర్వజ్ఞుఁడగుచున్న వాడు.

తెలియనిది చెప్ప నశక్యము గదా! పరమేశ్వరుఁడు సర్వవ్యాపకుఁడగుటచే వస్తువులనన్నిటిఁ జెందియుండు గావున సర్వజ్ఞుడగుట సిద్ధించుచున్నను సర్వవస్తు వులను ప్రకాశింపఁజేయు వేదముల నావిర్భవింపఁ జేయుటవలనఁ గూడ సర్వజ్ఞత విశేషముగ సమర్థింపఁబడుచున్నది.

"వస్తువుల రూపమును మాత్రమే తెలుపు దీపమువలె" కానివాడై తన శక్తు లతో కూడిన ప్రపంచమునంతయు నొకే పర్యాయము పరమేశ్వరుఁడు విశదపఱు చువాడు. జ్ఞానముఁ గలుగఁజేయు పదునెనిమిది విద్యలలో ముఖ్యములగు వేద ములు- కర్మోపాసనల ద్వారా సాక్షాత్తుగాను పరమేశ్వరుని నిరూపించునట్టివి.

శిక్ష, వ్యాకరణము, నిరుక్తంబు వేదస్వరముల నిర్ణయించుటకు వర్ణముల యొక్కయు. పదములయొక్కయు అర్థములను నిర్ధారించుటకు నుపయోగించునవి. కల్పము- వేదోక్త కర్మానుష్ఠానమును విధించునది; ఛందస్సు - కర్మాంగములైన

మంత్రములయొక్క ఛందస్సులను తెలుపునది; జ్యోతిషము - కర్మాంగ సమయ విశేషమును నిర్ణయించునది; పురాణములు - సృష్ట్యాదివిషయములను పరమేశ్వరుని మహావిభూతిని విశదీకరించునవి. న్యాయశాస్త్రము- వేదాంత తాత్పర్యమును నిర్ణయించుటకు షడ్విధ లింగములలో నుపపత్తి యనఁబడు అనుమానమును, అనుమాన పరికరములను శోధించునట్టిది; మీమాంస- వేదార్థనిర్ణయమున కనుకూలించు న్యాయములను తెలుపునది; ధర్మశాస్త్రము - వర్ణాశ్రమ సాధారణ ధర్మములను ప్రతిపాదించునది; ఆయుర్వేదము- కర్మాచరణ సాధనంబగు దేహపాటవమునకు ఉపయోగించునది; ధనుర్వేదము - రాజ్యమున కవసరములగు అస్త్రశస్త్రముల సముదాయమును కనుగొనునది; గాంధర్వము - దేవతలను సంతసింపఁజేయు సంగీతముల పరిజ్ఞానముఁ గలిగించునది, అర్థశాస్త్రము- ప్రత్యక్షములు నప్రత్యక్షములు నగు ధనసంపాదనోపాయములఁ దెలుపునది; ఇతిహాసములు పురాణములలో చేరును. వైదికదేవతారాధన విశేషములను బోధించు శివాగమములు - ధర్మశాస్త్రమనఁబఱగుచున్నవి.

పరమేశ్వరుఁడు - సృష్ట్యాదియందు నష్టాదశ విద్యాస్థానములకు మొదటి కర్తయై సాక్షాత్కవి యగుచున్నవాడు. ఒకానొక అర్థవిశేషమును పురస్కరించుకొని శ్లోకాదికమును రచించు అధ్యాపకునివలెఁగాక "తదేవ బ్రహ్మ పరమం కవీనాం," "కవిం కవీనా ముపమశ్రవ స్తమం'',"ఉదీరయం కవితమం కవీనాం"ఇత్యాది శ్రుతివాక్యములచే ఆదికవిగాను, మహాకవిగాను పేర్కొనఁబడుచున్నవాడు.

కవిశబ్దము- సర్వజ్ఞుడైన పరమేశ్వరుఁడు సర్వజీవుల ననుగ్రహించు నుద్దేశముతో తనలో దాగియుండు వేదములను వేదోక్తములైన కర్మోపాసనల నాచరించి జీవులు కృతార్థులు కావలెనని సృష్ట్యాదియందు రచించువాడని-విశదపఱచునది. అక్షరజ్ఞానము మాత్రము గలవాడు రచయిత యగునా ? సమస్తవేదార్థమును మనస్సునందిడుకొని తన నిట్టూర్పుగ వేదములను బయలుపఱచు పరమేశ్వరుఁడు దక్క నన్యుడు వేదరచయిత కాజాలడు.

ప్రశ్న : అర్థమును పురస్కరించుకొని వేదముల నావిష్కరించుట పౌరుషేయమగుటఁజేసి వేదనిత్యత్వము భంగపడును గదా ?

ఉత్తరము : వేదాక్షరములు పదములు వాక్యములు ప్రకరణంబులు నవ్వాని యర్థంబులును పూర్వాపూర్వములగుటచేత ననాదిసిద్ధంబులగుచున్నవి. ఇందు

పురుషబుద్ధి కల్పితంబగు వ్యత్యాసము ఉండజాలదు. "ఈ వాక్యమునుండి యీ యర్థము స్ఫురించుగాత"యని యుద్దేశించి మాత్రము వేదములను రచించుటయు, తన్మూలముగా సర్వజ్ఞతయు సంగతములగుచున్నవి.

"ఛందాంసి యజ్ఞాః క్రతవో వ్రతాని-భూతం భవ్యం యచ్చ వేదా వదంతి, అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్" ఛందస్సులు యజ్ఞములు క్రతువులు వ్రతంబులును ఐనది కానున్నదియు ఇత్యాదిని వేదములు తెలుపు ప్రపంచమునంతయు మాయావిశిష్టుఁడగు మహేశ్వరుఁడు సృజించుచున్నవాడు.

ఇత్యాది ప్రమాణములవలన వేదము పురుషబుద్ధికృతంబనుటయు వేదార్థము ననుసంధానముఁ జేయునట్టి ఒకానొక మహాపురుషుఁడు లేడనుటయు సమంజసములు కాజాలవు.

పరమేశ్వరుఁడు భ్రమలేనివాడని నిరుపప్లవ పదము తెలుపునది :

"స్వతః ప్రమాణస్య" అను పదము ప్రమాదము లేనివాడని విశదపఱచునది :

"పరమాప్తస్య" అను పదము విషమత్వము లేనివాడని స్పష్టపఱచునది;

ప్రశ్న : పరమేశ్వరుని సర్వజ్ఞత యనగా వేదోక్తములైన వస్తువులనన్నిటిని తెలిసికొనుట యగుగదా ! మహర్షులును వేదార్థమును గురుతెఱిగినవారగుటఁ జేసి సర్వజ్ఞులు కాదగినవారు. కావున పరమేశ్వరునకు, మహర్షులకును భేదమెట్టిది?

ఉత్తరము : వేదములను రచించు పరమేశ్వరునకు వేదాతీతజ్ఞానముండవలయును. వ్యాకరణాది శాస్త్రములను రచించు పాణిని మొదలగువారు, వ్యాకరణాది శాస్త్రములకంటె నధిక పరిజ్ఞానము కలవారు.

వేదము- సర్వార్థములను తెలుపునది. ఐనను కొంత లక్షణతోడను, కొంత సామాన్యముగాను, కొంత విశేషముగాను సమస్తమును నిరూపించును.

పరమేశ్వరుఁ డట్లుగాక సమస్తసాక్షియై సర్వమును గోచరింపఁ జేయువాఁడగుటచే వేదమునకు ఈశ్వరునకును వ్యత్యాసమును గాననగును.

వేదము పరమేశ్వరుని వాణియైనను పరమేశ్వరునివలె సర్వవస్తువులఁ జెందియుండు లక్షణముల నొకే పర్యాయము తెలుపునది కాదు. మహర్షులు వేద

సంపూర్ణ పరిజ్ఞానము కలవారు కానందున మహర్షుల సర్వజ్ఞతకు పరమేశ్వరుని సర్వజ్ఞతకును గొప్ప యంతరము కనఁబడుచున్నది.

ప్రశ్న : ఓయీ ? హిరణ్యగర్భుఁడు ఋగ్ యజుఃసామవేదములను మరియు సమస్తంబును సృజించెనని శ్రుతి చెప్పుచున్నందున చతుర్ముఖునకు వేద కర్తృత్వము అవగతమగును గదా ?

ఉత్తరము : హిరణ్యగర్భుఁడు ఆవిర్భవించుటకు ముందును వేదము లున్నట్లు శ్రుతి వక్కాణించినది. "యో దేవానాం ప్రథమం పురస్తాత్ విశ్వాధికో రుద్రో మహర్షిః, హిరణ్యగర్భం పశ్యత జాయమానం స నో దేవః శుభయా స్మృత్యా సంయునక్తు" "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం - యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై".

దేవతలందఱిలో మొదటివాడగు హిరణ్యగర్భుని సృజించి వేదముల నుప దేశించువాడగుటచే సర్వాధికుఁడైన వేదకర్తయు పరమదేశికుఁడు నగుచున్నవాడు. శ్రుత్యర్థము : రుద్రశబ్దవాచ్యుఁడైన పరబ్రహ్మ - సర్వజ్ఞత్వాది సామర్థ్యముతో ప్రపంచాధికుడై హిరణ్యగర్భుని తన ప్రకృతివలన జన్మించువానిగ నొనర్చి సృష్ట్యారంభమునందు సమస్తజ్ఞాన సాధనములగు వేదముల నుపదేశించు అనుగ్రహ దృష్టితో వీక్షించువాడు. పరమదేశికుడైనట్టి పరమాత్మ-సర్వవిధ సంసారపాశము లనఁబడు మహానర్థములను తొలగించునట్టి పరానందముఁ జెందించునట్టి పరమ మంగళరూపమైనట్టి వేదాంతసారసామరస్యమువలన నేర్పడునట్టియు స్వవిషయం బగు బోధరూపము గల స్మృతితో మమ్ము ననుసంధింపఁజేయుగాత !

ఇందువలన నీశ్వరునకు సకలవేదకర్తృత్వము సుసంగతంబని విశద మైనది.

వాఙ్నిత్యత్వ శ్రుతి—పరమేశ్వరుఁడు పూర్వసత్త ననుసరించి వేదముల నావిర్భవింపఁ జేయువాడగుటచే నీశ్వరకార్యములయ్యును నిత్యంబులు నగు వేద ములకు-విరుద్ధము కానట్టిది. కావున వేదములు పరమేశ్వర ప్రణీతములగుటయందు నిత్యత్వభంగము చేకూరఁజాలదు. మరియు—

బ్రహ్మదేవునకు-వేదప్రాప్తి పరమేశ్వరునివలన యని శ్రుతి చెప్పుచుండుటచే వేదకర్తృత్వము సిద్ధింపఁజాలదు.

శుభస్మృతి యనఁగా-ఇష్టలింగమును హృదయమునఁ ధరించి ప్రాణలింగ ధ్యానముఁ గావించు క్రమంబగును. ప్రాణలింగానుసంధాన రూపంబగు ప్రణవ పంచాక్షరీ మంత్రజపముతో భావలింగసాక్షాత్కారంబగునది; మోక్షజనకంబగు శివసాక్షాత్కారజ్ఞానంబు శుభస్మృతి యనఁబడును.

స్వయముగా సూక్తవిశేషంబులఁ గనుగొను వసిష్ఠుడు మొదలగువారు ఋషులని చెప్పఁబడుదురు. పరమేశ్వరుఁడైతేనో వేదముల నన్నిటి నావిర్భవింపఁ జేయువాడగుటచే మహర్షి యని పేర్కొనఁబడుచున్నవాడు.

ఇట్లు చెప్పుటవలన-రుద్రుఁడు ఋషులందరిలో గొప్పవాడై మహర్షి యనఁ బడునని-యవైదికులు వచించునది గ్రాహ్యము కాజాలదని తెలియనగును.

ఇట రుద్రశబ్దము-సంసారరోగమును పోగొట్టు పరబ్రహ్మయందు వర్తించు ననియు సంహారరుద్రునియందు కాదనియు వివరింపఁబడినది.

పరమామృతంబనగా - అమృతంబులలో నత్యంతోత్కృష్టము, అనాది ముక్తంబునగు బ్రహ్మంబగును. అట్టి బ్రహ్మభావముతో సాదృశ్యముఁ బొందుట-తల్లక్ష్మీసమావేశ మనంబడును. ఇదియే పరానంద ప్రాప్తి యగును. స్మృతి విశేషణార్థము - శుభపదముతో నిరూపింపఁబడుచున్నది. ఉపనిషత్తులన్నియు నైకకంఠ్యముగా శివునందు తాత్పర్యము గలిగియుండుట వేదాంతసామరస్య మనఁబఱగుచున్నయది.

ఇట్లు షడ్త్రోతాదివాక్యములకన్న నిశ్వసితాదిశ్రుతులు విలక్షణంబులగుట కతన పరమేశ్వరునకు సకలవేదకర్తృత్వమును సమర్థించుచున్నవి.

వేదములు - ప్రతికల్పమునందు నావిర్భవించునవగుటవలన ప్రవాహ నిత్యంబులగునని మొదట సమర్థించి-క్రమవిశేషముతో కూడిన వేదాక్షరములు ప్రళయమందు పరమేశ్వరుని బుద్ధిస్థములై సృష్ట్యాదియందు పరులకు వినఁబడు నట్లు బయలుపడున వగుటచే పరమేశ్వర ప్రణీతంబులగునని నిర్ధారింపఁ బడియెను.

"స్వయంభువైన సదాశివుఁడు మొదట ననాద్యంతమగు వాణి నావిర్భవింపఁ జేసినవాడు. అట్టిదియే వేదమనఁబడుచున్నది. ఆ పిమ్మట సృష్టిప్రవృత్తులన్నియు

నేర్పడినవి" అని శాస్త్రప్రమాణము కలదు గావున వేదములు నిత్యములైనను పరమేశ్వర కర్తృకంబులగుట బాగుగా పొసగుచున్నది.

ఇయ్యది
శ్రీ నీలకంఠ భగవత్పాదకృత శారీరక బ్రహ్మమీమాంసా
సూత్ర భాష్యమున ప్రథమాధ్యాయ ప్రథమపాద గత
తృతీయ సూత్రాంధ్రీకరణము.

---

ఈ భాష్యము అచ్చుపడుటకు-వేదాంతవిద్యాభిరుచితో యథాశక్తి ఆర్థికముగ సహకరించిన పుణ్యాత్ములు—

18. శ్రీ దారం పురుషోత్తం శ్రేష్ఠిగారు, జగిత్యాల. 17-11-1968
19. శ్రీ ఉత్తూరి శంకరయ్య గుప్తగారు. ,, 1-12-1973
20. శ్రీ దొంతుల కిష్టయ్యగారి నారాయణగారు ,, ...........
21. శ్రీ బాపెట్టి హనుమాండ్లుగారి లక్ష్మీకాంతం గారు ,, ........
22. శ్రీ ఉత్తూరి జగన్ గారు, జగిత్యాల.
23. శ్రీ బండారు మీనయ్య కోటయ్యగారలు, ,, 29-11-1973
24. శివశ్రీ॥ కందుకూరి విజయచంద్రగారు, ఉద్యోగము-జోగిపేట. 4-9-1982
25. ,, ముదిగొండ సుబ్రహ్మణ్యంగారు, ఉద్యోగము- మెటుపల్లి........
26. మహారాజశ్రీ॥ కీ. శే. వంక మామిడి రాములుగారు. సికిందరాబాద్,
27. శివశ్రీ॥ చాగంటి శివరావు గారు, అడ్వొకేటు, భీమవరం
28. మహారాజశ్రీ॥ బొణ్ణంపల్లి వరహాల అప్పాల నరసింహారావు గారు, సౌ॥ అనూరాధ (దంపతులు) సనత్‌నగర్. హైదరాబాద్.

శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య కృత

శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

ప్రథమాధ్యాయగత

ప్రథమపాదమందలి

నాలుగవ సూత్రము

# 4. "తత్తు సమన్వయాత్"

ప్రథమాధికరణమందు జ్ఞాతవ్యముగ ప్రతిపాదింపఁబడిన పరబ్రహ్మమును గురుతెఱుగుటకు ద్వితీయాధికరణమున జగజ్జన్మాదికారణత్వము బ్రహ్మలక్షణంబని నిరూపించి యట్టి బ్రహ్మమునకై వేదాంతశాస్త్రము ప్రమాణంబనియు బ్రహ్మము నిఖిలవేదములకు మూలమనియు తృతీయాధికరణమునందు నిర్ధారింపబడియెను. వేదాంతవాక్యములు బ్రహ్మము నెట్లు సాధించునను నాశంకకు సమాధానము గల నాలుగవ సూత్ర మవతరింపఁజేయబడినది.

"తత్-తు-సమన్వయాత్" అని సూత్రపదచ్ఛేదము.

తచ్ఛబ్దముతో ప్రకృతమైన బ్రహ్మము పరామర్శింపఁబడుచున్నది. 'తు' శబ్దముతో అవధారణార్థ పూర్వకముగా వేదాంతవాక్యములన్నియు గ్రహింపఁబడుచున్నవి. సమన్వయ శబ్దముతో తాత్పర్య సంబంధము చెప్పఁబడుచున్నది.

తత్ = బ్రహ్మమును, తు = వేదాంతవాక్యములు, సమన్వయాత్ = తాత్పర్యలింగ సంబంధము వలనఁ దెలుపునట్టివి యని సూత్రార్థము.

"కుముదం శ్వేతమేవ" అనుచో విశేషణ గత ఏవకార బలముతో కలువలన్నిటికిని తెలుపుదనము వలె సర్వ వేదాంతములకును బ్రహ్మసాధకత్వము

గుర్తింపఁబడుచున్నది. సమన్వయమనగా-ఉపక్రమాది లింగములతో తెలుపఁబడు తాత్పర్యముఁ దగు సంబంధమగును.

ఈ సూత్రమునకు వేదాంత వాక్యములన్నియు విషయములు.

సందేహము — వేదాంత వాక్యములకు బ్రహ్మబోధకత్వము యుక్తమా? కాదా?

ప్రశ్న : శబ్దము అర్థమును తెలుపుటకు నంతటను సంబంధ గ్రహణము నపేక్షించునది; శబ్దార్థ సంబంధ జ్ఞానము లేనిది పురుషునకు శబ్దార్థ జ్ఞానము కలుగఁజాలదు. సంబంధజ్ఞానమైతేనో వృద్ధవ్యవహారము నపేక్షించునది: వృద్ధ వ్యవహారము క్రియాస్వరూపంబు; "ఆవుఁ దెమ్ము! కట్టి వేయుము!" అని వృద్ధులు పలికెడు వాక్యములను వినుటతోడనే ప్రవర్తించు మరియొక వ్యక్తిఁ గనుగొని జిజ్ఞాసు విట్లు నిర్ణయించును. "అన్ని విధముల నీ వ్యక్తి క్రియఁ దెలిసికొనియే ప్రవర్తించుచున్నవాఁడు. ఇట్టి కార్యజ్ఞానము 'గామానయే' త్యాది వాక్యము వలననే కలుగుచున్నది. అన్యథా ప్రవృత్తి కలుగుటెట్లు?" ఆవుఁ దెచ్చుటను కట్టుటను చూచి కార్యవిశేషమును నిర్ధారించుకొనువాఁడు. ఇట్లు శబ్దార్థ జ్ఞానము కార్యము నుద్దేశించి కలుగునదగుటఁజేసి సిద్ధమగు బ్రహ్మము విషయమై శబ్దమునకు ప్రామాణ్యము కూడదు. మరియు జగము కార్యవిశేషమగుటచే కర్తృ విశేషంబగు బ్రహ్మము-అనుమానము వలనను సిద్ధించునట్టిది. ఇంతియే గాక వేదాంత వాక్యములు విధిపరములగునవియై బ్రహ్మపరములు కానట్టివి. విధి బ్రహ్మ ఉభయపరములని చెప్పునెడ వాక్యభేదము సిద్ధించును గావున వేదాంతవాక్యములు బ్రహ్మబోధకములగుట యుక్తము కాదు.

"అప్రాప్తే శాస్త్ర మర్థవత్" "ఇతర ప్రమాణములతోడ నగమ్యంబగుదాని విషయమై శాస్త్ర ముపయోగము కల" దను పూర్వమీమాంసా మర్యాద ననుసరించి యనుమాన ప్రమాణముతో సిద్ధంబగు బ్రహ్మమునకై వేదాంతశాస్త్రము నిరుప యోగమగును గదా?

ఉత్తరము : వేదాంతవాక్యములు తాత్పర్య లింగసంబంధముతో బ్రహ్మమును బోధించుట యుక్తమగుచున్నయది. "పరిజ్ఞానము కార్యము ననుసరించునదగుట చేత, బ్రహ్మము కార్యము గాకుండుటను బ్రహ్మమునకై శబ్దమునకు ప్రామాణ్యము

లేదని" చెప్పఁబడిన యంశము సమంజసము కాదు. "కుమారుడు కలిగె" ననునది మున్నగు వాక్యములు సిద్ధార్థముఁ గలిగియుండియు శబ్దార్థసంబంధమువలన వృద్ధ వ్యవహారమందు కార్యావగతిని జిజ్ఞాసువునకు కలుగఁజేయును. "ప్రయోజ్య వృద్ధునకు ప్రయోజనవాక్యము పదార్థజ్ఞానము నాపాదించు" నని జిజ్ఞాసువు నిర్ధారించుకొనును. కావున సిద్ధార్థవిషయముల నుద్దేశించియు శబ్ద మభిధానం బగుచున్నయది.

సిద్ధమనగా-స్వతంత్రముగ నేర్పడునది. శబ్దాదిప్రమాణములు భూతార్థముఁ గురించి వాక్యార్థసంబంధము గలవి యగుటచే సిద్ధబోధకంబు లగుచున్నవి. ఇంతియే గాక వృద్ధవ్యవహారముతో నవసరము లేకయే మరియొక విధముగాను పదార్థజ్ఞానము కలుగునది. ఎట్లనగా ? బాలురు తల్లి మున్నగువారితో శిశుపశ్వాదులఁగురించి యంగుళ్యాదులతో బోధింపఁబడుచుందురు. మరియు తత్తద్వస్తువుల విషయమై తత్తచ్ఛబ్దముల నుపయోగించుచు బాలురకు పదార్థజ్ఞానము కలుగఁ జేయఁబడును.

కావ్యనాటకముల యర్థమును గురుతెఱుగఁదలచిన పురుషులు తదభిజ్ఞులైన పురుషుల నాశ్రయించి-పదవిభాగముతో నీ శబ్దమున కీ యర్థంబని-శబ్దములన్నిటి యర్థముఁ గ్రహించుచున్నవారు. ఇందువలన సిద్ధార్థకమందును శబ్దార్థజ్ఞాన మేర్పడుచుండుటచే సిద్ధవిషయమై శబ్దమునకు ప్రామాణ్యము కలదు. గావున వేదాంత వాక్యములు బ్రహ్మవిషయమై ప్రమాణములగుచున్నవి.

పెద్దవారు మాటలాడుచుండగా నవ్వారి నడతఁబట్టి యర్థమును గ్రహింపనగును. మరియు చిన్నవారికి వస్తువులఁ జూపుచు-ఇద్దానికి ఇది పేరు- అని చెప్పుటవలనను ఉపాధ్యాయులు బోధించు శబ్దార్థసంబంధము వలనను పరిజ్ఞానమును బాలురు కలిగియుందురు.

"జగము కార్యవిశేషమగుటచే బ్రహ్మమును కర్తృవిశేషముగ ననుమానింపవచ్చు" ననుట సంభవింపదు. అనేకవిధ రచనలు గల రథ సౌధాదులకు కర్త లనేకులు కనఁబడుటచేత ననుమానముతో జగత్కర్తను సాధింపరాదు.

"వ్యాప్తిబలము వలన కర్మవశ్యత్వాదులు కర్తయందావహించు" నని పూర్వము చెప్పఁబడినది- గావున బ్రహ్మము అనుమానగమ్యము కానట్టిది. మరియు

శ్రుత్యనుకూలమైన అనుమానము బ్రహ్మమునకై ప్రమాణంబగుగాత! వాక్యములకైతేనో విశ్రాంతిఁజెందుచోట ప్రామాణ్య మేర్పడుచున్నది. ప్రత్యక్షాది ప్రమాణములట్లుగాక నంతటను ప్రామాణ్యము గలిగి యుండునవి.

వేదాంతవాక్యములకు బ్రహ్మమునందు తాత్పర్యమును నిర్ణయించు లింగములు ఉపక్రమాదులగుచున్నవి.

ఉపక్రమోపసంహారా వభ్యాసోఽపూర్వతా ఫలం
అర్థవాదోపపత్తీ చ లింగం తాత్పర్య నిర్ణయే.

ఉపక్రమము (ప్రారంభము), ఉపసంహారము (సమాప్తి), అభ్యాసము (పునఃపునరావృత్తి), అపూర్వత, ఫలము, అర్థవాదము, ఉపపత్తి యనఁబడునవి తాత్పర్యనిర్ణయ విషయమై లింగము లగుచున్నవి. కావున వేదాంతవాక్యములు బ్రహ్మయందు తాత్పర్యము కలిగియుండుట యుపక్రమాది లింగములతో నిర్ణయింపఁబడునట్టిది. ఇట్టి నిర్ణయమే వేదాంతవాక్య శ్రవణ మనఁబడుచున్నది.

అజ్ఞానప్రభవం దుఃఖం జ్ఞానం తస్య నివర్తకం
సర్వవేదాంత వాక్యానాం శ్రవణం తత్ప్రవర్తకమ్.

శ్రవణం నామ వాక్యానాం వైదికానాం పరాత్పరే
ఉపక్రమాదిభి ర్లింగైః శివే తాత్పర్య నిర్ణయః.

అజ్ఞానమువలన కలుగు దుఃఖమును పోగొట్టు జ్ఞానము-సర్వవేదాంతవాక్య శ్రవణమువలన నేర్పడునది. శ్రవణ మనఁగా? వైదికవాక్యములు ఉపక్రమాది లింగములతో పరాత్పరుండైన శివుని విషయమై తాత్పర్యము గలిగియుండుటను నిర్ణయించుట యగును.

ఉపక్రమము, ఉపసంహారంబును గూడి - వేదాంతములు శివునందు తాత్పర్యము గలిగి యుండుటను నిర్ణయించుటకు-నొక లింగ మగునవి.

శివునందు తాత్పర్య మనఁగా? శివస్వరూపము, శివోపాసనయు విషయములుగ (వేదాంతములు) గలిగియుండుట యగును.

ఉపక్రమోపసంహారములకు నుదాహరణములు "సదేవ సౌమ్యేదమగ్ర

ఆసీత్" "ఓ సౌమ్యుడా ? సృష్టికి పూర్వము జగము సన్మయము గానే యుండెను" అని యుపక్రమము. "తత్త్వమసి" "జీవుడా ! నీవా పరమేశ్వరుఁ డంతర్యామిగ గలవాడవు" అని యుపసంహారము. "ధాతుః ప్రసాదా న్మహిమాన మీశం" "శివానుగ్రహమువలన పరమేశ్వరుని కనుగొనఁ జాలుదు" వని యుపక్రమము. "యః పరః స మహేశ్వరః" "ప్రణవాతీతుఁ డగువాడే మహేశ్వరుఁడు" అని యుపసంహారము.

"తత్త్వమసి" "సర్వో వై రుద్రః" "అంబికాపతయ ఉమాపతయే" "యో వై రుద్రః స భగవాన్ భూర్భువః సువః" అనునది యభ్యాసము.

వేదేతర ప్రమాణముతో సంబంధము లేకయుండుట అపూర్వత యనఁబడును. ఫలము-బ్రహ్మజ్ఞానంబు; సృష్టిస్థితిలయాదులఁ జేర్కొనుట మున్నగునది యర్థవాదంబగును. ఎట్టి విరోధంబు లేకుండుట సర్వజ్ఞతాది సంపత్తియు నుపపత్తి యగును.

ఇట్లు నుపక్రమాది షడ్విధ లింగములతో వేదాంత వాక్యములకు బ్రహ్మ యందు తాత్పర్యము కలదని గ్రహింపవలెను.

వేదాంతములు బ్రహ్మపరంబులే గాక "ఆత్మావాఽరే ద్రష్టవ్యః" ఇత్యాది వాక్యములవలన బ్రహ్మోపాసనవిధిపరంబు లగుననియు తెలియుచున్నది. "బ్రహ్మమును బ్రహ్మోపాసనమును సమర్థించు నెడ వాక్యభేద ప్రసంగమగు" నని చెప్పగూడదు.

రూప జ్ఞాపకంబగు నేత్రముతో రూప గతంబగు వస్తువు సిద్ధించునట్లు వేదాంతములు బ్రహ్మోపాసనపరములైనను బ్రహ్మసిద్ధిఁ గలుగఁజేయున వగుటచే ఉభయపరత్వమగుటయందు విరోధ మేమియు లేదు.

ప్రశ్న : బ్రహ్మజ్ఞానము బ్రహ్మవాచకశబ్దముతోడనే కలుగును గావున బ్రహ్మజ్ఞానవిధితో నేమి ప్రయోజనము ?

ఉత్తరము : బ్రహ్మవాచక శబ్దముతో బ్రహ్మపదార్థము తెలియఁబడు చున్నను మంత్రములు మొదలగువానియందువలె బ్రహ్మజ్ఞాన విధికి విరోధము గానరాదు. ఎట్లు ద్రవ్యదేవతాదులను విశదపఱచు మంత్రములు చదువఁబడు చుండగా ద్రవ్యాది పరిజ్ఞానము కలిగినను మరల ననుష్ఠాన సమయమందు మంత్ర

ములను స్మరింపవలెనని (రెండవదగు) అనుష్ఠాన జ్ఞానమును కలుగఁజేయునో అట్లు వేదాంత వాక్యములు బ్రహ్మజ్ఞాన విధి ప్రయోజకములగుచున్నవని గ్రహింపవలెను.

ఉపక్రమము ఉపసంహారంబు గూడి యొక లింగము గావున లింగములు ఆరగుచున్నవి.

తాత్పర్యమనగా-అర్థస్వరూపంబగు వస్తువు ఇష్టముగ గలదాని భావంబగును. వక్త్రభీష్టము వాక్యమునందుపచరింపఁబడుటచే పై విధము తాత్పర్య శబ్దార్థముఁ గ్రహించునది.

కల్పాదియందు వేదమునంతయు ప్రవర్తిలఁజేయు పరమేశ్వరుని యిచ్ఛ-ప్రవాహానాది న్యాయముతో సిద్ధమై వేదార్థవిషయంబగునట్టిది.

వేదము - శబ్దబ్రహ్మంబనఁబడును. వేరువేరుగ చెప్పఁబడిన ఋగాది వేద వాక్యములు జీవాత్మభోగ్యంబు లగుచున్నవి. వేదాధిష్ఠాత-పరమాత్మ యొకఁడేను.

"వివక్ష యవివక్షయు వాక్యార్థ ప్రతిపాదనయందు శబ్దశక్తివలన తెలియఁబడునది. విధిశక్తితో గ్రహింపఁబడునదంతయు వివక్ష యగుచున్నది. విధిశక్తి రహితంబగునది యవివక్షిత మనఁబడును.'' ఈ రీతి యంతయు లోకవాక్యములకు నతిశయముగ సంబంధించునది; వేదమునందైతేనో న్యాయముఁబట్టి తాత్పర్య మేర్పడునది.

"తత్త్వమసి" "జీవుఁడు శరీరముగ కలవాఁడు పరమాత్మ" యని తొమ్మిది పర్యాయంబులును, "యో వై రుద్రః స భగవాన్'' బ్రహ్మవిష్ణు మహేశ్వరాది క్రమముతో భగవచ్ఛబ్దార్థమగు కల్యాణగుణవత్త్వము ప్రతి పర్యాయంబు నభ్యసింపఁబడుచున్నవి.

అణువునకంటె నణువును ఆకాశాదులకన్న గొప్పవాడు నగు పరమాత్మ-ప్రాణి హృదయగుహాయందు ప్రాణలింగస్వరూపముతో వర్తిలువాడు, సకలకర్మాతీత మహత్త్వము కలిగియుండు మహేశ్వరుని లింగాంగసాహిత్యముతో నుపాసించి తదనుగ్రహమువలన సంసారక్లేశము లేనివాడై నిరతిశయానంద స్వరూపము గల శివునితో నత్యంత సామ్యము గల సాయుజ్యముఁ బొందువాడు జీవాత్మయని మంత్రార్థము.

ప్రశ్న : ఉత్పత్తివిధి; వినియోగవిధి, అధికారవిధి యని విధిత్రయము గలదు గదా; ఇందెద్దియు నుపయుక్తము కానందున ప్రయోగవిధియు సంభవించుట లేదు.

## ఉత్పత్తివిధియనగా :

ఒకానొక విధియొక్క స్వరూపంబగును. ప్రతి విధికిని కర్త యవసరమగుటచే విధివాక్యము ననుసరించి యధికారిని పేర్కొనవలసి వచ్చును.

## వినియోగవిధియనగా :

అధికారికి వలయు సాధనముల ననుసంధించుట యగును.

## అధికారవిధియనగా :

అర్థవాదమువలన స్ఫురించు నత్యవసరాంశమును విశదపఱచుట యగును.

ఇవ్వాని సమష్టి-ప్రయోగవిధి యనఁబడును.

అనగా మొదట విధివాక్యము, సాధనములు, అధికారియు కూడి ప్రయోగవిధి యగునని తెలియనగును.

ఉత్తరము : అధ్యాహారముతోడ నుత్పత్తివిధి సిద్ధింపగా ప్రకరణవశమున శమదమాది సంపన్నుడై పరమేశ్వరు నుపాసింపవలెనని వినియోగనిధి యుపపన్నంబగునది; కావున రాత్రిసత్రన్యాయముతో "జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః" ఇత్యాద్యర్థవాదవాక్యములవలన నేర్పడు మోక్షకాముఁడు బ్రహ్మము నుపాసింపవలెనని యధికారవిధియు; ''మోక్షాపేక్షగలవాడు శమదమాదిసంపత్తి గలిగి బ్రహ్మోపాసకుఁడు గావలె" నని ప్రయోపవిధియు సంభవించుచున్నవి.

"సంసారబంధనిర్ముక్తుడు కాగోరినవాడు పరమేశ్వరునిఁ జూడవలె" నని యుత్పత్తివిధి కవకాశము కలుగునది. (ఇట నధ్యాహారము-సంసార విమోచనేచ్ఛుః అను పదమునకు).

"రాత్రులందన్నదానముఁ గావించువారు ప్రతిష్ఠితులగుదు" రనుటలో-రాత్రి సత్రమునకు ప్రతిష్ఠాకాముఁ డధికారి యగునట్లు మోక్షకాముడు బ్రహ్మజ్ఞానమున కధికారి యగుచున్నవాడు.

ఇట్లు వేదాంతములఁ జెందిన ప్రయోగవిధితో నప్రత్యక్షమైన బ్రహ్మజ్ఞానం బేర్పడును గావున పునఃప్రత్యక్షజ్ఞానార్థము బ్రహ్మోపాసనముఁ గావింపవలెనని వేదాంతములు విశదీకరించుచున్నవని గుర్తెరుగునది.

ప్రశ్న : ఓయీ! బ్రహ్మజ్ఞానవిధి యుక్తముకాదు, "ఆత్మా వా రే ద్రష్టవ్యః" నిత్యము నిర్వికారము విశుద్ధంబు నగు పరమాత్మవిషయమై కర్మకర్తృభావము కూడదు. కర్మకర్తృభావముతోడనే విధి యేర్పడునది గదా। ఉత్పత్తి ప్రాప్తి వికార సంస్కారము లనఁబడునవి పరమాత్మ యందు సంభవింపనట్టివి,

స్వతంత్రఫలప్రాప్తికై సక్తున్యాయముతో కర్మకారక భావమును విసర్జించి కరణత్వముకొరకై "ఆత్మనా పశ్యేత్" అని చెప్పవలెను గాదా ? మరియు సక్తువులకును బ్రహ్మమునకును వ్యత్యాసము గలదు. హవన క్రియవలన భస్మీభావమనఁ బడు విశేషము సక్తువులకు కలుగుటఁజేసి శబ్దముతో కరణత్వము, అర్థమువలన కర్మత్వంబు నేర్పడుచున్నవి. ఇట్టి వికారము బ్రహ్మమునందు సంభవింపదు గావున వేదాంతములకు బ్రహ్మజ్ఞానవిధిపరత్వము కూడదు గదా!

ఉత్పత్తియనగా-క్రియాజన్యఫలము; ప్రాప్తియనగా-పూర్వము అలభ్యమై ప్రస్తుతము లభ్యమగుట; వికారమనగా—మార్పు; సంస్కారమనగా శుద్ధి నాపాదించుట యని గుర్తెరుగవలెను.

ఉత్తరము : కర్మత్వాదిప్రయుక్తములగు నుత్పత్త్యాదు లాత్మయందు లేకున్నను కర్తకు వలయు మోక్షఫలము కొరకు విధి యుపపన్నంబగుచున్నది. ప్రాప్తియుండగా విధి యెట్లనినచో ప్రాప్తి పాక్షికమా ? నిత్యమా ? ద్వివిధప్రాప్తి యున్నను నియమాది విధి సంభవించునది,

ప్రశ్న : ఓయీ! అట్లయినచో వేదాంతములు విధిపరములు బ్రహ్మపరములు నగుట యుక్తము కాదు. "రూపనివేదకమగు నేత్రము వస్తువునుగూడ తెలుపునట్లు వేదాంతములు విధిపరములైనను బ్రహ్మపరములగు" నని చెప్పుటయు సమంజసము కాదు.

ఎందుకనఁగా ? కన్ను వస్తువుఁ జెందునపుడు అనపేక్షితముగానే ప్రతి వస్తువును తెలుపునట్టిది. శబ్దము అట్లుగాక తాత్పర్యముగలచోట ప్రమాణంబగునది. కావున వేదాంతములు బ్రహ్మఁ దెలుపుననియు, బ్రహ్మోపాసనను విధించుననియు ననుట పొసగదు గదా ?

ఉత్తరము : "సమిధో యజతి" ఇత్యాధి వాక్యములు-పంచ ప్రయాజము లనఁబడు కర్మలను విధించుటయు పంచప్రయాజానుష్ఠాన క్రమ విధాయకంబు లగుటయు ఇట్లు ఉభయపరత్వ ముండుటఁజేసి వేదాంతవాక్యంబులును బ్రహ్మ ప్రమాపకములగుటయు మోక్షోపకారక బ్రహ్మజ్ఞాన విధాయకంబులగుటయు యుక్తములగుచున్నవి. సమిదాది వాక్యములు-చదువువారికి నర్థమును అనుష్ఠాన క్రమమును తెలుపుగాత యని యుద్దేశించి పరమేశ్వరునిచే సక్రమముగా నుచ్చరింపఁ బడిన కతన నవ్వానికి పంచప్రయాజ విధానమందును తదనుష్ఠానక్రమమందును తాత్పర్యము సమంజసమగుచున్నది.

శివారాధనమందు గంధాక్షత పుష్పబిల్వ ధూపదీపనైవేద్యాదులఁ జెప్పనెడ తత్క్రమము తధనుష్ఠానబోధయు నేర్పడుచున్నవి గావున వేదాంతములు ఉభయ పరములగుటలో ఎట్టి యభ్యంతరము లేదని సిద్ధాంతము.

ప్రశ్న : బ్రహ్మము వేదవాక్యమువలననే తెలియుచుండగా వేదములు బ్రహ్మజ్ఞానమును విధించుట నిష్ప్రయోజన మగునది. ప్రయోజనంబు పూర్వజ్ఞానము వలననే కలుగును గదా !

ఉత్తరము : బ్రహ్మము వేదవాక్యమువలన పరోక్షముగా తెలియఁబడు చున్నందున తత్సాక్షాత్కారమునకై బ్రహ్మజ్ఞాన విధి యుపపన్నంబగుచున్నది. పరోక్ష జ్ఞానమునకు, అపరోక్ష జ్ఞానమునకు, భేదమెట్లనఁగా? శబ్దజన్యజ్ఞానము బ్రహ్మదర్శనమునకు కారణము గానట్టిది; ఉపాసనాత్మక జ్ఞానము బ్రహ్మసాక్షాత్కారమును కలుగఁజేయునది.

"ధ్యాత్వా ముని ర్గచ్ఛతి భూతయోనిం
సమస్తసాక్షిం తమసఃపరస్తాత్"

"ప్రాణుల నుదయింపఁజేయువాడు, సకల జీవప్రేరకుండు, ప్రకృత్య

శీతుండు నగు పరమాత్మను ధ్యానించి, బ్రహ్మసాక్షాత్కారముఁ బొందువాడగును. ఇట్టి యుపాసకుని ముని యందురు."

"జ్ఞాన నిర్మథనా దేవ పాశం దహతి పండితః"

"ఆత్మను అరణిగాను, ప్రణవము నుత్తరారణిగా నమర్చి జ్ఞానమనఁబడు మథనమువలన విజ్ఞానము గలవాడై సంసార పాశమును దహించును."

"జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః"

"పరమేశ్వరుని కనుగొని సర్వవిధ సంసార పాశములనుండి విడిబడును."

"ఈశం తం జ్ఞాత్వా అమృతా భవంతి"

"సర్వజగమును శాసించు మహాదేవుని కనుగొనినవారు ముక్తులగుదురు." ఇట్లు శ్రుతులు వక్కాణించుచుండుటచే బ్రహ్మఁగూర్చిన ప్రత్యక్షజ్ఞానము మాత్రము మోక్షప్రదమైనదని గ్రహింపవలెను,

"శ్రోతవ్యః శ్రుతివాక్యేభ్యో మంతవ్య శ్చోపపత్తిభిః
జ్ఞాత్వా చ సతతం ధ్యేయః ఏతే దర్శన హేతవః"

"వేదవాక్యములవలన వేదవాక్యార్థంబగు బ్రహ్మమును గురించి వినవలెను. మరియు అనేకవిధములైన సమర్థనములతో ఇదమిత్థమని నిష్కర్షితబుద్ధిఁ గలిగి యుండవలెను. ఇట్లు శ్రవణ మననములతో బ్రహ్మమును నిర్ధారించుకొని నిత్యము ధ్యానింపవలెను. ఇట్టి శ్రవణ మనన నిదిధ్యాసనములు బ్రహ్మదర్శనమునకు కారణములగుచున్నవి.

ఇట్టి తటి శ్రవణమువలనను, మననమువలనను కలుగు పరిజ్ఞానముతో కూడిన ధ్యానము బ్రహ్మసాక్షాత్కారముఁ గలుగజేయునదని విశదీకరింపఁబడినది. మరియు దిగువ శ్రుతులందు ఉపాసనాత్మక జ్ఞానము మోక్షఫలకమని విధింపఁ బడుచున్నది.

"ఆత్మన్యేవాత్మానం పశ్యేత్" "మనోబుద్ధ్యాది విశిష్టమగు హృదయమందు హృదయ స్థానీయమైన శివలింగమందును అథవా జీవాత్మయందు పరమాత్మఁ జూడవలెను."

"శంభు రాకాశమద్యే ధ్యేయః'' ''హృదయాకాశమునందు శంకరుని ధ్యానింపవలెను.''

"తజ్జలానీతి శాంత ఉపాసీత" ''శమదమాది సంపన్నుడై సృష్టి స్థితి లయములు మూడును పరమేశ్వరునివలననే జరుగుచున్నవని జగత్కారణముగ బ్రహ్మను భావింపవలెను.

"ప్రాచీన యోగ్యోపాస్వ" "పూర్వికుల ననుసరించు నుపాసకుడా! బ్రహ్మము నుపాసించుము."

''బ్రహ్మవిదాప్నోతి పరం" "బ్రహ్మోపాసకుఁడు బ్రహ్మమును పొందును" ఇత్యాది వాక్యములయందు బ్రహ్మస్వరూపము నుపాసించుటయు తత్ఫలాదికంబు నుపదేశింపఁబడినవి.

అట్లు బ్రహ్మ సాక్షాత్కారమునకు బ్రహ్మోపాసనము అనవసరమగుచో సత్యత్వాది విశిష్టమగు బ్రహ్మముతో నేక కాలమందు కోరికలన్నియు సిద్ధించుట, మరియు బ్రహ్మసాక్షాత్కారంబు ఎట్లు సమకూరును ?

కావున "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" "ఆనందో బ్రహ్మ'' "ఆకాశ శరీరం బ్రహ్మ" "సత్యాత్మ ప్రాణారామం మనఆనందం శాంతిసమృద్ధ మమృతం'' "ఋతం సత్యం పరంబ్రహ్మ-పురుషం కృష్ణపింగళం, ఊర్ధ్వరేతం విరూపాక్షం" అని సత్యజ్ఞానానంద స్వరూపంబు తనయందు తాను విశ్రాంతిఁ జెందునదియు; సమస్త ఉపద్రవకళంకములు బొత్తుగా లేనిదియు, సకల శుభాత్మకమైనదియు, ఎప్పుడును ఎడబాయనట్టి పరమశక్తితో విచిత్రరూపము గలదగుటచే నలుపు ఎరుపు తెలుపు కూడిన వన్నెగలదియు మూడు కన్నులు గలదియు నగు బ్రహ్మము-ఉపక్రమాది తాత్పర్యలింగములతో నిరూపింపఃబడుచున్నయది.

"యో వేద నిహితం గుహాయాం'' "ప్రాచీన యోగ్యోపాస్వ" అనుచో "వేద" గుర్తెరుగుము? "ఉపాస్వ" ఉపాసించుము! ఇట్లు జ్ఞానము ఉపాసనము ఏకార్థకములుగా నుపదేశింపఁబడుచున్నవి.

''సర్వాన్ కామాన్" ఇత్యాది వాక్యములందు ఉపాసకులకు బ్రహ్మముతో గూడ సకల కామావాప్తి యేర్పడునని విశదమగుచున్నది.

కావున నిష్కామము నిజవర్ణాశ్రమోచితంబు నగు ధర్మము నాచరించుచు పాశుపతవ్రతము ననుష్ఠించువాడును నిషిద్ధకామ్యకర్మరహితుండును శ్రుతిస్మృతి చోదితంబగు కర్మానుష్ఠానమువలన చిత్తశుద్ధి గలవాడును శమదమాదిసంపన్నంబగు పరమ శివభక్తి గలవాడు నగు ముముక్షువె శ్రేష్ఠశ్రుతులవలన పరబ్రహ్మము శివాభిధేయంబని తెలిసికొని పరమేశ్వరు నుపాసింపవలెనని జ్ఞానాత్మకంబగు బ్రహ్మోపాసన విధింపఁబడుట యుపపన్నంబగుచున్నయది.

శబ్దజ్ఞానము కలిగిన పిమ్మట నత్యంతచిత్తైకాగ్రతతో సాధింపఁదగు ఉపాసనాత్మకంబైన జ్ఞానంబే మోక్షార్థము ఉపయోగించునట్టిది; శబ్దజ్ఞానము వలననే బంధవిముక్తి కలుగునది కాదు. ధ్యానము, ఉపాసన మున్నగు పదములతో చెప్పఁబడు నిరంతర స్మరణాధిక్యము జ్ఞాన మనఁబడుచున్నది. ఇట్లు చెప్పుటచే ''అహం బ్రహ్మాస్మి" అను మహావాక్యమును వినుటతోడనే కృతార్థతను భావించువారు తమ సిద్ధాంత మసంగతమని బోధింపఁడుచున్నవారు.

ఉపాసనాత్మకజ్ఞానంబును సాక్షాత్ మోక్షసాధనము గాక బ్రహ్మ సాక్షాత్కారముద్వారా జన్మరాహిత్యముఁ గలుగజేయునది.

## హృదయాకాశమనఁగా ?

పరమేశ్వరుఁడు హృదయమందుండు ప్రాణలింగస్వరూపమగును. ''లింగే సుషుప్తిః" అని హంసోపనిషత్తు-హృదయాకాశ మధ్యవర్తియగు శివునకు లింగ రూపముండునని చెప్పుచున్నది, మరియు "తదోకోగ్రజ్వలనం" "హార్దానుగృహీతః శతాధికయా" ఇత్యాది సూత్రములందు హృదయగుహావర్తియగు ప్రాణలింగము నుపాసించువారికే శివానుగ్రహమువలన బ్రహ్మనాడీద్వారా శరీరమునుండి వెడలుటను సూత్రకారుడు నిర్ధారించియున్నవాడు.

బ్రహ్మస్వరూపమును బ్రహ్మోపాసనను తత్ఫలవిశేషంబును నిరూపించుటకై "బ్రహ్మవిదాప్నోతి పరం"అని ప్రారంభించి ఆ బ్రహ్మయెట్టిది ? బ్రహ్మజ్ఞాన మెట్లు కలుగును ? ఫలమెద్ది ? అను మూడు ప్రశ్నలకు సమాధానముగ "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" "యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్" "సోఽశ్నుతే సర్వాన్ కామాం త్సహ బ్రహ్మణా విపశ్చితా" అని యుదాహరించియున్నవారు.

ఈ భాష్యమునందు - ప్రథమాధ్యాయమున బ్రహ్మస్వరూపము; ద్వితీయాధ్యాయములో ప్రాణలింగస్వరూపంబగు పరమాత్మ నుపాసించు విధానము; తృతీయాధ్యాయమందు నిరతిశయానందరూపంబగు ఫలము; చతుర్థాధ్యాయమున శివసమరూపప్రాప్తిద్వారా శివసాయుజ్యము చేకూరుటయు చెప్పఁబడినవి.

శ్రుతి వాక్యమునందు "బ్రహ్మణా సహ" అని యుండుటచే బ్రహ్మముతో కూడి వేరుగా నుండుటయే ముక్తిస్వరూపమని తెలియుచున్నది.

న్యాయరక్షామణి మొదలగు గ్రంథములందు చెప్పఁబడిన ముక్తి యసంగతమని పై శ్రుతివాక్యమువలన గ్రహింపనగును.

"వేదాంతవాక్యములు ఉపాసనను విధింపకుండునెడ వేదాంతములు బ్రహ్మను ప్రతిపాదించుట నిరుపయోగమగును. కావున బ్రహ్మపర వాక్యములు బ్రహ్మప్రాప్త్యుపాయంబగు నుపాసనను విధింపనిది మోక్షమనఁబడు మహాపురుషార్థమును కలుగఁజేయఁజాలకున్నవి" ఇట్లు తాత్పర్యలింగమగు ఉపపత్తియు ఉపాసనావిధికిని కలదని విశదమైనది.

"చీర్ణశిరోవ్రతః" అనుచో శిరోవ్రతమనఁగా— పాశుపత వ్రతంబగును. శిరోవ్రతము నాచరించినవారికే బ్రహ్మవిద్య నుపదేశింపవలెనని శ్రుతులును సూతసంహితాది పురాణవచనంబులును బాగుగా చెప్పుచున్నవి.

మొదట బ్రహ్మము నుపాసించుటకు సాధారణజ్ఞానము కలిగిన తరువాత శ్రవణ మననములు సహజముగ నేర్పడునవగుటచేత నవ్వానికి విధి యనవసరమగుచున్నది.

ఇట శివోపపదము — త్రినేత్రంబగు పరమాత్మ - అతిశ్రేష్ఠమగు విశుద్ధికి శుభగుణములకు నాధారంబగుటఁజేసి ముముక్షువుల యుపాసనకు ముఖ్యవిషయంబగునని స్ఫురింపఁజేయునది.

"శివ ఏకో ధ్యేయః శివంకరః సర్వమన్య త్పరిత్యాజ్య"

"శివుడొకడే ధ్యానింపఁదగినవాడు. ఐహికాముష్మిక శుభఫలములను పరమపురుషార్థమైన మోక్షమును కలుగఁజేయువాడు గావున శివేతర దేవతలను అచేతనములనున్ను ధ్యానింపఁగూడదు" అని యధర్వ శిఖోపనిషత్తు - శివునకే ధర్మార్థ కామమోక్షార్థము ఉపాస్యత్వంబని వివరించినది.

అట్లు కానిచో సంసారపాశమునుండి విడిబడుట యెట్లు సంభవించును ? శివత్వమనగా- సమస్తదోషకళంకములు పూర్తిగా లేనట్టి సర్వోత్కృష్టమగు మంగళమున కాస్పద మగునట్టి స్వరూపంబగును. ఇట్టి శివజ్ఞానమువలన మోక్షఫలము చేకూరునది.

"యదా చర్మవదాకాశం వేష్టయిష్యంతి మానవాః
తదా శివ మవిజ్ఞాయ దుఃఖస్యాంతో భవిష్యతి."

"మానవులు మానవపదోపలక్షితులగు దేవతలును ఆకాశమును చర్మనువలె చుట్టగలిగినచో శివు నుపాసింపకయే దుఃఖవినాశము (మోక్షము)ను పొందగలుగుదురు."

ఆకాశమును చర్మనువలె పరివేష్టించుట కూడనట్లు శివుని విడిచి యన్యులను ధ్యానించుటవలన జన్మరాహిత్య మసంభవమని తెలియునది. మరియు "శివ ఏకో ధ్యేయః" అను శ్రుతియు మోక్షముఁ గోరువారు శివేతరదేవతల నుపాసించుటను నిషేధించునది. గావున శివాఖ్యమగు పరబ్రహ్మమును మోక్షకాములు ధ్యానించి కనుగొనవలెను.

ఇట్లు తాత్పర్యలింగ సమన్వయముతో వేదాంతములు బ్రహ్మప్రతిపాదకములై బ్రహ్మోపాసన విధాయకములగుటయు సమంజసమగుచున్నయది.

"భాష్యవిదులైన మహానుభావులు భాష్యార్థమును సరసముగా కనుగొనఁజాలుదురు. మరియు తమ యభీష్టపదములను వర్ణించుచు భాష్యమునకు సారస్యముఁ జేకూర్చుదురు" అను న్యాయము ననుసరించి శ్రీవారు స్వాభీష్టశివపదమును వివరించినవారు.

పరమవిశుద్ధి యనఁగా :

సంసారమాలిన్యమును తొలగించుట యగును.

మంగళభాజనత్వ మనఁగా :

సత్యసంకల్పత్వాది మంగళగుణములు కలిగియుండుట యగును. ఈ

రెండును ముముక్షువునకు కావలసినవగుటచే శివశబ్దమందు నీ రెండర్థములుండుట చేతను ముముక్షుధ్యేయత్వము శివునకే చెల్లుచున్నది.

ఇట్లు చెప్పుటవలన పరబ్రహ్మము నామరూపరహితమైనదని నిరూపించునవి శివేతరదేవతాపరములు నగు భాష్యములు సర్వప్రమాణ సంబద్ధములు కానందున "జిజ్ఞాసువులగు ముముక్షువులందరును శాంభవదీక్షితులై శివునినే పూజింపవలెను ధ్యానింపవలెను సాక్షాత్కరించుకొనవలెను" అని విశదమగుచున్నది.

బ్రహ్మమీమాంసాశాస్త్రము నారంభించుటను సాధించు ఈ చతుఃసూత్రి - శుద్ధాద్వైతులకు ఉపపన్నంబగునది కాదు. ఎందుకనగా? వారి పక్షమున విషయము ప్రయోజనంబు పొసగనట్టివి.

విషయ మనగా - సామాన్యముగా తెలియునది విశేషముగా తెలియనిది గదా; పూర్తిగా తెలియకున్నను, తెలిసినను జిజ్ఞాస (తెలిసికొనఁ గోరిక) యుండ జాలదు. బ్రహ్మము నిర్విశేష (నిర్గుణ)మగుటచే సామాన్యముగ తెలియునది కాదు మరియు విశేషముగ తెలియునదియు కాదు గావున పరబ్రహ్మమును గూర్చి తెలిసి కొనవలెనను తలంపు పొసగనిదగుచున్నది.

మరియు వారి పక్షమున - ఉత్తర మీమాంసయందు విషయమెద్ది ? బ్రహ్మమా ? భేదమిథ్యయా ? జీవబ్రహ్మైక్యమా ? బ్రహ్మము వేద్యము గాకుం డుటచే విషయము కాజాలదు. వేద్య మనునెడ ఘటాదులవలె అనుభవ దూరము కావలసివచ్చును. బ్రహ్మము వేద్య మగుట వ్యావహారికంబనుచో ఘటవేద్యత్వము నట్టిదే యగు గాన బ్రహ్మము విషయంబనుట కూడదు. ఇఁక భేదమిథ్యాత్వము - దృశ్యత్వాదులతో భేదమును పాటించి, యట్టి భేదమునకు మిథ్యాత్వమును భావిం చుటచే శాస్త్రము సార్థకమగుట లేదు.

తత్తద్వస్తువుల ధర్మములను నిజముగా తెలుపు ప్రత్యక్షాది ప్రమాణము లకు ప్రపంచ మిథ్యాత్వము విరుద్ధ మగుటచే భేద మిథ్యాత్వము శాస్త్రప్రతిపాద్య మగుటను విషయము కాకుండును.

జీవబ్రహ్మైక్యము విషయ మనునెడ బ్రహ్మము వేద్యము కావలసివచ్చును. బ్రహ్మశబ్దముతో బ్రహ్మమును తెలిసికొనునెడ బ్రహ్మమునకును జీవునకును ఏకత్వ మును చెప్పుటకు శక్యముకాదు. జీవాత్మ యొకడే యని చెప్పినంతమాత్రమున జీవ

బ్రహ్మైక్యము సిద్ధింపదు గదా; ఘట మొకటి యనినంతన ఘటపటైకత్వము ఏర్పడునా ? "అయమాత్మా బ్రహ్మ" ఇత్యాది వాక్యములందు శబ్దమువలన జీవ బ్రహ్మైక్యజ్ఞానము అంగీకరింపఁబడినను బ్రహ్మమే ప్రధానముగా శాస్త్రప్రతిపాద్యంబని నిర్ధారింపవలసి వచ్చును.

ఇఁక ప్రయోజనంబు నద్వైతమున పొసగదు. అవాంతర ప్రయోజన మనియు, పరమప్రయోజన మనియు ప్రయోజనము ద్వివిధము; ఈ రెంటిలో ప్రస్తుతంబగు వాక్యజన్యజ్ఞానము, అజ్ఞాన నివర్తకము కాదను నంశము సర్వసమ్మతమే గదా !

అద్వైతమతములో వసిష్ఠ పరాశర వేదవ్యాసాదులకు కలుగని జ్ఞానము తదితరులకు కలుగునని భావించుట మిక్కిలి యసంగత మగునది; ఒకవేళ వారికి జ్ఞానము కలిగినదనునెడ భేదము భాసింపకుండెడిది. అట్టి ప్రతిభాస తొలగునని చెప్పునెడ వారితో నేకీభవించు (ఇతర) జీవులందరికిని తొలగవలసివచ్చును గాన నెవ్విధముగను శాస్త్రారంభమునకు వీలు చిక్కుటలేదు. పరమప్రయోజనంబగు జీవబ్రహ్మైక్యంబు సిద్ధింపదు. ఎందుకనగా ? జీవేశ్వర భేదము శాస్త్రసమ్మతమై మిథ్య గాకుండుటచేత నెప్పటికి నభేదమును సాధింపరాదు.

ఇందు మొదటి సూత్రము అద్వైతులకు సంగతము కాకుండును. వారు జీవబ్రహ్మైక్యము శాస్త్రవిషయమని యంగీకరించుటచే బ్రహ్మజిజ్ఞాసా పదము సార్థక మగుటలేదు. బ్రహ్మశబ్దమువలన బ్రహ్మము జిజ్ఞాస్యంబగును గాని జీవ బ్రహ్మైక్యము జిజ్ఞాస్యము కాజాలదు.

ధర్మజిజ్ఞాసా పదము - ధర్మము విచారణీయమనియు ధర్మాధర్మముల యేకీభావము కాదనియు తెలుపునట్లు బ్రహ్మజిజ్ఞాసా పదము బ్రహ్మము మాత్రము విచారణీయంబని విశదపఱచుచున్నది.

రెండవ సూత్రంబు నసంగతము. "జగత్కారణత్వ'' మను లక్షణవిశేషము బ్రహ్మము నిర్విశేష మనుటను సహింపదు. మరియు సర్వజ్ఞతాది గుణములు ప్రక్షిప్తము లగుచున్నవి. బ్రహ్మము వస్తుమాత్రమని చెప్ప నెడ నాకానాక పాషాణముఁగూర్చి అజ్ఞత్వాదులును లక్షణములగుచున్నవి గావున బ్రహ్మమునకు జగత్కారణత్వ లక్షణమును ప్రతిపాదించు ద్వితీయ సూత్రంబు ఉపపన్నమగుటలేదు.

మూడవ సూత్రంబు నఘటితము. నిర్విశేష బ్రహ్మము తాత్పర్య విషయ మగుచుండగా శాస్త్రకారణత్వముతో నేర్పడు సర్వజ్ఞత్వాది గుణములను సమర్థించుట యెట్లు పొసగును ? సర్వజ్ఞత్వాదులను సమర్థించునెడ బ్రహ్మము సగుణం బగును. ఈ సూత్రము బ్రహ్మమునకు సర్వజ్ఞత్వమును సమర్థించుటకే బ్రహ్మము వేదాదిశాస్త్రయోని యని విశదపఱచునది. సర్వజ్ఞత్వ సమర్థనము నిర్విశేషత్వ విరుద్ధమగుటచే నాయ్యంబును కాదు.

ఇట్లు నాలుగవ సూత్రంబు ప్రతికూల మగుచున్నది.

ఎందుకనగా ? వేదాంతవాక్యములు భ్రాంతిఁబోగొట్టు వాక్యార్థ జ్ఞానమును కలిగించునవిగ సప్రయోజనములగుచున్నవని యద్వైతులు చెప్పుచున్నందున వాక్యార్థజ్ఞానమువలననే సంసారబంధము తొలగుట శాస్త్రవిరుద్ధంబు ప్రత్యక్షవిరుద్ధంబు నగుటచే నంగీకార్యము కాజాలదు.

ఇఁకను శివేతరదేవతలఁ బ్రతిపాదించు భాష్యము లన్నియు శ్రుతి సూత్ర విరుద్ధములగునవి. మరియు శ్రీకరభాష్యంబు సమంజసము గానట్టిది. అందలి భేదాభేద సిద్ధాంతము పరస్పరవిరోధము గలయట్టిది. బ్రహ్మము సగుణంబు నిర్గుణంబు, జీవుఁడు ఖద్యోతమువలె ప్రకాశరూపుఁడు అప్రకాశరూపుఁడును, ఇట్లు పరస్పరవిరోధముగల ప్రతిపాదనల వలనను అనేకకర్తల నిరూపణ వలనను ప్రాచీనము గాకుండుటను గ్రాహ్యంబగుట లేదు.

ఇందువలన శ్రీకర శ్రీభాష్యాదులు ఉపాదేయములు కావనియు నిర్గుణ బ్రహ్మవాదము గాని విష్ణుపారమ్యము గాని జగద్బ్రహ్మాద్వైతవాదము గాని శూన్యవాదముగాని సంగతములు కావని విశదమైనది.

ఇయ్యది శ్రీ నీలకంఠ భగవత్పాదకృత శారీరక బ్రహ్మమీమాంసా
సూత్రభాష్యమున ప్రథమాధ్యాయ ప్రథమపాదగత
చతుర్థసూత్రాంధ్రీకరణము.
ఓం తత్సత్

శ్రీ పార్వతీరాజరాజేశ్వరాభ్యాం నమః

శ్రీ నీలకంఠ భగవత్పాదకృత

# శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

[ఆంధ్రీకరణము]

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" మొదలుకొని "తత్తు సమన్వయాత్" వరకు గల నాలుగు సూత్రములందు బాగుగా చెప్పఁబడిన బ్రహ్మలక్షణము ప్రధానము (ప్రకృతి) నందు వర్తించునని యాశంకించి దిగువ సూత్రమును శ్రీ వేదవ్యాస భగవానులు ఉదాహరించియున్నవారు.

సూ. ఈక్షతే ర్నాశబ్దమ్. 1-1-5

శబ్దప్రమాణముచే సాధింపరానిది అశబ్దమనంబడును. అనగా ప్రధానము జగత్కారణము కాదు. శ్రుతియందు ఈక్షతిశబ్ద ముండుటవలనని సూత్రార్థము.

''సదేవ సౌమ్యేద మగ్ర ఆసీ దేకమేవాద్వితీయమ్" ఛాందోగ్యము.

"తదైక్షత బహు స్యాం ప్రజాయేయ"

ఇఁట సృష్టికి పూర్వమగు సత్పదార్థము బ్రహ్మమా ? ప్రధానమా ? అని సందేహము.

ప్రశ్న : ప్రధానము జగత్కారణమగుట పొసగునది. ఎట్లనగా ?

"అజా మేకాం లోహిత శుక్ల కృష్ణాం
బహ్వీం ప్రజాం జనయంతీం సరూపామ్"

"రక్త శుక్ల కృష్ణవర్ణములతో రజః సత్త్వ తమో గుణములు కలదియు, నిత్యయు ఏకయు నగు ప్రకృతి - తనతో సమానములగు రూపగుణములు గల యనేక ప్రాణులను పుట్టించునది"

ఇట్లు శ్రుత్యంతరమున గానంబడుచున్నందున రజః సత్త్వ తమోరూపిణి యగు సాంఖ్యప్రకృతియే జగత్కారణమని చెప్పవలెను. జీవాత్మయు ప్రకృతి ననుసరించువాడగుటచే సచ్ఛబ్దవాచ్యుఁడగువాడు. ఇట్టి ప్రకృతికి రజఃసత్త్వగుణముల యొక్క సంబధమువలన క్రియాజ్ఞానశక్తుల సంయోగ మేర్పడుచున్నందున జగత్కారణత్వము సిద్ధించుచున్నది. ప్రధానము అచేతన మగుటచే జగద్రూపముగ పరిణమించుట పొసగునది. పరమేశ్వరుఁడు- చేతనుఁడు కూటస్థుడు నగుటం జేసి జగదాకారముగ పరిణమించువాడు కాడు. పరిణామమనగా - కారణమునకు కలుగు వికారము గదా ! ఇట్టి న్యాయమువలన శ్రుతిప్రమాణము వలనను ప్రధానమే సచ్ఛబ్ద వాచ్యంబై జగత్కారణమగును కాదా ?

ఉత్తరము : "తదైక్షత బహు స్యాం ప్రజాయేయ" అను వాక్యమున "బ్రహ్మము అనేకము నగుదును గాక యని తలచెను." గల చేతనధర్మమగు బహుభవన సంకల్పము- అచేతనమగు ప్రకృతికి సంభవింపదుగదా ! "బహ్వీం ప్రజాం" అను ప్రమాణము ననుసరించి సాంఖ్య ప్రకృతికి జగత్కారణత్వమును సాధింప రాదు. మున్ముందీ భాష్యమున "చమసవద విశేషాత్" అను సూత్రవివరణము నందు - మాయ (ప్రకృతి) పరమేశ్వరు నాశ్రయించియే బహుప్రజాజనయిత్రి యగునని నిరూపింపగలము గాన నిట వివరింపలేదు.

మరియు రజఃసత్త్వరూపిణి యగుటచే క్రియాజ్ఞానశక్తి సంబంధము ప్రధానమునకు కలదని చెప్పుటయు సంగతము కాదు. సాంఖ్యమతమున ప్రకృతి - త్రిగుణాత్మిక యగుటచే తమోగుణమును విడదీసి రజఃసత్త్వ సంబంధమును చెప్ప కూడదు. "తమస్సు క్షీణించినపుడు రజఃసత్త్వములతిశయించుటచే ప్రధానమునకు క్రియా జ్ఞానసంబంధము పొసగు"నని చెప్పుటయు సరికాదు. సత్త్వరజస్తమో గుణముల మూడిటి సమానమైన స్థితి - ప్రకృతి యగునని సాంఖ్యులంగీకరించిన వారు.

"కూటస్థుడగు పరమేశ్వరునకు జగదాకారముగ పరిణమించుట వికార హేతువగు''నని వక్కాణించుట- అజ్ఞానవిలసితము.

శివాద్వైత సిద్ధాంతమునందు పరమేశ్వరునకు సూక్ష్మము స్థూలము నను రెండు రూపములంగీకరింపఁబడినవి. సూక్ష్మమనగా-నామరూప విభాగముఁజెందనిది యగును. స్థూలమనగా-నామరూపవిభాగముఁ జెందునది. ఇట్టి రూపద్వయము

చ్చిద్రూపిణి యచిద్రూపిణియు నగు శక్తికి యేర్పడునట్టిది. శక్తితో నవినాభావ సంబంధము కలిగియుండువాడగుటచే పరమేశ్వరుఁడు సూక్ష్మదశయందు కారణము. స్థూలదశయందు కార్యము నగునని చెప్పునట్టి మా సిద్ధాంతమునందు ''కారణముఁ దగు వికారము కార్యము'' అను న్యాయము ననుసరించిన లోపము సంభవింపదు గదా !

ప్రశ్న : ఓయీ ? "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీ దేకమేవాద్వితీయమ్" ఇత్యాది వాక్యముతో సద్రూపమగు వస్తువు ఎట్టి విశేషము లేనిదని "ఏవ" అను నవధారణవలన తెలియుచున్నది. ఇట్టితటి బ్రహ్మము కారణమగునపుడు సూక్ష్మ ప్రపంచముతో కూడియుండుట యెట్లు పొసగును ?

ఉత్తరము : "సదేవ" అను నవధారణవలన విశేషము తొలగింపఁబడుట లేదు. మరియెద్దియనగా- "అసద్వా ఇదమగ్ర ఆసీత్, తతోవై సదజాయత" "సృష్టికి పూర్వము అసత్తుండెను. ఇట్టి యసత్తువలన సత్తు జనించెను". ఇట్లు శ్రుత్యేకదేశమునందు వినంబడు అసత్కారణత్వము భ్రాంతి మూలకమని తెలుపుటకు "సదేవ'' అను నవధారణ ఉపయోగింపఁబడినది. మరియు "సదేవ'' అను వాక్యమునందు బ్రహ్మము నిర్విశేషమగుట యెట్లు పొసగును ? ''ఆసీత్" "ఉండెను'' అనుటవలన ఉండుటయను క్రియావిశేషము కలదని తెలియుచున్నది. ''అగ్రే" "ముందు" అను కాలవిశేషంబు పొడకట్టుచున్నది. "ఏకమేవ'' అను నవధారణ వలన జగము నధిష్ఠించు వస్తువు రెండవది లేదని విశదమగునది. అద్వితీయమనగా-రెండవ వస్తువు-తనకంటె వేరైనది-అవసరము లేకయే జగమున కుపాదానకారణమగునది యని యర్థము- ఇందువలననే బ్రహ్మము సర్వజ్ఞము అనంతశక్తి విశిష్టంబు నగుచున్నయది. ఇట్టి సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్త్వ విశేషములు లేనిది బ్రహ్మము జగమునకు నిమిత్తకారణమగుట యుపాదానకారణ మగుట యెట్లు పొసగును ? అనఁగా-పరమేశ్వరుడు సర్వజగమును తద్గత విశేషముల నొకే పర్యాయము తెలిసికొనువాడగుటచే నిమిత్తకారణమగువాడు. సర్వవిధ శక్తులతో నెడబాసియుండువాడు కాడు గావున నుపాదానకారణము నగువాడని గ్రహించునది.

సత్పదము-ప్రకృతి ప్రత్యయాత్మక మగుటచే నొకే వస్తువును తెల్పునదని చెప్పరాదు. ప్రకృతితో నొకదానిని ప్రత్యయముతో మరియొకదానిని ప్రతిపాదించునట్టిది. ఎట్లనగా ?

అభియుక్తసూక్తి.

శ్లో. శక్తిః శివశ్చ సచ్ఛబ్ద ప్రకృతి ప్రత్యయోదితౌ
తౌ బ్రహ్మ సామరస్యేన సమస్తజగదాత్మకౌ.

సచ్ఛబ్దముఁ దగు ప్రకృతిచే శక్తియు ప్రత్యయముతో శివుఁడును అథవా ప్రకృతితో శివుఁడు ప్రత్యయముతో శక్తియు చెప్పంబడువారు. అట్టి శక్తి శివులు కూడి అనగా సమరసత గలవారై బ్రహ్మమగుచున్నవారు. వారే సమస్త జగద్రూపము గల వారున్ను.

ఇట్లు చెప్పుటవలన తేలినదేమనగా-స్థూలసూక్ష్మ చిదచిద్ర్పపంచ రూపిణి యగు శక్తితో నిరంతరము కూడియుండువాడగుటచే పరమేశ్వరుడు కార్యము కారణంబునగుచు సత్పదమునకు విషయమగుచున్నవాడు. మరియు సజాతీయుఁడగు జీవాత్మ, విజాతీయమైన జగము, స్వగతములగు జ్ఞానానందాది గుణములు అను విశేషములు కలవాడగుటచే నిర్విశేషము బ్రహ్మము కాదని విశదమైనది.

మరియొక యాశంకను నివారించుటకి సూత్రము.

సూ. గౌణశ్చేన్నాత్మశబ్దాత్. ౧-౧-౬.

ప్రశ్న, చేతనుని ధర్మమగు ఈక్షణము అచేతన మగు ప్రధానమునందు గౌణము (అప్రధానము) గ సమన్వయింపఁ దగినది. ఎట్లనగా ? "తత్తేజ ఐక్షత" "తా ఆప ఐక్షంత" "తేజస్సువిచారించెను" "ఉదకములు యోచించినవి" ఇత్యాది వాక్యములందు వినంబడు వీక్షణము జలతేజస్సులకు గౌణమగునని యంగీకరింపఁ బడినట్లు ప్రధానమునకు గౌణమగునని చెప్పరాదా ?

ఉత్తరము : చేతనునిఁ జెప్పు ఆత్మశబ్దముండుటవలన ప్రధానమునకు వీక్షణము గౌణమనికూడ చెప్పరాదు. మరియు "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్" ఇత్యాదివాక్యమును ప్రారంభించి ''స ఆత్మా తత్త్వమసి'' అని యుపసంహరించుట వలన తేజస్సు మొదలగువానికి నీక్షతిశ్రవణము గౌణము కాజాలదు. ముఖ్యమైతే కానట్టిదియే గదా ! పరమేశ్వరుడే తేజస్సు మొదలగువానిలో ప్రవేశించి ఆ యా రూపములతో తద్భిన్న రూపముల నావిర్భవింపఁజేయువాడు.

ప్రశ్న : ఓయీ ? చేతన వాచకమగు ఆత్మశబ్దమువలన నచేతనమగు

ప్రధానము సద్రూపము జగత్కారణంబు కాజాలదని నిరూపించితిరి గదా: అచేతనమైన ప్రధానము ఆత్మశబ్దవాచ్యము కాదను నంశము సర్వసమ్మతమేను. చేతనుడైన జీవుడైతే ఆత్మశబ్దవాచ్యుండగువాడు కావున జీవాత్మ-సద్రూపము గలవాడై జగత్కారణమగునని చెప్పవచ్చునా ?

ఉత్తరము :

సూ. తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్. ౧-౧-౭.

సత్పదవాచ్యమునందు నిష్ఠ గలవానికి సంసారబంధమునుండి మోక్షము "తస్య తావదేవ చిరం యావ న్నవిమోక్ష్యేఽథ సంపత్స్యే" అను శ్రుతివాక్యమునందుపదేశింపఁబడినది. కావున ప్రధానముగాని జీవుడుగాని యీ సందర్భమున సత్పదవాచ్యములు కానట్టివి, ప్రధానమును జగత్కారణముగ చెప్పునట్టి సాంఖ్యులు గూడ "ప్రధానమందు నిష్ఠగలవాడు ముక్తుడగు"నని యంగికరించువారు కారు. వారి మతములో జీవాత్మ యేనాటికైనను ప్రకృతిని విసర్జింపవలసియుండును.

జీవాత్మయందు నిష్ఠగలవానికిని మోక్షము సంభవింపదు. ఎందుకనగా ? "శివ ఏకో ధ్యేయః శివంకరః సర్వ మన్యత్పరిత్యజ్య" అను శ్రుతి వాక్యమునందు—శివం అనగా నిఃశ్రేయసమును కలుగజేయు శివునొకనిని ధ్యానింపవలెను. శివేతరమగు చేతనాచేతనమునంతయు ధ్యానమున పరిత్యజింపవలెను. ఇట్లు శివేతర ధ్యానము నిషేధింపఁబడుచున్నయది.

తన్నిష్ఠయనగా వస్తువును కనుగొనుట మాత్రము కాదు; తన యంతర్యామియని యుపాసించుట యగును. శ్వేతకేతువును గూర్చి "తత్త్వమసి" సత్పదార్థము ఆత్మగ గలవాడవని యుపదేశించి "ఆచార్యవాన్ పురుషో వేద" అట్టి సత్పదార్థమును కనుగొనుటకు ఆచార్యునాశ్రయింపవలెనని యుపాయమును నిర్దేశించి "తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ సంపత్స్యే" ప్రారబ్ధ కర్మాధీనమగు శరీరమునుండి విడిబడుటయే తడవుగా శివోపాసకుఁడు శివుని పొందును" "అస్మాచ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య" అను వాక్యాంతరమున గల శరీర విమోచన పూర్వకముగ బ్రహ్మప్రాప్తి యనంబడు ఫలము ఇట విశదీకరింపఁబడినది.

ఇట్టి నిష్ఠ—"ఆత్మావారే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః"

ఇత్యాది శ్రుతివాక్యముల ననుసరించి శ్రవణ మనన నిదిధ్యాసన రూపమగు శివారాధన మని తెలియుచున్నది.

మరియొక స్పష్టకారణమును నిరాకరించుటకు వాక్రుచ్చుచున్నవారు.

సూ. హేయత్వావచనాచ్చ. ౧-౧-౮

ఇట ప్రధానమే సత్పదవాచ్యమై జగత్కారణముగ చెప్పఁబడినచో సాంఖ్య మతము ననుసరించి ప్రధానము త్యాజ్యమని చెప్పవలసి యుండెను. అట్టి హేయత్వము చెప్పఁబడనందునను "తత్త్వమసి" ఇత్యాది వాక్యముతో సత్పదవాచ్యము మోక్షహేతువగుటచే ధ్యానింపఁదగినదని తెలుపఁబడినందునను ప్రధానము జగత్కారణము కాదనుట సమంజసంబగుచున్నయది.

మరియు ప్రధాన పక్షమున విరోధము కలదని చెప్పుచున్నవారు.

సూ. ప్రతిజ్ఞా విరోధాత్. 1-1-9

"ఏక విజ్ఞానేన సర్వ విజ్ఞానం భవతి" అను ప్రతిజ్ఞకు విరోధమేర్పడుచుండుటచే ప్రధానము సత్పదవాచ్యము కానట్టిది. "యేనాశ్రుతం శ్రుతం భవతి" ఇత్యాది వాక్యముతో - సత్పదవాచ్యమగు తత్త్వమును తెలిసికొనుటవలన తత్కార్యములగు చేతనాచేతన వస్తువులన్నియు తెలియునట్టివి. అని ప్రతిజ్ఞ గావింపఁబడినది. ప్రధానము కారణమగునెడ నీ ప్రతిజ్ఞ సార్థకము కాకుండును. చేతనునకు ప్రధానము కారణమగుట ప్రమాణయుక్తిదూరమగును గదా !

ప్రశ్న : కారణమగు ప్రధానము తెలియునెడ జాడ్య వికారాస్పదము తత్కార్యమునగు ఈ ప్రపంచమంతయు తెలియునది. ఎట్లనగా ? మన్ను తెలిసినచో మృత్కార్యమగు ఘటాదికము తెలియును. కావున శ్రుతిప్రోక్త ప్రతిజ్ఞకు విరోధ మెద్దియు గానరాదు.

ఉత్తరము :

సూ. స్వాప్యయాత్. 1-1-10

"స్వప్నాంతం మే సౌమ్య విజానీహి యత్రైతత్పురుషః స్వపితి నామ సతా సౌమ్య తదా సంపన్నో భవతి స్వమపీతో భవతి తస్మాదేనం స్వపితీత్యాచక్షతే

"సౌమ్యుడా ? నావలన స్వప్నాంతమును అనగా సుషుప్తిని తెలిసికొనుము! ఎప్పుడీ పురుషుఁడు సత్పదార్థమగు పరమేశ్వరునితో కూడియుండునో అప్పుడు తనను మఱచును. అట్టితఱి తత్త్వవేత్తలీ యాత్మను స్వపితి యని చెప్పుచున్నవారు."

ఇట్లు చేతనుఁడైన జీవుఁడు బ్రహ్మముతో కూడియుండుట అనగా స్వవృత్తిలయముఁ జెందియుండుట స్వాప్యయ మనంబడుచున్నది. అప్యయమనగా - ప్రళయము. ఇట్టి ప్రళయము చేతనునకు నచేతనమగు ప్రధానమునందు సంభవింపనట్టిది. కావున ప్రధానము సత్తు కాజాలదని సిద్ధాంతము.

బ్రహ్మమునకు జీవుడు శరీరమగుటచే జీవాత్మను విడిచి యొకప్పుడును బ్రహ్మము వేరుగ నుండనిదగుటవలన జీవాత్మ - స్వోపాదానమగు శివునియందు వృత్తిలయముఁజెందుట పొసగుచున్నది. జీవేశ్వరుల కనన్యత్వము-వ్రేలాడు చెవులు గల దేవదత్తుడు అనుచో లంబకర్ణములు దేవదత్తుడు వేరువేరుగ నుండనట్లు నపృథక్ సిద్ధమైనదిగ చెప్పఁబడుచున్నది. "నీలో ఘటః" "నీలత్వవిశిష్టఘటము" అనుచో నలుపు, కుండయు కూడి యేర్పడుచున్నవి గదా ! ఇవ్విధముగనే జీవేశ్వరులకు కార్యకారణభావము అనన్యత్వము వస్త్వనేకత్వంబును కలిగియుండునది. లయమనగా - స్వరూపవినాశము కాదు. స్వకీయవ్యాపారమును విరమించి స్వాంతర్యామియందు విశ్రాంతిఁజెందుట యగును.

జీవేశ్వరులకు బొత్తుగా భేదములేదని చెప్పునెడ "సుషుప్త్యుత్క్రాంత్యో ర్భేదేన" అను సూత్రముయొక్క భాష్యమున సిద్ధాంతీకరింపఁబడిన జీవేశ్వరభేదము విరోధించును కావున నవినాభావముతో కూడిన భేదము గలవారు జీవేశ్వరులని గ్రహింపవలెను.

సచ్ఛబ్దముతో పరమేశ్వరుఁడే ప్రతిపాదింపఁబడుచున్నవాడు. ప్రధానము కాదని చెప్పుచున్నవారు.

సూ. గతి సామాన్యాత్ 1-1-11

ఈ ఛాందోగ్యమునందు సత్పదము పరమేశ్వరుని చెప్పునది యని యెట్లు గతి కలదో అట్లే శ్రుత్యంతరములందును గానంబడుచున్నది.

"పురుషో వై రుద్రః సన్మహో నమోనమః"

"పురుషుండగు పరమేశ్వరుఁడు సత్పదవాచ్యుండు, తేజోమయుండును. ఇట్టి పరమేశ్వరునకు నమస్కారము."

సూ. శ్రుతత్వాచ్చ 1-1-12

"ఆత్మతః ప్రాణ ఆత్మత ఆకాశః" ఇది మొదలుకొని "ఆత్మన ఏవేదం సర్వమ్"అను వాక్యమువరకు పరమేశ్వరునివలన ప్రాణ ఆకాశాది సర్వంబు నావిర్భవించుచున్నది. ఇట్టి ఛాందోగ్యోపనిషత్తునందే వినంబడుచున్నది కావున జగత్కారణము సత్పదవాచ్యంబు బ్రహ్మమే గాని ప్రధానము కాదని విశదమైనది.

బహుభవన సంకల్పము చేతన ధర్మమగుటచే ప్రధానము జగత్కారణము కాదని నిరూపింపఁబడినది గదా! పరమతమున జగము భ్రాంతి మూలమగుటచే స్థాణ్వాదులు భ్రమాధిష్ఠానములగుటవలనను మిథ్యయగు ప్రధానమును నిషేధింప రాదు కావున శివాద్వైతమునందీ సమర్థనము సమంజసంబగుచున్నయది. ఇయ్యది ఈక్షత్యధికరణము.

## ఆనందమయాధికరణము

శాస్త్రము వలననే గుర్తెరుగఁదగు జగత్కారణత్వ లక్షణము ప్రధానమునందు వర్తింపదని నిరూపించి చేతనుడైన జీవునియందును జగత్కారణత్వము చెల్లనేరదని ప్రతిపాదించునదీ యధికరణము.

సూ. ఆనందమయోఽభ్యాసాత్. 1-1-13

"తస్మా ద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః" మొదలుకొని "తస్మాద్వా ఏతస్మాద్విజ్ఞానమయాత్ అన్యోఽంఽతర ఆత్మాఽఽనందమయః" వరకు ఆకాశాది సర్వభూత కారణముగాను అన్నమయాది కోశములనంబడు కవచములలోన దాగియుండువాడుగాను ఆనందవల్లియందు వినంబడు ఆనందమయుడైన ఆత్మ-జీవుడా? పరమేశ్వరుడా? అని సందేహము.

ప్రశ్న: జీవధర్మములు నిట ప్రతిపాదింపఁబడినందున ఆనందమయుఁడు జీవాత్మ కాదనుము. ఎట్లనగా? "పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోఽన్నం, అన్నా

త్పురుషః" ఇత్యాది వాక్యములతో ఐదు నంగములు గల శరీరము మొదలగునవి నిరూపింపఁబడుచున్నవి.

ఈ సందర్భమున అన్నమయమనగా శరీరమగును. ప్రాణమయమనగా శరీరాంతర్వర్తియగు ప్రాణము; మనోమయమనగా ప్రాణములో నుండు మనస్స గును. విజ్ఞానమయమనగా మనస్సులోని బుద్ధి; ఆనందమయుడైతేనో అన్నమయాది సర్వకోశముల కాశ్రయుండగు జీవుండేను; అన్నమయాది కోశములకు తలకాయ, రెక్కలు, వెన్ను, నడుము అను నవయవములను కల్పించుట యుపాసనకొరకని గ్రహింపవలెను. అన్నమయాది కోశములను బ్రహ్మముగ భావించుటవలన అన్నాది సమృద్ధి కలుగునని ఫలముగూడ చెప్పఁబడినది.

"సంసార సముద్రములో నిమగ్నుడై బాధపడుచున్న జీవునకానంద మయత్వ మెట్లు సంభవించు" నని శంకింపఁ గూడదు. "ఆనందో బ్రహ్మ" అని శ్రుతి ప్రతిపాదించుచున్నందున ఆనందము పరబ్రహ్మమగును. మయట్ ప్రత్య యము వికారార్థక మగుటంజేసి బ్రహ్మకార్యమగు జీవుడే ఆనందమయుడు కావగు నని చెప్పవలసియున్నది. నిత్యము శివత్వముతో కూడియుండు బ్రహ్మము ఆనంద మయమని అంగీకరించునెడ "అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయాఽ నందమయా మే శుద్ధ్యంతామ్" అను శుద్ధిప్రార్థన- వ్యర్థమగునది. కావున ఆనంద మయుఁడగు ఆత్మ జీవుండేను. పరమేశ్వరుఁడు కాజాలడు.

ఉత్తరము: ఆనందమయుండైన ఆత్మ - పరమేశ్వరుండేను ఎట్లనఁగా ? బ్రహ్మానందము మిక్కిలి శ్రేష్ఠమైనదని శ్రుతియందు వక్కాణింపఁబడినది.

"సైషాఽఽనందస్య మీమాంసా భవతి"అని ప్రారంభించి మనుష్యశ్రేష్ఠుడు మొదలుకొని చతుర్ముఖ బ్రహ్మవరకు "మనుష్యానందముకన్న గంధర్వానందము శతగుణ మధికము" అను రీతిగా చెప్పిన పిమ్మట "స ఏకో బ్రహ్మణ ఆనందః" బ్రహ్మానందము నిరతిశయమైనదని యభ్యసింపఁబడియున్నది. ఇట్టి అత్యంత శ్రేష్ఠమగు బ్రహ్మానందము కలిగియుండుట సంసారియగు జీవునకు సంభవింప నట్టిది.

"ఆనందమయుడు పరమాత్మయగుచో నిత్యశుద్ధుడైన ఆనందమయుని గురించి చేయఁబడు విశుద్ధి పార్థన యెట్లు పొసగునను ఆశంకకు సమాధానమే మనఁగా ?

సంపూర్ణప్రకాశము గల చంద్రునకు నాచ్ఛాదకమైన మేఘము తొలగిన యెడల ప్రకాశము ప్రసరించుటవలె నిత్యశుద్ధుడైన పరశివుని సాక్షాత్కారమునకు ప్రతిబంధకమగు తన యజ్ఞానమును పోగొట్టుకొనుటకు శుద్ధి ప్రార్థన సంగతంబగునది కావున నానందమయుఁడు పరమేశ్వరుండేను.

"యతో వాచో నివర్తంతే"అను వాక్యము మనోవాక్కుల కందరాని నిరతిశయత్వమును బ్రహ్మానంచమునకు సమర్థించుచున్నది. ''రసో వై సః, రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి" "పరమాత్మ రసస్వరూపుడు, ఇట్టి పరమాత్మను పొందియే జీవుఁడానందము ననుభవించువాడు'' ఇదియే పరమపురుషార్థము కావున తత్పూర్వము జీవుడు సంసారియగుటఁ జేసి యానందమయుఁడు కాజాలకుండును.

ప్రశ్న : ఆనందమే బ్రహ్మమని శ్రుతులందు చెప్పఁబడుచున్నది గదా! అట్టితఱి ఆనందవికారము గలవాడు ఆనందమయుడు కావలసి వచ్చును. మయట్ ప్రత్యయము వికారార్థము గలదగుటవలన ఆనందవికారము గలవాడు పరమేశ్వరుఁడగునని చెప్పునెడ బ్రహ్మము తద్భిన్నమగును. అట్లంగీకరించినచో పరమేశ్వరుఁడు వికారరూపము కలవాడగును కావున ననిత్యుఁడగును.

సూ. వికారశబ్దాన్నేతి చేన్న ప్రాచ్యురాత్ 1-1-14

మరియు అన్నమయ ప్రాణయమ మనోమయాదులు అన్నప్రాణమనో వికారరూపము లగునట్లు ఆనందమయుండు నానందవికారము కలవాడగును. ఘటాదులు మృద్వికారములై మృణ్మయము లనంబఱగుచున్నవి గదా! ఇట్టితఱి పరమేశ్వరుఁడానందమయుఁడని వికారము నాపాదించుట సమంజసము కాదు గావున జీవుండనియే చెప్పవలెను.

ఉత్తరము : ఇఁట మయట్ శబ్దము ప్రాచుర్యమను నర్థము గలది యగును. అన్నమయ ప్రాణమయ మనోమయముల వరకే మయట్- వికారార్థమును బోధించును. విజ్ఞానమయుండనగా - విజ్ఞానము మిక్కుటముగ గల జీవాత్మయగును. ఆనందమయుఁడనఁగా- ఆనందపరిపూర్ణుఁడగు పరమేశ్వరుఁడగును.

మయట్ శబ్దము వికారప్రకరణమునందు పఠింపఁబడినదగుటచే నన్నివిధములుగ వికారార్థము సముచితంబగు- నను నాశంకకు సమాధాన మీ సూత్రము.

సూ. తద్ధేతువ్యపదేశాచ్చ 1-1-15

"ఏష హ్యే వానందయాతి'' అను వాక్యము జీవాత్మల నానంద పఱుచువా డగుటచే పరమేశ్వరుఁ డానందమయుఁడని చెప్పుచున్నయది. స్వయముగ పూర్ణానందము గలవాడు ఇతరుల నానందింపఁజేయుఁగదా! ఇందువలన పరమేశ్వరుఁడే ఆనందమయుఁడగువాడు.

మయట్ ప్రత్యయమునకు వికార ప్రాచుర్యార్థములు సాధారణములు కాగా "ఏష హ్యేవానందయాతి" అను వాక్యశేషమువలన ప్రాచుర్యార్థమే చెప్పఁదగి యున్నది. దేవమానవాది జీవు లనుభవించు విషయానందము బ్రహ్మానంద లేశ మగునని "ఏతస్యైవానందస్యాన్యాని మాత్రాముపజీవంతి" అను వాక్యము తెలుపు చున్నయది. లోకమున సంపూర్ణ శ్రీమంతుడగువాడు పరులను ధనికులను చేయఁ జాలును గదా!

ఆనంద ప్రచురుఁడగు పరమేశ్వరుఁడానందమయుండని చెప్పినను బ్రహ్మ భిన్నుఁడని తెలియుచున్నది. ఎట్లనగా ? "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా"అను వాక్యము వలన ఆనందమయునకు బ్రహ్మమాధారమగునని బోధపడునుగదా! పరమేశ్వరుఁడు బ్రహ్మము వేరువేరని యంగీకరించునెడ బ్రహ్మము పరతంత్రమగును కావున జగత్కారణత్వాది లక్షణములుపపన్నములు కాకుండును.

ఇందువలన ఆనందమయుడు జీవాత్మయను పక్షము సమీచీనమైనదను శంకకు సమాధాన మీ సూత్రము.

సూ. మాంత్రవర్ణిక మేవ చ గీయతే 1-1-16

మంత్రవర్ణమునందు "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అను వాక్యముచే చెప్పఁబడిన బ్రహ్మమే "అన్యోఽంతర ఆత్మాఽఽనంద మయః" అను వాక్యము వలన నానందమయముగ వక్కాణింపఁబడుచున్నది. "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" అను వాక్యములోని బ్రహ్మశబ్దము ప్రణవమును బోధించునది. ఇట్టి ప్రణవము పరమేశ్వరవాచకంబగుటచే పరమేశ్వరున కాధారంబగుచున్నయది.

"బ్రహ్మవిదాప్నోతి పరమ్" ఇత్యాది వాక్యములతో ఆనందవల్లి యందు నిరూపింపఁబడిన విషయము నంతయు సూచించున దీ సూత్రము. ఎట్లనఁగా ?

బ్రహ్మము ఎద్ది ? బ్రహ్మమును తెలిసికొనుట యెట్లు ? బ్రహ్మజ్ఞానమువలన లభించు పరమోత్కృష్ట ఫల మెద్ది? అను ప్రశ్నత్రయమునకు "సత్యం జ్ఞాన మనంత బ్రహ్మ" "యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్" "సోఽశ్నుతే సర్వాన్ కామాన్" అను మూడు వాక్యములు సమాధానములుగ ప్రతిపాదింపఁబడియున్నవి.

ఇవ్విషయమై కొందరిట్లు అభిప్రాయపడుచున్నవారు.

సకలప్రపంచ ప్రకృతియగు చిదంబరశక్తి-ఆనందమయము గాని జగన్నిమిత్తమగు విశ్వాతీతమైన పరబ్రహ్మము కాదు. ఎందుకనగా? "సత్యం జ్ఞాన మనంతం" అని బ్రహ్మము ప్రతిపాదింపబడినది. "తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః" ఆకాశాది ప్రపంచమునకు ప్రకృతిగా చెప్పఁబడిన పరమాకాశము (చిదంబరము) ఆనందమయము కాదగును. "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" అను వాక్యము - ఆనందమయ చిదాకాశమునకు బ్రహ్మ మాధారంబని తెలుపునది. "యదేష ఆకాశ ఆనందో న స్యాత్"అను వాక్యము - ఆకాశాది ప్రపంచ ప్రకృతి యగు పరమాకాశము ఆనందమయంబని విశదీకరించినది. ఇందువలన "స ఏకో బ్రహ్మణ ఆనందః" ఆనందము బ్రహ్మాశ్రితమని శ్రుతి ప్రతిపాదించుచున్నయది.

మఱల నిట్టి యానందమే "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్, ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే" ఇత్యాది శ్రుతివాక్యములతో సమస్తజగత్కారణము మగ పేర్కొనంబడుచున్నది.

ఇఁట "ఆనందో బ్రహ్మ" అను వాక్యముతో ఆనందమునకు చేయఁబడిన బ్రహ్మత్వవ్యవహారము బ్రహ్మధర్మంబగుటచే నానందము బ్రహ్మ భిన్నమను నుద్దేశముతో గావింపఁబడినది. మరియు "సైషా భార్గవీ వారుణీ విద్యా పరమే వ్యోమన్ ప్రతిష్ఠితా" బ్రహ్మధర్మ స్వరూపము గలదియు, పరమానందరూపము, ప్రపంచప్రకృతియు పరమశక్తియు నగు చిద్రూపమైన పరమాకాశమునందు వారుణీ (బ్రహ్మ) విద్య సమాప్తిఁ జెందినదని చెప్పఁబడినది కావున నిట్టి పరమశక్తి - ఆనందమయంబనియు పరబ్రహ్మము - ఆనందము ధర్మముగ కలదగుటంజేసి యానందమయమున కాధారమగుననియు తెల్పుచున్నది. విజ్ఞానమయుఁడు బ్రహ్మోపాసకుఁడగు జీవుండగును.

ప్రతిష్ఠయు ధర్మియు నగు బ్రహ్మమునకు ధర్మము శక్త్యాత్మకంబునగు

ఆనందమయమునకు భేదము గానరానందున నానందమయుఁడు బ్రహ్మంబను నభి ప్రాయముతో సూత్రకారుడు "ఆనందమయోఽభ్యాసాత్" అను నీ సూత్రమును వచించినవాడాయెను.

"సత్యం జ్ఞాన మనంతమ్" అను వాక్యములోని యానంత్యమును కారణ ప్రతిపాదక శ్రుతివాక్యములనేకములు నిరూపించినవి. ఏవం అన్నమయాది కోశ చతుష్టయాంతర్వర్తియగు గుహ - బ్రహ్మమునకు నివాసమగునని అన్నమయాది వాక్యములు చెప్పుచున్నవి.

మరియు ఆనందమీమాంసవలన సర్వకామావాప్తిరూపమైన ఫలము విశదీ కరింపఁబడినది. హృదయ గుహాంతరాళమున బ్రహ్మనివాస ప్రదేశముగ నిర్దేశిం పఁబడిన పరమాకాశము- ఆనందమయంబనియు అందుండు బ్రహ్మము తదాధార మనియు ప్రణవము కాదనియు తెలియునది.

భూమిపై నుండు పర్వతము భూధరమగునట్లు స్వశక్తియగు పరమాసన మందుండు పరబ్రహ్మము ఆనందమయ చిచ్ఛక్తికి ప్రతిష్ఠ యగుటలో విరోధ మెద్దియు గానరాదు.

శివునివలె శివసంబంధము గల చిచ్ఛక్తియు సృష్ట్యాదిపంచకృత్య కారణు రాలు కానగును. పరమేశ్వరుఁడు శక్తివిశిష్టుడైతేనే శుద్ధము అశుద్ధమునగు సమస్త ప్రపంచముఁజెందిన పంచకృత్యములను గావింపఁజాలువాడు.

ఇందు కీ దిగువ పురాణ శ్లోకములను గాననగును.

శక్తిః సాక్షా న్మహాదేవీ మహాదేవస్తు శక్తిమాన్
తయో ర్విభూతిలేశో వై సర్వమేత చ్చరాచరమ్.

వస్తు కించి దచిద్రూపం కించిద్వస్తు చిదాత్మకమ్
ఇదం శుద్ధ మశుద్ధం చ పరం చాపర మేవ చ.

యత్సంసరతి చిచ్చక్ర మచిచ్చక్రసమన్వితమ్
తదేవాశుద్ధ మపర మితరత్తు పరం శుభమ్.

అపరంచ పరంచైవ ద్వయం చిదచిదాత్మకమ్
శివస్యచ శివాయాశ్చ స్వామ్యం చైత త్స్వభావతః.

యథా శివ స్తథా దేవీ యథా దేవీ తథా శివః
నానయో రంతరం విద్యా చ్చంద్రచంద్రికయో రివ.

చంద్రో న ఖలు భాత్యేవ యథా చంద్రికయా వినా
న భాతి విద్యమానోఽపి తథా శక్త్యా వినా శివః.

ఏవం పరస్పరాపేక్షా శక్తిశక్తిమతోః స్థితిః
న శివేన వినా శక్తి ర్న శక్త్యాచ వినా శివః.

శక్తో యయా శివో నిత్యం భుక్తౌ ముక్తౌచ దేహినామ్
యా మాహు రఖిలేశస్య తై స్తైరనుగుణై ర్గుణైః.

సమానధర్మిణీ మేవ శివస్య పరమాత్మనః
యథా న జాయతే పుత్రః పితరం మాతరం వినా.

తథా భవం భవానీం చ వినా నైత చ్చరాచరమ్
స్త్రీపుంసప్రభవం విశ్వం స్త్రీపుంసా త్మక మేవ చ.

స్త్రీపుంసయో ర్విభూతిశ్చ స్త్రీపుంసాభ్యా మధిష్ఠితమ్
తస్మా త్సహ తయా శక్త్యా హృది పశ్యంతి యే శివమ్.
తేషాం శాశ్వతికీ ముక్తి ర్నేతరేషా మితి శ్రుతిః.

శక్తి యనగా—సాక్షాత్తు పార్వతీదేవి యగును ఇట్టి శక్తితో నిరంతరము కూడియుండు పరమపురుషుఁడు- మహాదేవుఁడనఁబడుగును. ఈ చరాచరమంతయు పార్వతీ పరమేశ్వరుల విభూతిలేశమగునది. ఇట్టి విభూతిలేశము చిద్రూపమని యచిద్రూపమనియు శుద్ధమని యశుద్ధమనియు పరమని యపరమనియు రెండు రెండు విధములగునది. ఈ రెండును పార్వతీశంకరుల యధికారము స్వభావ సిద్ధముగ కలిగియుండునవి. అచిత్సమూహముతో కూడిన చిత్సమూహము సంసార బద్ధమగుచు అపరమనంబడును. సంసారబద్ధముగాని జీవసముదాయము పరమనం బడును. శివుం డెట్టివాడో శక్తియు నట్టిదే యగును. శక్తివలె శివుఁడును భావింపఁ దగినవాడు. చంద్రునకు వెన్నెలకు వలె పార్వతీ పరమేశ్వరులకు నంతరమును చూడరాదు. చంద్రికలేనిది చంద్రుఁడు ప్రకాశింపనట్లు శివుఁడు భావస్వరూపుడై

నను శక్తిలేనిది విరాజమానుఁడు కాజాలడు. ఇట్లు శక్తి శివుల యునికి పరస్పరము అపేక్ష కలిగియుండునది. శివుడు శక్తిద్వారా ప్రాణులకు భుక్తి ముక్తి ఫలముల నొసగువాడు. ఆ యా అనుకూల ధర్మములతో పరమాత్మయగు శివుని సహచారిణి యగునది శక్తి యనంబడును. తలిదండ్రులు ఉభయలుండిననే పుత్రోదయ మగు నట్లు గౌరీశంకరులలో నెవరిని నిరాకరించినను ప్రపంచోద్భవము కాజాలదు. ప్రపంచ మైతేనో స్త్రీ పురుషాత్మకమై స్త్రీపురుషస్వరూపులగు శక్తి శివులవలన నావి ర్భవించునది. స్త్రీపురుషులగు శక్తిశివుల విభూతిలో స్త్రీపురుషులగు జీవులిమిడి యున్నవారు. కావున శక్తి విశిష్టుడైన శివుని - హృదయమున భావించి కనుగొను వారికే పునరావృత్తి రహితనుగు మోక్షము (పరమపదము) చేకూరును. కాని తది తరులకు సంభవింపఁజాలదను నీయంశమంతయు శ్రుతిసమ్మతమై యున్నది. మరియు

సా శక్తిః సర్వదా సూక్ష్మా ప్రబోధానందరూపిణీ
శక్తిమానుచ్యతే దేవః శివః శీతాంశుభూషణః.

మహదాది విశేషాంతా స్త్వజాద్యాశ్చైవ మూర్తయః
యచ్చాన్యదస్తి తత్సర్వం తస్యాః కార్యం న సంశయః.

సా దేవీ మాయయా సర్వం బ్రహ్మాద్యం సచరాచరమ్
మోహయత్యప్రయత్నేన మోచయత్యపి లీలయా.

యా సా మాహేశ్వరీ శక్తి ర్జ్ఞానరూపాఽతిలాలసా
వ్యోమసంజ్ఞా పరాకాష్ఠా సేయం హైమవతీ తథా.

సేయం కరోతి సకలం తస్యాః కార్య మిదం జగత్
న కార్యం నాపి కరణ మీశ్వరస్యేతి సూరయః-

సైషా మాహేశ్వరీ గౌరీ మమ శక్తి ర్నిరంజనా
శాంతా సత్యా పరానందః పరంపద మితి శ్రుతిః.

అస్యాః సర్వ మిదం జాత మత్రైవ లయ మేష్యతి
ఏషైవ సర్వభూతానాం గతీనా ముత్తమా గతిః.

జ్ఞానానంద స్వరూపిణియు, ఎల్లకాలము సూక్ష్మరూపము గలదియు శక్తి యనంబడును. చంద్రశేఖరుడైన శివుఁడు శక్తిమంతుడని చెప్పఁబడును. మహత్తు మొదలుకొని ఆదిశేషుడువరకు గల తత్త్వములు బ్రహ్మాదిమూర్తులును తదితర సమస్తంబును శక్తి కార్యములగుచున్నవి. బ్రహ్మాది ప్రపంచమునంతయు తన విచిత్ర సామర్థ్యముతో నప్రయత్నముగా మోహింపఁజేయునది, విలాసముగ విడుదలఁజేయించునదియు శక్తియే యగును. జ్ఞానము స్వరూపముగా గలదియు మిక్కిలి యనురాగము గలదియు చిదాకాశమను నంజ్ఞకలదియు ధ్యానముఁదగు పరమావధియునగు మహేశ్వరుని శక్తియే హైమవతి యనంబడును. ఇట్టి పార్వతీదేవియే సమస్తమును గావించుచున్నయది.

వస్తుతః మహేశ్వరుడు స్వయముగ (శక్తిద్వారా గాక) నేమియు చేయువాడు కాడు. అట్టి మహేశ్వరశక్తి - ఎట్టి పుణ్యపాపలేపము లేనిదై మహేశ్వరుని యధీనురాలుగ నుండునది. మరియు శాంతయనియు, సత్యస్వరూణియనియు, గౌరియనియు పరానందమనియు, పరమపదమనియు శ్రుతులయందు పేర్కొనంబడుచున్నయది. ఈప్రపంచమంతయు మహేశ్వరప్రేరిత యగుశక్తివలన నావిర్భవించునదై శక్తి యందే సూక్ష్మదశ (ప్రళయము)ను పొందునది. ఇట్టి శక్తియే ప్రాణులందరు తాము గావించు శివోపాననలో మొదట చూడదగిన చిదంబరమగు టంజేసి గతులలో నుత్తమగతిగ భావింపఁదగినది.

ఇట్లు శివ లింగ కూర్మపురాణాదులయందు శక్తిశివులకు ప్రత్యేకముగ చెప్పఁబడిన సృష్ట్యాది పంచకృత్యములు - పరస్పరాపేక్షతో నెరవేరునవి యని గ్రహింపవలెను. శివునికైనను శక్తికైనను నిషేధింపఁబడిన పంచకృత్యములు పరస్పరాపేక్షలేని స్థితియందు వర్ణింపఁబడినవని తెలియునది.

తథాఽపి శివుడు సర్వాత్మనా స్వతంత్రుడనియు శక్తి శివుని విషయమై మాత్రము పరతంత్రురాలుగ నుండుననియు దిగువ ప్రమాణము విశదీకరించుచున్నయది.

సైకా పరా చ చిద్రూపా శక్తిః ప్రసవధర్మిణీ
విభజ్య బహుధా విశ్వం విదధాతి శివేచ్ఛయా.
ఏవ మేషా పరా శక్తి రీశ్వరేచ్ఛానువర్తినీ
స్థిరం చరం చ యద్విశ్వం సృజతీతి వినిశ్చయః,

ప్రసవము ధర్మముగా గల చిచ్ఛక్తి యొకతే శివేచ్ఛ ననుసరించి ప్రపంచము ననేక రీతులుగ విభజించి నిర్మించుచున్నయది. మరియు పరమేశ్వరాజ్ఞాబద్ధురాలై చరాచరమునంతయు విపులీకరించుచున్నది. కావున శక్తిశివులకు గల బ్రహ్మభావమునందు విశేషణ విశేష్యత - అనగా శక్తికి విశేషణభావము శివునకు విశేష్యభావంబును గ్రహింపదగినవి. ఇందువలననే శక్తిశివుల నారాధించుటలో పూర్వాపరక్రమమును శివపురాణము విధించుచున్నయది.

యథా దేవస్య దేవ్యాశ్చ కుర్యా త్స్నానాదికాం క్రియామ్
న తు కశ్చి ద్విశేషోఽస్తి తత్ర తౌ సదృశౌ యతః.

ప్రథమం దేవ ముద్దిశ్య కుర్యా త్స్నానాదికాం క్రియామ్
పశ్చా ద్దేవ్యై ప్రకుర్వీత దేవదేవస్య శాసనాత్.

శక్తికి శివునకును స్నానము మొదలగు నుపచారములను సమర్పించుటలో విశేషమేమియు గానరాదు. ఎందుకనఁగా? పూజ్యభావమున శక్తిశివు లుభయులును సమానప్రతిపత్తి గలవారు. కాని శివునకు మొదట; శక్తికి తరువాత స్నానాదులను సమర్పించవలసియుండును. ఇద్ది మహాదేవుని శాసనంబని గ్రహించునది.

ఇందుకు శ్వేతాశ్వతర మంత్రము ప్రమాణముగా చూపఁబడుచున్నయది.

"యుజేవాం బ్రహ్మపూర్వ్యం నమోభి ర్విశ్లోకా యంతి పథ్యేవ సూరేః,
శ్రుణ్వంతి విశ్వే అమృతస్య పుత్రాః ఆ యే ధామాని దివ్యాని తస్థుః''

"శక్తిశివులారా? వాం - మీ యిరువురిలో పూర్వ్యం - విశేష్యమగుటచే మొదటిదియు ముఖ్యంబు నగు బ్రహ్మ - శివస్వరూపమును నమోభిః- (శివుడు సర్వనమస్కారపర్యవసానభూమి యగుటచే) నమస్కారాంకితములగు శ్లోకములతో యుజే - అనుసంధింపఁజేయుచున్నానని భావము.

సూరేః- శివస్వరూపమును తెలిసికొనుటవలన ముక్తుడనగు నా; విశ్లోకాః- వివిధ వర్ణనములు గల శ్లోకములు వాచిక శివనమస్కార సందర్భరూపముగలవి "అహం శ్లోకకృత్" ముక్తకృత్యములుగా శ్రుతి ప్రసిద్ధములైనవి పథ్యేవ-మార్గమున హితకరములగు మంచి గుఱ్ఱముల వలె యంతి - నిరర్గళప్రవాహము వలె

బయలువెడలుచున్నవి. అమృతస్య - "ఏతాని హ వా అమృతస్య నామధేయాని" శ్రుతిప్రసిద్ధ అమృతనామదేయము గలిగినట్టి పరమేశ్వరుని యొక్క విశ్వేపుత్రాః "దివ్యా గణా బహురూపాః పురాణాః'' ఇత్యాది శ్రుతిప్రసిద్ధులగు స్కంద నంది కేశ్వరాది పుత్రులందరును శ్రుణ్వంతి - (నా శ్లోకములను) ఆదరముతో విను చుందురు. యే - స్కందనందికేశ్వరాదు లెవరో వారు దివ్యాని - చిదాకాశరూప మైన నిత్యకైలాసముననుండు ధామాని - భవనములను అతస్థుః - ఆశ్రయించి యున్నవారు.

ఇట్లు శక్తిశివులకు బ్రహ్మభావము స్ఫురించుచున్నను శివునకు పూర్వభావ ముండుటచే విశేష్యత యేర్పడుచున్నది. కావున శక్తివిశేషణ విశిష్టమగు బ్రహ్మ మును భావించుటలో తదేకదేశమగు శక్తికి బ్రహ్మత్వము వ్యవహరింపఁదగినది కాని ప్రత్యేకించి శక్తికి బ్రహ్మత్వమును భావింపరాదనియు, ఆనందమయము చిచ్ఛక్తియనియు తదాధారము పరబ్రహ్మమనియు కేచిత్పక్షసారాంశము.

మరికొందరు దిగువవిధముగ తమ నిర్వచనముఁ దెలిపినవారు.

"అస్మాల్లోకా త్ప్రేత్య ఏత మన్నమయ మాత్మాన ముపసంక్రమ్య'' ఇత్యాది శ్రుతివాక్యములందలి అన్నమయాదికోశములకు ప్రత్యేకము చేతనవాచక మగు ఆత్మశబ్దము సంబంధించుటచే సంసారబంధమునుండి విడిబడిన ముక్త పురుషునకు నన్నమయాదికోశానుమిత పృథివ్యాది పంచభూతముల నధిష్ఠించు బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివులనంబడు కారణపురుషులు వరుసగా పొందఁదగినవారు. (ఇట్టి ఐదుగురును శివస్వరూపులే యగువారు) అన్నమయాది ఆత్మల కాధారమగు సదాశివుండానందమయుండగువాడు. ఇట్టి సదాశివునకు పరమశివాఖ్యమైన బ్రహ్మము కారణమై ప్రతిష్ఠ యగుచున్నది. సదాశివుఁడు శివు నితో నభిన్నుఁడగుటంజేసి పరబ్రహ్మముగా వ్యవహరింపఁబడుచున్నవాడు.

ఏతాదృశ మతత్రయమందు నానందమయుఁడు శక్తితోడ నవినాభావము గలిగియుండునట్టి సదాశివుఁడుగ వ్యవహరింపఁబడునట్టియు పరమేశ్వరుఁడే యగుచున్నవాడనియు జీవాత్మ ఆనందమయుడు కాడనియు ఈ మూడు విధము లలో నెద్దానిని స్వీకరింపవలెనను విశేషవిచారము నిష్ప్రయోజనమనియు విశద మైనది.

## ఇతరానుపపత్త్యధికరణము

పరమ శివాఖ్యమగు బ్రహ్మమునకు జగత్కారణత్వాది లక్షణము సమన్వయముతో నేర్పడినదిగదా! అట్టి లక్షణము ప్రధానమునందును జీవునియందును సంభవింపదని బాగుగా నిరూపించి జీవసమష్టి స్వరూపుడగు హిరణ్యగర్భునియందును పొసగజాలదను నుద్దేశముతో దిగువసూత్రము ఉదాహరింపబడినది.

సూ. "నేతరోఽనుప పత్తేః. 1-1-17

"యతః ప్రసూతా జగతః ప్రసూతీ
తోయేన జీవాన్ వ్యససర్జ భూమ్యామ్,
యదోషధీభిః పురుషాన్ పశూంశ్చ
వివేశ భూతాని చరాచరాణి"

జగమును విస్తరింపఁజేయు ప్రకృతి - పరమాత్మవలన నావిర్భవించునట్టిది. మరియు పరమేశ్వరుఁడు భూలోకాదులందు జలప్రధానములగు పృథివ్యాది ద్రవ్యములతో దేవమానవాది ప్రాణులను సృజించుచున్నవాడు. ఓషధులు మున్నగు స్థావరములను సురనరాది పురుషులను పశు పక్ష్యాది తిర్యగ్జంతువులను చరాచర భూతముల నన్నిటి నంతర్యామిగఁ బ్రవేశించుచున్నవాడు".

ఇఁట జగత్ప్రసూత్యాది కర్తగా వినంబడు పురుషుఁడు పరమేశ్వరుడా? ఇతరుడా? అని సందేహము.

ప్రశ్న : హిరణ్యగర్భుడే ప్రతిపాదింపఁ దగినవాడు. ఎట్లనఁగా?

ఏకార్ణవే తు త్రైలోక్యే - బ్రహ్మా నారాయణాత్మకః
భోగిశయ్యాయుతః శేతే - త్రైలోక్యగ్రాసబృంహితః.

-విష్ణుపురాణము

లోకత్రయము సముద్రమయమగునపుడు బ్రహ్మదేవుఁడు మూడు లోకముల నొక కబళముగ పరిగ్రహించుటఁజేసి గొప్పదగు నారాయణ స్వరూపము గలవాడై సర్పశయనమున పవళించువాడు.

ఇట్లు చెప్పుటవలన చతుర్ముఖునకు సముద్రశాయిత్వమను లక్షణము విదితమగుచున్నది.

"య మంతః సముద్రే కవయో వయంతి" "ప్రజాపతి శ్చరతి గర్భే అంతః" అను శ్రుతివాక్యముల వలనను సముద్రశాయిత్వము సర్వానుప్రవేశంబు నీ యుపనిషత్ప్రారంభమునందు వినఁబడుచున్నవి.

"సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్ దివంచ పృథివీంచ" ఇత్యాది సందర్భముతో నుపసంహారమందు సూర్యచంద్రాది సర్వజగత్కారణత్వము బ్రహ్మదేవునకు గలదని పొడగట్టుచున్నది కావున నుపక్రమోపసంహారములందు బోధపడు హిరణ్యగర్భుఁడు నవాంతరములగు సముద్రశాయిత్వాది ధర్మములు కలిగియే యుండువాడు, మరియు "అద్భ్యః సంభూతో హిరణ్యగర్భ ఇత్యష్టౌ" అనుచో హిరణ్యగర్భుని ప్రతిపాదించు మరియొక సందర్భముయొక్క యుపసంహారము గావింపఁబడినది. "అద్భ్యః సంభూతః" అనుచో "ప్రజాపతి శ్చరతి గర్భే అంతః" అను వాక్యము ననుసరించి హిరణ్యగర్భుడే ప్రతిపాదింపఁదగినవాడు. "హిరణ్యగర్భః సమవర్తతాఁగ్రే" అనుచో "ప్రజాపతి ర్వై హిరణ్యగర్భః" అను వాక్యముఁబట్టి చతుర్ముఖుండనియే గ్రహింపవలెను, కావున జగత్ప్రసూతి మొదలగు కారణముగ హిరణ్యగర్భుడే ప్రతిపాదింపఁబడుచున్నవాడు.

మహోపనిషత్తునందలి పూర్వానువాకమునకు పురుషసూక్తమునకు నేకవాక్యతయుండుటచే పురుషసూక్తము నారాయణపరమగును కావున నీ యుపనిషత్తు హిరణ్యగర్భుని భోదించుట యెట్లందురేని పురుషసూక్తము విష్ణుపరము కాకుండుట యెట్లో విచారింతము.

"సహస్రశీర్షా పురుషః" ఇత్యాది మంత్రములు - శ్వేతాశ్వతరోపనిషత్తునందు శివపరములుగా చెప్పఁబడినందున నవ్వానితో పరమేశ్వరుని ప్రశంసించి "తస్మాద్విరాడజాయత" పరమేశ్వరుని వలన విరాజమానమగు బ్రహ్మాండముయొక్కయు "విరాజోఽధిపూరుషః" బ్రహ్మాండమునుండి హిరణ్యగర్భుండను పురుషునియొక్కయు నావిర్భావము చెప్పఁబడినది.

ఇట్లు బ్రహ్మాండోత్పన్నుడైన హిరణ్యగర్భునియొక్క ముఖము మొదలగు నవయవములనుండి బ్రాహ్మణాదిప్రజలు ఇంద్రచంద్రాది దేవతలును జన్మించిరని విశదీకరింపబడినది కావున పురుషసూక్తము పరమేశ్వర ప్రతిపాదకమై బ్రహ్మాండ హిరణ్యగర్భాద్యుత్పత్తిని విశదీకరించునదని గ్రహింపవలెను.

శ్లో॥ లోకానాం తు వివృద్ధ్యర్థం ముఖబాహూరుపాదతః
బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రం చ నిరవర్తయత్.

పరమేశ్వరుని బ్రహ్మాండమనంబడు నుదరమునుండి యావిర్భవించిన బ్రహ్మదేవుడు తన ముఖాద్యంగములనుండి బ్రాహ్మణాది ప్రాణులను పుట్టించెను. ఇట్లు మనుస్మృతియు చెప్పుచున్నది కావున బ్రాహ్మణాది సృష్టి - కేశవుని యవయవములనుండి కానట్టిది. మరియు "హ్రీశ్చ తే లక్ష్మీశ్చ'' అనువాక్యము - ఉపక్రమగత ప్రజాపతిశబ్దము ననుసరించి హ్రీ పదము లజ్జావాచకమనియు లక్ష్మీ పదము శ్రేష్ఠగుణవాచకమనియు తెలియునది కావున నుత్తరనారాయణంబు బ్రహ్మపరమేయగునది. ఇవ్విధము పురుషసూక్తము మహోపనిషదనువాకములు నేకవాక్యత కలిగియుండుటఁజేసి యిట హిరణ్యగర్భుఁడే జగత్కారణముగ ప్రతిపాదింపఁదగినవాడు గదా!

ఉత్తరము : పరమేశ్వరభిన్నుఁడగు హిరణ్యగర్భుఁడీ సందర్భమున జగత్కారణముగ ప్రతిపాదింపఁదగినవాడు కాడు ఎట్లనగా?

"యతః ప్రసూతా జగతః ప్రసూతీ'' మొదలుకొని "అతఃపరం నాన్యదణీయసం హి పరాత్పరం యన్మహతో మహాంతమ్, యదేక మవ్యక్త మనంత రూపం విశ్వం పురాణం తమసఃపరస్తాత్" ఇత్యాది వాక్యములవరకు చెప్పఁబడిన సర్వోత్కృష్టత్వము మరియు తమోమయమగు ప్రకృతిమండలము నతిక్రమించి యుండుటయు బ్రహ్మాండాంతర్వర్తియగు హిరణ్యగర్భునకు పొసగనట్టివి. మరియు "య ఏనం విదు రమృతా స్తే భవంతి" ఇట్టి తమోఽతీతుని తెలిసికొనువారు ముక్తులగుదురు" అను వాక్యముతో తెలుపఁబడిన ముక్తిజనకత్వంబును హిరణ్యగర్భుని యందు ఉపపన్నమగుటలేదు. "యదాచర్మవదాకాశం - వేష్ట యిష్యంతి మానవాః, తదా శివ మవిజ్ఞాయ - దుఃఖస్యాంతో భవిష్యతి" అను ప్రమాణమువలన శివజ్ఞానము మోక్షకారణమని విదితమగుటఁజేసి ముక్తిప్రదత్వము పరమేశ్వరున కసాధారణలింగమగుచున్నయది.

"ఉపక్రమోపసంహారములఁబట్టి హిరణ్యగర్భుఁడీ యుపనిషత్తునందు ప్రతిపాద్యుఁ'' డను నంశము నిష్ప్రయోజనమైనది.

ప్రజాపతి ధాతృశబ్దములు - అనుపపత్తి కారణముగా హిరణ్యగర్భుని విడ

నాడి పరమేశ్వరునే ప్రతిపాదించునవి, ప్రజానాం - ద్విపాచ్చతుష్పాత్ పశువులకు పతిః - నియామకుఁడనియు ధాతా - జగమును వహించువాడనియు గ్రహించు నది. "అద్భ్యః సంభూతో హిరణ్యగర్భః" అనుచో పరమేశ్వరుడే నిర్వచింపఁద గినవాడు. "య ఈశే అస్య ద్విపద శ్చతుష్పదః" "ఆదిత్యవర్ణం తమసః పర స్తాత్'' విశ్వేశ్వరత్వము విశ్వాతీతత్వంబు పరమేశ్వర లక్షణములగుటం జేసి జగ త్కారణత్వాది లక్షణముల యుపపత్తివలనను ప్రజాపతి ధాతృశబ్దవాచ్యుఁడు పర మేశ్వరుడే యగుచున్నవాడు, జగజ్జననియగు పరాశక్తి - పరమేశ్వరు నెప్పుడు నెడబాయనిదై ప్రపంచమహావృక్షమునకు నంకురంబగునది, ఇట్టిది "ప్రజ్ఞాచ తస్మాత్ప్రసృతా పురాణీ" అను వాక్యమువలన పరమేశ్వరుని వలననే యావిర్భ వించునది యని విదితమగుచున్నది. ''తదేవ బ్రహ్మ పరమం కవీనామ్" పర మేశ్వరుఁడసాధారణ బ్రహ్మశబ్దవాచ్యుఁడగుటఁజేసి త్రివిధ పరిచ్ఛేదరహితుఁడగు వాడు. "తదేవ భూతం తదు భవ్య మాహుః'' భూతభవిష్యద్వర్తమానమగు సమస్తప్రపంచము స్వరూపముగా కలిగియుండువాడు పరమేశ్వరుండేను. ధాతృ శబ్దము - "అంభస్య పారే" అను సూక్తముఁదగు నుపసంహారముఁ జెందునది కాదు.

"పురుషస్య విద్మ సహస్రాక్షస్య మహాదేవస్య ధీమహి, తన్నో రుద్రః ప్రచోదయాత్"

''తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి, తన్నోరుద్రః ప్రచోద దయాత్" ఇంతవరకు పరమేశ్వరుని సూక్తములు ముగిసినవి. తరువాత రుద్ర గాయత్రి తత్ప్రసంగవశమున గణేశగాయత్రి మొదలగునవియు స్నానార్థము దూర్వాధారణార్థంబును ప్రవృత్తములగుటచే పరమేశ్వర సూక్తములలో చేరవని భట్టభాస్కరుఁడు సూక్తమర్యాదను నెలకొలిపియున్నవాడు.

ఇట్లు నుపక్రమోపసంహార పరామర్శవలన ప్రజాపతి శబ్ద ముపక్రమగత మైనను ఉపసంహారగత రుద్రమహాదేవ శబ్దములు ప్రబలములగుటచే నేతత్సూక్తము పరమేశ్వరపరంబగుట నిర్వివాదాంశము ధాతృపద ముపసంహారగత మని యంగీకరించినను మధ్యగత బహుశ్రుతిలింగముల ననుసరించి యోగమువలన పరమేశ్వరపరంబగునని యంగీకరింపవలెను.

"వేదాహ మేతంపురుషం మహాంతమ్" అనుచో వినంబడు తమఃపరత్వము

ఇతరముచే సాధ్యము కానట్టి శివజ్ఞానసాధ్యమైనట్టియు మోక్షమును కలుగఁ జేయుటయు, హిరణ్యగర్భునియందు పొసగకుండును. కావున నుత్తరనారాయణంబు శివపరమే నని విశదమైనది.

పరమేశ్వరునకు హిరణ్యగర్భునకును భేదము లేనందున హిరణ్యగర్భుఁడు జగత్కారణము కావచ్చునను శంకకు సమాధాన మీ సూత్రము.

సూ. భేదవ్యపదేశాచ్చ. 1-1-18

పరమేశ్వరుఁడు కారణమనియు బ్రహ్మదేవుఁడు కార్యమనియు మహోపనిషత్తునందు "యో దేవానాం ప్రథమం పురస్తాత్ - విశ్వాధికో రుద్రో మహర్షిః, హిరణ్యగర్భం పశ్యత జాయమానమ్'' అనుచో పరమేశ్వర హిరణ్యగర్భులకు కారణకార్యభేదము నిర్దేశింపఁబడినది. కావున హిరణ్యగర్భాది సర్వప్రపంచమునకు కారణము పరమేశ్వరుడే యగుచున్నవాడు.

మరియొక యాశంకకు సమాధాన సూత్రము.

సూ. కామాచ్చ నానుమానాపేక్షా. 1-1-19

"ప్రజాపతి రకామయత ప్రజాః సృజేయ" ఇత్యాది శ్రుతివాక్యములందు హిరణ్యగర్భుఁడు జగత్సృష్టిని కల్పించినట్లు గానంబడుచున్నను జగత్కారణమని యూహింపరాదు. ఎందుకనగా? ఇట్టి సృష్టికామన అవాంతరసృష్టిఁ గూర్చి (హిరణ్యగర్భుఁడు) చేయునది కాని ప్రస్తుతః మున్ముందు భాష్యమున "సంజ్ఞామూర్తి క్లుప్తిః" అను సూత్రముఁదగు నధికరణమునందు పరమేశ్వరుఁడే హిరణ్యగర్భుని ద్వారా అవాంతరసృష్టిఁజేయువాడని వివరింపఁబడును.

"అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" హిరణ్యగర్భస్వరూపముతో ప్రపంచమును ప్రవేశించు పరమేశ్వరునకు హిరణ్యగర్భునకు నభేదమే యంగీకరింపఁదగిన దను నాశంకకు సమాధాన మీ సూత్రము.

సూ. అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి. 1-1-20

ఈ యుపనిషత్తంత్రమునందే హిరణ్యగర్భుఁడు పరమేశ్వరునకు శేషమగువాడని "బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోఽధిపతిః" అను మంత్రభాగము శాసించు

చున్నది, కావున పరమేశ్వరుడే జగత్కారణమనియు హిరణ్యగర్భుఁడు తత్కార్య మనియు గ్రహింపవలెను.

"ఈశానః సర్వవిద్యానామ్" అనువాక్యముతో వేదాధిపత్యము "ఈశ్వరః సర్వభూతానామ్" అను వాక్యముతో బ్రాహ్మణాధిపత్యంబు నేర్పడుటవలన "బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోఽధిపతిః" అను నభ్యాసముతో హిరణ్యగర్భాధిపత్యమే విధింపఁబడుచున్నయది.

ఇట్లు చెప్పుటవలన శ్రుత్యంతములందు హిరణ్యగర్భుని విషయమై అభాసించు పరత్వము మరియు పరమేశ్వరునితో నభిన్నత్వంబు నిరసింపఁబడినవని విశదమైనది.

ఏతదధికరణ సూత్రముల నానందమయాధికరణ శేషములుగ గావింపబడిన పరుల వ్యాఖ్యాన మనర్థాహమైనది.

శ్రీ భాష్యకారులైతేనో ముక్తజీవుఁ డానందమయశబ్దవాచ్యుడు కాడని వ్రాసియున్నవారు.

"ఆనందమయోఽభ్యాసాత్" అను సూత్రమువలననే ముక్తాముక్త జీవనిషేధ మేర్పడుటచే శ్రీభాష్యకారుల వ్యాఖ్యానంబు నసంగతం బగునది.

ఆనందతీర్థులవారు - చతుర్ముఖాదులానందమయ శబ్ద ప్రతిపాద్యులు కారని చెప్పియున్నను హిరణ్యగర్భుఁడు జగత్కారణమని సూచించు సూక్తములు స్వాభిమతమగు విష్ణుపరత్వమునందన్వయింప శక్యములు కానందున నుపేక్షింపవలసివచ్చెను గాన నీ వివరణంబు గ్రాహ్యము కాకుండును.

## అంతరధికరణము

శివతత్త్వము - సమస్తము నొకేమారు తెలిసికొనునదియు, నిత్యతృప్తి గలిగియుండునదియు, ఆది చెప్పరాని. పరిజ్ఞానము కలిగినదియు, తనకు తాను ప్రవర్తించునదియు, లోపింపని శక్తులు గలదియు, అవధిలేని శక్తులతో కూడియుండునదియు, ప్రపంచమున కంతటికి నభిన్న నిమిత్తోపాదాన కారణమగునదియు, ఉపనిషత్తంత్రములన్నిటి సమన్వయమువలననే తెలియునదియు, తనకు

దా(ప్రకాశించునదియు, నిఖిలప్రపంచముతో కూడినదైనను తనను విడిచి రెండవదిలేని స్వభావము గలదియు, సద్రూపము చిద్రూపము ఆనందమయంబగు నదియు, చిత్తు అచిత్తు అనువానికన్న వేరైనదియు పరబ్రహ్మంబగునని యీ వరకు చెప్పఁబడిన అధికరణ న్యాయములతో నేర్పడియున్నదిగదా! అట్టి శివ తత్త్వముయొక్క సాధకుల సంసారవ్యాధిఁ బోగొట్టు నౌషధమువంటి, మనస్సు సమాధానపడుటకు వలయు ఒకానొక దివ్యస్వరూపమును ప్రదర్శించునదీ యధి కరణము.

సూ. అంత స్తద్ధర్మోపదేశాత్. 1-1-21

"య ఏషోఽంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రు హిరణ్యకేశ ఆప్రణఖాత్సర్వ ఏవ సువర్ణస్తస్య యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ" ఛాందోగ్యము.

సూర్యునిలోనుండు హిరణ్మయుడైన పురుషుఁడు పరమేశ్వరుడా? ఒకా నొక దేవతయా? అని సందేహము.

ప్రశ్న : సర్వమున కాధారమగువాడు - సూర్యాంతర్వర్తి యగుటయు సర్వవ్యాపకుడు పరిచ్ఛిన్నమగు హిరణ్మయరూపము కలిగియుండుటయు నెట్లు పొసగును? పరమేశ్వరుఁడు తన యిష్టముతో స్వరూపము గలవాడగునని యంగీ కరించునెడ- "పుండరీక మేవ మక్షిణీ" "కమల సదృశములగు రెండునేత్రములు అను వాక్యమువలన మూడుకన్నులు కలిగియుండుట నియతము కాకుండును. ఒకవేళ సర్వస్వరూపములను స్వేచ్ఛతో పరిగ్రహించువాడందు రేని జీవులకు దేహప్రవేశము దుఃఖమును కలిగించునట్లు పరమేశ్వరునకును శరీరస్వీకారము క్లేశావహమగును. ఒకానొకడు తన యిష్టముతో నిప్పుఁదాకిన యెడల నద్ది కాల్ప కుండునా? అందువలన పరమేశ్వరునకు శరీరసంబంధమును చెప్పుట పాడికాదు.

ఒకానొక దేవతయని చెప్పుట యుక్తమని తోచెడిని.

ఉత్తరము: ఆదిత్యాంతర్వర్తియగు హిరణ్మయపురుషుఁడు పరమేశ్వరుం డేను.

"స ఏష (ః) సర్వేషాం లోకానా మీషే సర్వేషాం కామానామ్, తస్యోదితి

నామ, స ఏషః సర్వేభ్యః పాప్మభ్య ఉదితః" ఇది మొదలగు వాక్యములతో సర్వ లోకేశ్వరత్వము సర్వకామేశ్వరత్వము సర్వపాపరాహిత్యము మొదలగు పరమేశ్వర లక్షణములు ప్రతిపాదింపఁబడినవి. మరియు "ఏకో రుద్రో న ద్వితీయాయ తస్థుః, య ఇమాన్ లోకా నీశత ఈశనీభిః'' "ఏకో బహూనాం యో విదధాతి కామాన్" ఇత్యాది వచస్సులు పరమేశ్వరుండద్వితీయుఁడనియు లోకశాసకుఁడనియు ఉపాసకుల మనోఽభీష్టముల నన్నిటి నొసగువాడనియు విశదీకరించినవి.

సర్వాధారుఁడు సర్వగతుఁడు నగు పరమేశ్వరుఁడు సూర్యాంతర్వర్తి యెట్లగు ననగా? సాధకుల ననుగ్రహించుటకై ఒకానొక హిరణ్మయరూపము గలవాడగుట పరమేశ్వరుని సర్వవ్యాపకత్వమునకు సర్వాధారత్వమునకు భంగము నాపాదించునది కాదు. ఇందువలననే సూర్యమండలము నధివసించువాడు.

పరమేశ్వరునకు శరీరసంబంధము మనకువలె సంసారదోషములను కలుగఁ జేయునది కాదు. పూజ్యయగు శ్రుతియే పరమాత్మకు శరీరసంబంధమును సకల పాపములు లేకుండుటను నిర్దేశించుచున్నది. మేము శ్రుతియనెడు ప్రమాణమును శరణముగ భావించువారమగుటచే ప్రమాణవిరుద్ధయుక్తిని గొప్పగా దలంపము. శక్తివిశేషముగలవారి నగ్నిహోత్రము దహించుటలేదు గదా!

"కప్యాసం పుండరీక మేవ మక్షిణీ" అనుచో మూడుకన్నులు గల దేవునకు రెండు నేత్రములను చెప్పుట - కమలములతో సమానములని తెలుపుటకు మాత్ర మగునది. కాని మూడవ కన్ను లేదని స్ఫురింపఁజేయుటకు కాదు. ఎట్లనగా? ముగ్గురు కుమారులు గల బ్రాహ్మణు నుద్దేశించి యీతని యిరువురు కుమారులు అగ్నిసమానులని చెప్పునెడ ద్విసంఖ్యను గ్రహించుట-మిగత కుమారులను నిషేధించుటకు గాదు. పుత్రద్వయము అగ్ని సదృశ ప్రతిభ కలదని తెలుపుటకు మాత్రము కావున నిటఁగూడ కం-ఉదకమును కిరణములతో త్రాగువాడగుటచే కపియనగా సూర్యుఁడగును. సూర్యునిచే ఆసితం - వికసింపఁజేయఁబడిన కమలముల జతవలె పరమేశ్వరుని రెండు నేత్రములు ప్రకాశించునవి. మూడవ నేత్రము ముకుళించుకొనియుండునదగుటచే వికసితపుండరీక సదృశము కానిదై ముకుళిత పుండరీకసమానమని గ్రహింపపలెను.

ప్రశ్న : "స ఏషః సర్వేభ్యః పాప్మభ్యః ఉదితః" అనుచో పాపము

లన్నిటినుండి బయటపడినవాడను నర్థమువలన తత్పూర్వము ఒకానొకప్పుడు పరమేశ్వరునకు పాపసంబంధమేర్పడియుండెనని పొడగట్టును గదా ?

ఉత్తరము : "పాప్మభ్య ఉదితః" అనుచో పాపసంబంధము ఎప్పుడును బొత్తుగా లేనివాడని లక్షణతో సమర్థింపవలెను. అనఁగా భూత భవిష్యద్వర్తమాన కాలత్రయమందును క్షుత్పిపాసాది దోషములు ఏమాత్రము లేనివాడు పరమాత్మ యని భావము.

"అసౌ యోఽవసర్పతి నీలగ్రీవో విలోహితః, ఉతైనం గోపా అదృశ న్నదృశ న్నుదహార్యః । ఉతైనం విశ్వా భూతాని-స దృష్టో మృడయాతి నః" అనుచో నీలకంఠుఁడగు పరమేశ్వరుఁడు ప్రాణులందరికి ప్రత్యక్ష మగువాడనియు "స్వరుచాఽహితమండల స్త్రినేత్రో రవిః" అనుచో మూడుకన్నులు గలవాడనియు బోధపడుచున్నందున స్వ కాంతి మండలములో నుండు సూర్యుడే ప్రత్యక్ష పరమేశ్వరుఁడని చెప్పవలెను. అట్లుకానిచో సూర్యునకు నీలకంఠత్వము త్రిలోచన త్వము పొసగునెట్లు ? "అసా వాదిత్యో బ్రహ్మ" అను వాక్యమున సూర్యునకు బ్రహ్మత్వము చూపఁబడినది కావున "అంతరాదిత్య" యను వాక్యముచే బోధింపఁ బడు పురుషుఁడు మండలవర్తియగు సూర్యుడే అను నాశంకకు దిగువసూత్రము సమాధానము.

సూ. "భేదవ్యపదేశా చ్చాన్యః" ౧-౧-౨౨

మండలమునందభిమానము గల చేతనుఁడగు సూర్యునికంటె నితరుడే హిరణ్మయస్వరూపము గల పరమేశ్వరుండగును.

"య ఆదిత్యే తిష్ఠ న్నాదిత్యా దంతరో యమాదిత్యో నవేద యస్యాదిత్యః శరీరం య ఆదిత్య మంతరో యమయతి ఏష త ఆత్మాఽంతర్యామ్యమృతః".

"సూర్యునిలో నంతర్యామిగ నుండు పరమశివుని సూర్యుడు గుర్తెరుగఁ జాలడు. ఐనను సూర్యుడు పరమాత్మకు శరీరమగుచున్నవాడు.

కావున సూర్యుని ప్రేరేపించునట్టి అమృతుఁడు నీకు నంతర్యామి యగు వాడు."

ఇఁట నమృత శబ్దముతో శివుడు చెప్పఁబడును. ఎందుకనగా ? "ఏతాని

హ వా అమృతస్య నామధేయాని" శతరుద్రీయము (రుద్రాధ్యాయము)ను ప్రశంసించు జాబాలోపనిషత్తునందు నీలగ్రీవాది నామధేయములన్ని యమృతునివి యని విశదీకరింపఁబడినది.

సూర్యునకు తెలియరానివాడగుట మొదలగు ధర్మములతో పరమేశ్వరుఁడు సూర్యుఁడును వేరువేరని బోధపడుచున్నయది. "నీలగ్రీవో విలోహితః" నలుపు కంఠముగల పరమేశ్వరుఁడే సూర్యాంతర్వర్తిగ నిరూపింపఁబడుచున్నవాడు. సూర్యునకు నంతర్యామి యగుటచే సూర్యశబ్దముతో చెప్పబడుట సంగతమగునది.

ప్రశ్న : ఓయీ ? నీలకంఠుడగు పరమాత్మ-సూర్యునిలో నుండు వాడు కాడు. ఎందుకనగా ? "ధ్యేయః సదా సవితృమండల మధ్యవర్తీ-నారాయణః సరసిజాసన సన్నివిష్టః" "నారాయణుఁడు సూర్యమండల మధ్యమున కమలాసనమందు కూర్చున్న వాడుగ ధ్యానింపఁదగినవాడు" అని తఱచుగ లౌకికులు పఠించుచుందురు. మరియు పుండరీకాక్షుఁడను ప్రసిద్ధివలన కమలములతో సమానములగు రెండు నేత్రముల సంబంధము నారాయణునకే పొసగును కావున మఱియొకరీతిగ ప్రతిపాదించు పరిశ్రమ యెందులకు ?

ఉత్తరము : హిరణ్మయపురుషునియందు గానంబడు పరమేశ్వరుని యసాధారణ లక్షణములు నారాయణునియందు ఉపపన్నములు కావు. ఎట్లనగా ? సూత్ర విషయమగు వాక్యము సందేహింపఁబడినపుడు సందిగ్ధములుకాని మరియొక శ్రుతివాక్యములతో విషయనిర్ణయమును చేయుట సమంజసమగును. మహోపనిషత్తునందలి "ఆదిత్యో వా ఏష ఏతన్మండలం తపతి" ఇత్యాది సందర్భమును విచారించెదము గాక !

అందు ''య ఏతస్మిన్ మండలేఽర్చి ర్దీప్యతే" అను వాక్యముతో సూర్యమండల కాంతిని పక్కాణించి "య ఏష ఏతస్మిన్ మండలేఽర్చిషి పురుషః" మండలాభిమాని దేవత యగు సూర్యుని నిర్దేశించి "ఏషోఽంతరాదిత్యే హిరణ్మయః పురుషః" హిరణ్మయస్వరూపము గల పురుషుని సూర్యాంతర్వర్తిగ నుపదేశించి తరువాత "ఆదిత్యో వై తేజ ఓజో బలం యశః" "సూర్యుడే తేజస్సు, పరాక్రమము బలము కీర్తియు నగుచున్నవాడు" అని సూర్యస్వరూపముగల పరమాత్మయొక్క విభూతిని విశదీకరించి "ఏష పురుష ఏష భూతానా మధిపతిః" అనుచో సూర్యాంతర్వర్తియగు వాని భూతాధిపతిగ వర్ణించి మరియు హిరణ్మయ

పురుషు( డెట్టివాడనునెడ ''సర్వో వై రుద్రః'' అని యారంభించి ''నమో హిరణ్య బాహవే హిరణ్యపతయేఽంబికాపతయ ఉమాపతయే'' అని యుపసంహారము గావింప(బడినది. ఇ(ట బాహుపదగ్రహణము మొత్తము స్వరూపమున కుపలక్షణ మగుటచే శివు(డు హిరణ్యస్వరూపు(డని భావింప(దగినది కావున బంగారముతో సరిపడు రూపము గల ఉమాపతి-ఆదిత్యమండలవర్తి యగువాడని విశదమైనది.

ఈ సందర్భమున నీలగ్రీవత్వము ఉమాపతిత్వంబు మొదలగునవి పరమేశ్వరుని విశేషలింగములన(బఱగుచున్నవి. ఇట్టి విశేషములు పరమేశ్వరునికంటె నితరులకు సంబంధింపనట్టివి. "పుండరీకాక్షు(''డను లక్షణము సాధారణమైనది. నారాయణేతరులందు నీ లక్షణమును గాననగును. కమలాక్షియగు వనిత, కమల లోచనుఁడగు పురుషు(డు, అను ప్రయోగములు పెక్కు గలవు. కావున విశేష లింగముతో సామాన్య లింగము కొట్టుబడును గదా !

"ధ్యేయః సదా" అను శ్లోకము భక్తులచే కల్పింప(బడినదగుటచే లౌకిక మన(బఱగుచున్నయది. ఇట్లు చెప్పుటవలన-సువర్ణ సమానరూపము గలవాడును, త్రిలోచనుండును, నీలకంఠుఁడును, ఉమాపతియు, లోకములన్నిటియందలి కోర్కెల నొసగు అధికారము గలవాడును, సర్వపాపములచే నొకప్పుడును స్పృశింప(బడనివాడును, షడ్గుణైశ్వర్యసంపన్ను(డు నగు పరమేశ్వరు(డే సూర్యునిలో నుండువాడై గాయత్రీమంత్రప్రతిపాద్యుడుగ ముముక్షువులు ధ్యానింప(దగిన వాడని విశదమైనది.

ఈ సూత్రమందలి చకారమువలన సూర్యుడేగాక నారాయణు(డును పరమేశ్వరభిన్నుడని తేటపడును. "ధ్యేయః సదా" అను శ్లోకము పౌరాణికము, పౌరుషేయము నగును. మరియు విష్ణుపూజావసానమున నారాయణు నాదిత్యమండలమున ధ్యానింపవలెనని మాత్రము తెలుపునది కాని సూర్యాంతర్యామియని ప్రతిపాదించునది కాదు.

శ్లో. ఆదిత్యమండలాసీనం రుక్మాభం పురుషం పరమ్
ధ్యాయన్ జపేత్తదిత్యేత న్నిష్కామో ముచ్యతే ద్విజః.

"ద్విజు(డు (బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు) పరశివుని బంగారువన్నె( గలిగి సూర్యమండలములో నుండువానిగ ధ్యానించుచు శివప్రతిపాదకమగు

గాయత్రీమంత్రమును నిష్కాముఁడై జపించునెడల సంసారబంధమునుండి ముక్తుఁడగును.

"ఆదిత్య మండలాంతస్థం - పరంబ్రహ్మాధిదైవతమ్."

"పరబ్రహ్మము-సూర్యమండలములో నుండునది, గాయత్రీ మంత్రమున కధిదేవత యగునది" ఇత్యాది స్మృతివచనములు - గాయత్రీ ప్రతిపాద్యమగు పరబ్రహ్మము శివుఁడే నని విశదపఱచుచున్నవి.

ప్రశ్న: గాయత్రీమంత్రమునకు విశ్వామిత్రుఁడు ఋషి యనియు ఛందస్సు గాయత్రి యనియు దేవత సూర్యుఁడనియు సంధ్యావందనమునందు కలదు గావున పరశివుఁడు గాయత్రీ ప్రతిపాద్యుండెట్లగును?

ఉత్తరము : సూర్యవాచకమగు సవితృపదము - సూర్యాంతర్వర్తి యగు పరశివునందు పర్యవసానముఁ జెందునది. "సవితుర్వరేణ్యమ్" అను పదముతో గాయత్రీ మంత్రమునందు "శివుఁడు సూర్యునిచే నుపాసింపఁబడువా" డని తెలియుచున్నది. "యేన సూర్యస్తపతి తేజసేద్ధః" అనుమంత్రము - సూర్యునకు తేజః ప్రదుడగుటచే సూర్యునిచేత నాశ్రయింపఁదగినవాడు సూర్యాంతర్యామియు నగు పరమశివునే సమర్థించుచున్నయది.

ఈ యధికరణము - శుద్ధాద్వైతులకు సంగతము కానిది. ఇందు పరబ్రహ్మము - హిరణ్యరూపము గలదని నిర్ణయింపఁబడుటవలన నిర్గుణ తత్త్వమునకు సరిపడకుండును. హిరణ్యరూపము కల్పితమనియు స్తుతిరూపమనియు బ్రహ్మము సాకారమను నంశమును సమర్థించునెడ వేద ప్రామాణ్యమున విశ్వాసము లేనివారగుటఁజేసి యాస్తికతయే భంగపడునది.

ఇఁక భగవానుఁడు హిరణ్యవర్ణము గలవాడని చెప్పుటచే మిక్కిలి నలుపు వన్నె యొడలు గల లక్ష్మీపతి యట్టివాడు కానందున నీ యధికరణము శ్రీభాష్యకారులకును ప్రతికూలమగును. మరియు నంతరాదిత్య విద్యయందుపాసింపఁదగిన తత్త్వమును నిర్ణయింపఁ బ్రవర్తించిన మహోపనిషత్తునందు చెప్పఁబడిన భూతపతిత్వము అంబికా పతిత్వము మొదలగు లక్షణములు శివుని కసాధారణములగుటచే నారాయణునియందు సమర్థింప నలవి గానట్టివి. ఇందువలననే శ్రుతప్రకాశికా వేదాంతసార వేదాంత దీపికాది గ్రంథకర్తలును మౌనము నవలంబించినవారైరి.

## ఆకాశాధికరణ ప్రాణాధికరణములు

సర్వజ్ఞత్వము మొదలగు గుణములు గల పరబ్రహ్మమగు శివుని పరమ మంగళాస్పదమైనట్టి యుపాస్యరూపమును విర్వచించి నామరూఢి నిమిత్తముగ ఇతరవస్తువునందు పరశివుని లక్షణము పొదగట్టునను మందబుద్ధి గలవారి యాశంకకు సమాధానమును దిగువసూత్రములతో చెప్పుచున్నవారు.

సర్వజ్ఞత్వాది గుణవిశిష్టుఁడగు పరమేశ్వరుడు - లోకోత్తర సౌందర్యశాలి యగుటచే "యత్రాకృతి స్తత్ర గుణాః" అను న్యాయము ననుసరించి పరమ మంగళగుణములు గలవాడవి తెలియవలెను.

సూ. "ఆకాశ స్తల్లింగాత్" 1-1-23

"అత ఏవ ప్రాణః," 1-1-24

"సర్వాణి హ వా ఇమాని భూతాని ఆకాశాదేవ సముత్పద్యంతే ఆకాశం ప్రత్యస్తం యంతి."

"సర్వాణి హ వా ఇమాని భూతాని ప్రాణమేవాభిసంవిశంతి ప్రాణ మభ్యుజ్జిహతే."

ప్రాణులందరి యుత్పత్తి స్థితి లయకారణములుగ ప్రాణాకాశ శబ్దములు పరమేశ్వర పరములా? భూతాకాశ ప్రాణవాయువులను బోధించునవియా? అని సందేహము.

ప్రశ్న : "ప్రాణాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే, ప్రాణేన జాతాని జీవంతి. ప్రాణం ప్రయంత్యభిసంవిశంతి" "ఆకాశా ద్వాయుః" ఇత్యాది వాక్యముల వలన సకల జగత్కారణములుగ బోధపడుచున్నందున ప్రాణాకాశములే యిట ప్రతిపాదింపఁ దగినవి గదా ?

ఉత్తరము : ప్రాణశబ్దముతోడ నా కాశశబ్దము తోడను పరమేశ్వరుఁడే చెప్పఁబడువాడు. సర్వకారణత్వాది లక్షణములు ప్రాణవాయువునందు ఆకాశము నందును సంభవింపనట్టివి. ఈ సందర్భమున ఆనందస్వరూపమగు బ్రహ్మము సర్వకారణమను వాదమునందు తాత్పర్యము గనఁబడుచున్నయది. "ప్రాణాద్ధ్యేవ

ఖలు" ఇత్యాది శ్రుతివాక్యములు-"ప్రాణవాయువు జగత్కారణ" మను వాదము నందు తాత్పర్యము గలవి కావు, "బ్రహ్మము జగత్కారణ" మను వాదము ననువదించునట్టివి. ఆకాశము పంచభూతములలో చేరుటచే సర్వశబ్దముతోడనే గ్రహింపబడునది కావున నాకాశము ప్రత్యేకము జగత్కారణమని చెప్పనలవిగానిది. "ఆత్మన ఆకాశః సంభూతః" అనువాక్యము-పరమేశ్వరుని వలననే ఆకాశాది సర్వభూతము లావిర్భవించునవియని తెలుపుచున్నది కావున భూతాకాశ ప్రాణవాయువులకు సర్వభూతకారణత్వము ఉపపన్నము కాజాలదు.

ఆకాశమునకు "భూత" అను నుపపదము-పరప్రకృతియగు చిదాకాశము సర్వభూత కారణమగునను నంశము ప్రామాణికమగుటంజేసి చిదాకాశమునకన్న వేఱైనది భూతాకాశంబని తెలుపుటకు సార్థకమగుచున్నయది. ఐతే పరమేశ్వరుం డెట్లు జగత్కారణమగు ననగా ? చిదాకాశమునకు పరమేశ్వరునకును భేదము లేనందున పరమేశ్వరుండని చెప్పఁబడుచున్నయది

శుద్ధమనియు మిశ్రమనియు మలినమనియు త్రివిధముగఁ జెప్పఁబడు భూతాకాశమునకు జగత్కారణమగు యోగ్యత గానరాదు.

పరబ్రహ్మము ఆకాశశబ్ద వాచ్యమగుట-శరీర శరీరిభావమునందే పొసగును కావున నిర్గుణవాదమునందు శరీరాత్మభావము నంగీకరింపకుండుటచే నీ యధికరణ ద్వయము సంగతము కాకుండును.

ఆకాశవాయువులు పరమేశ్వరుని అష్టమూర్తులలో చేరుటవలన "ప్రాణానాం గ్రంధిరసి" అను వాక్యము పరమేశ్వరుఁడు ప్రాణగ్రంధియగువాడని తెలుపుట వలన నితర వ్యాఖ్యలును సమంజసములు కానట్టివి.

## జ్యోతి రధికరణము

లోకములన్నిటి నేలికయు, దోషములన్నిటి వాసనలనఁబడు కళంకము లన్నియు బొత్తుగా లేనివాడును, మిక్కిలి గొప్పవగు మంచి గుణములకు సముద్రమువంటివాడు, ఉమాపతియునగు పరబ్రహ్మమునకు సూర్యమండలము ఒకానొక నివాసస్థానమని యీవరకు నిరూపింపఁబడినది.

ఈ యధికరణమునందు మరియొక నివాసము చెప్పఁబడుచున్నయది.

సూ. జ్యోతి శ్చరణాభిధానాత్. ॥1-1-25॥

ఛాందోగ్యమునందు విషయవాక్యము.

"అథ యదతః పరో దివోజ్యోతి ర్దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠేష్వనుత్తమేషు లోకేష్విదం వావ తద్యదిద మస్మిన్నంతః పురుషే జ్యోతిః"

లోకములనన్నిటిని వ్యాపించునట్టి, యంతరిక్షము నతిక్రమించియుండు పరంజ్యోతి-పరమేశ్వరుడా? ఇతరుడా? అని సందేహము.

ప్రశ్న : ద్యుశబ్దము ఆకాశవాచకముగదా ! ఆకాశముపైనుండు సూర్యుఁడే పరంజ్యోతియని చెప్పవలెను. అథవా "అంతఃపురుషే జ్యోతిః"అను వాక్యమువలన పురుషునిలోనుండు జఠరాగ్నియైనను జ్యోతి యగును గదా !

ఉత్తరము : సర్వోత్కృష్టమగు పరంజ్యోతి-పరమేశ్వరుండేను; "పాదోఽస్య విశ్వా భూతాని" ఇట్టి పరంజ్యోతియొక్క నాల్గవభాగముగా ప్రాణులందరు చెప్పఁబడుచున్నవారు.

సూర్యుఁడు గాని జఠరాగ్ని గాని పరిచ్ఛిన్నములగుటచే దివఃపర మగు జ్యోతిస్సు కాజాలరు.

సూర్యునిలో నుండు సదాశివుఁడు తన్మండలమునం దెట్లుండుననగా? పర్యంకముననుండు రాజు-మేడపై నుండువాడని వ్యవహరింపఁబడినట్లు పరమశివుండును సూర్యాంతర్యామియై సూర్యమండలమునందు వసించువాడని గ్రహించునది.

"దివఃపరః" అను పదమునకు "సర్వోత్తరమ్"అని చెప్పుటవలన సంసారమండలము నతిక్రమించి యుండువాడను నర్థము తెలువఁబడినది. "త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః" అను వాక్యమున చరణశబ్దము చెప్పఁబడుటచే చరణచతుష్టయాత్మకుండగు పరమపూరుషుఁడు జ్యోతిఃశబ్దముతో ప్రతిపాదింపఁబడువాడని విశదమగునది.

"పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే" అను శ్రుతి వాక్యమునందు గల పరంజ్యోతిఃపదము పరమేశ్వరునే తెలుపుచున్నయది. మనోవాక్కులు సూర్యచంద్ర నక్షత్రాదులు నవరజ్యోతిస్సులగును. "తమేవ భాంత మనుభాతి సర్వం-తస్య భాసా సర్వమిదం విభాతి" అను వాక్యము సూర్యచంద్రాది

సూ. జ్యోతి శ్చరణాభిధానాత్. ॥1-1-25॥

ఛాందోగ్యమునందు విషయవాక్యము.

"అథ యదతః పరో దివోజ్యోతి ర్దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠేష్వనుత్తమేషు లోకేష్విదం వావ తద్యదిద మస్మిన్నంతః పురుషే జ్యోతిః"

లోకములనన్నిటిని వ్యాపించునట్టి, యంతరిక్షము నతిక్రమించియుండు పరంజ్యోతి-పరమేశ్వరుడా? ఇతరుడా? అని సందేహము.

ప్రశ్న : ద్యుశబ్దము ఆకాశవాచకముగదా! ఆకాశముపైనుండు సూర్యుఁడే పరంజ్యోతియని చెప్పవలెను. అథవా "అంతఃపురుషే జ్యోతిః"అను వాక్యమువలన పురుషునిలోనుండు జఠరాగ్నియైనను జ్యోతి యగును గదా!

ఉత్తరము : సర్వోత్కృష్టమగు పరంజ్యోతి-పరమేశ్వరుండేను; "పాదోఽస్య విశ్వా భూతాని" ఇట్టి పరంజ్యోతియొక్క నాల్గవభాగముగా ప్రాణులందరు చెప్పఁబడుచున్నవారు.

సూర్యుఁడు గాని జఠరాగ్ని గాని పరిచ్ఛిన్నములగుటచే దివఃపర మగు జ్యోతిస్సు కాజాలరు.

సూర్యునిలో నుండు సదాశివుఁడు తన్మండలమునం దెట్లుండుననగా? పర్యంకముననుండు రాజు-మేడపై నుండువాడని వ్యవహరింపఁబడినట్లు పరమశివుండును సూర్యాంతర్యామియై సూర్యమండలమునందు వసించువాడని గ్రహించునది.

"దివఃపరః" అను పదమునకు "సర్వోత్తరమ్"అని చెప్పుటవలన సంసార మండలము నతిక్రమించి యుండువాడను నర్థము తెలువఁబడినది. "త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః" అను వాక్యమున చరణశబ్దము చెప్పఁబడుటచే చరణచతుష్టయాత్మకుండగు పరమపూరుషుఁడు జ్యోతిఃశబ్దముతో ప్రతిపాదింపఁబడువాడని విశదమగునది.

"పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే" అను శ్రుతి వాక్యమునందు గల పరంజ్యోతిఃపదము పరమేశ్వరునే తెలుపుచున్నయది. మనోవాక్కులు సూర్యచంద్ర నక్షత్రాదులు నవరజ్యోతిస్సులగును. "తమేవ భాంత మనుభాతి సర్వం-తస్య భాసా సర్వమిదం విభాతి" అను వాక్యము సూర్యచంద్రాది

వానస్య" అను పురుషసూక్తమంత్రంబు పరబ్రహ్మపరమని సూచింపఁబడినది. మరియు హృదయకమలధ్యేయమగు పరమాకాశ మనంబడు స్వర్గము భావలింగాత్మకమై పరమేశ్వర రాజధాని యనఁబఁబడుచున్నది. ఇట్టి స్వర్గలోకమునకు ద్వారపాలురు ప్రాణవాయువు మొదలగునవి. ఇవ్వానిని బ్రహ్మపురుషులుగ కీర్తించుట యనునది పరమేశ్వరలింగము గావున గాయత్రీపదము పరమేశ్వర వాచకమే నగునది.

సూ. ఉపదేశభేదాన్నేతి చేన్నోభయస్మిన్నప్యవిరోధాత్ 1-1-28

ప్రశ్న: "పాదోఽస్య విశ్వాభూతాని - త్రిపాదస్యామృతం దివి" అనుచో ద్యుశబ్దముయొక్క ప్రత్యభిజ్ఞానము (గుర్తు) వలన జ్యోతిర్వాక్యమునందును పరమేశ్వరుఁడు ప్రతిపాదింపఁబడుట లేదని చెప్పవలెను. "త్రిపాదస్యామృతం దివి" "పరో దివో జ్యోతిః" అను సప్తమీ షష్ఠీ విభక్తులవలన నగు నుపదేశభేదముచే పరమేశ్వరుని ప్రత్యభిజ్ఞానము సిద్ధించుటలేదు కావున గాయత్రీ ప్రకరణము పరమేశ్వరపరమగుట విరుద్ధము గదా !

ఉత్తరము: పై రెండువాక్యములందును పరమేశ్వర ప్రతిపాదన విషయమై విరోధమేమియు గానరాదు. ఎట్లనగా? ''చెట్టుకొనయందు డేగపక్షి, చెట్టుకొనపైన డేగపక్షి" అని వ్యవహరించుటయందు నుభయత్ర వృక్షపరత్వమే బోధపడునట్లు ప్రస్తుత ప్రకరణమునందును రెండు చోటులలో దివః పరత్వమే గ్రాహ్యమగునది.

ఇత్యాది సందర్భముతో పురుషసూక్తమున వర్ణింపఁబడినవాడు పరమేశ్వరుడే నని యేర్పడుచున్నది. "పాదోఽస్య విశ్వా భూతాని" "సమస్త ప్రాణులు పురుషునకు నొక భాగము" ఇట్లు పురుషసూక్తము నందును కలదు కావున నిఖిల ప్రపంచము తన యేకాంశమువరకే ముగియు నట్టి, సకలభువనాతీత ప్రదేశమునందు ప్రకాశించు పరంజ్యోతి - పరమేశ్వరుఁడే యగును.

పురుషసూక్తము విష్ణుపరమని చెప్పుటకు చూపఁబడిన నెనిమిది కారణములను ఖండించి పదునెనిమిది యోగ్యహేతువులతో శివపరమగునని నిర్ణయించిన యంశమును మహోపాధ్యాయ శ్రీ శివయోగి ముదిగొండ నాగలింగశాస్త్రిగారి వైష్ణవమత ప్రతిషేధమునందు సహృదయులు గాననగును.

## ఇంద్రప్రాణాధికరణము

పూజనీయమగు సూర్యమండలమునందు ప్రత్యక్షముగా నుపాసింపఁదగిన వాడని నిర్దేశింపఁబడిన పరమేశ్వరునకు నంతరధికరణమునందు విశ్వాత్మకత్వము నిరూపింపఁబడినది. కావున తదితరులు పరమేశ్వరుండంతర్యామిగ కలవారగు టచే ధ్యానింపఁదగినవారగుదురు. అన్యథా ఉపాస్యులు కాజాలరని విశదపఱచు నదీ యధికరణము.

సూ. ప్రాణస్తథాఽనుగమాత్ 1-1-29

కౌషీతకోపనిత్తునందు విషయవాక్యము.

''ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మాతం మా మాయు రమృత మిత్యుపాస్వ'' ఇంద్ర వచనము.

ఉపాసనావిషయముగా ప్రాణశబ్దముతో నిర్దేశింపఁబడువాడు ఇంద్రుఁడా? పరమేశ్వరుడా? అని సందేహము.

ప్రశ్న : "ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా తం మామ్" అనుచో ప్రాణ శబ్దమునకు నింద్రునితో సమానాధికరణ భావము పొడగట్టుచున్నయది. "మాముపాస్వ" అను వచనము ఇంద్రు నుద్దేశించి యుపాసనావిధిఁ జెప్పుచున్నది. ఇంద్రునకు ప్రాణ త్వము - వర్షముద్వారా సకలప్రాణులను కాపాడుట కారణముగా సమర్థింపఁబడు నది. "ఇంద్రో రాజా జగతో య ఈశే" అను శ్రుతివాక్యమువలన గొప్ప ఐశ్వ ర్యము కలవాడని తెలియుచున్నందున సకలోపాస్యుండగువాడు గదా!

ఉత్తరము : పరమేశ్వరుఁడు ప్రాణశబ్దముతో నిట చెప్పఁబడును, ఎందు కనగా? ఆనందము, జరారాహిత్యము, అమృతభావము, ప్రాజ్ఞత్వము మున్నగు పరమేశ్వరుని యసాధారణ ధర్మములు ప్రాణశబ్దవాచ్యుని యందు అనుగమించు నవి. "ఏషప్రాణ ఏవప్రజ్ఞాత్మాఽనందోఽజరోఽమృతః" అనుశ్రుతివాక్య మిందుకు ప్రమాణము.

''ఇంద్రో రాజా" అను శ్రుతివాక్యమునందు గల ఇంద్రశబ్దము - ప్రకరణ వశమున పరమేశ్వరవాచకమని బోధపడుచున్నయది. "ఇంద్రస్యాత్మానం దశధా

చరంతమ్'' ఇత్యాది పూర్వాపరమంత్రములు - పరమేశ్వరుఁడు ఇంద్రాంతర్యామి యని తెలుపుచున్నందున నిద్ది పరమేశ్వర ప్రకరణమే యగును.

సూ. న వక్తు రాత్మోపదేశా దితి చే
దధ్యాత్మసంబంధభూమా హ్యస్మిన్. 1-1-30

ప్రశ్న : ఇట నుపాస్యుడు పరమేశ్వరుఁడు కాడు. ఎట్లనగా? ఉపక్రమమున "మామేవ విజానీహి త్రిశీర్షాణం త్వాష్ట్రి మహనమ్" "మూడు శిరస్సులుగల వృత్రాసురుని సంహరించిన నన్నే కనుగొనుము" ఇత్యాది వాక్యముతో తాను జీవుడ నను పరిజ్ఞానముగల ఇంద్రుడు తన నుపాసింపవలసినదిగా నుపదేశించినందున నుపసంహారంబు నిద్రపరముగ నన్వయింపవలెను.

ఉత్తరము: ఉపక్రమము మొదలుకొని యీ ప్రకరణమునందు పరమేశ్వర లక్షణము లధికముగ చెప్పఁబడినవి. ఎట్లనగా? "యం త్వం మనుష్యాయ హితతమం మన్య సే" ''మనుష్యోపలక్షితుఁడగు ప్రతిజీవునకు మిక్కిలి హితకరమగు నుపాసన యెట్టిది'' అని హితతమోపాసనమును గురించి ప్రారంభించుట పరమేశ్వరు నుద్దేశించి యగును. మోక్షసాధనమగు పరమేశ్వరోపాసనమే హితతమనుగు నది గదా! ఏతత్ప్రకరణ మధ్యమున- "ఏష ఏవ సాధుకర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతే, ఏషఏవాసాధుకర్మ కారయతి తం యమధో నినీషతే" "ఏ జీవాత్మ నీ లోకములనుండి యూర్ధ్వలోకములకు గొంపోవఁదలచునో అట్టి జీవునితో మంచిపనిఁజేయించువాడు మరియు నధోలోకములను పొందింపదగిన జీవునితో చెడుపని చేయించువాడును పరమాత్మయే'' ఇట్లు శుభాశుభకర్మ కారయితృత్వము వినంబడుచున్నయది. మరియ "తద్యథా రథస్యారేషు నేమి రర్పితా నాభా వరా అర్పితా ఏవమేవైతా భూతమాత్రాః ప్రజ్ఞామాత్రాస్వర్పితాః ప్రజ్ఞామాత్రాః ప్రాణేఽర్పితాః" "రథచక్రముఁదగు ఆకులపై కమ్ములుంచబడును ఆకులు నాభివలెనుండు వలయాకారమునందు నెలకొలుపఁబడును. ఇట్లే పంచభూతములు ఇంద్రియములును జీవాత్మలయందాధారపడియుండును. జీవాత్మలు ప్రాణశబ్ద నిర్దిష్టుఁడగు పరమాత్మయందు విశ్రాంతిఁజెందువారు" ఇవ్విధము చేతనాచేతన సమ్మిశ్రమగు సకలప్రపంచమున కాధారమగుటయు గానంబడుచున్నది. ఇదియు పరమేశ్వరధర్మంబేను కావున నిట పరమేశ్వరధర్మబాహుళ్యముండుటఁజేసి యుపాస్యుఁడు ఇంద్రుడగుట లేదు

దేవేంద్రుడు ఒకానొక జీవాత్మ యగుటచే నుపాసింపఁదగినవాడు కాడు గదా! ఐనను తన నుపాసింపవలసినదిగ నెట్లుపదేశించు నను అశంకకు సమాధానము దిగువ సూత్రము.

సూ. శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్. 1-1-31

"అనేన జీవేనాఽత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" 'జీవాత్మ ద్వారా ప్రపంచమును ప్రవేశించి నామరూపముల నేర్పఱచువాడను" అను వాక్యమువలన జీవగత నామరూపకరణము తనవరకు నవధిగలదని భావింపఁదగినదగుటచే పరమేశ్వరుఁడు శబ్దములన్నిటితో చెప్పఁబడువాడని తెలియుచున్నది. ఇఁట నింద్రుఁడు తా శరీరముగా గలవాడగు పరమేశ్వరుని స్వశబ్దవాచ్యునిగ నుపాస్యునిగ నుపదేశించెను. కావున నింద్రశబ్దముతో పరమేశ్వరుని శాస్త్రదృష్టితో బోధించుట యని గ్రహింపవలెను.

శాస్త్రదృష్టి యనగా - శాస్త్రము మూలముగా గల దృష్టి; పరమేశ్వరుడు సర్వాత్మకుఁడు అని వక్కాణించు శాస్త్రము నవలంబించి తన యంతర్యామియగు పరమేశ్వరు ననుసంధించు భావన యనఁబఱగుచున్నయది. ఇవ్విషయమై వామదేవుని దృష్టాంతమును గాననగును.

పూర్వము వామదేవుఁడను ఋషి - స్వాంతర్యామి పరమేశ్వరుఁడను భావనతో "అహం మను రభవం సూర్యశ్చ" నేను మనువును సూర్యుడనైతిని."

ఇట్లు మను సూర్యాది ప్రపంచ మంతయు తానుగా నిర్దేశించినట్లు ఇంద్రుఁడును ప్రతర్దనుఁడనువానికి నుపదేశించినవాడు.

ఇంతియే గాక మరియొక విధముగ నివ్విషయమును గ్రహింపనగును.

వేదాంతములను తెలిసికొనుటవలన నేర్పడునట్టి శివజీవ సామరస్య భావనతో, మరియు భక్త మాహేశ్వర ప్రసాద ప్రాణలింగ శరణ ఐక్యములనంబడు ఆరు భూమికలలో గావింపఁబడు శివోపాసనతోడను త్వక్ చక్షుః శ్రోత్ర జిహ్వ ఘ్రాణములు మొదలగు నింద్రియములందు నవ్వానిఁ బ్రేరేపించువాడుగ నుండునని భావింపఁబడు సర్వాంగలింగసాహిత్యము తోడను శివభావమును పొందినవాడును మనుష్యాదిదేహ సంబంధముగ నేర్పడిన యహంకార సంకోచమును పోగొట్టుకొనినవాడును విశ్వాకారమును పొందియుండు పరాహంభావము

కలవాడు నగు వామదేవుఁడు తాను సర్వగతుండనని తెలిసికొనినవాఁడగుటచే మను సూర్యాది ప్రపంచభావమును వెల్లడించినవాడు. ఇట్లు ఇంద్రుఁడును సర్వాత్మ భావనతో ప్రతర్దనున కుపదేశము నొనర్చినవాడని తెలియునది.

"ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా" అనుచో ప్రాణశబ్దముతో పరమేశ్వరుఁడు చెప్పఁబడుచున్నవాడు. పరబ్రహ్మము - ఆనందస్వరూపమగుటం జేసి చరాచరము నంతయు నుజ్జీవింపఁజేయునది. "ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మాఽఽనందోఽజరోఽమృతః" "ప్రాణమే ప్రజ్ఞాత్మ యనియు ఆనందమనియు జరామరణములు లేనిదనియు పేర్కొనంబడును" అను శ్రుతివాక్య మిందుకు ప్రమాణము. మరియు "అహం బ్రహ్మాఽస్మి" "మాముపాస్వ" ఇట్లు బ్రహ్మభావనతోడ నుపదేశించుట సరిపడుచున్నయది. ఇవ్విధమే శ్రీకృష్ణుఁడు మొదలగువారు అర్జునుఁడు మున్నగువారికి "మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు" "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ! "అహం సర్వస్య ప్రభవః మత్తః సర్వం ప్రవర్తతే" బ్రహ్మాత్మభావనాదార్ఢ్యవశమున స్వశబ్ద నిర్దేశముతో గీతల నుపదేశించినవారని గ్రహింపవలెను.

సూ. జీవముఖ్య ప్రాణలింగా న్నేతి చేన్న ఉపాసా త్రైవిధ్యా దాశ్రితత్వా దిహ తద్యోగాత్. 1-1-32

ప్రశ్న : జ్ఞానాత్మకమగు బ్రహ్మోపాసనతో బ్రహ్మభావమును పొందినవాడును జీవభావము తొలగినవాడును బ్రహ్మస్వరూపమునందు గల నిష్ఠతో తాను ఉపాస్యుడగుటను సర్వాత్మభావము కలిగియుండుట నుపదేశించుట యుక్తంబేను. కాని యిట "త్రిశీర్షాణం త్వాష్ట్ర మహనమ్" "యావదధ్యస్మిన్ శరీరే ప్రాణో వసతి తావదాయుః" "త్రిశిరస్కుడైన వృత్రాసురునిఁ జంపితిని" "ఈ శరీరమున ప్రాణవాయువుండునంత వరకు జీవిత మనఁబడును. ఇత్యాది సందర్భమున జీవ లింగము ముఖ్య ప్రాణలక్షణంబు కనఁబడుచున్నవి గావున పైరీతిగా ఇంద్రుఁడు ప్రతర్దనున కుపదేశించుట యుక్తము కాదు గదా!

ఉత్తరము : బ్రహ్మోపాసనము మూడు విధములగుట కారణముగా జీవ ప్రాణశబ్దములతో పరమేశ్వరుఁడు చెప్పఁబడుట సముచితమైనది. ఇఁట పరమేశ్వరుని నిజరూపము నుపాసించుట మొదటి విధమగును. కర్మఫలభోక్తయగు జీవుని

ద్వారా పరమాత్మ నారాధించుట రెండవవిధ మగును. ప్రకృతిద్వారా పరాత్పరుని పూజించుట మూడవ విధమగును. ఇట్టి త్రివిధోపాసనములలో ప్రథమమున తానే యుపాసింపఁబడుటయు ద్వితీయమున తృతీయమందును జీవప్రకృతులచే నాశ్రయింపఁబడి పూజింపఁబడుటయు గమనింపఁదగినవి.

ఐతే పరమేశ్వరుని ఉమాసహాయత్వాది లక్షణ విశిష్టమగు నిజరూపమును భావించుట శీఘ్రముగ మోక్షావహమగునది. తదితరములైన యుపాసనలు రెండు నాలస్యముగ ముక్తిహేతువులగునట్టివి. కావున నిండ్రుఁ డిచట పరమేశ్వరుఁ డంతర్యామిగా కలవాడ నను భావనవలన నుపాస్యుండగుచున్నవాడు.

ఇయ్యది శ్రీ నీలకంఠ భగవత్పాదకృత శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యమున ప్రథమాధ్యాయగత ప్రథమపాదము.

---

ఈ శైవసిద్ధాంత గ్రంథముద్రణకై స్వ సంతోషముతో ధనసహకారమును అందఁజేసిన మహాశయులు (73వ పేజీ తరువాయి)

29. మహారాజశ్రీ తేలుకుంట నారాయణరావుగారు, మరియు సోదరులు వెంకటరమణ బనారస్ సిల్క్ హౌస్, జనరల్ బజార్, సికిందరాబాద్.
30. మ॥రా॥ శ్రీ పద్మ నరసింహారావు తేలుకుంట శ్రీనివాస్‌గారలు బనారస్ సిల్క్ హౌస్, జనరల్ బజార్, సికిందరాబాద్.
31. శివశ్రీ॥ ములుగు హనుమంతరావు గారు, 1-8-726/35, అచ్చయ్యనగర్ హైదరాబాద్-500044 ప్రస్తుతం పుడ్‌కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అహమదాబాద్-380009
(వీరు యథార్థబుద్ధితో గొప్ప విరాళమును సమర్పించిన మహోదారులు)
32. మ॥రా॥శ్రీ ఉప్పలంచి బాలరాజయ్యగారి శ్రీనివాసులు, రమణకుమార్, ఆనందకుమార్, ప్రేమ్‌కుమార్‌గారలు జనరల్ బజార్ సికిందరాబాద్.

ఏతత్ గ్రంథముద్రణ సహకారులందరిని - పరమేశ్వరుఁడు - దీర్ఘాయురారోగ్య భాగ్యముల నొసఁగి - రక్షించుగాక!

శ్రీ పార్వతీరాజరాజేశ్వరాభ్యాం నమః

శ్రీ నీలకంఠ భగవత్పాదకృత

# శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

[ఆంధ్రీకరణము]

ప్రథమాధ్యాయగత ద్వితీయపాదము

## సర్వత్ర ప్రసిద్ధాధికరణము

పరబ్రహ్మమును బోధించు వేదాంతవాక్యము లనంతములగుటచే ప్రతివాక్యమును విచారింప వలనుగాదు. కావున సందిగ్ధములగు కొన్ని వాక్యములను విచారించినయెడల తద్రీతిగా తాదృశవాక్యము లన్నిటి యర్థము నిర్ణయింపఁబడునని భావించి కొన్ని వాక్యములు తాత్పర్యలింగ సమన్వయముతో బ్రహ్మబోధకము లగునని సూత్రములందు సూచింపఁబడినది. అట్టి వాక్యములలో బ్రహ్మలక్షణము లను స్పష్టపఱచునట్టి కొన్నిటిని ప్రథమపాదమునందు విచారింపనైనది.

అతి స్పష్టములు కాని కొన్ని వాక్యములను ద్వితీయపాదమున విచారించువారము.

సూ. సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్. 1-2-1

"మనోమయః ప్రాణశరీరో భారూపః సత్యసంకల్ప ఆకాశాత్మా సర్వకర్మా సర్వకామః'' ఛాందోగ్యము.

మనోమయత్వము మొదలగు ధర్మములు గల పురుషుఁడు పరమేశ్వరుడా? జీవుడా? అని సంశయము.

ప్రశ్న : జీవాత్మ-మనోమయాది వాక్యమునకు సమీపవర్తి యగువాడు. ఎట్లనగా? "అథ ఖలు క్రతుమయః పురుషో, యథాక్రతు రస్మిన్ లోకే పురుషో భవతి తథేతః ప్రేత భవతి స క్రతుం కుర్వీత" "ఈ లోకమునందు పురుషుఁడు

గావించు సుకృతము ననుసరించి మరణానంతరము పరలోకములందు ఫలము ననుభవించును. కావున నిత్యనై మిత్తికాది సుకృతముల నవశ్య మాచరింపవలెను.

ఇఁట కర్మవశమున నిహపరలోకములందు సంచరించు జీవాత్మ ప్రశంసింపఁబడినవాడు. ఇందువలననే జీవుఁడు మనోమయత్వాది ధర్మములు గలవాడగును. మనోమయత్వము ప్రాణశరీరత్వము మొదలగు లక్షణములు-సంసారియగు జీవునివే కాని పరమేశ్వరునివి కావు.

సతి - యథార్థమునందు అసంకల్పః - సంకల్పము లేనివాడను నర్థముతో సత్యసంకల్పత్వమును జీవునకు సమర్థింపవచ్చును. కావున సర్వథా మనోమయత్వాది ధర్మములు కలవాడు జీవాత్మయే కాని పరమాత్మ కాఁజాలడు.

ఉత్తరము : పరమేశ్వరుఁడే మనోమయత్వాది ధర్మములు గలిగియుండువాడు. ఎందుకనగా? ఛాందోగ్య ప్రారంభమునందు "సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపాసీత" అను వాక్యము పరబ్రహ్మమగు పరమేశ్వరుడే సర్వకారణముగా నుపాసింపఁ దగినవాడని యుపదేశించున్నయది.

శ్రుత్యర్థము - సృష్టి స్థితి లయములు బ్రహ్మాధీనము లగునవి. చిదచిన్మయమగు జగమంతయు బ్రహ్మాత్మకమని శమదమాది సంపత్తి గలవాడై భావింపవలెను. సముద్రమున జన్మించి లయించు నురుగు బుద్బుదములున్ను సముద్రమయములుగా కనఁబడునట్లు శక్తివిశిష్టుడైన శివునివలన నేర్పడు సృష్టి స్థితి లయాదులు శివమయములగునని భావింపదగినవి. కావున శివేతరమగు వస్తు వెద్దియు గ్రాహ్యము కాకున్నయది.

మరియు నథర్వశిరమునందు "అహ మేకః ప్రథమ మాసం వర్తామి చ భవిష్యామి చ నాన్యః కశ్చిన్మత్తో వ్యతిరిక్తః" "సృష్టికి ముందున్నవాడను ప్రస్తుత ముండువాడను ఇక ముందుండగలిగినవాడనగు నన్ను ఆశ్రయింపక నెవఁడు నుండఁజాలడు" ఇట్లు పరమేశ్వరుఁడు వక్కాణించినవాడు. తరువాత "బ్రహ్మాహం" ఇత్యాది వాక్యముతో తన విశ్వరూపతను చాటినవాడు. "సోఽంతరాదంతరం ప్రావిశత్" "పరమేశ్వరుఁడు సర్వాంతరమగు జీవునికంటె నంతరమును అనఁగా లోనప్రవేశించిన వాడు". ఇట్టి అనుప్రవేశము పరమేశ్వరుని విశ్వరూపత్వమునకు తార్కాణముగ పేర్కొనఁబడుచున్నయది.

కావున శివకృతములగు సృష్టి స్థితి లయాదులు గల జగము- శివేతరము కానిదని విశదమైనది.

గాలి వీచుటవలన పైపైన సంచలనము కలుగుటచే తరంగములు, నురుగు బుద్బుదములు అనునవి సముద్రమున కేర్పడునట్లు శివేచ్ఛవలన సంచలనముఁ బొందు శక్తియొక్క పరిణామము సర్వప్రపంచము కావున "బ్రహ్మము ప్రపంచాత్మకము" అనుటవలన బ్రహ్మమున కెట్టి హానియు గానరాదు.

శ్లో॥ శక్తయోఽస్య జగత్కృత్స్నం - శక్తిమాంస్తు మహేశ్వరః
శక్తిస్తు శక్తిమద్రూపాత్ - వ్యతిరేకం న గచ్ఛతి.

తాదాత్మ్య మనయో ర్నిత్యం - వహ్నిదాహికయో రివ
శక్తి శక్తిమతో ర్యస్మా — దభేదః సర్వదా స్థితః.

అత స్తద్ధర్మధర్మిత్వాత్ - పరాశక్తిః పరాత్మనః
న వహ్నే ర్దాహికా శక్తి - ర్వ్యతిరిక్తా విభావ్యతే.

అభియుక్త సూక్తి.

శక్తి విశిష్టుడగు మహేశ్వరుని శక్తుల పరిణామము సమస్త ప్రపంచము. కావుననే శక్తి - శివుని స్వరూపమును నిడిచియుండునది కాదు. అగ్నికి జ్వాలకును వలె శక్తిశివులకు తాదాత్మ్య ముండుటఁజేసి యభేద మొప్పారుచున్నయది. పరాశక్తి ధర్మముగా కలవాడగుటచే పరమేశ్వరుఁడు శక్తిని విడిచియుండువాడు కాడు. అగ్ని - దహనశక్తిని విడనాడి యుండునది కాదు గదా!

శివమహాపురాణములోని వాయుసంహిత యందు

శక్త్యాది చ పృథివ్యంతం — శివతత్త్వ సముద్భవం
తేనైకేన తు తద్వ్యాప్తం - మృదా కుంభాదికం యథా॥

పరాఽస్య వివిధా శక్తిః - ప్రబోధానందరూపిణీ
ఏకానేక స్వరూపేణ - భాతి భానో రివ ప్రభా॥

శక్తిమొదలుకొని భూమివరకుగల ప్రపంచమంతయు శివతత్త్వమునుండి యావిర్భావముఁ జెందునది కావున మన్ను - కుండలు మున్నగు వాని వ్యాపించు

నట్లు శివుఁడు ప్రపంచమంతట నిండియుండువాడు. జ్ఞానానంద స్వరూపిణియగు పరమేశ్వరుని శక్తి - సూర్యప్రకాశమువలె ఏకముగా ననేకముగాను ప్రకాశించునది యగును.

వాస్తవముగా శక్తియొకటియే; ఐనను తెలిసికొనుట, కోరుట, చేయుట, పుట్టించుట, కాపాడుట, గిట్టించుట, మఱుగుఁబఱచుట, అనుగ్రహించుట యను ధర్మములతో ననేకరూపములను పొందునదని సారాంశము.

"పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే, స్వాభావికీ జ్ఞానబలక్రియాచ" "ఏకో రుద్రో న ద్వితీయాయ తస్థుర్య ఇమాన్ లోకానీశత ఈశనీభిః పరమశక్తిభిః" ఇత్యాది వాక్యములు — పరమేశ్వరుని శక్తి సహజమైనదనియు ఆనందమనియు సృష్టి స్థితి లయాది భేదములఁ జెందునదనియు వక్కాణించుచున్నవి.

ఇంతియేగాక

శ్రుతిస్మృతీతిహాసపురాణముల యొక్కయు అభియుక్తసూక్తులయొక్కయు ప్రామాణ్యమువలన తెలియునదేమనగా? చిదచిత్ప్రపంచమంతయు మహావిభూతి యనఁదగును. ఇట్టి విభూతి సచ్చిదానందములఁ జెందిన గొప్ప సత్త (ఉనికి) యగును. ఇయ్యది దేశకాలాదిపరిచ్ఛేదము లేనిదై స్వాభావసిద్ధయగు పరమశక్తి యనఁబడును. ఇదియే పరమేశ్వరునకు స్వరూపము గుణము నగునది. ఇట్టి పరమశక్తి లేనిది సర్వజ్ఞత్వము సరశక్తిమత్త్వము సర్వకారణత్వము సర్వనియామకత్వము సర్వోపాస్యత్వము సర్వానుగ్రాహకత్వము సర్వపురుషార్థప్రదత్వము సర్వగతత్వము మొదలగు ధర్మములు పరబ్రహ్మమునకు సంభవించునవి కావు.

మరియు భగవానుడు - మహేశ్వర శివ మహాదేవ రుద్రాదిశ్రేష్ఠనామధేయములతో నిర్వచింపఁబడుటయు పొసగనట్టిది. చిదచిత్ప్రపంచము పరమేశ్వరుని శరీరమగుటఁజేసి శరీరవిశిష్టబ్రహ్మము శబ్దములన్నిటితో నిర్వచింపఁబడునట్టిది. "నీలోత్పలమ్'' అనుచో నీలశబ్దము నలుపురంగునే గాక కలువనుగూడ తెలుపునట్లు ప్రపంచశబ్దము ప్రపంచమునే గాక బ్రహ్మమును గూడ బోధించునది. కావుననే "సర్వోవైరుద్రః" ఇత్యాది వాక్యములు బ్రహ్మము సర్వశబ్దవాచ్యంబనియు "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను వాక్యము సర్వచిదచిత్ప్రపంచము శరీరముగా

గల యట్టిది బ్రహ్మంబనియు విశదీకరించినవి. ఇట్లు ప్రపంచము బ్రహ్మస్వరూప మగుటచే ద్వేషాస్పదము కానందున శాంతుడై బ్రహ్మము నుపాసింపవలెనని విదితమైనది.

ఇవ్విషయమునే సమర్థించు పురాణశ్లోకములను గాననగును.

విగ్రహం దేవదేవస్య - జగదేత చ్చరాచరమ్ ।
ఏతమర్థం న జానంతి - పశవః పాశగౌరవాత్ ॥

విద్యేతి చేతనాం ప్రాహు - స్తథాఽవిద్యా మచేతనామ్ ।
విద్యావిద్యాత్మకం సర్వం - విశ్వం విశ్వగురో ర్విభోః ॥

రూపమేవ న సందేహో - విశ్వం తస్య వశే యతః ।
వృక్షస్య మూలసేకేన - శాఖాః పుష్యంతి వై యథా ॥

శివస్య పూజయా తద్వత్ - పుష్యత్యస్య వపు ర్జగత్ ॥

చరాచర ప్రపంచము శివశరీరంబని పశుతుల్యులైన జీవాత్మలు - సంసారపాశ భారముచే క్రుంగినవారగుటచే తెలియకున్నవారు. చేతనాచేతనాత్మక జగము విద్యావిద్యాత్మకమై విశ్వనియామకుని స్వరూప మనుటలో సందియము లేదు, చెట్టు మొదట పోయఁబడు నీరు కొమ్మలు మొదలగు వృక్షమునంతయు పోషించునట్లు శివారాధనముతో జగమంతయు సంతసించునది.

కావున నిట నుపక్రమమున నుపాస్యముగ నిరూపింపఁబడిన బ్రహ్మమే మనోమయత్వాదిధర్మములు కలిగియుండునది. సంసారిజీవునకు ఇట్టిది పొసగకుండుటఁజేసి బ్రహ్మలక్షణమే బాగుగా ప్రతిపాదింపఁబడినదని సారాంశము.

మనోమయత్వమనఁగా? నిరతిశయమైన ఆనందము ననుభవించుటకు వలయు పరిపూర్ణమనన్సు కలిగియుండుట యగును. ప్రాణమయత్వ మనఁగా? జీవుల నందరిని నియమించు సామర్థ్యము కలిగియుండుట యగును.

ప్రశ్న : ప్రారంభమున చెప్పఁబడిన బ్రహ్మమే మనోమయత్వాది ధర్మములు గలది యని చెప్పునెడ నవాంతరమందు చూపఁబడిన జీవప్రసంగము వ్యర్థ మగును గదా?

ఉత్తరము :

సూ. "వివక్షిత గుణోపపత్తేశ్చ" 1-2-2

ఇట సత్యసంకల్పత్వము మొదలగు గుణములు చెప్పఁబడినందున బ్రహ్మమునకే పొసగునట్టివి. జీవాత్మయైతేచో బ్రహ్మోపాసకుఁడుగ నిర్ధారింపఁబడువాఁడు. ఎందుకనఁగా? ఉపాస్యమునకు నుపాసకుని యవసరము అనివార్యంబైనది.

సత్యసంకల్పత్వము :- వ్యర్థములు కానట్టి సంకల్పములు కలిగియుండుట.

సర్వకర్మత్వము :- ప్రపంచము కర్తవ్యముగా కలిగియుండుటయగును.

సత్యకామత్వము :- చేతనుల కోరికలను నిర్వహించు బాధ్యతయగును. అథవా సర్వకల్పములయందు జీవులకు వలయు భోగ్యముల నన్నిటి నేర్పరచుటయని చెప్పవచ్చును.

ప్రపంచమును వ్యాపించియు ప్రపంచగతములైన శరీరేంద్రియ విషయముల సంబంధము లేకుండుట మున్నగు లక్షణములు బ్రహ్మమునందే యుపసన్నములగునవి.

## అనుపపత్త్యధికరణము

సర్వసాధారణముగ జీవునకు నుపాస్యత్వము లేదనియు నుపాసక భావము కలదనియు పూర్వాధికరణమునందు నిరూపింపఁబడినది. మరియు సకల జీవోపాదానమగు నారాయణుఁడును విశ్వాతీత పరబ్రహ్మము నుపాసించువాఁడు కాని ముముక్షూపాస్యుఁడు కాజాలఁడని చెప్పన దీ యధికరణము.

సూ. "అనుపపత్తేస్తు న శారీరః" 1-2-3

ఇట విషయవాక్యము మహోపనిషత్తు నందలిది.

"పతిం విశ్వస్యాత్మేశ్వరం శాశ్వతం శివ మచ్యుతమ్, నారాయణం మహాజ్ఞేయమ్"

విశ్వపతిత్వము మొదలగు లక్షణములు కలిగిన నారాయణశబ్ద వాచ్యుఁడైన మూర్త్యాత్మ- పరమాత్మయా ? మరియొకఁడా ? అని సందేహము.

ప్రశ్న : "సహస్రశీర్షత్వాది లక్షణములు గలవాడు మూర్త్యాత్మయగు నారాయణుఁడే నని యభ్యసింపఁబడినది. ఎట్లనఁగా ? "సముద్రేఽంతం విశ్వశం భువమ్" అనుచో సముద్రశాయిత్వము మొదలగు నారాయణలక్షణములు, అచ్యుత హర్యాది పర్యాయవాచక శబ్దంబులు నుండుటఁజేసి మూర్త్యాత్మయగు నారాయ ణుఁడే విశ్వపతిత్వాదిలింగములు కలవాడని చెప్పనగును కాదా ?

ఉత్తరము : నారాయణుని యంతరాత్మయగు పరమేశ్వరుఁడే విశ్వపతి త్వాది లక్షణములు గలవాడు. కావున శివేతరుఁడగు నారాయణునియందయ్యవి యుపపన్నములు కాకుండును. "పశూనాం పతయే" "వృక్షాణాం పతయే" "జగ తాం పతయే" ఇత్యాది వాక్యములు పరమేశ్వరునియందే నిఖిలలోకాధిపత్యము గలదని యభ్యసించుచున్నవి "ఏకో హి రుద్రో న ద్వితీయాయ తస్థు ర్య ఇమాన్ లోకా నీశత ఈశనీభిః" అను వాక్యంబును శివేతరులకు జగన్నాథత్వమును నిషే ధించినది. "విశ్వాధికో రుద్రః" అను శ్రుతియు శంకరునకే విశ్వాతీతత్వమును సమర్థించుటఁజేసి విశ్వపతిత్వాది లక్షణములు గలవాడును నారాయణాంతర్యా మియు పరమేశ్వరుఁడే నగుననుట సమంజసమగుచున్నది.

ప్రశ్న : "అగ్నిర్వై దేవానా మవమో విష్ణుః పరమః'' అను శ్రుతివలన నారాయణుఁడు సర్వదేవతా శ్రేష్ఠుఁడని తెలియుచున్నది కాదా ?

ఉత్తరము : ''యజ్ఞోపవీతం పరమం పవిత్రమ్" అనునట్లు "తస్మాద్దానం పరమం వదంతి" అనునట్లును పై శ్రుతివాక్యము అర్థవాదమగునట్టిది. అథవా పై వాక్యమును ప్రమాణముగా భావించి గ్రహింపఁబడు పరత్వము - బ్రహ్మాదిదేవతల కంటె పరుఁడను నర్థమున నుపయుక్తంబగునది. కాని శివునికన్న నధికుఁడను నర్థమున కాజాలదు. "తత్పరాత్పరతో బ్రహ్మా- తత్పరా త్పరతో హరిః, తత్పరా త్పరతో హీశః" అను శ్రుతిఁ బట్టియు హరికి గల పరత్వము ఆపేక్షికమైనదని తెలియునది. విష్ణుశబ్దము - "వినా = పక్షిణా, ష్ణాతి = గచ్ఛతీతి విష్ణుః'' అను వ్యుత్పత్తి ననుసరించి నారాయణుని బోధించును. "విష్లు వ్యాప్తౌ" అను ధాతువు ననుసరించి వ్యాపించువాడు నను నర్థమున "సర్వేదేవాః సంవిశంతీతి విష్ణుః" "తస్మాత్సర్వగతః శివః" ఇత్యాది శ్రుతులఁబట్టియు శివాభిధానమగుచున్నయది.

ప్రశ్న : పరమేశ్వరుఁడు నారాయణాంతర్యామియనుట యుక్తము కాదు. ఎందుకనఁగా ? "నారాయణ పరంబ్రహ్మ" అనుచో నారాయణుఁడు పరబ్రహ్మం బని చెప్పి ''పద్మకోశప్రతీకాశం" ఇత్యాది వాక్యమున జీవుని హృదయపుండరీక మును పేర్కొనియు "తస్య మధ్యే వహ్నిశిఖా" ఇత్యాదిని జీవుని స్వరూపమును నిరూపించి "తస్యాః శిఖాయా మధ్యే- పరమాత్మా వ్యవస్థితః" పరమాత్మయనియు జీవాంతర్యామియనియు చెప్పినందున నారాయణుఁడు ఉపాస్యుఁడని తెలియు చున్నది. మరియు "స బ్రహ్మ స శివః" అనుచో బ్రహ్మశివాదులు నారాయణుని విభూతిలో చేరినవారనియు విశదమగుటఁజేసి విశ్వపతియు జీవాంతర్యామియు ఉపాస్యుండును నారాయణుఁడే నని చెప్పవలెను కాని శివుడు నారాయణాంత ర్యామి యగుటచే హరిపరుండనియు హరిచే నుపాసింపఁబడువాడనియు చెప్పుట సమంజసంబగునా ?

ఉత్తరము :

సూ. ''కర్మకర్తృవ్యపదేశాచ్చ" 1-2-4

మహోపనిషత్తు నందు పరమేశ్వరుఁడు ధ్యానింపఁదగినవాడగుటచే కర్మ యనియు నారాయణుఁడు ధ్యానించువాడగుటచే కర్తయనియు నిరూపింపఁబడినది. ''పద్మకోశ ప్రతీకాశం" అనుచో ప్రస్తుత నారాయణునిదే హృదయము పద్మకోశ మువలె ప్రకాశించునదనియు "పరమాత్మా వ్యవస్థితః" అనుచో పరమేశ్వరుఁడే పరమాత్మయనియు నారాయణ హృదయాంతర్వర్తిగా ధ్యానింపఁదగినవాడనియు గ్రహింపనగును, కావుననే శివకేశవులు ధ్యేయధ్యాతృ సంబంధము గలవారై కర్మ కర్తృభావములను పొందుచున్నవారు అందువలన నారాయణునికంటె వేరగు పర మాత్మ (శివుఁడు) ఉపాసింపఁదగినవాడని విశదమైనది.

"స బ్రహ్మ స శివః'' ఇత్యాది వాక్యములయందు బ్రహ్మ విష్ణు రుద్రేంద్రాది ప్రపంచము విభూతిగా గలవాడు శివుఁడని యుపదేశింపఁబడినది.

మహోపనిషత్తునందు విభూతిలో విష్ణువును గ్రహింపకున్నను కైవల్యో పనిషత్తునందు విష్ణుగ్రహణమును గాననగును. ఎట్లనఁగా ? "హృత్పుండరీకం విరజం" ఇత్యాదిని హృదయకమలమును ప్రశంసించి "ఉమాసహాయం పరమే శ్వరం ప్రభుం- త్రిలోచనం నీలకంఠం ప్రశాంతమ్, ధ్యాత్వా మునిర్గచ్ఛతి భూత

యోనిం- సమస్తసాక్షిం తమసః పరస్తాత్" సబ్రహ్మా స శివః సేంద్రః సోఽక్షరః పరమః స్వరాట్, స ఏవ విష్ణుః స ప్రాణః స కాలోఽగ్నిః" "పరమేశ్వరుఁడు- ఉమాసహాయుఁడనియు జగన్నియామకుఁడనియు త్రిలోచనుఁడనియు నీలకంఠుఁడనియు ప్రశాంతుఁడనియు ప్రాణులందరికిని జనకుఁడనియు చేతనుల సమస్త కర్మలకు సాక్షియనియు తమస్సు (ప్రకృతి) నతిక్రమించినవాఁడనియు ధ్యానించు శివభక్తుఁడు - శివపదము నొందువాడగును. ఇట్లు ధ్యేయుండై ప్రాప్యుఁడైన పరమేశ్వరుఁడే బ్రహ్మరుద్రేంద్రరూపములు గలిగియుండును. మరియు నాతడే అక్షరుడనఁబడును. పరముఁడును స్వరాట్టున్ను విష్ణుమూర్తియు ప్రాణంబును కాలంబు నగ్నియు నగువాడు'' ఇట్టి కైవల్యోపనిషన్న్యాయము నీ మహోపనిషత్తునందు స్వీకరింపనగును.

''యోవై రుద్రః సభగవాన్ భూర్భువః సువర్యశ్చ బ్రహ్మ, తస్మైవై నమోనమః'' ''యశ్చవిష్ణుః'' "యశ్చమహేశ్వరః'' ఇత్యాది అథర్వణశ్రుతియు పై యంశమును సమర్థించుచున్నది.

మహోపనిషత్తునందు బ్రహ్మరుద్రులమధ్య విష్ణువు శివోపాసకుఁడగుటచే గ్రహింపఁబడలేదనియు ఉపాసకుఁడుగా ప్రశంసింపఁబడినవాడనియు వివేకము.

ప్రశ్న : పురుషసూక్తమున "సహస్రశీర్షా పురుషః'' మొదలుకొని ప్రశంసింపఁబడిన పురుషుఁడు "పాదోఽస్య విశ్వాభూతాని" అనుచో - తనలో జగము ఏకాంశముగా గలవాడని చెప్పఁబడినది. అట్టివాడే "సహస్ర శీర్షం దేవం" ఇత్యాదిని నారాయణుడుగా బోధింపఁబడుచున్నవాడు. మరియు "నారాయణ పరంబ్రహ్మ" అనుచో పరబ్రహ్మముగాను చెప్పఁబడుచున్నవాడు. బ్రహ్మమగువాడే సర్వోపాస్యుఁడగును గదా ! సర్వోపాస్యుఁడైన నారాయణుఁడు శివోపాసకుఁడు కాదగునా ?

ఉత్తరము :

సూ. "శబ్దవిశేషాత్" 1-2-5

"నారాయణ పరంబ్రహ్మ"అను శబ్దవిశేషమే "నారాయణాత్ పరంబ్రహ్మ" అను నంశమును ప్రతిపాదించుచున్నది. కావున నారాయణునికన్న నితరమగు నదియే పరబ్రహ్మముగా నుపాసింపఁదగినదని తెలియనగును. పరమేశ్వరుఁడు

సహస్రశీర్షత్వము మొదలగు ధర్మములతో కూడియుండు నారాయణుడనఁబఱగు పురుషుని స్వరూపము గలవాడై జగదుపాదాన మగువాడు.

పరమేశ్వరుఁ డంతర్యామిగా గల నారాయణుఁడు- జగద్రూపుఁడని ప్రకృత్యధికరణమునందు బాగుగా నిరూపింపఁబడును.

శ్రీ సుదర్శనాచార్యచరణులు - తాత్పర్య సంగ్రహమునందు "నారాయణః పరంబ్రహ్మ''అని వ్యస్తపదముగా గ్రహించి "నారాయణునకు పరబ్రహ్మత్వము- పరమేశ్వరునితో నభిన్నమైన (శివోఽహం) భావన గలవాడగుటఁజేసి విశ్వపతిత్వాది లక్షణములున్ను పొసగు"నని దిగువ శ్లోకము నుదాహరించినవారు.

బ్రహ్మోచ్యతే పరమసౌ పరమంచ తత్త్వం
జ్యోతిఃపరంచ పరమేశ్వర ! పద్మనాభః ।
త్వద్భావనైకనిరత స్త్వదనన్యభావాత్
మంత్రీ యథా గరుడభావనయా గరుత్మాన్ ॥

నారాయణుఁడు శివోపాసకుఁడను నంశమున మరియొక ప్రమాణమును దిగువ సూత్రము నుదాహరించినవారు.

సూ. "స్మృతేశ్చ'' 1-2-6

శ్లో॥ ఏవ ముక్త్వా తతో రాజన్-మహాయోగీశ్వరో హరిః ।
దర్శయమాస పార్థాయ-పరమం రూప మైశ్వరమ్ ॥ భ. గీ.

ఇఁట నారాయణుఁడు మహాయోగస్వామి యని చెప్పఁబడుటచే పరమేశ్వర ధ్యానమనఁబడు సమాధియోగము గలవాడని వ్యక్తమగుచున్నది. మరియు

శ్రీకృష్ణుని యోగనిష్ఠను వక్కాణించి అట్టి యోగనిష్ఠఁదగు మహిమవలన పార్థునకు చూపెట్టిన రూపము "ఐశ్వరం'' అనఁబడుటచే శివధ్యానయోగము గలవాడు శ్రీకృష్ణుఁడని సువ్యక్తము చేయఁబడినది. లోకములో గరుత్మన్మంత్రోపాసకుఁడు భావించు గరుడభావన లేనిది గారుడరూపము ఏర్పడనట్లు పరమేశ్వర భావన దృఢముగా లేనిది శ్రీకృష్ణుఁడు శివరూపమును చూపజాలడుగదా ! దధీచి మహర్షియు పరమేశ్వరభావనాదార్ఢ్యము వలననే విశ్వరూపమును ప్రదర్శించిన వాడని లింగపురాణాదులయందు దక్షదధీచి సంవాదమున నుల్లేఖింపఁబడినది.

శ్లో॥ అహం యథావదారాధ్యః-కృష్ణేనాక్లిష్ట కర్మణా।
తస్మాదిష్టతమః కృష్ణా-దన్యో మమ న విద్యతే॥ మహాభారతము

"లోకకల్యాణ కార్యములఁ జేయు శ్రీకృష్ణుఁడు నన్ను విధివిహితముగ నారాధించువాడు కావున కృష్ణునికన్న మిక్కిలిప్రియుఁడు మరియొకఁడు గాన రాడు" అని పరమేశ్వరుఁడు అశ్వత్థామఁ గూర్చి వక్కాణించెను.

ఏవమాది సందర్భమువలన నారాయణభిన్నమైన శివాఖ్యమగు తత్త్వము ఉపాస్యంబని విశదమైనది.

మరియొక అనుపపత్తిని నివారింపఁ దిగువసూత్రము.

సూ. "అర్భకౌకస్త్వా త్తద్వ్యపదేశాచ్చ నేతి చేన్న,
నిచాయ్యత్వా దేవం వ్యోమవచ్చ" 1-2-7

"నీవారశూకవత్తన్వీ పీతా భాస్వత్యణూపమా, తస్యాః శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః" అనుచో హృదయకమలమందు మిక్కిలి చిన్నదగు అగ్ని జ్వాలలో ఆశ్రయము స్వల్పమగుటచేత నందు గలవాడు నల్పుడనఁబడగును కావున సర్వవ్యాపియగు పరమేశ్వరుఁడు ప్రతిపాదింపఁబడుచులేదని, యాశంకింప గూడదు.

పరమేశ్వరుఁడు ఉపాస్యుఁడగుటచే హృదయగుహాంతర్వర్తియని చెప్పఁ బడియెను. కాని యల్పస్వరూపముగలవాడని కాదు. పరబ్రహ్మము ఆకాశమువలె స్వల్పమైనదియు మహత్తునగును. ఘటాదులలో గల యాకాశము స్వల్పమగుటయు, స్వరూపతః మహత్తునగుటయు సుప్రసిద్ధము గావున విరోధమెద్దియు లేదని భావము.

మరియు నొక యాశంకకు సమాధానము దిగువ సూత్రము.

సూ. "సంభోగప్రాప్తిరితి చేన్న, వైశేష్యాత్" 1 2-8

"నారాయణపరంబ్రహ్మ" అనుచో నారాయణునికంటె నతీతంబనియు ఉపాస్యంబనియు చెప్పఁబడిన పరబ్రహ్మమే "ఋతం సత్యం పరంబ్రహ్మ - పురుషం కృష్ణపింగళమ్, ఊర్ధ్వరేతం విరూపాక్షమ్" అనుచో పరమశక్తియనఁదగు.

ఉమాదేవితో కూడి నానావర్ణములు కలదగుటచే కృష్ణపింగళమనియు అగ్ని రేతస్సుగా గలవాడగుటచే నూర్ధ్వరేతస్కుంబనియు మూడు కన్నులు గల వాడగుటచే విరూపాక్షంబనియు పూర్వోక్త దహరపుండరీకమనఁదగు పురమున శయనించువాడగుటచే పురుషుఁడనియు మనోవిపర్యాసము లేనందున ఋతంబనియు వాగ్విపర్యాసము లేనందున సత్యంబనియు పేర్కొనఁబడినది.

కావున "పరబ్రహ్మమునకు త్రిలోచనత్వము మున్నగు లక్షణములుగల శరీరముఁదగు సంబంధమువలన శరీరగతములైన సుఖదుఃఖాదుల యనుభవము సమకూరు"నని చెప్పఁగూడదు ఎందుకనఁగా? జీవేశ్వర శరీరములకు వైలక్షణ్యము గానఁబడుచున్నయది. పరమేశ్వరుని శరీరమైతేనో స్వేచ్ఛా గృహీతము; జీవ శరీరములు కర్మమూలకములగునవి. ఇందువలననే "అపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సోఽపిపాసః, సత్యకామః సత్యసంకల్పః" అనుచో సంసారి శరీరధర్మములగు పాపము ముసలితనము మరణము దుఃఖము ఆకలి దప్పి లేనివాడనియు యథార్థములగు సృష్ట్యాదివాంఛలు గలవాడనియు సఫలములగు రచనలు గలవాడనియు పరమేశ్వరుఁడు పేర్కొనఁబడుచున్నవాడు. సంసారి జీవుఁడు ఏతాదృశుఁడు కాజాలడు. పరమేశ్వరుని శరీరములు ప్రాకృతములు కానివనియు పాప జరా మరణ శోకాదిరహితములనియు స్వేచ్ఛాసంపాదితము లనియు లీలామంగళరూపములనియు "స్థిరేభి రంగైః పురురూప ఉగ్రః" ఇత్యాది వాక్యములయందు స్థిరములనియు నిత్యములనియు ప్రతిపాదింపఁ బడినది. అందువలన పరబ్రహ్మమగు శివునికి జీవునికిని భేదముఁడుటఁజేసి జీవునికివలె శరీరాదిగత దోషములు పరమేశ్వరునకు సంభవింపఁజాలవని సారాంశము.

ఇఁట నుపక్రమాది లింగములతో విరూపాక్షమైన పరబ్రహ్మము సర్వోత్కృష్టముగ నుపాస్యంబనుట సమంజసంబగుచున్నయది ప్రారంభమున "అణో రణీయాన్" మొదలుకొని "మహిమాన మీశమ్" వరకు పరమేశ్వరుఁడు-ప్రాణు లందరి హృదయ గుహలయందు నివసించుచు తన యనుగ్రహాతిశయమున సంసారదుఃఖమును తొలగించుకొనిన మహాపురుషునకు దర్శనీయుఁడగు గొప్ప మహిమగలవాడని ప్రశంసింపఁబడినవాడు. మఱియు "సప్తప్రాణాః ప్రభవంతి తస్మాత్" అనుచో పరమశక్తి సంపన్నుడైన శివుఁడే ప్రాణశబ్దితములైన మనోబుద్ధి

జ్ఞానేంద్రియ పంచకములు మున్నగు జగమునకు నుపాదాన మగువాడని నిరూపింపఁబడెను. అనంతరము" యో దేవానాం ప్రథమం పురస్తాత్-విశ్వాధికో రుద్రో మహర్షిః, హిరణ్యగర్భం పశ్యత జాయమానమ్" అనుచో విశ్వాధికుఁడనియు సర్వజ్ఞుఁడనియు సకలకార్య ప్రథముఁడగు హిరణ్యగర్భుని పుట్టించి యనుగ్రహించు వాడగుటచే జగత్కారణమగుననియు శివుఁడు పరామర్శింపఁబడెను. అట్టి పరమాత్మయే "పరేణనాకమ్" అనుచో పరాకాశమనఁదగు గుహలో నుండు వాడనియు ఫలాపేక్షారహితముగ కర్మల నాచరించి వేదాంతముల తాత్పర్యమును గురుతెఱిగిన జితేంద్రియులకు "పరామృతాత్ పరిముచ్యంతి" అనుచో పరామృత రూపముగ ప్రాప్యుఁడనియు వర్ణింపఁబడెను. అట్టి శివుని పొందుటకు నుపాయ మెద్దియనఁగా"ధహరంవిపాప్మమ్"అనుచో దహరోపాసనమని ప్రారంభించి"తస్మిన్ యదంత స్తదుపాసితవ్యమ్" అనుచో దహరపుండరీకమునఁగల వస్తువు ఉపాసింపఁదగినదని సామాన్యముగ చెప్పి "యః పరః స మహేశ్వరః" అనుచో మహేశ్వరుఁడను పేరు గల పరబ్రహ్మము విశేషించి నిర్ధారింపఁబడినది. ఉపాస్యము ఎట్టి రూపము గలదనునెడ" ఋతం సత్యమ్" ఇత్యాది వాక్యమున విరూపాక్షత్వాది స్వరూపము గలది యని యుపసంహరింపఁబడెను.

"యో దేవానాం" అను మంత్రము తరువాతిదగు "యస్మాత్పరం నాపరమస్తి కించిత్" అను మంత్రము శివపరమగునని ఆశ్వలాయనుఁడు దిగువ శ్లోకములతో సమర్థించెను.

యస్మా త్పరతరం నాస్తి-నాపరంచ పరాత్మనః ।
న జ్యాయోఽస్తి న చాణీయో-నమ స్తస్మై స్వయంభువే ॥

యేనేద మఖిలం వ్యాప్తం-యన్మయా మూర్తయః స్మృతాః ।
తస్మై శివాయ మహతే-నమః సూక్ష్మాక్షరాత్మనే ॥

మహోపనిషత్తునందు నవాంతరవాక్యసిద్ధుఁడగు నారాయణుఁడు పూర్వాధికరణ న్యాయము ననుసరించి యుపాసకుఁడుగ నిర్ణయింపఁబడుచున్నవాడనియు జీవులందరికి శివోపాసనాధికారము ఉన్నను విశిష్ట పురుషాధిష్ఠితమగుటచే శివోపాసనము సర్వోత్తమమైనదని భావించి నారాయణుఁడు శివోపాసకుఁడుగ గ్రహింపఁబడెననియు ఉపాస్యంబగు విరూపాక్షబ్రహ్మము కొఱకు పాసకుఁడైన నారాయణుఁడు

నభిన్నమగు భావన గలవాడగుటచే శివధర్మములగు విశ్వపతిత్వాదులతో ప్రతిపాదింపఁబడెననియు శివాంతర్యామికుఁడు శివకార్యంబు నగు నారాయణునకు జగద్రూపత్వాదులు పొసగుననియు సిద్ధాంతము.

## అత్త్రధికరణము

సూ. "అత్తా చరాచరగ్రహణాత్" 1-2-9

విషయవాక్యము "యస్య బ్రహ్మచ క్షత్రం చోభే భవత ఓదనః, మృత్యు ర్యస్యోపసేచనం క ఇత్థా వేద యత్ర సః"

ఇఁట మృత్యువును వ్యంజనముగా గ్రహించి బ్రహ్మక్షత్రోపలక్షితమైన జగమును కబళముగా స్వీకరించు సర్వసంహర్త-పరమేశ్వరుఁడా? తదితరుఁడగు సంహారరుద్రాది రూపముగల దేవతావిశేషమా? అని సందేహము.

ప్రశ్న : పరమకారుణికుఁడు సర్వానుగ్రాహకుఁడు నగు భగవానుఁడు సకల భక్షకుఁడనుట యనుచితము. ఇతరుల ప్రాణములఁదీయుట-హింసారూపముగదా ' హింసాప్రవృత్తికి క్రోధమే మూలాంకురమగునది అమంగళగుణమగు క్రోధమునకు మోహమే కారణమని తెలియునది. సర్వసంహార నిదానమైన మోహమునకు తమోగుణమే జన్మస్థానమగును కావున సర్వసంహర్తయు తామసుఁడు కావలసివచ్చును. తామసత్వమనఁగా? జ్ఞానాది సద్గుణములను మఱుగుపఱచు ప్రకాశరాహిత్యముగదా! బ్రహ్మము సర్వసంహర్తయని చెప్పనెడ-నిత్యశుద్ధము నిరుపాధిక మంగళాత్మకము సంసారకళంకరహితము నగు బ్రహ్మమునకు అజ్ఞాన తమో మోహ క్రోధాదికములైన అమంగళ గుణములు సంభవించునని చెప్పవలసివచ్చును. మరియు బ్రహ్మ స్వరూప లక్షణముగా నిర్ణయింపఁబడిన సర్వజ్ఞత్వ నిత్యతృప్తత్వాదికము వ్యర్థమే యగునది. అందువలన పూర్వోక్తగుణములు గల మరియొక దేవతావిశేషము-సంహర్తయగువాడని యంగీకరింపవలెను గాదా?

ఉత్తరము : బ్రహ్మమే సర్వసంహర్తయని చరాచర గ్రహణమువలన తెలియుచున్నది. "చరాచరమునంతయు భక్షించుట యుచితముగా" దని చెప్పుట సరి కాదు. అద్దియే బ్రహ్మమగుటకు లక్షణము గదా! పరిమితశక్తి గల జీవాత్మకు చరాచరమునంతయు సంహరించు సామర్థ్యము లేకుండును. "తస్మాదుపసంహర్త్రే

మహాగ్రాసాయ వై నమోనమః" అను అథర్వశిరోవాక్యమున పరమేశ్వరుఁడు సర్వ సంహర్తయని ప్రతిపాదింపఁబడినది. కాని జీవాత్మ సర్వ సంహర్తయని యెందును చెప్పఁబడలేదు. మరియు "య ఇమా విశ్వా భువనాని జుహ్వదృషి ర్హోతా నిషసాద పితా నః. స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః పరమచ్ఛదో వర అవివేశ'' ''సకలవేద ద్రష్టయు మమ్ము పుట్టించువాడు నగు శివుఁడు - లోకముల నన్నిటిని స్వగర్భ వహ్నియందు హోమముఁ జేయుచు తానుమాత్ర ముండువాడు. ఇట్టి పరమాత్మ— స్వేచ్ఛాశక్తిచే స్వవిభూతి యనఁదగు ప్రపంచమును బంగారముతో కుండలమును వలె సృజింపఁదలచెను. నిజసంకల్పమాత్ర సృష్టమగు ప్రపంచము ఆవరణముగా గలవాడై ప్రపంచమునఁ బ్రవేశించెను'' అనుచో పరమేశ్వరుఁడు నిజప్రకాశవహ్ని యందు నిఖిలభువన హవ్యములను హోమముఁజేయువాడని విదితమగును. హవ్య కోటిలో చేరిన జీవునకు ఇట్టి సామర్థ్యము లేదు గదా ! స్వభిన్నమగు చరాచరము లతో నిండియుండు చిదచిత్ప్రపంచము నంతయు తనలో నుపసంహరించి(శివుఁడు) యుండు తఱి - జగమంతయు సూర్య చంద్రాది ప్రకాశము లేనిదగుటచే దివా రాత్ర్యాది కాలవిభాగము లేనిదియు నామరూప విశేషరహితమగుటచే దేవమానవాది స్థూలవిభాగము లేనిదియు తమోమాత్రముగ నుండెడిది. ఆ సమయమున పర మేశ్వరుఁడు ఒకఁడే నిరంకుశ ప్రకాశము గలవాడై సర్వసాక్షిగ నుండువాడు. ఇందుకు శ్రుతిప్రమాణము "యదా తమస్త న్నదివా న రాత్రి-ర్నసన్నచాస చ్ఛివ ఏవ కేవలః"

ప్రశ్న : నిత్యప్రకాశము గలవాడై శివుఁడు ఉన్నపుడు జగము తమోమ యంబగుట పొసగదుగదా ! అట్లైనచో శివుని నిత్యప్రకాశమునకు భంగము చేకూ రును గాదా ?

ఉత్తరము : జగము తమోమయముగా నున్నను స్వయంప్రకాశమానుఁడు సర్వసాక్షియు నగు శివునకు హాని యేమియు లేదు. ప్రళయకాలము నామరూప శూన్యమగుట నింద్రియశక్తులను గోల్పోయిన జీవాత్మలు - శరీరాది పరికరములు లేనివారై సృష్టియందువలె ప్రపంచము ననుభవింపఁజాలనివారగుదురు. మఱియు ననాదిమలత్రయముచే నిజజ్ఞానము మఱుగుపడియుండు కతన శివుఁడు స్వప్రకాశుఁ డైనను జీవులకు దర్శనీయుఁడు కాకుండును. అందువలన సమస్త కార్య విశేష జ్ఞానము లేనట్టి (జీవుల)పరమ సుషుప్తియనఁదగు మహావస్థ - తమస్సు అనఁబడు చున్నయది.

ఆసీదిదం తమోభూత మప్రజ్ఞాత మలక్షణమ్, స్మృతి.

"ఈ జగము- ప్రళయమున నామరూపవిభాగము లేనిదై తమోమాత్రముగ నుండినది" అప్రజ్ఞాతమనగా - నామవిభాగము తెలియరానిది. అలక్షణమనగా - రూపవిభాగముఁ జేయరానిది యగును.

"శివ ఏవ కేవలః" అనుచో కేవలపదమునకు సూక్ష్మ (నామరూప విభాగ రహిత) చిదచిత్ప్రపంచ విశిష్టుఁడను నర్థముఁజెప్పి ఏవకారమునకు స్వసమాన మైన ద్వితీయవస్తువు లేనివాడని నిర్వచనముఁ జేయవలెను. మఱల సృష్టికాల మున స్వసంకల్పమువలననే యత్కించి దుపకరణము లేకయే తననుండి ప్రప్రథ మముగ ఇచ్ఛాశక్తిని స్ఫురింపఁజేయువాడును వెనువెంటనే పూర్వాపూర్వ నామ రూపములతో ఇంద్రాది చేతనులను పృథివ్యాద్యచేతనములను సృజించువాడును శివుఁడనియే గ్రహింపవలెను.

శ్లో॥ చిదాత్మైవహి దేవోఽంతః-స్థిత మిచ్ఛావశా ద్బహిః।
యోగీవ నిరుపాదాన-మర్థజాతం ప్రకాశయేత్॥ అభియుక్తసూక్తి.

చిదానందస్వరూపుడగు పరమేశ్వరుఁడే తనలో సూక్ష్మరూపముతో నుండు చరాచరమునంతయు యోగిపురుషునివలె నెట్టి సాధనములేకయే స్థూలరూపముతో బయలుపఱచువాడు.

ప్రశ్న : "మాయాం తు ప్రకృతిం విద్యా- న్మాయినంతు మహేశ్వరమ్" అనుచో (మాయ జగమున కుపాదానమనియు) మహేశ్వరుడు మాయావిశిష్టుండని విశదమగుచున్నందున మహేశ్వరుడు గావించు సృష్టికార్యమునకు మాయ యుపా దానమగునని బోధపడుచున్నయది. మరియు "తస్మా ద్విరాడజాయత" అనుచో పురుషుడును జగదుపాదానముగ పేర్కొనంబడుచున్నవాడు కావున పరమేశ్వ రుడు నిరుపాదానముగ జగమును సృజించు ననుట యెట్లు పొసగును ?

ఉత్తరము : కుమ్మరివాడు చేయు ఘటమునకు వేరుగ మృత్పిండముపా దానముగ కనఁబడునట్లు మాయాద్యుపాదానములు పరమేశ్వరుని విడిచియుండు నవి కావు. పరమేశ్వరుడే మాయాది రూపములఁదాల్చి జగమును పుట్టించువాడు కావున "నిరుపాదానమ్" అనుటలో విరోధమేమియులేదు స్వరూపములగు సూక్ష్మ

మాయాపురుషులతో నవినాభావము గల పరమేశ్వరుఁడే స్వయముగ నుపాదాన మనియు చెప్పఁబడువాడు.

"ధ్యాయీతేశానం ప్రధ్యాయితవ్యమ్, సర్వమిదం బ్రహ్మవిష్ణురుద్రేంద్రా స్తే సంప్రసూయంతే, సర్వాణి చేంద్రియాణి, సహభూతైః, ర్నకారణం కారణానామ్, ధాతా ధ్యాతా కారణం తు ధ్యేయః సర్వైశ్వర్యసంపన్నః సర్వేశ్వరః శంభు రాకాశమధ్యే"

అధర్వశిఖోపనిషత్తు.

''ధ్యేయుఁడగు పరమేశ్వరుని ముముక్షువు ధ్యానింపవలెను. బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వరులు, సర్వప్రపంచంబు సర్వేంద్రియములు, పంచభూతములును పరమేశ్వరునివలన నావిర్భవించునట్టివి. జగత్కారణములుగ నిర్దేశింపఁబడు పంచభూత దశేంద్రియాదులకు కారణుఁడైన పరమాత్మ మాత్రము ఎద్దానివలన నావిర్భవించువాడు కాడు. ఇట్లు జగమునంతయు నిర్మించువాడు తదుపయుక్తమైన వస్తుసామగ్రిని కనిపెట్టువాడు నగు పరశివుఁడు - సర్వజ్ఞత్వము మొదలగు కల్యాణగుణముల సమృద్ధిఁగలవాడనియు సమస్త ప్రపంచమును శాసించువాడనియు హృదయపుండరీకగతమగు చిదాకాశమునందు ధ్యానింపఁదగినవాడు" ప్రాణులందరు సంహరింపఁబడుటకు నిలయమెద్దియో నద్దానినుండియే జీవుల యావిర్భావమగుటంజేసి యవధిలేనట్టి జీవాత్మలు - అనంతశక్తి విశిష్టుఁడగు పరమేశ్వరునందే విశ్రాంతిఁ జెందుదురని విశదమగుచుండుటచే బ్రహ్మశబ్దాభిధేయుండగు శివుఁడే సర్వసంహర్త యగువాడు.

"సర్వజగత్సంహారము హింసారూపమగుటచే హింసామూలములగు క్రోధాద్యనర్థగుణములు బ్రహ్మమునకు సంబంధించు"నని చెప్పుట యవివేకమగును. ఎందుకనఁగా? క్రోధాదిగుణములకు మూలమగు తమోగుణము ప్రాకృతము గదా ! "ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం" మొదలుకొని'' సమస్త సాక్షిం తమసః పరస్తాత్" వరకుగల పూజ్యమగు శ్రుతియే - పరమేశ్వరుఁడు తమోఽతీతుఁడని చెప్పుటకు- పరమప్రమాణమగుచున్నది.

మఱియు- పరమాత్మ మోహాదులను తొలగించు జ్ఞానాదిగుణములతో నిత్య సంబంధము గలవాడని- పౌరాణికవాక్యము విశదీకరించినది.

శ్లో॥ జ్ఞానం వైరాగ్య మైశ్వర్యం-తపః సత్యం క్షమా ధృతిః
స్రష్టృత్వ మాత్మసంబోధో-హ్యధిష్ఠాతృత్వ మేవ చ ।
అవ్యయాని దశైతాని-నిత్యం తిష్ఠంతి శంకరే ॥

జ్ఞానము, విరాగము, ఈశ్వరభావము, తపస్సు (సృష్టి సామగ్రి నాలోచించుట) సత్యము, సహనము, ధైర్యము, నిఖిల ప్రపంచమును సృజించుట, తనను తాను గుర్తెరిగియుండుట, సృష్టజగము నంతర్యామిగ నధిష్ఠించుటయు నీ పది నిత్యగుణములు పరమేశ్వరునియందెల్లకాలము వర్తించునవి.

శ్లో॥ అశేషవిషయామోఘ-శుద్ధబుద్ధివిజృంభణః ।
ఆత్మశక్త్యమృతాస్వాద-ప్రమోదరసికో యువా ॥

పరమేశ్వరుఁడు - నిరుపయోగము కానట్టి శుద్ధమైనట్టి నిత్యాభివృద్ధి గలిగినట్టియు స్వకీయవిజ్ఞానమున చరాచరమంతయు విషయముగా గలవాడును, నిజశక్తిరూపమైన నమృతము నాస్వాదించుటవలన కలుగు ప్రమోదముచే రసికుడగువాడును, నిత్యయువకుఁడు నగుచున్నవాడు.

నిగ్రహము - అనుగ్రహోద్దేశముతో పుత్రాదులఁ గురించి చేయఁబడునదియు, గొప్పవారి ననుగ్రహించుటకై తదితరములను వేట మొదలగువానియందు హింసించునదియు, ప్రజలను తద్బాధకులగు చోరాదుల ననుగ్రహించు నుద్దేశముతో గావింపఁబడునదియు నగుచు త్రివిధంబగును. ఏతాదృశ త్రివిధ నిగ్రహము హింసారూపమైనను దోషావహము కానట్టిది.

ఇందుకు ప్రమాణము.

శ్లో॥ ఏకస్మిన్ యత్ర నిధనం-ప్రాపితే దుష్టచారిణి
బహూనాం భవతి క్షేమం-తత్ర పుణ్యప్రదో వధః ॥

దుర్మార్గు నొకనిని సంహరించునెడ బహుజనమునకు క్షేమము కలుగునేని యట్టి నిగ్రహము పుణ్యప్రదమగునది.

శ్లో॥ రాజభి ర్ధృతదండా స్తు-కృత్వా పాపాని మానవాః
విమానైః స్వర్గ మాయాంతి-సంతః సుకృతినో యథా॥

పాపములఁ జేసిన మానవులు రాజదండనఁ బొందినచో పుణ్యాత్ములవలె విమానములలో స్వర్గమునకు వెళ్ళుదురు.

ఐతే ఇమ్మూఁడు విధములగు నిగ్రహములు గాక నాల్గవదైన ద్వేషమూలక నిగ్రహము దోషావహ మగుటచే పరిహరింపఁదగినదని భావము.

మహాప్రళయకాలమున పరమేశ్వరుఁడు గావించు సర్వసంహారము - అనుగ్రహరూపమగునది. ఎట్లనఁగా ? చాలకాలమునుండి సంసారమార్గమున రాకపోకలచే నలసటఁ జెందియుండు జీవులకు మహాసుషుప్తి యనఁదగు గొప్ప విశ్రాంతిని కలుగఁజేసి యనుగ్రహించుట యగును.

స్థితికాలమున చేయఁబడు రాక్షస సంహారము - దేవతలను రాక్షసుల నుభయుల ననుగ్రహించుట యగును. మఱియు హింసించు తిర్యగ్జంతువులను వధించుట - భక్తులను కాపాడునది, పాపాత్ములను నరకములందు బాధింపఁజేయుట - వారి పాపములను బోకార్చి యనుగ్రహించునది;

ఇట్లు పరమేశ్వర కృతములైన నిగ్రహములన్నియు దోషావహములు గాకుండుటను గుణములగుటను శివమహాపురాణాంతర్గత వాయుసంహితయందు గాననగును.

శ్లో॥ యే పుత్రనిగ్రహాః కేచిత్-బ్రహ్మాదిషు నిదర్శితాః
తేఽపి లోకహితాయైన-కృతాః శ్రీకంఠమూర్తినా ॥

అండస్యాస్యాధిపత్యం హి-శ్రీకంఠస్య న సంశయః
శ్రీకంఠాఖ్యాం శివో మూర్తిం-క్రీడంతీ మధితిష్ఠతి ॥

సదోషా ఏవ దేవాద్యా-నిగృహీతా యథోచితమ్
తతస్తేఽపి విపాప్మానః-ప్రజాశ్చ విగతజ్వరాః ॥

నిగ్రహోఽపి స్వరూపేణ-విదుషాం న జుగుప్సితః
అతఏవ హి దండ్యేషు-దండో రాజ్ఞాం ప్రశస్యతే॥

యత్సిద్ధి రీశ్వరత్వేన—కార్యవర్గస్య కృత్స్నశః
న స చేదీశతాం కుర్యా-జ్జగతః కథ మీశ్వరః ॥

హితే సదా నిషణ్ణానా—మీశ్వరః స్యా న్నిదర్శనమ్
న కథం దూష్యతే సద్భి-రసతా మేవ నిగ్రహాత్ ॥

సర్వోఽపి నిగ్రహో లోకే-న చ విద్వేషపూర్వకః
న హి ద్వేష్టి పితా పుత్రం - యో నిగృహ్యాపి శిక్షయేత్ ॥

పరమేశ్వరుఁడు శ్రీ కంఠమూర్తికి బ్రహ్మాండాధిపత్యము నొసగి విహరించు నమ్మూర్తి నావహించియు తద్వారా లోకహితమునకై బ్రహ్మాదులను పుత్రభావనతో శిక్షించినవాడు. ఇట్లే దేవతలు మున్నగువారు నపరాధులైనపుడు నవ్వారిని నిగ్రహించుటఁజేసి దేవతలు ప్రజలును నిర్దోషులై సుఖముగ మనుచుండువారు. ఇట్టి నిగ్రహము - వస్తుతః జ్ఞానులచే నిందింపఁబడునది కాదు. కావుననే రాజులు చోరాదులను శిక్షించుట - న్యాయమగుచున్నది. ఈశ్వరుడనఁగా - బ్రహ్మాదికార్య వర్గము నంతయు శాసించువాడగును. ఒకవేళ శాసింపకుండునెడ జగత్ప్రభు వెట్లగును? లోకమున దుర్మార్గులను మాత్రము శిక్షించుచు నవ్వారి హితముఁగోరు మహానుభావులకు పరమేశ్వరుఁడే నిదర్శనమగువాడు. కావున నట్టివారు పరమేశ్వరుని వలె నదూషితులగుదురు.

జనకుఁడు - పుత్రుని నిగ్రహించినను ద్వేషింపనట్లు పరమేశ్వరుని సర్వవిధ నిగ్రహంబు ద్వేషపూర్వకము కానట్టిది.

ప్రశ్న : దైత్యులు మొదలగువారిని చంపుటయందు క్రోధ మనివార్యమగుటచే క్రోధమూలమగు తమోగుణము కలవాడు పరమేశ్వరుఁడని చెప్పవలెఁగాదా ?,

ఉత్తరము : "తమసః పరస్తాత్" అను శ్రుతివాక్యము ననుసరించి పరమేశ్వరునికి వలయు క్రోధము తమోగుణమువలన నేర్పడదని తెలియుచున్నది.

"తమస్సు లేనిది క్రోధము కలుగ"దని శంకింపఁగూడదు. "క్రోధమాహారయన్ తీవ్రమ్" అని శ్రీ రామాయణమునందు చెప్పినరీతిగా దుష్టనిగ్రహమునకై క్రోధము తెచ్చుకొనఁబడునదగుటచే పరమేశ్వరుని యధీన మగునట్టిది.

అసంకుచితమగు వైభవము గల పరమేశ్వరుఁడు - సృష్టిఁజేయఁదలచి "సోఽకామయత బహు స్యామ్" విశాల ప్రపంచము సిద్ధమగుటకు మాయాస్వరూపిణియగు ఇచ్ఛాశక్తి నాశ్రయించువాడు. పిమ్మట "స తపోఽతప్యత" తపఃస్వరూపిణియగు జ్ఞానశక్తితో జీవాత్మలందరి కర్మలకు వలయు నానావిధ శరీరములనంబడు సామగ్రి నాలోచించువాడు. తరువాత సంకల్పించినవాటి నన్నిటిని నిర్మించు నేర్పుగల క్రియాశక్తితో "ఇదం సర్వ మసృజత" ఇచ్ఛాశక్తి-భిత్తియందు సమస్త జగచ్చిత్రమును బయలుఁబఱచువాడు. "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" బ్రహ్మాది కార్యవర్గము నంతయుఁ బ్రవేశించి ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తిత్రయ సంబంధముతో రజస్తమఃసత్త్వ గుణత్రయముతో నేర్పడు బ్రహ్మవిష్ణురుద్రులు మొదలగు ప్రపంచముగ పరిణమించువాడు. కావున సర్వవిధ సామర్థ్యములు గలిగినయట్టి సర్వజ్ఞుడగునట్టియు శివుని మహిమ-ఏతన్మాత్రమని యెవఁడు గురుతెఱుఁగఁజాలును? ఎవనికిని తెలియనలవి గానిదని భావము.

ఇందువలన సర్వమును సంహరించువాడు పరమేశ్వరుఁడే నని విదితమైనది.

సూ. "ప్రకరణాచ్చ" 1-2-10

"మహాంతం విభు మాత్మానం మత్వా ధీరో న శోచతి"

"నాయ మాత్మా ప్రవచనేన లభ్యః"

"గొప్పవాడు సర్వవ్యాపకుఁడు నగు పరమాత్మను ధీరుఁడు భావించునెడల సంసారదుఃఖమును పొందఁజాలడు"

"ప్రసంగముతో పరమాత్మ-తెలియువాడు కాడు"

ఇట్టి పరమేశ్వర ప్రకరణ మిందున్నందునను పరంబ్రహ్మమగు పరమేశ్వరుఁడే సర్వసంహర్త యగును కాని యితరుఁడు కాజాలడని సిద్ధాంతము.

## గుహాఽధికరణము

పూర్వాధికరణమున సర్వసంహర్తగా నేర్పడిన పరమేశ్వరుఁడు "ద్వా సుపర్ణా" ఇత్యాది శ్రుతివాక్యమునందు ప్రసిద్ధమగు జీవసాహచర్యము గలవాడని తెలుపునదీ యధికరణము.

సూ. "గుహాం ప్రవిష్టా వాత్మానౌ హి, తద్దర్శనాత్" 1-2-11

"అత్త్రధికరణమున త్రిమూర్త్యతీతుఁడు పరమేశ్వరుఁడని ప్రతిపాదించి అట్టి పరశివుని ముముక్షువులు - సకలేతర దేవతా పరిత్యాగ పూర్వకముగ నుపాసించి సాక్షాత్కరించుకొనవలెనని సూచింపఁబడినది గదా! ఇది యుక్తము కాదు. ఎందుకనగా?

హరిశ్చాహం చ రుద్రశ్చ - తథాఽన్యే చ సురాసురాః
తపోభి రుగ్రై రద్యాపి - యస్య దర్శనకాంక్షిణః ॥

"విష్ణుమూర్తి నేను రుద్రుఁడును తదితరులగు దేవతలు రాక్షసులును తీవ్రములగు అనుష్ఠానములతో నిప్పటికిని పరమేశ్వరుని దర్శింపఁ గోరుచుందుము".

ఇట్లు చతుర్ముఖబ్రహ్మ వక్కాణించిన సందర్భము ననుసరించి బ్రహ్మాదులకును చూడనలవి గానట్టి పరమాత్మను మన బోంట్లు గావించు నుపాసనతో దర్శింపవలనుపడ" దను నాశంకకు పై సూత్రము సమాధానమగుచున్నయది.

విషయవాక్యము : "ఋతం పిబంతౌ సుకృతస్య లోకే-గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధే, ఛాయాతపౌ బ్రహ్మవిదో వదంతి —పంచాగ్నయో యే చ త్రిణాచికేతాః"

"సుకృతమునకు నిలయము, ఉత్కృష్ట బ్రహ్మవిద్య నాపాదింపఁజేయున దగుటచే పరమము, శివోపాసనాత్మక శ్రేష్ఠప్రయోజనము గలదియు నగు బ్రాహ్మణాది శరీరమునందు కర్మఫలము ననుభవించు (అనుభవింపజేయు) వారు, నీడ వెలుఁగులవంటివారు నగు జీవేశ్వరులు హృదయగుహఁ బ్రవేశించినవారని పంచాగ్న్యుపాసకులగు బ్రహ్మవిదులైన నచికేతులు వక్కాణింతురు."

జీవాత్మయందు నిండు వాత్సల్యము గలవాడై పరమాత్మ — జీవసాహచర్యము నంగీకరించినవాడు. జీవుఁడు స్వభూతిలో చేరినవాడగుటచే తండ్రికి కుమారునియందు వలె జీవాత్మయందు వాత్సల్యము గలవాడగును.

ఇఁట — సుకృతలోక, పరమ, పరార్ధ విశేషణములతో శివోపాసనయందధికారము గలిగినట్టి బ్రాహ్మణాదుల ననుగ్రహించుటకు హృదయ గుహయందు

భావలింగస్వరూపముతో సాక్షాత్కరించుటకును పరమేశ్వరుఁడు జీవసహచరుం డాయెనని విశదార్థము.

సుకృతస్థానము పరార్థము నగు బ్రాహ్మణాది శరీరమునందు హృదయ గుహఁ బ్రవేశించినవారు ఫలభోక్తలు, ఛాయాతపములవలె భిన్నస్వరూపము గల వారును బుద్ధిజీవులా? జీవపరమేశ్వరులా? అని సంశయము,

ప్రశ్న : హృదయగుహఁ బ్రవేశించినవారు బుద్ధిజీవులగుదురు. "ఋతం పిబంతౌ" "కర్మఫలము ననుభవించువా" రని చెప్పుటవలన కర్మఫలభోగము పర మేశ్వరునకు సంభవింపదుగదా? "అనశ్నన్నన్యో అభిచాకశీతి" "జీవభిన్నుడైన పరమాత్మ - కర్మఫలము ననుభవింపనివాడై ప్రకాశించువాడు" బుద్ధిజీవులకైతే భోక్తృత్వము ప్రసిద్ధమగుటను జీవేశ్వరు లిరువురును చేతనులగుటచే ఛాయా తపములవలె వైలక్షణ్యము లేనివారగుటను బుద్ధి యచేతనము కావున జీవవిలక్షణ మగుట నిట బుద్ధిజీవులే ప్రతిపాదింపఁదగినవారు.

ఉత్తరము : హృదయ గుహఁ జెందియండువారు జీవ పరమేశ్వరులేను; ''తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం గుహాహితం గుహ్వరేష్ఠం పురాణమ్'' అనుచో జీవునితోసహ గుహాప్రవేశము పరమేశ్వరునకు వినంబడుచున్నయది. పరమేశ్వరునకు భోక్తృత్వము సంభవింపదని చెప్పుట యుక్తము కాదు. "ప్రాణా రామం మన ఆనందమ్'' అనుచో బ్రహ్మము ఆత్మారామమైనను మనోమాత్ర విషయమగు స్వరూపానందము ననుభవించుదని విదితమగుచున్నయది.

కావుననే

శ్లో॥ ఆత్మశక్త్యమృతాస్వాద ప్రమోదరసికో యువా
ఆనంత పరమానంద మకరంద మధువ్రతః ॥

"నిజశక్తి యనఁబడు అమృతము నాస్వాదించుటవలన కలుగు ప్రమోద ముచే రసికుఁడగువాడు నిత్యయువకుఁడు నిరవధికమగు శ్రేష్ఠమైన ఆనందమను పూదేనెఁ గ్రోలుటయందు తుమ్మెదవంటివాడును" అని పురాణవాక్య ముద్ఘోషించు చున్నయది.

జీవుఁడైతే తా జేసిన కర్మయొక్క ఫలితము ననుభవించుట ప్రసిద్ధము

గదా! ఇట్లు జీవేశ్వరులకు భోగము సాధారణమైన నందు విశేషము పాటింపఁబడు నది. "రాజు భృత్యుఁడును భోజనమును చేయుచున్నా" రనునెడ వారివారికి తగు అన్నమును భుజించువారే కాని సమానమైన ఆహారము ననుభవించువారు కారని భావింపవలెను. "జీవేశ్వరులకు వ్యత్యాసము లేద''ని చెప్పుట యుక్తము కాదు. ''నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానామ్" అను శ్రుతివాక్యముతో జీవేశ్వరులకు నిత్యత్వ చేతనత్వాది సామ్యము వినంబడుచున్నను అనాదికాలమునుండి సంబంధించి యున్న అజ్ఞానము జీవాత్మకుండుట పరమాత్మకు లేకుండుట యను వైషమ్యము సిద్ధమగుచున్నయది. మఱియు "జ్ఞాజ్ఞౌ ద్వావజా వీశానీశా'' ఇత్యాది శ్రుతివలన పరమేశ్వరుడు - సర్వజ్ఞుఁడు నిత్యుఁడు స్వతంత్రుఁడు ననియు, జీవుఁడు - కించిజ్ఞుడు నిత్యుఁడు పరతంత్రుఁడు ననియు వైలక్షణ్యము బోధపడుచున్నయది.

ప్రశ్న: జీవేశ్వరులకు శరీరసంబంధము సమానమైనను ఒకనికి అజ్ఞత్వాది అనర్థముల సంబంధము మరియొకనికి నజ్ఞత్వాది అనర్థముల సంబంధము లేకుండుట యెట్లు పొసగును?

ఉత్తరము: సుఖదుఃఖానుభవమునకు ఏకాశ్రయత్వము సాధకము కాదు. స్వతంత్ర పరతంత్ర భావములే సాధకములగును. ''సమానే వృక్షే పురుషో నిమగ్నోఽనీశయా శోచతి ముహ్యమానః, జుష్టం యదా పశ్యత్యన్యమీశ మస్య మహిమాన మితి వీతశోకః" ఇద్దానికి సాంప్రదాయికార్థము వ్రాయఁబడుచున్నది.

''ఈ జీవాత్మ- అనాదియగు కర్మబంధముతో కట్టుబడి ఆ యా కర్మఫలముల ననుభవించుటకు వలయు మాయామయ అనేక శరీరములలో ప్రవేశించి భరింపరాని బాధల ననుభవించుచు పరతంత్రుఁడగుటచే నివారింపశక్యము గానందునవే మోహముఁజెంది మహామోహమువలన నేర్పడు దుఃఖసముద్రమునందు మునుగుచున్నవాడు. జీవేశ్వరు లిరువురు నొకే సంసారవృక్షము నధిరోహించు వారైనను జీవుఁడు పూర్వసుకృతబలమున ప్రసరించు శివానుగ్రహమువలన తనను ప్రేరేపించువాడుగ హృదయ గుహయందుండువాడనియు సమస్త జీవుల ననుగ్రహించువాడనియు ఉమాసహితుఁడనియు పరమేశ్వరుని భావించుతఱి పరమేశ్వర సంపూర్ణ కటాక్షముఁజెంది ప్రత్యక్షముగా నవలోకించువాడు. మరియు నీ పరమాత్మయొక్క యత్యంతశ్రేష్ఠమగు మహిమను పొందువాడు."

ఇందువలన స్వతంత్రుఁడు అనాదిముక్తుఁడు నగు శివునకు శరీర సంబంధ

మున్నను జీవునకు వలె శరీరగతదోషములు సంభవించునవి కావు. కావున జీవపర మేశ్వరులే హృదయగుహఁ జెందియుండువారు.

సూ. "విశేషణాచ్చ" 1-2-12

ఈ ప్రకరణమునందు జీవపరమేశ్వరులు విశేషించి చెప్పఁబడినవారు. ఎట్లనఁగా? "న జాయతే మ్రియతే వా విపశ్చిత్" ఇత్యాదివాక్యముచే జీవాత్మయు "అణోరణీయాన్ మహతో మహీయాన్" ఇత్యాది వాక్యముతో పరమేశ్వరుఁడును ప్రశంసింపఁబడినవారు. ఇట్టి విశేషణములు (విపశ్చిత్, అణుః, మహాన్ అనునవి) జీవబుద్ధులు గుహాగతము లను పక్షమున నెట్లు పొసగునవి? ఇందువలన జీవపర మేశ్వరులే హృదయగుహఁ బ్రవేశించి ప్రేర్యప్రేరక భావముతో శరీర శరీరిభావ ముతోడను గూడియుండువారని విశదమగునది.

ఇఁట జీవేశ్వరుల భేదము- కంఠరవేణ చెప్పఁబడుటచే నవ్వారి యభేదము నిరూపింప సలవిఁగానిది. జీవత్వము అవిద్యాకృతమనియు ఈశ్వరభావము పార మార్థికమనియు చెప్పఁబడిన శాస్త్రార్థము నిర్మూలమగునదని గ్రహింపవలెను.

## అంతరధికరణము

హృదయగుహయందు ఉపాస్యుఁడుగ నిరూపింపఁబడిన పరమాత్మ నుపా సించుటకు మరియొక స్థానము గలదని యిందు ప్రతిపాదింపఁబడుచున్నయది.

సూ. "అంతర ఉపపత్తేః" 1-2-13

ఛాందోగ్యమునం దీ సూత్రమునకు విషయవాక్యము.

''య ఏషోఽక్షిణి పురుషో దృశ్యత ఏష ఆత్మేతి హోవాచ, ఏత దమృత మభయ మేతద్బ్రహ్మ" "కంటియందు కనఁబడు ఈ పురుషుఁడు పరమాత్మ యనియు అమృతుఁడనియు అభయుఁడనియు బ్రహ్మమనియు పేర్కొనఁబడు వాఁడు"

ఇఁట అమృతత్వాది లక్షణములు కలవాఁడు నేత్రములో నుండువాఁడు నగు పురుషుఁడు - పరమేశ్వరుఁడా? ఇతరుఁడా? అని సంశయము.

ఉపకోసలుఁడను కామలాయనుఁడు సత్యకాముఁడను ఆచార్యు నాశ్రయించి సత్యకాముని యగ్నులకు పండ్రెండు వత్సరములు పరిచర్యఁజేయుచుండెను. ఇట్టి తఱి కామలాయనునకు బ్రహ్మోపదేశముఁ జేయకయే స్వస్థానమునుండి సత్య కాముఁడు వెళ్ళగా తన యాచార్యుని అగ్నులను సేవించుచు అధివ్యాధులకు లోనై ఉపవాసములఁ జేయుచున్న కామలాయనునియందనుగ్రహము కలిగి గార్హపత్య దక్షిణ అహవనీయాగ్నులు మూడును కూడి "ప్రాణో బ్రహ్మ కం బ్రహ్మ ఖం బ్రహ్మ" ఇత్యాది వాక్యములతో బ్రహ్మవిద్య నుపదేశించి ప్రత్యేకముగా నాక్కొక్క విద్యను "య ఏష ఆదిత్యే పురుషో దృశ్యతే సోఽహమస్మి స ఏవాహమస్మి" "య ఏష చంద్రమసి పురుషో దృశ్యతే" "య ఏష విద్యుత్‌పురుషో దృశ్యతే అని యువదేశించినవి. తరువాత మేము చెప్పిన బ్రహ్మవిద్యను నీవు ఆచార్యుని వలన దృఢపఱచుకొందువుగాత యని వక్కాణించినవి, పిమ్మట స్వస్థానమున కేతెంచిన ఆచార్యుఁడు - ప్రసన్నముఖుఁడగు నుపకోసలుని గాంచి సౌమ్యుడా! నీ ముఖము బ్రహ్మవిదుని ముఖమువలె ప్రకాశించుచున్నది. ఎవరు నీకు బ్రహ్మ విద్య నుపదేశించిరని ప్రశ్నింవగా కామలాయనుడు అగ్నులును సమాధానముఁ జెప్పుటకు భయపడినవారైరి. అప్పుడగ్నులే యుపదేశించినవని నిశ్చయించుకొని యక్షిపురుషుఁ గురించి యుపదేశమును గావించి "ఏష దేవపథో బ్రహ్మపథః, ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవ మావర్తం నావర్తంతే" అను వాక్యమువరకు అక్షిపురుషోపాసకునకు అర్చిరాదిమార్గప్రాప్తి పర్యంతము పునరావృత్తిరహిత ఫలమును సత్యకాముఁడు వాక్రుచ్చినవాడాయెను.

ప్రశ్న : "దహరం విపాప్మమ్" "పద్మకోశ ప్రతీకాశమ్" ఇత్యాది వాక్యములందు - పరమాత్మ హృదయ పుండరీకమందుండువాడని చెప్పఁబడుట చేతను జీవుఁడు రూపాదులను గ్రహించుటకు మనఃసంబంధము వలన చక్షురింద్రి యాది ప్రవేశముఁ జేయువాడగుటచే నిట నక్షిపురుషుఁడు జీవుండేను, అథవా చాయాపురుషుఁడు కాదగును.

ఉత్తరము : అక్ష్యంతఃపురుషుఁడు పరమేశ్వరుఁడేను, ఎట్టి యుపాధి లేనట్టి అమృతత్వము అభయత్వము మొదలగు ధర్మములు పరమేశ్వరుని యందే నుపపన్నములగునవి.

పరమేశ్వరునకు నేత్రాంతర్వర్తియగుట శ్రుతియందు గానరాదను నాశం కకు సమాధానము దిగువ సూత్రము.

సూ. "స్థానాది వ్యపదేశా చ్చ" 1-2-14

"య శ్చక్షుషి తిష్ఠన్ చక్షుషోఽంతరః, యం చక్షు ర్నవేద, యస్య చక్షుః శరీరం, య శ్చక్షు రంతరో యమయతి, ఏష త ఆత్మాఽంతర్యామ్యమృతః"

"నేత్రములోనుండి నేత్రమును ప్రేరేపించువాడు, ఐతే నేత్రము పరమాత్మను కనుగొననిదై పరమేశ్వరునకు శరీంబగునది, ఇట్టి పరమేశ్వరుఁడు నీకు నంతర్యామి యగువాడు"

ఇట చక్షుః స్థితి నియమనాదులు పరమేశ్వరునివి యని 'వినఁబడుచున్నవి. కావుననే "దృగంగే శివలింగం స్యాత్" సర్వాంగలింగ సాహిత్యప్రకరణమున వాతూలోత్తరమను శివాగమము "కంటియందు శివలింగమను సంజ్ఞతో నుండు. వాడు పరమాత్మ" యని వక్కాణించియున్నది.

ఛాయాపురుషుఁడును ప్రతిపాదింపఁబడుచు లేడని తెలుపున దీ సూత్రము.

సూ. "సుఖవిశిష్టాభిధానాదేవ చ" 1-2-15

"కం బ్రహ్మ ఖం బ్రహ్మ" అను వాక్యముతో నేత్రాంతర్వర్తి యగువాడు సుఖవిశిష్టుఁడని చెప్పినందువలనను ఛాయాపురుషునియందు సుఖసంపత్తి సంభవింపదు గావున నిట పరమేశ్వరుఁడే ప్రతిపాదింపఁబడుచున్నవాడు.

''అక్షిపురుషుఁడు - జీవుడు" అను పక్షమును నిరాకరించున దీ సూత్రము.

సూ. ''అతఏవ స బ్రహ్మ" 1-2-16

సంసారభయమువలన బాధపడి బ్రహ్మమును తెలియగోరిన నుపకోసలునకు "కం బ్రహ్మ ఖం బ్రహ్మ'' "బ్రహ్మతత్త్వము సుఖరూపమైనది. ప్రకాశమానంబగునది" యని యుపదేశమును ప్రారంభించి "యదేవ కం తదేవఖమ్" ఎద్ది సుఖరూపమో నద్దియే ఆకాశ రూపంబును ఎద్ది ఆకాశరూపమో నద్దియే సుఖరూపంబు నగును" అని యాచార్యుఁడు వక్కాణించినవాడు. కావుననే ఖ శబ్దముతో చెప్పఁబడు ఆకాశము పరబ్రహ్మమగుచున్నయది. ఇట్టి యుపపత్తి జీవాత్మకు నుండజాలదు గదా! మరియు జీవాత్మ నిరతిశయసుఖము గలవాడును కాదు.

ఇందువలన నపరిచ్ఛిన్నసుఖము రూపముగా గలవాడని పూర్వము.

ప్రశంసింపఁబడిన బ్రహ్మమే నేత్రమున కాధారముగ ప్రతిపాంపఁబడుచుండుటఁ జేసి నేత్రాంతర్వర్తియగు పురుషుఁడు పరమేశ్వరుండేను.

అక్షిపురుషోపాసనకంటె నితరములగు నుపాసనలఁ జేసినవారిని గూర్చి శవకర్మను చేయకుండునెడ నర్చిరాది మార్గప్రాప్తికి విలంబమగును కాని యక్షి పురుషోపాసకునకు మాత్రము శవకర్మ గావింపఁబడకున్న నర్చిరాది మార్గప్రాప్తి కి నాలస్యము కాకుండును.

ఇందుకు శ్రుతిప్రమాణము.

"అథ ఖలు చైవాస్మిన్ శవ్యం కుర్వంతి యదు చ నార్చిష మేవాభిసం యంతి''

"నేత్రములోనుండు శివలింగము నుపాసించువాడు మరణింపగా పుత్రుడు మున్నగువారు శవకర్మయగు పితృమేధ మను సంస్కారమును చేయునెడ చేయకున్నను అర్చిరాదిమార్గమును పొందఁజాలును".

జీవుఁడు 'ఛాయాపురుఁడు' అను రెండు పూర్వపక్షములకు సమాధాన మీ సూత్రము.

సూ. "శ్రుతోపనిషత్క గత్యభిధానాచ్చ" 1-2-17

బ్రహ్మస్వరూపమును కనుగొనినవారికి నర్చిరాదిగతి యనివార్యమని అక్షిపురుషోపాసకులకు నర్చిరాదిగతి" అర్చిష మేవాభిసంభవ త్యర్చి షోఽహ రహ్నః" ఇత్యాది వాక్యముతో చెప్పఁబడుచున్నయది. మఱియు "తత్పు రుషోఽమానవః స ఏతాన్ బ్రహ్మ గమయతి స ఏవ దేవపథో బ్రహ్మపథ ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవ మావర్తం నావర్తంతే" "తేజోఽభిమాని దేవతను పొంది యటనుండి దినము నభిమానించు దేవతను పొందుదురు. ఇట్లు విద్యుల్లోకమువరకు వెళ్ళిన పిమ్మట నటనుండు దివ్యపురుషుఁడు ముక్తపురుషులను శివపదమువరకు గొంపోవువాడు. ఇద్దియే దేవపథము బ్రహ్మపథంబు నీ మార్గము ద్వారా శివలోకముఁ బ్రవేశించువారు మఱల నీ మానవలోకమును పొందువారు కారు''

ఇవ్విధము చెప్పుటవలన జీవాత్మగాని ఛాయాపురుషుఁడు గాని యిట

నిరూపింపఁదగినవారు కారనియు పరమేశ్వరుఁ డక్షివిద్య యందు ఉపాస్యుఁడుగు ననియ విశదమైనది.

## అనవస్థిత్యధికరణము

సూ. "అనవస్థితే రసంభవాచ్చ నేతరః" 1-2-18

సకల జగదీశ్వరత్వము విశ్వభుక్త్వము మొదలగు ధర్మములు ప్రాణ వాయువునందు- అవవస్థితేః - నిలచియుండునవి కాకుండుటవలన, అసంభవాచ్చ ఉండునని చెప్పుట పొసగనందువలనను, ఇతరః - ప్రాణవాయువు ఉపాస్యము, న కాదు అని సూత్రార్థము.

విషయవాక్యము : "అంగుష్ఠమాత్రః పురుషోఽంగుష్ఠం చ సమాశ్రితః, ఈశః సర్వస్య జగతః ప్రభుః ప్రీణాతి విశ్వభుక్''

ఇట అంగుష్ఠమాత్రత్వము మొదలగు ధర్మములతో కూడినవాడు పరమేశ్వ రుడా? ఇతరుడా? అని సంశయము.

ప్రశ్న : ప్రాణాగ్నిహోత్ర ప్రకరణమగుటచే అంగుష్ఠమాత్రుఁడని స్వల్ప స్వరూపమును చెప్పుట వలన నాహుతిపంచకము ననుభవించు ప్రాణవాయువే ప్రతి పాదింపఁదగినది. "అపశ్చ పృథివీ చాన్న మత్తారౌ వహ్ని మారుతౌ" ఉదకము భూమియను ఆహారమును వాయువు అగ్నియు ననుభవించువారు" ఇత్యాది శ్రుతు లందు వాయువు భోక్తగా నేర్పడుచున్నవాడు. కావున సర్వథా ప్రాణవాయు విట నంగుష్ఠమాత్రుఁడగునని చెప్పవలెను గాదా?

ఉత్తరము : పరమేశ్వరుఁడే అంగుష్ఠమాత్రుఁడుగ నీ ప్రకరణమునందు ప్రతిపాదింపఁదగినవాడు. ఎట్లనగా? సమస్త ప్రపంచమునకు ప్రభువగుటయు విశ్వము ననుభవించుటయు మొదలగు ధర్మములు పరమేశ్వరుని కంటె నితరము లైన ప్రాణవాయువు మున్నగు వానియందుపపన్నములు కానట్టివి. "ప్రాణానాం గ్రంధి రసి రుద్రో మా విశాంతకః" "రుద్రుడా! పంచప్రాణముల నొకచో నిలిపి యుంచువాడవు గాన కాలాగ్ని రుద్రస్వరూపముతో నాలో ప్రవేశించి యాహార మును జీర్ణింపఁచేసి తత్సారముతో నుజ్జీవింపఁజేయుము!" అను వాక్యము నందు

పరమేశ్వరుఁడు ప్రాణాధారుఁడనియు ప్రాణవాయువుగ నుపాసింపఁ దగినవాడ నియు వినంబడుచున్నయది.

శివరూపమనియు ఘోరరూపమనియు పరమాత్మ - ద్వివిధ స్వరూపములు గలవాడు. జఠరాగ్నిజ్వాల శమించుటకు లోన నన్నభోక్తగా నుండునది - శివ స్వరూపము; భోజనానంతరము భుక్తాన్నమును పరిణమింపఁజేసి దేహమును పోషించు టచే ప్రాణవాయువులు స్థిరముగా శరీర మందుండుటకు రుద్రరూపముతో లోన నాహారమును పచనముఁజేయునది ఘోరరూపము.

అంగుష్ఠమాత్రుఁడని పరిమాణముఁ జెప్పుట - ఉపాసింపఁబడుటకు గావున విరోధ మేమియు లేదు. ప్రాణవాయువు బోక్తగా నేర్పడినను విశ్వబోక్త కాజాల కుండును. కావున పరమేశ్వరుఁ డే ప్రాణమను అగ్నిహోత్రమునందు నారాధింప దగినవాడుగ ప్రాణస్వరూపుఁడగునని ప్రతిపాదింపఁబడుచున్నవాడు.

"న ప్రాణేన వాపానేన మర్త్యో జీవతి కశ్చన, ఇతరేణతు జీవంతి యస్మి న్నేతా వుపాశ్రితా" అను శ్రుతిననుసరించి పరమేశ్వరు నాశ్రయించియుండు ప్రాణాపానములతో జీవులు బ్రతుకుచున్నవారనియు కేవల ప్రాణముతోగాని కేవల అపానముతోగాని జీవించువారు కారనియు తెలియనగును.

దక్షిణ పాదాంగుష్ఠమునందు హస్తముతో నుదకమును సమర్పించుతఱి బ్రహ్మాండమునకు మూలాధారమగు లోకమునందు గల కాలాగ్ని రుద్రస్వరూప మును శరీరమున కాధారమగు పాదాంగుష్ఠమునందు ధ్యానించి తత్ప్రీత్యర్థము చరణాభిషేకమును చేయుచు "అంగుష్ఠమాత్రః" అను మంత్రము నుచ్చరింపవలె నని విదితమగుచున్నయది.

## అంతర్యామ్యధికరణము

సర్వజ్ఞుఁడు సర్వశక్తిసంపన్నుఁడు సర్వానుగ్రాహకుఁడు పరబ్రహ్మము నగు శివుని సూర్యమండలమునందు పురుషహృదయపుండరీకాదులందు నుపా సనఁ జేయుటకు నివాసము నిర్ధారింపఁబడినది. అట్టి నివాసము నంతటఁ జూపుట కీ యధికరణము చెప్పఁబడినది.

సూ. అంతర్యామ్యధిదైవాదిషు తద్ధర్మవ్యపదేశాత్ 1-2-18

సూత్రార్థము : పృథివ్యాద్యచేతనములు అధిదైవములనంబడును. లోకము లన్నిటియందు అను నర్థమున "అధిలోకం" అను శబ్దముపయోగించును. ఇట్టి అధిదైవములు మున్నగువానియందు-విశ్వాధికత్వము అనాదిముక్తత్వము మొదలగు తద్ధర్మములు అనగా పరమేశ్వర ధర్మములు శ్రుతియందు వ్యపదేశాత్ - ప్రతి పాదింపఁబడుటవలన అంతర్యామి యగువాడు పరమాత్మయే.

విషయవాక్యము - అంతర్యామి బ్రాహ్మణమునందు

"యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అంతరో యం పృథివీ నవేద యస్య పృథివీ శరీరం, యః పృథివీ మంతరో యమయతి ఏష త ఆత్మాఽంతర్యామ్య మృతః"

"భూమిలో నున్నను భూమికి తెలియనివాడు భూమిని ప్రేరేపించువాడు భూమి శరీరముగా కలవాడు భూమిని శాసించువాడు నగు పరమాత్మ - సర్వాంత ర్యామియై అమృతుడనఁబఱగును.

ఇట్లు పృథివి మొదలుకొని అవ్యక్త ఆత్మతత్వముల వరకు ప్రతి వస్తువు నందంతర్యామియని ప్రతి పర్యాయము వినంబడువాడు - పరమాత్మయా? జీవా త్మయా? విరాట్ పురుషుఁడా? ప్రధానమా? అని సంశయము.

ప్రశ్న : తా నొనర్చిన విచిత్రకర్మల ఫలము ననుభవించుటకు పంచ భూతములలో ఇంద్రియములందును జీవుఁడు ప్రవేశించువాడు. అథవా చేతనులంద రికి నుపాదానమగు విరాట్ పురుషుఁడు ప్రాణులలో చేరియుండువాడని చెప్పుట సమంజసము. లేక ప్రకృతి - మహత్తు మున్నగు రూపములతో పరిణమించునదగు టచే సర్వవ్యాపియగు ననుట సముచితంబగును. ఎందుకనఁగా? పరమేశ్వరుఁడు "విశ్వాధికో రుద్రః'' అను ప్రమాణము ననుసరించి పృథివ్యాది ప్రకృతి వికారము లను మించియుండు వాడగుటఁజేసి విశ్వాధికుఁడు గావున వికారాత్మక ప్రపంచ మును వ్యాపించియుండుట పొసగఁజాలదు పరమేశ్వరుఁడు దక్క జీవాదులలో నొకఁడు సర్వాంతర్యామి కాదగును.

ఉత్తరము : పృథివ్యాద్యంతర్యామిగ వినంబడువాడు; పరమేశ్వరుండేను; సర్వాంతర్యామిత్వము మొదలగు ధర్మములు - పరమేశ్వరుని యందే ఉపపన్న లగుచున్నవి. ఎట్లనఁగా? అథర్వశిరమునందు ''సోఽంతరా దంతరం ప్రావిశత్"

అను వాక్యమువలన పరమేశ్వరుఁడే నంతర్యామిగ సమస్తమందుండువాడని తెలియుచున్నది. మఱియు ''స త ఆత్మాంతర్యామ్యమృతః" శివుఁడే అనాది ముక్తుఁడగుటచే అమృతుఁడని చెప్పఁబడువాడు. "ఏతాని హ వా అమృతస్య నామ దేయాని" పూర్వోక్త నామదేయములన్నియు అమృతునివే" యని శ్రుతి పేర్కొని యున్నది. "విశ్వాధికో రుద్రః" అను వాక్యముచే పరమేశ్వరునకు విశ్వాధికత్వము చెప్పఁబడినట్లు "సర్వో వై రుద్రః" ఇత్యాది వాక్యములతో విశ్వరూపత్వము నిరూపింపఁబడుచున్నది. కావున పృథివ్యాది ప్రకృతివికారములందు ప్రవేశము కలవాడైనను తద్వికార స్పర్శలేశము గూడ లేనివాడని ప్రతిపర్యాయము అమృతశబ్ద ప్రయోగము గావింపఁబడినది.

అథర్వశిరమునందు "యో నై రుద్రః స భగవాన్ యశ్చ బ్రహ్మభూర్భువః సువస్తస్మై వై నమోనమః" ఇత్యాది వాక్యములతో బ్రహ్మ విష్ణు రుద్ర మహాలక్ష్మి సరస్వతీ గణపతి కుమారులు, దేవేంద్రాది లోకపాలురు మఱియు భూరాది సప్త లోకములు, పృథివ్యాది పంచభూతములు, సూర్య చంద్రాది నవగ్రహములు, నక్షత్రములు కాలము మున్నగు స్వరూపములు గలవాడని ప్రతిపర్యాయము పరమేశ్వరుని గురించి యభ్యాసము గావింపఁబడినది. అందు "పరమేశ్వరుఁడు చిదచిన్మయములగు సకల తత్త్వములయందు ప్రవేశించువాడగుటఁజేసి శరీరాది తత్త్వములకు సంబంధించియుండు దోషముల నంటియుండువాడు" అను నాశంకను నివారించుటకు ఐశ్వర్యము మొదలగు మంగళగుణముల సంబంధమును చెప్పు భగవచ్ఛబ్దము ప్రయోగింపబడినది. కావున సర్వాంతర్యామియగు శివుడు పరమేశ్వరుఁడని చెప్పుట సమంజసంబేను;

ప్రధానము మొదలగువాని కంతర్యామిత్వము సముచితము కాదని నిరూపించున దీ సూత్రము.

సూ. "న చ స్మార్త మతద్ధర్మాభిలాపాత్ శారీరశ్చ''౧-౨-౧౯

ప్రధానము-సాంఖ్యస్మృతి సిద్ధమగుటచే స్మార్త మనఁబడును. ప్రకృతి ధర్మములగు వికార జడత్వాదులు శ్రుతియందు చెప్పకుండుటవలన ప్రధానము, సకల నియామకత్వాది ధర్మములు లేనివాడగుటచే విరాట్పురుషుఁడును సర్వాంతర్యామి కాజాలరని సూత్రార్థము.

సకల కల్పములలో చేతనాచేతనములను నియమించు నసంకుచిత సామర్థ్యము-మూర్త్యాత్మయగు హిరణ్యగర్భునకు నారాయణునకును సంభవింపనట్టిది. సూత్రగత శారీరపదము "అనుపపత్తేషు న శారీరః'' అనుచో చెప్పినట్లు జీవుండను నర్థము కలదియే గాక హిరణ్యగర్భ నారాయణాద్యర్థము గలదిగ చెప్పఁబడుచున్న యది.

సుబాలోపనిషత్తునందు "కిం తదాసీత్'' "జగత్కారణము ఎట్టిది" అని ప్రశ్నించి ''పరమాత్మ స్వరూపం ప్రథమ మాసీత్" "పరమాత్మ-మొదటి స్వరూపముగ నుండెను" అని సమాధానము చెప్పఁబడియెను. తరువాత "తతస్తమస్తమసో భూతాదిః" "పరమాత్మవలన తమస్సు, తమస్సువలన నాకాశము" ఇట్లు భూతపంచకమును నిరూపించి యవ్వాని వలనఁ బ్రహ్మాండ మావిర్భవించుటను బ్రహ్మాండమున సహస్ర శీర్షములు సహస్ర నేత్రములు సహస్ర పాదములు సహస్ర భుజములు గల పురుషుఁడావిర్భవించినట్లు చెప్పి "బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్" అను పురుష సూక్త ప్రక్రియ ననుసరించి పురుషుని హృదయాద్యవయవములనుండి బ్రాహ్మణాదిచేతనులయొక్కయు అచేతనములయొక్క నావిర్భావము వర్ణింపఁబడినది. మఱియు పురుషుని నిశ్వాసమునుండి వేదములు బయలుదేరినవనియు పురుషుఁడే సగము శరీరముతో స్త్రీ భావము సగము శరీరముతో పుంభావమును పొంది దేవర్షి యక్ష రాక్షసాదులను తిర్యగ్జంతువులను పుట్టించు స్త్రీ పురుష రూపములు గలవాడగుననియు వక్కాణింపఁబడినది

మఱల నుపసంహరించు సమయమున త్రైలోక్య భస్మీభావము నుపక్రమించి "పృథ్వ్యప్సులీయతే" "భూమి-జలమందు లీనమగును" ఇత్యాది వాక్యము మొదలుకొని "తమః పరస్మి న్నేకీభవతి'' "తమస్సు పరమాత్మయందు ఏకీభవించును" అను వాక్యమువరకు జగత్ప్రళయము నిరూపింపఁబడినది-

ఇట్లు సుబాలోపనిషత్తున ప్రథమానుశాసనమందు పరమాత్మ-జగదాది కారణుఁడనియు పరమాత్మచే బ్రహ్మాండ మధ్యమున సృజింపఁబడిన పురుషుఁడు-అవాంతర సృష్టి స్థితి లయములఁ జేయువాడనియు వర్ణించి "తత్ర తదండం హిరణ్మయం సమభవత్" అని బ్రహ్మాండమును నిర్దేశించి "దివ్యః సహస్రశీర్షా సహస్రాక్షః సహస్ర బాహుః పురుషోఽజాయత" సహస్ర శీర్షత్వాది లక్షణములు గల దివ్యపురుషుని తృతీయానుశాసనమున ''దివ్యో దేవ ఏకో నారాయణః" అను

వాక్యముతో నారాయణునిగ ప్రశంసించి పరమేశ్వరాభేదదృష్టితో సకల జగదు పాదానము నారాయణుఁడని ప్రతిపాదింపఁబడినది. కావున నారాయణుఁడు దేవ మానవాది ప్రజాజనకుఁడైన నవాంతర సృష్టిలయములఁ గానించు వాడనియు నారాయణాది సకల జగదాది కారణము సకల నియామకుఁడును పరమేశ్వరుఁడే ననియు సారాంశము.

జీవాత్మయు సర్వాంతర్యామి కాదను సంశమును సమర్థించున దీ సూత్రము.

సూ. "ఉభయేఽపి హి భేదే నైన మధీయతే" 1-2-21

కాణ్వులు మాధ్యందిన శాఖవారున్ను జీవపరమాత్మలను భేదము గలవారిగ చెప్పుచున్న వారని సూత్రార్థము.

"యో విజ్ఞానే తిష్ఠన్" "య ఆత్మని తిష్ఠన్" ఇత్యాదివాక్యములతో "పర మేశ్వరుఁడు జీవాత్మలో నుండవా"డని జీవపరమేశ్వరులను వేఱువారిగ శ్రుతులు ప్రతిపాదించుటచే పరమేశ్వరుఁడే సర్వాంతర్యామి యనియు ప్రధాన విరాట్ పురుష జీవాత్మలు-సర్వాంతర్యాములు కారనియు సిద్ధాంతము.

## అదృశ్యత్వాధికరణము

"ప్రత్యక్షముగ కనఁబడు పృథివ్యాదికము పరమేశ్వరునిచే నియమింపఁ బడునదగుటచే శివునకు శరీరమగునని పూర్వము చెప్పఁబడినది కావున పృథి వ్యాదులందుఁ బ్రవేశించియుండు పరమేశ్వరుఁడు-ఒకానొక గృహమందున్న పురుషునివలె కనఁబడువాడగు" నను ఆశంకను నివారించుటకు సర్వత్ర వ్యాపించు వాడైనను పరమాత్మ పరిదృశ్యమానుఁడు కాజాలడని "న చక్షుషా పశ్యతి కశ్చ నైనమ్" ఇత్యాది ప్రమాణముల ననుసరించి యీ యధికరణమునందు ప్రస్తావింపఁబడుచున్న యది.

సూ. అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః" 1-2.22

సర్వజ్ఞత్వాది ధర్మముల నీ యుపనిషత్తునందు చెప్పినందువలన నదృశ్య త్వాది గుణములు కలవాడు పరమేశ్వరుండేనని సూత్రార్థము.

విషయవాక్యము : "అథ పరా యయా తదక్షర మధిగమ్యతే; యత్తద

ద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుః శ్రోత్రం తదపాణిపాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః"

"అక్షరశబ్ద వాచ్యమగు పరబ్రహ్మమును కనుగొనునది-పరవిద్య యనం బడును. అట్టి అక్షరము నిర్దేశింపరానిది, గ్రహింప నలవిగానిదియు, గోత్ర వర్ణములు లేనిదియు నేత్రములు చెవులు హస్తములు పాదములు లేనిదియు, నిత్యమైనదియు, సర్వవ్యాపకంబు, మిక్కిలి సూక్ష్మంబు, వినాశములేనిదియు సకల ప్రాణులకు కారణమైనదియు; ఇట్టి తత్త్వమును ధీరపురుషులు కనుగొందురు".

ఇచట నక్షరము ప్రధానమా? జీవుడా? పరమేశ్వరుడా ? అని సంశయము.

ప్రశ్న : ఈ సందర్భమున నక్షర శబ్దము ప్రధానమునే చెప్పును. ఎట్లనగా ? మహత్తు మొదలగు తత్త్వముల రూపముగ పరిణమించు ప్రకృతి- ప్రాణులందరికి కారణము కాదగును. అథవా జీవాత్మ ''క్షరం ప్రదాన మమృతాక్షరమ్" అను ప్రమాణముతో నక్షరవాచ్యుండగువాడు. మరియు తా జేయు కర్మ ననుసరించి పృథివ్యాది పంచభూతములకు తద్వికారమగు జగమునకును కర్త యగువాడు. కావున ప్రధానముగాని జీవాత్మగాని యక్షరులు కాదగినవారు.

ఉత్తరము : పరమేశ్వరుడే అక్షరపదవాచ్యుండు; ''యః సర్వజ్ఞః సర్వవిత్ యస్య జ్ఞానమయం తపః" ఇత్యాది వాక్యములు-పరమేశ్వరుని సర్వజ్ఞత మున్నగు లక్షణములను చెప్పుచున్నవి. పరమేశ్వర భిన్నుడైన జీవునియందు సర్వజ్ఞత్వాది ధర్మములు సంభవించునవి కావు. ''ప్రకృతిగాని జీవుడుగాని సమస్త కారణము కాదగినవార''ని చెప్పుట యుక్తము కాదు. జీవుడు సర్వజ్ఞుడు కాకుండుటను ప్రకృతి చేతనము కాకుండుట నవ్వానికి సర్వకారణత్వ సామర్థ్యము అలవడకుండును.

సాలెపురుగు తన శరీరములోని చొల్లుతో దారముం గావించునట్లు పరమేశ్వరుఁడు స్వశక్తి లేశముతో ప్రపంచమును పుట్టించుటను చంపుటను గాననగును. మఱియు భూమినుండి భూమిని విడువకయే యావిర్భవించు ఓషధులవలె ప్రపంచము పరమేశ్వరు నెడబాసియుండనిదగుటచే పరమేశ్వర శక్తియందొక భాగ మగుచున్నయది. శరీరమునుండి జన్మించు కేశ నఖాదులున్నను పోయినను

పురుషుఁడు వికారముఁ జెందనట్లు స్వరూపైకదేశమగు ప్రపంచము భిద్రముగా నున్నను వినాశముఁ జెందినను పరమేశ్వరుఁడు-సంతోషమును దుఃఖమును పొందు వాడు కాడు. ఐతే పురుషుఁడు తన శరీరములో నొక భాగమగు హస్తములు పాదములు మొదలగు నవయవములను పట్టుదలతో కాపాడుకొనునట్లు పరమేశ్వరుఁడు స్వశరీరమగు శక్తిలో నొక భాగమగు ప్రపంచము నవశ్యము రక్షింప వలసియుండును.

మఱియొక ఉపపత్తిఁ జెప్పుచున్నవారు.

సూ. "విశేషణ భేద వ్యపదేశాభ్యాం చ నేతరౌ." 1-2-23

ఇఁట "ఏక విజ్ఞానముతో సర్వ విజ్ఞానము కలుగు"నను ప్రతిజ్ఞ చేయఁబడు చున్నది. "కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" "ఎద్దానిని కనుగొనినచో నీ సమస్తము తెలియు"నను ప్రశ్న ననుసరించి చెప్పఁబడిన ప్రతిజ్ఞ యనఁబడు విశేషణము నుపయోగించుటవలన నక్షరము ప్రధానము కాజాలదు. "అక్షరా త్పరతః పరః" "ప్రకృతికంటె పరుఁడగు జీవుఁ డక్షరుఁడైన నవ్వాని నతిక్రమించినవాడు పరమాత్మ" యను ప్రమాణముఁబట్టి జీవునకు పరమేశ్వరునకును భేదము కనఁబడుటవలన నిట నక్షర పదము జీవవాచకంబు కానట్టిది.

సూ. "రూపోపన్యాసాచ్చ" 1-2-24

"అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ, దిశః శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః, వాయుః ప్రాణో హృదయం విశ్వమస్య, పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాంతరాత్మా".

"పరమాత్మకు (ఇఁట నగ్నిశబ్దముతో స్ఫురించు తేజస్సు నిండియుండు ప్రదేశమని యర్థము ననుసరించి) ద్యులోకము శిరస్సనియు, సూర్యచంద్రులు నేత్రములనియు, దిశలు చెవులనియు, విస్తృతములైన వేదములు వాక్స్థానీయములనియు వాయువు ప్రాణమనియు విశ్వమంతయు హృదయమనియు భూమి పాదములనియు త్రైలోక్యస్వరూపము ప్రతిపాదింపఁబడినది కావున సకలాంతర్యామియగు పరమేశ్వరుఁడే అక్షరపదముతో చెప్పఁబడుచు భక్తులు కానివారికి కనఁబడువాడు కాడని విశదమైనది.

## వైశ్వానరాధికరణము

ప్రాణవాయువున కాధారముగ నుపాసింపఁదగినవాఁడని చెప్పఁబడిన పరమాత్మ నిట జఠరాగ్ని స్వరూపముగ నుపాసింపవలెనని యుల్లేఖింపఁబడుచున్నయది.

సూ. "వైశ్వానరః సాధారణ శబ్ద విశేషాత్" 1-2-26

వైశ్వానరశబ్దము సాధారణముగ వహ్నిపరమైనను బ్రహ్మశబ్దమున్నగు శబ్దవిశేషమువలన పరమేశ్వర పరమే నగునని సూత్రార్థము.

విషయవాక్యము : "యస్త్వేత మేవం ప్రాదేశమాత్ర మభివిమాన మాత్మానం వైశ్వానర ముపాస్తే స సర్వేషులోకేషు సర్వేషుభూతేషు సర్వేష్వాత్మ స్వన్న మత్తి" ఛాందోగ్యము.

"ప్రాదేశమాత్ర స్వరూపుడు అంతట వ్యాపించు అపరిచ్ఛిన్న స్వరూపము గలవాడు నగు పరమేశ్వరుని వైశ్వానరునిగ నుపాసించు పురుషుఁడు లోకము లన్నిటియందలి పంచభూతములందావిర్భవించునట్టి జీవాత్మలందరనుభవించు నట్టియు ఆహారము ననుభవించిన తృప్తిఁబడయఁ గలుగును."

ఇఁట నుపాస్యుడుగ చెప్పఁబడిన వైశ్వానరుఁడు పరమేశ్వరుడా? ఇతరుడా? అని సంశయము.

ప్రశ్న : వైశ్వానర శబ్దముతో జఠరాగ్ని చెప్పఁబడునది గదా! ఎట్లనగా? "అయ మగ్ని రైశ్వానరో యేనేదం పచ్యతే యదిద మద్యతే, తస్యైష ఘోషో భవతి యమేతత్కర్ణా వపిధాయ శృణోతి, స యదోత్క్ర మిష్యన్ భవతి నైనం ఘోషం శృణోతి" "భుజ్యమానమగు అన్నమును జీర్ణింపఁజేయునది వైశ్వానరాగ్ని యనఁబడును. ఇట్టి వైశ్వానరుని ధ్వని లోన నున్నట్లు చెవులుమూసికొని విననగును. మరణించు సమయమునందు మాత్రము జాఠరాగ్ని ధ్వని వినఁబడునది కాదు". ఇట్లు జఠరాగ్నియందు వైశ్వానరశబ్దము ప్రయోగింపఁబడియున్నది. అథవా మహాభూతములలో మూడవదగు అగ్నియైనను వైశ్వానరుఁడు కావలెను. "ఏష ఏవాగ్నిర్వైశ్వానరః" ఇత్యాది వాక్యములందు వైశ్వానరశబ్దము అగ్నియందు వాడఁబడినది గదా! అగ్నిదేవతనైనను వైశ్వానరశబ్దవాచ్యునిగ నిరూపింపవలసి యున్నది.

"వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపే త్పుత్రే జాతే" "కుమారుఁడు జన్మించినచో ద్వాదశకపాల మనఁబడు అగ్నిదేవతాకమైన క్రతువును గావింప వలెను" అను ప్రమాణము-ఇష్టికి దేవతగ ఫలము నిచ్చువాఁడు అగ్నిదేవుఁడని విశదపఱచుచున్నది కావున ప్రాదేశమాత్రుఁడను పరిచ్ఛేదమువలనను వైశ్వానర శబ్దముతో పరమేశ్వరుఁడు చెప్పఁబడువాఁడు కాఁడు.

ఇవ్విషయమై యొక ఆఖ్యాయిక వేదమునందు కలదు. ఔపమన్యవుఁడు మొదలగు ఐదుగురు మహర్షులు కూడి "కో ను ఆత్మా కిం బ్రహ్మ" అను ఆకాంక్ష గంవారై-వైశ్వానరోపాసకుఁడగు నుద్దాలకు నాశ్రయించి ప్రశ్నింపగా "అశ్వపతి యనఁబఱగు కేకయుఁడు ప్రస్తుతము వైశ్వానరుని పూర్తిగా గుర్తెరిగినవాఁడ"ని భావించి యవ్వారి నశ్వపతిచెంతకు గొంపోయి వైశ్వానరుఁనిగూర్చిప్రశ్నించినవాఁడు.

ఉత్తరము : పరమేశ్వరుఁడే వైశ్వానరుండగును. ఎట్లనగా? వైశ్వానరశబ్దము-జఠరాగ్ని మున్నగువానికి సాధారణమైన నీప్రకరణమునందు "ఆత్మాన మేవేమం వైశ్వానరం సంప్రత్యధ్యేషి తమేవ నో బ్రూహి" "ఈ వైశ్వానరుని పరమేశ్వరునిగ ప్రస్తుతము భావించుచున్నావు. అట్టి వైశ్వానరుని గురించియే మాకు బోధింపుము" ఇత్యాదివాక్యములందు పరమేశ్వరున కసాధారణములగు బ్రహ్మశబ్దము మొదలగు వానితో వైశ్వానరుఁడు విశేషింపబడుచున్నవాఁడు. కాని జఠరాగ్ని మున్నగువాని యందు వైశ్వానర విశేషణము సంభవించునదికాదు. కావున పరమేశ్వరుఁడే వైశ్వానరుఁడగువాఁడు.

వైశ్వానరుఁడు పరమేశ్వరుఁడను పక్షమున ప్రమాణాంతరమును చెప్పుచున్నవారు.

సూ. "స్మర్యమాణ మనుమానం స్యాదితి" 1-2-26

"అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ" ఇత్యాదివాక్యములందు పరమేశ్వరునకు స్వర్గలోకము మొదలుకొని పృథివి వరకు గల స్వరూపము దిగువవిధము వర్ణింపఁబడినది. "తస్య హ వా ఏతస్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజా శ్చక్షుర్విశ్వరూపః ప్రాణః పృథగ్వర్త్మాఽఽత్మా సందేహో బహులో వ స్తిరేవ రైః పృథివ్యేవ పాదౌ" "వైశ్వానరుఁడుగ చెప్పఁబడు పరమాత్మకు తేజోమయమగు స్వర్గము శిరస్సనియు సూర్యచంద్రులు నేత్రములనియు వాయువు ప్రాణమనియు జీవాత్మ -

నాభి మొదలుకొని కంఠము వరకు గల శరీరమనియు వర్షము మూత్రమనియు పృథివి పాదములనియు భావింపవలెను" అనుచో స్మరింపఁబడు లక్షణము వైశ్వానరుఁడు పరమేశ్వరుఁడగుటకు నిదర్శన మగుచున్నయది.

సూ. "శబ్దాదిభ్యోఽంతః ప్రతిష్ఠానాచ్చ నేతి చేన్న, తథా దృష్ట్యుపదేశా దసంభవాత్పురుషమపి చైన మధీయతే" 1-2-27

ప్రశ్న : స ఏషోఽగ్ని ర్వైశ్వానరో హృదయం గార్హపత్యో మనోఽన్వాహార్యవచన ఆస్య మావహనీయం తద్యద్భక్తం ప్రథమమాగచ్ఛే త్తద్ధోమీయం సాయం ప్రథమ మాహుతిం జుహుయాత్"

"ఈ జఠరాగ్ని వైశ్వానరుఁడగును. పురుషుని హృదయము గార్హపత్యాగ్ని యనియు మనస్సు అన్వాహార్యాగ్ని యనియు ముఖము ఆహవనీయాగ్ని యనియు మొదట భుజింపఁబడునది హవనద్రవ్యమనియు భావించి ప్రతిదినము పగలు సాయంకాలంబు భోజనారంభమున సమంత్రకముగ ప్రాణాహుతులను సమర్పింపవలెను.''

ఇత్యాది వాక్యములందు లభించు అగ్నిశబ్దము అగ్నిత్రయకల్పనము ప్రాణాహుత్యాధారత్వము అను వానివలన "స యో హైన మేవ మగ్నిం వైశ్వానరం పురుషవిధం పురుషేఽంతః ప్రతిష్ఠితం వేద'' అనుచో తెలియంబడు పురుషునిలో ప్రతిష్ఠించియుండుట యను లక్షణమువలనను వైశ్వానరుఁడు జాఠరాగ్నియే కాని పరమేశ్వరుఁడు కాజాలఁడు గదా!

ఉత్తరము : పరమేశ్వరుని జాఠరాగ్ని స్వరూపునిగ నుపాసింపవలెనని శ్రుతి యుపదేశించినది. కేవలము జఠరాగ్ని - త్రైలోక్య శరీరుఁడగుట మొదలగునది సంభవింపనట్టిది. మఱియు వాజసనేయశాఖవారు ''సఏషోఽగ్నిర్వైశ్వానరో యత్పురుషః" అను వాక్యముతో వైశ్వానరుని పురుషునిగా వాక్రుచ్చుచున్నవారు. "తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్'' అను ప్రమాణముతో ఎట్టి యుపపదములేని పురుష శబ్దము పరమేశ్వరునే చెప్పునదని తెలుపఁబడుచున్నయది.

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా-ప్రాణినాం దేహ మాశ్రితః
ప్రాణాపానసమాయుక్తః-పచామ్యన్నం చతుర్విధమ్ ॥

"నేను ప్రాణుల శరీరములో జఠరాగ్ని స్వరూపముగ నివసించి ప్రాణాపానవాయువులతో కూడుకొని ఆహారమును నాలుగు విధములుగ జీర్ణింపజేయుదును." ఇట్లు స్మృతులందును జఠరాగ్ని = పరమేశ్వర స్వరూపంబని యుపపాదింపఁబడుటచేతను పరమేశ్వరుడే వైశ్వానరుఁడని చెప్పుట సమంజసంబగుచున్నయది.

సూ. "అత ఏవ న దేవతా భూతం చ" 1-2-28

వైశ్వానరుఁడు త్రైలోక్యశరీరుఁడు పురుష శబ్దవాచ్యుఁడు నగుట వలననే అగ్నిదేవతగాని భూతాగ్నిగాని వైశ్వానర శబ్దవాచ్యములు కాజాలవు.

ఇట్లు పరమేశ్వరుని జఠరాగ్ని స్వరూపముగ నుపాసింపవలెనని యేర్పడిన పిమ్మట నా పరమాత్మ- అగ్నిశబ్దవాచ్యుఁడగుటకు మహర్షులు చూపెట్టిన విధానములను దిగువ సూత్రముల నుల్లేఖించినవారు.

సూ. "సాక్షా దప్యవిరోధం జైమినిః" 1-2-29

అగ్నిస్వరూపముగ నుపాసింపవలెనని చెప్పుటవలననే పరమేశ్వరునకు అగ్నిశబ్దవాచ్యత్వము కాదు. "అగ్రం నయతీత్యగ్నిః" "పుణ్యాత్ములగు శాంభవ దీక్షితుల నౌన్నత్యముఁ జెందించువాడను వ్యుత్పత్తి ననుసరించియు పరమేశ్వరునందే అగ్నిశబ్దము సాక్షాత్తు వర్తించునదగుటచే వాచ్యవాచక సామానాధికరణ్యమును చెప్పుటలో విరోధమేమియు గానరాదు. "అగ్నిః కస్మా దగ్రం నయతి" అను నిరుక్త నిర్వచనము నిర్విషయమై గాననగును. మఱియు మహాభారతమున

శ్లో॥ యస్మా చ్చాయం నయత్యగ్రాం-గతిం విప్రాన్ సుపూజితః
తస్మాచ్చ నయనాద్రాజన్-వేదేష్వగ్ని రితీర్యతే॥

శుద్ధ శ్రోత్రియులు - శాంభవదీక్షా పురస్సరముగ నారాధించుటవలన ప్రసన్నుడై అగ్రగతిని అనఁగా స్వసమానస్థితినిఁ బ్రసాదించువాడగుటచే పరమాత్మ వేదములం దగ్నియని చెప్పఁబడువాడు.

విశ్వానర మహర్షిగారి కుమారుఁడు వైశ్వానరుఁడను నర్థమువలె విశ్వేషు నరేషు = సమస్త జీవులం దంతర్యామిగ నుండువాడను నర్థంబు పొసగునదని జైమిని మహర్షిగారి నిర్వచనము.

"అభివిమానం" అను శ్రుతిగతపదముతో నపరిచ్ఛిన్నుఁడుగ చెప్పఁబడిన పరమాత్మ స్వర్గము మొదలుకొని పృథివివరకు గల ప్రదేశము స్వరూపముగ కలవాడని యొకానొక పరిచ్ఛేదముఁ జెప్పుట యెట్లు పొసగునను ఆశంకను నివారించున దీ దిగువ సూత్రము.

సూ. "అభివ్య క్తే రిత్యాశ్మరథ్యః 2-2-30

పరమేశ్వరునకు ప్రాదేశమాత్రత్వమును పృథివ్యాది స్వర్గలోకాంత స్వరూపమును చెప్పుట యుపాసకులకు వ్య క్తమగుటకొరకని ఆశ్మరథ్యముని నిర్వచించెను.

సూ. "అనుస్మృతయ ఇతి బాదరిః" 1-2-31

ఆకాశము మొదలుకొని పృథివివరకు శిరస్సు మున్నగు పాదముల వరకు గల నవయవములను కల్పించుట బ్రహ్మప్రాప్తికొరకని బాదరి వచించెను. ఉపాసకుల బుద్ధియం దధిరోహించుటకు పై విధము పరిచ్ఛేదము చెప్పఁబడినది. ప్రతిదినము గావింపఁదగిన ధ్యానమనఁదగు స్మృతి - బ్రహ్మ ప్రాప్తికొరకని గ్రహించునది.

సూ. "సంపత్తే రితి జైమిని స్తథాహి దర్శయతి" 1-2-32

"ఉర ఏవ వేది ర్లోమాని బర్హి ర్హృదయం గార్హపత్యో మనోఽన్వాహార్యపచ న మాస్య మాహవనీయః" "పరమేశ్వరోపాసకుని వక్షఃస్థలమే వేదికయనియు వెంట్రుకలు బర్హిస్సనియు హృదయము గార్హపత్యాగ్ని యనియు మనస్సు అన్వాహార్యాగ్ని యనియు ముఖము ఆహవనీయాగ్ని యనియు పేర్కొనఁబడుచున్నవి" ఇట్లు శివోపాసకుని వక్షస్సు మొదలగువానికి వేదిక మొదలగు యజ్ఞాంగములను కల్పించుట బ్రహ్మవిద్యాంగమగు ప్రాణాహుతి - అగ్నిహోత్రమని భావించుటకొరకని జైమిని యభిప్రాయము.

ఇందుకు "అథ య ఏవం విద్వా నగ్నిహోత్రం జుహోతి" అను శ్రుతి వాక్యము ప్రమాణముగ చెప్పఁబడుచున్నది.

"స య ఇద మవిద్వా నగ్నిహోత్రం జుహోతి, యథాఽంగారా నపోహ్య భస్మని జుహుయా త్తాదృక్ తత్స్యాత్, అథ య ఏత దేవం విద్వా నగ్నిహోత్రం

జాహోతి తస్య సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మసు హుతం భవతి, తద్యథైషీకతూల మగ్నౌ ప్రోతం ప్రదూయే తైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే"

"విద్వాంసుఁడు కానివాడు అగ్నియందు చేయు హోమము- నిప్పు శమించిన పిమ్మట భస్మయందు చేయఁబడిన హోమమువంటిది; విద్వాంసుఁడు జఠరాగ్నియందు చేయు హవనమువలన లోకములన్నిటి యందలి ప్రాణులందరియందు ఆత్మలయందును హవనమును గావించినట్లగును. దూది అండెము అగ్నిలో పూర్తిగ నశించునట్లు వైశ్వానరోపాసకుని పాపములన్నియు నశించునవి.''

సూ. "ఆమనంతి చైన మస్మిన్'' 1-2-33

పరమేశ్వరుఁడు ఉపాసకుని శరీరములో ప్రాణాహుతి సమయమున భోక్తయగునని "శివో మా విశాప్రదాహాయ" "ప్రభుః ప్రీణాతి విశ్వభుక్'' అను ప్రమాణములలో తైత్తిరీయులు నిరూపించుచున్నవారు. ఇట్లు సకలాచార్యమతముల ననుసరించియు న్యాయముగాను పరమేశ్వరుఁడు - జఠరాగ్ని స్వరూపుఁడనియు ప్రాణాగ్నిహోత్రస్వరూపుఁడనియు విశదమైనది.

ఇయ్యది ప్రథమాధ్యాయగత ద్వితీయపాదము.

---

ఈ మహాగ్రంథమును తెలుగు ననువదించిన నా పరిశ్రమను బాగుగ గుర్తించి మనఃశుద్ధితో విరాళాలు అందఁజేసిన మేధావులు.

(130 వ పేజీ తరువాయి)

33. లోకారాధ్యులైన శివశ్రీ॥ కాశీనాథుని పూర్ణమల్లికార్జునుఁడు గారు.
EX.M.P. బుట్టయ్యపేట, మచిలీపట్నం, కృష్ణాజిల్లా, (ఆం. ప్ర.)
వీరు వయోజ్ఞాన వృద్ధులు, నిరాడంబర ప్రవర్తనులు, గౌరవనీయాగ్రగణ్యులును)

34. లో. శివశ్రీ॥ తాడికొండ లింగమూర్తిగారు, శక్తివిశిష్ట శివోపాసకులు.
శ్రీనిలయము, 1-1-336/26, వివేకనగర్, చిక్కడపల్లి, హై॥ 20.

35. శివశ్రీ॥ మల్లికార్జున పండితారాధ్య, ముత్యంపేట గంగాధరశర్మగారు,
14-159, సంతోషరెడ్డికాలనీ, న్యూ మిర్యాలగుడ, మల్కాజిగిరి, సి.బాద్.

శ్రీ పార్వతీరాజరాజేశ్వరాభ్యాం నమః

శ్రీ నీలకంఠ భగవత్పాదకృత

# శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

[ఆంధ్రీకరణము]

## ప్రథమాధ్యాయగత తృతీయపాదము

ఈ మూడవ పాదమునందు కొద్ది స్పష్టముగా కొద్ది యస్పష్టముగాను బోధ పడు బ్రహ్మలక్షణములు గల వేదాంత వాక్యములు విచారింపఁ బడుచున్నవి. మరియు శివోపాసనయం దధికారము గలవారి లక్షణమున్ను చెప్పఁబడును.

సూ. "ద్యుభ్వాద్యాయతనం స్వ శబ్దాత్" 1-3-1

స్వర్గము మొదలగువాని యాధారము - పరమేశ్వర వాచకమగు ఆత్మశబ్ద మిందుండుటవలన- పరమేశ్వరుఁడే నగునని సూత్రార్థము.

విషయవాక్యము : ముండకోపనిషత్తు.

"యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్ష మోతం మనః సహ ప్రాణైశ్చ సర్వైః, తమేవైకం విజానథ ఆత్మాన మన్యావాచో విముంచథ, అమృతస్యైష సేతుః"

"స్వర్గము భూమి ఆకాశము ఇంద్రియములన్నిటితో కూడిన మనస్సు ఇత్యాది ప్రపంచమున కాధారమగు పరమాత్మ నొకనినే కనుగొనుఁడు ! తదితర ములను చెప్పు వాక్యములను విడనాడుడు ! ఎందుకనగా ? అమృత (మోక్ష)ము నకు పరమావధియగువాడు పరమాత్మయే.''

ఇఁట స్వర్గాద్యాధారముగ వినఁబడువాడు పరమేశ్వరుఁడా ? ఇతరుడా ? అని సంశయము.

ప్రశ్న : పరమేశ్వర భిన్నుడగు వాయువే స్వర్గాద్యాధారమని తెలియు చున్నది. "వాయునా వై గౌతమ సూత్రేణాయం చ లోకః పరశ్చ లోకః, సర్వాణి భూతాని సందృబ్ధాని భవంతి" "గౌతముడా ? ఇహపర లోకములు సమస్త ప్రాణు

లున్న సూత్రప్రాయుడగు వాయువుచే ధరింపఁబడుచున్నవి" అను శ్రుతివాక్యము నందు వాయువు సర్వాధారమని విశదీకరింపఁబడినది గదా!

ఉత్తరము : పరమేశ్వరుఁడే స్వర్గాదులకు నాధారమగువాడు. "తమేవైకం విజానథ ఆత్మానమ్'' అనుచో గల ఆత్మశబ్దము పరమేశ్వరున కసాధారణమగు టచే వాయువు సర్వాధారమని చెప్పరాదు.

సూత్రాత్మయగు వాయువునందు ఆత్మశబ్దము వర్తించునెడ దోష మెద్ది యను శంకను నివారించున దీ సూత్రము.

సూ. "ముక్తోపసృప్య వ్యపదేశాచ్చ" 1-3-2

"యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం - కర్తార మీశం పురుషం బ్రహ్మయో నిమ్, తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ - నిరంజనః పరమం సామ్యముపైతి"

"శివారాధనఁ జేయువాడు - బంగారువన్నె కలిగిన శరీరము గలవాడు, సమస్త జగత్కర్తయు జగమును శాసించువాడు, పరిపూర్ణుఁడు, వేదరచయితయు జగదుపదానంబు నగు పరమేశ్వరుని సాక్షాత్కరింపఁజేసికొని పుణ్యము పాపము అవ్వాని లేపమున్ను బొత్తుగా లేనివాడై పరమేశ్వరునితో పూర్తిగ సామ్యమును పొందువాడు"

"యథా నద్యః స్యందమానాః సముద్రే - అస్తం గచ్ఛంతి నామ [రూపే విహాయ
తథా విద్వాన్ నామరూపా ద్విముక్తః - పరాత్పరం పురుష [ముపైతి దివ్యమ్"

"నదులు ప్రవహించుచు తమ నామరూపముల (స్థూలదశ)ను విడనాడి సముద్రమున కలియునట్లు శివోపాసకుడగువాడు ప్రాకృత నామరూపముల సంబంధము లేనివాడై సర్వాతీతమగు ప్రకాశమానమైన అంతరిక్షమునందు విరాజమానుఁడగు పరమపురుష (పరమేశ్వరు)నిఁ బొందువాడగును."

ఇట్లు పుణ్యపాపములు ప్రాకృత నామరూపములున్ను లేనట్టి ముక్తపురుష లకు ప్రాప్యుండగునని చెప్పుటవలన నిట సూత్రాత్మయగువాడు పరమేశ్వరుండే నని తెలియవలెను. ఇట్టి స్వర్గాద్యాధారత్వ లక్షణము వాయువునందెట్లు పొసగును?

పరమేశ్వరుని యష్టమూర్తులలో చేరినవాడగుటచే వాయువు సూత్రాత్మ యని చెప్పఁబడినవాడు. కావున వాయువు స్వర్గాద్యాధారము కాజాలదని నిర్ణయము.

"తమేవ ధీరో విజ్ఞాయ- ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః" "శివ ఏకో ధ్యేయః శివంకరః సర్వమన్య త్పరిత్యజ్య" అను శ్రుతివాక్యమువలన శివేతరముల నన్ని టిని విడనాడి శివుఁడే ముఖ్యముగ తెలిసికొనఁదగిన వాడని బోధపడుచున్నది. మఱియు "నానుధ్యాయా ద్బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్"అను వాక్యము "ఇతర వాక్యములను పరిశీలింపగూడదు. ఎందుకనగా ? శివేతర సమర్థకములగు వాక్యములను విచారించుట శబ్దములయొక్క నిరుపయోగ కృత్యమగు"నని తెలుపు చున్నది.

కేనోపనిషత్తునందు "దేవతలు పరమేశ్వరానుగ్రహమున రాక్షసులను జయించి గర్వపడియుండుతఱి దేవతల గర్వమును పరిహరింప నుద్దేశించి పర మేశ్వరుఁడు యక్షరూపముతో నావిర్భవింపగా దేవేంద్రుడు యక్షుని పరామర్శించు టకు పంపిన వాయువును "నీ వెవరు? నీ సామర్థ్యమెట్టిది? అని పరమేశ్వరుఁడు ప్రశ్నించెను. "గొప్ప బలము కలిగి మూడు లోకములఁ గూడ కదిలించువాడ" నని వాయువు చెప్పగా "ఇద్దానిని కదలించు" మని వాయువుముందు పరమేశ్వ రుఁడు ఒకానొక గడ్డిపుడకఁ బడవేసినవాడు. అప్పుడు వాయువు తన సంపూర్ణ సామర్థ్యముతో తృణశలాకను కదలింపఁజాలకుండెను" అను నాఖ్యాయిక వినఁ బడుచున్నయది. మఱియు నదే యుపనిషత్తున "బ్రహ్మహి దేవేభ్యో విజిగ్యే" అను వాక్యము - పరమేశ్వరుఁడు దేవతలకు విజయమును ప్రసాదించెనని విశద పఱచుచున్నయది.

ప్రకృతిగాని జీవాత్మగాని స్వర్గాద్యాధారము కాజాలరని దిగువ సూత్రము లతో వివరించుచున్నవారు.

సూ. "నానుమాన మతచ్ఛబ్దాత్ ప్రాణభృచ్చ" 1-3-3

అనుమానగమ్యమగు ప్రధానము సర్వోపాదాన మగుటచే స్వర్గాద్యాధార మగునని చెప్పఁగూడదు. ఎందుకనఁగా? ఈ శ్రుతియందు గల ఆత్మశబ్దము ప్రధా నమును చెప్పునది కాదు.

జీవుఁడణుమాత్రుఁ డగుటచే, శివేతరమును విసర్జించి యుపాసించుటవలన

లభించు అమృతత్వమునకు కారకుఁడు కానందువలనను, స్వర్గాద్యాధారమున కుప యోగించు వ్యాప్తి యను నర్థము గల ఆత్మశబ్దముండుట వలనను జీవాత్మయు స్వర్గాద్యాధారము కాజాలడు.

జీవపక్షమును నిరాకరించుటకు మరియొక కారణమును చెప్పుచున్నవారు.

సూ. "భేదవ్యపదేశాత్" 1-3-4

ఇఁట జీవపరమేశ్వరులు భిన్నులని శ్రుతి ప్రమాణముచే నిర్దేశింపఁబడినది.

"సమానే వృక్షే పురుషో నిమగ్నోఽనీశయా శోచతి ముహ్యమానః, జుష్టం యదా పశ్యత్యన్య మీశ మస్య మహిమాన మితి వీతశోకః"

శ్రుత్యర్థము - సమానే - ఒక, వృక్షే - వృక్షమువలె చేదింపఁదగిన శరీరమునందు: నిమగ్నః - ధూళిపరాగముల సముదాయమునందు పడియున్న నీటిచుక్కవలె శరీరతత్త్వమును కనుగొనఁజాలనివాడై, ముహ్యమానః - శరీర గత దోషములు తనవి యని మోహపడునట్టి పురుషః=జీవాత్మ-అనీశయా=శరీర దోషములను పోగొట్టుశక్తి లేకుండుటచే, శోచతి - దుఃఖపడుచుండును. యదా ఎప్పుడు, జుష్టం - భక్తిచే ప్రసన్నుడైన, అన్యం - తనకంటెవేరైన, ఈశం-పర మేశ్వరుని, పశ్యతి-చూచునో, తదా-అప్పుడు, వీతశోకః - సంసారదుఃఖమును పోగొట్టుకొని, అస్య - ఈ పరమేశ్వరునియొక్క మహిమానం - సత్యసంకల్ప త్వము మొదలగు ఐశ్వర్యమును ఇతి (ఏతి) - పొందుచున్నవాడు.

ఏతన్మంత్రమునందు - స్వతఃసిద్ధము అత్యంత శ్రేష్ఠమునగు మహిమగల పరమేశ్వరుఁడే ఈశ శబ్దముతో నిర్దేశింపఁబడువాడు. ఇఁక జీవాత్మ - పరమేశ్వ రానుగ్రహమున ముక్తదశయందు సత్యసంకల్పత్వాది మహిమ కలిగియుండు వాడు గదా! ఏతాదృశ జీవేశ్వరతారతమ్యము వలన అనాదికాలమునుండి ఐశ్వ ర్యము కలవాడే స్వర్గాద్యాదారమగుట పొసగుచున్నందునను పరమేశ్వరుఁడే స్వయముగ స్వర్గాద్యాధార మగువాడని తెలియవలెను.

సూ. "ప్రకరణాత్" 1-3-5

ముండకోపనిషత్తునందలి యీ ప్రకరణము "కస్మి న్ను భగవో విజ్ఞాతే" మొదలుకొని ప్రాణులందరి యుత్పత్తికారణమగు అక్షరశబ్దవాచ్యుడైన

పరమేశ్వరునిదే నని "అథ పరా, యయా తదక్షర మధిగమ్యతే" ఇత్యాది వాక్యము వలనఁ దెలియుచున్నది.

జీవాత్మకు నాడీ సంబంధము - హృదయము ద్వారా నేర్పడునదగుటచే హృదయమందు భావలింగముగ నుపాసింపఁదగిన పరమేశ్వరుఁడు "అజాయ మానో బహుధా విజాయతే" అనునట్లు ఐచ్ఛికముగా ననేక విగ్రహములఁ బరిగ్రహించువాడని తెలియునది.

సూ. "స్థిత్యదనాభ్యాం చ" 1-3-6

"ద్వా సువర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే తయోరన్యః పిప్పలం స్వాద్వ త్త్యనశ్న న్ననో్య అభిచాకశీతి"

"మంచివన్నె గలిగిన రెండు పక్షులు (జీవపరమేశ్వరులు) శరీరరూపమగు ఒకే వృక్షమునందు నిరంతరము కూడి స్నేహితులవలెఁ బ్రవర్తించునవి. ఈ రెంటిలో నొక పక్షి — రుచికరమైన కర్మఫలము ననుభవించునట్టిది. మరియొక పక్షి - యెట్టి యనుభవము లేకయే ప్రకాశించునట్టిది."

ఇట్లు జీవునకు కర్మఫల భోగమును పరమేశ్వరునకు కర్మభోగములేకయే శరీరస్థితిని శ్రుతి నిర్దేశించుచున్నందున జీవునికంటె వేరైన పరమేశ్వరుఁడే స్వర్గాద్యాధారమగునని విశదమైనది.

సర్వజ్ఞాన ప్రతిజ్ఞానము - విశిష్ట శివాద్వైత సిద్ధాంతమునందే పొసగునది. ఎట్లనఁగా? "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" అనుచో ఏవ కారమునకు ఇవార్థముఁ జెప్పవలెను. జీవాత్మ - ముక్తుడగునెడ బ్రహ్మసదృశుఁడగుననియు "అస్య మహిమాన మితి" అనుచో బ్రహ్మసదృశ మహిమ లభించుట బ్రహ్మభిన్నత్వమునందే పొసగుననియు "యదా పశ్యః పశ్యతే" అను అనంతర మంత్రమునందు పరమేశ్వరునితో పరమసామ్యముఁ జెందుట ముక్తి స్వరూపమనియు "ఏషోఽణురాత్మా" అనుచో అణువుగ చెప్పఁబడిన జీవాత్మ "తస్మిన్ విశుద్ధే విభవత్యేష ఆత్మా" ముక్తదశయందు విభువగునని ముక్తదశయందును జీవస్థితి నంగీకరించుటచే జీవేశ్వరభేదము పారమార్థికమైనదనియు ఏవంసత్యేవ "బ్రహ్మమును కనుగొనినవాడు జగమంతయు తెలిసికొనువాడగు" నను ప్రతిజ్ఞ సరిపడుననియు గ్రహింపవలెను.

## భూమాధికరణము

ముక్తప్రాప్యుఁడుగ చెప్పఁబడిన పరమేశ్వరుని పొందుటకు ప్రయోజనమగు నిరతిశయ సుఖమును ప్రదర్శించుచున్నవారు.

సూ. "భూమా సంప్రసాదా దధ్యుపదేశాత్" 1-3-7

సూత్రార్థము - సంప్రసాదుఁడనఁగా జీవాత్మయగును. ఇట్టి సంప్రసాదుని కంటె నధికముగ శ్రుతియందుపదేశింపఁబడుటవలన పరమేశ్వరుడే భూమశబ్ద నిర్దిష్టుడగువాడు.

ఛాందోగ్యమునం దీ సూత్రమునకు విషయవాక్యము.

"యత్ర నాన్యత్పశ్యతి నాన్య చ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా" "ఏద్ది లభించినచో ఇతరమును చూడకుండుటయు అన్యమును వినకుంకుటయు వేరుదానిని తెలియకుండుటయు నగునో అట్టిది భూమ యనఁబడును."

మనోవాక్కుల కందరాని యతిశయము గల ఆనందము భూమ శబ్దార్థ మగును. ఇట్టిది ఒకానొక ధర్మి నాశ్రయించునదగుటఁజేసి నిరతిశయానందము కలిగియుండు పరమేశ్వరుఁడు భూమశబ్ద నిర్దిష్టుడగువాడు.

ఇట్టితటి భూమశబ్దముతో నిర్దేశింపఁబడువాడు పరమేశ్వరుఁడా? తదితరుడా? అని సందేహము.

ప్రశ్న : పరమేశ్వరునికంటె నితరుఁడగు ప్రాణవాయువే భూమశబ్దముతో చెప్పఁబడవలెను. ఎందుకనఁగా? ఛాందోగ్యమునందు భూమవాక్యమునకు ముందు "అస్తి భగవో నామ్నో భూయః" ఇత్యాది వాక్యములతో నారదుఁడు ప్రశ్నింపగా సనత్కుమారుఁడు "వాగ్వావ నామ్నో భూయసీ" పేరుకన్న వాక్కు శ్రేష్ఠమైనది" ఇట్లు నామాది తత్త్వములను గురించి చెప్పిన తరువాత ప్రశ్నోత్తరములు లేకయే నిర్దేశింపఁబడిన భూమశబ్దము సంబంధించుటచే ప్రాణవాయువే ఇట ప్రతిపాద్యము కాని పరమేశ్వరుఁడు కాజాలడు గదా!

ఉత్తరము : సుషుప్తియందు అథవా ముక్తదశయందు బాగుగా ప్రసన్నుడగువాడగుటచే సంప్రసాదుడనఁబడు జీవాత్మ నతిక్రమించియుండు వాడని

చెప్పఁబడుటవలన పరమేశ్వరుఁడే భూమశబ్దవాచ్యుండగువాడు, "అథ యఏష సంప్రసాదః" సంప్రసాదుఁడగు జీవుఁడు ప్రాణశబ్దములో నిర్దేశింపఁబడును. ఇట్టి జీవునికన్న మరియొక ఆత్మగా భూమయగువాడు "ఏష తువా అతివదతి యః సత్యేనాతివదతి" "ఎవడు స్వరూపముతో ప్రకృతి నతిక్రమించువాడో వాడే మిక్కిలి సంభాషించువాడు అనఁగా గొప్పవాడు పరమాత్మ" అనుచో నుపదేశింపఁబడు చున్నవాడు.

ఈ సందర్భమున పూర్వము "స్వావా ఏష ఏవం పశ్య న్నేవం మన్వాన ఏవం విజానన్నతివాదీ భవతి" "జీవుడు శ్రుతిప్రోక్త రీతిగ పరమాత్మను భావించుచు చూచువాడై మిక్కిలి తెలివి గలవాడు మరియు మహిమగల వాడగును" ఇట్లు అతి వాదియగు జీవునిఁజెప్పి యటుపిమ్మట "ఏషతువా" అను వాక్యములోని "తు" శబ్దముతో ప్రాణశబ్దవాచ్యుండగు జీవునికన్న సత్యస్వరూపుఁడగు పరమేశ్వరుఁ డతీతుఁడుగ తెలుపబడుచున్నవాడనియు "అథాత ఆత్మాఽఽదేశః" అనుచో ఆత్మగా చెప్పఁబడుచున్నవాడనియు గ్రహింపనగును కావున జీవాత్మాధికుఁడగు ఆత్మ (పరమేశ్వరుఁడు) భూమయగువాడే నని సిద్ధాంతము.

సూ. "ధర్మోపపత్తేశ్చ" 1-3-7

"స భగవః కస్మిన్ ప్రతిష్ఠితః" "భగవానుఁ డెద్దానియందు ప్రతిష్ఠిఁబడిన వాడు" "ఆత్మైవేదం సర్వమాత్మనః ప్రాణ ఆత్మన ఆకాశః" "జగమంతయు ఆత్మస్వరూపమే, ఆత్మనుండి ఆకాశము ప్రాణము అన్ని యావిర్భవించినవి" ఇత్యాది ప్రశ్నోత్తర వాక్యములందు గల స్వమహిమ ప్రతిష్ఠితత్వము, సర్వాంతర్యామిత్వము సర్వకారణత్వము మొదలగు ధర్మములు - ప్రాణశబ్ద నిర్దిష్టుడగు జీవునియందు ఉపపన్నములు కాకుండుటచే పరమేశ్వరునియందుపపన్నములగుటను భూమాఖ్యుఁడు పరమేశ్వరుఁడేను.

ప్రశ్న: పూర్వాధికరణమునందు "నిరంజనః పరమం సామ్య ముపైతి" అను వాక్యము ననుసరించి ముక్తపురుషులకు శివసాదృశ్యము చెప్పఁబడినది కావున సాయుజ్యముక్తి గలవారు బ్రహ్మములో లీనులుగాక బ్రహ్మమునకంటె వేరు నుందురని బోధపడుచున్నదిగదా! ఏవంసతి "యత్ర నాన్య త్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమా" అను వాక్యము పరమాత్మ నవలోకిం

చిన పిమ్మట బ్రహ్మములోనుండు ప్రపంచమును చూచుట మొదలగువాని నిషేధించుట యెట్లు పొసగును?

ఉత్తరము : నిరతిశయ సుఖస్వభావము గల పరమాత్మ - సాక్షాత్కరింపగా - ఇంద్రియానందము ననుభవించు నుద్దేశముతో రూపాది విషయములను గాంచుటయందు ప్రవృత్తి గలవాడు కాకుండును. ఇట్టి యానందమును కలుగఁజేయు బ్రహ్మము భూమ యనఁబడుచున్నది. ఇంద్రియసుఖ విశేషములన్నియు బ్రహ్మానందలేశమున పరమాణువులవంటివి.

ఇవ్విషయమునే "ఏతస్యైవానందస్య అన్యాని భూతాని మాత్రా ముపజీవంతి "ఈ బ్రహ్మానందముయొక్క యల్పాంశము నాశ్రయించియే ప్రాణులన్నియు జీవించుచున్నవి" యని శ్రుతి ప్రతిపాదించుటచే "నాన్య త్పశ్యతీ" త్యాది నిషేదము బ్రహ్మగతమగు ప్రపంచమునకు కాజాలదు.

ప్రశ్న : ప్రపంచము ఉండునపుడు ముక్తపురుషులకు ప్రపంచ దర్శనము లేదని శ్రుతి చెప్పుట యెట్లు పొసగును?

ఉత్తరము : ప్రపంచము సత్యమైనను ముక్తపురుషులకు కనఁబడునది కాదు. నిరతిశయానంద స్వరూపమగు బ్రహ్మమే ప్రపంచాకారముగ కనఁబడునది యగును. "వృక్ష" మనెడు పదము పత్రపుష్పాదులతో కూడిన స్థావరమును చెప్పునట్లు "భూమ" శబ్దము స్థూలసూక్ష్మ చేతనాచేతనములతో నిండియుండు ప్రపంచముతో కూడియుండు పరమేశ్వరుని తెలుపునట్టిది. వృక్షమును చూచువాడు మూలము మొదలుకొని శాఖాగ్రములవరకు నెటఁ జూచినను వృక్షమునే చూచునట్లు ముక్తపురుషుఁడు ప్రపంచమును ప్రపంచాకారముతో గాక బ్రహ్మాకారముగ నవలోకించువాడగును. ఇందువలననే "యత్ర నాన్యత్పశ్యతీ" త్యాది నిషేదమును శ్రుతి చెప్పుట సమంజసంబగుచున్నయది.

ఇవ్విషయమై తైత్తిరీయశ్రుతి "ఏతత్తతో భవతి, ఆకాశశరీరం బ్రహ్మ, సత్యాత్మ, ప్రాణారామమ్" "పరిదృశ్యమాన జగము - ముక్తావస్థ నొందిన మహాపురుషునకు చిదాకాశ స్వరూపత్వము మొదలగు లక్షణములతో కూడిన బ్రహ్మముగ గోచరించును'' "ఆప్నోతి స్వారాజ్యం ఆప్నోతి మనసస్పతిమ్" "స్వః-స్వర్గమనఁదగు పరమపదమునందు ప్రకాశించువాడు కావున స్వారాట్ అనఁబడును

స్వారాట్టుభావము స్వారాజ్యమగును. ఇట్టి సుఖైక రసస్వరూపము గల పదమును మఱియు జ్ఞానశక్త్యధిష్ఠాతయగు పరమేశ్వరుని పొందఁజాలును" అని ముక్త పురుషుని గురించి వాక్రుచ్చియున్నది.

అట్టితఱి ముక్తపురుషుఁ డెట్టివాడను నాకాంక్ష యుదయింపగా "వాక్పతిః" ఇత్యాది వాక్యములతో - నప్రాకృతములు విశుద్ధములు స్వాధీనములు నగు వాగింద్రియాదుల సంబంధము కలవాడని - తెలుపబడుచున్నయది.

భూమవిద్యయందు ప్రపంచమును దుఃఖరూపకముగ చూడనివాడై ఎట్టి దుఃఖసంసర్గము లేని బ్రహ్మముగ నవలోకించువాడగునని విశదమైనది.

"న పశ్యో మృత్యుం పశ్యతి, న రోగం నోత దుఃఖతాం సర్వం హి పశ్యః పశ్యతి, సర్వమాప్నోతి సర్వశః"

ప్రపంచమును బ్రహ్మముగ నవలోకించువాడు మృత్యుమయమగు సంసా మును గాని రోగాది వికారములనుగాని దుఃఖమునుగాని పొందువాడు కాడు. కావున శివుని సర్వాంతర్యామిగ గాంచువాడు సర్వవిధములుగ పరమేశ్వరునే పొంద వాడగును".

అందువలన శ్రుతిప్రోక్త ప్రపంచ నిషేధమునకు విరోధము లేనందున ముక్తపురుషులు శివసములై శివునికి వేరుగాని ప్రపంచమును శివమయముగ గాంచుట యుపపన్నంబగుచున్నయది.

## అక్షరాధికరణము

సూ. "అక్షర మంబరాంత ధృతేః" 1-3-9

బృహదారణ్యకమునందీ మాత్రమునకు విషయవాక్యము.

"ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంతి, అస్థూల మనణ్వ హ్రస్వ మదీర్ఘ మలోహిత మస్నేహ మచ్ఛాయమ్"

ఇట నక్షరశబ్దార్థము ప్రణవమా? జీవాత్మయా? పరమేశ్వరుఁడా? అని మూడు విధములుగ సందేహింపఁబడుచున్నది.

ప్రశ్న : ప్రణవము కాని జీవుఁడు కాని యక్షరశబ్దవాచ్యుఁడు కాదగును. ఎందుకనఁగా? అక్షర మనునది వర్ణమునకును పర్యాయమగుటచే ప్రణవవాచకం బగుటయ "పురుషోఽక్షర ఉచ్యతే" అను ప్రమాణము ననుసరించి జీవుఁడక్షర శబ్దముతో చెప్పఁబడుటయు గమనింపఁదగినవి.

ఉత్తరము : ఇఁట నక్షరపదము పరబ్రహ్మమునే చెప్పునది. ఎందువలన ననఁగా? ఆకాశావధిక ప్రపంచమును ధరించుట యను లక్షణము ప్రణవ జీవులకు పొసగనట్టిది.

ఈ సందర్భమున నక్షరమును గురించి యొక యాఖ్యాయిక గలదు.

జనకమహారాజు - స్వక్రియమాణ యజ్ఞమునకు కురుపాంచాలాది దేశముల నుండి యనేక బ్రాహ్మణులు రాగా వీరిలో నెవరు బ్రహ్మిష్ఠులని తెలిసి కొనఁగోరి "మీలో బ్రహ్మిష్ఠులగువారు సువర్ణాలంకార భూషితములగు వేయి ఆవులను తీసుకొనుఁడ"ని ప్రకటించెను. అప్పుడు నేను బ్రహ్మజ్ఞుడనను దృఢ విశ్వాస ముతో యాజ్ఞవల్క్య మహర్షి తన శిష్యునికి జనకప్రదత్తగోవులను మన యాశ్ర మమునకు గొంపొమ్మని చెప్పగా నచటి బ్రాహ్మణులు క్రుద్ధులైనందున అశ్వలు డనువాడు "నీవేనా బ్రహ్మిష్ఠుడవు" అని ప్రశ్నించెను. అట్టితఱి యాజ్ఞవల్క్యుఁడు "మేము బ్రహ్మవిదుని నమస్కరించువారము కాని ఆవులను మాత్రము కోరుదుము" అని చెప్పగా ఇద్ది గర్వోక్తియని శంకించి యాశ్వలాదులు గావించిన ప్రశ్నలకు యాజ్ఞవల్క్యుఁడు సదుత్తరములను చెప్పినందున సభ్యులందరు మిన్నకుండిరి.

పిమ్మట ఈ జగము ఎద్దానియందు ఆధారపడియుండునని ప్రశ్నింపగా నీటియం దాధారపడి యుండునని సమాధానముఁ జెప్పెను. మరికొన్ని ప్రశ్నలకు తగిన సమాధానములను యాజ్ఞవల్క్యుఁడు చెప్పి బ్రహ్మలోకములు సర్వాధారము లగునని నిరూపించిన తరువాత బ్రహ్మలోకములు కిమాధారకములని ప్రశ్నింప "గార్గీ? అధికముగా ప్రశ్నింపకుము! మిక్కిలి ప్రశ్నలను గావింపనివారియందే దేవతలు ప్రసన్నులుగ నుందురని యాజ్ఞవల్క్యుఁడు సక్రోధముగ వచించినందున గార్గి యూరకుండెను.

అట్టితఱి బ్రహ్మవిదుఁడని ప్రసిద్ధుడైన నుద్దాలకుఁడు సర్వాంతర్యామి యగు సూత్రాత్మను గురించి ప్రశ్నింపగా యాజ్ఞవల్క్యుఁడు సరియైన సమాధానమును

చెప్పుటఁజేసి ''పృచ్ఛకులందరు పరాజితులగుచున్నవారని గమనించి సభాసదుల యనుమతిని యాజ్ఞవల్క్యుని క్రోధము నిరూపయోగమని గ్రహించియు" గార్గి మరల సర్వాధారమగునది యెద్దియని ప్రశ్నింపగా - "యదూర్ధ్వం గార్గి దివో యదర్వాక్ పృథివ్యా యదంతరా ద్యావాపృథివీ ఇమే యద్భూతంచ భవచ్చ భవిష్యచ్చేత్యాచక్షత, ఆకాశ ఏవ తదోతంచ ప్రోతంచ".

''గార్గీ! స్వర్గమునకు పై క్రింది భాగములు పృథివీభాగము భూమ్యంతరిక్షముల నవకాశంబును భూత భవిష్యద్వర్తమానకాలీన జగమంతయు ఆకాశము నందాధారపడియున్నవి. అని యాజ్ఞవల్క్యుఁడు వచింపగా ఆకాశమునకు ఆధారము ఎద్దియని ప్రశ్నించినది.

"ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంతి" అను వాక్యము మొదలు కొని "ఏతస్మిన్ ఖల్వక్షరే గార్గి బ్రాహ్మణా అభివదంతి" అను వాక్యమువరకు వచింపఁబడిన ఆకాశాపధికమైన ప్రపంచమును భరించుట - అక్షరపదవాచ్యమగుదానికే పొసగుచున్న యది.

ఇట్టి ప్రపంచధారణము పరమేశ్వరునికి దక్క నితరముల కెట్లు ఉపపన్నంబగును? అందువలన నక్షరపదాభిధేయుఁడు పరమేశ్వరుఁడే యగుచున్నవాడు.

అక్షరపదవాచ్యము ప్రణవము కానట్లు జీవాత్మయు నక్షరపద వాచ్యుఁడు కాజాలడని దిగువ సూత్రము నుదాహరించినవారు.

సూ. ''సా చ ప్రశాసనాత్'' 1-3-10

"ఏతస్యైవాక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః'' ఇత్యాది వాక్య సందర్భముతో సూర్య చంద్రాది సకల ప్రపంచధారణము శ్రేష్ఠమగు నక్షరముఁ దగు కార్యమని విశదమగుచున్నయది. ఇట్టి జగచ్ఛాసనము జీవాత్మవలన నేర్పడునది కాదుగదా!

''ఏక ఏవ రుద్రో న ద్వితీయాయ తస్థుః" అను తైత్తిరీయ శ్రుతివాక్యము పరమేశ్వరునికి దక్క జీవాత్మకు జగము శాసించుటయను లక్షణము సంభవించునది కాదని తెలుపుచున్నయది.

ఇట జగచ్ఛాసనమందు మాత్రము తనకంటె రెండవ వస్తువు లేదనియు వస్తుతః రెండవ వస్తువు కలదనియు దిగువ వాక్యములు తెలుపుచున్నయవి.

"య ఇమాన్ లోకా నీశత ఈశనీభిః" శ్వేతాశ్వతర శ్రుతి.

"య ఇమాన్ లోకా నీశత ఈశనీయః" అథర్వశిరోపనిషత్తు.

ఇందువలనను పరమేశ్వరుఁడే అక్షరనామధేయుఁ డగువాడు.

సూ. ''అన్యభావ వ్యావృత్తేశ్చ'' 1-3-11

తద్వా ఏతక్షరం గార్గి అదృష్టం ద్రష్టృ, అశ్రుతం శ్రోతృ, అమతం మంతృ, అవిజ్ఞాతం విజ్ఞాతృ"

"జీవసముదాయము ఒకానొక వస్తువుఁ జూచునపుడు అపాతతః గోచర మగునెడ నట్టిదగు రూపమును సాక్షాత్కరింపఁజేయునదియు ఒకానొక శబ్దము అస్పష్టముగా వినఁబడునెడ శ్రావ్యశబ్దమును విశదముగ వినగలుగఁజేయునదియు "స్థాణుహా? పురుషుడా? అని సందేహించునపుడు విచారణీయవస్తువును భాసింపఁ జేయునదియు, స్థాణువనియో పురుషుఁడనియో నిర్ణయించునపుడు నిర్ణీతమగు వస్తువును గోచరింపఁజేయునదియు నగు నక్షరము ఈవరకు చెప్పఁబడిన పర బ్రహ్మమే నగు" నని గార్గిని గురించి చెప్పుటవలన "పరమేశ్వరుఁడే నక్షరమ గును కాని వేరు కాద"ని నిరూపితమైనది.

అనేక విద్వాంసులు నివసించు గ్రామమున ''చైత్రుఁడే పండితు"దని చెప్పునెడ ననేక శాస్త్రవిదుఁడగు పండితుఁడు చైత్రునితో సమానుఁడు మరి యొకఁడు లేడను నర్థము స్ఫురించునట్లు "రుద్రు డద్వితీయుడ''ను నెడ జగచ్ఛాసకుడు ద్వితీయుడు లేడని విశదమగునది.

"అదృష్టం- ద్రష్టృ'' అనుచో సర్వద్రష్ట, సర్వాధారుఁడు సర్వశాసకుఁడు నగు పరమేశ్వరునితో సమానుఁడు మరియొకఁడు లేడని "నాన్యదతోఽస్తి ద్రష్టృ" ఇత్యాది వాక్యము నిరూపించుచున్నది కాని అనేకులు చూచువారు లేరను నిషేధ మును మాత్రము చెప్పుటలేదు. ఐతే అనేక ప్రమాణములు - ద్రష్టలు శ్రోతలు భావించువారు విజ్ఞాతలు నగు జీవాత్మ లనేకులు గలరని చాటుచున్నవి గదా!

బ్రహ్మమే ద్రష్టయని చెప్పుట - బ్రహ్మమునకు ద్రష్టృత్వాది విశేషములు

లేవని చెప్పు స్వమతమునకే విరుద్ధమగుటచే యథోక్తమైన సమర్థనమే విహితంబగు చున్నయది. ఇఁక ప్రణవమునకుగాని జీవాత్మకుగాని ఏతాదృశ మహిమ లేనందున పరమేశ్వరుఁడే నక్షరపదాభిధేయుఁడగు వాడని సారాంశము-

## ఈక్షతికర్మాధికరణము

ప్రత్యక్షాది ప్రమాణముల నతిక్రమించి యుండువాడైనను పరమకారుణికుఁ డగుటచే పరమేశ్వరుఁడు స్వోపాసకులకు ప్రత్యక్షమగువాడని ప్రతిపాదించున దీ యధికరణము.

సూ. ''ఈక్షతి కర్మ వ్యపదేశా త్సః" 1-3-12

"యః పునరేతం త్రిమాత్రేణోమిత్యేతే నైవాక్షరేణ పరం పురుష మభి ధ్యాయీత స తేజసి సూర్యే సంపన్నో యథా పాదోదర స్త్వచా వినిర్ముచ్యత ఏవం హైవ స పాప్మనా వినిర్ముక్తః స సామభి రున్నీయతే బ్రహ్మలోకం స ఏతస్మా జ్జీవఘనాత్ పరాత్పరం పురిశయం పురుష మీక్షతే".

"అకార ఉకార మకారము లనఁబడు మాత్రలు మూడిటితో నేర్పడు ఓంకారముతోడను తదనుస్యూతమగు శివపంచాక్షరీ మంత్రముతోడను పరమేశ్వ రుని ధ్యానించువాడు - తేజోమయుఁడగు సూర్యుని దర్శించి- పాము కుబుసమును విడుచునట్లు - కర్మబంధమునుండి విడిబడి సామవేదాభిమానము గల దేవతల తోడ్పాటుతో శివపదమును పొందువాడగును. తరువాత జీవసమష్టి స్వరూపుఁడగు హిరణ్యగర్భు నతిక్రమించియుండు నారాయణునికన్న పరుఁడగు పరమేశ్వరుని దర్శించువాడగును".

ప్రశ్నోపనిషత్తునందు - సత్యకాముఁడనువాడు ప్రశ్నించినపుడు పిప్ప లాదమహర్షి నిర్వచించు పై సందర్భమును గాననగును.

ఇఁట దర్శింపఁబడువాడు పరమేశ్వరుడా? ఇతరుడా? అని సందేహము.

ప్రశ్న : ''స సామభి రున్నీయతే బ్రహ్మలోకమ్" అనుచో హిరణ్య గర్భుని లోకమును చెప్పవలసియుండును. ఎట్లనఁగా? ప్రణవోపాసకుఁడు ఇంద్రియాతీతుఁడగు జీవునికంటె నతీతుఁడగు హిరణ్యగర్భుని చూచువాడగును.

లేక జీవఘనుఁడగు హిరణ్యగర్భునికన్న పరుఁడగు నారాయణుని దర్శించువాడగు. నని చెప్పవలెను. ఇట్టి నారాయణుఁడే ప్రణవవాచ్యుఁడను ప్రసిద్ధియు కలదు. "తద్విష్ణోః పరమం పదం - సదా పశ్యంతి సూరయః" అను వాక్యము విష్ణు పదమే విజ్ఞానముగలవారి దర్శనమను యనుభవములో విషయమగు"నని తెలుపుచున్నయది. మరియు "ఋగ్భి రేతం యజుర్భి రంతరిక్షం సామభి ర్యత్తత్కవయో వేదయంతే" అనుచో "యత్తత్'' అను పదముతో విష్ణుపదముఁదగు ప్రత్యభిజ్ఞానము కలదు గదా!

ఉత్తరము: ప్రణవోపాసకుఁడు చూచుటకు విషయమగువాడు పరమేశ్వరుఁడేను. ఎందుకనఁగా? ఇదే ప్రశ్నోపనిషత్తునందు ''తమోంకారేణై వాయతనేనాన్వేతి విద్వాన్ యత్తచ్ఛాంత మజర మమృత మభయం పరంద" అను వాక్యమున అజరత్వ అమృతత్వ భయరాహిత్యాది పరమేశ్వర లక్షణములు చెప్పఁబడుటచే తత్కార్యమగు హిరణ్యగర్భుఁడు శాంత్యాది ధర్మసంపన్నుఁడు కాజాలకుండును. ''బ్రహ్మలోకమ్'' అను పదమునకు "పరబ్రహ్మమగు శివుని లోకము ముక్తప్రాప్యమగునది" యను నర్థమును చెప్పవలెను, జీవఘనుఁడనఁగా? జీవాత్మ సముదాయ స్వరూపుఁడగు బ్రహ్మదేవుఁడగును. ఇంద్రియాతీతుఁడగు చతుర్ముఖుని కంటె పరుఁడగు శివుఁడు ధ్యానింపఁదగినవాడని విశదమైనది కావున "ప్రణవానుసంధానపరునకు హిరణ్యగర్భుఁడు దర్శనీయుఁడు" అను పక్షము యుక్తమైనది కాజాలదు.

"నారాయణుఁడు దర్శనీయుఁడు" అను వాదమును విచారింతము.

శాంతి జరారాహిత్యము మొదలగు లక్షణములు నారాయణునకు ఉపపన్నములైనను ''అమృత మభయం పరంచ" ఇత్యాది వాక్యమున చెప్పఁబడిన నిత్యముక్తత్వము, అభయప్రదాతృత్వము, విశ్వాధికత్వము అను లక్షణములు నారాయణునియందెట్లు పొసగునట్టివి? నారాయణుఁడు విశ్వమయుఁడగుటచే విశ్వాతీతత్వము మున్నగు లక్షణములు (కేశవునకు) సంభవింపనట్టివి.

జీవఘనుఁడగు హిరణ్యగర్భునికన్న నుత్కృష్టుఁడైన నారాయణుని కంటె నతీతుఁడును సర్వాంతర్యామియు దేహమను పట్టణమున నెలకొనినందున పురుష శబ్దముతో చెప్పఁబడువాడు నగు పరమేశ్వరుని ప్రణవపంచాక్షరితో నుపాసించువాడు సాక్షాత్కరించుకొనువాడగునని విశదార్థము.

"నారాయణ పరంబ్రహ్మ'' "ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ - పురుషం కృష్ణపింగళమ్, ఊర్ధ్వరేతం విరూపాక్షమ్" అను వాక్యముల ననుసరించి పరబ్రహ్మము నారాయణాతీతంబనియు మనోవాగ్వికారములు లేనట్టిదనియు దేహములోని హృదయపుండరీకమున నివసించుటచే పురుషశబ్ద వాచ్యంబగునది యనియు మూడు కన్నులు కలదియగుటచే విరూపాక్షంబనియు ప్రణవగత అకార ఉకార మకారములను వ్యత్యాసముగ (ఉ=మ్=అ) పలుకుటచే నేర్పడు ఉమాశబ్దముతో చెప్పఁబడు పరశక్తితోకూడినదై, "తస్య ప్రకృతిలీనస్యయః పరః స్సమహేశ్వరః" అను వాక్యము ననుసరించి ప్రణవాభిధేయం బగునది యనియు అనేక వర్ణములు కలది యగుటచే కృష్ణపింగళంబనియు, సర్వాతీతమగుటచే పరంబనియు "పరాత్పరం పురిశయం పురుష మీక్షతే" అను వాక్యము ననుసరించి స్వోపాసకులకు సాక్షాత్కరించునదనియు చెప్పుట సమంజసంబగునది.

"తద్విష్ణోః పరమం పదమ్'' అనుచో విష్ణువునకు గల ప్రపంచస్వరూపము దక్క నిరతిశయానంద స్వభావము గల పరమ స్వరూపమే శివాభిధేయమగు బ్రహ్మమగునని చెప్పనెడల విరోధమెద్దియు గానరాదు. ఎందుకనఁగా? ఉపాదాన కారణమగు విష్ణుమూర్తికిని నిమిత్తకారణమగు పరమేశ్వరునకును అవస్థాభేదమే కాని స్వరూపభేదము పాటింపఁదగినది కాదు.

ఇట్లు హరిబ్రహ్మాది ప్రపంచాతీతుఁడైనను ఉపాసకుల ననుగ్రహించుటకు పరమేశ్వరుఁడు దేహమున నివసించుచు పురుషుఁడనఁబడిగి పరమశక్తియగు ఉమాదేవితో కూడినవాడై సాక్షాత్కరించుట - సకల సంసారము తొలగుటద్వారా స్వప్రాప్తిని కలిగించునది యగును. ఇట్టి మోక్షము శివవాచకమగు ప్రణవపంచాక్షరీ మంత్రముతో శివానుసంధానమును చేయువారికే సంభవించునని విశదమైనది.

నిత్యముక్తత్వమనఁగా? సంసారకళంకములు ఎల్లకాలము లేకుండుటయే కాదు. మరియు నెప్పుడును సర్వశ్రేష్ఠమగు స్వకీయానందము ననుభవించుట యగును. ఇట్టి యానందానుభవము పరమేశ్వరుని యవస్థా విశేషమగు నారాయణునకు సంభవించునది కాజాలదు.

ప్రశ్న : 'యో దేవానామ్" అను మంత్రము ననుసరించి పరమేశ్వరుఁడు హిరణ్యగర్భుని మించినవాడగుటఁజేసి ''నారాయణ పరం బ్రహ్మ'' అను మంత్ర

మునఁ గల నారాయణ శబ్దమునకు బ్రహ్మార్థమును చెప్పవలసియుండును- కావున శివుఁడు బ్రహ్మాతీతుఁడే గాని నారాయణాతీతుఁడు కాజాలడు గదా!

ఉత్తరము: "ఋతగ్ం సత్యం పరం బ్రహ్మ" అను తదనంతరాను వాకమునందు శివుఁడే నారాయణునికన్న నతీతంబగు బ్రహ్మమగునని ప్రదర్శింపఁబడినది కావున చతుర్ముఖునికంటెఁ బరుఁడు నారాయణుఁడనియు నారాయణుని కన్న నతీతుఁడు శివుఁడనియు దిగువ వ్రాయఁబడిన శివసంకల్పోపనిషత్తననుసరించి విశదమగునది.

"పరా త్పరతరో బ్రహ్మ తత్పరా త్పరతో హరిః"

తత్పరా త్పరతో హీశః"...............శివసంకల్పోపనిషత్తు.

ప్రణవమునకు గల నక్షరములను వ్యత్యాసముగ పలికినచో నేర్పడు "ఉమ" అను నామధేయము గౌరీ ప్రణవమగునను నంశమును లింగపురాణ వాక్యములు తేటపఱచినవి.

శ్లో॥ త్వదీయః ప్రణవః కశ్చిత్ - మదీయః ప్రణవ స్తథా
త్వదీయో దేవి మంత్రాణాం - శక్తిభూతో న సంశయః ॥

అకోరోకార మకారా - మదీయే ప్రణవే స్థితాః
ఉకారం చ మకారం చ - అకారం చ క్రమేణ తు॥

త్వదీయ ప్రణవం విద్ధి - త్రిమాత్రం ప్లుత ముత్తమమ్ ॥

బ్రహ్మలోకమనఁగా? బ్రహ్మము సంపూర్ణముగ ప్రకాశించునదియగును, విష్ణుపదమనఁగా? విష్ణువునకు గల యప్రాకృత నిరతిశయానంద స్వభావమగును గావున నిట్టి పదద్వయము ఏకార్థమునే బోధించుచున్నవని గ్రహింపవలెను

## దహరాధికరణము

దేహమను పట్టణమున నివసించువానిగ స్వహృదయమున పరమేశ్వరు నుపాసింపవలెనని వ్యక్తపఱచున దీ దహరాధికరణము.

సూ. "దహర ఉత్తరేభ్యః" 1-3-13

''అథ యదిద మస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ, దహ రోఽస్మి న్నంతర ఆకాశ స్తస్మిన్ యదంత స్తదన్వేష్టవ్యమ్, తద్వావ విజిజ్ఞాసి. తవ్యమ్" ఛాందోగ్యము.

"బ్రహ్మపురమనఁదగు ఈ శరీరమునందు కమలాకారముగల హృదయము లోని దహర (సూక్ష్మాతిసూక్ష్మ) ఆకాశ (ప్రదేశ) మునఁ గల వస్తువును కను గొనుటకు యత్నింపవలెను". ఇఁట దహరాకాశము భూతాకాశమా? జీవుఁడా? పరమాత్మయా? అని సందేహము.

ప్రశ్న : ఆకాశపదము భూతాకాశమునందు రూఢి కలదగుటచే దహరా కాశము పంచభూతములలోని ఆకాశము కాదగును. అథవా స్వల్పరూపము గల వాడగుటఁజేసి జీవాత్మయగును. ఎట్లనఁగా అణువగు జీవాత్మయందు దహరాకాశ త్వము సంభవించునట్టిది. కాని సర్వవ్యాపకుఁడగు పరమేశ్వరుఁడు దహరము కాజాలఁడు గదా! ఒకవేళ దహరాకాశము పరమేశ్వరుఁడగునెడ దేహము నశించిన పిమ్మట "ఒకానొక ఘటము భిన్నమైనచో నందలి దధిక్షీరాదులు అంతరించు నట్లు'' బ్రహ్మము వికారముఁ జెందును.

ఉత్తరము : ఛాందోగ్యమునందు నుత్తరభాగమున చెప్పఁబడిన అపహత పాప్మత్వాది లక్షణములఁ బట్టి దహరాకాశము పరమేశ్వరుఁడగును. మరియు ముదుసలితనము వధింపఁబడుట మొదలగువానివలన వినాశముఁజెందునది కానట్టి దహరాకాశము సత్యమైనది కావున నిట్టి దహరాకాశమునకు నిలయమగు సూక్ష్మ శరీరము బ్రహ్మపుర మనఁదగును.

"ఏష ఆత్మా అపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సోఽ పిపాసః సత్యకామః సత్యసంకల్పః"

"పరమేశ్వరుఁడు— బొత్తుగా పాపములు లేనివాడు, ముసలితనము, చావు, ఇడుములు, ఆకలిదప్పులును లేనివాడు; యథార్థ మనోరథములు గలవాడు; సంక ల్పముల సదుపయోగము గలవాడు నగును "

ఇట్టి గుణములు ఆకాశమునందుగాని జీవాత్మయందుగాని వర్తింపవు గావున నపహతపాప్మత్వాది గుణములు గల పరమేశ్వరుఁడే దహరాకాశమగువాడు.

సూ. "గతిశబ్దాభ్యాం తథాహి దృష్టం లింగం చ" 1-3-14

"తద్యథా హిరణ్యనిధిం నిహిత మక్షేత్రజ్ఞా ఉపర్యుపరి సంచరంతో న విందేయు రేవ మేవేమాః సర్వాః ప్రజా అహరహ ర్గచ్ఛంత్యేతం బ్రహ్మలోకం న విందంతి అనృతేన ప్రత్యూఢాః"

"భూమిలోని ద్రవ్యనిధిని పైపైన నడచుచున్నవారు కనుగొనఁ జాలనట్లు ప్రజలందరు నజ్ఞానావృతమనస్కులై బ్రహ్మలోకశబ్ద వాచ్యుడగు పరమాత్మను దినదినము సుషుప్తియందు కలిసికొనుచున్నను కనుగొనఁజాలకున్నవారు''

అనుచో వినఁబడు ప్రాణుల దహరాకాశగమనము వలన బ్రహ్మలోక శబ్దము వలనను దహరాకాశము పరమేశ్వరుఁడే నగును.

ఇట్లే మరియొక శ్రుతియందు జీవాత్మ సుషుప్తియందు దహరాకాశముఁ జెందుటను గాననగును. "ఏవమేవ ఖలు సౌమ్యేమాః ప్రజాః సతి సంపద్య న విదుః సతి సంపత్స్యామహే'' "సౌమ్యుడా ? ఈ ప్రాణులన్నియు పరమాత్మయందు విశ్రాంతిఁ జెందుచున్నను పరమేశ్వరుని పొందుచున్నామని తెలిసికొనఁజాలకున్నవి."

''ఏష బ్రహ్మలోకః సంరాడితి హోవాచ"

"ఇద్ది బ్రహ్మలోకము బాగుగా ప్రకాశించునదియు''

ఇదిగాకను శ్రుత్యంతరములందు గల గతి శబ్దముతో నవసరము లేకయే నీ ప్రకరణమునందును వినఁబడు ప్రతిదిన దహరాకాశగమనము బ్రహ్మలోక శబ్దంబును పరమేశ్వరుఁడు దహరాకాశ మగుటను పూర్తిగా సమర్థించు నిదర్శనములగుచున్నవి.

సూ. "ధృతేశ్చ మహిమ్నోఽస్యాస్మి న్నుపలబ్ధేః" 1-3-15

"అథ య ఆత్మా స సేతు ర్విధృతి రేషాం లోకానా మసంభేదాయ"

"ఎవఁడు పరమాత్మయనఁబఱగి దహరాకాశ మగుచున్నవాడో వాడే లోకములన్నిటి యవధిగ నుండువాడై బ్రహ్మాండమును భరించుచు సుస్థిర మొనర్చువాడు."

శ్రుత్యంతరములందు పరమేశ్వర మహిమగ చెప్పఁబడిన జగద్విధృతి

యీ చాందోగ్యమునందు దహరాకాశమునకే ప్రతిపాదింపఁబడుచున్నందున దహరాకాశము పరమేశ్వరుఁడే నగునని నిర్ణయింపఁబడనది.

మఱియు దిగువ శ్రుతివాక్య మిందుకు ప్రోద్బలకమగునట్టిది.

"ఏష సర్వేశ్వర ఏష భూతాధిపతి రేష భూతపాల ఏష సేతు ర్విధారణ ఏషాం లోకానా మసంభేదాయ"

"సర్వేశ్వరుఁడు ప్రాణులను శిక్షించుచు రక్షించుచు లోకములన్నియు కళవళపడకుండునట్లు నవ్వాని మోయుచున్నవాడు."

సూ. "ప్రసిద్ధేశ్చ" 1-3-16

"దహ్రం విపాప్మం వరవేశ్మభూతం - యత్పుండరీకం
పురమధ్యసంస్థమ్,
తత్రాపి దహ్రం గగనం విశోక - స్తస్మిన్ యదంత
స్తదుపాసితవ్యమ్."

"పరమేశ్వరుని నివాసము, దేహమను పట్టణము నడుమ నుండునది, ఎట్టి కళంకములు లేనిదియు, పరిశుభ్రంబు సూక్ష్మంబు నగు హృదయపుండరీకమునందు నిర్వికారము మిక్కిలి సూక్ష్మము నగు చిదాకాశము గలదు. అందు గల జ్యోతిర్లింగాత్మక శివు నుపాసింపవలెను."

"హృత్పుండరీకం విరజం" అను వాక్యము మొదలుకొని "ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుమ్" ఇత్యాది వాక్యమువరకు కైవల్యోపనిషత్తునందు పరమేశ్వరుని దహరపుండరీక మధ్యవర్తిగ నుపాసింపవలెనని ప్రసిద్ధముగ నిరూపింపఁబడినది. కావున నిట్టి ప్రసిద్ధిఁబట్టియు పరమేశ్వరుఁడు దహరాకాశమనఁ దగినవాడు.

దహరాకాశము తదంతర్వర్తియు పరమేశ్వరుఁడనునెడ "తనలో తానుండుట" యను ఆత్మాశ్రయ దోషము సంభవించు నని శంకించి - హృత్పుండరీకమందలి దహరాకాశము చిచ్ఛక్తియగును కావున శక్తిశక్తిమంతులకు నభేదమగుటచే శక్తిమయమగు దహరాకాశము శక్తివిశిష్టుఁడగు శివుఁడనుటలో విరోధమెద్దియు గానరాదు.

ఇందువలననే హంసోపనిషత్తునందు

"ఏషోఽసౌ పరమహంసో భానుకోటిప్రకాశో యేనేదం వ్యాప్తం తస్యాష్టధా వృత్తి ర్భవతి"

"కోటి సూర్యులతో సమానముగ ప్రకాశించువాడు, జగమునంతయు వ్యాపించువాడు, పరమహంసయు నగు పరమాత్మ - ఎనిమిది విధములగు స్వరూపవృత్తి గలవాడు."

మఱియు జీవాత్మకు వైరాగ్యము హృదయపుండరీక మధ్యమున నేర్పడును. హృదయకమలము యొక్క కేసరమునందు జాగ్రదవస్థయు, కర్ణికయందు స్వప్నావస్థయు హృదయకమల మధ్యగత చిదాకాశములోని జ్యోతిర్లింగమున సుషుప్తియు సంభవించును."

ఇట్లు చేతనుల గాఢనిద్రా సమయమునకు ఆధారమగు దహరాకాశము శివలింగస్వరూపమగుట ప్రసిద్ధమై యున్నది.

ఒకవేళ నిట పరమేశ్వరుఁడు లింగస్వరూపుడు కాడనినచో - హృదయ కమలమున కేసరము కర్ణిక మధ్యప్రదేశముదక్క నాలుగవది లేనందున "లింగే సుషుప్తిః" అను వాక్యము సార్థకము కాకుండును. కావున సమస్తజీవ సుషుప్తి కాల నివాసముగా చెప్పఁబడిన శివలింగము పరబ్రహ్మంబని విశదార్థము.

"ఉమా సహాయం పరమేశ్వరం ప్రభుమ్" అని కైవల్యమునందు "ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగళమ్" అని యుపనిషదంతరముననుసాకారరూపము ప్రతిపాదింపఁబడినట్లు "తమాదిమధ్యాంతవిహీన మేకం- విభుం చిదానంద మరూప మద్భుతమ్" అని శ్రుత్యంతరములందు నిరాకారత్వము నిరూపింపఁబడియున్నది. కావున చిదంబరశక్తివిశిష్టుఁడగు పరమేశ్వరునకు లింగ స్వరూపము విహితమగుచున్నది గదా !

శ్లో॥ "ఆధారే కనకప్రఖ్యం– హృదయే విద్రుమప్రభమ్,
భ్రూమధ్యే స్ఫటికచ్ఛాయం–లింగం యోగీ విభావయేత్"

"శివోపాసకుఁడు తన దేహములోని ఆధారచక్రమునందు బంగారు వన్నె

గలదిగాను హృదయమున పగడపుకాంతి గలదిగాను భ్రూమధ్యమున స్ఫటికమయముగాను శివలింగమును భావింపవలెను.''

ఇవ్విధము సాకారుఁడు నిరాకారుఁడు నగు మహేశ్వరుని లింగస్వరూపమే సాధకులకు ధ్యానమునందు పూజనాదులందును విహితమైనదనియు చేతనులందరి నను్గ్రహించు పరమేశ్వరుఁడు జీవహృదయమున సహజలింగ స్వరూపముతో సన్నిహితుఁడగుననియు తేటపడుచున్నది.

పరమేశ్వరుని సాకారునిగానైనను నిరాకారునిగానైనను ధ్యానించుటకు పూజించుటకు నీ మహాలింగ స్వరూపమే ముఖ్యమైనదని మహాభారతములోని ద్రోణపర్వమునందలి అశ్వత్థామఁ గురించి వేదవ్యాసుని వచనము విశదపఱచు చున్నది.

శ్లో॥ జన్మకర్మ తపోయోగా- స్తయో స్తవ చ నిర్మలాః ।
తాభ్యాం లింగేఽర్చితో దేవ- స్త్వయాఽర్చాయాం యుగేయుగే ॥

"అశ్వత్థామా ? కృష్ణార్జునులయొక్కయు నీయొక్కయు జననము పవిత్రమైనది. మరియు కర్మాచరణ, ఉపాసన, ధ్యానము ఇత్యాది యోగములన్నియు నిర్దోషములేను; కాని కృష్ణార్జునులు ప్రతియుగమున మహాదేవుని లింగస్వరూపమునందారాధించుచున్నవారు, నీవైతేనో మూర్తియందారాధించుచున్నావు. కావున మూర్తిపూజకంటె లింగారాధనము శ్రేష్ఠమగుటఁజేసి కృష్ణార్జునులకు ప్రతి సమయమునందు విజయము చేకూరుచున్నది" ఇందువలననే "ధిగ్గ్రామ మశివాలయమ్" అను ప్రమాణము ననుసరించి ప్రతి గ్రామమునందు పుణ్యక్షేత్రములందును దేవతలు గాని మహర్షులు గాని శ్రీరామచంద్రుఁడు మున్నగు మహాపురుషులు గాని ఆలయములలో లింగములను ప్రతిష్ఠించిరను నంశము సుప్రసిద్ధమై యున్నది.

లింగస్వరూపము - పరమేశ్వరుని పంచవింశతి లీలా విగ్రహములలో మొదటిది కావున బ్రహ్మవిష్ణువులు కలహించినపుడు శివుఁడు లింగస్వరూపముతో సాక్షాత్కరింపవలసినవాడయ్యెను.

"లీయతే గమ్యతే యస్మిన్-యతః సర్వం చరాచరమ్"

"ప్రపంచమంతయు ప్రళయకాలమున దాగియుండుటకు నెలవగునదియు

సృష్టికాలమున నామరూప విభాగార్హమగుటకు కారణమగునదియు లింగ మనఁ బడును. ఐతే తన నారాధించువారికి మహాలింగస్వరూపమును కనఁబఱచి భక్తులకు వరముల నొసగునపుడే గంగాధరత్వాది రూపము కలవాడగుచున్నవాడు. ఇంతియే గాక పరమాత్మ వాత్సల్యజలనిధి యగుటచే జీవుల నుద్ధరించుటకే హృదయమున సూక్ష్మాతిసూక్ష్మమైన జ్యోతిర్మయమగు లింగస్వరూపముతో నివసించు వాడని చెప్పుట ముమ్మాటికి నొప్పారుచున్నది.

మహాలింగము హృదయ పుండరీక మధ్యవర్తియగుటచే సూక్ష్మాతిసూక్ష్మ మగునది. అవిరక్తుని హృదయమున భోగస్థానములు సుఖదుఃఖ భోగ సాధనములును దాగియుండునవి. విరక్తుని హృదయమునందైతేనో ప్రియములగు పుత్ర విత్తాదులకన్న నతిప్రియము చిదంబరాత్మకమునగు పరశివ స్వరూపమే ప్రకాశించునది.

ఇట్టి మహాలింగమే స్థూలతనువునందు ఇష్టలింగమనఁబఱగి సూక్ష్మశరీరమునందు ప్రాణవాయువుతో నవినాభావమును పొందు శివపంచాక్షరీ మంత్రము ననుసంధించుటగా ప్రాణలింగమనఁబడుచు కారణశరీర సన్నిహితమగు దహరాకాశమున పరమానందమై నివసించు భావలింగముగా పేర్కొనఁబడుచున్నది. అందువలననే క్రియాసారమను గ్రంథమున "శ్రీ నీలకంఠ భగవత్పాదుల వారు దహరాధికరణమును భావలింగోపాసన పరముగా నిర్ణయించి" రని వ్రాయఁబడి యున్నది.

సూ. "ఇతర పరామర్శాత్స ఇతి చేన్న అసంభవాత్" 1-3-17

"అథ య ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరా త్సముత్థాయ పరం జ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే ఏష ఆత్మేతి హోవాచ"

ఇట సంప్రసాదశబ్దముతో జీవాత్మ పరామర్శింపఁబడుచున్నవాడు. కావున దహరాకాశము జీవుఁడే యగునని శంకించునెడ- పూర్వోక్త అపహత పాప్మత్వాది లక్షణములు జీవునియందు సంభవింపనివగుటఁజేసి దహరాకాశము తదంతర్వర్తియు పరమేశ్వరుఁడేను.

సూ. "ఉత్తరాచ్చే దావిర్భూత స్వరూపస్తు" 1-3-18

ఛాందోగ్యమునందు తరువాత గల ప్రజాపతి వాక్యము.

"య ఆత్మాఽపహత పాప్మా, విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సోఽపి పాసః సత్యకామః సత్యసంకల్పః సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః, స సర్వాన్ లోకా నాప్నోతి సర్వాంశ్చ కామాన్, య స్త మాత్మాన మనువిద్య విజానాతి"

ఇందు చెప్పఁబడిన లక్షణములు జీవాత్మను బోధించునవి. మరియు జాగ్రత్స్వప్న సుషుప్తులనఁబడు నవస్థలయందు వర్తించుట జీవలక్షణమే గదా!

ఎట్లనఁగా ?

"య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే ఏష ఆత్మేతి హో వాచ" జాగ్రదవస్థ.

"య ఏష స్వప్నే మహీయమాన శ్చరతి ఏష ఆత్మేతి హోవాచ" స్వప్నావస్థ.

"తద్యత్రై తత్ సుప్తః సమస్తః సంప్రసన్నః స్వప్నం న విజానా త్యేష ఆత్మేతి హోవాచ" సుషుప్త్యవస్థ.

ఇందువలన దహరాకాశము జీవుఁడే యనునెడ - జీవునకు అనాదికాలము నుండి చేయఁబడు కర్మలవలన నగు కళంకముల సంబంధముచేత నేర్పడు శరీరములందు అపహత పాప్మత్వాది లక్షణములు మఱుగుపడి యుండును. ఎప్పుడు శివోపాసనవలన శివానుగ్రహపాత్రుడై పరంజ్యోతి (శివు) నాశ్రయించిన పిమ్మట సహజము నవహతపాప్మత్వాది లక్షణ విశిష్టము నగు రూపమును కనుగొనునో అప్పుడు ముక్తజీవుఁడగును. ఇట్టివాడే ప్రజావతి వాక్యమునందు ప్రతిపాదింపబడుచున్నవాడు కాని సంసారియగు బద్ధజీవుఁడు కాజాలడు.

దహరాకాశమైతేనో - సత్యకామత్వాది కల్యాణ గుణములు మఱుగుపడనిదియు సహజములగు అపహతపాప్మత్వాది లక్షణములు గలదియు నగును కావున నిట బద్ధజీవుఁడుగాని ముక్తజీవుఁడుగాని దహరాకాశముగ నిరూపింపఁబడుచు లేదని సారాంశము.

సూ. "అన్యార్థశ్చ పరామర్శః" 1-3-19

అట్లు ఐనచో జీవుని పరామర్శ యెందుకనఁగా ?

"అస్మా చ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభి నిష్పద్యతే'' అనుచో దహరాకాశ శబ్దముతో పరంజ్యోతిగ నిర్దేశింపఁబడు పరమాత్మ నాశ్రయించియే తన రూపమును పొందుట యను జీవ మహిమను చాటుటకయ్యే జీవపరామర్శ చేయఁబడినది కాని దహరాకాశము జీవుఁడనుటకు కాదని సూత్రార్థము.

సూ. "అల్ప శ్రుతే రితి చే త్తదుక్తమ్" 1-3-20

''దహరాకాశము మిక్కిలి సూక్ష్మమగుటఁజేసి అందు పరమాత్మ నివసించుట పొసగదని శంకించునెడ ''వ్యోమవచ్చ" అను సూత్రముయొక్క వివరణయందు ఆకాశమువలె సర్వమును వ్యాపించువాడు పరమాత్మయని నిర్వచింపఁబడినదని సూత్రార్థము.

సూ. "అనుకృతే స్తస్య చ" 1-7-21

జీవాత్మ దహరాకాశ మనఁదగు పరంజ్యోతియగు పరమేశ్వరు ననుసరించుట శ్రుతియందు కనఁబడుచున్నయది.

"నైనం సేతు మహోరాత్రే తరతో న జరా న మృత్యు ర్నశోకో న సుకృతం, న దుష్కృతం, సర్వే పాప్మానోఽతో నివర్తంతే, అపహత పాప్మా హ్యేష బ్రహ్మలోకః, తస్మాద్వా ఏతం సేతుం తీర్త్వా అంధః సన్న నంధో భవతి, విద్ధః స న్నవిద్ధో భవతి, ఉపతాపీ స న్ననుపతాపీ భవతి, తస్మాద్వా ఏతం సేతుం తీర్త్వా అపి నక్త మహరేవాభి నిష్పద్యతే, సకృద్విభాతో హ్యేష బ్రహ్మలోకః"

"సర్వావధియగు దహరాకాశము నహోరాత్రములుగాని జరామృత్యు దుఃఖములుగాని సుకృత దుష్కృతములుగాని ఆశ్రయింపవు. పాపములన్నియు తొలగును కావున నీ దహరాకాశము అపహతపాప్మ యనఁబడును. ఇట్టి దహరాకాశమును కనుగొనినవాడు గ్రుడ్డివాడైనను చూపుగలవాడగును. బాధితుఁడైన నబాధితుఁడగును. పరితాపము గలవాడైనను లేనివాడగును. మరియు ప్రకాశము లేనివాడైనను కలవాడగును. బ్రహ్మలోకమనఁదగు నిట్టి దహరాకాశము సకృత్ సాక్షాత్కరించునెడల ఎప్పుడును మఱుగుపడునది కాదు."

అనుచో దహరాకాశము బొత్తుగా పాపములు లేనిదై ఎల్లకాలము ప్రకాశము

కలిగియుండుటఁజేసి యద్దానిని పొందినవారికి పాపకార్యములగు నంధత్వాదులు లేకుండుటయు నిరంతర ప్రకాశము ఏర్పడుటయు గమనింపఁదగినవి.

కావున దహరాకాశద్రష్టలకు నపహత పాప్మత్మాది ఫలములు చేకూరుటచే దహరాకాశముతో సమానమగు ప్రతిపత్తి యను యనుకృతి సంభవించుచున్నది.

ఇందువలన నట్టి యనుకృతి - జీవేశ్వర భేదమునందే పొసగునది కావున దహరాకాశము జీవుఁడు కాదని సారాంశము.

సూ. "అపి చ స్మర్యతే" 1.6-22

మఱియు స్మృతులయందు నివ్విషయము బాగుగా నిరూపింపఁబడినది.

''ఈశ్వరః సర్వభూతానాం - హృద్దేశేఽర్జున తిష్ఠతి" గీతావాక్యము.

"అర్జునా ? ప్రాణులందరి హృదయమున దహరాకాశమునందు పరమేశ్వరుఁడు మహాలింగ స్వరూపముతో నివసించువా"డని గుర్తెరుగుము !

"తమేవ చాద్యం పురుషం ప్రపద్యే" గీతావాక్యము.

''సర్వప్రథముఁడగు నా మహాపురుషనే నేను శరణుఁబొందుచున్నాను."

"తతోఽవ్యయాత్మా స హరిః - స్వహృత్పంకజశాయినమ్,
దర్శయామాస దేవానాం - మురారి ర్లింగమైశ్వరమ్"
వామన పురాణము.

"నిత్య స్వరూపము గల నారాయణుఁడు కమలమువంటి తన హృదయమున నివసించు శివలింగమును దేవతలకు చూపెట్టినవాడయ్యెను."

"అథవా పరమాత్మానం—పరమానంద విగ్రహం।
గురూపదేశా ద్విజ్ఞేయం—పురుషం కృష్ణపింగళమ్ ॥

బ్రహ్మ బ్రహ్మపురే గార్గి ! - దహరాబ్జ ఖ మధ్యమే।
అభ్యాసాత్ సంప్రపశ్యంతి- సంత స్త్వంచ తథా కురు ॥

"సర్వాతీతమగు ఆనందము స్వరూపముగా గలిగి కృష్ణపింగళ వర్ణము గల

పరిపూర్ణుఁడగు పరమాత్మను బ్రహ్మపుర మనఁదగు హృదయ కమలములోని దహరాకాశ మధ్యయందు నిత్యశివారాధనముఁ దగు క్రమాభ్యాసమువలన సత్పురుషులు కనుగొనువారు కావున నో గార్గీ ! నీవుగూడ నట్లు చేయుము !" అని యాజ్ఞవల్క్యుఁడు స్వధర్మపత్ని యగు గార్గికి నుపదేశించినవాడు.

ఇట్టి హృదయకమల స్థితమగు స్వరూపమును గురూపదేశమున గాననగుననియు గురూపదిష్టుఁడు క్రమాభ్యాసమునఁజేసి బ్రహ్మదర్శనముఁ జేయఁజాలుననియు సారాంశము.

## ప్రమితాధికరణము

ఉపాస్యమైన దహరాకాశము మహాలింగ స్వరూపంబని ఛాందోగ్యమున నిర్ణయింపఁబడినది. ఇట్టి యంశమునే ధృవపఱచు కఠవల్లీ విద్యయందలి యను వాదమును తెలుపున దీ ప్రమితాధికరణము.

సూ. "శబ్దా దేవ ప్రమితః" 1-2-22

కఠవల్లీ వాక్యము

"అంగుష్ఠమాత్రః పురుషో- మధ్య ఆత్మని తిష్ఠతి,
ఈశానో భూతభవ్యస్య-న తతో విజుగుప్సతే"

"భూత భవిష్య ద్వర్తమాన ప్రపంచమును శాసించువాడును ఈశాన శబ్దరూఢివాచ్యుఁడును అంగుష్ఠమాత్రుఁడు నగు పరమాత్మ - జీవాత్మలో నుండువాడు. కావున స్వహృదయమున నంగుష్ఠమాత్రమగు శివలింగమును కనుగొనినందువలన నిజరూపజ్ఞానము కలవాడగును" అనగా పరమాత్మ దర్శనము ఐన పిమ్మటనే జీవునకు నిజ రూపము మఱుగుపడజాలదనియు నిరాయాసముగ గోచరించుననియు వివేకము.

ఇఁట నంగుష్ఠమాత్రుఁడు పరమాత్మయా ? జీవాత్మయా అను సందేహమును పురస్కరించుకొని ప్రశ్నింపఁబడుచున్నది.

ప్రశ్న : జీవాత్మయని చెప్పనగును. ఎందుకనఁగా ?

"స విశ్వరూప స్త్రిగుణ స్త్రివర్త్మా - ప్రాణాధిపః సంచరతి
స్వకర్మభిః,
అంగుష్ఠమాత్రో రవితుల్యరూపః- సంకల్పాహంకార
సమన్వితో యః."

"విశ్వమునందలి దేవ మనుష్యాది రూపములను వరుసగా పొందువాడగుటచే విశ్వరూపుఁడనియు సత్త్వరజస్తమోగుణముల నధిష్ఠించి యుండువాడగుటఁజేసి త్రిగుణుఁడనియు స్వర్గ మర్త్య పాతాళములందు సంచరించువాడగుటవలన త్రివర్త్మ యనియు ప్రాణవాయువు నింద్రియములను నియమించు కతన ప్రాణాధిపుఁడనియు పేర్కొనఁబడు జీవాత్మ - స్వకృతకర్మవశమున ననేక జన్మలఁ బొందుచుండువాడు. మరియు బొటన వ్రేలంతవాడై సూర్యుఁడాకసమున వలె స్వదేహమునందుఁ బ్రకాశించుచు సంకల్పముతోడ నహంకారముతోడను ప్రవర్తించు వాడు.''

ఈ వాక్యమునందు జీవాత్మ యంగుష్ఠమాత్రుఁడని ప్రసిద్ధము గదా! "మధ్య ఆత్మని" అనుచో దేహమునడుమ నుండువాడని యర్థము గావున పరమేశ్వరుఁడు సర్వవ్యాపకుఁడగుటఁజేసి పరిచ్ఛిన్నమగు అంగుష్ఠ మాత్రత్వము (పరమాత్మకు) పొసగకుండును గదా ?

ఉత్తరము : ఇఁట నంగుష్ఠమాత్రుఁడు పరమేశ్వరుఁడే నని చెప్పుట సమంజసము. "ఈశానో భూతభవ్యస్య" అనుచో సర్వేశ్వరత్వ లక్షణము గల ఈశాన శబ్దము ప్రతిపాదింపఁబడినందున ''అంగుష్ఠమాత్ర" పదమును పరమాత్మ పరముగ నిరూపింపవలసియున్నది.

"సర్వైశ్వర్య సంపన్నః సర్వేశ్వరః శంభు రాకాశమధ్యే" ఇత్యాది శ్రుతి వాక్యములు శివునకు గల సర్వేశ్వరత్వ లింగమును సమర్థించుచున్నవి మఱియు భూతభవ్యశబ్దములతో నిర్వచింపఁబడు ప్రపంచము సంకుచితము కానిదగుటఁ జేసి అసంకుచితమైన జగమును శాసించు నధికారము పరమేశ్వరునకే ఉపపన్నం బగునది.

ఈశాన శబ్దము "ఈశ్వరః శర్వ ఈశానః" అను నిఘంటువాక్యముఁ బట్టి పరమేశ్వరునకు నభిధానశ్రుతిరూపమగునది.

"శాసించువాడు" అను యౌగికార్థము ననుసంధించు భూతభవ్యపదముం డుటఁజేసి ఈశానపదము శివపరము కాదనునెడ - శబ్దమును వినుటతోడనే స్ఫురించు శివపరమైన రూఢ్యర్థమును గ్రహించుట అనివార్యంబగునది.

భూతభవ్య జగమును శాసించుట యను లక్షణము "ఈశానో భూత భవ్యస్య" అను వాక్యముఁ దగు నర్థమును కనుగొనిన పిమ్మట బోధపడును గావున శబ్దశ్రవణమాత్రమున త్వరలో ప్రబోధమును కలిగించు ఈశాన శబ్దము వలననే ఇష్టార్థసిద్ధి యేర్పడునని సూత్రగతమైన ఏవకారము విశదపఱచుచున్నది.

ఇఁట శ్రీభాష్యకారులు :

"ఈశానో భూతభవ్యస్య" అను వాక్యమువలననే యని "శబ్దాదేవ" అను దానికి నర్థముఁ జెప్పినవారు, ''దేహేంద్రియాదులను నియమించు జీవుఁడు" అను నర్థమును నిరాకరించుటకు "భూత భవ్యస్య" అను పదము ప్రయోగింపఁబడిన దని వార యాశయము.

ఇదియు సరికాదు, ఎట్లనఁగా ?

భూతభవ్యశాసన లింగము ఈశాన శబ్దముకన్న దుర్బల మను నుద్దేశ ముతో "శబ్దాదేవ" అను ఏవకారమును సూత్రకారుఁడు నుపయోగించినవాడు.

ఈశాన శబ్దము వలననే యని చెప్పునెడ విష్ణుపరత్వము సమర్థనీయము కాజాలదని భావించి ఈశత్వముఁ జెప్పు శబ్దమువలన యని యౌగికార్థమును పరి గ్రహించిరి.

ఇట్లు శ్రీవారు శ్రమపడి చెప్పిన సందర్భము ఘట్టకుటీ ప్రభాత న్యాయ ముగ నీశానశబ్దవాచ్యుండగు పరమేశ్వరునే సమర్థించుచున్నయది.

ఏతత్సూత్రముఁ దక్క నితర సూత్రములలో బ్రహ్మమునకు విశేష నామదేయము లేమింజేసి ప్రకృత సూత్రములోని "ఈశాన" యను విశేషాభి ధానముతో మొత్తము మీమాంసయందలి "సత్" "ఆత్మ" "బ్రహ్మ" ఇత్యాది శబ్ద ములు ఛాగపశున్యాయమున శివపరములగునవి విశదమగుచున్నందున బ్రహ్మ మీమాంసా శాస్త్రము శివేతర దేవతలఁ బ్రతిపాదించునది కాదని తెలియునది.

అంగుష్ఠమాత్రత్వము పరమేశ్వరున కెట్లు పొసగు నను యాశంకకు సమాధానముముగ దిగువ సూత్రము నుదాహరించినవారు.

సూ. "హృద్యపేక్షయా తు మనుష్యాధికారత్వాత్" 1-3-24

వస్తుతః పరమేశ్వరుఁడు పరిచ్ఛేదము (కొలత) లేనివాడేయైనను మానవ హృదయము అంగుష్ఠమాత్ర మగుటఁజేసి పరమేశ్వరుఁడు నంగుష్ఠమాత్రుఁడని చెప్పఁబడినది. ఉపాసనాశాస్త్రము ముఖ్యముగా మానవులఁ గూర్చి విధింపఁబడినందున మానవ హృదయమంతటి స్వరూపమును పరమకరుణా సంపన్నుడగు పరమేశ్వరుఁడు మానవులు గావించు నుపాసనలు సిద్ధించుటకై - దాల్చువాడు.

గజ తురగాదుల హృదయము ఏకవిధ పరిమాణము లేనిదగుటచే మానవ హృదయము అంగుష్ఠమాత్ర మగుట చేతను పరమాత్మ యంగుష్ఠమాత్రుఁడని చెప్పఁబడెను.

బొటన వ్రేలుతో సరిదూగునది శివలింగ మగుటఁజేసి హృదయములోని దహరాకాశము లింగస్వరూపమగుట నుపాసకుల హృదయమున పరమేశ్వరుఁడు జ్యోతిర్లింగ స్వరూపముతో విరాజిల్లువాడని గ్రహించునది.

ఇయ్యది నిర్గుణబ్రహ్మవాదులకును విరుద్ధము. ఎట్లనఁగా? "ఈశాన" అను నభిధానము ఇందు విశదీకరింపఁబడుటచే లింగస్వరూపంబగునని నిరూపింపఁబడినందునను ఎట్టి నామరూపములు లేనట్టి నిర్గుణ బ్రహ్మమును పూర్వోక్త నామ రూపములు సమర్థించునవి కాజాలవు గదా!

## దేవాధికరణము

"ప్రమితాధికరణమున పరమేశ్వరోపాసనయందు మనుష్యులకు అధికారము కలదని "మనుష్యాధికారత్వాత్" అను సూత్రము వలన సూచింపఁబడినది గదా! ఐతే "తతో దేవా రుద్రం నాపశ్యన్, తే దేవా రుద్రం ధ్యాయంతి" అను నథర్వశిరోవాక్యమున తెలియఁబడు దేవతలు చేయు పరమేశ్వరోపాసన మెట్లు పొసగు" నను ఆశంకకు సమాధాన మీ సూత్రము.

సూ. "తదుపర్యపి బాదరాయణః సంభవాత్" 1-3-25

ప్రశ్న : కర్మాచరణము ననుసరించి ఆ యా రూపములను తాత్కాలికముగ పొందుచు సహజమైన ఒకానొక ఆకారము లేనివారగుటచే విగ్రహము గలవారే పూజాస్తోత్ర ధ్యానాదుల నొనర్చ నర్హులగుటఁజేసియు దేవతలకు శివోపాసనముఁజేయు సామర్థ్యము లేదని విశదమగునది. మఱియు దేవతల నివాసము శివపదంబు నొకటే యగుటచే వారు పరమేశ్వర స్థలమును కోరువారు కారు. ఇంతియే గాక నుపనయన సంస్కార పూర్వక వేదాధ్యయనము వారికి విధింపఁబడకుండుటవలన వేదముఁ జదువనిది వేదార్థమును విచారించుట పలనుపడదు గావున వేదార్థపరాపుర్య లేనిది వేదాంత శ్రవణము కూడదు గావునను (దేవతలకు) బ్రహ్మజ్ఞానము సంభవింపదు గదా! ఇత్యాది సందర్భము వలన వారికి బ్రహ్మోపాసనము నందధికారము లేదని యంగీకరింపవలయును కాదా?

ఉత్తరము : దేవతలును బ్రహ్మోపాసనమునందధికారము గలవారు. ఎట్లనఁగా? పరమేశ్వర పదప్రాప్తి యనఁబడు మోక్షము నవ్వారికిని కావలసినదేను; ఉభయుల నివాసమొక్కటి కాజాలదు. స్వర్గశబ్దము సుఖవాచకంబైనను ప్రకరణవశమున విశేషార్థమును తెలుపునది.

పరబ్రహ్మంబగు శివుని స్థానమైతేనో పునరావృత్తి రహితము నిరతిశయము నగు సుఖము స్వరూపముగ కలది యగును. తారతమ్యము అవధి మున్నగు వికారములతో కూడిన సుఖము గల స్థలమున నుండు దేవతలు - అనవధికము అనుత్తమము నగు పరమేశ్వర స్థానమును కోరుట సహజము గదా! దేవతలకు వేదార్థము వేదాధ్యయన మవసరము లేకయే స్ఫురించునది అథవా పూర్వజన్మమున చదువఁబడిన వేదముఁదగు నర్థమును విస్మరింపని వారగుటచే శివోపాసనమునకు వలయు పాండిత్యము కలిగినవారు దేవతలని చెప్పవలెను. మఱియు శాస్త్రము దేవతామానవ సాధారణముగ బ్రహ్మోపాసనమును విధించునట్టిది కావున దేవలతకును పరమేశ్వరోపాసనయందధికారము గలదని తేటపడుచున్నయది.

సూ. "విరోధః కర్మణీతి చేన్న, అనేక
ప్రతిపత్తే ర్దర్శనాత్" 1-3-26

ప్రశ్న : అనేక ప్రదేశములందు నొకే సమయమున గావింపఁబడు యజ్ఞయాగాది సత్కర్మలలో నాహ్వానింపఁబడు దేవతలకు ఒకానొక విగ్రహము కల

దని యంగీకరించునెడ నవ్వారికి సర్వత్ర నొకే తడవ యజ్ఞాది సన్నిధి సరిపడని దగుటచే కర్మాచరణమున విరోధము ఏర్పడును గదా?

ఉత్తరము : సౌభరి మున్నగువారు విగ్రహము కలవారైన నేక కాలమున ననేక ప్రదేశములందు ప్రవేశించుట సుప్రసిద్ధము. మఱియు బ్రహ్మాది దేవతలు శరీరేంద్రియాదులు కలవారై ఆయా స్థానములందు భోగ భేదములతో నివసింతురని వేదమూలకములగు పురాణేతిహాసములందు విశదీకరింపఁబడినది.

ఇందుకు మహాభారత వచనము తార్కాణముగ తెలియఁదగినది.

శ్లో॥ ఆత్మనో వై శరీరాణి - బహూని మనుజేశ్వర ।
యోగే కుర్యా ద్బలం ప్రాప్య - తైశ్చ సర్వాం మహీం చరేత్॥

"యోగిపురుషుఁడు యోగబలమున బహుశరీరములలో ప్రవేశించి సమస్త భూమండలమును సంచరించువాడు."

సూ. "శబ్ద ఇతి చే న్నాతః ప్రభవాత్
ప్రత్యక్షానుమానాభ్యామ్" 1-3-27

ప్రశ్న : మీరు చెప్పినట్లు కర్మవిరోధము లేకున్నను ఇంద్రాది వైదిక శబ్దమునకు విరోధము సంభవించును. ఎట్లనఁగా? దేవతలు విగ్రహము గలవారని యంగీకరించునెడ నవయవములు కలిగియుందురని చెప్పవలసివచ్చును. అట్టితఱి "ఏద్ది సావయవమో అద్ది యనిత్యము" అను నియమము ననుసరించి దేవతల శరీరములు నిత్యములు కాజాలవని బోధపడును. కావున జనన మరణాదులు నవ్వారికి ననివార్యములగుచున్నయవి. ఐతే దేవతలు జన్మించుటకు ముందు మరణించిన తరువాతను ఇంద్రాది వైదికశబ్దములు సార్థకములు కాకుండును. అథవా అనిత్యములని చెప్పవలసివచ్చును. పౌరుషేయములు గూడ నగును. పౌరుషేయములని యంగీకరించునెడ విధి నిషేధ వాక్యములు ప్రమాణములు కాజాలవు. ఇట్టి వాక్యములందు చెప్పఁబడిన సత్కర్మలున్ను ఫలప్రదములు కాకుండును.

ఇత్యాది సందర్భము ననుసరించి వైదికశబ్ద విరోధములను పోనాడుటకై దేవతలు విగ్రహము లేనివారనియే నిరూపింపవలసియుండును కాదా?

ఉత్తరము : ఇంద్రాది వైదికశబ్దములు వ్యక్తివాచకము లగునెడ మీరు చెప్పినట్లు అర్థరాహిత్యము అనిత్యత్వాదులును చేకూరునని మేము నంగీకరింతుము. గవాదిశబ్దములవలె నింద్రాదిశబ్దములును తత్తదాకారములను మాత్రము చెప్పునట్టివి. మఱియు వేదప్రోక్తములగు ఇంద్రాది శబ్దముల యుచ్చారణమాత్రమున నింద్రాది వ్యక్తులు సృజింపఁబడువారు.

కుమ్మరి తనలో స్ఫురించు ఘటాది శబ్దముల వలన ఘటాద్యాకారములను స్మరించి ఘటాదులను నిర్మించునట్లు బ్రహ్మదేవుఁడును పూర్వ కల్పములందు ఇంద్రాది దేవతలు నశింపగా పిమ్మట కల్పాదులలో వైదిక ఇంద్రాది శబ్దముల వలన తత్తదాకార విశేషములను భావించి మరియొక ఇంద్రాది దేవతలను పుట్టించువాడు. కావున ఇంద్రాది వ్యక్తులు నశించినను ఇంద్రాద్యాకారములు నశింపనందున తత్తద్వాచక శబ్దములన్నియు నిత్యములగునవి. ఇందువలన వైదికశబ్దమునకు ఎట్టి విరోధంబు గానరాదని తెలియునది. ఏతన్నిర్వచనమునకు దిగువ శ్రుతి స్మృతులు ప్రమాణములగుచున్నయవి.

"వేదేన రూపే వ్యాకరోత్, సతా- సతీ ప్రజాపతి స్స భూరితి వ్యాహరత్స భూమి మసృజత" శ్రుతివాక్యము.

"చతుర్ముఖుఁడు వేదగత శబ్దములతో వ్యక్తులఁ దెలుపు నామరూపముల నేర్పఱచెను. ఎట్లనఁగా? ప్రజాపతి ''భూః" అని యుచ్చరించుట తోడనే భూమిని పుట్టింపఁగలిగెను."

శ్లో॥ సర్వేషాం చ స నామాని - కర్మాణి చ పృథక్ పృథక్,
వేదశబ్దేభ్య ఏవాదౌ - పృథక్ సంస్థాశ్చ నిర్మమే॥

"ప్రజాపతి - వేదగతములైన శబ్దములనుండియే దేవ మానవాది వ్యక్తులకుఁ దగు నామరూపములను వేరు వేరు కర్తవ్యములను నివాసములను నిర్మింపఁ గలిగినవాడయ్యెను."

సూ. "అత ఏవ చ నిత్యత్వమ్" 1-3-28

ప్రశ్న : వేదము నిత్యము అపౌరుషేయంబగునేని విశ్వామిత్రుడు మున్నగువారు మంత్రద్రష్టలని చెప్పుట పొసగదు గదా!

ఉత్తరము : బ్రహ్మదేవుఁడు - పూర్వకల్పములందు నశించిన విశ్వామిత్రాదుల యాకృతి విశేషములను వైదికశబ్దాధారముగా స్మరించి తాదృశ స్వరూపములు గల విశ్వామిత్రాదులను శక్తివిశేషములతో కూడినవారిగ ప్రకృత కల్పములందు పుట్టించువాడు. కావుననే విశ్వామిత్రాది మహర్షులు గురుసన్నిధిని వేదాధ్యయనము లేకయే సర్వమంత్రములఁ జదువువారగుదురు. ఇట్టితఱి విశ్వామిత్రాదులు మంత్రద్రష్టలని చెప్పుట సమంజసంబగును. మరియు వేదనిత్యత్వాదులకు ఎట్టి భంగమున్ను చేకూరఁజాలదు.

సూ. "సమాన నామరూపత్వా చ్చావృత్తా వప్యవిరోధో
దర్శనా త్స్మృతేశ్చ" 1-3-29

ప్రశ్న : మహాప్రళయమున వేదము బ్రహ్మాదిదేవతలున్ను నశింతురు. గావున ఇంద్రాది వైదిక శబ్దములు నిత్యములెట్లగును?

ఉత్తరము : ప్రకృత సృష్టియందు దేవమానవాది విశేషవ్యక్తులు పూర్వసృష్టిలోగల నామరూపములతో సమానములగు నామరూపములు కలిగియుందురు. అందువలన వేదనిత్యత్వవిరోధ మేమియు లేదు. ఎట్లనఁగా? సర్వజ్ఞుఁడు, సర్వశక్తిమంతుఁడు, విద్యాధిపతి, ఆదికర్తయు నగు పరమేశ్వరుఁడు - పూర్వ పూర్వ ప్రపంచమును స్మరించియే మరియొక ప్రపంచమును నిర్మించువాడు, మరియు వేదములఁగూడ పూర్వరచనానుకూల ప్రగతి యుండునట్లు పుత్రకల్పుఁడగు చతుర్ముఖున కుపదేశించువాడు.

ఇందుకు ప్రమాణములు.

"సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్,
దివంచ పృథివీం చాంతరిక్ష మథో సువః" శ్రు.

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం — యో వై వేదాంశ్చ
ప్రహిణోతి తస్మై" శ్రు.

శ్లో॥ అపఏవ ససర్జాదౌ — తాసు వీర్య మవాసృజత్,
తదండ మభవ ద్ధైమం - సహస్రాంశు సమప్రభమ్ ॥

తస్మిన్ జజ్ఞే స్వయం బ్రహ్మ - సర్వలోక పితామహః,
బ్రహ్మాణం విదధే పూర్వం - వేదా నస్మై ప్రయచ్ఛతి॥ స్మృతి.

ఇత్యాద్యుపపత్తి వలన ప్రాకృత ప్రళయానంతర సృష్టియందును వేద నిత్యత్వము భంగపడుట లేదని విశదమైనది.

సూ. "మధ్వాదిష్వసంభవా దనధికారం జైమినిః" 1-3-30

సూ. "జ్యోతిషి భావాచ్చ" 1-3-31

మధువిద్య మున్నగువానియందు వస్వాదిదేవతలు ఉపాస్యులై ప్రాప్యులగుటఁజేసి దేవతలకిట్టి యుపాసనలయందు అధికారము లేదనియు "జ్యోతిషి" అనఁగా బ్రహ్మోపాసనయందు మాత్రము అధికారము గలదనియు జైమిని మహర్షిగారి యభిప్రాయము.

ఇఁక స్వమతము నీ క్రింది సూత్రముతో చెప్పుచున్నవారు.

సూ. "భావం తు బాదరాయణోఽస్తి హి" 1-3-32

మధువిద్యాదులందును వస్వాదిదేవతలకు నధికారము గలదని వేదవ్యాసుఁడు నిర్వచించెను. ఎట్లనఁగా? వస్వాది దేవతలు వస్వాది దేవతాంతర్యామి యగు బ్రహ్మము నుపాసించుట యుక్తమగునది. మరియొక కల్పమునందు వస్వాది దేవతారూపము లభించుట తదుపాసనమునకు ఫలంబగునని గుర్తెరుగవలెను.

"అసౌ వా ఆదిత్యో దేవమధు" అను వాక్యము మొదలుకొని ఆదిత్య వస్వాది నామరూప కృత్యములు గల బ్రహ్మము ఉపాస్యంబని యుపదేశింపఁబడినది. తరువాత "తత్తదూర్ధ్వ ఉదేతి నైవోదితో వాస్తమేతి" ఇత్యాది వాక్యముతో నామరూప క్రియలు లేనట్టి సూక్ష్మంబు నగు బ్రహ్మము ధ్యేయంబని నిరూపింపఁబడినది. ఏతద్ద్వివిధోపాసనఫలము - కల్పాంతరమున వస్వాది దేవత్వప్రాప్తియు పిమ్మట బ్రహ్మప్రాప్తియు నగుచున్నది.

సహస్రచతుర్యుగ కాలము బ్రహ్మదేవుని దినమగును. మరియు నంతియే కాలము రాత్రియగును. అట్టితఱి స్వర్గమర్త్య పాతాళములు మాత్రము నశించును.

మహర్లోకాదులు నశింపవు. ఇట్లు చతుర్ముఖుని శత వర్షములు గడచిన పిమ్మట నగు నూరు వత్సరముల కాలము ప్రాకృత ప్రళయమనఁబడును. ప్రాకృత ప్రళయమున ప్రకృతిమాత్రము శేషించును. బ్రహ్మదేవుని దైనిక ప్రళయమున వేదములు లోపింపవు. కాని ప్రాకృత ప్రళయమున – వేదములు, బ్రహ్మాండము, బ్రహ్మదేవుఁడును లోపించినను వేదపూర్వస్థితి ననుసరించి స్మృతి – పరమేశ్వరున కుండుటఁజేసి వేదనిత్యత్వమున కెప్పుడును భంగమును చెప్పరాదని సారాంశము.

## అపశూద్రాధికరణము

"హృద్యపేక్షయా తు మనుష్యాధికారత్వాత్" అను సూత్రమున మనుష్యులకు బ్రహ్మోపాసనమందు సాధారణముగ అధికారము కలదని యేర్పడగా వారిలో విశేషము నీ సూత్రముతో చెప్పుచున్నవారు.

సూ. "శుగస్య తదనాదర శ్రవణా త్తదాద్రవణాత్
సూచ్యతే హి" 1-3-33

ఈ సూత్రమును నిర్వచించుటకై ఛాందోగ్యమునందొక యాఖ్యాయికను గాననగును. ఎట్లనఁగా? జానశ్రుతి యనఁబడు క్షత్రియ మహారాజు – స్వరాష్ట్రమున గ్రామములలో నగరములందును మార్గములలో నడవులయందును పుణ్యతీర్థములయందు నన్యప్రదేశములందంతటను బాటసారులకు ననాథులకును శీతోష్ణాదిబాధలు తగ్గుటకు వస్త్రముల నన్నోదకములను లభింపఁజేయుటకై యనేక భవనములను కట్టించెను. ఇవ్విధము కర్మయోగముతో దురితక్షయముఁ గాంచిన జానశ్రుతికి బ్రహ్మజిజ్ఞాస కలుగవలెనని మహర్షులు కొందరు హంసరూపములఁ దాల్చి మహారాజు నిద్రించు రాత్రివేళ మేడలోనికేతెంచి క్రిందివిధము సంభాషించిరి.

అందు మొదటి హంసను రెండవ హంస "భల్లాక్షమా?" అని సంబోధించి "ఈ జానశ్రుతి గావించిన అన్నదానాదిపుణ్యముల ప్రభావము స్వర్గపర్యంతము వ్యాపించినది. అట్టి పుణ్యఫలమునందు నీకు నపేక్ష కలిగెనేని దహించి పోవుదువు" అనఁగా- మొదటిహంస "ఈ మహారాజు రైక్వమహర్షి వలె గొప్ప ప్రభావము

గలవాడని భావింతువా? నిజముగా రైక్వుఁడే బ్రహ్మజ్ఞుఁడగువాడు. మానవ సామాన్యస్థితి నతిక్రమించి బండిపై సంచరించుచుండును. జానశ్రుతి యైతేనో సుకృతి కాని బ్రహ్మజ్ఞుఁడు కాడు గదా! అందువలన నీతని మహిమ రైక్వుని ప్రతిభ వలె దహించునది కాదు" అని సంభాషించెను.

రెండవ హంస - ఎవఁడా రైక్వుఁడు? ఎట్టివాడు?

మొదటి హంస - ప్రాణులందరి సుకృతములు నవ్వారి విజ్ఞానంబు నెవని కర్మసముచ్చితమగు జ్ఞానములో చేరునో నట్టి మహానుభావుఁడే రైక్వుఁడనబడును. ఈతని జ్ఞానప్రభావము సహింపరానిది కాని యీ అకించనుఁడగు జానశ్రుతియొక్క మహిమ శ్రేష్ఠము కాజాలదు.

ఇట్లు వక్కాణించి మహర్షులు సౌధమునుండి వెడలగా నద్దానినంతయు నాకర్ణించిన జానశ్రుతి యా రాత్రి నతికష్టముగా గడిపి యొకానొక రాజభటునకు రైక్వ లక్షణములఁ దెలిపి యాతని తోడ్కొని రమ్మనెను.

ఒకానొకచో తన మేను గోకుచు బండిక్రింద నుండు రైక్వునిఁగాంచి యాతని పలుకరింపఁజాలని రాజదూత రాజసన్నిధినేతెంచి రైక్వుని సమాచారము నెఱిగింపగా రాజు స్వయముగ బయలుదేరి రైక్వునిఁజేరి యిట్లు ప్రార్థించెను.

"ఆరువందల ఆవులను కంఠహారమును వడిగల గుఱ్ఱములతో కూడిన రథమును తమకు సమర్పించెదను. నాయందనుగ్రహము గలవారై తమ యుపాస్య దేవతను గురించియే ఉపాసానాపద్ధతి నుపదేశింపుడు!"

రైక్వుడు - ఈ హారము రథము గోవులును నీకే యుండుగాత! ఇట్టి యల్పధనముతో సంతృప్తిఁబడయజాలను. మఱియు గృహస్థుడను కాకుండుటఁ జేసి యవ్వానిని కాపాడుటకు వలయు సౌకర్యము లేకున్నయది. స్వార్థమునకై నరిపడని ధనము నర్పింపఁజూచు నీకు బ్రహ్మవిద్యా నిష్ఠ యేర్పడునది కాదు.

జానశ్రుతి - గోసహస్రంబును కంఠహారాదులను వివాహమునకై కన్యను నివసించుటకై గ్రామమును సమర్పించెదను కావున నన్ననుగ్రహింపుడు!

రైక్వుఁడు -జానశ్రుతే! నీ చెప్పినవన్నియు తీసికొని రమ్ము! ఏతత్సమర్పణముద్వారా నన్ను బ్రహ్మవిద్యోపదేశాభిముఖుని గావించితివి! ధన్యుడవైతివి;

ఋషులు- హంసరూపముతో గావించిన స్వనింద నాకర్ణించిన జానశ్రుతికి శుక్ - అనగా దుఃఖము కలిగినందున రైక్వుని గురించి యాద్రవణము (వడి వడిగా బయలుదేరుట) సంభవించుటచే జానశ్రుతి మహారాజును రైక్వుఁడు "శూద్ర" యని సంబోధింపవలసివచ్చెను. కాని జాతిఁ బురస్కరించుకొని కాదు. ఐతే శూద్రులు ఉపనయన సంస్కారము లేని వారగుటచే వారికి వేదాధ్యయనాధికారము గానరానందున బ్రహ్మోపాసనమునకు వలయు బ్రహ్మగుణ పరిజ్ఞానము లేకుండును. పురాణేతిహాసములైతేనో వేదోపబృంహణములగుటచే వేదముద్వారా బ్రహ్మజ్ఞాన సాధనములగునట్టివి. శూద్రులకు పురాణ శ్రవణమువలన కలుగు జ్ఞానము పాపక్షయమును మాత్రము గావించును. విదురుఁడు ధర్మవ్యాధుఁడు మొదలగువారు బ్రహ్మనిష్ఠులెట్లైరనఁగా? అవ్వారికి పూర్వజన్మలందేర్పడిన విజ్ఞానము నిండుగ నుండుటచే బ్రహ్మోపాసనార్హత కలిగియుండిరని తెలియవలెను.

సూ. "క్షత్రియత్వావగతేశ్చ" 1-3-34

ఇఁట జానశ్రుతి మహారాజు - క్షత్రియుఁడని విదితమగును. ఎట్లనఁగా? రైక్వజానశ్రుతుల సంవాదము ప్రారంభమైనపుడు - జానశ్రుతి పౌత్రాయణుఁడని పేర్కొనఁబడినది. "జనశ్రుతి మహారాజు కుమారుఁడు జానశ్రుతి యనఁబడుననియు పుత్రుఁడనఁబఱగువాని గోత్రమునందు జన్మించినవాడు పౌత్రాయణుఁడగుననియు" నిర్వచనము.

యాచకులకు విరివిగా అన్నవస్త్రాదుల నొసగుటయు వసతిగృహములను నిర్మింపఁజేయుటయు రైక్వమహర్షికి కన్యా గ్రామ రథాశ్వ గజములను సమర్పించుటయు అంతఃపుర రక్షకుఁడగు క్షత్తయనువానిఁబిలచుటయు క్షత్రియుని లక్షణములని గమనింపవలెను.

సూ. "ఉత్తరత్ర చైత్రరథేన లింగాత్" 1-3-35

సంవర్గ విద్యయందు రైక్వజానశ్రుతి సంవాదానంతర సందర్భమున బ్రాహ్మణ క్షత్రియులకు సంబంధము కనఁబడుచున్నయది. ఎట్లనఁగా? అభిప్రతారి యనఁబడు చైత్రరథుఁడు కాపేయుఁడను బ్రాహ్మణుని యాజకునిగ నెన్నుకొనెను. చిత్రరథ వంశీయులైన రాజులకు కాపేయులను బ్రాహ్మణులు పరంపరగా యాజకులైరని శ్రుతియందు గమనింపనగును.

ఇందువలన రైక్వుఁడు బ్రాహ్మణుఁడనియు జానశ్రుతి క్షత్రియుఁడనియు వీరికి గురుశిష్య సంబంధము సమంజసంబగుననియు "శూద్ర" యని సంబోధింపఁబడిన మాత్రమున జానశ్రుతి శూద్రుఁడు కాజాలడనియు సారాంశము.

సూ. "సంస్కార పరామర్శాత్తదభావాభిలాపాచ్చ" 1-3-36

ఇద్దానికి ఛాందోగ్యమున గల కథానిక నుదాహరణముగ గ్రహింపనగును. సత్యకాముడు అనువానికి తండ్రి పిన్నతనముననే గతించినందున తన గోత్ర మేమిటో తెలిసికొనవలెనని కోర్కె యుదయింపగా నొకప్పుడు గురుకులవాస మును గావింపఁదలచి "అమ్మా! మన గోత్రమెద్ది" అని ప్రశ్నించెను.

అట్టితఱి వాని తల్లి "నాయనా! చిన్నదాననై యున్నపుడు పతిపరిచర్యఁ జేయుచు యువతినై యున్నపుడు పతి యనుగ్రహమున నిన్నుఁ బడసితిని. కావున మన గోత్రము నడుగుటకు వలయు నవకాశము నీ మధ్య లభింపలేదు. నాపేరు జాబాల యందురు. ఐతే గురుసన్నిధి కేగినపుడు నేను సత్యకాముడను జాబాలుడనని వచింపుము!" అనఁగా సత్యకాముఁడు బయలుదేరి గౌతముఁడను మహానుభావు నాశ్రయించి యిట్లు ప్రార్థించెను.

"పూజ్యులైన తమ సన్నిధిని బ్రహ్మచర్యాశ్రమమును గడుపువాడను"

"నీ గోత్రమెద్ది" యని గౌతముఁడు ప్రశ్నింపగా "నా తల్లిగూడ చెప్పనందున గోత్రము నాకు తెలియలేదు. ఆమె జాబాలయని పేర్కొనఁబడుచున్నయది" అని సత్యకాముఁడు వచింపగా గౌతముఁడు "వీడు యథార్థమును చెప్పుచున్నందున బ్రాహ్మణుఁడే కావచ్చు"నని నిశ్చయించి సత్యకామునకు నుపనయనసంస్కారముఁ గావించి తన గోసమూహములో కృశించియున్న నాల్గునూర్ల ఆవులను కాపాడుచుండు" మని యాజ్ఞాపించెను. అప్పుడు సత్యకాముఁడు గురునాజ్ఞ శిరసా వహించి నాల్గునూర్ల ఆవులు వేయియగువరకు తమ సన్నిధికి రానని ప్రతిజ్ఞఁజేసి సమృద్ధమగు ఒకానొక యరణ్యమునకు నవ్వానిఁ గొంపోయి పోషించుచు కొన్ని వత్సరములఁ గడుపగా సత్యకాముని గురుశుశ్రూషవలన సంతసించిన నలుగురు దేవతలు - ఋషభ, అగ్ని, హంస మద్గు - అనువారు సత్యకామునకు సాక్షాత్కరించి పదునారు కళలతో నిండియుండు బ్రహ్మవిద్య నుపదేశించిరి. తరువాత సత్య కాముఁడు వేయి ఆవులఁ గైకొని గౌతముని సమీపింపగా గౌతముఁడు సత్య

కాముని ముఖవైఖరిఁ గమనించి "ఎవరు నీకు బ్రహ్మవిద్య నుపదేశించి" రని ప్రశ్నించెను. "దేవతలు ప్రసన్నులై నాకు బ్రహ్మవిద్య నుపదేశించిరి. కాని యంతమాత్రమున సంతృప్తిఁజెందువాడను కాను. తాము మరల ననుగ్రహింపు" దని ప్రార్థింపగా గౌతముఁడు దేవతలు చెప్పినట్లుగానే షోడశకళా సమన్వితముగ బ్రహ్మవిద్య నుపదేశించిన వాడు''.

ఈ సందర్భమున నుపనయన సంస్కారము పరామర్శింపఁబడుటవలన "న శూద్రే పాతకం కించి న్నచ సంస్కార మర్హతి" ''శూద్రునకు మాంస భక్షణాది దోషములేదు గావున నాతడు ఉపనయనాది సంస్కారములఁ బొందవలసిన యవసరము గానరాదు" అను ప్రమాణమువలనను శూద్రునకు నుపనయన సంస్కారము లేనందున వేదాధ్యయనము తత్పూర్వక బ్రహ్మవిచారంబు ననర్హము లగుచున్నవి.

సూ. "తదభావ నిర్ధారణే చ ప్రవృత్తేః" 1-3-37

సత్యకాముఁడు యథార్థమును వచించినవాడు కావుననే శూద్రుఁడు కాడని నిశ్చయించి యుపనయనమును గౌతముఁడనుశాసించి బ్రహ్మవిద్యోపదేశమునఁ బ్రవృత్తుడయ్యెను.

ప్రశ్న: శిశువునకు నుపనయనము లేకున్నను వేదాధ్యయన నిషేధము వికల్పితమా? నిర్ధారితమా? "న బ్రహ్మాభివ్యాహరే దన్యత్ర స్వధానినయనాత్" "పితృమేధమునందు దక్క నితరకర్మలందు ననుపనీతుఁడు వేదము నుచ్చరింప రాదు" అను ప్రమాణము ననుసరించి వికల్పితంబని తెలియును గదా! అందువలన శూద్రునకు ననుపనీతునకు పాక యజ్ఞాదులందు వేదోచ్చారణము నిషేధింపఁబడుచున్నది. కాని బ్రహ్మవిద్యోపయుక్త మహావాక్యాది శ్రవణమునఁగాదని యంగీకరింప వలెను గాదా?

ఉత్తరము:

సూ. ''శ్రవణాధ్యయనార్థ ప్రతిషేధాత్" 1-3-38

"తస్మా చ్ఛూద్ర సమీపే నాధ్యేతవ్యమ్'' అను ప్రమాణము శూద్రుని చెంత వేదముఁ జదువఁగూడదని తెలుపుచున్నందున వేదశ్రవణమునకుఁగూడ నధికారములేని శూద్రునకు వేదపఠనమునకు నధికార మెక్కడినుండి వచ్చును?

సూ. "స్మృతేశ్చ" 1-3-39

"అథహాస్య వేదముపశృణ్వత త్రపుజతుభ్యాం శ్రోత్రప్రతిపూరణ ముదాహరణే జిహ్వాచ్ఛేదో ధారణే శరీర భేదః"

"శూద్రుఁడు వేదమును వినినచో నవ్వాని చెవిని సీసము లక్క కఱిగించి పోయవలెను. వేదము నుచ్చరించిన యెడల నాలుకఁ గోయవలెను. హృదయమున కొంత నిలిపినచో శరీరవియోగమును గావింపవలెను" అను స్మృతి ప్రమాణము శూద్రునకు వేదాధ్యయనాదులను తొలగించినది. వేదపఠనాదులకు వలయు నర్హత లేమింజేసి వేదార్థమును విచారించుట యుక్తంబగుట లేదు. వేదార్థమును విచారింపనిది ధర్మాధర్మ నిర్ణయము కాదు గావున ధర్మానుష్ఠానము సంభవింపఁ జాలదు. ధర్మానుష్ఠానము లేనిది చిత్తశుద్ధి కలుగఁజాలనిదగుటచే వేదాంత విచారంబు ననుపయుక్తంబగునది.

## కంపనాధికరణము

సూ. "కంపనాత్" 1-3-40

ఇవ్విధము ప్రసంగవశమున బ్రహ్మవిద్యాధికారమును నిరూపించి ప్రకృతమగు శివతత్త్వముఁ గూర్చి వ్రాకుచ్చుచున్నవారు.

కఠవల్లియందు అంగుష్ఠ ప్రమితపురుష ప్రకరణమున "యదిదం కించ జగత్సర్వం ప్రాణ ఏజతి నిఃసృతమ్, తం మహద్భయం వజ్రముద్యతం, య ఏతద్విదు రమృతా స్తే భవంతి" "ఈ చరాచరమంతయు ప్రాణము నుండి బయట పడి జీవించుచున్నది. ప్రాణమువలన నగు భయము- ఎత్తఁబడిన వజ్రాయుధము వలె ప్రాణులనందరిని స్వకార్య తత్పరులఁ జేయుచుండును. ఇట్టి ప్రాణము నెవరు కనుగొందురో వారు ముక్తులగుదురు"

ఇఁట భయ పెట్టునది పరమేశ్వరుఁడా? ఇతరమా? అని సంశయము.

ప్రశ్న : సకలజగమున కభయము నొసగు మధురస్వభావము గలవాడు పరమకారుణికుఁడు నగు పరమేశ్వరుఁడు జగత్కంపన హేతువు కాజాలడు. ఇట వజ్రశబ్దము వినఁబడుటచే వజ్రాయుధము కంపనహేతువని చెప్పనగును.

అథవా ప్రాణవాయువు జగత్కంపనహేతువు కాదగును. ప్రాణవాయువు దేహ చలనమునకు కారణమగుటచే తత్ప్రయుక్తముగ నీ జగచ్ఛరీరమంతయు కదలుచుండును. మరియు వాయువు ముందుగా నేర్పడు మెఱపు తరువాత నుపయోగింపఁబడు వజ్రాయుధము మహాభయకారణము కానగును. "వాయు రేవ వ్యష్టి ర్వాయు రేవ సమష్టి రప పునర్మృత్యుంజయతి య ఏవం వేద" అను శ్రుతి వాక్యంబు - వాయువిజ్ఞానము వలన నమృతత్వము చేకూరునని తెలుపుచున్నందున వాయువైనను జగచ్ఛాసకము కాదగును గదా?

ఉత్తరము : సకలజగత్కంపనహేతువు పరమేశ్వరుఁడేను; ఎందుకనఁగా? పరమేశ్వరుఁడు శాసకుఁడగుటచే నాతని శాసనభయమువలననే నిషిద్ధములను విడనాడి విహితముల నాచరించువార మగుదుము. వాయ్వాదులును పరమేశ్వరుని శాసనమువలన భయపడుచు తమతమ కర్తవ్యములను నెరవేర్చుచుందురు గదా! "భీషాఽస్మా ద్వాతః పవతే" ఇత్యాది శ్రుతివాక్యములిందుకు ప్రమాణము లగుచున్నయవి.

పరమేశ్వరుఁడు పరమకారుణికుఁడై కల్యాణమూర్తియైనను శాసకుడగుటఁజేసి భయకారణుఁడు నగువాడు. సకల జగదధికారియు పరమేశ్వరుఁడేను.

## జ్యోతిరధికరణము

సూ. ''జ్యోతి ర్దర్శనాత్'' 1-3-41

విషయవాక్యము - (ఛాందోగ్యము - ప్రజాపతి విద్య)

"ఏష సంప్రసాదోఽస్మా చ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతి రుప సంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే, స ఉత్తమః పురుషః"

ఈ జీవాత్మ - శివోపాసనాపూర్ణతను గాంచి కడపటి శరీరమునుండి బయలువెడలి పరమేశ్వరు నాశ్రయించి నిజరూపము నావిష్కరింపఁజేసికొనును. అట్టి పరంజ్యోతియే ఉత్తమ పురుషుఁ డనఁబఱగును."

ఇఁట ముక్తప్రాప్యమగు పరంజ్యోతి - పరమేశ్వరుఁడా మూర్త్యాత్మయగు నారాయణుఁడా! అని సందేహము.

ప్రశ్న: ఛాందోగ్యమున ప్రజాపతి విద్యయందు గల ఈ వాక్యమున పరంజ్యోతి పురుషోత్తమ శబ్దముచే నిర్దేశింపఁబడినది కావున ముక్తప్రాప్యుఁడు నారాయణుఁడే నని బోధపడును. మరియు భగవద్గీతలయందు "ద్వావిమౌ పురుషౌ లోకే - క్షర శ్చాక్షర ఏవ చ, క్షరః సర్వాణి భూతాని- కూటస్థోఽక్షర ఉచ్యతే" "జీవాత్మ- క్షరుఁడనియు, అక్షరుఁడనియు రెండు విధములు గలిగియుండువాడు. సంసారియగు సామాన్యప్రాణి - క్షరుఁడనఁబడును. సంసారబద్ధుఁడు కానివాడై ముక్తుఁడగువాడు-అక్షరుడనఁబడును" "ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః, యో లోకత్రయ మావిశ్య - బిభర్త్యవ్యయ ఈశ్వరః" "క్షరాక్షర పురుషులకన్న వేరగు నుత్తమ పురుషుఁడు పరమాత్మ యనఁబడును. ఇట్టి పరమేశ్వరుఁడు లోకత్రయమునఁ బ్రవేశించి జగమును వహించువాడు" "యస్మాత్ క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః, అతోఽస్మి లోకే వేదే చ-ప్రథితః పురుషోత్తమః" "ఎందువలన క్షరాక్షర పురుషుల నతిక్రమించినవాడనో అందువలన లోకమునందును వేదమునను పురుషోత్తముఁడనని ప్రసిద్ధుఁడనైతిని" ఇట్లు భగవానుఁడు ఉపదేశించెను. మఱియు "దేవకీనందనః శౌరిః - శ్రీపతిః పురుషోత్తమః" "హరిర్యత్రైకః పురుషోత్తమః స్మృతః - మహేశ్వర స్త్ర్యంబక ఏవ నాపరః" ఇత్యాదిని పురుషోత్తమ పదము విష్ణుపరముగ వ్యవహరింపఁబడుటను ముక్తప్రాప్యమగు పరంజ్యోతి నారయణుఁడే యగును కాదా?

ఉత్తరము : ఇట ముక్తప్రాప్యమగు పరంజ్యోతి - పరశివుఁడే యగుచున్నవాడు. ఎందుకనఁగా? పరశివప్రాప్తి యగువానికే పునరావృత్తి యుండజాలదని బహుప్రమాణములు చాటుచున్నయవి. తదితరుల నాశ్రయించువారికి పునర్జన్మాదులెట్లు లేకుండును? పురుషోత్తమ శబ్దము నారాయణునియందు పురుషులనఁబడు జీవాత్మలకన్న నధికుఁడను నర్థముతో రూఢి గలిగియున్నదని గ్రహింపవలెను. బ్రహ్మమేధమునందు "వేష్టితుం పురుషోత్తమమ్" అనుచో పురుషోత్తమశబ్దము పరమేశ్వర పరముగ నిరూపింపఁబడినది.

పురుషోత్తమ పద రూఢ్యర్థము - శివేతర ప్రాప్తివలన జన్మరాహిత్యము కలుగఁజాలదను నర్థమునకు విరుద్ధమగుటను జన్మరాహిత్యమును కలుగఁజేయు సామర్థ్యము నారాయణాది మూర్త్యాత్మలయందు లేకుండుటను పురుషోత్తమ పదమునకు యౌగికార్థమును పరబ్రహ్మ పరముగ నిర్ణయింపవలెను.

"అతోఽస్మి లోకే వేదే చ - ప్రథితః పురుషోత్తమః" అను గీతావాక్యముఁ దగు సమన్వయము - "ఊర్ధ్వమూల మధఃశాఖ- మశ్వత్థం ప్రాహు రవ్యయమ్" అను వచనముతో సంసారవృక్షమును పేర్కొని "తతః పదం తత్ పరిమార్గితవ్యం - యస్మిన్ గతా న నివర్తంతి భూయః" పునరావృత్తి లేకుండుటకై సర్వాతీతమగు పరబ్రహ్మము నుపాసింపవలెనని చెప్పియు "తమేవ చాద్యం పురుషం ప్రపద్యే" సర్వోత్తముఁడైన పురుషునే నేను ధ్యానించుచున్నాననియు భగవానుఁడగు శ్రీకృష్ణుఁడు వాక్రుచ్చినవాడు.

ఇట్లు ముముక్షువులకు శ్రీకృష్ణునకు నుపాస్యుడుగ చెప్పఁబడిన పరమ పురుషుడే క్షరాక్షరోభయాతీతుండగునని "ఉత్తమః పురుష స్త్వన్యః" అను శ్లోకముతో వర్ణింపఁబడినవాడు, ఇట్టి సందర్భము ననుసరించు "యస్మాత్ క్షర మతీతోఽహమ్" అను శ్లోకంబును పరశివు నెట్లు ప్రతిపాదింపకుండును?

భగవద్గీతలందు భగవానుఁడు "శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్" అను న్యాయము ననుసరించి యభేదభావనా దార్ఢ్యముతో పురుషోత్తముడుగ ప్రఖ్యాతిఁ బొందితినని చెప్పిన వాక్యము లోకమునందును వేదమునందున నుప పాదింపఁబడినది కావున ముక్తప్రాప్యమగు పరంజ్యోతి - పరమేశ్వరుఁడేను

## అర్థాంతరత్వాదివ్యపదేశాధికరణము

సూ. "ఆకాశోఽర్థాంతరత్వాది వ్యపదేశాత్" 1-3-42

"ఆకాశో హ వై నామ నామరూపయో ర్నిర్వహితా, తే యదంతరా తద్బ్రహ్మ, తదమృతం, స ఆత్మా" ఛాందోగ్యము.

ఇఁట చెప్పఁబడిన ఆకాశము - పరమేశ్వరుఁడా? ఆకాశమా? జీవాత్మయా అని సందేహము!

ప్రశ్న : ప్రాణులందరికి నవకాశమును కలుగఁజేయునదై నామరూపముల నేర్పఱచునట్టి యాకాశము ఇఁట ప్రతిపాదింపఁబడుచున్నదని చెప్పవలెను. అథవా "అనేన జీవేనాఽత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరణవాణి" అను ప్రమాణము ననుసరించి జగద్గతములైన నామరూపములను జీవాత్మద్వారా వ్యక్తపఱచువాడు పరమాత్మయని తెలియుటచే జీవాత్మయని యంగీకరింపనగును కాదా?

ఉత్తరము : ఇఁట ఆకాశ శబ్దముతో పరమేశ్వరుఁడే నామరూపముల నేర్పరచువాడుగ ప్రతిపాదింపఁబడుచున్నవాడు. ఎందుకనఁగా? అమృతత్వాదు

ళగు పరమేశ్వర ధర్మములు భూతాకాశమునకు సంభవింపఁజాలవు. జీవాత్మకు నమృతత్వాది ధర్మములు పొసగకుండును. కావున పరమేశ్వరుఁడే ఆకాశమగునని గ్రహింపవలెను.

"ఓయీ? తత్త్వమస్యాది వాక్యములయందు జీవేశ్వరులకు నైక్యము చెప్పఁబడుచున్నందున జీవునికన్న వేరు పరమాత్మ యని యంగీకరింపరాదు గదా'' అను నాశంకకు సమాధానము దిగువసూత్రము.

సూ. "సుషుప్త్యుత్క్రాంత్యో ర్భేదేన" 1-3-43

''ప్రాజ్ఞేనాఽఽత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేద నాంతరమ్"

''ప్రాజ్ఞేనాఽఽత్మనాఽన్వారూఢ ఉత్సృజన్ యాతి"

"గాఢనిద్రయందు పరమాత్మతో నేకీభవించువాడగుటచే నింద్రియ చేష్టితములను మనోవ్యాపారమును జీవాత్మ యెంతమాత్రము గురుతెఱుగఁజాలకుండును. మఱియు జీవుఁడు శరీరమును విడుచతఱి పరమాత్మచే నధిష్ఠింపఁబడినవాడై లోకాంతరములకు వెళ్ళును."

ఇవ్విధము సుషుప్తియందు ఉత్క్రాంతియందును జీవుఁడు - బాహ్యాంతర విషయజ్ఞానము లేనివాడగుటయు అట్టితఱిని పరమేశ్వరుఁడు జీవభిన్నుడుగా ప్రాజ్ఞశబ్దముచే చెప్పఁబడుటయు జీవేశ్వరాద్వైతమును సమర్థించుట లేదు. కావున పరమాత్మయే ఇఁట నాకాశమగును.

సూ. "పత్యాది శబ్దేభ్యః'' 1-3-44

''సర్వస్య వశీ సర్వస్యేశానః సర్వస్యాధిపతిః" ఇత్యాది వచస్సులను వినఁబడు పత్యాది శబ్దములవలన పరమాత్మ జీవభిన్నుడని బోధపడుచున్నయది. ఇట్లే "స న సాధునా కర్మణా భూయాన్ నో ఏవాసాధునా కనీయాన్ ఏష సర్వేశ్వర ఏష భూతాధిపతి రేష భూతపాలః" ఇత్యాది వాక్యములు - తరువాత నుపయుక్తములైయున్నవి. "పశూనాం పతయే వృక్షాణాం పతయే" ఇత్యాది వాక్యములవలనను పరమేశ్వరునకు జగదాధిపత్యము ప్రసిద్ధంబగుచున్నది. కాని జీవాత్మకెచటను గానరాదు కావున జీవభిన్నుండగు పరమేశ్వరుఁడే ఆకాశమనఁబఱగుచున్నవాడు.

ఇయ్యది ప్రథమాధ్యాయగత తృతీయపాదము.

శ్రీ పార్వతీరాజరాజేశ్వరాభ్యాం నమః

## శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్యకృత

# శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

[ఆంధ్రీకరణము]

## ప్రథమాధ్యాయగత చతుర్థపాదము

తృతీయపాదమున స్పష్టాస్పష్ట బ్రహ్మలక్షణములను ప్రతిపాదించు వాక్యములు పరామర్శింపఁబడినవి. ఇందు నస్పష్ట బ్రహ్మలక్షణములు గల వేదాంత వాక్యములు కొన్ని విచారింపఁబడుచున్నయవి.

సూ. "అనుమానిక మప్యేకేషా మితి చే న్న, శారీర రూపక విన్యస్త గృహీతేః, దర్శయతి చ" 1.4.1

కఠశాఖీయులు పఠించు సందర్భములో గల యవ్యక్తము సాంఖ్యుల ప్రధానము కాజాలదు. ఎందుకనఁగా? రథికుఁడు రథము మొదలగు రూపకములలో చేరు శరీరము అవ్యక్తమనఁబఱగును. శ్రుతియందు నిట్లే చెప్పఁబడినది యని సూత్రార్థము.

కఠశాఖీయుల పాఠము—

"ఇంద్రియేభ్యః పరా హ్యర్థా - అర్థేభ్యశ్చ పరం మనః,
మనసస్తు పరాబుద్ధి - ర్బుద్ధే రాత్మా మహాన్ పరః ।
మహతః పర మవ్యక్త - మవ్యక్తాత్ పురుషః పరః,
పురుషా న్నపరం కించిత్ - సా కాష్ఠా సా పరా గతిః॥

ఇఁట మహత్తునకన్న నతీతముగ చెప్పఁబడిన నవ్యక్తము కపిల తంత్రోక్తమగు ప్రధానమా? శరీరమా? అని సంశయము.

ప్రశ్న : ప్రధానమనఁదగును. ఎట్లనఁగా? ' 'మహత్తు అవ్యక్తము

పురుషుఁడు" అను పదములు సాంఖ్యశాస్త్రమునందే ప్రసిద్ధములైనవి. అవ్వానినే ఈ శ్రుతియందు పేర్కొనుటవలన పరమపురుషుని ప్రసక్తియే లేదని చెప్ప వచ్చును కావున సాంఖ్యప్రోక్తమగు ప్రధానమేగాని శరీరము కాజాలదు.

ఉత్తరము : ఈ సందర్భమునకంటెఁ బూర్వమునందు "ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు, బుద్ధింతు సారథిం విద్ధి - మనః ప్రగ్రహ మేవచ । ఇంద్రియాణి హయా నాహు - ర్విషయాం స్తేషు గోచరాన్" ఆత్మను రథికుని గాను శరీరమును రథముగాను బుద్ధిని సారథిగాను మనస్సును పగ్గముగాను ఇంద్రియములను గుఱ్ఱములుగాను విషయములను మార్గములుగాను గ్రహింపుము! వశీకరణమునకై రథికరథాది రూపకములను నిరూపించుతఱి పరిశిష్టమగు సూక్ష్మ శరీరము - అవ్యక్తశబ్దముతో గ్రహింపఁబడినది. ఇంద్రియములు మొదలుకొని పరపురుషునివరకు చెప్పఁబడిన తత్త్వములలో ఒకదానిని మరియొకదానియందు నియమింపవలెనను యభిప్రాయముతో "ఇంద్రియములకన్న శ్రేష్ఠములు విషయ ములు" అను క్రమము చెప్పఁబడినది.

ఏతదనంతరమున్ను శ్రుతియందు ప్రతిపాదింపఁబడిన యంశమును గానన నగును.

"యచ్ఛే ద్వాఙ్మనసీ ప్రాజ్ఞ - స్తద్యచ్ఛేత్ జ్ఞాన ఆత్మని,
జ్ఞాన మాత్మని మహతి - నియచ్ఛే త్తద్యచ్ఛే చ్ఛాంత ఆత్మని"

మనస్సునందు వాగాది ఇంద్రియములను విషయములనుండి మఱల్చి నియమింపవలెను. బుద్ధియందు మనస్సును ఆత్మయందు బుద్ధిని పరమాత్మలో ఆత్మను నిగ్రహింపవలెను. గుఱ్ఱములఁబోలు ఇంద్రియములకన్న మార్గసన్ని భములగు విషయములు ప్రబలములగునవి. జితేంద్రియుఁడును విషయములు దరి నుండునేని ఇంద్రియములను వశపఱచుకొనఁజాలడనియు మనస్సు చంచల మగునెడల విషయములు ఇంద్రియదూరములైన నుపయోగము లేదనియు బుద్ధి నిశ్చయాత్మకము కాదేని ప్రబలమైన మనస్సుగూడ ప్రయోజనకారి కాజాలదనియు సర్వంబు జీవేచ్ఛాధీన మగుటఁజేసి బుద్ధికంటె నతీతుఁడు జీవాత్మయనియు జీవుడు చేయు పురుషార్థప్రవృత్తులన్నియు శరీరము నాశ్రయించియుండుననియు పరమేశ్వ రుఁడు సర్వాంతర్యామియగుటఁజేసి ఇంద్రియ మనో బుద్ధ్యాత్మ శరీరముల కన్న నతీతుఁడగుననియు భావము.

ఓయీ? ప్రధాన మనఁగా అవ్యక్తమని ప్రసిద్ధము; ఇట శరీరమని యెట్లు చెప్పవలెనను యాశంకకు సమాధానము దిగువ సూత్రము.

సూ. "సూక్ష్మం తు తదర్హత్వాత్" 1-4-2

సూక్ష్మమనఁగా ప్రధానము. అద్దాని స్థూలరూపము శరీరమనఁదగును. అవ్యక్తమే కార్యరూపముగలది యగునపుడు శరీరమగునది. కావున నిట శరీరము అవ్యక్త శబ్దముతో చెప్పఁబడుచున్నదని భావము.

మరియొకరీతిని ప్రతిపాదించుచున్నవారు

సూ. "తదధీనత్వా దర్థవత్" 1-4-3

ఆత్మ శరీరాదులు పరమేశ్వరాధీనములగుటచే యుపాసన నెరవేరుటకు సార్థకములగుచున్నయవి. అంతర్యామియగు పరమాత్మ- ఆత్మాది సర్వంబును ప్రేరేపించువాడగుటఁజేసి యుపాసనోపాయములగు ఇంద్రియాదుల వశీకరణము నందు పరాకాష్ఠ యగువాడు, మరియు ప్రాప్యుడగుటవలన పరాగతి యగువాడున్నుః ఇందువలన నవ్యక్తము శరీరంబే యగుచున్నయది.

వశీకరింపఁదగినవాని కన్నిటికిని పరమేశ్వరుఁడు చివరి యవధి యగుట చేతను తదర్థము వశీకార్యముల నన్నిఁటిని పేర్కొనవలసివచ్చుటవలనను వశీ కార్యములలో ఒకానొక పదముతో శరీరమును నిరూపింపవలసియుండుట నవ్యక్త పదముతో శరీరము గ్రహింపబడియున్నది.

సూ. "జ్ఞేయత్వావచనాచ్చ" 1–4–4

ఇట ప్రధానము సాంఖ్యమగుచో జ్ఞేయత్వము చెప్పఁబడియుండెడిది. అవ్విధము లేనందున కపిలప్రోక్తమగు అవ్యక్తము కాజాలదని తెలియవలెను.

సూ. "వదతీతి చేన్న, ప్రాజ్ఞో హి ప్రకరణాత్" 1-4-5

"అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం - తథాఽరసం నిత్య
మగంధవచ్చ యత్,
అనాద్యనంతం మహతః పరం ధ్రువం - నిచాయ్య తం
మృత్యుముఖా త్ప్రముచ్యతే.

"శబ్దస్పర్శరూపములు లేనిదియు వినాశరహితమగునదియు రసశూన్యము నిత్యము గంధరహితము నగునదియు అద్యంతరహితము మహతః పరము శాశ్వతము నగు తత్త్వమును గుర్తెరుగునెడ సంసారబంధ విముక్తుఁడగును". అను మంత్రమున ప్రధానము జ్ఞేయముగ చెప్పఁబడినదనుట సమంజసము కాజాలదు. ఎందుకనఁగా? "యచ్ఛే ద్వాఙ్మనసీ ప్రాజ్ఞః" అను వాక్యము మొదలుకొని పరమేశ్వరుని ప్రకరణము గానంబడుచున్నందున నేతత్పూర్వము ప్రాజ్ఞుడే యుదాహరింపబడుటను గమనింపనగును. కావున నవ్యక్తము శరీరమే యగునది.

సూ. "త్రయాణా మేవ చైవ ముపన్యాసః ప్రశ్నశ్చ" 1-4-6

ఈ ప్రకరణమునందు-ఉపాస్య ఉపాసక ఉపాసనలనఁబడు మూడు జ్ఞేయములని మాత్రము చెప్పుటయు అవ్వానిఁగూర్చి ప్రశ్నించుటయు గమనింపఁదగినవి.

ఇందుకు నొక యుపాఖ్యానము గలదు.

వాజస్రవుఁడను మహర్షి - ఒకానొక యజ్ఞమును గావించి బ్రాహ్మణులకు ముదుసలి ఆవులను దక్షిణ నిచ్చుచుండగా తత్పుత్రుడగు నచికేతుఁడు అయోగ్యములగు యజ్ఞదక్షిణల నిచ్చుచున్నందున తన తండ్రి చేయు యజ్ఞము అనర్థహేతువగునని శంకించి "నాయనా? నన్నెవరికి నొసగుదు" వని పలుమారులు ప్రశ్నించినందున వాజస్రవుడు కోపగించి "నిన్ను మృత్యువునకు సమర్పింతు"నని చెప్పిన వచనము ననుసరించి "మృత్యులోకమునకు వెళ్ళి తద్ద్వారమున నుపవాసముతో మూడురాత్రులు పడియుండెను. అట్టితఱి మృత్యుదేవత ప్రవాసమునుండి యేతెంచి "బ్రాహ్మణుఁడు నిరాహారుడై ద్వారమునందు వేచియున్నవాడ"ని నచికేతునిఁగూర్చి భయపడినవాడై తచ్ఛాంతికొరకు మూడు వరముల నడుగుమని వక్కాణించెను.

అట్టితఱి నచికేతుఁడు దిగువ విధముగ మూడు వరముల నడిగినవాడు.

1. తన జనకునకు మంచి మనస్సు కలుగుటయు,

2. తనకు అగ్నివిద్య లభించుటయు,

3. "శరీరమునుండి యుత్క్రాంతిఁజెందిన జీవాత్మ యెట్టివాడు" అను ప్రశ్నకు సమాధానముఁ బడయుటయు.

పై వరములలో రెంటిని మృత్యుదేవత ప్రసాదించి మూడవవరము నిచ్చునపుడు "పరమాత్మతత్త్వము-ఐహికాముష్మిక ధర్మమునకంటెను అధర్మముకంటెను భూతభవిష్యద్వర్తమాన కాలమునకంటెను విలక్షణమైన స్వరూపము గలుగునది యనియు దేవతలకును తెలియరానట్టిదనియు ఇట్టి పరబ్రహ్మమును పొందుటకై ప్రణవాది మహామంత్రములతో పరమేశ్వరు నుపాసించి తదనుగ్రహమును తనపై ప్రసరింపఁ జేసికొనవలెననియు జీవాత్మ - ముక్తస్థితియందును పరబ్రహ్మముతో నైక్యము నొందక వేరు నుండుహాడనియు" వక్కాణించెను.

సూ. "మహద్వచ్చ" 1-4-7

''బుద్ధే రాత్మా మహాన్ పరః" అనుచో గల ఆత్మశబ్దముఁ దగు సాహచర్యమువలన మహచ్ఛబ్దముతో జీవాత్మ చెప్పఁబడువాడు. జీవుఁడు వస్తుతః అణువైనను ఇట "మహాన్" కాదగును కాని కపిలతంత్రసిద్ధమగు ప్రధానము కాజాలనట్లు నవ్యక్త శబ్దమునకు "శరీర" మను నర్థముఁ జెప్పుటయే సమంజసంబగునని సిద్ధాంతము.

## చమసవదధికరణము

"ఒకచో ప్రధానమే కారణముగ వినఁబడుచున్న"దను అశంకకు సమాధాన మీ యధికరణము.

సూ. "చమస వ దవిశేషాత్" 1-4-8

"అజా మేకాం లోహితశుక్ల కృష్ణాం-బహ్వీః ప్రజాః సృజమానాం సరూపాః,

అజో హ్యేకో జుషమాణోఽనుశేతే- జహాత్యేనాం భుక్తభోగా మజోఽన్యః" శ్వేతాశ్వతరము-

జన్మలేనిదగుటచే "అజ" యని చెప్పఁబడు ప్రకృతి యిట సాంఖ్యుల అభిమతమైనదియా ? మరి యొకటియా ? అని సందేహము.

ప్రశ్న : సాంఖ్యసిద్ధమగు ప్రకృతినే ఇట జగత్కారణముగ చెప్పవలసి.

యున్నది. ఎందుకనగా ? "అజాం" అను పదము- జన్మరాహిత్యమును, "బహ్వీః ప్రజాః సృజమానాం" అను వాక్యము- సర్వజగత్కారణత్వమును "లోహిత శుక్ల కృష్ణాం'' అనునది - రక్త శ్వేత కృష్ణ వర్ణములతో గుర్తింపఁబడు రజస్సత్వ తమోగుణముల సంబంధమును, చెప్పుచున్నవి గావున మరియొక ప్రకృతి జగత్కారణమగునని నిరూపింప నశక్యము గదా ?

ఉత్తరము : సాంఖ్యతంత్రోక్తమగు ప్రకృతి యిట జగత్కారణ మగునని చెప్పరాదు. జన్మరాహిత్య మాత్రమున సాంఖ్యప్రకృతియే అని భావింపఁజెల్లునా ? ''అర్వాక్ బిల శ్చమసః" ''క్రింది రంధ్రము గలది చమసము'' అనుచో విశేషము నిర్దేశింపఁబడనందున "ఇదం తచ్ఛిరః" అను వాక్యమువలన "చమసము శిరస్సు" అగునని గుర్తింపఁబడినట్లు శ్వేతాశ్వతరోపనిషత్ప్రతిపాదిత మైన ప్రకృతి- సర్వసాధారణమగునది యనియే విశదమైనది. అందువలన తంత్రప్రకృతిమాత్రము జగత్కారణము కాజాలదని భావము.

ఐతే ఇట చెప్పఁబడిన ప్రకృతి యెట్టిది ? అను ఆశంకకు నుత్తరము దిగువ సూత్రము.

సూ. "జ్యోతిరుపక్రమాత్తు తథా హ్యధీయత ఏకే'' 1-4-9

జ్యోతియనఁగా పరమేశ్వరుఁడు, ఉపక్రమమనఁగా కారణము, పరమేశ్వరుఁడు కారణముగా గల ప్రకృతి — యిట నిరూపింపఁదగినది. ఎందుకనఁగా ? తైత్తిరీయశాఖవారు- పరమేశ్వరాశ్రయయగు ప్రకృతి గల మంత్రములను దిగువ విధము చదువుచున్నవారు. ఎట్లనఁగా ?

"అణో రణీయాన్, మహతో మహీయాన్" అను వాక్యముతో పరమేశ్వరుని ప్రశంసించి "సప్త ప్రాణాః ప్రభవంతి తస్మాత్" ఇత్యాదిని ప్రాణవాయువు ఇంద్రియములు అంతఃకరణము మొదలగు ప్రపంచము - పరమేశ్వరునివలన నావిర్భవించునదగుటచే ప్రకృత్యాది సర్వంబును పరమేశ్వరాత్మక మగునని నిరూపించుతటి "అజామ్" అను మంత్రము పఠింపఁబడినది. కావున "తంత్రసిద్ధ ప్రకృతి కాజాల" దను వాదము సమంజసంబైనది.

ఓయీ ? మీ ప్రకృతి- పరమేశ్వరకారణిక యగునెడ పరమేశ్వరుని కార్యమగు గదా ! అట్టితఱి "అజ" యను పదము ఎట్లు ఉపయుక్తంబగునను ప్రశ్నకు సమాధాన మీ సూత్రము.

సూ. "కల్పనోపదేశాచ్చ మధ్వాది వదవిరోధః" 1-4-10

కల్పన యనఁగా సృష్టియగును.

"ఛందాంసి యజ్ఞాః క్రతవో వ్రతాని - భూతం భవ్యం యచ్చ వేదా వదంతి,
అస్మా న్మాయీ సృజతే విశ్వమేతత్ - తస్మిం శ్చాన్యో మాయయా సన్నిరుద్ధః"

"ఛందస్సులు, యజ్ఞములు, యాగములు, వ్రతములు, భూత భవిష్య ద్వర్తమాన కాలకృత్యములు, మరియు వేదములు చెప్పుచున్న ప్రపంచమంతయు పరమేశ్వరు నాశ్రయించియుండు మాయనుండి యావిర్భవించునది. జీవాత్మయైతేనో మాయచే కట్టుబడినవాడై సంసారి యగువాడు "

"మాయాం తు ప్రకృతిం విద్యా-న్మాయినం తు మహేశ్వరమ్"

"ప్రకృతి- మాయయనియు, మహేశ్వరుఁడు మాయ నధిష్ఠించి యుండు వాడనియు గురుతెఱుగవలెను."

ఈ రెండు మంత్రములయందు మాయ - అజయైనను మహేశ్వర కార్యమగునని ప్రతిపాదింపఁబడినందున విరోధ మేమియు గానరాదు. ఎట్లనఁగా ?

మాయ - ప్రాకృత (మహా) ప్రళయమున తన నామరూపముల (స్థూలత్వము)ను విడనాడి యవిద్వస్తురూపిణియైనను సూక్ష్మరూపముతో మహేశ్వరుని శరీరముగ నుండునదగుటఁజేసి "అజ" యని చెప్పఁబడును. సృష్టికాలమున నామరూపములుగలది యగుట కతన పరమేశ్వరుని కార్యమనఁబఱగుచున్నది. ఇందువలన మాయానిత్యత్వమునకు ఎట్టి భంగము కలుగఁజాలదని భావము.

ఇందుకు దృష్టాంతము - "సూర్యుఁడు సృష్టి సమయమున వసువు మొదలగు దేవతలకు భోగ్యుడగుకతన మధువనఁబఱగును. ప్రళయమున సూక్ష్మరూపము గలిగియుండు వాడగుటఁజేసి వస్వాది దేవతా భోగ్యుఁడు కానందున తద్గత ఉదయా స్తమానంబులు నుండజాలవు" ఇట్లు మధు విద్యయందు నిరూపింపఁబడిన విధముగ మాయ - పరమేశ్వర కార్యమైనను ప్రళయమున సూక్ష్మ రూపిణియై నిత్య యనంబడునని సారాంశము.

## సంఖ్యోపసంగ్రహాధికరణము

కాపిల తంత్ర ప్రసిద్ధములగు పంచవింశతి తత్త్వములు శ్రుతులయందు గానఁబడుచున్నవి గదా ? అను నాశంకకు సమాధాన మీ యధికరణము.

సూ. "న సంఖ్యోపసంగ్రహాదపి, నానాభావా దతిరేకాచ్చ" 1-4-11

"యస్మిన్ పంచ పంచజనా- ఆకాశశ్చ ప్రతిష్ఠితః,
తమేవ మన్య ఆత్మానం-విద్వాన్ బ్రహ్మామృతోఽమృతమ్" శ్రు.

ఇఁట "పంచ పంచజనాః" అను పదముతో తెలుపఁబడు తత్త్వములు- సాంఖ్యసిద్ధములగు పంచవింశతి తత్త్వములా ? శ్రుతిసిద్ధములా ? అని సంశయము.

ప్రశ్న : పంచవింశతిసంఖ్య - సాంఖ్యశాస్త్రమునందు ప్రసిద్ధమగుటచేతను అట్టిది "పంచ పంచజనాః" అనుచో విశద మగుటవలన నిట సాంఖ్యతత్త్వములే కాదగినవి.

ఉత్తరము : "పంచ పంచ" అని పంచవింశతి సంఖ్యఁ గ్రహించుటవలనఁ గూడా తాంత్రిక తత్త్వములు కాజాలవు. ఎందుకనగా ? "యస్మిన్" అను యచ్ఛబ్దము- తత్త్వములు పరమేశ్వరాధీనములని తెలుపుచున్నందున నియ్యని సాంఖ్యాభిమత తత్త్వములు కావని విశదమగుచున్నది. మఱియు ఆకాశమును వేరుగ గ్రహించుటచే తత్త్వములు నిరువదియారు కావలసివచ్చును. కావున నిట పంచవింశతి తత్త్వప్రసక్తియే లేదని గ్రహించునది. "దిక్ సంఖ్యే సంజ్ఞాయామ్" అను ప్రమాణము ననుసరించి పంచజనులనఁబడునవి కొన్ని తత్త్వములు "సప్త సప్తర్షయః" అను దానివలె పేర్కొనఁబడుచున్నవి.

ఐతే అయ్యవి ఎట్టివి ? అనునెడ

సూ. "ప్రాణాదయో వాక్యశేషాత్" 1-4-12

"ప్రాణస్య ప్రాణ ముత చక్షుష శ్చక్షుః శ్రోత్రస్య శ్రోత్ర మన్నస్యాన్నం

మనసో యే మనో విదుః" అను వాక్యశేషము ననుసరించి త్వక్ చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణము లనఁబడు పంచజ్ఞానేంద్రియములనియే చెప్పవలెను.

ఇట ప్రాణవాయుసంబంధమున స్పర్శప్రయుక్తమైన త్వగింద్రియమును, అన్నమయపృథివీగత గంధమును రసమును గ్రహించు జిహ్వాఘ్రాణములను గ్రహించునది.

పంచజ్ఞానేంద్రియములనుటకు మరియొక ఉపపత్తిఁ జెప్పుచున్నవారు.

సూ. "జ్యోతిషైకేషా మసత్యన్నే" 1-4-13

"అన్నస్యాన్నం" అను పదము కాణ్వశాఖీయుల పాఠమునందు లేకున్నను "తం దేవా జ్యోతిషాం జ్యోతి రాయు ర్హోపాసతే అమృతమ్"అను నుపక్రమ వాక్యమున పరమేశ్వర బోధకమైన జ్యోతిః శబ్దముండుటఁజేసి "పంచ పంచజనాః" అను పదమునకు పంచేంద్రియములనియే చెప్పవలసి యుండును.

విషయ ప్రకాశకములగుటచే ఇంద్రియములు జ్యోతిస్సులనఁబడును. ఇట్టి జ్యోతిస్సులఁ గూడఁ బ్రకాశింపఁజేయు పరమాత్మ "జ్యోతిషాం జ్యోతిః"అని నిర్దేశింపఁబడిన సందర్భము ననుసరించి యుపయుక్తమైన "పంచ పంచజనాః" అను దానికి జ్ఞానేంద్రియములని యర్థముఁ జెప్పుట సమంజసంబగుచున్నది.

సూ. "కారణత్వేన చాకాశాదిషు యథావ్యపదిష్టోక్తేః" 1-4-14

"అసద్వా ఇద మగ్ర ఆసీత్" "సృష్టికిమున్ను జగము అసత్తు (నామరూప విభాగముఁ జేయరానిది)గ నుండెను" తద్దేదం తర్హ్యవ్యాకృత మాసీత్" "సృష్టి పరంపరతో వెలయుచున్న నీ ప్రపంచము - వ్యాకృతము (విభాగార్హము)గా పూర్వము లేకుండెడిది" మరియు "ఆకాశో హ వై నామరూపయో ర్నిర్వహితా" "ఆకాశము- జగద్గతములైన నామరూపములను ప్రకాశింపఁజేయునది."

ఇఁట జగత్కారణమును విశేషించి చెప్పకుండుటఁజేసి విశేషమెద్ది యను ఆకాంక్షకు సమాధానమును "ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్" అను వాక్యమునఁగల ఆత్మశబ్దము ననుసరించి పరమేశ్వరుఁడే జగత్కారణమగు"నని నిరూపింపవలసి యుండును.

ఆకాశాదులు - కారణవర్గములో చేరునవి యైనను ఆత్మశబ్దనిర్దేశము వలన పరమేశ్వరుఁడే జగత్కారణమగునని నిర్ధారింపఁబడినట్లు నీసందర్భమునను విశేషవాక్య నిర్దిష్టములగు పంచ జ్ఞానేంద్రియములే ప్రతిపాదింపఁదగియున్నవి.

ఇట్లు పంచజ్ఞానేంద్రియములను సమర్థింప నలవి యైనను తాంత్రిక తత్త్వముల నేల గ్రహింపరాదను నాశంకకు సమాధానము దిగువ సూత్రము.

సూ. "సమాకర్షాత్" 1-4-15

"అసద్వా ఇద మగ్ర ఆసీత్" అనుచో "సో౽కామయత బహు స్యామ్" అనుచో చెప్పఁబడిన పరమేశ్వరు నాకర్షించుటవలనను పూర్వనిర్దిష్టమగు అవ్యాకృతమును "స ఏష ఇహ ప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః" అనుచో ననువదించుట వలనను పరమేశ్వరుఁడే నని యవగతమైనట్లు ఇటఁగూడ "పంచ పంచజన" శబ్దముతో జ్ఞానేంద్రియపంచకము నాకర్షించుటఁ జేసి పంచజన పదమునకు నింద్రియార్థముఁ జెప్పుట- సమంజసంబగుచున్నది.

## జగద్వాచిత్వాధికరణము

సూ. "జగద్వాచిత్వాత్" 1-4-16

సాంఖ్యతత్త్వమును ప్రతిపాదించు ప్రసంగము నిరాకరింపఁబడినది. ఇఁక నీ యధికరణంబున "పరమేశ్వరునికన్న వేరువాడు జీవాత్మ" యను నంశము నిర్ధారింపఁబడుచున్నది.

విషయ వాక్యమును కౌషీతకి బ్రాహ్మణోపనిషత్తునందు "బ్రహ్మతే బ్రువాణి" అని యారంభించి "యో వై బాలాక! ఏతేషాం పురుషాణాం కర్తా, యస్య వై తత్ కర్మ, స వై వేదితవ్యః" "బాలాకుఁడా? ఈ సూర్యచంద్రాది పురుషులకు కర్తయు సృజ్యమాన జగమునకు కారణంబు నగు మహాపురుషుఁడు తెలియఁదగినవాడు" అని బాలాకునకు నజాతశత్రువనఁబడు కాశీరాజు యుపదేశించెను,

ఇఁట తెలియఁదగిన వాడు పరమేశ్వరుఁడా? జీవాత్మయా? అని సంశయము

ప్రశ్న : "యఏవైష ఆదిత్యే పురుష స్తమేవాహ ముపాసే, య ఏవైష చంద్రమసి పురుషో య ఏవైష విద్యుతి" సూర్యమండలము నందు చంద్రమండలమునందు మెఱపునందును గల పురుష నుపాసించువాడను" అని కాశీరాజునకు

బాలాకి చెప్పియున్నవాఁడు. ఐతే విషయ వాక్యమునఁ గల కర్మ శబ్దమునకు ''అపూర్వము'' అను నర్థముఁ జెప్పి సూర్యచంద్రాది పురుషులు - జీవునకు నపూర్వము (అదృష్టము) ద్వారా భోగోపకరణములగుటఁ జేసి యీ యర్థము సకల కర్మ సంబంధము లేనట్టి పరమాత్మయందు పొసగకుండుటను సూర్యచంద్రాది కర్తృత్వము జీవునందు నుపయుక్త మగుటవలనను జీవాత్మయే తెలియఁదగియున్నవాఁడని చెప్పవలెను కాదా ?

ఉత్తరము : విషయ వాక్య గతమగు కర్మశబ్దము—ఏతచ్ఛబ్దమునకు సమానాధికరణ మగుటచేతను "క్రియత ఇతి కర్మ" అను వ్యుత్పత్తి ననుసరించియు కర్మశబ్దమునకు ''జగము"అను నర్థముఁ జెప్పవలెను. అపూర్వమని చెప్పరాదు. ఐతే జగము కార్యముగా గలవాఁడు పరమాత్మ యగు గాని జీవాత్మ కాజాలఁడు గదా ! సకలజగత్కర్తృత్వము పరమేశ్వరునిదే యగును.

ఇందుకు ప్రమాణములు.

"చక్షోః సూర్యో అజాయత, చంద్రమా మనసో జాతః" "సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్" "పరమేశ్వరుని నేత్రము నుండి సూర్యుఁడుదయించెను. మనస్సునుండి చంద్రుఁ డావిర్భవించెను'' "పరమేశ్వరుఁడు పూర్వమువలె సూర్య చంద్రాది ప్రపంచము సంతయు నిర్మించినవాఁడు."

"ఛందాంసి యజ్ఞాః క్రతవో వ్రతాని-భూతం భవ్యం యచ్చ వేదా వదంతి, అస్మా న్మాయీ సృజ్యతే విశ్వమేతత్- తస్మిం శ్చాన్యో మాయయా సన్నిరుద్ధః"

"మాయాంతు ప్రకృతిం విద్యా-న్మాయినంతు మహేశ్వరమ్" "ఛందస్సులు యజ్ఞములు యాగములు వ్రతములు భూత భవిష్యద్వర్తమానములు మున్నగు జగమును మహేశ్వరుఁడు మాయ నధిష్ఠించియే సృజించువాఁడు కాని మాయాబద్ధుఁడు కాజాలఁడు. జీవుఁడైతేనో మాయామోహపరవశుఁడై జగమునఁ బ్రవర్తించువాఁడు."

"మాయ జగన్మూలమనియు మాయావిశిష్టుఁడగు మహేశ్వరుఁడు జగత్కర్త యనియు గురుతెఱుగవలెను."

ఇఁట భూతభవిష్యద్వర్తమాన జగము కార్యమనియు ఇట్టి కార్యమునంతయు

అనితరసాధారణమగు మహేశ్వరశబ్దముచే చెప్పఁబడు శంకరుఁడే నిర్మించు వాడనియు ప్రతిపాదించు శ్వేతాశ్వతర వాక్యద్వయము పురోవాదమగుటచే ననువాద రూపమగు "యో వై బాలాక ?" అను వాక్యమునందలి కర్మ శబ్దమునకు యౌగికముగా "జగము" అను నర్థముఁ జెప్పవలసి వచ్చును. కావున నసంకుచిత జగత్కర్తృత్వము జీవాత్మకు సంభవింపనిదగుటచేత నిట పరమాత్మయే ప్రతిపాదింపఁదగినవాడు.

బాలాకుఁడు స్వయముగా నేతెంచి కాశిరాజును గురించి "బ్రహ్మతే బ్రువాణి''అని ప్రారంభించి సూర్యచంద్రాది పురుషులను ప్రతిపాదింపగా నవ్వారు బ్రహ్మము కాజాలరని కాశీరాజు నిరాకరించి ఈ ఆదిత్యాది పురుషులకు కర్తయు సకల జగత్స్రష్టయు నగువాడే బ్రహ్మంబగుననియు ఇట్టి పరమాత్మను కనుగొనిన వాడు పూర్వికులగు అజ్ఞానుల నందరి నతిక్రమించి ప్రాణులందరిపై యధికారమును నిజరూపసంపదను పొందువాడనియు బాలాకునకు నుపదేశించినవాడు.

సూ. "జీవముఖ్యప్రాణలింగాన్నేతిచేత్తద్వ్యాఖ్యాతమ్" 1-4-17

"ఈ యుపనిషత్తున జీవుని ముఖ్యలక్షణమగు భోక్తృత్వము మరియు నముఖ్యమగు ప్రాణవాయుస్థితియు కనఁబడుటవలన నిట పరమాత్మ - ప్రతిపాదింపఁబడుచులేదు" అని చెప్పకూడదు. ఇట్టి యాశంకకు ఇదే భాష్యమున మొదట ప్రతర్దన విద్యయందు "శివోపాసనము మూడు విధములైనదను నుపపత్తి ననుసరించి జీవలింగములన్నియు పరమేశ్వరుని యందు సమర్థింపఁదగినవి" యని సమాధానము నిరూపింపఁబడినదని సూత్రార్థము.

జీవప్రతిపాదక వాక్యములు.

"శ్రేష్ఠీ స్వై ర్భుంక్తే, యథా వా స్వాః శ్రేష్ఠినం భుంజంత్యేవమేవైషప్రాజ్ఞ ఆత్మా ఏతై రాత్మభి ర్భుంక్తే. ఏవమైవైత ఆత్మాన ఏత మాత్మానం భుంజంతి."

"ఒకానొక ధనికుఁడు - తన పరివారజనము నుపయోగించుకొనువాడు. పరివారజనంబును శ్రేష్ఠిగారి నాశ్రయించి జీవించును. ఇట్లే సుకృతియగు ఒకానొక జీవుఁడు సూర్యచంద్రాదుల సాహాయ్యమున భోగ్యముల ననుభవించువాడు. సూర్యచంద్రాది జీవాత్మలున్ను పుణ్యాత్మ నాశ్రయించి సంతృప్తిపడువారు"

"యదా సుప్తః స్వప్నం న కంచన పశ్యతి, అథాస్మిన్ ప్రాణ ఏవైకధా

భవతి" "పురుషుఁడు ఎట్టి స్వప్నమును గాంచని గాఢనిద్రఁ జెందినపుడు ప్రాణ వాయువు మాత్రము ఏకరూపముతో జీవదేహమున సంచరించుచుండును.

ఐతే ఇటఁగూడ పూర్వాపరములను పరామర్శించునెడల పరమేశ్వరుఁడే నని విశదమగును.

''బ్రహ్మతే బ్రువాణి" అని యుపక్రమము. "యస్య వైతత్కర్మ" అను వాక్యముతో మధ్యన పరమేశ్వరునకు సకల జగత్కర్తృత్వము ప్రతిపాదింపఁ బడినది. ఉపసంహారమునందును ''సర్వాన్ పాప్మనోఽపహత్య సర్వేషాంచ భూతానాం శ్రైష్ఠ్యం స్వారాజ్య మాధిపత్యం పర్యేతి, య ఏవం వేద" "శివోపాసనఁ జేయువాడు - పాపముల నన్నిటిని పోఁగొట్టుకొని ప్రాణులందరిలో శ్రేష్ఠుఁడై స్వారాజ్యము (శివసాయుజ్యము)ను పొందువాడగును" శివోపాసన ఫలము స్వారాజ్య ప్రాప్తియని నిరూపింపఁబడినది.

ఇట్లు ఈ ప్రకరణము బ్రహ్మపరమగుచుండుటఁజేసి జీవముఖ్య ప్రాణ లింగములు శివపరములగుననియే సమర్థింపవలసియుండును.

దిగువ సూత్రమున రెండవపక్షము నుదాహరించినవారు

సూ. "అన్యార్థం తు జైమినిః ప్రశ్నవ్యాఖ్యానాభ్యా మపి చైవ మేకే" 1-4-18

శరీరేంద్రియాది భిన్నజీవుని ప్రతిపాదించుట జీవభిన్న పరమాత్మను కనుగొనుటకే యని జైమిని భావించెను. ఇట్లే మరియొక శాఖవారు ప్రశ్నోత్తరములతో నివ్విషయమునే నిరూపించినవారని సూత్రార్థము.

"తౌ హ సుప్తం పురుష మాజగ్మతు స్తం హాజాతశత్రు రామంత్రయాం చక్రే బృహన్ ! పాండరవాస ! సోమరాజన్ !"

"బ్రహ్మమీమాంసఁ గావించు-అజాతశత్రువు బాలాకుఁడును నిద్రించు ఒకానొక పురుషుని సమీపించి "గొప్పవాడా ? ఉదకములధికముగా గల శరీరమే నివాసముగ కలవాడా ? చంద్రునివలె ప్రకాశించువాడా ? సమ్రాట్టువలె సర్వాధికారము గలవాడా ?" అని యజాత శత్రువు సంబోధించెను.

"స తూష్ణీ మేవ శిశ్యే, తదుహ ఏనం యష్ట్యా వ్యాచిక్షేప, స తత ఏవ

సముత్తస్థౌ" "ఐన నా పురుషుఁడు నట్లే నిద్రించుచుండెను. కావున నజాతశత్రువు బెత్తముతో కొట్టినందున నా పురుషుఁడు దిగ్గున లేచినవాడు.''

ఇట్లు ప్రాణనామధేయములతో నాహ్వానించినను లేవకుండుటను యష్టిమాత్రముతో నుత్థితుఁడగుటను గమనించినచో ప్రాణాదులకన్న వేరుగ జీవాత్మ కలదని విశదమగును కావున నిట్టి జీవుఁడు స్వాతిరిక్త పరమాత్మ నాశ్రయించువాడనియు బోధపడును.

ఇవ్విషయమునఁ బ్రశ్నోత్తర వాక్యములు.

"క్వైష ఏతత్ బాలాకే? పురుషోఽశయిష్ట? క్వ వా ఏతదభూత్? కుత ఏతదాగాత్?"

"గాఢనిద్రఁ జెందునప్పుఁడు పురుషుఁ డెందు విశ్రాంతిఁ జెందువాడు? ఎట నుండెను? ఎచ్చోటికి వెళ్ళినవాడు?"

"యదా సుప్తః స్వప్నం న కంచన పశ్య త్యథాస్మిన్ ప్రాణ ఏవైకథా భవతి"

"సతా సౌమ్య! తదా సంపన్నో భవతి"

"నిద్రించువాడు ఎట్టి స్వప్నమును గాంచకుండుకటి నీ శరీరమునందు ప్రాణమొక్కటియే ఏకరూపముగా సంచరించుచుండును."

"సౌమ్యుఁడా! పురుషుఁడు గాఢనిద్రితుడైనపుడు పరమేశ్వరునితో నేకీభవించి శివానందము ననుభవించును."

ఈ సందర్భమున వాజసనేయులు నిట్లే ప్రశ్నోత్తరముల నుదాహరించిరి.

"యత్రైష ఏతత్సుప్తోఽభూ ద్య ఏష విజ్ఞానమయః పురుషః క్వైషతదాఽభూత్? కుత ఏతదాగాత్" ప్రశ్న వాక్యము.

"యత్రైష ఏతత్సుప్తోఽభూద్య ఏష విజ్ఞానమయః పురుషస్త దేషాం ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞాన మాదాయ య ఏషోఽంత ర్హృదయ ఆకాశ స్తస్మిన్ శేతే" ఉత్తరము.

"విజ్ఞాన ప్రచురుఁడైన జీవాత్మ- ఎట సుషుప్తిఁ జెందెను? ఎచటనుండెను? ఎచ్చోటికి వెళ్ళినవాడు ?

"విజ్ఞానమయుఁడగు జీవుఁడు సుషుప్తియందు కర్మజ్ఞానేంద్రియముల సామర్థ్యమునంతయు తనలో నిమిడ్చుకొని హృదయములోని చిదాకాశమునందు విశ్రాంతిఁ జెందువాడు."

ఇందువలన జగత్కర్తయగు పరమేశ్వరుఁడే ఇఁట ప్రతిపాదింపఁ దగినవాడని సారాంశము.

## వాక్యాన్వయాధికరణము

సూ. "వాక్యాన్వయాత్" 1-4-19

"న వా అరే పత్యుఃకామాయ పతిః ప్రియో భవతి, ఆత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి" మొదలుకొని "ఆత్మావారే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" వరకు బృహదారణ్యకమున మైత్రేయీ బ్రాహ్మణమునందు వినఁబడుచున్న సందర్భము—

"యాజ్ఞవల్క్య మహర్షి - స్వయముగ సన్న్యసింపఁదలచి తన భార్యలైన మైత్రేయికి కాత్యాయనికిని స్థిరచరాస్తినంతయు పంచియిచ్చెద ననఁగా-మైత్రేయి "ధనముతో మోక్షము చేకూరునా" అని ప్రశ్నింప సంసారుల జీవితమువలె నీ జీవితము సాగుననియు మోక్షమునకు ధనముతో నవసరము లేదనియు - యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. "మోక్షము నొసగఁజాలని ధనము నాకెందులకు ? పూజ్యులైన తాము గురైఱిగిన తత్త్వమును గురించియే ఉపదేశింపు"డని మైత్రేయి మరల ప్రశ్నింపగా "భార్యకు భర్త ప్రియుండగుట - భార్యకు గల కామమువలననే యనియు భర్త యొక్క కామమువలన కాదనియు ఒక భర్తయే కాదు, భార్య, కుమారులు, మిత్రులు, పశువులు మున్నగునదంతయు పురుషుని భోగముకొరకే యనియు" యాజ్ఞవల్క్యుఁడు బోధించి పత్యాది సర్వభోక్త ఆత్మయని యుపక్రమించి "పరమాత్మ- చూడదగినవాడు, వినదగినవాడు, ధ్యానింపఁదగినవాడు"అని

యుపదేశించెను. మరియు ఆత్మవిజ్ఞానముతో సర్వవిజ్ఞానము కలుగుననియు "రగులుకొనిన నిప్పునుండి వేడగా పొగ బయలుదేరునట్లు గొప్పదైన పరబ్రహ్మమునుండి ఋగ్యజుః సామాధర్వణ వేదములు, పురాణములు, విద్యలు, ఉపనిషత్తులు, శ్లోకములు, సూత్రములు, వ్యాఖ్యానములు, యజ్ఞయాగములు, ఆహార పానీయములు, ఇహపరలోకములు, ప్రాణులందరును నిట్టూర్పుగా నావిర్భవించునవి" యనియు నామరూపాత్మక సకల ప్రపంచమునకు కారణము బ్రహ్మంబనియు అంతర్మహిస్సులందు నిజరసముతో ఘనీభవించిన ఉప్పురాయివలె విజ్ఞానపరిపూర్ణుఁడగు జీవాత్మ - పంచభూతాదినిర్మిత శరీరమునుండి నిర్గమించి యవ్వానిననుసరించియే యుండును. కాని ఇట్టి దశయందు జీవునకు ఎట్టి తెలివి యుండఁజాలదనియు ఆత్మవిజ్ఞానమువలననే మోక్షము చేకూరుననియు వక్కాణించెను.

ఇఁట "ఆత్మా వారే ద్రష్టవ్యః" అనుచో గల ఆత్మశబ్దము - పరమేశ్వర వాచకం బగునది. అమృతత్వమును కోరు మైత్రేయికి ఆత్మదర్శనమును ఆత్మ దర్శనమువలన నమృతత్వము చేకూరునని యుపదేశించుట వలనను దర్శనీయ ఆత్మయే నామరూపాత్మక సకల ప్రపంచ కారణమని ప్రతిపాదించుటఁ జేసియు సైంధవ ఘనేత్యాది నిరూపిత జీవుండైతేనో దేహాకార పరిణత పంచభూతోపాధికములగు ఉత్పత్తి వినాశములు కలిగి యుండువాడని చెప్పుటవలనను "ఆత్మా వారే ద్రష్టవ్యః" అను వాక్యముతో ప్రశంసింపఁబడు ఆత్మయే "మహద్భూత మనంత మపారమ్" అనుచో గల మహదాది శబ్దములు బ్రహ్మపరములగుటవలనను పరమేశ్వరుండగునని నిర్ధారింపనగును.

ప్రశ్న : "ఆత్మనస్తు కామాయ" ఇత్యాది సందర్భమున భోగప్రీతియుక్తుఁడగు సంసారి చెప్పఁబడుటచే నిట జీవాత్మ ప్రశంసింపఁదగినవాడని విశదమగుచున్నది కాదా ?

ఉత్తరము : పరమేశ్వరుఁడే ఇట ప్రతిపాదింపఁదగినవాడు. ఎందుకనఁగా? "అమృతత్వస్య తు నాఽఽశాస్తి విత్తేన" "మోక్షమునకు ద్రవ్యముతో నవసరము లేదు" "ఆత్మని ఖల్వరే దృష్టే శ్రుతే మతే విజ్ఞాతే ఇదం సర్వం విదితమ్" "పరమేశ్వరుని గురించి శ్రవణముఁ జేయుచు మననము గావించి ధ్యానము నాచరించి సాక్షాత్కారము నొనర్చుకొనునెడ నీ జగమంతయు విదితమగును" "ఇదం సర్వం యదయ మాత్మా" "ఈ ప్రపంచమంతయు పరమేశ్వరాత్మకము" "యేనేదం

సర్వం విజానాతి - తం కేన విజానీయాత్" "జీవాత్మ - స్వాంతర్యామియగు పరమేశ్వరునివలన జ్ఞానశక్తి గలవాడై ఈ చరాచరమునంతయు కనుగొనఁజాలును. అట్టి పరమేశ్వరుని సాక్షాత్కరించుకొనుటకు పూర్వోక్తములైన శ్రవణమననాదులు దక్క నితరమగు నుపాయ మెద్దియు గానరాదు" అను వాక్యములన్నియు పరమేశ్వరునియందన్వయించుటఁజేసియు జీవుఁడు-పతిజాయాది శబ్దములతో అనువదింపఁబడుటవలనను పరమేశ్వరుఁడు ద్రష్టవ్యుఁడుగా ప్రతిపాదింపఁబడుటచేతను విరోధమేమియు గానరాదు.

పతిజాయాద్యనురాగము మోక్షమునకు భంగకరమగుటచే ముముక్షువు పతిజాయాదులందు విరాగము కలవాడై శ్రవణమననాదులతో పరమేశ్వరుని దర్శింపవలెనని సారాంశము.

ఐతే జీవశబ్దముతో పరమేశ్వరు నభిధానించుట యెట్లు పొసగునను ఆశంకకు దిగువసూత్రములందు మతాంతర సమాధానములను వ్రాకుచ్చినవారు.

సూ. "ప్రతిజ్ఞాసిద్ధే ర్లింగ మాశ్మరథ్యః" 1-4-20

"ఆత్మని ఖల్వరే దృష్టే" ఇత్యాది వాక్యమునఁ జెప్పఁబడిన "ఏక విజ్ఞానముతో సర్వవిజ్ఞానము కలుగు"నను ప్రతిజ్ఞ-సిద్ధించుటకు జీవుఁడు పరమేశ్వరుని కార్యమగుటచే పరమేశ్వరునికన్న వేరువాడు కాదను నంశమును తెలుప నుద్దేశించి జీవశబ్దముతో పరమేశ్వరుఁడు సమర్థింపఁబడెనని ఆశ్మరథ్యుఁడు భావించెను.

సూ. "ఉత్క్రమిష్యత ఏవంభావా దిత్యౌడులోమిః" 1-4-21

జీవాత్మ - సంసారిదశయందు పరమేశ్వరభిన్నుఁడైన నంతిమశరీరము నుండి నిష్క్రమించి ముక్తుఁడగుతఱి పరమేశ్వరరూప స్వభావములు గలవాడగుటఁజేసి జీవాత్మ శబ్దముతో పరమేశ్వరుఁడు ప్రతిపాదింపఁబడెనని ఔడులోమి యభిప్రాయము.

సూ. "అవస్థితే రితి కాశకృత్స్నః" 1-4-22

"య ఆత్మని తిష్ఠన్" ఇత్యాది శ్రుతివాక్యములయందు జీవునిలో పరమేశ్వరుఁ డంతర్యామిగా నుండువాడని చెప్పఁబడుటఁజేసి పరమేశ్వరుఁడు - జీవశబ్దవాచ్యుండయ్యెనని కాశకృత్స్నమహర్షి సంభావించెను.

ఇదియే సూత్రకారుని యభీష్టంబని తెలియనగును. మొదట నిరువురి అభిప్రాయముల నుపన్యసించి వారిరువురికి భిన్నముగా కాశకృత్స్నని యభిమతమును నిరూపించినందున మరియొక యభిమతమును చెప్పకుండుటను పైవిధము నిర్ణయింపఁబడుచున్నది.

శ్రుతులనేకము లివ్విషయమునే సమర్థించుచున్నవి.

అథర్వశిరోపనిషత్తున చేతనాచేతనములన్నిటియందు ప్రవేశించుటఁజేసి పరమేశ్వరుఁడు సర్వశబ్ద వాచ్యుఁడగునని చెప్పఁబడినది.

ప్రథమఖండమునందు "దేవా హ వై స్వర్గం లోక మగమన్, తే దేవా రుద్ర మపృచ్ఛన్ కో భవానితి" బ్రహ్మవిష్ణ్వాది దేవతలు పరశివనివాసమనఁదగు మహాకైలాసముఁ జని నీవు ఎట్టివాడవని పరమేశ్వరుని ప్రశ్నించిరి. అట్టితఱి మహాదేవుఁడు "సోఽబ్రవీదహ మేకః ప్రథమ మాసమ్, వర్తామిచ భవిష్యామిచ, నాన్యః కశ్చి న్మత్తో వ్యతిరిక్తః" "సృష్టికి మున్ను నేనొకఁడ నుంటిని. సృష్టిసమయమందు నుండువాడను, ప్రళయకాలముననును నేనే యుండువాడను. నేనుదప్ప మరియొకఁడు కాలత్రయాబాధ్యుడుగ నుండజాలడు" అని యుపదేశించినవాడు.

మఱియు నదే యథర్వశిరమునందు

"సోఽంతరా దంతరం ప్రావిశద్దిశశ్చాంతరం సంప్రావిశత్, సోఽహం నిత్యానిత్యోఽహమ్, బ్రహ్మాహమ్, ప్రాంచః ప్రత్యంచోఽహమ్, దక్షిణాంచ ఉదంచోఽహమ్, అధశ్చోర్ధ్వంచ దిశశ్చ విదిశశ్చాహమ్, పుమా నపుమాన్ స్త్రియశ్చాహమ్, సావిత్ర్యహమ్, గాయత్ర్యహమ్, త్రిష్టుప్ జగత్యనుష్టుప్ చాహమ్, ఛందోఽహం గార్హపత్యోఽహం, దక్షిణాగ్ని రాహవనీయోఽహమ్, సత్యోఽహం గౌరోఽహం గౌర్యహమ్, జ్యేష్ఠోఽహం శ్రేష్ఠోఽహం, వరిష్ఠోఽహమాపోఽహం, తేజోఽహ మృగ్యజుస్సామాథర్వాంగిరసోఽహం, అక్షరమహం క్షరమహం గుహ్యోఽహం గోప్యోఽహం, అరణ్యోఽహం పుష్కరమహం, పవిత్రమహం, అగ్రంచ మధ్యంచ బహిశ్చ పురస్తాజ్జ్యోతిరిత్యహ మేకః, సర్వేచ మామేవ, మాం యో వేద, స సర్వాన్ దేవాన్ వేద."

"పరమేశ్వరుఁడు - స్థూలశరీరాంతరమగు సూక్ష్మశరీరములో ప్రవేశించి యుండువాడు. అన్ని దిశలలోను ప్రవేశించెను. నిత్యుఁడను; అనిత్యుడను; బ్రహ్మంబునగుదును: ప్రాంచుడను; పాశ్చాత్యుడను; దాక్షిణాత్యుడను; ఉదీచ్య

దను; దిగువను పైన నుండువాడను; దిశలు; విదిశలు, పురుషుఁడు, నపుంసకుఁడు, స్త్రీ, ఇవ్వాని స్వరూపము గలవాడను; సావిత్రి గాయత్రి త్రిష్టుప్ జగతి అనుష్టుప్ అనఁబడు ఛందస్సులు నగువాడను; గార్హపత్య దక్షిణా ఆహవనీయములనఁబడు అగ్నిత్రయముఁ దగు స్వరూపము గలవాడను; సత్యరూపుడను; గౌరీస్వరూపుడను; శంకరుఁడను; మరియు దేవమానవ పశుపక్ష్యాది చరాచరమునకన్న నతీతుఁడగుటఁ జేసి మిక్కిలి గొప్పవాడ నగుదును; జలతేజస్సులు, ఋగ్యజుః సామాథర్వణంబులును క్షరాక్షరంబులును నా రూపంబులేను; రహస్యంబును అతిరహస్యంబును అరణ్యము పుష్కరము పవిత్రము అగ్రమధ్యములు అంతర్బహిస్సులు సర్వాగ్రమునందు వెలుగొందు జ్యోతిస్సును నేనే యగుదును. జీవాత్మలందరు నన్నే ఆశ్రయించువారు. ఇవ్విధము భావించువాడు దేవతలనందరిని కనుగొనఁ జాలువాడగును" అనియు చెప్పినవాడు.

ద్వితీయ ఖండమునందును

"యో వై రుద్రః స భగవాన్ యశ్చ బ్రహ్మ తస్మై వై నమో నమః"అను వాక్యము మొదలుకొని ప్రతిపాదింపఁబడిన విషయము- బ్రహ్మ విష్ణు మహేశ్వర ఉమా వినాయకాది సర్వశబ్దవాచ్యత్వము పరమేశ్వరునకు పొసగునని విశదీకరించుచున్నది కావుననే సర్వాంతర్యామి యగును.

మఱియు ప్రపంచమన్నిటిఁ దగు సామరస్యమును విచారించునెడ చిదచిత్తులన్నిటిలో నంతర్యామిగా ప్రవేశించుటఁ జేసి పరమేశ్వరుఁడు సర్వస్వరూపుఁడనియు సర్వశబ్దవాచ్యుఁడనియు చెప్పఁబడును. ఇందువలన కాశకృత్స్న మహర్షిగారి మతమే శ్రుతులకు అభియుక్తసూక్తులకు సనువైనదనుట సమంజసంబగుచున్నది.

పూర్వోక్తమతత్రయంబున ఆశ్మరథ్యుని పరమేశ్వరకార్యము జీవుఁడను వాదము "నాఽత్మాశ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః.'' (సూ. 18-3-2) అను నధికరణమునందు నిరాకరింపఁబడుటను "ముక్తిదశయందు ఆగంతుక రూపంబేర్పడు" నను ఔడులోమి వాదము ''సంపద్యావిర్భావః స్వేన శబ్దాత్" సూ. 1-4-4 అను నధికరణమునందు ఖండింపఁబడుటవలనను కాశకృత్స్నుని మతమే సూత్రకారుని యభీష్టంబని తెలియుచున్నది.

ఇవ్విషయమునే మనుస్మృత్యాది ప్రమాణములు చాటుచున్నవి.

అధర్వశిరోగత ద్వితీయఖండమున

"ఘృతాత్పరం మండమివాతిసూక్ష్మం జ్ఞాత్వా శివం సర్వభూతేషు గూఢమ్'' ''శివుడు నెయ్యిలోని చిన్నపూస వలె నతిసూక్ష్మస్వరూపుడు కావుననే ప్రాణులందరిలో దాగియున్నవాడని భావింపవలెను."

"ఏష దేవో విశ్వకర్మా మహాత్మా - సదా జనానాం హృదయే సన్నివిష్టః "ప్రపంచమే కార్యముగా గల గొప్ప దేవుఁడు ప్రాణుల హృదయములలో నెల్లపుడు నెలకొనియుండువాడు."

"యో రుద్రో అగ్నౌ వప్సు య ఓషధీషు యో రుద్రో విశ్వాభువనా వివేశ" "అగ్నియందు నుదకమందును ఓషధులలోను సమస్తలోకములలోను ప్రవేశించియుండు రుద్రునకు నమస్కారము."

ఇత్యాది శ్రుతివాక్యములు నంతర్యామి బ్రాహ్మణాదులయందు పంచభూత సూర్యచంద్రచేతనాంతర్యామిగా నష్టమూర్తిత్వము పరమేశ్వరునకు కలదని ధృవపఱచుటచే సర్వశరీరములు గలవాడని విశదమగుచున్నది.

మహాభియుక్త సూక్తులనఁగా స్మృతులు పురాణములు నగును. అవ్వానిలోని మానవ ధర్మశాస్త్రముఁ(మనుస్మృతి)దగు నుపసంహారమున "ప్రశాసితారం సర్వేషా మణీయాంస మణోరపి, రుక్మాభం స్వప్నధీ గమ్యం- విద్యాత్తు పురుషం పరమ్'' అనుచో సర్వనియామకుఁడగు పురుషుని ప్రశంసించి "ఏనమేకే వదంత్యగ్నిం- మరుతోఽన్యే ప్రజాపతిం। ఇంద్ర మేకే పరే ప్రాణ మపరే బ్రహ్మ శాశ్వతమ్" అనుచో పలువేద భాగములయందు చెప్పఁబడిన అగ్ని మున్నగు శబ్దములతో వ్యవహరించుటను పేర్కొనియు పైవాని విరోధమును పోనాడుటకై "ఏష సర్వాణి భూతాని-పంచభి ర్వ్యాప్య మూర్తిభిః। జన్మవృద్ధిక్షయై ర్నిత్యం-సంసారయతి చక్రవత్'' అను శ్లోకమున పరమేశ్వరుఁడు పంచమూర్తులు గలవాడై ప్రాణులందరిని జన్మస్థితిలయములతో సంసారచక్రమున భ్రమింపఁజేయు నని చెప్పఁబడుటచే ప్రజలను నియమించు రాజువలె గాక నియామ్యము లన్నిటిలో ప్రవేశించియుండువాడని తెలియనగును.

"కొందరు అగ్నియందురు. మరికొందరు ప్రజాపతి యందురు.'' ఇత్యాది

ప్రతిపాదనమున శివశరీరములగు అగ్న్యాదుల శబ్దములతో శివుఁడే నిరూపింపఁబడినవాడని సారాంశము. పంచమూర్తులనఁగా ఆకాశాది పంచభూతములు, అథవా తదభిమానముగల సద్యోజాతాది పంచబ్రహ్మములని గ్రహించునది.

ప్రశ్న : "ఓయీ ? మానవధర్మశాస్త్ర ప్రారంభమున - ఈ జగమంతయు నామరూప నిర్వచనములేక నుండుటచే నూహింపరానిదిగాను నిర్దేశింపఁజాలనిదిగాను నిద్రించినదానివలె తమోమాత్రమై యుండెడిది. అట్టితఱి నవ్యక్తుఁడైన భగవానుఁడు ఆకాశాది పంచమహాభూతములను రచించు ప్రభావము గలవాడై స్వయముగా వెలువడి కొంత తడవాలోచించియు ప్రజలనందరిని పుట్టింపఁదలచి మొదట జలమును సృజించి యందు తన సిసృక్షారూపమైన వీర్యమును విసర్జించినవాడు. అట్టిది సూర్యప్రకాశమగు హిరణ్మయాండముగ పరిణమించెను. ఆ యండములో నుండి సర్వలోక పితామహుండగు చతుర్ముఖుఁ డుద్భవించినవాడు" అనియు "ఉదకములు నర(జీవ) సంబంధముగలవి యగుటచే నారము లనఁబడు"ననియు, "నారములు స్థానముగా గలవాడగుటచే నారాయణుఁడనఁబడుగు" ననియు చెప్పఁబడుటచే పితామహుని బ్రహ్మాండములోనుండి మొదట పుట్టించిన నారాయణుఁడే జగత్కారణమైన పురుషుఁడని యంగీకరింపవలెను గాదా ?

ఉత్తరము : "తతః స్వయంభూ ర్భగవాన్" అనుచో పితామహుని పుట్టించిన నారాయణుఁడు "ప్రాదురాసీ త్తమోనుదః" అనుచో తమః ప్రేరకుఁడు మాయాధిష్ఠాతయు నగు పరమేశ్వరునివలన ప్రళయానంతర కాలమున నావిర్భవించినవాడని చెప్పఁబడుటచే పరమశివుడే సర్వకారణమగువాడని తెలియుచున్నయది.

"తమోనుదః" అను పదము క్విన్ ప్రత్యయముతో పంచమ్యంతమగునది, కాని ఇగుపధ లక్షణముగల క ప్రత్యయమునఁజేసి ప్రథమాంతమై యావిర్భవించినవానికి విశేషణము కాజాలదు. ఈ సందర్భమున మొదట ఉండెనని చెప్పఁబడిన తమస్సును తరువాత జన్మించినవాడు నధిష్ఠించుట పొసగనట్టిది. కావున మానవ ధర్మశాస్త్రోపక్రమోపసంహారములను పరిశీలించినచో పరమేశ్వరుఁడే జగత్కారణంబని తేటపడును.

మఱియు కాత్యాయన గృహ్యసూత్రమున నదీవృక్ష పర్వతాదుల నతిక్రమించుతఱి "నమో రుద్రాయాప్సుషదే స్వస్తి మా సంపాదయ" "జలాదుల నధి

ష్ఠించియుండు రుద్రునకు నమస్కారము. రుద్రుడా! నాకు శుభమును కలుగ జేయుము." "నమో రుద్రాయ వనస్పతిషదే స్వస్తి మా సంపాదయ" వృక్షాదులను వ్యాపించియుండు శివునకు నమస్కారము. పరమేశ్వరా! నాకు క్షేమము నాపాదించుము" ఇత్యాది శివ నమస్కారమంత్రములు ప్రతిపాదింపఁబడినవి మఱియు "నమో రుద్రాయేత్యేవ బ్రూయాత్" అని పరమేశ్వరుని నమస్కరించు మంత్రమును సామాన్యముగ విధించి "రుద్రోహ్యేవైతత్సర్వమ్" అను వాక్యముతో "రుద్రుఁడు సర్వాధిష్ఠాత'' యని "సర్వో వై రుద్రః" అను శ్రుతి-స్మరింపఁజేయఁబడినది.

ఇట్లు చెప్పుటవలన "సర్వోవై రుద్రః" "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇత్యాదిని గల సర్వశబ్దముఁ దగు సామానాధికరణ్యము సర్వాధిష్ఠాతయు సర్వశరీరకుఁడు నగు వానియందే పర్యవసానముఁ జెందునని తెలియవలసి యున్నది.

ఆశ్వలాయన సూత్రమునను శివుని ప్రశంసించి "సర్వాణి హ వా ఏతస్య నామధేయాని భవంతి" అను వాక్యముతో నామములన్నియు పరమేశ్వరునియందు పర్యవసానముఁ జెందునని సాక్షాత్తు నిరూపింపఁబడినది.

ఇఁట శ్రీ భాష్యకారులు నారాయణునకు సర్వాంతర్యామిత్వమును ప్రతిపాదించుటద్వారా సర్వశబ్దవాచ్యత్వమును సాధింపఁజూచిరి కాని ప్రబలశ్రుతులు అనుకూలింపనందున "సర్వభూతాంతరాత్మా" ఇత్యాది సుబాలోపనిషద్వాక్యమును మాత్ర మాధారముగా గొని కృతార్థులమైతిమని భావింపవలసివచ్చెను. ఐతే సుబాలోపనిషత్తు పాంచరాత్రతంత్రముల ననుగ్రహించునదగుటచేతను పూర్వోదాహృత శ్రుతుల విరోధమువలనను పరస్పర విరోధముగలవాని సముదాయమున "భూయసాం స్యా త్స్వధర్మత్వమ్'' అను న్యాయము ననుసరించి పెక్కు శ్రుతులకు ప్రామాణ్య మొదవును గావునను సౌబాలము బాధింపఁబడుటచే పరుల యభిమతము ఈడేరజాలదని గ్రహించునది.

శుద్ధాద్వైతులైతేనో

"న వారే పత్యుః కామాయ" ఇత్యాది వాక్యములతో జీవాత్మ ననువదించి "ఆత్మావా అరే ద్రష్టవ్యః" అనుచో జీవాత్మయే చూడఁదగినవాడని శ్రుతి చెప్పుచున్నందున జీవబ్రహ్మల కభేదముః సిద్ధించినదనియు "అవస్థితే రితి కాశకృత్స్నః"

అను సూత్రమునకు "పరమాత్మయే విజ్ఞానాత్మభావముతో నుండువాడ"ను నర్థముఁ జెప్పి స్వాభిమతమును సమర్థింపఁజూచుట - యెంతమాత్రము సంగతము కాజాలదు.

"భేదవ్యపదేశాత్" "అర్థాంతరవ్యపదేశాత్" ''సుషుప్త్యుత్క్రాంత్యో ర్భేదేన" ఇత్యాది సూత్రములు జీవబ్రహ్మభేదమును నిర్ణయించుచున్నందున ప్రకృత సూత్రమున నభేదార్థమును నిరూపించుట సమంజసము కాజాలదు.

ప్రకృత సూత్రమున ''అవస్థితేః'' అను పదమునకు చెప్పఁబడిన అభేదార్థము "స్థితేః" అనుటతోడనే సిద్ధించును గదా! "అవస్థితేః'' అనుచో గల ''అవ" అను ఉపసర్గమునకు విశేషార్థముండితీరవలయును. సూత్రకారునకు నభేదము ఇష్టమగుచో "అభేదాత్" అని వ్రాసియుండెడివాడు. పరపక్షమునకు అవోపసర్గము నిరర్థకమై స్వాభిలషితమును సాధించుట లేదు. తత్త్వమస్యాది మహావాక్యములు జీవబ్రహ్మైక్యమును అపాతతః బోధించుచున్నను "యస్యాత్మా శరీరమ్" ఇత్యాది వాక్యములు గల యంతర్యామి బ్రాహ్మణము ననుసరించి శరీర శరీరిభావము నంగీకరించునెడ తాదాత్మ్య సంబంధముతో సుసంగతములగునవి."

''తమాత్మస్థం యేஉనుపశ్యంతి ధీరాః" "ద్వా సుపర్ణా" ఇత్యాద్యనంత శ్రుతివచస్సులున్ను జీవబ్రహ్మైక్యమును విరోధించుచున్నవి. సూత్రకారుఁడైతే నంతర్యామ్యధికరణమునందు "ఉభయేஉపి భేదేనైవ మధీయతే" అనుచో జీవపరమాత్మలకు భేదమును స్పుటముగా నంగీకరించినవాఁడు. ఇట్లు సర్వశ్రుత్యనుగతమగుటచే జీవబ్రహ్మములకు శరీర శరీరిభావము యథార్థముగ నిర్ణయింపఁబడుచున్నది. కావున వేదార్థమంతయు పరమేశ్వరుని సర్వాంతర్యామిత్వ మనఁబడు మహా విభూతిని వర్ణించునదియే నని గ్రహింపవలెను.

ఇఁక నుపాసనాంగముల యభేదము పారమార్థికమైనదని యంగీకరించి యనేకములైన భేదశ్రుతులు - శ్రుతిసూత్రములలో గానరానట్టి స్వకల్పితంబునగు నవిద్యను పురస్కరించుకొనిన భేదమును సమర్థించుననియు, ప్రత్యగాత్మ యొకఁడే కాని యిరువురు కారనియు వక్కాణించి యంతర్యామి బ్రాహ్మణమును తదధికరణమున్ను స్వవచనములతోడనే నిరాకరించి సాధించు ఐక్యార్థము ఎట్టిదో సుధీమంతులు గ్రహింతురు గదా!

# ప్రకృత్యధికరణము

"జన్మాద్యస్య యతః" అను ద్వితీయాధికరణమునందు "యతోవా ఇమాని భూతాని" అను పంచమి విభక్తిఘటితమగు శ్రుతి నుదాహరించి పరమేశ్వరుఁడు జగదుపాదానమగునని సామాన్యముగ నిరూపింపఁబడియుండెను. అట్టి జగదుపాదానత్వము నీ యధికరణమునందు విశేషముగ సమర్థించుచున్నవారు.

సూ. "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్" 1-4-23

"ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానమ్" అను ప్రతిజ్ఞను మరియు మృద్ఘట దృష్టాంతము ననుసరించి "ప్రకృతిః" జగదుపాదానకారణము "చ" నిమిత్తకారణంబును పరమేశ్వరుఁడే అని సూత్రార్థము.

"తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః"

"ద్యావాభూమీ జనయన్ దేవ ఏకః" ఇత్యాది శ్రుతులయందు వినఁబడు ఉభయకారణత్వము పరమేశ్వరునకు పొసగునా లేదా యని సందేహము. లోకములో నిమిత్తకారణములగు కుమ్మరి మున్నగునవి మృత్పిండాదుల యుపాదానభావమును పొందనందునను మృత్పిండాదులు కులాలాదుల నిమిత్తభావమును చెందనందునను జగత్కార్యమును గురించి యుపాదానము నిమిత్తంబు నాకే పరమాత్మ యెట్లు కాదగునని సందేహ బీజము.

ప్రశ్న : పరమేశ్వరుడు జగత్సృష్టివిషయమై నిమిత్త కారణంబేను, ఉపాదానమగుట సరిపడుటలేదు. ఘటనిర్మాతయగు కులాలుఁడు తానే మృత్పిండమై ఘటమును చేయడు గదా! సాలెవాడును వస్త్రమై పటము నేర్పరచువాడు కాడు. లేక మృత్పిండము కుమ్మరియై కుండఁజేయుటయు సంభవింపదు. నిమిత్తమగు బ్రహ్మమునకు నుపాదానత్వము సమర్థనీయము కానట్టిది. నిమిత్తమునకు నుపాదానత్వమును కల్పించుటయు నిష్ప్రయోజనమగునది అట్లు కల్పింప నవసరము లేకయే కార్యనిష్పత్తి కలుగును. కులాలుఁడు మృత్పిండభిన్నుఁడైనను ఘటము నిష్పన్నమగుటను గాననగును. ఇందువలన బ్రహ్మము నిమిత్తమే గాని యుపాదానము కాజాలదని యంగీకరింపవలెను గాదా!

ఉత్తరము: ఈ సందర్భమున జగన్నిమిత్తము ఉపాదానంబు బ్రహ్మంబే వని ప్రతిపాదింపఁబడుచున్నయది. "స్తబ్ధోఽస్యుత తమాదేశ మప్రాక్ష్యో

యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మత మవిజ్ఞాతం విజ్ఞాతమ్" ఎద్దానిని వినినచో సర్వము శ్రుతంబగునో ఎద్దానిని భావించినచో సమస్తము భావింపఁబడునో ఎద్దానిని తెలిసికొనినచో నంతయు తెలియునో అట్టి యాదేశము (బ్రహ్మము)ను గూర్చి యాచార్యుని ప్రశ్నించితివా?" ఉద్దాలక మహర్షి-తన కుమారుఁడగు శ్వేతకేతువును గురుకులమందు వేదాధ్యయనముఁగావించి రమ్మని నియోగింపగా శ్వేతకేతువు నట్లే గావించి స్వాశ్రమమునకు పాండిత్య గర్వముతో స్తబ్ధుడై యేతెంచుటను గమనించి "బ్రహ్మవిద్యాశ్రవణమును చేయనందున వీడు నవినీతుఁడయ్యె" నని కనుగొని బ్రహ్మవిదునిగ నొనర్పఁదలచియు "స్తబ్ధోస్యుత" అను వాక్యముతో పైవిధము ప్రశ్నించె నని ఛాందోగ్యమున చెప్పఁబడినది. "జగన్నిమిత్తము ఆదేశించునదియు నగు బ్రహ్మమును కనుగొనినచో చిదచిదాత్మకమగు జగమంతయు తెలియు" నను సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ ననుసరించియు "ఏకమృత్ పిండజ్ఞానముతో మృణ్మయమంతయ విజ్ఞాతంబగు" నను దృష్టాంతము ననుసరించియు బ్రహ్మమునకు నుభయకారణత్వమును సమర్థింపనగును. బ్రహ్మము నిమిత్తమే నగునెడ బ్రహ్మజ్ఞానముతో సకల ప్రపంచ విజ్ఞానము చేకూరకుండును. కులాలుని తెలిసికొనినచో ఘటాదికార్యము తెలియదుగదా! కాని తదుపాదానమగు మృత్ పిండమును కనుగొనునెడ ఘటాదికార్యము తెలియును గావున నిమిత్తమగు బ్రహ్మము ఉపాదానమగునెడ సర్వవిజ్ఞానము సంభవించుటఁజేసి బ్రహ్మమే యుపాదానంబు నగునది. "ఆదిశ్యతే అనేనే త్యాదేశః" అను వ్యుత్పత్తి ననుసరించి ఆదేశమనఁగా బ్రహ్మంబని తెలియనగును.

జగన్నిమిత్త మగునదియే జగదుపాదాన కారణ మగునని దిగువ సూత్రమున హేత్వంతరమును చెప్పుచున్నవారు.

సూ. "అభిధ్యోపదేశాచ్చ" 1-4-24

"తదైక్షత బహు స్యాం ప్రజాయేయ" అనుచో- నిమిత్తము సర్వజ్ఞంబునగు బ్రహ్మమే విచిత్రజగదాకారముగా బహుభవమును సంకల్పించినట్లు నుపదేశింపఁబడుచున్నది కావున నిమిత్త మునకన్న నుపాదానము వేరు కాజాలదు.

ప్రశ్న : ఓయీ? "విశ్వాధికో రుద్రో మహర్షిః, హిరణ్యగర్భం పశ్యత జాయమానమ్" అనుచో "విశ్వాతీతుఁడగుటచే జగన్నిమిత్తముగ చెప్పఁబడు పరమేశ్వరుఁడే సర్వజ్ఞుఁడగుటఁజేసి స్వ (అపృథక్ సిద్ధ) భిన్నయగు ప్రకృతి

యందు తన సంకల్పమువలనఁ బుట్టువాడును సకలదేవతాప్రథముఁడు నగు హిరణ్యగర్భుని సృష్టిసామర్థ్యమునొసగు నుద్దేశముతో ననుగ్రహదృష్టి నవలోకించువా"డని తెలియుచున్నది. ఇట్టితఱి శివుఁడు ప్రకృతిరూపుఁడై విశ్వాకారుఁడగుట యెట్లు పొసగును? "మాయాం తు ప్రకృతిం విద్యాత్'' అనుచో శ్రుతి-మాయ జగదుపాదాన (ప్రకృతి) మగునని వివరించినది. "తస్మా ద్విరాడజాయత విరాజో అధిపూరుషః'' అనుచో పురుషుఁడు జగత్ప్రకృతిగా వర్ణింపఁబడెను. అందువలన మాయాపురుషులే ప్రకృతిగా జగద్రూపులగుట సముచితము గాదా?

ఉత్తరము :

సూ. "సాక్షా చ్చోభయామ్నానాత్" 1-4-25

పరమేశ్వరుఁడు ప్రకృతిగా జగద్రూపుఁడనియు నిమిత్తముగా జగదుత్పాదకుఁడనియు వేదాంత భాగములయందు ప్రత్యక్షముగా నిరూపింపఁబడినది. ఎట్లనఁగా? "విశ్వాధికో రుద్రః" ఇత్యాది వాక్యములతో విశ్వాధికత్వము వినఁబడునట్లు "సర్వో వై రుద్రః" ఇత్యాది వాక్యములతో ప్రకృతి యగుటఁజేసి విశ్వరూపత్వంబును తెలుపఁబడుచున్నయది.

శతరుద్రీయమునందు "నమో హిరణ్యబాహవే" అను వాక్యము మొదలుకొని "కులుంచానాం పతయే" ఇత్యాది వాక్యమువరకు విశ్వాధిపతి యగుటయు ఆటుపిమ్మట "నమః పర్ణాయచ పర్ణశద్యాయచ" అను వాక్యమువరకు జగదాకారము గలవాడగుటయు ప్రతిపాదింపఁబడినవి.

ఇందుకు మరియొక శ్రుతిప్రమాణము - "బ్రహ్మ వనం బ్రహ్మ స వృక్ష ఆసీత్ బ్రహ్మధ్యతిష్ఠత్ భువనాని ధారయన్" "పరమాత్మ - అరణ్య వృక్షాది రూపములు గలవాడై చేతనాచేతనాత్మక సమస్తలోకములను ధరించుచు ప్రపంచము నంతయు నధిష్ఠించియుండువాడు" అథర్వశిరమునందును ప్రథమ ద్వితీయ ఖండములలో "బ్రహ్మహమ్" మొదలుకొని విశ్వాకారత్వము, పంచమ ఖండమున "ఏకో రుద్రో న ద్వితీయాయ తస్థే" ఇత్యాది వాక్యములతో జగదీశ్వరత్వంబును ప్రతిపాదింపఁబడినవి. ఇట్లు శ్రుతులయందు ఉభయకారణత్వము స్పష్టముగా చెప్పఁబడినందున ప్రపంచ స్వరూపుఁడును ప్రపంచాతీతుఁడును ప్రకృతి.

నిమిత్తంబు పరబ్రహ్మము పరమేశ్వరుఁడును శివుఁడే నగునని నిరూపించుట-సమంజసంబేను; ఇవ్విషయమై ప్రమాణాంతరంబు కలదని దిగువ సూత్రముతో చెప్పుచున్నవారు.

సూ. "ఆత్మకృతేః" 1-4-26

"తదాత్మానం స్వయ మకురుత" అనుచో తానే జగదాకారముగ నగుట విశదపఱుపఁబడుటచే శివుఁడే జగదుపాదానము నిమిత్తంబు నగువాఁడు.

ప్రశ్న : సమస్త దోష లవ కళంకములు బొత్తుగా లేనివాడు, అనంత మంగళగుణరత్నాకరుఁడు, నిరంకుశము నిత్యసిద్ధంబునగు వైభవము గలవాడు, ప్రపంచాతీతుఁడు నగు పరమశివుడు - అజ్ఞానవికారాస్పదము తుచ్ఛంబు నగు ప్రపంచముగా నుండుట యెట్లు పొసగును?

ఉత్తరము :

సూ. "పరిణామాత్" 1-4-27

నిత్యశుద్ధ ఆనందస్వరూఁపుడు నిరతిశయ మంగళ స్వభావము గలవాడు జగన్నిమిత్తంబు నగు పరమేశ్వరుఁడు ప్రకృతిద్వారా జగద్రూపుఁడగుట సముతంబగుచున్నయది. ఎందుకనఁగా? శివుఁడు చేతనాచేతన రూపముగ పరిణమించు సామర్థ్యము గలవాడు.

ప్రశ్న ; పరిణామమనఁగా కారణరూపమునకు వికారము కలుగుట గదా! పూర్వ రూపమును విడనాడి రెండవ రూపము నొందుటయు పరిణామమగును. ఐతే పరమేశ్వరుఁడు అనర్థధర్మమగు పరిణామముఁజెంది తన యపకర్షను చాటుకొనునా!

ఉత్తరము : నీవనునది నిజమే; నిమిత్తము ఉపాదానమైనను వికారాది స్పర్శ గాకుండునట్లు ఇఁట పరిణామమును గాననగును. "ఓహో! మీరు చెప్పెడు పరిణామము అపూర్వముగా నున్నదే; అద్దానిని వినుటకు మేము తత్తఱపడుచున్నాము" అనినచో వినుడు! చెప్పెదము.

ఇందుకు ప్రమాణము

"యదా తమ స్త న్నదివా నరాత్రి ర్నసన్న చాసచ్ఛివ ఏవ కేవలః, తదక్షరం తత్సవితు ర్వరేణ్యం, ప్రజ్ఞా చ తస్మాత్ ప్రసృతా పురాణీ".

''ఎప్పుడు ఈ ప్రపంచము చంద్ర సూర్యాది తేజస్సులు లోపించుటచేసి దివారాత్రి విభాగము లేనిదియు నామరూప విశేషరహితమగుటవలన స్థూలసూక్ష్మ చేతనాచేతన సదసత్తుల యేర్పాటు లేనిదియు తమోమాత్రమగునో అట్టితఱి శివుఁడొక్కఁడే తనతో విభజింపరాని చిదచిచ్ఛక్తులు గలవాడగు కతన కేవలుఁ డనఁబఱగుచు స్వప్రకాశుఁడై మిగిలియుండువాడు. అట్టి శివతత్త్వమే అక్షర మనఁబఱగును. పూర్వము సృష్టి కాలమున సూర్యునకు తేజస్సు నొసగు వాడగుటచే సూర్యాతీతుఁడగును. సూర్యునిలో నుండు ప్రకాశమున్ను శివుఁడేను; తనకు వేరైన చేతనాచేతన ప్రపంచమును తనలో దాచినవాడు నద్వితీయుడు నగు శివునినుండి నిత్యసిద్ధయు ప్రళయతమస్సును తొలగించునదియు మహాస్ఫుర ణంబు నగు జ్ఞానశక్తి యావిర్భవించినది. ఆటుపిమ్మట "సోఽకామ యత బహు స్యామ్" నామరూపవిభాగము లేని సూక్ష్మచిదచిద్వస్తువులు శరీరముగా కారణావస్థఁజెందిన పరమాత్మ - నామరూప విభాగము కలిగిన స్థూల చిదచిద్వ స్తువులు శరీరముగా కార్యావస్థఁ జెందుదునని సంకల్పించినవాడు తరువాత "ఇదం సర్వ మసృజత యదిదం కించ" స్వశరీరమగు సూక్ష్మ చిదచిద్వస్తువును తన నుండి విడదీసి "తత్ సృష్ట్వా తదేవానుప్రావిశత్" స్వవిభక్తమైన చిదచిద్వస్తువు నందు తా నంతర్యామిగా ప్రవేశించియు "సచ్చ త్యచ్చాభవత్" నానావిధ సదసత్ ప్రపంచ రూపముతో ననేక రీతులుగ పరిణమించినవాడు. జగద్రూపుఁడగు పర మాత్మ - జగత్కారణమగుటను దిగువ శ్రుతియందు గాననగును.

"మాయాం తు ప్రకృతిం విద్యా - న్మాయినం తు మహేశ్వరమ్;"

తస్యావయవభూతేన - వ్యాప్తం సర్వమిదం జగత్" అనుచో మాయ-సకల జగత్ప్రకృతి (ఉపాదాన) యనియు మహేశ్వరుఁడు ప్రకృతి నధిష్ఠించి యుండువాడనియు మాయావిశిష్టుఁడైన మహేశ్వరుని యంశంబు చిచ్ఛక్తిఁదగు కిరణంబు, భోక్తృదశయందు పురుషుఁడు ననువానితో జగము వ్యాపింపఁబడుటయు విశదమగుచున్నవి. ఎట్లనఁగా? లోకములో కేవలము శరీరమునుండి గాని కేవ లము ఆత్మవలనఁగాని వెంట్రుకలు గోళ్ళు పుట్టనట్లు కేవలము శివునినుండిగాని కేవలము మాయవలనఁగాని జగము యావిర్భవింపనట్టిది. కాని శరీరముతో కూడిన జీవాత్మవలన కేశనఖాదులు ఉదయించునట్లు మాయావిశిష్టుఁడగు మహేశ్వరుని వలన సకల చేతనాచేతన ప్రకృతియగు పురుషుఁడు ఆవిర్భవించువాడు. పురుష స్వరూపుఁడైన శివునివలన నవ్యక్తము చతుర్ముఖుఁడు మున్నగువారు జన్మించు

వారు. కావుననే "పురుషో వై రుద్రః" అను శ్రుతివాక్యము-పరమేశ్వరుఁడు పురుషరూపుఁడని వక్కాణించినది. అందువలన చిదచిద్విశిష్టుఁడైన పరమేశ్వరుఁడు-సూక్ష్మస్థూల దశల నొందువాడగుటచే కారణము కార్యంబు నగుట సముచితంబే యగునది. శరీరికి పరిణామిత్వమును భావించునెడ శరీరము పరిణమించునదగుటఁ జేసి శరీరవిశిష్టుఁడైన జీవుఁడు-కృశించినవాడను బలసినవాడను అని సంకల్పించినట్లు పరమేశ్వరుఁడును శక్తిద్వారా పరిణమించువాడైనను శక్తివిశిష్టుఁడగుటచే స్వతః పరిణామము గలవాడగునని చెప్పఁబడినది.

ప్రశ్న : "ఛందాంసి యజ్ఞాః క్రతవో వ్రతాని-భూతం భవ్యం యచ్చ వేదా వదంతి, తస్మా న్మాయీ సృజ్యతే విశ్వమేత-త్తస్మిం శ్చాన్యో మాయయా సన్నిరుద్ధః" అనుచో మాయాశక్తి - జీవాత్ముఁడగు బంధమునకు హేతు వగునని చెప్పఁబడినది గదా! అదియే "మాయాం తు ప్రకృతిం విద్యాత్" అనుచో పరామర్శింపఁబడుచున్నయది ఇట్టిది సర్వానుగ్రాహకురాలుగా శైవీ చిచ్ఛక్తి యగునని యెట్లు చెప్పనగును ?

ఉత్తరము : ఆత్మలకు జీవత్వమును కలుగఁజేసి సకల సంసారనిదానము రోధశక్తియు నగు మాయయందు మలావరణమనఁదగు పాశమను వ్యవహారమును శివాగమములయందు గాననగును.

శ్లో॥ తాసాం మాహేశ్వరీ శక్తిః - సర్వానుగ్రాహికా పరమ్,
పరానువర్తనాదేవ - పాశ ఇత్యుపచర్యతే॥

ఇంతియేగాక నజా మంత్రమునందు మాయ (సర్వసేవ్యురాలైనను) స్వరూపముతో విడువఁదగినదని "జహాత్యేనాం భుక్తభోగా మజోఽన్యః" అనుచో ప్రతిపాదింపఁబడినది.

కూర్మపురాణము నందు

శ్లో॥ కైషా భగవతీ దేవీ - శంకరార్ధ శరీరిణీ,
శివా సతీ హైమవతీ - యథావ ద్బ్రూహి పృచ్ఛతామ్॥

"శంకరుని సగము శరీరమనఁదగు పార్వతీదేవి యెట్టిదో మాకు యథార్థముగ వచింపుడ"ను ప్రశ్నకు సమాధానముగ దిగువ శ్లోకములను గాననగును.

శ్లో॥ తస్య సర్వజగత్సూతిః - శక్తి ర్మాయేతి విశ్రుతా,
తయేదం భ్రామయే దీశో - మాయావీ పురుషోత్తమః॥
సైషా మహేశ్వరీ శక్తిః - సర్వాకారా సనాతనీ,
సైవ రూపం మహేశస్య - సర్వదా సంప్రకాశయేత్॥
సర్వశక్త్యాత్మికా మాయా - దుర్నివారా దురత్యయా॥

పరమేశ్వరుని శక్తి - సర్వజగత్ప్రసూతియై మాయ యనఁబడును. ఇద్దానిని సాధనముగా గొనియే పురుషోత్తముండైన పరమాత్మ - ప్రపంచమును భ్రమింపఁజేయువాడు. సర్వరూపిణి సనాతనియు నగు మాయయే మహేశ్వరుని శక్తి యనఁబడుచున్నయది. మరియు మహేశ్వరునకు రూపంబునై ఎల్లకాలము ప్రకాశింపఁజేయునది. సర్వశక్తి స్వరూపురాలైన మాయ నతిక్రమింపను తొలగింప నేరికిని శక్యము కాదు" ఇంకను శ్రుత్యంతరములయందు మహేశ్వరుని శక్తియే పరమాకాశముగ వ్యవహరింపఁబడుచున్నయది. ఇఁక మహేశ్వరుని శక్త్యంశముగ నావిర్భవించిన నారాయణుఁడు - హరివంశమునందు దిగువ విధముగ పేర్కొనఁబడినవాడు.

విశ్వము నధిష్ఠించియుండు శివుఁడు - ప్రకృత్యతీతుఁడనియు పరమ పురుషుఁడైన శివుని మొదటి రూపమగు ఉమాదేవిఁ దగు వ్యక్తమైన భాగము మహావిష్ణువనియు శివాత్మక శక్త్యంశబలమున నారాయణుఁడు బ్రహ్మాది సకల ప్రపంచమును సృజింపఁగలిగెననియు ఏవమాది సందర్భమును పారిజాతాపహరణమునందు నారదుఁడు దేవేంద్రుఁగూర్చి వక్కాణించినట్లు గాననగును.

కూర్మ పురాణమున "కైషా భగవతీ" అను ఋషుల ప్రశ్నకు సమాధానమును మహాయోగియగు నారాయణుఁడు స్వమూలరూపమగు శక్తితత్త్వమును ధ్యానించి చెప్పినవాడని కలదు. మఱియు నదే పురాణమునందు శ్రీకృష్ణుని తపశ్చర్యచే సంతుష్టుడై సాక్షాత్కరించిన శివునితో నేతెంచిన పార్వతీదేవి "కుమారా? నీ భక్తి శివునియందు నాయందు ననన్యమైనదని గ్రహించితిని. దేవతా ప్రార్థన ననుసరించి దేవకీ సుతుడవై జన్మించినాడవు గదా! ఐతే మన యిరువురికి సోదర సోదరీ భావముండుటఁజేసి భేదమును పాటింపరాదు. జ్ఞానులు అభేదమునే భావింతురు" ఇట్లు నారాయణుఁడు శక్త్యంశ సంభూతుఁడైన నెల్లకాలము పురుషుఁ డనఁ

బఱగుననియు తదితరమంతయు (శక్త్యంశము) స్త్రీప్రాయంబనియు నారసింహ పురాణమున వక్కాణింపఁబడినది.

సూ. "యోనిశ్చ హి గీయతే" 1-4-28

"ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం - త్రిలోచనం నీలకంఠం ప్రశాంతమ్,
ధ్యాత్వా ముని ర్గచ్ఛతి భూతయోనిం - సమస్త సాక్షిం తమసః పరస్తాత్"

అను శ్రుతియందు సమస్త ప్రాణుల యుత్పత్తికి కారణమగువాడనియు సమస్త సాక్షి యనియు విశ్వోత్తీర్ణుఁడనియు ఉమాసహాయుఁడు, నియామకుఁడు, త్రిలోచనుఁడు, నీలకంఠుఁడు ననియు ప్రశాంతుఁడనియు పరమేశ్వరుఁడు ప్రతిపాదింపఁబడుచున్నవాడు. ఇందు భూతయోనిత్వము ముఖ్యముగా గమనార్హమగుటచే పరమేశ్వరుఁడే జగదుపాదానము జగన్నిమిత్తంబు నగువాడని సిద్ధాంతము.

## సర్వవ్యాఖ్యానాధికరణము

సూ. "ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః" 1-4-29

"జన్మాద్యస్యయతః" అను సూత్రము మొదలుకొని పై సూత్రము వరకు (137 సూత్రములుగల యధికరణములయందు) వేదాంత వాక్యములను వ్యాఖ్యానించుటవలన బ్రహ్మలక్షణ ప్రతిపాదక వేదాంత వాక్యములు, కర్మకాండలో నంతర్భూతములైన పురుషసూక్త శతరుద్రీయాది మంత్ర బ్రాహ్మణ భాగములు, స్మృతులు, ఇతిహాసములు, పురాణములు, ఆగమములు, అభియుక్తసూక్తి విశేషంబులును వ్యాఖ్యాతప్రాయములైనవని తెలియవలెను. సూత్రములో "వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః" అను ద్విరుక్తి - అధ్యాయ పరిసమాప్తిని సూచించునది. (అథాతో బ్రహ్మ జిజ్ఞాసా"సూత్రమును కలుపుకొని ప్రథమాధ్యాయాంతిమ సూత్రమువరకు 138 సూత్రములగును.)

ఇఁట కర్మప్రకరణపఠితములైన పురుషసూక్త శతరుద్రీయాదులకు స్మృతీ

తిహాస పురాణాదులకున్ను తాత్పర్యము అనఁబడు లింగముఁ దగు సమన్వయ ముతో బ్రహ్మబోధకత్వము కలదా లేదా అని సందేహము. ప్రకరణభేదము-సంశయమునకు కారణము.

ప్రశ్న : కర్మప్రకరణముఁ జెందిన పురుషసూక్తాదులు - అనుష్ఠాత యగు జీవాత్మను నిరూపించుట సముచితమని తోఁచెడిని. నిత్యముక్తుఁడగు పరశివుని బోధించుటలో ప్రయోజనము గానరాదు. స్మృతి పురాణాదులును ఒకే విషయమును చెప్పుట లేదు. ఎట్లనఁగా? అవ్వానిలో కొన్ని చతుర్ముఖబ్రహ్మను మరికొన్ని విష్ణు మూర్తిని తదితరములు రుద్రుని దేవేంద్రుని శక్తిని అగ్నిని సూర్యుని అన్యాన్య దేవతలను పరమాత్మగా ప్రతిపాదించినవి. కావున నియ్యవి బ్రహ్మబోధకములగు నని చెప్పుట యెట్లు పొసగును ?

ఉత్తరము : పురుషసూక్తాదులయందు బ్రహ్మలక్షణములు కనఁబడుటచే నయ్యవి బ్రహ్మ బోధకంబులగుచున్నవి. ''తస్మా ద్విరాడజాయత" "ఆదిత్య వర్ణం తమసస్తు పారే" "తమేవం విద్వా నమృత ఇహభవతి" అనుచో సకలకార ణత్వము తమసః పరత్వము అమృతహేతుత్వము మున్నగు పరమేశ్వరుని లక్షణ ములు విదితములగుచున్నందున నిట పురుష శబ్దముతో పరమేశ్వరుఁడే ప్రతిపా దింపఁబడుచున్నవాఁడని తెలియవలెను. శతరుద్రీయమునందును పరమేశ్వరుఁడు సాక్షాత్ జగదధిపతి యనియు జగదాత్మకుఁడనియు నీలగ్రీవాది లక్షణములు గల వాఁడనియు వక్కాణింపఁబడినది కావున పరమాత్మ - పురుషసూక్తాది బోధ్యుండ నుట సమంజసంబేను.

ప్రశ్న : పరమేశ్వరుఁడు నిఖిల మాంగళ్యగుణ రత్నాకరుఁడగుటచే శత రుద్రీయమునందు చెప్పఁబడుట - యుక్తము కాఁజాలదు. ఎందుకనఁగా? ప్రారంభముననే "నమస్తే రుద్ర మన్యవే" అను వాక్యమున హేయగుణమనఁదగు క్రోధము రుద్రునకు సంబంధించునని విదితమగుచున్నది గదా!

ఉత్తరము : ఇట్లు భావింపఁగూడదు. ఇఁట మన్యుశబ్దము యజ్ఞ వాచకం బగునది. అథవా క్రోధవాచకమగునని చెప్పినను దోషమేమియు లేదు. ప్రకృతి గుణమగు క్రోధమును దుష్టనిగ్రహార్థము స్వేచ్ఛగా పరిగ్రహించుటచే పరమేశ్వ రునియందు ఇద్దాని సంబంధమును భావింపరాదు. పురాణాదులున్ను తాత్పర్య

లింగవశమున బ్రహ్మవిష్ణ్వాది శబ్దవాచ్యుఁడు సర్వజ్ఞుఁడు సర్వశక్తిమంతుఁడు సర్వాధికుఁడు ఇతరులకు సాధ్యముకాని వైభవము గలవాడు బ్రహ్మశబ్దార్థమునకు విశ్రాంతిస్థాన మగువాడు వేదాంత వాక్యము లన్నిటిఁదగు సామరస్యముతో కూడిన సమన్వయముఁ జెందిన తాత్పర్యమునకు పర్యవసానమగువాడు ఉమాసహాయుఁడు పరమేశ్వరుఁడు నగు శివునిఁగూర్చి బోధకంబులగుట - సమంజసంబగు చున్నయది. "కర్మప్రకరణమగుటచే శివప్రబోధకత్వము కూడ" దనగూడదు. లింగము ప్రకరణమును బాధించును గదా ! ఇట్టి న్యాయముతో చేతనుని యందు గాని అచేతనమునందు గాని జగత్కారణత్వాదికము వినఁబడు ప్రతి స్థలమునను వేదాది ప్రమాణ వచనములయందును ఆ యా రూపములతో శివుఁడే ప్రతిపాదింపఁ బడుచున్నవాడని తెలియునది. పురుషార్థములు వికారములు అజ్ఞానము మున్నగు ధర్మములు ప్రతిపాదింపఁబడిన చోట్లయందును పరబ్రహ్మమగు శివుని శరీరమగు చిదచిద్వస్తువే బోధింపఁబడుచున్నదని నిపుణముగా సమర్థించుకొనవలెననియు సర్వంబు సముచితంబగుచున్నయది.

ప్రశ్న : "నమస్తే రుద్రమన్యవ" ఇత్యాది మంత్రశ్రుతమగు రుద్ర శబ్దము "రుద్రో వా ఏష యదగ్నిః" అను శ్రుతిప్రమాణముఁబట్టి యగ్నిపరమగుచున్నందున ప్రకరణ బలమునఁజేసి రుద్రాధ్యాయము - అగ్ని ప్రతిపాదకంబగునని చెప్పవలెను గాదా ?

ఉత్తరము : "దిశాంచ పతయే" ఇత్యాది వాక్యములు పరమేశ్వరుని సర్వాధిపతిత్వము మున్నగు లక్షణములను చెప్పుచున్నందునను భవ రుద్ర శర్వ పశుపతి శివ శంకరాది శబ్దములతోడను శతరుద్రీయమును వినునప్పుడే "పరమేశ్వర పరము రుద్రాధ్యాయము" అను నంశము తేటపడుచున్నది గదా! "రుద్రో వా ఏష యదగ్నిః" అనునది అర్థవాదవాక్య మగుటచే అగ్నిపరమనుటకు ప్రమాణము కాజాలదు.

ప్రశ్న : పురాణములు తాత్పర్యలింగవశమున శివుని ప్రతిపాదించు చున్నవని చెప్పితిరి గదా ! అవ్వానిలో కొన్నిటిని బ్రహ్మదేవుఁడు సాత్త్విక స్వభావముతో చెప్పెననియు మరికొన్నిటిని రాజస స్వభావముతోడను తదితరములను తామస స్వభావముతోడను వక్కాణించె ననియు కలదు గావున వైష్ణవములు సాత్త్వికములనియు బ్రాహ్మపురాణములు రాజసములనియు శైవములు తామసము

లనియు గ్రహించునది. అందుకు పులస్త్యుని వరప్రభావమున దేవతా పరమార్థ మును కనుగొనిన పరాశరమహర్షి వచించిన విష్ణుపురాణము ప్రజల ప్రమాణ మనఁ జెల్లును. "విష్ణోః సకాశా దుద్భూతం - జగత్తత్రైవ చ స్థితమ్" "విష్ణువునుండియే సమస్త జగము ఉద్భవించినది. ప్రళయమున విష్ణువునందే యుండునది" ఇత్యాది ముఖ్యాంశములు - విష్ణుపురాణమునందు వ్రాయఁబడియుండుటఁజేసి వైష్ణవపురాణ ములుమాత్రము ప్రమాణములు కావలయును గదా ?

ఉత్తరము : ఇఁట తాత్పర్యలింగమనఁగా ? సర్వకారణత్వాదులు పర్యవ సానముఁబొందు సమన్వయ మగును. బ్రహ్మవిష్ణు రుద్రులకు పురాణములలో వినఁ బడు సర్వకారణత్వము సర్వసంహర్తృత్వము సర్వాంతర్యామిత్వము మున్నగు బ్రహ్మలక్షణములన్నియు సర్వాంతర్యామియగు పర శివుని యందే పర్యవసాన ముఁ జెందునవి.

శ్లో॥ స్మృతయశ్చ పురాణాని- భారతాదీని సత్తమ,
శివ మేవ సదా సాంబం- హృది కృత్వా బ్రువంతి హి ॥

పరాశర పురాణము.

"స్మృతులు పురాణములు మహాభారతము మున్నగు ఇతిహాసంబులును సాంబశివు నెల్లకాలము మనస్సునందిడుకొనియే ప్రవర్తించునట్టివి." ఇట్లు పురాణ ములలో పరస్పర విరోధమును పరిహరింప నంగీకరింపనియెడల భాష్యముల యందలి యధికరణములలోని విషయవాక్యములయందు వినఁబడు సర్వకారణ త్వాది బ్రహ్మలక్షణములయొక్కయు ప్రాణ ఆకాశ ఇంద్రాది ప్రకరణముల యొక్కయు విరోధము దుష్పరిహరంబగునది. శ్రుతులలో గల విరోధమును నిరా కరించి శ్రుతిప్రామాణ్యము నంగీకరించినట్లు పురాణములకుగూడ నవిరోధ ప్రమా ణత్వమును నిరూపింపవలసి యుండును.

శ్లో॥ పురాణం మానవో ధర్మః-సాంగో వేద శ్చికిత్సితమ్,
ఆజ్ఞాసిద్ధాని చత్వారి-న హంతవ్యాని హేతుభిః ॥

పురాణములు, మానవస్మృతి, సాంగవేదము, ఆయుర్వేదము అను నాలుగు, పరమేశ్వరాజ్ఞాసిద్ధము లగుటచే హేతువాదములతో నవ్వానిని ఖండింపరాదు."

ఇఁక శివపురాణముల యప్రామాణ్యమునకై పరులు చూపిన మాత్స్య పురాణవచనములు "వృత్రాసురుని స్వవాగ్వజ్రమువలె'' పరపక్షమునే బాధించు చున్నవి. ఎట్లనఁగా ? పురాణములు బ్రహ్మ విష్ణ్వాదులలో నొకరికన్న నొకరు గొప్పవారని ప్రతిపాదించునవి గదా! అట్టి ప్రతిపాదనము కల్పభేదమును పురస్క రించుకొనిన యుత్కర్షముఁ జెందినదగుటచే ఎట్టి విరోధము లేని ప్రామాణ్యము పురాణముల కన్నిటికిని గలదని మాత్స్య పురాణవాక్యములు తెలుపుచున్నయవి. లోకములో వేడి యెక్కువనుండు కాలము గ్రీష్మమనియు చలువ నిండియుండు సమయము హేమంతమనియు వ్యవహరింపఁబడినట్లు సత్త్వాది గుణాతిశయము గలవారిని సాత్త్వికాది పదములతో నిర్దేశించునట్లును కల్పములయందు సాత్త్వికాది విభాగంబును పరమేశ్వరుని శాసనముతో నేర్పడు సత్త్వాది గుణముల యతిశయము వలననే యని గ్రహించునది. కాని ఆ యా కల్పములయందు చతుర్ముఖునకు కలుగు గుణోత్కర్షముఁబట్టి సాత్త్వికాది విభాగము కాజాలదు. మరియు పరులు చెప్పునది మాత్స్యపురాణ వచస్సులందు కంఠరవేణ లేకుండుటయు గమనింపఁ దగినది. మాత్స్యమునందే "పురాణం మానవో ధర్మః'' అనుచో చెప్పఁబడిన పురాణమాత్ర ప్రామాణ్యమును మరియు శిష్టులందరు పురాణముల నన్నిటిని పరి గ్రహించుటను ఉల్లంఘించి ''కొన్ని పురాణములు - భ్రాంతి మూలకము''లని కల్పించుట - వైదికమార్గ ప్రద్వేషమాత్ర విజృంభణమని చెప్పక తప్పదు. పర రీతిని శివపురాణముల యపకర్షము ఏర్పడుట లేదు. ప్రత్యుత- ఉత్కర్షమునే గాన నగును.

శ్లో॥ సంకీర్ణాః సాత్త్వికాశ్చైవ-రాజసాశ్చైవ తామసాః ॥

కల్పములు - సాత్త్వికములనియు రాజసములనియు తామసములనియు సంకీర్ణములనియు నాలుగు విధములుగా విభజింపఁబడినవి.

శ్లో॥ యస్మిన్ కల్పేతు యత్ ప్రోక్తం - పురాణం బ్రహ్మణా పురా,
తస్య తస్య తు మహాత్మ్యం-తత్స్వరూపేణ వర్ణ్యతే ॥

ఇఁట బ్రహ్మదేవుఁడు- పురాణముల నా యా కల్పములయందు రచించిన వాడని చెప్పఁబడలేదు కాని ఆ యా కల్పములలో నభివృద్ధిఁజెంది యుండు దేవతా విశేషముఁ దగు మహిమను వర్ణించినవాడని తెలియునది. ఐతే ఎట్టి గుణ ముతో నే పురాణమును రచించినవాడని యాకాంక్షింప నెంతమాత్రంబు నిట వీలు

లేదు. కాని యిద్ది యే దేవతను సమర్థించునను జిజ్ఞాసకు సమాధానముగా దేవతా విశేషము చెప్పఁబడినది. ఇంతియేగాక ''సాత్త్వికేష్వథ కల్పేషు" అనుచో సాత్త్వికాది విభాగము కల్పములకే గాని పురాణములకు కాదని విశదమగును గదా! మఱియు కల్పబేదమును పురస్కరించుకొని త్రిమూర్తులలో యుత్కర్షాపకర్షములు ఏర్పడుచుండునని శివపురాణములోని వాయవీయ సంహితయందు గానఁగును.

శ్లో॥ క్వచిద్బ్రహ్మ క్వచిద్రుద్రః-క్వచి ద్విష్ణుః ప్రశస్యతే,
నానేన తేషా మాధిక్యం-న్యూనత్వం వా కథంచన।
త త్తత్కల్పాంతవృత్తాంత-మధికృత్య మహర్షిభిః.
తాని తాని ప్రణీతాని-విద్వాం స్తత్ర న ముహ్యతి ॥

బ్రహ్మదేవుఁడు కొన్ని కల్పములయందు, రుద్రుఁడు కొన్నిటియందు, విష్ణువు మరికొన్నిటియందు ప్రశంసింపఁబడుచున్నవారు. ఇంతమాత్రమున నవ్వారిలో నొకరికి గొప్పదనమును మరియొకరికి చిన్నతనమును భావింపరాదు. కాని మహర్షులు- ఆ యా కల్పముల చివరి సమాచారమును పురస్కరించుకొని కల్పముల విభాగము నేర్పరువఁజేసి యున్నవారు. అంతమాత్రమున నివ్విషయమై విద్వాంసుఁడు మోహముఁజెందరాదు."

ఇట్లు పరులుదాహరించిన మాత్స్య పురాణవచనములతోడనే సర్వపురాణ ప్రామాణ్యమును నెలకొల్పుటవలన నవ్వారి వాదము నిహతమైనదని తెలియునది.

ఒకవేళ బ్రహ్మదేవుఁడు - తమోగుణము నుపాధిగా గొని శివపురాణముల నావిష్కరింపఁజేసెనని యంగీకరించినను అవ్వాని ప్రామాణ్యము సిద్ధించుచున్నది.

శ్లో॥ జ్ఞాన మప్రతిమం యస్య-వైరాగ్యంచ జగత్పతేః,
ఐశ్వర్యం చైవ ధర్మశ్చ-సహ సిద్ధం చతుష్టయమ్ ॥

"అసమానమైన జ్ఞానము, వైరాగ్యము, ఐశ్వర్యము, ధర్మంబు అను నాలుగు - బ్రహ్మదేవునకు సహజములైనవి'' అనుచో జ్ఞానవిశేషము గలవాడుగ చెప్పఁబడిన చతుర్ముఖుఁడు- తమోగుణమును ఉపాధిగ గొనియు వక్కాణించిన పురాణవిశేషము ప్రమాణము ఎట్లు కాకుండును ? తథాపి మనవలె తమోగుణమున

తత్త్వజ్ఞానము లేనివారై రచించిన పురాణములు ప్రమాణములు కావనునెడ పూర్వో దాహృత మాత్స్యపురాణ శ్లోకములకున్ను ఇదియే గతి పట్టును గదా!

శ్లో॥ పురాణం సర్వశాస్త్రాణాం-ప్రథమం బ్రహ్మణా స్మృతం.
అనంతరం తు వక్త్రేభ్యో-వేదా స్తస్య వినిర్గతాః॥
మత్స్యపురాణము.

బ్రాహ్మమేవ కృతే చాద్యే-పురాణం ధర్మసంహితం,
అష్టాదశవిధం తచ్చ-కృతం కోటిప్రభేదతః॥ ధర్మసంహిత.

"శాస్త్రము లన్నిటిలో పురాణమును మొదట బ్రహ్మదేవుఁడు స్మరించిన వాఁడు. అటుపిమ్మట నాతని ముఖములనుండి వేదములు బయలుపడినవి."

"ఆద్య సమయమున కృతయుగమునందు శతకోటి శ్లోకములతో పురాణము ఒక్కటిగా నుండెను. తరువాత ఋషులు పదునెనిమిది విభాగములతో కోటి గ్రంథముగా సంగ్రహించిరి."

ఇంకను దిగువ ప్రమాణములను చూడనగును.

"యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" శ్రుతి.

ఇఁటగల చ శబ్దము పురాణములను శివాగమసంహితలను తెలుపునది.

"తస్మై వేదాన్ పురాణాని-దత్త్వా నగ్రజన్మనే"
కూర్మ పురాణము.

ఇఁక పరమేశ్వరుఁడే. వేదాది సకలవాఙ్మయకర్త యనుటకు దిగువ శ్రుతి పురాణ వాక్యములను గమనింపనగును.

"అస్య మహతో భూతస్య నిశ్వసితమేతత్, యదృగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వవేద ఇతిహాస పురాణమ్"

శ్లో॥ ఆదికర్తా కవిః సాక్షాత్-శూలపాణి రితి శ్రుతిః,
భూయః స భగవాన్ ధ్యాత్వా-చిరం శూలవరాయుధః॥

అసృజ త్సర్వశాస్త్రాణి-మహాదేవో మహేశ్వరః,
ఇత్యేతాః శంకరప్రోక్తా-విద్యాః శబ్దార్థ సంయుతాః ॥

రాజధర్మవచనము.

విద్యాస్థానముల కన్నిటికిని పరమేశ్వరుఁడే కర్తయని పై ప్రమాణముల వలన విశదమగుచున్నందున బ్రహ్మదేవుఁడు తమోగుణముగలవాడై కొన్ని పురాణములను రచించెననియు అందువలన నయ్యవి ప్రమాణములు కావనియు శంకించుటకు ఎంతమాత్రము అవకాశము లేదు.

ఇఁక చతుర్ముఖుఁడు సత్త్వాది గుణము ప్రధానముగా గల దేవతను ప్రతిపాదించుటలో న్యూనత యేమియు గానరాదు. సాత్త్వికములుగా పరులచే నామోదింపఁబడిన పాద్మాది పురాణములయందు గల శివరాఘవ సంవాదమున తదితర ప్రకరణములయందు లింగపురాణాదులకన్న నధికముగా శివోత్కర్షము ప్రతిపాదింపఁబడినందున సాత్త్వికాది పురాణ విభాగము మృగతృష్ణవలె నిరర్థకమగుచు పరులకు వృథాఽఽయాస ఫలకమగుచున్నది.

పరాశర సంహితారూపమైన విష్ణుపురాణము ప్రబల ప్రమాణమని చెప్పు నంశము- వాయుసంహితా రూపమగు శివపురాణమునకు గల ప్రాబల్యమును సమర్థించుచునది. ఎట్లనఁగా ?

శివ మహాపురాణము - సర్వజ్ఞత్వ వైరాగ్యాది గుణసంపన్నుఁడైన పితామహునిచే వక్కాణింపఁబడినది. అందు పరతత్త్వమును తెలియగోరి పరస్పరము వాదించుకొనిన షట్కులీన మహర్షులు బ్రహ్మసభలో ప్రవేశించి “పూజ్యుఁడా ! గొప్పదైన అజ్ఞానాంధకారము మమ్మావరించి యున్నందున పరతత్త్వమును కనుగొనఁజాలకుంటిమి. చిత్రకృత్యుండైన ఏ మహానుభావుఁడు జగమును పుట్టించెను ? మరియు నియ్యది ప్రళయమున నెవనియందు విశ్రాంతిఁజెందును ?” అని జగత్కారణమగు పరదైవమునుగూర్చి సామాన్యముగా ప్రశ్నించిరి. అట్టితఱి పితామహుఁడు- స్వపీఠమునుండి లేచినవాడై శివధ్యానముఁగావించి “రుద్రుఁడు” అను పదము నుచ్చరించుచు ఆనందాంబుధిని గ్రుంకులిడి కృతాంజలియై ఇట్లు సంభాషించెను.

శ్లో॥ యస్మా త్సర్వమిదం బ్రహ్మ-విష్ణు రుద్రేంద్ర పూర్వకం,
సహ భూతేంద్రియైః సర్వైః-ప్రథమం సంప్రసూయతే ॥

కారణానాం చ యో ధాతా-ధ్యాతా పరమకారణం,
న సంప్రసూయతేఽ న్యస్మాత్-కుతశ్చన కదాచన ॥

"బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఇంద్రాది దేవతలు సకల ప్రాణులు ఇంద్రియములు అన్నియు ఎవనివలన మొదట నావిర్భవించినవో అట్టి శివుఁడే కారణములకు కారణమగువాడు మరియు ఎప్పుడును తానెద్దాని వలనను జన్మించువాడు కాడు గావుననే పరమకారణ మనఁబఱగును."

వేదాంతములయందు ననేక శాఖలలో నధికముగా నభివర్ణింపఁబడిన శివుని నానావిధ వైభవమును ఇట్లు ప్రశంసించి చిత్రకృత్యముగల పరశివుఁ డీ జగమును పుట్టించె ననియు మరల తనలోనే లీనముఁ జేసికొనుననియు శివుఁడే సకలకారణమగు పరదైవంబనియు పక్కాణించినందున శివ మహాపురాణమే ప్రబల ప్రమాణమని విశదమగుచున్నది.

ఇఁక విష్ణుపురాణమున- శిష్యుఁడైన మైత్రేయుని ప్రశ్నకు మున్నే నవ్వాని హృదయమును కనుగొనిన పరాశరుఁడు పూర్వసిద్ధమగు శిష్య భక్తిని పెంపొందింపఁదలచి విష్ణుపారమ్యము నభివర్ణించిన వాడని కలదు. శివపురాణమునందైతేనో ప్రశ్నించినవారు పెక్కురగుటచే నొకానొకని యుద్దేశము ననుసరింపకయే బ్రహ్మదేవుఁడు సమాధానము నొసగుట గమనింపఁదగియున్నది.

వేద పురాణ వాక్యములన్నియు శివునియందు తాత్పర్యము గలిగియున్నవని సూతసంహిత- చాటుచున్నది.

శ్లో॥ కానిచిత్ వేదవాక్యాని-బ్రాహ్మణా వేదవిత్తమాః ।
రుద్రమూర్తిం సమాశ్రిత్య-శివే పరమకారణే ॥
పర్యవస్యంతి విప్రేంద్రా- స్తథా వాక్యాని కానిచిత్ ।
విష్ణుమూర్తిం సమాశ్రిత్య-బ్రహ్మమూర్తిం చ కానిచిత్ ॥
ఆగ్నేయమూర్తి మాశ్రిత్య-శ్రుతివాక్యాని కానిచిత్ ।
సూర్యమూర్తిం మునిశ్రేష్ఠా- స్తథైవాన్యాని కానిచిత్ ॥
ఏవం మూర్త్యభిధానేన-ద్వారేణైవ మునీశ్వరాః ।
ప్రతిపాద్యో మహాదేవః-స్థితః సర్వాసు మూర్తిషు ॥

మఱియు "సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ" అనుచో గల జగదాత్మకత్వము సూర్యునియందుగాక "స యశ్చాయం పురుషే యశ్చాసా వాదిత్యే" అను ప్రమాణముఁబట్టి మహేశ్వరునియందే నుపపన్నంబగునని తెలియవలెను. అట్లే "ఇంద్రో రాజా జగతో య ఈశే" అనుచో గల జగదీశ్వరత్వము దేవేంద్రుని యందు గాక "ఇంద్రస్యాత్మానం శతధా చరంతమ్" అను శ్రుతి ననుసరించి పరమేశ్వరునియందే సమర్థింపఁబడునని గ్రహించునది.

"ఆపో వా ఇదగ్ం సర్వం" ఇత్యాది సందర్భములయందు గల పరత్వము గూడ శివునియందే పర్యవసానముఁ జెందునది. ఐతే శరీరాది నిర్వచనములు గల చోట్లయందు శరీరాది నిరూపణమునందే తాత్పర్యము కాని తదంతర్యామియగు శివుని నిరూపించుట కాజాలదు. జీవ విషయమున్ను ఇట్టిదేను; జీవాత్మకు సంసారమున విరక్తి యేర్పడి శరీరాదులపై హేయభావమును కలుగఁజేయుటకు మాత్రము చేతనాచేతన పరామర్శగల ప్రకరణములు ఉపయోగించునని తెలియునది.

"యం పృథివీ న వేద, యస్య పృథివీ శరీరమ్" ఇత్యాదిని గల పృథివ్యాది పదములు-పరమేశ్వరునిచే నియమింపఁబడు పృథివ్యాది దేవతలనే బోధించును కాని తదంతర్యామిని బోధింపవు. ఎందుకనఁగా ? శివుఁడు పృథివ్యాద్యంతర్యామియైనను అవ్వానిచే తెలియఁబడకుండువాడని తదనంతరమే చెప్పఁబడినది.

ఈ యధికరణమునందును నారాయణ పరత్వము సమర్థింప నలవిగానిది. ఎట్లనఁగా? నారాయణునకు నవాంతర సృష్టియందు కల్పాంతరమున కారణత్వము చెప్పబడినను ఆదిసృష్టిఁజెందిన సర్వకారణత్వము ఉపపన్నము కాజాలదని గ్రహించునది. త్రిమూర్తి జనకుఁడగువాడే సర్వకారణుఁడగునని వివేకము. మూర్తిద్వయ జనకుఁడగువాడు సంకుచితకారణుఁడు కాదగును బ్రహ్మోపనిషత్తున "అకారం బ్రహ్మాణం నాభౌ, ఉకారం విష్ణుం హృదయే, మకారం రుద్రం భ్రూమధ్యే, ఓంకారం సర్వేశ్వరం ద్వాదశాంతే" బ్రహ్మ విష్ణు రుద్రాతీతము తురీయంబునగు శివ తత్త్వమే సర్వకారణముగా సహస్రారమునందు ధ్యానింపఁదగినదని ప్రతిపాదింపఁబడినది. మఱియు మైత్రేయోపనిషత్తునందు "తమో వా ఇదమేక మాస, తత్పరేణేరితం విషమత్వం ప్రయాతి" ఇత్యాది వాక్యమున "ఆదిసర్గమునకన్న మున్ను తమస్సే నుండెడిది. అట్టి తమస్సు (ప్రకృతి) పరమాత్మచే ప్రేరేపింపఁబడి సంచలనము కలది యగును.

అట్టితత్త్వ ప్రకృతివిశిష్టుఁడైన మహేశ్వరుని రజోగుణాంశము బ్రహ్మగాను సత్త్వగుణాంశము విష్ణువుగాను తమోగుణాంశము రుద్రుఁడుగా నావిర్భవించినవి." అని వ్రాయఁబడినది. ఇట్టి నాలుగవ తత్త్వము శివుఁడనుటకు మాండుక్యోపనిషత్తు మరియొక నిదర్శనము.

"శివ మద్వైతం చతుర్థం మన్యంతే, స ఆత్మా, స విజ్ఞేయః"

బ్రహ్మోపనిషద్గతమైన సర్వేశ్వరపదము-శివునకు అసాధారణ వాచకమగునది. "బ్రహ్మ విష్ణు రుద్రేంద్రాః సంప్రసూయంతే" అను నథర్వశిఖావాక్యంబు శివునకు మూర్తిత్రయ కారణత్వమును స్పష్టముగా వక్కాణించినది.

మఱియు మహాభారతమున అనుశాసనికమునందు

శ్లో॥ స ఏష భగవా నీశః - సర్వ తత్త్వాది రవ్యయః,
సర్వతత్త్వవిధానజ్ఞః - ప్రధాన పురుషేశ్వరః॥

సోఽసృజ ద్దక్షిణా దంగాత్ - బ్రహ్మాణం లోకసంభవం,
వామపార్శ్వాత్తథో విష్ణుం - లోకరక్షార్థ మీశ్వరః
యుగాంతే చైవ సంప్రాప్తే - రుద్రం ప్రభు రథాసృజత్॥

"సర్వతత్త్వాదియు అవ్యయుఁడును సర్వతత్త్వ విధానజ్ఞుఁడును ప్రకృతి పురుష నియామకుఁడు నగు పరమేశ్వరుఁడు-తన కుడి భాగము నుండి లోక స్రష్టయగు బ్రహ్మదేవుని పుట్టించెను. ఎడమవైపు నుండి లోక రక్షకుఁడగు విష్ణువు నావిర్భవింపఁజేసినవాడు. హృదయము నుండి లోకప్రళయంకరుడైన రుద్రు నావిష్కరింపఁజేసెను."

శాంతిపర్వమున

శ్లో॥ యం విష్ణు రింద్రః శంభు శ్చ - బ్రహ్మా లోకపితామహః,
స్తువంతి వివిధైః స్తోత్రైః - దేవదేవం మహేశ్వరమ్॥
త మర్చయంతి యే శశ్వత్ - దుర్గాణ్యతితరంతి తే॥

"బ్రహ్మ విష్ణు రుద్రాదులు అనేక స్తోత్రములతో దేవదేవుఁడైన మహేశ్వరుని ప్రార్థించుచుందురు. అట్టి శివు నారాధించువారు తమ సర్వవిధ సంకటములను

దూరమొనర్పఁజాలువారు" ఇఁట త్రిమూర్తులు శివుని ప్రార్థించుట-తమను కాపాడుటకే నని గ్రహించునది. మఱియు నదే శాంతిపర్వమున త్రిమూర్తులను సూర్య చంద్రాది జగమునంతయు సంహరించి తమోమయముగాను నామరూప విభాగ రహితముగా నొనర్చువాడు శివుఁడే నని నిర్ధారింపఁబడినది.

ఇందువలన "యతో వా ఇమాని భూతాని జాయంతే" ఇత్యాదిని ప్రబోధిత మైన బ్రహ్మము శివుఁడే నని నిశదమైనది.

శివపురాణమునందును

శ్లో॥ తస్మాత్త్రయ స్తే కథ్యంతే - జగతః కారణత్రయం।
కారణత్రయ మేతత్తు - శివః పరమకారణమ్॥

స్కాంద మహాపురాణమున

శ్లో॥ బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ - పరతత్త్వ విభూతయః।
ఏషాం త్రయాణా మధికః - సర్వకారణ మీశ్వరః॥

"బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముప్వురును పరమేశ్వరుని విభూతి యనఁబఱగుచు జగమునకు నవాంతరకారణ మగువారు. శివుఁడైతే తో త్రిమూర్తులకు నధిష్ఠాతయై పరమకారణ మగువాడు."

ప్రశ్న : మహోపనిషత్తున "ఏకో హవై నారాయణ ఆసీత్" అని చెప్పఁబడినందున "బ్రహ్మ విష్ణు రుద్రేంద్రాః సంప్రసూయంతే" అనుచో గల విష్ణు జన్మము స్వేచ్ఛాఽఽవిర్భావమని యంగీకరింపవలెను గదా ?

ఉత్తరము : అటులగునెడ "హిరణ్యగర్భః సమవర్తతాగ్రే" అనుచో చతుర్ముఖుఁడును సృష్టికి పూర్వము కలవాడని యున్నందున తదుత్పత్తిని గూడ స్వేచ్ఛాఽఽవిర్భావముగ చెప్పవలెను గదా ! వస్తుతః "బ్రహ్మ విష్ణు రుద్రేంద్రాః సంప్రసూయంతే" అను ప్రమాణమును పురస్కరించుకొని "ఏకో హ వై నారాయణ ఆసీత్" అనుచో "ఆసీత్" అను పదమునకు "రోహితో లోహితా దాసీత్" "శక్తే రాసీత్ పరాశరః" ఇత్యాదినివలె నుత్పత్త్యర్థమును చెప్పవలసియుండును. బ్రహ్మ రుద్రాదులు జన్మించుటకు పూర్వము నారాయణుఁడొకఁడు సర్గాద్యసమయమున పరమశివునివలన నావిర్భవించినవాడని చెప్పుట సమంజసంబగునది.

ఇఁట ఆసీత్పదమునకు పుట్టుకయను నర్థము పొసగుచున్నందున ఏకపద మునకు ''తనతో సమానముగ పుట్టువాడు మరియొకఁడు లే''డను నర్థమును చెప్పవలసియుండును.

ఒకవేళ ఏదే నాకరీతిగ ఆసీత్పదమునకు సత్తామాత్ర మను నర్థముఁ జెప్పినను "ఏష వా వ ప్రథమో యజ్ఞః'' అనుచో జ్యోతిష్టోమయాగమునకు ప్రాథమ్యము నిరూపితమైనను "దర్శపూర్ణమాసాభ్యా మిష్ట్వా సోమేన యజేత" అను శ్రుత్యంతరము జ్యోతిష్టోమయాగ ప్రాథమ్యమును సంకోచపరచినట్లు పరమశివమూర్తి-త్రిమూర్త్యతీతుండనియు సర్వమూలంబనియు తెలుపు పెక్కు వాక్కుల విరోధమును పోనాడుటకు "ఏకో హ వై నారాయణః" ఇత్యాది విష్ణుపర వాక్యములకు "నారాయణుఁ డొక్కఁడే పరశివునివలన నావిర్భవించినవాడై సర్వ మునకు ముందుండె" నను నర్థమును చెప్పవలెను.

ఇందుకు మను ధర్మశాస్త్రమున నుపక్రమమును చూడనగును.

శ్లో॥ ఆసీదిదం తమోభూత-మప్రజ్ఞాత మలక్షణమ్,
అప్రతర్క్య మనిర్దేశ్యం-ప్రసుప్త మివ సర్వతః॥
తతః స్వయంభూ ర్భగవా-నవ్యక్తో వ్యంజయన్నిద,
మహాభూతాది వృత్తౌజాః-ప్రాదురాసీ త్తమోనుదః
అభిధ్యాయ శరీరా త్స్వాత్-సిసృక్షు ర్వివిధాః ప్రజాః,
అప ఏవ ససర్జాదౌ-తాసు వీర్య మవాసృజత్॥
తదండ మభవ ద్దైమం-సహస్రాంశు సమప్రభమ్,
తస్మి జ్జజ్ఞే స్వయం బ్రహ్మ-సర్వలోకపితామహః।
ఆపో నారా ఇతి ప్రోక్తా-ఆపో వై నరసూనవః,
తా యదస్యాయనం పూర్వం-తేన నారాయణః స్మృతః॥

''సృష్టికి మున్ను జగము - నామరూపవిభాగము లేనిదిగా నూహింపనలవి గానిదిగా నిదమిత్థమని నిర్దేశింపరానిదిగా నంతట నిద్రించినట్లుగా తమోమయమై యుండెడిది. అట్టితఱి నారాయణుఁడు తనను తాను ప్రకటింతునో యనునట్లు

పంచమహాభూతములు మున్నగువానిబలము గలవాడై ప్రళయతమస్సుఁ దొలగించు పరశివునివలన నావిర్భవించువాడు. పిమ్మట కొంతతడవు విచారించి తన శరీరము నుండి నానావిధ ప్రాణులను పుట్టింపఁదలచినవాడై మొదట జలమును సృజించి యందు సిసృక్షయను స్వప్రభావమును నెలకొల్పగా సూర్యసన్నిభము సువర్ణ మయము నగు అండము ఉదయించెను. సర్వలోక పితామహుఁడగు బ్రహ్మదేవుఁడు ఆ యండమునుండి శివేచ్ఛావశమున జన్మించినవాడు. ఇట్లు బ్రహ్మదేవునికన్న మున్ను జన్మించిన మహాపురుషుఁడు-ప్రప్రథమము పుట్టించిన జలములు నారము లనఁబఁడుగుటచే నవ్వానియందు పడుకొనియుండుటఁజేసి నారాయణుఁడుగ పేర్కొనఁబడుచున్నవాడు."

ఇఁట ''తమోనుదః'' అను పదమును ప్రథమాంతముగ భావించి నారాయణపదమునకు విశేషణముగ చెప్పరాదు. ఎందుకనఁగా ? "ఆసీదిదం తమో భూతం" అనుచో సర్గాధిని సమస్త జగమును తమోమయముగ ప్రతిపాదించి "తతః స్వయంభూ ర్భగవాన్" అనుచో "అనంతరము భగవానుఁడు జన్మించె"నని చెప్పుటవలన పూర్వసిద్ధమగు తమస్సును తరువాత నుదయించిన నారాయణుఁడు నధిష్ఠించియుండఁజాలడని తెలియనగును. కావున "తమోనుదః" అనుదానిని పంచమ్యంతముగ నిర్ణయించి శివపరముగ నిరూపించుట సమంజసంబగునది.

మఱియు మనుస్మృతి - ఉపసంహారముననను

శ్లో॥ ప్రశాసితారం సర్వేషా - మణీయాంస మణో రపి,
రుక్మాభం స్వప్నధీగమ్యం - విద్యాత్తు పురుషం పరమ్॥

ఏష సర్వాణి భూతాని - పంచభి ర్వ్యాప్య మూర్తిభిః,
జన్మవృద్ధిక్షయై ర్నిత్యం - సంసారయతి చక్రవత్॥

"చరాచర ప్రాణులను శాసించువాడును అణువుకంటె నణువగువాడును బంగారువన్నెగలవాడును సుషుప్తియందు సాక్షాత్కరించువాడు నగు పరమ పురుషుని ధ్యానింపవలసియుండును. ఇట్టి దేవుఁడు పృథివ్యాది పంచభూతముల నధిష్ఠించియుండు సద్యోజాతాది పంచమూర్తులతో సమస్త ప్రాణులను వ్యాపించి సృష్టి స్థితి లయముల నిమిత్తముగ సంసార చక్రమునందు నెల్లకాలము భ్రమింపఁ జేయుచుండువాడు."

ఇఁట సర్వభూతవ్యాప్తి యనఁబడు అసాధారణ లక్షణము శివునిదే యగుటఁజేసి తమోఽధిష్ఠాత శివుఁడే కాదగినవాడని తెలియునది. నారాయణుఁడు హిరణ్యగర్భజనకుఁడైనను ఆదిసృష్టిని శివునివలన జన్మించువాడనియు ఆదిసర్గకర్త సర్వకారణంబు నగువాడు శివుఁడే ననియు పై సందర్భమువలన విశదమైనది.

ఇటులనే యోగయాజ్ఞవల్క్యయ ధర్మశాస్త్రమునందు బ్రహ్మవిష్ణు మహేశ్వరుల ధారణమును గురించి చెప్పిన తరువాత దిగువ విధము శివుని ధారణము ధ్యానంబు నిరూపింపఁబడినవి.

శ్లో॥ ఆకాశే వాయు మారోప్య - హకారేణ సమన్వితమ్,
బిందురూపం మహాదేవం - వ్యోమాకారం సదాశివమ్॥

శుద్ధ స్ఫటిక సంకాశం - బాలేందుకృతశేఖరమ్,
పంచవక్త్రధరం సౌమ్యం - దశబాహుం త్రిలోచనమ్॥

సర్వాయుధోద్యతకరం - సర్వభూషణ భూషితమ్,
ఉమాఽర్ధదేహం వరదం - సర్వకారణ కారణమ్॥

చింతయే చ్చిత్తవిన్యస్తం - ముహూర్త మపి ధారయేత్,
స ఏవ ముక్త ఇత్యుక్త - స్తాంత్రికేష్వపి శిక్షితైః॥

"వాయుతత్త్వమును హకారముతోగూడ నాకాశమందారోపించి హృదయములోని చిదాకాశమునందు శివుని బిందుస్వరూపునిగాను శుద్ధ స్ఫటికమువలెఁ బ్రకాశించువానిగాను చంద్రశేఖరునిగాను ఐదు ముఖములు పదిచేతులు మూడు కన్నులు గల సౌమ్యునిగాను పాశుపత సుదర్శన వజ్రాది మహాయుధములను కరములఁ దాల్చువానిగాను దివ్యాలంకార భూషితునిగాను అంబికాదేవియే సగము శరీరము గలవానిగాను భక్తాభీష్టముల నొసగువానిగాను సర్వకారణ కారణునిగాను ముహూర్తకాలమైనను నిలుపుకొని ధ్యానింపవలెను. ఇట్టివాడే ముక్తుఁడగునని మంత్ర తంత్ర ద్రష్టలగు మహానుభావులు వక్కాణించియున్నవారు."

ఇఁట నుమాపతిని త్రిమూర్త్యతీతునిగా నంతర్ధారణముఁ జేయుట ముక్తి

హేతువగుటయు తన్మూలముగా మహాదేవుఁడు సర్వకారణుఁ డనఁబడుఁగుటయు ముఖ్యాంశము లగుచున్నవి.

మరియు నదే యోగయాజ్ఞవల్క్యయమున

శ్లో॥ ఏతదుక్తం భవత్యత్ర - గార్గి ! బ్రహ్మవిదాం వరే,
బ్రహ్మాది కార్యరూపాణి - స్వే స్వే సంహృత్య కారణే ।
యుక్తచిత్త స్తథాఽఽత్మానం - ధారయే త్పరమేశ్వరే॥

"బ్రహ్మవిదులలో శ్రేష్ఠురాలవైన గార్గీ ! సావధానముగ నాలకింపుము! ఇవ్విషయమున సారాంశమును చెప్పుచున్నాను. బ్రహ్మాది కార్యరూపములను స్వ స్వకారణములగు విష్ణ్వాది రూపములయందు నుపసంహరించి స్థిరచిత్తముగలవాడై తన (జీవాత్మ)ను పరమేశ్వరునియందు నిలుపవలెను."

ఇత్యాది ప్రమాణసంపత్తిచే "ఏకో హ వై" అనుచో గల ఆసీత్పదము - నారాయణుని ప్రథమోత్పత్తిని చెప్పుననియు సుబాల నారాయణోపనిషదాదుల యందు గల నారాయణుని జగత్కారణత్వము నవాంతర సృష్టి విషయకముగ సమర్థింపనగు ననియు తేటపడుచున్నయది.

ప్రశ్న : ఓయీ ! భవత్సమర్థనము సర్వ శ్రుతులకు విరుద్ధము కానప్పుడు గదా అంగీకార్యమగును? ఎట్లు అంగీకార్యము కాదందువేని వినుము!

"యో బ్రహాణం" "యో దేవానాం" అను మంత్రములలో దేవతలకు మున్ను బ్రహ్మదేవుఁడు పరశివునివలన నుదయించి "యజుర్భ్యో విష్ణుం" ఇత్యాది వాక్యము లఁబట్టి విష్ణు రుద్రులను పుట్టించెనని తెలియుచున్నది. అట్లే "అండం హిరణ్మయం మధ్యే సముద్రం రుద్రస్య వీర్యాత్ ప్రథమం సంబభూవ, తత్ర బ్రహ్మా విష్ణు ర్జాతో జాతవేదాః" ఇత్యాది శ్రుతులయందు "రుద్రసంజ్ఞస్య దేవస్య- రూపే మూర్తిః ప్రజాయతే, తేన క్షిప్తం రసే వీర్యం - పరమూర్త్యభిమానినా । తదండ మభవ ద్వీర్యం - సహస్ర కిరణప్రభమ్, విష్ణు స్తత్ ప్రావిశ త్సాక్షాత్ - మమ శక్తేస్తు వైభవాత్ । పున ర్నారాయణాఖ్యాం మే - నియోగాత్ ప్రాప్తవానసౌ" అను వాసిష్ఠ లైంగాది పురాణ వాక్యములయందును రుద్రుఁడు బ్రహ్మ విష్ణువులను పుట్టించెనని విదితమగును. మఱియు మహోపనిషదాది ప్రమాణములు - నారాయణునిచే బ్రహ్మ

ద్రుదులు తదితరమంతయు సృజింపఁ బడెనని చెప్పుచున్నవి. కావున సర్వకారణ వస్తువును నిర్ణయించుట యసాధ్యమని తోచెడిని.

ఉత్తరము : ఇవ్విషయమున పూజ్యుడైన వాయువు దిగువ విధము వక్కాణించెను.

శ్లో॥ తపసా తోషయిత్వా తం - పితరం పరమేశ్వరమ్,
బ్రహ్మనారాయణౌ పూర్వం - రుద్రః కల్పాంతరే ఒ సృజత్॥
కల్పాంతరే పునర్బ్రహ్మ - రుద్రవిష్ణూ జగన్మయః,
విష్ణుశ్చ భగవాం స్తద్వత్ - బ్రహ్మాండ మసృజత్ పునః॥
నారాయణం పునర్బ్రహ్మ - బ్రహ్మాణం చ పునర్భవః,
ఏవం కల్పేషు కల్పేషు - బ్రహ్మ విష్ణు మహేశ్వరాః॥
పరస్పరస్మా జ్జాయంతే- పరస్పర జయైషిణః,
తత్తత్ కల్పాంత వృత్తాంత - మధికృత్య మహర్షిభిః ।
ప్రభావః కథ్యతే తేషాం - పరస్పర సముద్భవః॥

పూర్వము ఒకానొక మహాకల్పమున రుద్రుఁడు తన తండ్రియగు పరశివుని తపస్సుతో సంతోషింపఁజేసి తదనుగ్రహమున బ్రహ్మ విష్ణువులను పుట్టింప సమర్థుఁడయ్యెను. మరియొక మహాకల్పమున చతుర్ముఖుఁడు నట్లే శివానుగ్రహ పాత్రుఁడై రుద్రవిష్ణువులను జన్మింపఁజేసినవాడు. ఇంక నొక మహాకల్పమున నారాయణుఁడు పరమేశ్వరు నారాధించి బ్రహ్మరుద్రాది ప్రపంచము నావిర్భవింపఁ జేసెను. మరల బ్రహ్మదేవుఁడు నారాయణుని రుద్రుఁడు బ్రహ్మదేవుని పుట్టించిరి. ఇట్లు త్రిమూర్తులు ఒండొరులను జయింపఁదలచి ఆ యా కల్పములయందు పరస్పరము (ఒకరివలన మఱియొకరు) జన్మించుచుందురు. కావున మహర్షులు ఆ యా కల్పముల ననుసరించి త్రిమూర్తుల ప్రభావమును ప్రశంసించియున్న వారు."

ఇట్లు త్రిమూర్తులలో గల కార్యభావము కారణభావంబు తత్తత్కల్పములను పురస్కరించుకొనినదగుటచే సర్వ ప్రమాణములకు విరుద్ధము కాదనియు "నారాయణాత్ బ్రహ్మ జాయతే" ఇత్యాది సందర్భమున నారాయణుఁడు బ్రహ్మరుద్రాది

జనకుఁడని చెప్పుట యవాంతర సృష్టిఁ జెందినదనియు ఇట్లే సర్వకారణవాక్యములు నవిరోధముగ సమర్థించుకొనవలెననియు తెలియునది. ఒకవేళ నిట్లు కాదని నచో "శివ ఏవ కేవలః'' "ఏకో హ వై నారాయణ ఆసీత్" "హిరణ్యగర్భః సమ త్రాగే" ఇత్యాది వాక్యములు పరస్పర విరుద్ధములుగ భాసించుటఁజేసి యప్రమాణములు కావలసివచ్చును.

"ఏవ మపి చతుర్ముఖునివలన రుద్రుఁడు జన్మించిన వాడను నంశము శ్రుత్యంతరములయందు సుప్రసిద్ధమగుటచే శివునకు సర్వకారణత్వము భంగ పడు" నని శంకింపఁగూడదు.

శ్లో॥ తతాప పరమం ఘోరం - తతో విప్రా శ్చతుర్ముఖః ।
సృష్ట్యర్థం బ్రహ్మణ స్తస్య - భ్రువో ర్ఘ్రాణస్య మధ్యతః॥
అవిముక్తాభిధా ద్దేశాత్ - స్వకీయాత్తు విశేషతః ।
త్రిమూర్తీనాం మహేశస్య - ద్విజా వేదాంతవిత్తమాః॥
అంశభూతో మహాదేవః - సర్వదేవ నమస్కృతః ।
అర్ధనారీశ్వరో భూత్వా - ప్రాదురాసీత్ కృపానిధిః ॥

సూతసంహిత.

"వేదాంతవిదులైన విప్రులారా! చతుర్ముఖుఁడు తా జేయఁదలచిన సృష్టి కొనసాగుటకై ఘోరతపము నాచరింపగా మహేశ్వరుఁడు తన యంశముతో పితామహుని కనుబొమలు ముక్కునడుమ స్వకీయమగు అవిముక్త ప్రదేశము నుండి యర్ధనారీశ్వరుఁడుగ నావిర్భవించినవాడు. అట్టితఁడి కరుణానిధియగు మహాదేవుని దేవతలందరు నమస్కరించిరి.

మఱియు నీ యంశమునే పరాశరుఁడు రాజధర్మమునందు సంగ్రహముగా వచించెను.

శ్లో॥ సృష్ట్యర్థం బ్రహ్మణః పుత్రో - లలాటా దుత్థితః ప్రభుః॥

శిలాదుఁగూర్చి దేవేంద్రుఁడు లింగపురాణమునందు

శ్లో॥ తస్య హృత్కమలస్థస్య - నియోగా దంశజో విభోః,
లలాటం తస్య నిర్భిద్య - ప్రాదురాసీత్ ప్రభో ర్ముఖాత్ ॥

రుద్రుఁడు - స్వహృదయకమలమున నివసించు శివుని యాదేశమునఁజేసి బ్రహ్మదేవుని లలాటమును భేదించి బ్రహ్మముఖమునుండి యావిర్భవించినవాఁడు." అని వక్కాణించెను.

ఇట్లే వాయుసంహితయందు

శ్లో॥ నిర్దిష్టః పరమేశేన - మహేశో నీలలోహితః ।
పుత్రో భూత్వాఽనుగృహ్ణాతి - బ్రహ్మాణం బ్రహ్మణోఽనుజః ॥

"పరమేశ్వరుని నియోగమువలన నీలలోహితుఁడైన మహేశ్వరుఁడు పుత్రుఁడుగ జన్మించి బ్రహ్మదేవు ననుగ్రహించినవాఁడు" మఱియు "త్వామేవ పుత్ర మిచ్ఛామి" అని ప్రార్థించిన చతుర్ముఖు ననుగ్రహించుటకు నాతని లలాటమునుండి రుద్రుఁడావిర్భవించెనని యాదిత్య పురాణాదులయందు కలదు. మహేశ్వరుఁడు మహాప్రళయమువరకు నుండు వాఁడగుటను అవాంతర కల్పముల యందు పునః పునః జన్మింపనివాఁడగుటవలనను ప్రతి అవాంతరకల్పమునఁ జెప్పఁబడిన మహేశ్వరుని యావిర్భావము తదంశ విశేషమును గురించినదని యవశ్య మంగీకరింపవలెను.

"తస్య లలాటా త్త్ర్యక్షః శూలపాణిః పురుషోఽజాయత"

"బిభ్రత్సర్వం బ్రహ్మచర్యం తపః" శ్రుతి.

శ్లో॥ తతః పార్శ్వే వృషాంకస్య - బ్రహ్మచారీ వ్యవర్తత,
పింగాక్ష స్తపసా శ్రేష్ఠో - బలవా న్నీలలోహితః ॥

ద్రోణపర్వము.

కూర్మపురాణమునందు

శ్లో॥ అహం చ భవతో వక్త్రాత్ - కల్పాంతే ఘోరరూపధృక్,
శూలపాణి ర్భవిష్యామి - క్రోధజ స్తవ పుత్రక! ॥

ప్రళయకాలమున భయంకర రూపముతో త్రిశూలపాణినై నీ ముఖము నుండి యావిర్భవింతును కావున నన్ను నీ క్రోధమునుండి పుట్టినవాడందురు. అని పరమేశ్వరుఁడు వక్కాణించుటచే పురాణాదుల యందు చెప్పఁబడిన రుద్రుని

యావిర్భావమును ఐచ్ఛిక అంశావతారముగ భావించుట సమంజసంబగుచున్న యది. ఐతే నొకానొకచో బ్రహ్మ విష్ణువులకన్న రుద్రుఁడు తక్కువవాడని చెప్పఁబడిన యంశము - రామకృష్ణాద్యవతారములు దశరథ వసుదేవాదులకన్న నికర్షములగునని లోకదృష్టి నంగీరింపఁబడినట్లు స్థాణ్వాది శబ్దములతో తెలుపఁబడు రుద్రుని యంశవిశేషములఁగూర్చి యని- గ్రహింపవగును.

బ్రహ్మ విష్ణువులు మాత్రము స్వమూల రూపములతోడనే రుద్రుని కన్న తక్కువవారనుటకు శ్రుతి ప్రమాణమును గాననగును.

"పరా త్పరతరో బ్రహ్మ - తత్పరా త్పరతో హరిః,
తత్పరా త్పరతో హీశః" శివసంకల్పోపనిషత్తు.
మఱియు "యో దేవానాం ప్రథమం పురస్తాత్ - విశ్వాధికో రుద్రో మహర్షిః,
హిరణ్యగర్భం పశ్యత జాయమానం - స నో దేవః శుభయా స్మృత్యా సంయునక్తు"

అను నారాయణోపనిషత్‌వచనముఁబట్టియు బ్రహ్మ విష్ణు రుద్రేంద్రాః సంప్రసూయంతే" అను అథర్వశిఖావచనమువలనను "బ్రహ్మ విష్ణువులు ఒకరి నొకరు పుట్టించుకొనువార"ని చెప్పటయు ముఖ్యాంశము కాజాలదు.

ఇందుకు మరియొక ప్రమాణము - ఆదిత్య పురాణమున గానఁబడుచున్న యది.

శ్లో॥ ప్రవిష్టో బ్రహ్మణో దేహం - తత్ర దర్శనలాలసః,
విస్మితః కమలాకాంతో - నిర్జగామ విధే ర్ముఖాత్ ॥
సహస్రశీర్షా పురుషః - పున ర్బ్రహ్మాణ మబ్రవీత్,
విధే త్వమద్య మద్దేహం - ప్రవిశ్యాఽశు విలోకయ ॥
చరాచరాత్మకాన్ లోకాన్ - సదేవాసుర మానుషాన్,
తతో విరించి ర్భగవాన్ - సుందరం కమలాపతేః ॥
ప్రవిశ్య సకలాన్ లోకాన్ - దృష్ట్వాఽభూత్ విస్మితో విధిః,
నాపశ్య న్నిర్గమద్వారం - పిహితాం చక్రపాణినా ॥

తతోఽసౌ నాభిచక్రస్య - నాభిమార్గ మభిందత,
నిర్గత స్తేన మార్గేణ - బ్రహ్మ బ్రహ్మవతాం వరః ॥

"నారాయణుఁడు నొకప్పుడు బ్రహ్మదేహమునఁ బ్రవేశించినవాడై యందలి విశేషములఁగాంచి విస్మితుడై విధిముఖమునుండి సహస్రశీర్షత్వాది లక్షణములు గల పురుషుఁడుగా బయటపడెను. అట్టితఱి చతుర్ముఖుని గురించి "నీవిప్పుడు నా శరీరమున త్వరగా చొఱఁబడి యందలి దృశ్యములను గాంచు"మని నారాయణుఁడు నుడువగా బ్రహ్మదేవుఁడు సుందరమగు హరి శరీరమునఁ బ్రవేశించి చరాచరలోకముల నన్నిటి నవలోకించి యచ్చెరువునొందెను. తరువాత వేద విద్వరుఁడైన చతుర్ముఖుఁడు హరి దేహమునుండి వెళ్ళుటకు మార్గమును (నారాయణుఁడు తన శరీరమునంత నాచ్ఛాదించియుండుటచే) గాంచనందున నాభిచక్రమును భేదించి నాభిమార్గముగుండా బయటికి నేతెంచెను."

ఇత్యాది సందర్భమువలన "అనేక స్థలములయందు చెప్పఁబడిన నారాయణుని జననము వాస్తవము కాదనియు స్వేచ్ఛాఽవతారకృతమగుటచే విలక్షణమైనదనియు రుద్రుఁడు పితామహుని పుత్రుఁడనియు ఒకప్పుడు నారాయణునిచేతను సృజింపఁబడె ననియు" పరులు ఆర్భాటించునది వైదికజన పరిగ్రాహ్యము కాజాలదని విశదమైనది.

''అజాత ఇత్యేవ కశ్చి ద్భీరుః ప్రపద్యతే" "రుద్ర యత్తే జనిమ చారు చిత్రమ్'' అను మంత్రములయందు జన్మరహితుఁడుగా నిరూపింపఁబడిన మహేశ్వరుఁడు - బ్రహ్మ విష్ణు ప్రార్థన ననుసరించి పరశివ ధ్యానమునకై శ్రేష్ఠమగు నవిముక్త ప్రదేశమునుండి యావిర్భవించుట కర్మమూలకము కాదని తెలియవలెను.

ఇఁక "నమో విష్ణవే బృహతే కరోమి" అనుచో బృహత్తుగా చెప్పఁబడిన విష్ణువు "జాతో బృహ న్నభిపాతి తృతీయమ్" అనుచో జన్మవంతుఁడుగాను పురాణాదులయందు గర్భవాసమునుండి మనుష్యమాత్రుఁడుగా నుదయించినవాడుగాను చెప్పఁబడినందున నారాయణుని జననము స్వేచ్ఛావతారకృతముగాక కర్మమూలకమగునని బోధపడును. అకర్మవశ్యత్వాది లక్షణములు నారాయణునిగూర్చి యెచటను ప్రతిపాదింపఁబడలేదు. ప్రత్యుత కర్మవశ్యత్వాదులు విష్ణువునకు గలవని యుత్తరరామాయణమున ఏబదియొకటవ సర్గమున దూర్వాసుఁడు దశరథమహా

రాజు నుద్దేశించి దిగువ విధము వక్కాణించిన సందర్భమును పరిశీలింపగా తేట పడుచున్నయది.

శ్లో॥ శ్రుణు రాజన్ పురావృత్తం - తథా దేవాసురే యుధి,
దైత్యాః సురై ర్భర్త్స్యమానాః - భృగుపత్నీం సమాశ్రితాః ॥
తయా దత్తాభయా స్తత్ర - న్యవస న్నభయా స్తదా,
తయా పరిగృహీతాం స్తాన్ - దృష్ట్వా క్రుద్ధః సురేశ్వరః ॥
చక్రేణ శితధారేణ - భృగుపత్న్యాః శిరోఽహరత్,
తత స్తాం నిహతాం దృష్ట్వా - పత్నీం భృగుకులోద్వహః ॥
శశాప సహసా క్రుద్ధో - విష్ణుం రిపుకులార్దనమ్,
యస్మా దవధ్యాం మే పత్నీ - మవధీః క్రోధమూర్ఛితః ॥
తస్మా త్త్వం మానుషే లోకే - జనిష్యసి జనార్దన,
తత్ర పత్నీవియోగం త్వం - ప్రాప్స్యసే బహువార్షికమ్ ॥
ఇతి శప్తో మహాతేజాః - భృగుణా పూర్వజన్మని,
ఇహాగతో హి పుత్రత్వం - తవ పార్థివసత్తమ ॥
రామ ఇత్యభివిఖ్యాత-స్త్రిషు లోకేషు మానద,
తత్ఫలం ప్రాప్స్యతే వాఽపి - భృగుశాపభవం మహత్ ॥

పూర్వము దేవతలకు రాక్షసులకును ఘోర యుద్ధము జరిగెను. అట్టితఱి రాక్షసులు దేవతల యుద్ధాటోపమును సహింపనలవి గాక భృగుమహర్షిగారి భార్య నాశ్రయించి ఆమె యొసగిన అభయమువలన భృగ్వాశ్రమమునందు నిర్భయులై నివసించిరి. అందువలన విష్ణువు కోపోద్రిక్తుడై భృగుపత్నిశిరమును తీక్ష్ణమైన తన చక్రముతో ఖండించెను. అట్లు నిహతురాలైన తన భార్యను భృగుమహర్షి గాంచి హఠాత్తు క్రుద్ధుఁడై శత్రుసంహారకుఁడైన నారాయణుని దిగువ విధము శపించెను. "క్రోధమూర్ఛితుడవై అవధ్యురాలగు నా భార్యను సంహరించితివి గావున మనుష్య లోకమున జన్మించి యనేక వత్సరములు భార్యావియోగమును పొందుదువుగాత" ఇట్లు పూర్వజన్మమునందు గొప్ప ప్రభావము గలవాడైనను భృగుమహర్షిచే

శపింపఁబడినవాఁడగుటచేసి యిందు నీకు పుత్రుఁడై మూఁడు లోకములలో "రాము"డని ప్రసిద్ధిఁబొందియు భృగు శాపజన్యమైన ఫలము ననుభవింపఁగల వాఁడు."

శ్రీ సుదర్శనాచార్యచరణు లివ్విషయమునే దిగువ విధము విశదీకరించిన వారు.

శ్లో॥ ఇచ్ఛావతార మురశాసన గర్భవాసః - స్యా చ్చే దుదాహరణ
మేష విమర్శనీయః,
గర్భే వసామి పరివేష్ట్య జరాయుణాఽహం - మాసాన్ బహూ
నితి మహేశ్వర కస్య కామః?॥

శ్లో॥ ఇచ్ఛాఽపి నూన మనుయాతి పురాకృతాని - కర్మాణి శంకర!
శుభాశుభలక్షణాని,
ఇచ్ఛాఽవతార వచనాని తు భారతాదౌ- నారాయణస్య గుణవాద
ముదాహరంతి ॥

"నారాయణుని గర్భవాసము - ఇచ్ఛావతారమునకు నిదర్శనమగు నెడల నియ్యంశము విచారణీయమగునుగదా! మహేశ్వరా! స్త్రీ గర్భమునందు జరాయువుతో కప్పఁబడి పెక్కు నెలలు నివసింతునను వాంఛ యెవనికి జనించును? ఐన నిట్టి వాంఛ పూర్వకృతములైన శుభాశుభకర్మల ననుసరించి కలుగునట్టిది. కావున "విష్ణు జన్మము స్వేచ్ఛావతారకృత" మని మహాభారతాదులయందు చెప్పఁబడిన వాక్యములు అర్థవాదములగునని గుర్తెరుగవలెను."

ఇవ్విధము శ్రుతి స్మృతి పురాణాది ప్రమాణములవలనను న్యాయములఁబట్టియు పరమశివుఁడు త్రిమూర్తికారణుఁడగుటఁజేసి సర్వకారణుఁడనియు బ్రహ్మ విష్ణు రుద్రులు ద్విమూర్తి జనకులగుటచే నవాంతర కారణులనియు నారాయణమున "విశ్వాధికో రుద్రో మహర్షిః" అనుచో మరియు శ్వేతాశ్వతరమున "యదా తమ స్త న్న దివా న రాత్రిః న సన్నా చాస చ్ఛివ ఏవ కేవలః" అనుచోటను విశ్వాధికుఁడగుటచే పరమేశ్వరుఁడే సర్వకారణుఁడుగ చెప్పఁబడినవాఁడనియు విశదమగుచున్నయది.

ప్రశ్న : నారాయణమునందలి మూడవ యధ్యాయమున "వేదాహ మేతం పురుషం మహాంతమ్" అను పురుషసూక్తగతమంత్రము నుదాహరించుట నారాయణుని పురుషసూక్త ప్రతిపాద్యత్వముఁ దగు ప్రత్యభిజ్ఞానమగుటచే నారాయణంబును విష్ణుపరమగునని యంగీకరింపవలెను గదా?

ఉత్తరము : ప్రత్యభిజ్ఞానమనఁగా రెండుచోట్లఁ బరామర్శవలన తడవుగా నేర్పడునది; అద్దానికన్న నభిధానశ్రుతులు ప్రబలములగునవి గదా! "క్షరం ప్రధాన మమృతాక్షరం హరః" "శివ ఏవ కేవలః" "మాయినంతు మహేశ్వరమ్" అనుచో హర శివ మహేశ్వరాది ప్రబలాభిదానములుండుట వలన నారాయణము శివపర మగునని తెలియుచుండగా ప్రత్యభిజ్ఞానము ఎట్లు ఉపయోగించును? ఒకవేళ ప్రత్యభిజ్ఞానమే ప్రబల మనునెడ "యా తే రుద్ర శివా తనూః" "యా మిషుం గిరిశంత హస్తే" ఇత్యాది రుద్రాధ్యాయగత మంత్రములు నారాయణమునందు వినఁబడుటచే. మంత్రోపనిషత్తునందలి "వేదాహ మేతమ్" ఇత్యాది మంత్రముల ప్రత్యభిజ్ఞానము పుంసూక్తమునందు నుండుటఁజేసి పుంసూక్తంబును శివపరమగునని తేటపడుటచేతను "అభివృద్ధికాములకు మూలమే నష్టమైన"దను న్యాయము సిద్ధించుట పరులకు హాస్యాస్పదమైనది గదా! ప్రత్యుత పురుషసూక్తము నారాయణ పరమగునని చెప్పనలవిగాదు. మహాపురుష నారాయణాది శబ్దములు విష్ణువునకసాధారణము లగునని చెప్పుటయు స్వాభిమాన విలసిత మగునట్టిది.

శ్లో॥ బ్రహ్మ నారాయణాఖ్యోఽసౌ - కల్పాదౌ భగవాన్ యథా,
నారాయణాఖ్యో భగవాన్ - బ్రహ్మ లోకపితామహః ॥

విష్ణుపురాణము.

అశ్వలాయనస్మృతియందును

శ్లో॥ తస్మా దండా దభూ త్సృష్టౌ - శివాత్మా చతురాననః,
సర్వలోకస్య నిర్మాతా - బ్రహ్మ విశ్వసృజాం పతిః ॥

స చాప్సు శయనాదేవ - శివాత్మా స్వేచ్ఛయా చిరమ్,
నారాయణాఖ్యా మభజత్ శక్తిరూపః ప్రజాపతిః ॥

బ్రహ్మాండమునుండి బ్రహ్మదేవుఁడు జన్మించినవాడు; మఱియు చతుర్ము

ఖుఁడు శివుఁ డంతర్యామిగ గలవాఁడై విశ్వనిర్మాతల కధిపతియగుటఁజేసి లోకము నంతయు నిర్మించెను. ఒకప్పుడు శివప్రేరితుఁడై స్వేచ్ఛావిలాసమున నుదకముల యందు చాలకాలము పరుండినందున శక్తి రూపములలో చేరిన బ్రహ్మదేవుఁడు నారాయణుఁడను పేరు గలవాడయ్యెను."

కూర్మ పురాణమునందును

శ్లో॥ బ్రహ్మస్వరూపిణం దేవం - జగతః ప్రభవాప్యయమ్'' అనుచో పితామహుని పేర్కొని "ఆపో నారా ఇతి ప్రోక్తాః" అనుచో నారాయణపదము బ్రహ్మదేవునిఁ జెప్పునని సమర్థింపఁబడినది, మఱియు నందే "నారా అవ్యయనం యస్మా - త్తేన నారాయణః స్మృతః" అనుచో నారాయణపదము శివపరమగునని నిర్ధారింపఁబడినందున నారాయణాది శబ్దములు విష్ణ్వసాధారణములగునని చెప్పుటకు నవకాశము గానరాదు.

మహచ్ఛబ్దము - భవాది శివాష్టకమున పఠింపఁబడి "అథాష్టభి ర్నామభిః" ఇత్యాని బోధాయన సూత్రమునందు శివనామముగ పేర్కొనఁబడినది. మఱియు సాంబపురాణమునందు

శ్లో॥ పూజ్యతే యత్సురై ర్నిత్యం - మహాంశ్చైవ ప్రమాణతః,
ధాతు ర్మహేతి పూజాయాం - మహాదేవ స్తతః స్మృతః ॥

"దేవతలచే పూజింపఁబడువాడును గొప్ప స్వరూపము గలవాడును "మహ" అను ధాతువు పూజార్థకమగుటచే శివుఁడు మహాదేవుఁ డనబఱగు చున్నవాడు". అనుచోటను శివపరముగ నిర్దేశింపఁబడుటచే "పురుషం మహాంతమ్" అనుచో పురుష శబ్దమునకు విశేషణముగ వ్యవహరింపఁబడుటచేతను మహచ్ఛబ్దము శివ పరమగునని యంగీకరింపవలెను. కావున పురుష మహాపురుషాది శబ్దములు శివునకు నసాధారణములగుచుండగా నట్లంగీకరింపక పురుషాది శబ్దములు విష్ణ్వసాధారణములగునని యెచటను చెప్పఁబడని యంశము నంగీకరించుట-యప్రామాణిక మతావలంబనమూలమగు బుద్ధివైపరీత్యము కాని వేరొండు గాదు.

శివాది శబ్దములు నాకే యుపనిషత్తునందు కలవని చెప్పనెడ దిగువ శ్రుతులయందు తదితర సర్వోపనిషత్తులందును శివాభిధానములను గాననగును.

"ఈశావాస్య మిదగ్ం సర్వమ్" ఈశావాస్యోపనిషత్తు.

"ఈశానో భూతభవ్యస్య'' కఠోపనిషదత్తు.

"శివ మద్వైతం చతుర్థం మన్యంతే" మాండూక్యము.

ఇఁక మంత్రోపనిషత్తు విష్ణుపరమని సమర్థింపఁ బ్రారంభించి ''అజాత ఇత్యేవం" అను మంత్రమున శివుని యసాధారణ లక్షణములలో చేరిన దక్షిణ ముఖత్వము నారాయణునకు చెప్పనలవి కానిదని భావించి ఛిద్రవ్యాశ్చికదంశిత చోరునివలె మౌనముతో పలాయనమును చేయవలసివచ్చెను. విష్ణు సహస్రనామము లలో గల హర శివ శంభు మహేశ్వరాది పదములు - అభిధానకోశ స్మృతులఁబట్టి శివపరములే యగునవి. అట్లే లైంగాదిత్య భారతాదులయందు గల శివ సహస్ర నామములలో కొన్ని విష్ణునామములు పేర్కొనఁబడినంత మాత్రమున హాని యేమియు లేదు.

హరివంశమునందు - శ్రీకృష్ణుని కైలాసయాత్రా సందర్భమున శివుఁడు కృష్ణు నుద్దేశించి చెప్పిన ప్రమాణమును దిగువ గాననగును.

శ్లో॥ నామాని తవ గోవింద - యాని లోకే మహాంతి చ,
తాన్యేవ మమ నామాని - నాత్ర కార్యా విచారణా ॥

ఇట్లు చెప్పుటవలన విష్ణుపరమైన నామధేయ మొక్కటియు లభింప కుండుటచేతను గణపత్యాంజనేయాది సహస్రనామములలో సకల దేవతల నామ ధేయములున్నందునను "సర్వాణి హ వా ఏతస్య నామధేయాని" అను అశ్వలాయన వాక్యము "శ్రేష్ఠ నామధేయములన్నియు శివవాచకంబు లగు"నని తెలుపుచున్నందు నను పడలు మౌనము నవలంబింపవలసి వచ్చును గదా!

మఱియు

శ్లో॥ లింగమూర్తిం మహాజ్వాలా - మాలాసంవృత మవ్యయమ్,
లింగస్య మధ్యే రుచిరం - చంద్రశేఖరవిగ్రహమ్ ॥

వ్యోమమార్గే తథా లింగే - బ్రహ్మాణం హంసరూపిణమ్,
విష్ణుం వరాహరూపేణ - లింగస్యాధ స్త్వధోముఖమ్ ॥

బ్రహ్మాణం దక్షిణే తస్య - కృతాంజలిపుటం స్థితమ్,
వామే విష్ణుం మహాబాహుం - కృతాంజలిపుటం తథా ॥
మధ్యే లింగం మహాఘోరం - మహాబ్దే రంభసి స్థితమ్,
ధ్యాత్వా ప్రదోషసమయే - సర్వసిద్ధి మవాప్నుయాత్ ॥

ప్రళయకాల సముద్రమున నుదక మధ్యమున జ్వాలామాలా సమావృతము; అవ్యయము భక్తులుగానివారికి భయముఁ గొలుపునదియు నగు మహాలింగ స్వరూపమును బ్రహ్మ విష్ణువులు గాంచిరి. అందు బ్రహ్మదేవుఁడు హంసరూపముతో లింగాగ్రమును కనుగొనఁగోరి యాకాశమార్గమున నూర్ధ్వభాగమునకు పోవుచుండెను. నారాయణుఁడు లింగాంతమును గుర్తెరుగఁదలచి వరాహరూపముతో భూమిఁ ద్రవ్వి సప్తపాతాళములఁదెసఁ జనుచుండెను. ఐతే నట్టితటి లింగమధ్యమున మనోహరమైన చంద్రశేఖరమూర్తి - లింగాగ్రాంతములను కనుగొనఁజాలని విధి విష్ణువులకు గానవచ్చెను. అట్టి మహాలింగమును ప్రదోషకాలమున స్మరించువారు ఐహిక అముష్మిక అభీష్టసిద్ధులఁ బడయ జాలుదురు."

ఇత్యాది ప్రమాణ సంపత్తి ననుసరించి "యమంతః సముద్రే కవయో వయంతి" "అంభస్యపారే" ఇత్యాద్యనువాకములున్ను శివపరములగుననియే విదితమగుచున్నయది.

ప్రశ్న : ఓయీ? నీ సమర్థనమును చూడఁ జూడ మిగుల నచ్చెరువగుచున్నది పురుషసూక్తము విష్ణుపరము కాదందువేని ఉత్తరనారాయణమున "హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ" అనుచో గల లక్ష్మీపదమునకు గతి యేమి?

ఉత్తరము : అదియా నీ బాధ; పైవాక్యమున ప్రథమమగు హ్రీః పదము అంబికావాచక మగుటఁజేసి లక్ష్మీపదమును తదనుసారముగా సమర్థింపవలసియుండును. ఇందుకు వాయు సంహితయందు ప్రమాణమును గాననగును.

శ్లో॥ తత్ర మాహేశ్వరీ లక్ష్మ్యా - మూర్తి ర్మూర్తిమతః ప్రభోః,
తస్యాంకమండలారూఢా - శక్తి ర్మాహేశ్వరీ పరా ॥
మహాలక్ష్మీ రితి ఖ్యాతా - శ్యామా సర్వమనోహరా ॥

"శక్తి రూపములలో మాహేశ్వరి యనఁబడు లక్ష్మీమూర్తి - సహజ స్వరూప లావణ్యము గల సదాశివుని యంకమునందాసీనురాలై శ్యామవర్ణముఁగలిగి

సర్వ మనోహరరూపముతో విరాజిల్లుచుండును. ఈమెయే మహాలక్ష్మి యనఁబఁ గును."

ఇఁట లక్ష్మీపదము విష్ణుపత్నీ వాచకము కాదనియు ప్రత్యుత శివాంకము నధిష్ఠించు మహాలక్ష్మిని బోధించుననియు విశదమగుటచే నుత్తర నారాయణము నకు సరివడు పురుషసూక్తంబును శివపరమగు ననుటలో ఎట్టి సందేహలేశము లేదు సరిగదా!

మఱియు "అంభస్యపారే" అను మంత్రమను ననుసరించి "పురుషస్య విద్మ-సహస్రాక్షస్య మహాదేవస్య ధీమహి" "ఏష హి దేవః ప్రదిశోఽను సర్వాః""విశ్వత శ్చక్షు రుత విశ్వతో ముఖః" ఇత్యాది మంత్రముల ప్రత్యభిజ్ఞానము పురుష సూక్తమునందు కలదు గావున "ప్రజాపతి శ్చరతి గర్భే అంతః" అనుచో గల ప్రజాపతి శబ్దము "యస్మాత్ పాతి ప్రజాః సర్వాః- ప్రజాపతి రితిస్మృతః" అను లింగపురాణ వాక్యము ననుసరించి శివపరంబగుటయు, హిరణ్యగర్భపదము "హిరణ్యరేతా హుతభుక్- రేతోఽ భూ దస్య గర్భగః, తస్మాద్ధిరణ్యగర్భోఽసౌ-పురాణేఽస్మి న్నిరుచ్యతే" అను ప్రమాణముఁబట్టి శివపరంబగుటయు గమనింపఁ దగినవి.

"హిరణ్యగర్భః శత్రుఘ్నః" అను విష్ణు సహస్ర నామములలోని హిరణ్య గర్భపదంబును విష్ణుపరము కాదని పై యంశమువలన తేటపడును. మఱియు శత్రుఘ్నపదము - నారాయణునకు కొందరు శత్రువులు మరి కొందరు మిత్రులు కలరని తెలుపుటచే విష్ణువు సర్వేశ్వరుఁడు కాజాలడని తెలియుచున్నది.

ప్రశ్న : సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్" అనుచో ధాతృపదము ఉపక్రమగత మగుటచే నుపసంహారగత మహేశ్వరాది పదములను తరపరముగా నన్వయింపవలెను గాదా?

ఉత్తరము : ధాతృపదము నారాయణునియందు రూఢము కాదు సరిగదా! చతుర్ముఖుని చెప్పునందువేని ఉపసంహారగతములగు ననేక పదములు - ఉపక్ర మమును బాధింపనని "ఆకాశోఽర్థాంతరత్వాత్" అను నధికరణములోని న్యాయము ననుసరించి బోధపడుచున్నది. ఎట్లనఁగా? ఆకాశపదము - ఉపక్రమ గతమైనను నామరూప నిర్వహణము అమృతత్వము మున్నగు పెక్కు ధర్మములు తరువాత నుండుటచే భూతాకాశపరము గాక బ్రహ్మపరమగునని నిర్ణయింపఁబడి

నట్లు నుపసంహారగతములైన రుద్ర మహేశ్వరా ద్యనేక పదముల ననుసరించి యువక్రమగతమైన ధాతృ పదంబును శివపరమగుననియే సిద్ధాంతము.

ప్రశ్న : ఓయీ ! "సహస్రశీర్షం దేవమ్" ఇత్యాద్యనువాకమున "నారాయణ పరంబ్రహ్మ" అనుచో నారాయణుఁడు పరమాత్మయని తెలియుచున్నది గదా ?

ఉత్తరము : "దీపో జ్యోతిః పరంబ్రహ్మ" అనుచో చెప్పఁబడినట్లు నిఁట నుపాసకుని ప్రశంసించు సందర్భముండుటఁజేసి "నాయణ పరంబ్రహ్మ" అని నంత మాత్రమున పరబ్రహ్మత్వము నారాయణునకు సిద్ధింపఁజాలదని గ్రహింపవలెను. ఇదే యుపనిషత్తున "దహ్రం విపాప్మం - పరవేశ్మభూతమ్" అనుచో దహ్రోపాసనము నుల్లేఖించి "యో వేదాదౌ స్వరః ప్రోక్తః" అనుచో మహేశ్వర శబ్దవాచ్యుండైన పరశివు నుపాసింపవలెనని నిరూపింపఁబడినది. ఐతే "ఈ యుపనిషత్తు విష్ణు పరము గాక శివపరమగునని చెప్పునెడ "నారాయణము'' అను సంజ్ఞ చెల్లకుండు" ననినచో వినుము! "వామదేవ్యమగు సామవేదము" అను నానుడివలె నారాయణుఁడను ఋషి కనుగొనినదగుటచే నిద్దానికి నారాయణమను సంజ్ఞ యేర్పడినదని తెలియుము!

ప్రశ్న : పద్మకోశ ప్రతీకాశమ్" ఇత్యాది వాక్యమున ప్రతిపాదింపఁబడిన హృదయము నారాయణునిది కాదు గదా! ఉపాసకులగు నితరులదై యుండవలెను. అట్టి హృదయమున నివసించు నారాయణుఁడు ఉపాస్యుఁడగునని తేటపడును గదా ?

ఉత్తరము : ఈ సందర్భమున "అనంత మవ్యయం కవిగ్ం సముద్రేఽంతం విశ్వశంభువమ్" ఇత్యాదిని నారాయణుని ప్రశంసించి, తరువాత "పద్మకోశ ప్రతీకాశమ్" అని చెప్పఁబడిన హృదయము నారాయణునిదే ఐ యుండవలెను.

ప్రశ్న : ఐతే మీ ప్రసంగమువలన నారాయణుఁడు శివోపాసకుఁడని తెలియుచున్నది. అట్లగునెడ "నారాయణ పరంబ్రహ్మ" ఇత్యాదిని చెప్పఁబడిన పరబ్రహ్మత్వము నారాయణునకు పొసగకుండును గదా ?

ఉత్తరము : "నారాయణ పరంబ్రహ్మ" ఇత్యాది వాక్యము-ఉపాసకుఁడగు నారాయణుని ప్రశంసించినదగుటచే నర్థవాద మగునది. ఐతే నారాయణుఁడు ధ్యాత

ధ్యేయము అను వివేకము లేనట్టి సమాధ్యవస్థ యందు పరబ్రహ్మమగు శివునితోడ నేకీభావమును పొందుటఁజేసి "లోకమున గరుడోపాసకుఁడు తా గరుత్మంతుడ నని భావించునట్లు" పరబ్రహ్మత్వాది లక్షణములు కలవాడుగా శ్రుతిచే ప్రశంసింపఁ బబడుచున్నవాడు. కావుననే "నారాయణం మహాజ్ఞేయమ్" అనుచో "మహత్ జ్ఞేయం యస్య తమ్" అను వ్యుత్పత్తి ననుసరించి మహచ్ఛబ్దముతో చెప్పఁబడు పరబ్రహ్మము జ్ఞేయ (ఉపాస్య)ముగా గలవాడు నారాయణుఁడని తెలియు చున్నందున నారాయణుఁడు మహాజ్ఞానియు శివోపాసకుఁడు నగు ననుట యని వార్యము గదా !

ప్రశ్న : అట్లైనచో "స బ్రహ్మ స శివః స హరిః సేంద్రః సోఽక్షరః"

ఇత్యాదివాక్యమున బ్రహ్మశివాదులు - ఉపాస్యుని విభూతికోటిలో చేరిన వారని చెప్పఁబడినందున నిట నుపాస్యుఁడు శివునికన్న నితరుడు కావలసివచ్చును. ఒకవేళ నాతడే శివుఁడని చెప్పనెడ "స శివః" అను విభూతివాక్యము సంగతము కాకుండును గదా ?

ఉత్తరము : ఇఁట హరిబ్రహ్మాదిప్రాయ పాఠము ననుసరించి చెప్పఁబడిన శివశబ్దమునకు కాలరుద్రుఁడను నర్థమును ప్రతిపాదింపవలెను. మఱియు "స హరిః" అనుటవలనను హరి యుపాస్యుని విభూతి యనియు ప్రత్యుత ఉపాసకుఁడే యనియు తెలియుచున్నందున దహ్రవిద్యయందు నుపాస్యుఁడు శివుఁడే నని నిర్ధారింపవలెను. ఇంతియేగాక నీ యుపనిషత్తున శివుఁడే యుపాసింపఁదగిన వాడని విశదపఱచుటకు శివరూపమును "ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ-పురుషం కృష్ణపింగళమ్" అను మంత్ర మభివర్ణించినది. ఒకవేళ నారాయణుఁడే యుపాస్యుఁడగునెడ తద్రూపమును శ్రుతి చెప్పవలసియుండెను. అట్లు చెప్పనందున శివుఁడే హరిబ్రహ్మాది సర్వోపాస్యుఁడనుట వజ్రలేప మగునది.

మఱియు నిట ప్రారంభమున దహరవిద్యను తరువాత నంతరాదిత్య విద్యను తదనుసారము గాయత్రీవిద్యను ప్రతిపాదించి నీ విద్యా త్రయంబు నొకే చోట నుపసంహరింపఁబడినది. ఇఁక నంతరాదిత్య విద్యయందు "నమో హిరణ్య బాహవే హిరణ్యవర్ణాయ హిరణ్యరూపాయ హిరణ్యపతయేఽం బికాపతయ ఉమా పతయే పశుపతయే నమః" ఇత్యాది మంత్రములు - ఉమాపతియు హిరణ్యస్వరూ పము గలవాడు నగు శంకరు నుపాస్యునిగా చెప్పినందున దహ్రవిద్యయందు

నారాయణు నుపాస్యునిగా నెట్లు నిరూపింపనగును ? ఇందువలననే పై మూడు విద్యలలో నుపాస్య రూపమును సమర్పించుటకు "ఋతగ్ం సత్యం పరం బ్రహ్మ" అను మంత్రము బయలుపడినదనియు శివేతర దేవతల నుపాస్యులుగా భావింప రాదని తెలుపుటకు "శివ ఏకో ధ్యేయః శివంకరః సర్వమన్యత్ పరిత్యజ్య" అను నథర్వ శిఖావచనము విరాజిల్లుచున్నదనియు తప్పక నంగీకరింపవలసి వచ్చినది.

మఱియు నిట "సద్యోజాతం ప్రపద్యామి" ఇత్యాది పంచబ్రహ్మ మంత్రము లతో గూడిన "ఊర్ధ్వాయ నమః, ఊర్ధ్వలింగాయ నమః" అను లింగసూక్తము పరులు వచింపరానిదియు వినఁగూడనిదియు నగుటచే నీయుపనిషత్తు శివపరమగు ననుటలో ఎట్టి సందియము గానరాదు.

ఇఁక పురుషసూక్తము విష్ణుపరమగునను వాదమును విచారింతము.

పురుషసూక్తము విష్ణుపూజనమున వినియోగింపఁదగినదను నంశమును దృఢీకరించుటకు ముద్గలోపనిషత్తు విష్ణుపరముగా పుంసూక్తమును సమర్థించినంత మాత్రమున శ్రుతిలింగాదులచే తెలుపఁబడు యథార్థము బాధింపఁబడదు గదా ! అట్లు కానిచో "అవశవోవా అన్యే గో అశ్వేభ్యః పశవో వై గో అశ్వాః" అనుచో గో వృషభాశ్వములు పశువులగునని శ్రుతి వివరించినందున నట్టి యర్థమే సర్వత్ర గ్రాహ్యమనుచెడ "అగ్నిషోమీయం పశు మాలభేత" అనుచో గల పశుశబ్దంబు గో వృషభాశ్వములను బోధింపవలసివచ్చుటచే గొప్ప యనర్థము సంభవించును కావున శ్రుతి నిర్ణీతమగు గో వృషభాద్యర్థము నుపేక్షించి "అగ్నిషోమీయమ్" ఇత్యాదిని పశుశబ్దమునకు ఛాగ (మేక) మను వర్థమును గ్రహించినట్లు పురుష సూక్తాంతమున "నాన్యః పంథా అయనాయ విద్యతే" "మోక్షమునకు మరియొక మార్గము లేదు" అను వచనమును చెప్పుటచేతను "ఉతామృతత్వస్యేశానః'' అను సూక్తి ఈశానపదఘటిత మగుటవలనను పుంసూక్తము శివపర మనకతప్పదు.

ఇందువలననే ఈ భాష్యమునందు "శబ్దాదేవ ప్రమితః" అను సూత్రముతో నొప్పుచున్న యధికరణమున ''అంగుష్ఠమాత్రః పురుషః'' అనుచో తెలుపఁబడు పురుషుఁడు ఈశానపద శ్రుతి మాత్రమున పరబ్రహ్మ మగునని భగవానుఁడగు బాదరాయణుఁడు నిర్వచించినవాడు.

ప్రశ్న : ఓయీ ! పురుషసూక్త ప్రారంభమున "సహస్రశీర్షా పురుషః" అను వాక్యమందు నారాయణాసాధారణమగు పురుష శబ్దము వినఁబడుచున్నది

గదా ! అద్ది "పురుసంజ్ఞే శరీరే హి-శయనాత్ పురుషో హరిః" ఇత్యాది పురాణ వచనములయందు హరి నామధేయముగా చెప్పఁబడినది. కావున నుపక్రమగతమైన పురుషశబ్దముఁబట్టి యియ్యది విష్ణుపర మనఁజెల్లును కాదా ?

ఉత్తరము : నీవు చెప్పినట్లు పురుషశబ్దము "పురుషో హవై నారాయణోఽకామయత" ఇత్యాదిని విష్ణుపరముగా ప్రతిపాదింపఁబడినను "పురుషా వాత్మ మానవౌ" అను నిఘంటువుఁబట్టి పురుష శబ్దమునకు గల శక్తి - ఆత్మసామాన్యమునందేర్పడుటచే ప్రత్యేకముగా విష్ణువునందు కల్పింప వలను పడదు గదా !

ప్రశ్న : ఆరుణకేతుకమునందు "పూర్వ మేవాహ మిహాసమ్" అను కూర్మాకృతిలో గల నారాయణుని వచనముఁబట్టి "తత్పురుషస్య పురుషత్వమ్" అను వాక్యము ననుసరించియు "సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ భూత్వోదతిష్ఠత్" అను ప్రమాణమువలనను నారాయణుఁడే పురుష శబ్దవాచ్యుఁడని చెప్పవలెను గాదా ?

ఉత్తరము : ఓయీ ! నీవు చూపిన ఆరుణకేతుకమున "కూర్మః పురుషో భూత్వోదతిష్ఠత్" అనుచో పురుషుఁడు కానివానికి పురుషభావము ప్రదర్శింపఁబడినందున "సహస్రశీర్షా పురుషః" ఇత్యాదిని గల పురుషశబ్దము విష్ణుపర మనఁజెల్లదు. అట్లు కాదేని పూర్వమునను విష్ణువు పురుషశబ్దముతో వ్యవహరింపఁబడవలసియుండెను. అట్టితఱి "పురుషో భూత్వా" అను వచనము సార్థకము కాకుండును. ఇంతియేగాక "స వై శరీరే ప్రథమః- స వై పురుష ఉద్యతే, ఆదికర్తా స భూతానాం - బ్రహ్మాగ్రే సమవర్తత" అనుచో పురుషశబ్దము చతుర్ముఖునియందు నుపయోగింపఁబడినందున పురుషశబ్ద శ్రుతితోడనే దేవతావిశేషమును నిర్ణయింపనలవికాదు సరిగదా !

"పురుశబ్దే శరీరే" ఇత్యాది పౌరాణిక వ్యవహారమునకన్న "పురుషో వై రుద్రః" ఇత్యాది శ్రౌతవ్యవహారము ప్రబలమగుటచే పురుషశబ్దమునకు గల విశేషశక్తి- పరశివునియందే యేర్పడుచున్నది.

మఱియు

శ్లో॥ పురుషో నామ సంపూర్ణః-శివః సత్యాదిలక్షణః,
సాంబమూర్తిధరో నాన్యో-రుద్రోఽజో విష్ణురేవ హి ॥

ఈశో వృక్ష ఇవ స్తబ్ధో-య ఏకో దివి తిష్ఠతి,
తేనేద మఖిలం పూర్ణం-పురుషేణ మహాత్మనా ॥

"పురుషుఁ డనఁగా సంపూర్ణ స్వరూపుఁడు సచ్చిదానందమూర్తియు అంబికా సహితుఁడు నగు శివుఁ డగును. తదితరులైన బ్రహ్మ విష్ణ్వాదులు పురుషశబ్ద వాచ్యులు కాజాలరు. మరియు నా పురుషుఁడు చెట్టువలె దివ్యాంతరిక్షమున నిశ్చలుడై నిలుచువాడు. మహాప్రభావసంపన్నుఁడు సమస్త జగమును శాసించువాడు నగు పురుషునిచే ప్రపంచమంతయు నిండియుండినది." ఇత్యాది పురాణవాక్యముల వలనను "వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేక స్తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్" ఇత్యాది శ్రుతివాక్యములవలనను పురుషపదము శివపరమగు ననుటలో సందియము గానరాదు.

"పురుష ఏవేదగ్ం సర్వమ్" అను వాక్యమునకు "సర్వో హ్యేష రుద్రః" అను వాక్యము వివరణమగుటఁజేసి పూర్ణత్వోపాధికమగు పురుషత్వము శివుని యందే నిర్ధారితమగునది. ఇందువలననే "పురుషస్య విద్మ సహస్రాక్షస్య మహాదేవస్య ధీమహి" "పురుషం కృష్ణపింగళమ్" "త మీశానం పురుషం దేవ మీడ్యమ్" ఇత్యాది వాక్యములు పురుషశబ్దమును శివునియందే వ్యవహరించుటఁజేసి నారాయణపరముగ నుదాహరింపకుండుటను "వేదాంతేషు యమాహు రేక పురుషమ్" "వేదాంతము లన్నిటియందు గల పురుషశబ్దము శివైకాంతిక మగు" నని యభియుక్తులు వక్కాణించినందువలనను "పరాత్పరం పురిశయం పురుష మీక్షతే" ఉపాస్యమును గురించిన ఏతాదృశ వాక్యములలో గల పురుషపదము శివున కసాధారణ మగుచున్నది.

ఇట్లు చెప్పుటవలన పుంసూక్తమునందలి పురుషపదమును వినుటతోడనే శివపరత్వము బోధపడునని విశదమైనది. ఇఁక పురుష సూక్తము విష్ణుపూజనోపయుక్తమగుటచే విష్ణుపరమగునను నంశము గ్రాహ్యము కాజాలదు. ఎందుకనఁగా? "యజేత్ పురుషసూక్తేన- ధనదం విశ్వరూపిణమ్" ఇత్యాదిప్రమాణములు కుబేర పూజనమునందు శివారాధనమునందున్ను పురుషసూక్తమునకు వినియోగమును తెలుపుచున్నందున పుంసూక్తము శివపరంబగుననుట వజ్రలేపంబగునది.

ఇందువలన "పుంసూక్తము విష్ణుపర మగునని మంత్రోపనిషదాదులను

నారాయణపరములుగ సమర్థించుటను పూర్తిగా నిరసింపనైనది. ఇంతియేగాక ప్రసిద్ధశ్రుతులయందు విష్ణుస్వరూప వర్ణనము గానరాకుండుటను "ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతమ్" "ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగళమ్, ఊర్ధ్వ రేతం విరూపాక్షమ్" ఇత్యాద్యనేక శ్రుతులయందు పరమేశ్వరుని యసాధారణ రూపము నభ్యస్తముగా ప్రదర్శించుట చేతను ఔపనిషదుఁడగు పురుషుఁడు - ఉమాసహాయత్వాది స్వరూపలక్షణములు గలవాడుగా గుర్తింపఁ బడుటవలనను కారణప్రకరణగతమైన నారాయణ పదము విష్ణ్వసాధారణమైనను "ఆకాశ స్తల్లింగాత్" అను నధికరణన్యాయము ననుసరించి పరమేశ్వర పరముగా వ్యాఖ్యానింపఁబడుట సమంజసంబగుటను వరులకు పాంచ రాత్రములు దక్క తదితర శ్రుత్యాదిప్రమాణములు ప్రబలములు కాజాలవని విశదమైనది.

మఱియు శివనామమును స్మరించుటను శివచరణమును సేవించుటను విడ నాడువారికి భర్గపదఘటిత గాయత్రీమంత్రమును జపించుటయు "రుద్రో వా ఏష యదగ్నిః" అనుచో రుద్రమూర్తిగా వినఁబడు అగ్ని నుపాసించుటయు జాగ్రద్దశ యందు శివలింగదర్శనాదికమును ప్రయత్నముతో పరిహరించిన వారికి సుషుప్తిలో శివలింగానుసంధానము ననివార్యము లగుటచే పరుల కివ్విషయమున కింక ర్తవ్యతావిమూఢత్వ మేర్పడుచున్నది.

జీవాత్మ - ప్రత్యహము సుషుప్తిలో హార్దబ్రహ్మముఁ జెందుననియు, అట్టి బ్రహ్మము అంగుష్ఠ మాత్ర మనియు, అంగుష్ఠపరిమాణము శివలింగమునకు సరి పడుటఁ జేసి యది శివలింగ మగుననియు శ్రుతులు నిరూపించుటయే గాక "లింగే సుషుప్తిః" అనుచో హంసోపనిషత్తు హృదయాంతర్వర్తి యగు శివలింగమునందు చేతనుఁడు విశ్రాంతిఁ జెందునపుడే సుషుప్తి చేకూరునని కంఠరవమున నిర్ణయించి నది. ఇందువలన శివద్వేషులకు సుషుప్తియు పరిహరింపఁదగినదగుటయు "ప్రాణా నాం గ్రంధిరసి రుద్ర" అనుచో ప్రాణసముదాయము రుద్రుఁడని చెప్పినందున ప్రాణధారణాత్మక జీవనంబు నవ్వారికి పరిగ్రాహ్యము కాకుండుటయు మొదలగు పెక్కు విరోధములు గానంబడుటచే వేదాది వాఙ్మయమంతయు శివపర మగునను నంశము నిర్వివాదంబగుచున్నది.

ఓం తత్సత్

శ్రీమహాగణాధిపతయే నమః

శ్రీ నీలకంఠ భగవత్పాదకృత

# శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

## ద్వితీయాధ్యాయము

### ప్రథమపాదము

ఆంధ్రీకరణము

## స్మృత్యధికరణము

సూ॥ "స్మృత్యనవకాశదోష ప్రసంగ ఇతిచే
న్నాన్యస్మృత్యనవకాశదోష ప్రసంగాత్" 2-1-1

"ప్రధానమును పరతత్త్వముగా జెప్పు కపిలస్మృతికి నగ్నిహోత్రాది ధర్మమునందవకాశము లేమింజేసి పరతత్త్వ ప్రశంసయందు కపిలస్మృతియే ప్రబల ప్రమాణమగునని చెప్పుట సరికాదు. మను యాజ్ఞవల్క్యాది స్మృతులు ధర్మ ప్రతిపాదకములైనను ధర్మము బ్రహ్మోపాసనరూపమగుటచే మన్వాది స్మృతులకు ప్రత్యేకముగా నెచ్చోట నవకాశము లేకుండుట యనునది సమాన మగునని సూత్రార్థము.

గడచిన ప్రథమాధ్యాయమునందు - సచ్చిదానంద స్వరూపుడు, సర్వజ్ఞత సర్వశక్తిత్వము మున్నగు స్వరూపలక్షణములు గలవాడు, ప్రపంచమున కంతటికి కారణమగుటయను నుపలక్షణము గలవాడు, సర్వవిలక్షణుఁడు, సర్వాంతర్యామియు, విరూపాక్షత్వము కృష్ణపింగళత్వము నీలకంఠత్వము మొదలగు వానితోకూడిన లీలా-మంగళస్వరూప స్వభావములు గలవాడును, భవ శివ శర్వ

మహాదేవ పరమేశ్వరాది ముఖ్యశబ్దములతో చెప్పఁబడువాడును, పరమకారుణికుఁడు పరబ్రహ్మంబు నగు శివునియందు వేదాంతవాక్యములన్నియు వేదాంతానుకూలములగు స్మృతులున్ను తాత్పర్యముతో సమన్వయముఁ జెందుచున్నవని చెప్పఁబడినది.

ప్రస్తుతము రెండవ అధ్యాయముతో పూర్వోక్తసమన్వయమునకు వేదాంత విరుద్ధస్మృతి తర్కాదులతో గల విరోధము తొలగింపఁబడుచున్నయది.

మొదట సాంఖ్యస్మృతి విరోధమును పరిహరింపవలసియున్నది. ఈ యధ్యాయమునందంతటను ప్రథమాధ్యాయగత సమన్వయము విషయము. బ్రహ్మమును గురించి నిర్ణయింపఁబడిన వేదవేదాంత సమన్వయము ప్రకృతిప్రతిపాదకమగు కపిలస్మృతితో బాధింపఁబడునా లేదా అనునది- సంశయము;

వేదము- జగత్కారణము బ్రహ్మంబని చెప్పునది. కపిలస్మృతి యైతేనో ప్రకృతిని జగత్కారణముగా నిరూపించునది.

"ఋషిం ప్రసూతం కపిలం యస్తమగ్రే జ్ఞానైర్బిభర్తి జాయమానం చ పశ్యేత్" అను శ్రుతిప్రమాణము ననుసరించి కపిలమహర్షి - మహాతపస్వి, గొప్ప జ్ఞానము కలవాడున్ను కావున నాతని వచనము ప్రమాణము కాదగును. పూజ్యమైన వేదంబును నిఖిల ప్రమాణములలో మూర్ధన్యమైనది. కావున నప్రామాణ్య గంధమునుగూడ సహింపనట్టిది. ఇట్టితఱి నీ రెంటి నెద్దానితో నెద్ది బాధింపఁబడు ననునది- సంశయబీజము;

ప్రశ్న ; సాంఖ్య (కపిల)స్మృతి- యగ్నిహోత్రాది ధర్మముల యందవకాశము లేనిదగుటచే ప్రబలమగుచున్నందున వేదము ధర్మము నందవకాశముకల దగుటచే దుర్బలము కావునను ప్రబలస్మృతితో దుర్బలమైన వేదము బాధింపఁబడుట యుక్తము కాదా ?

ఉత్తరము : వేదవిరుద్ధములు కానట్టి మన్వాది స్మృతులు ప్రత్యేకముగా ధర్మమునుమాత్రము ప్రతిపాదించునవి కావు గావున నవ్వానికి నెచ్చోట నవకాశము లేకుండును.

"అప ఏవ ససర్జాదౌ - తాసు వీర్య మవాసృజత్"

ఇత్యాది వాక్యములతో "హిరణ్యగర్భం పశ్యత జాయమానమ్" ఇత్యాది శ్రుతు లందు ప్రత్యక్షముగా నేర్పడు బ్రహ్మకారణత్వమును సమర్థించు మన్వాది స్మృతులు - తద్విరుద్ధము అనుమేయ శ్రుతిమూలంబునగు సాంఖ్యశాస్త్రమును బాధించుట - ప్రామాణికజన సమ్మతం బగుచున్నయది.

ధర్మము శివారాధనరూపంబనుటకు ప్రమాణము—

కూర్మపురాణమున వ్యాసగీతలలో స్మృత్యుక్త సదాచారములను నిరూపించిన తరువాత-

"ఇత్యేష మానవో ధర్మో-యుష్మాకం కథితో మయా,
మహేశ్వరారాధనాయ - యజ్ఞయోగశ్చ శాశ్వతః."

"మన్వాది స్మృతులయందు చెప్పఁబడిన యజ్ఞాది ధర్మమును మహేశ్వరు నారాధించుటకై మీకు నే జెప్పితి"నని వ్యాసభగవానుఁడు ప్రతిపాదించెను.

"యోగప్రభావమున సకలవేదార్థతత్త్వమును కనుగొనిన కపిలమహర్షియే ప్రామాణికులలో నగ్రగణ్యుఁడు కాదగును. మన్వాదులు కర్మయోగవ్యగ్రులగుటచే వేదార్థమును పూర్తిగా తెలియఁజాలనివారు - కావున కపిలస్మృతి ననుసరించియే వేదవేదాంతార్థములను నిర్ణయింపనగు" నను ఆశంకకు సమాధానము దిగువ సూత్రము.

సూ. "ఇతరేషాం చానుపలబ్ధేః." 2-1-2

సర్వజ్ఞులైన మన్వాదులు ప్రవచించిన స్మృతులయందు కపిలుడు వక్కాణించిన ప్రధాన కారణత్వము మున్నగునది చెప్పఁబడనందున కపిలస్మృతి వేద మూలము కాదని తెలియుచున్నది. ఇందువలన సాంఖ్యస్మృతి - వేద వేదాంత సమన్వయమును బాధింపఃజాలదని సిద్ధాంతము.

పరమేశ్వరారాధనరూపమగు కర్మయోగమునందు కపిలుడు నిష్ఠలేనివా డగుటచే నాతనికి గల యోగనిష్ఠ - పరిపూర్ణము కాజాలదు - కావున మన్వాదులే కర్మజ్ఞాన భక్తియోగ నిష్ఠాగరిష్ఠులగుటఁజేసి సర్వజ్ఞులగుచున్నవారనియు కపిలుఁడు ఏకదేశజ్ఞానము గలవాడనియు సారాంశము.

## యోగప్రత్యుక్త్యధికరణము

సూ. "ఏతేన యోగః ప్రత్యుక్తః" 2-1-3

యోగాంగములను నిరూపించు హిరణ్యగర్భస్మృతియు ప్రధానమునే జగత్కారణముగా చెప్పునది.

సాంఖ్యస్మృతి వేదవిరుద్ధ మగుటచే వైదిక సమన్వయమును పరిహరింపఁ జేయఁజాలనట్లు హిరణ్యగర్భస్మృతితోడను వైదిక సమన్వయమునకు సంకోచము ఏర్పడునా లేదా యని సంశయము.

ప్రశ్న : యోగవిద్య బ్రహ్మసాక్షాత్కార హేతువని శ్వేతాశ్వతరోప నిషత్తునందు విశదీకరింపఁబడినది. కపిలస్మృతి యనుమేయ శ్రుతి మూలమగుటచే నద్ది వైదిక సమన్వయమును దుర్బల మొనర్పఁజాలకున్నను హిరణ్యగర్భస్మృతి ప్రత్యక్షశ్రుతిమూలమగుటచే ప్రధానకారణత్వమును సమర్థించుచు బ్రహ్మకారణ వాదినియగు శ్రుతిఁదగు సమన్వయమును సంకోచపఱచుట న్యాయ్యము గదా ?

ఉత్తరము : యోగస్మృతి శ్రుతి సమన్వయమును నిరాకరింపఁజాలదు. యోగశాస్త్రము "యోగశ్చిత్తవృత్తినిరోధః" ఇత్యాది వాక్యములతో వైదికములైన అష్టాంగయోగములను ప్రతిపాదించునది కాని యవైదికమగు ప్రధానకారణవాదము నందద్దానికి తాత్పర్యము లేదు ఒకవేళ నందు తాత్పర్యముకలదందు రేని యిద్దియు సాంఖ్యస్మృతివలె నిరాకరింపఁబడుట సమంజసంబగును.

అందువలన ప్రధానమును జగత్కారణముగా చెప్పునని యంగీకరింపఁ బడు హిరణ్యగర్భస్మృతి బ్రహ్మమును జగత్కారణముగా సిద్ధాంతీకరించు వైదిక సమన్వయమును సంకోచపఱచునని చెప్పుట యోగ్యము కాదని విశదమైనది.

శ్వేతాశ్వతరోపనిషత్తు పరులు భావించినట్లుగాక నుపక్రమమునుండి పరిసమాప్తివరకు శివునకే జగత్కారణత్వమును జగదంతర్యామిత్వమును బంధ మోక్ష హేతుత్వాది ధర్మములను నిరూపించుచు వేదాంత సూక్తములన్నియు పరమ తాత్పర్యముఁదగు పర్యవసాన భూమియగుటను శివునందే విస్తారముగా ప్రతిపాదించుచున్నయది.

ద్వితీయాధ్యాయమున "త్రిరున్నతం స్థాప్య సమం శరీరమ్" ఇత్యాది

వాక్యములయందు శివసాక్షాత్కారమును కలుగజేయు శివయోగవిద్య కలదు. ఇద్దియే యోగశాస్త్రమునందు విశదీకరింపఁబడినది. "ఈశ్వరప్రణిధానా ద్వా" "క్లేశకర్మవిపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః" "సపూర్వేషామపి గురుః" "తస్య వాచకః ప్రణవః" "పరమేశ్వరు నుపాసించుటవలన జీవాత్మ ముక్తుఁడగును" "ఈశ్వరుఁడనఁగా ? దుఃఖము కర్మవిపాకము సంస్కారసము దాయము అనువాని సంబంధము బొత్తుగా లేనివాడగును" "అట్టి పరమాత్మయే పూర్వాచార్యులందరికి నాచార్యుఁడు" "ప్రణవము పరమేశ్వరుని వాచకము" ఇత్యాది సూత్రములు శివపురాణగతములైన పరమేశ్వర ప్రతిపాదక వచనముల ననుసరించియే నిరూపింపఁబడినవి.

ఇందుకు శివపురాణమునందు వాయవీయ సంహితలో ప్రమాణములను గాన నగును.

శ్లో॥ న శివస్యాణవో బంధః-కార్మో మాయేయ ఏవవా ।
ప్రాకృతో వాఽథవా బంధః-అహంకారాత్మక స్తథా ॥

న రాగో న చ విద్వేషః-శంభో రమితతేజసః ।
ప్రతిసర్గం ప్రసూతానాం-బ్రహ్మణాం శాస్త్రవిస్తరమ్ ॥

ఉపదేష్టా స ఏవాదౌ-కాలావచ్ఛేదవర్తినామ్ ।
కాలావచ్ఛేదయుక్తానాం-గురూణా మప్యసౌ గురుః ॥

సర్వేషామేవ సర్వేశః-కాలావచ్ఛేదవర్జితః ।
ప్రణవో వాచక స్తస్య-శివస్య పరమాత్మనః ॥

"బంధము- ఆణవమనియు కార్మికమనియు మాయాకృతమనియు ప్రకృతి జన్యమనియు అహంకారమూలమనియు నొప్పారుచుండును. ఇట్టి బంధమెద్దియు పరమేశ్వరునకు లేనందున రాగద్వేషాది వికారములును (అనంతమహిమగల శివునకు) సంభవింపనట్టివి. ప్రతి సృష్టియందు జన్మించి కాలపరిచ్ఛేదము కలిగి యుండు చతుర్ముఖ బ్రహ్మలకు వేదాదిశాస్త్రసముదాయము నుపదేశించువాడు శివుఁడేను; పరశివుఁడు కాలావచ్ఛేదరహితుడు కావుననే కాలపరిచ్ఛిన్నులైన గురువులందరికిని గురువగుచున్నవాడు. అట్టి శివునకు ప్రణవ (ఓంకార)ము వాచకంబగుచున్నయది.

వస్తుతః యోగశాస్త్రము వైదికములైన యమనియమాద్యష్టాంగములను ప్రతిపాదించుటయందే తాత్పర్యము కలది గాని వేదవిరుద్ధమగు ప్రధానకారణ వాదమును సమర్థించుట లేదని సారాంశము.

ఒకవేళ యోగశాస్త్రమున ప్రధానకారణవాదము కలదందురేని తావన్మాత్రము ఈయధికరణమునందు నిరాకరింపఁబడినదని తెలియ నగును.

## న విలక్షణత్వాధికరణము

సూ. "న విలక్షణత్వా దస్య తథాత్వం చ శబ్దాత్" 2-1-4

(ఇది పూర్వపక్ష సూత్రము.)

వేదాంతములు జగత్కారణము బ్రహ్మంబని చెప్పు సమన్వయమును సాంఖ్యస్మృతి బాధింపనట్లు సాంఖ్యతర్కముతోఁడను వేదాంతసమన్వయము బాధింపఁబడునా ? లేదా యని సంశయము.

ప్రశ్న : బ్రహ్మకారణవాదము సర్వవిధంబులను తర్కబాధ్యంబగునది. "బ్రహ్మము ప్రపంచమున్ను విలక్షణములైనను కార్య కారణము లెట్లు గాకుండును ? వైలక్షణ్యమెట్టిది ?" అను ప్రశ్నలకు సమాధానమును "విజ్ఞానం చా విజ్ఞానంచ" ఇత్యాది శబ్దము (శ్రుతి) నిరూపించుచున్నయది.

ప్రపంచమైతేనో వికారాశ్రయత్వము, అజ్ఞత్వము మొదలగు నపురుషార్థముఁదగు రూపముగలది; బ్రహ్మంబు సత్యజ్ఞానానంద రూపంబగునది; ఇట్టితతీ పరస్పరవైలక్షణ్యము (భేదము) గల ప్రపంచబ్రహ్మములకు గోమహిషములకు వలె కార్యకారణభావము పొసగు నెట్లు ?

సూ. "అభిమాని వ్యపదేశస్తు విశేషానుగతిభ్యామ్" 2-1-5

(ఇదియు పూర్వపక్ష సూత్రము.)

జగత్తు చేతనము కాదనియు బ్రహ్మము చేతనంబనియు వైలక్షణ్యము నంగీకరించునెడ "తం పృథివ్యబ్రవీత్" "ఆపోవా అకామయంత" "శ్రుణోత గ్రావాణో విదుష" ఇత్యాది వాక్యములయందు పృథివీ జల పాషాణాదులు వచన

వాంఛా శ్రవణాదులు కలిగియున్నట్లు వ్రాయఁబడుటచే పృథివ్యాది ప్రపంచము చేతనంబే యగును కావున బ్రహ్మ ప్రపంచములు విలక్షణములు కావనునెడ-ప్రపంచమునందంతటను జ్ఞానకార్యములను నిర్దేశించుట పృథివ్యాదులయందభిమానము గలిగియుండు దేవతావిశేషము నుద్దేశించియే కాని మరియొకరీతిని కాదు.

ఇందుకు "హంతాహ మిమా స్తిస్రో దేవతా" ఇత్యాదులు ప్రమాణములు. "అగ్నిర్వాక్భూత్వా ముఖం ప్రావిశత్" ''తేజస్సు వాగ్రూపముతో ముఖమునఁ బ్రవేశించెను'' అనుచో అచేతన వస్తువునందభిమానముగల దేవత ననుసరించుటను గాననగును. ఏవమాది సందర్భమువలన నచేతనత్వము మొదలగు లక్షణములఁ జేసి ప్రపంచము బ్రహ్మమునకన్న విలక్షణంబగునది. కావున జగము కార్యమనుటయు బ్రహ్మము కారణంబనుటయు యుక్తి-యుక్తములు కాకుండును.

ఇట్లు ఏర్పడిన పూర్వపక్షము (ప్రశ్న)లకు సమాధానము దిగువసూత్రము నుండి నిరూపింపఁబడుచున్నయది.

సూ. ''దృశ్యతే తు'' 2-1-6

సిద్ధాంతమును చెప్పుచున్నారము.

ప్రపంచబ్రహ్మలు విలక్షణములైన నవ్వానికి కార్యకారణ భావము సంభవించును. చేతనముకానట్టి గోమయము (ఆవుపేడ) నుండి చేతనమగునట్టి వృశ్చికము (తేలు) పుట్టుటయు చేతనుఁడైన పురుషునివలన నచేతనంబులగు వెంట్రుకలు మున్నగునవి జన్మించుటయు లోకమున గానంబడుచున్నవి. కావున శుష్క-(శ్రుతివిరుద్ధ) తర్కము శ్రుతిసమన్వయమును బాధింపఁజాలదని సిద్ధాంతము. మఱియు నొకవిధముగా శంకించి పరిహరింపఁబడుచున్నయది.

సూ. ''అసదితిచేన్న, ప్రతిషేధమాత్రత్వాత్'' 2-1-7

"కార్యకారణములు విలక్షణములను నెడ కారణమునందు కార్యము లేకయే జనించుచునను నంశమును ''అసద్వా ఇదమగ్ర ఆసీత్, అను శ్రుతి వాక్యము నిరూపించుచున్నది గావున నసత్కార్యవాదము, నంగీకరించినట్లగు ననుట సమంజసముకాదు.

"దృశ్యతేతు" అను సూత్రమునందు ఉపాదాన (కారణ)ఉపాదేయ (కార్య)

ములకు సాలక్షణ్య (ఒకేరూపము కలిగియుండుటయను) నియమము మాత్రము నిషేధింపఁబడినది కాని కారణకార్యములు ఏకద్రవ్యనిష్ఠములు కావని చెప్పఁబడ నందున జగద్బ్రహ్మములకు నేకవస్తుభావమును నిరూపించుట సమంజసంబగు చున్నయది.

## అపీతౌ తద్వత్ప్రసంగాధికరణము

సూ. "అపీతౌ తద్వత్ప్రసంగా దసమంజసమ్" 2-1-8

(ఇది పూర్వపక్షసూత్రము.)

సత్కార్యవాదమునఁజేసి కార్యకారణములగు జగద్బ్రహ్మములు నొకే వస్తువగునని చెప్పు సమన్వయము తర్కబాధ్యమగునా కాదా యని సందేహము.

ప్రశ్న : అట్టితటి (జగద్బ్రహ్మములొకేవస్తువుయని చెప్పనెడ) జగము నకు వలె బ్రహ్మమునకును వికార అజ్ఞానాది అనిష్ట సంబంధము ఆవహించును. అందువలన వేదాంతవాక్యముల సామరస్యము (నిర్దోష కల్యాణగుణ విశిష్టమగు బ్రహ్మమునందు తాత్పర్యము) సమంజసము కానట్టిది. కావున తర్కముతో వేదాంత సమన్వయము బాధింపఁబడుచున్నయది.

"ప్రపంచ స్థితికాలమునందు బ్రహ్మము ప్రపంచగత దోషములతో కూడి యున్నను ప్రళయకాలమున నిర్దోషముగా కల్యాణగుణాకరంబుగా నుండునను ఆక్షేపమునకు సమాధానముగా సూత్రమునందు "అపీతౌ" అను శబ్దము చేర్చబడి నది. అపీతియనఁగా-ప్రళయము.

సూ. "న తు దృష్టాంతభావాత్" 2-1-9

సూత్రగత నకారముతో పూర్వపక్షము నిరాకరింపఁబడుచున్నయది. "యస్యాత్మాశరీరమ్" "పరమేశ్వరునకు జీవాత్మ-శరీరము" "యస్యావ్యక్తం శరీరమ్" "అవ్యక్తశబ్దితమగు ప్రధానాదిప్రపంచము శరీరము" ఇత్యాది శ్రుతి ప్రమాణమువలనను.

శ్లో॥ విగ్రహం దేవదేవస్య – జగదేతచ్చరాచరమ్।
ఏత మర్థం న జానంతి - పశవః పాశగౌరవాత్ ॥

"ప్రాణులతోడ జడములతోడను నిండియుండు జగము మహాదేవునకు మూర్తియగును. ఇట్టి రహస్యమును పశువులు (జీవులు) సంసారపాశముఁదగు ఖారమున క్రుంగువారగుటచే గురుతెఱుగకున్నారు" ఇత్యాది పురాణసూక్తివలనను చిదచిచ్ఛరీరకముగా నేర్పడిన పరబ్రహ్మంబగు శివుఁడు కారణము కార్యంబు నగుటలో గుణదోషములను పరిశీలించుటకు దృష్టాంతము నుండుటఁజేసి వేదాంత వాక్య సమన్వయ సామరస్యము అసమంజసము కాజాలదు.

ఎట్లనఁగా ? శరీరముగల మనుష్యాది చేతనునకు బాల్య యౌవన వృద్ధత్వాది దశలు సంభవించినను బాల్యాదులు శరీరమునందే ఏర్పడునవి. సుఖ దుఃఖాదులు ఆత్మయందు సంభవించునవి. అటులే నీ సందర్భమునఁ గూడ శివ శరీరములగు చిదచిద్వస్తువులయందే చిదచిద్గతములగు అజ్ఞాన వికారాది అనిష్టములు సమకూరునట్టివి. నిరవద్యత్వము, వికార రాహిత్యము, సర్వజ్ఞత్వము, సత్యసంకల్పత్వము మొదలగునవి చిదచిదాత్మయగు పరమేశ్వరునందే సంభవించునవి.

అందువలన నిట్టి ద్విధము దృష్టాంతము కనఁబడుటచే శ్రుతులఁదగు అసామంజస్యము బ్రహ్మమునందు కలుగునది కాదని సారాంశము.

సూ. "స్వపక్షదోషాచ్చ" 2-1-10

కేవలము తర్కము నవలంబించునెడ సాంఖ్యులకు స్వపక్షమునందే దోషము సంభవించును.

ఎట్లనఁగా ? పురుషుఁడు ఎట్టి వికారములేనివాడనియు ప్రకృతి జడమనియు ప్రకృతిపురుషులలో నొకరిధర్మమును మరియొకరియందు భావించుటయను నధ్యాస సంసారమనియు సాంఖ్యుల సిద్ధాంతము. సూత్రములోని చకారము ఏవకారార్థమును బోధించును. ఐతే సాంఖ్యుల యభిమతమున నిర్వికారుఁడగు పురుషుని సన్నిధానమునఁజేసి ప్రకృతి మహదహంకారాది తత్త్వములను పుట్టించుట యెట్లు పొసగును ? అధ్యాసయనఁగా ? ఒక వస్తువునందుండు ధర్మమును మరియొకదానియందు భావించుట యగును. ఇట్టి యధ్యాస పురుషునకెట్లు సంభవించును ? ప్రకృతి జడమగుటచే నద్దానికి నధ్యాస కూడదు గదా ! ఇందువలన సాంఖ్యుల ప్రధానకారణవాదమే తర్కబాధ్యంబగునని తెలియునది.

సూ. "తర్కాప్రతిష్ఠానాత్" 2-1-11

కేవలతర్కము నూతగా గొని సాంఖ్యులు ప్రధానకారణత్వము విషయమై ఊహించు నుపపత్తులను పరమాణుకారవాదులు దూషించిరి. అట్లే పరమాణు కారణవాదమును మరియొకరు ఖండించిరి. కావున శుష్కతర్కములకెందును ప్రతిష్ఠ (స్థైర్యము) లేమిఁజేసి శ్రుతిమూలకమగు బ్రహ్మకారణవాదమే పరిగ్రాహ్యం బగుచున్నయది.

సూ. "అన్యథాఽనుమేయ మితిచే దేవ మప్యనిర్మోక్ష ప్రసంగః" 2-1-12

తర్కమునకు ప్రతితర్కము ఏర్పడిన నద్ది (ప్రతితర్కము) ఎవ్విధము కొట్టుబడకుండునో నవ్విధము (మరియొకరీతిగా) ప్రధానమును జగత్కారణ ముగా ననుమానముతో సాధింపవలె నను వాదంబును యుక్తము కాదు.

అట్టితటి నిదేవిధము (ప్రతితర్కమునకు) ప్రతితర్కము ఏర్పడును కావున. తర్కకలహము ఎప్పటికిని ముగియునది కాజాలదు. ఇందువలన తర్కమునకు ప్రతిష్ఠితముకాకుండుట యను దోషమునుండి విడుదల కానేరదు. కావున శుష్క తర్కమూలమగు ప్రధానకారణవాదమే విడువఁదగినది. కాని ప్రబలశ్రుతిప్రమాణ సిద్ధంబగు బ్రహ్మకారణవాదము త్యాజ్యంబు కాదని చెప్పుట యుక్తంబేను;

## శిష్టాపరిగ్రహాధికరణము

సూ. "ఏతేన శిష్టాపరిగ్రహా అపి వ్యాఖ్యాతాః" 2-1-13

సాంఖ్యమతము తర్కమూలమగుటచే నప్రతిష్ఠితత్వము మొదలగు దోష ములవలన నిరాకరింపఁబడినట్లు కణాద అక్షపాద క్షపణకాది మతములన్నియు వైదికజనులచే పరిగ్రహింపఁదగినవి కావని నిరూపించినట్లేను:

కణాదాదులందరిచే పరమాణుకారణవాదము పరిగ్రహింపఁబడినను పర మాణు స్వరూపమును శూన్యముగా మాధ్యమికులు; జ్ఞానాత్మకముగా యోగా చారులు; క్షణికముగా బౌద్ధులు; సత్యముగా వైశేషికులు చెప్పుచు వివాదగ్రస్తులై తమతమ యనుకూలతర్కములతో విపక్షముల నాభాసములుగా నొనర్చుకొనిరి.

గావున తర్కావలంబిపక్షములన్ని యప్రతిష్ఠితములగుటఁజేసి వేదాంతవాక్య సమన్వయముతో నేర్పడు బ్రహ్మకారణవాదమే వైదిక జనపరిగ్రాహ్యం బగునది యని విదితమైనది.

## భోక్త్రాపత్త్యధికరణము

సూ. భోక్త్రాపత్తేరవిభాగశ్చేత్స్యాల్లోకవత్" 2-1-14

పూర్వాధికరణములయందు చిదచిత్ప్రపంచవిశిష్టుడైన శివుఁడే అద్వితీ. యుఁడై కారణము కార్యంబునగువాడని విశిష్టశివాద్వైత సిద్ధాంతము వేదాంత వాక్య సమన్వయ సిద్ధమైనదని చెప్పఁబడినది. కాని యద్దానికి యుక్తిబాధ యుండునా ? లేదా ? అని సందేహము.

ప్రశ్న : పరమేశ్వరుఁడు చిదచిచ్ఛరీరకుఁడగునెడల శరీరముతో కూడిన వాడగును. మఱియు జీవునివలె శరీరియగునని యంగీకరించుచో శివునకును శరీర సంబంధముతో సుఖదుఃఖభోగము తప్పనిసరిగా సంభవించును కావున సంసారియగు ఈ జీవునికన్న పరమేశ్వరునకు విభాగము లేకుండుట చేకూరును. ఇందువలన నీతడు జీవాత్మ, యీతడు పరమాత్మ, యను విశేషము సరిపడ కుండుఁటజేసి జగద్విశిష్టత్వవాదమున పరమేశ్వరుఁడు సుఖదుఃఖభోగాది దోష ములు లేని స్వరూపము గలవాడవి నిరూపంప వలను పడదు గదా !

ఉత్తరము : ఇందు విరోధమేమియు లేదు. జీవునికంటె పరమేశ్వరునకు కళంకములు లేనట్టి నమస్తమంగళములఁదగు స్వరూపము కలిగియుండుట కారణ ముగా విభాగముండియే తీరును అనిష్టభోగము శరీరిత్వప్రయుక్తము గాక పరాధీ నత్వప్రయుక్తమగునట్టిది.

లోకమున రాజ-భృత్యులు శరీరముతో కూడియుండుటలో సమానులైనను రాజు పరాధీనుఁడు గాకుండుటచే స్వేచ్ఛాకృతభోగము ననుభవించుచు పరాధీను లగు భృత్యులవలె కటకటపడకుండును. స్వాతంత్ర్య పారతంత్ర్యములే ఈ రాజ భృత్య విభాగమునకు కారణములగుచున్నవి. ఇందుకు శ్రుతిప్రమాణము-"జ్ఞాజ్ఞౌ ద్వావజావీశానీశౌ, అనుచో జీవేశ్వరులలో పరమాత్మ జ్ఞానాత్మకుఁడనియు జీవాత్మ

కించిజ్ఞుఁడనియు ఈశ్వరుఁడు స్వతంత్రుఁడనియు జీవుఁడు పరతంత్రుఁడనియు ఇద్దరును జననమరణాదిరహితులగుటచే నిత్యులనియు నిరూపించుచున్నయది.

ఇందువలన స్వతంత్రుఁడగు పరమేశ్వరునకు పరతంత్రుఁడైన జీవుని కంటె విభాగము (శరీరసంబంధము ఉభయులకు సమానమైనను) అవశ్యము అంగీకరింపఁదగినది. ఏవం విశిష్టాద్వైత సిద్ధాంతమునకు ఎట్టి హానియు లేదని సారాంశము.

## ఆరంభణాధికరణము

స్వతంత్రత, పరతంత్రత, మొదలగు పరస్పర విరుద్ధధర్మముల సంబంధమువలన జీవేశ్వరులకు విభాగము చెప్పఁబడినను కారణకార్యములగు బ్రహ్మ ప్రపంచములన్యములు (వ్యతిరిక్తములు-వేరువేరుగా నుండునవి) కావని చెప్పునదీ యధికరణము.

సూ "తదనన్యత్వ మారంభణ శబ్దాదిభ్యః" 2-1-15

తస్మాత్ కారణాత్ బ్రహ్మణః కార్యస్య జగతః అనన్యత్వం-అపృథక్ సిద్ధత్వం "వాచాఽఽరంభణం" ఇత్యాదిశ్రుతిగత ఆరంభణ శబ్దాదిభ్యః సాధ్యతే ఇతి సూత్రార్థః.

"కారణమగు బ్రహ్మమునకంటె కార్యమగు జగము వేరుకాదని శ్రుతి ప్రోక్తములగు ఆరంభణాది శబ్దముల వలన సాధింపఁబడునని" సూత్రార్థము.

కార్యకారణములగు ప్రపంచ పరమాత్మలకు పూర్వోక్తవేదాంత సమన్వయముతో నేర్పడిన అనన్యత్వము యుక్తమగునా కాదా ? అని సందేహము.

ఒకటి చేతనము, మరియొకటి యచేతనము, ఒకఁడు స్వతంత్రుడు మరియొకడు పరతంత్రుఁడు మొదలగు పరస్పర విరుద్ధధర్మముల సంబంధమునఁ గలుగు వైలక్షణ్యము (భేదము) సందేహమునకు కారణము.

ప్రశ్న : ప్రపంచ బ్రహ్మములకు ననన్యత్వము ఏర్పడునెట్లు ? పూర్వాధికరణమునందు పరమేశ్వరుడు సర్వజ్ఞత్వాది లక్షణములు గలవాడనియు జీవుఁడు భోక్తయనియు కించిజ్ఞుడనియు విభాగము చూపఁబడినది. ఇక బ్రహ్మప్రపంచ

ములు చేతనాచేతనములగుటచేత నత్యంత విలక్షణములగుటఁజేసి యవ్వానిక భేదము చెప్ప నలవిగానిది గదా ! కార్యకారణత్వము అనన్యత్వమును సాధించు నందు రేని మృత్పిండ ఘటములు కారణకార్యములైనను కుండతో జలాహరణము చేయఁబడును కాని మృత్పిండముతో చేయఁబడదుగదా ! ఇందు ఘటము శరావము అను వస్తుభేదము గమనింపఁదగినది. (మృత్పిండమునకును నీటితో తడుపుటయు మర్దించుటయు కారణములు.) ఇట్టి భేదములు పెక్కులుండుటచే కారణకార్యత్వము అభేదమును సాధింపఁజాలదు. గోమయము కారణముగా వృశ్చికము కార్యముగా చెప్పఁబడినపుడు గోమయ వృశ్చికము లొక్కటియేయని చెప్పశక్యము కాదుగదా ! ఇంతియేగాక కార్యకారణముల కత్యంతాభేదమనునెడ ప్రపంచబ్రహ్మము లఖండములు కావలసివచ్చును. అట్టితఱి నంతటను కర్త యనియు క్రియయనియు ఇత్యాది వ్యవహారము లోపించును కాదా ?

ఉత్తరము : కారణమగు బ్రహ్మమునకంటె కార్యమగు జగము అన్యంబు (పృథక్ సిద్ధము) కాజాలదు. ఇది యెట్లు తెలియుననఁగా ? "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్" "కార్యములగు ఘటాదుల నామరూపములు అర్థక్రియారూపవ్యవహారోపయుక్తములగుచు కారణమగు మృత్తికననుసరించియే సత్యములగుచున్నవి."

"సదేవ సౌమ్యేద మగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్" "సౌమ్యుడా ? ఈ జగము సృష్టికిమున్ను సదాత్మకముగానే యుండెను. అట్టి సత్పదార్థము తనతో సమానమైన రెండవది లేనిదై ఏకరూపమగునట్టిది." "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి" బ్రహ్మము అనేకముగా నగుదునని సంకల్పించెను." "ఐతదాత్మ్య మిదగ్ం సర్వమ్'' తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" ఈ జగమంతయు శివస్వరూపమగునది. అట్టి శివరూపము సత్యమైనది. అద్ది యాత్మ యనఁబడును. శ్వేతకేతువా ? నీవు పరమేశ్వరుఁడంతర్యామిగా కలవాడ వగుచున్నావు" "విశ్వం భూత భువనం చిత్రం బహుధా జాతం జాయమానం చ యత్ సర్వో హ్యేష రుద్రః" చిత్రవిచిత్రముగా సంభవించినట్టి అనేక విధములుగా అవిర్భవించుచున్నయట్టి ప్రపంచమంతయు రుద్రుఁడేను" ఇత్యాది వాక్యములయందు గల ఆరంభణాది శబ్దములవలన కారణకార్యములగు బ్రహ్మ జగంబు లనన్యము లగుచున్నయవి.

కార్యకారణత్వము అనన్యత్వమును సాధింపఁజాలదను శంకకు సమాధాన మీ సూత్రము.

సూ. "భావేచోపలబ్ధేః" 2-1-16

ఘటాదికార్యము లేర్పడినపుడే తత్కారణమగు మృత్తికయే ఘటముగా పరిణమించెనని తెలియఁబడును. కావున కారణముతో భిన్నము కానిదియే కార్యమగుచున్నయది. ఇట్లే "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్" అను శ్రుతియందు చెప్పఁబడినది.

ఇద్దానియర్థము "వికారః = రూపము, నామధేయమున్ను; వాచ యనఁగా = ఉచ్చారణము, ఉపయోగము, అనువానిఁదగు వ్యవహారమగును ఇట్టి వ్యవహారమును కలిగించుసవి. (మన్ను నకే కుండయునికి, కుండ యను పేరున్ను జలమును పరిగ్రహించుట మున్నగు లోకవ్యవహారమునకై నుపయుక్తములగుచున్నవని సారాంశము.)

వస్తుతః ఘటాదికార్యములు మృత్తికా రూపములగుటఁజేసియే సత్యములగుచున్నవి. మన్నులేకుండా ఘటాదికము కనఁబడదుగదా! ఇంతియేగాక ఘటమను రూపము "ఇది ఘటము" అనుటకు మాత్రమువయోగించునది. మరియు మృత్తికయందే వ్యవహారము సిద్ధించుటకు నేర్పడు రెండవయవస్థయే ఘటాదికంబగునని పరమార్థము. కాని ఘటాదికము మృత్తికకంటె భిన్నమైన వస్తువు కాజాలదు. మృత్తికావ్యాప్య మగుటఁబట్టియే ఘటాది నామధేయములు సత్యములగుచున్నవి. ఘటాదికము మృత్తికయనియే యంతటను మృత్ ఘటాది నామరూపములు ప్రామాణికములగుచున్నవి. కాని మృత్భిన్నములని సత్యములగుట కాదు. ఎందువలన ఘటము మృత్తికయో నందువలననే కారణముతో ననన్యము కార్యమగుచున్నది. అర్థక్రియాది వ్యవహార భేదమైతేనో మృత్ ఘటములొక్కే వస్తువైన నవస్థాభేదమునఁజేసి యేర్పడుచున్నయది. అందువలన మృత్ఘటములకువలె బ్రహ్మప్రపంచములకు వ్యాప్యవ్యాపక భావముండుటచే ననన్యత్వంబని గ్రహించునది.

ఇందుకు పురాణ ప్రమాణము.

శ్లో॥ శక్త్యాది చ పృథివ్యంతం-శివతత్త్వసముద్భవమ్ ।
సతైకేన తు తద్వ్యాప్తం-మృదా కుంభాదికం యథా ॥

''ఆదిశక్తి మొదలుకొని పృథివివరకు గల తత్త్వములన్నియు శివతత్త్వమునుండి యావిర్భవించినవి. మన్ను-కుండలుమున్నగువాని వ్యాపించునట్లు సత్పదార్థమగు పరమేశ్వరునిచే తత్త్వములన్నియు వ్యాపింపఁబడియున్నవి." ఇందువలన మృత్తికతో ఘటాదులవలె కారణంబగు శివునితో కార్యమగు ఈ జగము వ్యాపింపఁబడినదగుటచే బ్రహ్మభిన్నమైనదని సిద్ధాంతము.

సూ. "సత్త్వాచ్చావరస్య" 2-1-17

అపరమనఁగా కార్యము కారణమునందుండుటవలన కారణముకంటెన భిన్నమైనది కార్యంబగును. ఘటశరావాదికము పూర్వము మృత్తుగా నుండెను కావుననే ఘటాదికము మృద్రూపముగా కనఁబడుచున్నది.

సూ. "అసద్వ్యపదేశాన్నేతిచేన్న, ధర్మాంతరేణ
వాక్యశేషా ద్యుక్తేః శబ్దాంతరాచ్చ"

ప్రశ్న : "ఇదంవా అగ్రేనైవ కించనాసీత్" "ఈ జగము సృష్టికిమున్ను ఏమియు లేకుండెను" అనుచో కార్యము పూర్వము అభావంబని నిర్దేశించుటవలన కారణమునందు కార్యము లేకుండెడిదని బోధపడుచున్నది కాదా ?

ఉత్తరము : కారణమునందు కార్యముండియే తీరినది. స్థూలత్వమునకు ప్రతికూలమగు సూక్ష్మత్వమనెడు రెండవ ధర్మము కార్యమునకు సంగతంబగుచున్నయది అందువలననే కార్యమునకు "అసత్" అనెడు నిర్దేశము కాని అభావమువలన కాదు, ఎందుకనఁగా "తదసదేవ సన్ మనోఒకురుత" "ఆ యసత్తే సత్తుగా నగుదు"నని సంకల్పించెను'' అను వాక్యశేషంబు నిదే యర్థమును బలపఱచుచున్నయది. మఱియు ఉన్న వస్తువునకే సంకల్పము (మనస్కారము) పొసగునది. అసద్వ్యపదేశంబును ధర్మాంతరము సంబంధించుటకు నిమిత్తమగుటను స్ఫురింపఁజేయునదియని యుక్తితో సాధింపవచ్చును. యుక్తియెట్లనఁగా ? పరస్పరవిరుద్ధములు, భావరూపములునగు పిండత్వ ఘటత్వ కపాలత్వ రూప ధర్మములవలన "ఘటము పూర్వము లేకుండెను'' ''ఇప్పుడుకలదు" ''ఇక ముందునుండదు" ఇట్లు ఎల్లకాలము అనువర్తించు మృత్తికకే అసత్ మొదలగు నిర్దేశమగుచుండగా తద్భిన్నమైన అభావముఁదగు వ్యవదేశమున కాధారముగా మరియొక ధర్మము (అత్యంత వినాశము)ను కల్పింపఁగూడదు.

మఱియు "తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్, తన్నామరూపాభ్యామేవ వ్యాక్రియత" "అనాదికాలానువర్తమానంబగు ఈ జగము ఎట్టి విభాగము లేనిదై ప్రళయకాలమున నుండెడిది, అది సృష్టికాలమున నామరూపములతో స్థూలరూపమై వ్యక్తమయ్యెను" ఇత్యాది శ్రుతి ప్రమాణములు పై యంశమునే సమర్థించుచున్నయవి

సారాంశమేమనఃగా ?

తనతో వేఱుకాని నామరూపవిభాగము లేనట్టి సూక్ష్మచిదచిద్రూపయగు పరాశక్తి గర్భమందు గల శివుఁడు కేవలుడని ప్రళయకాలమున వర్ణింపఁబడుచున్నవాడు. మరల శివుడు తన రూపమగు సూక్ష్మశక్తిని సూక్ష్మదశావిరోధియైన స్థూలదశతోకూడిన నామరూప విభాగముఁదగు చిదచిద్రూపము గలదానిగా విస్తరింపజేయువాడు.

ఈ సందర్భమున శక్తివిశిష్టశివునకు సంకోచావస్థ ప్రళయమనియు వికాసావస్థ సృష్టియనియు గ్రహింపవలెను. ఇద్దానికి ఆ ప్రవచనమును ప్రమాణముగా గాననగును.

శ్లో॥ "చిదాత్మైవ హి దేవోంఽతః-స్థిత మిచ్ఛావశా ద్బహిః,
యోగీవ నిరుపాదాన - మర్థజాతం ప్రకాశయేత్ ॥

"జ్ఞానస్వరూపుఁడు అథవా జీవాంతర్యామియగు పరమాత్మతనలోనుండు ప్రపంచమును "యోగిపురుషుఁడు ఎట్టియుపాదానము (సాధనాంతరము) లేకయే ననేక వస్తువుల నావిర్భవింపజేయునట్లు" వ్యక్తముఁజేయువాడు"

ఇట "నిరుపాదానమ్" అను పదము మరియొక నుపాదానము లేకుండా స్వయముగా నుపాదానమై పరమేశ్వరుఁడు జగమును నిర్మించునని తెలుపునది, కావున పరమకారణము. పరబ్రహ్మమునైన శివునికంటె నభిన్నమైనదే జగత్కార్యంబని విదితమైనది.

మఱియొక నిదర్శనముఁ జెప్పుచున్నవారు.

సూ. "పటవచ్చ" 2-1-19

సూ. "యథా చ ప్రాణాదిః" 2-1-20

సంకుచితమైన సూక్ష్మరూపమగు వస్త్రము తెఱువఁబడినదై పెద్ద వస్త్రముతో కాదగు కుటీరముగా కార్యమగునట్లు పరమాత్మయు సంకుచిత (సూక్ష్మ) రూపముఁ జెందినపుడు కారణమగుననియు విస్తృత (స్థూల) రూపము నొందినపుడు కార్యమగుననియు తెలియవలెను.

మఱియు ఒకే వాయువు ఆయా స్థలములందుండు విశేషమునఁజేసి ప్రాణవాయువు మున్నగు భేదమును పొందినట్లు పరబ్రహ్మంబును శక్తివ్యాపార భేదమున సదాశివాదిరూపభేదము గలదగుచున్నయది.

ఇందువలన జగత్కారణమగు బ్రహ్మమునకంటె కార్యమైన జగము అన్యము కాదని చెప్పుట సమంజసంబైనది.

ఒకే ద్రవ్యము సూక్ష్మస్థూలదశలతో కార్యకారణభావమును పొందుననుటకు మృత్ ఘటాది దృష్టాంతము చూపఁబడినది. ఇఁక వస్తువు నొకటియైనను కార్యకారణ భేదముఁజెందినపుడు భిన్నమగునని చెప్పువారికి సమాధానముగా పటకుటీర ప్రాణవాయు దృష్టాంతములు ప్రదర్శింపఁబడినవి.

సూ. "ఇతరవ్యపదేశా ద్ధితాకరణాదిదోష ప్రసక్తిః" 2-1-21

(ఇది పూర్వపక్షసూత్రము)

ప్రశ్న : "తత్త్వమసి" "అయమాత్మా బ్రహ్మ" ఇత్యాది వాక్యములతో కార్యమగు జీవుఁడు కారణమగు బ్రహ్మముగా నిర్దేశింపఁబడుటవలన నుభయుల (జీవేశ్వరుల)కు ననన్యత్వమని ప్రతిపాదించితిరి గదా ! అట్లైనచో పరమేశ్వరుఁడు జగమును నిర్మింపకుండుట స్వహితముగాను జగమును సృజించుట స్వఅహితముగాను సంభవించును. ఎందుకనఁగా ? సర్వజ్ఞుఁడు సత్యసంకల్పుఁడు నగు పరమాత్మ తనతో వేరుకానట్టి జీవుని సంసారతాపము తనదే యని గురుతెఱిగినవాడై హితముగానట్టి సంసారనిమిత్తమైన జగమునెట్లు నిర్మించును ? హితమగు జగమును సృజింపకుండుట నెట్లుపేక్షించును ? అందువలన పరమేశ్వరుఁడు జీవాభిన్నుడనునెడ స్వహితము నొనర్పకుండుటయు నహితమును గావించుటయు ఏతాదృశవివేకశూన్యత్వాదిదోషము సంభవించుచున్నయది. ఇత్యాదిసందర్భము వలన కార్యకారణములగు జీవేశ్వరుల కనన్యత్వము యుక్తము కాదని తోచెడిని.

ఉత్తరము : యుక్తంబగునని చెప్పువారము.

సూ. "అధికం తు భేదనిర్దేశాత్" 2-1-22

(ఇది సిద్ధాంతసూత్రము)

కార్యకారణము లనన్యములైనను కార్యంబగు చిదచిత్ప్రపంచమునకంటె కారణమగు బ్రహ్మము అధికంబనియు, జీవేశ్వరులకు భేదంబనియు దిగువ పేర్కొనఁబడిన ననంతశ్రుతులవలన తెలియుచున్నది.

"విశ్వాధికో రుద్రో మహర్షిః'' "సర్వజ్ఞుడైన శివుడు చేతనాచేతన సమ్మిశ్రమగు ప్రపంచమునకంటె నెక్కువగా నున్నవాడు" "విద్యావిద్యే ఈశతే యస్తు సోఽన్యః" "విద్యయనఁగా చేతనుఁడు, అవిద్యయనగా అచేతనము, ఈ రెంటిని శాసించువాడు మూడవవాడగును. అనఁగా-చేతనాచేతనముల నియమించువానికి తదధిక సామర్థ్య ముండి తీరవలెనని భావము." "క్షరాత్మానా వీశతే దేవ ఏకః" "దేవుఁడొకఁడే ప్రకృతిని పురుషుని శిక్షించు గొప్పదనము గలవాడు'' "పృథగాత్మానం ప్రేరితారంచ మత్వా'' "జీవుఁడు-పరమాత్మ తనలోనుండి తనను ప్రేరేపించువాడని భావించినచో ముక్తుఁడగును.'' "ద్వా సువర్ణా సయుజా సఖాయా'' "మంచిరెక్కలుగల రెండుపక్షులు (జీవేశ్వరులు) కూడియుండువారై చెలిమిగలవారు." "ద్వేబ్రహ్మణీ వేదితవ్యే వరంచాపరంచ" "పరమనియు అపరమనియు బ్రహ్మము (జీవేశ్వరు)లు తెలియఁదగినవి.'' "జ్ఞాజ్ఞౌ ద్వా వజావీశానీశౌ" "జీవుఁడు ఈశ్వరుఁడును జన్మాదులులేనివారై నిత్యులైన నందు పరమేశ్వరుఁడు సర్వజ్ఞుఁడనియు స్వతంత్రుఁడనియు, జీవుఁడు కించిజ్ఞుడనియు, పరతంత్రుఁడనియు చెప్పఁబడుచున్నారు." "నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానామ్" "నిత్యులైన జీవులలో నిత్యుఁడనియు చేతనులలో చేతనుఁడనియు పరమాత్మ పేర్కొనఁబడుచున్నవాడు'' "అంతఃప్రవిష్టః శాస్తా జనానామ్" ''ప్రాణుల హృదయములో ప్రవేశించి వారిని శిక్షించువాడు పరమాత్మయగును " "అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్" "మాయాధిష్ఠాతయగు శివుఁడు-తనతో నెడబాయని ప్రధానము నుండి యీ ప్రపంచమును పుట్టించును." ''తస్మింశ్చాన్యో మాయయా సన్నిరుద్ధః"

"శరీరమునందు అథవా సంసారమునందు శివభిన్నుడైన జీవుఁడు మాయా వశమున కట్టుబడియున్నవాడు.''

''జుష్టం యదా పశ్యత్యన్య మీశమ్" ''జీవాత్మ—తనను వ్యాపించియుండు వానిగా పరమాత్మను గురుతెఱిగినపుడు ముక్తుఁడగును."

"ప్రధానక్షేత్రజ్ఞపతి ర్గుణేశః" ''పరమాత్మ-ప్రకృతికిని జీవునకును గుణము లకున ధీశుఁడగువాడు'' "ఏషా మీశే పశుపతిః పశూనామ్" "పశువులనఁబడు జీవు లందరిని శాసించువాడగుటచే పశుపతి యనఁబడును"

కావున ప్రపంచమునకంటె నతీతమై శివాపరనామధేయమగు బ్రహ్మము అధికంబే యగుచున్నయది.

ప్రశ్న : ఓయీ ? "తదనన్యత్వమ్" ఇత్యాది సూత్రములవలన జగజ్జీవేశ్వ రుల కభేదంబును "అధికంతు" ఇత్యాదిసూత్రములచే భేదంబు నవగతమగుచున్నం దున ప్రపంచబ్రహ్మములకు భేదాభేదము సాధింపఁదగియున్నది కాదా ?

ఉత్తరము : ప్రపంచబ్రహ్మములకు భేదాభేదమును సాధింప వలనుపడదు. విశిష్టాద్వైతమును సాధించువారము. బ్రహ్మప్రపంచములకు ఘటపటములకువలె మిక్కిలి భేదమును చెప్పువారము కాము. భేదమును చెప్పునెడ జగద్బ్రహ్మముల యభేదమును నిరూపించు శ్రుతులు విరోధించును. అత్యంతాభేదమునుగూడ చెప్పు వారము కాము. మరియు శుక్తిరజతములకు వలె ఏకతరమిథ్యాత్వమును ప్రతి పాదించువారము కాము అత్యంతాభేదముగాని ఏకతరమిథ్యాత్వముగాని స్వాభావిక గుణములతో జగద్బ్రహ్మభేదమును తెలుపు శ్రుతులకు విరుద్ధంబగునది. భేదా భేదంబును చెప్పువారము కాము. మొదట భేదము తరువాత నభేదంబనునెడ జగ జ్జీవులును బ్రహ్మంబును అను వస్తుత్రయము లోపించును. కాని శరీరిశరీరములకు వలె గుణిగుణములకువలెను విశిష్టాద్వైతమును నిరూపించువారము. ప్రపంచబ్రహ్మ ములకు అనన్యత్వమనఁగా ? మృత్తికాఘటములకు వలె గుణగుణులకు వలెను కార్యకారణములగుటగాను విశేషణవిశేష్యములగుటగాను ఎడబాటు లేకుండుట యగును. మన్నులేనిది కుండ యుండఁజాలదు గదా ? నలుపులేనిది కలువ యుండజాలదు. అట్లే బ్రహ్మము లేనిది ప్రపంచరూపమైన శక్తి యేర్పడదు. శక్తిని నిరాకరించి యొకప్పుడైనను బ్రహ్మము తెలియఁబడదు. వేడి లేకుండా

అగ్నిఁగుర్తెరుగఁజాలముగదా! ఎద్ది లేకుండా నెయ్యది తెలియఁబడదో అద్ది నద్దానితో కూడియుండునదేను; విశేషణముతో కూడియుండుట విశేష్యముఁదగు స్వభావంబే యగుచున్నయది. ఇందువలన నన్నివిధములుగా బ్రహ్మము ప్రపంచముతో కూడియుండునదేను, కావున బ్రహ్మముతో ననన్యమైనది జగంబని చెప్పఁబడుచున్నది. జగద్బ్రహ్మభేదం బైతేనో స్వాభావిక మగునది. అందువలన పరబ్రహ్మము విశ్వమునకంటె నధికంబగుచున్నయది. కారణత్వకార్యత్వముల నిర్దేశము "నతు దృష్టాంతభావాత్" అనుచో చక్కగా గావింపఁబడినది.

కావున నీ విశిష్టాద్వైత సమన్వయ మార్గము భేదము నభేదంబును సమర్థించు శ్రుతులకు విరుద్ధము కానట్టిదియే;

సూ. "అశ్మాదివచ్చ తదనుపపత్తిః" 2-1-23

అభేదశ్రుతులఁబట్టి జీవేశ్వరులకు సర్వథా అభేదంబనుట పాడికాదు. పాషాణములు కాష్ఠములు మట్టిబెడ్డలు తృణము మున్నగునవి ఒకేభూమినుండి పుట్టునవైనను పరస్పరము విలక్షణములైనట్లు జీవాత్మ-కించిజ్ఞుఁడగుట మొదలగు లక్షణములు గలవాడుగాను పరమాత్మ-సర్వజ్ఞత్వము మొదలగు లక్షణములు గలవాడుగాను మిక్కిలి వైలక్షణ్యము గల వారగుటచే వారికి నేకత్వముపపన్నము కాజాలదు. అందువలన పరమేశ్వరుఁడు జీవునికన్న రెండవ వస్తువగువాడేను; మరియు చేతనుడే గుణములతో భేదము ఎక్కువ కలవాడై ఈశ్వరాభిన్నత్వమును పొందనపుడు స్వరూపముతో విలక్షణంబగు నచేతనము ఈశ్వరాభిన్నమని చెప్పుటకు బొత్తుగా వీలులేదు.

స్వకార్యమగు చేతనాచేతన ప్రపంచము తనకు వేరుగానుండు వస్తువు కానిదైనను అట్టి ప్రపంచమునకన్న సర్వజ్ఞుడు సర్వశక్తిమంతుడు నగు పరమేశ్వరుఁడధికుఁడే యని సిద్ధాంతము.

## ఉపసంహారదర్శనాధికరణము

సూ. "ఉపసంహారదర్శనా న్నేతి చేన్న, క్షీరవద్ధి,
దేవాది వదపి లోకే" 2-1-25

"ఒకానొక కార్యము ఏర్పడుటకు ననేకకారణములు ఏకీభవించుట గానంబడుచున్నందున నానావిధమగు జగమునకు నేకరూపమైన బ్రహ్మము కారణము కాజాలదని చెప్పగూడదు. లోకములో ఒకేనొక పాలు—పెరుగురూపముగా పరిణమించుటవలెను దేవతలు ననేకకామరూపములఁదాల్చునట్లును విచిత్రజగమునకు బ్రహ్మమొక్కటియే కారణము కాదగు"నని సూత్రార్థము.

"ఏకమేవాద్వితీయమ్" "ద్యావాపృథివీ జనయన్ దేవ ఏకః"ఇత్యాదిశ్రుతులు పరమేశ్వరుఁడొక్కఁడే జగత్కారణమని చెప్పుచున్నవి కావున బ్రహ్మ మొక్కటియే విచిత్ర జగమునకు కారణ మగుట పొసగునా ? లేదా ? అని సందేహము.

ప్రశ్న : ఆకాశ వాయు అగ్ని జల భూమ్యాదిరూపమైన జగము విచిత్ర (నానావిధ)మైనది. అద్ది కారణముఁదగు విచిత్రత్వములేనిది సంభవింపఁజాలదు. లోకమున రథాదికార్యముల విషయమై అనేక కర్తలను చూచుచునేయున్నారము. అందువలన జగమునకు బ్రహ్మము ఏకైక కారణమని చెప్పరాదు గదా ?

ఉత్తరము : కారణమొక్కటియైనను కార్యరూపముగా పరిణమించుట సంభావ్యంబేను, పాలు ఒక్కటియే పెరుగుగా పరిణమించుటను లోకమున గాననగును. అందువలన జగత్కార్యము బ్రహ్మైకకారణంబగుచున్నయది.

కార్యము నానావిధముగా నుండుట కారణవైచిత్ర్యమును సూచించు ననుట పాడికాదు. చేతనుఁడైన నొక్క పురుషునివలన వెంట్రుకలు గోళ్ళు మొదలగు విచిత్రములైన కార్యములు జనించుచునే యున్నవి. కావున సమస్త విచిత్ర జగత్కార్యమును నిర్వహించుటకై బ్రహ్మము మరియొక కారణముఁదగు నవసరము లేనిదనియే సారాంశము.

ఇద్ది శక్తిగలవారికి సంభవించునదియేను,

శాస్త్రమువలన తెలియఁబడు సామర్థ్యముగల దేవతలు మున్నగువారు తమ యభీష్టములైన నానారూపములను పొందునట్లు శ్రుతిస్మృత్యాదులవలన విదితంబగు మహిమ గల పరమేశ్వరునకు సమస్తంబు నుపపన్నంబగునది.

ఇందుకు ప్రమాణము.

"య ఇమాన్ లోకా నీశత ఈశనీభిః జననీభిః పరమశక్తిభిః" అనంతములైన శక్తులుగల పరమేశ్వరునకు నసాధ్యంబెద్దియగును ?

# కృత్స్నప్రసక్త్యధికరణము

సూ. "కృత్స్నప్రసక్తి ర్నిరవయత్వ శబ్దకోపో వా" 2–1–26

పూర్వపక్షసూత్రము.

బ్రహ్మము జగద్రూపముగా పరిణమించునని పూర్వము చెప్పఁబడిన యంశము పొసగునా లేదా యని సందేహము.

ప్రశ్న : ఎట్లు పొసగును ? ఒకే బ్రహ్మము జగదాకారముగా పరిణమించు నెడ పాలు పెరుగుగా పరిణమించునట్లు బ్రహ్మము సర్వాత్మనా జగద్రూపముగా పరిణమింపవలసివచ్చును. అట్టితఱి బ్రహ్మము జగద్రూపమునకంటె నధికముగాక శేషింపకుండును. ఒకానొక నంశముతో బ్రహ్మము జగద్రూపమగు నను నెడ బ్రహ్మము అవయవములు లేనిది యను నంశము భంగపడును. మరియు నిరవయవము బ్రహ్మంబని చెప్పు శ్రుతియు విరోధించును. కావున బ్రహ్మమునకు పరిణామము కూడదనియే చెప్పవలెను కాదా ?

సిద్ధాంతసూత్రము.

సూ. "శ్రుతేస్తు శబ్దమూలత్వాత్" 2–1–27

శ్రుతిప్రమాణముఁబట్టి బ్రహ్మము జగదాకారముగా పరిణమించుట యుక్తంబని తెలియునది. ఇవ్విషయమై శ్రుతిదక్క నితరప్రమాణము సరిపడదు. బ్రహ్మము శబ్దమూల మగుటఁజేసియే ఇతరప్రమాణములన్నిటితో తెలియఁబడు వస్తువులకంటె విలక్షణంబగుటచే బ్రహ్మమునందు ఒకానొక అదృష్టశక్తి యేర్పడునది. కావున నెట్టి విరోధంబును లేదు. ఇందువలన పరిపూర్ణంబగు బ్రహ్మమే కారణమగుటయు కార్యమగుటయు పొసగుచున్నవి.

"నైషా తర్కేణ మతి రాపనీయా" అను శ్రుతివాక్యము బ్రహ్మవిచారబుద్ధిని తర్కముతో క్షీణింపఁజేసికొనగూడదని చెప్పుచున్నందున బ్రహ్మము తర్కమునకు గోచరముకాదు గావునను రూపమును కనుగొనుటకు శ్రోత్రము సాధకము బాధకంబును గానట్లు తర్కము బ్రహ్మజ్ఞానమునకు సాధకంబు బాధకంబును కాజాలదు.

శ్రుతిప్రమాణముతోడనే సంతృప్తిఁజెందని తార్కికంమన్యుని యుద్దేశించి సూత్రోక్తమైన సిద్ధాంతమును దిగువవిధము చెప్పుచున్నవారు.

జాతివాదులు- అత్యంత విలక్షణములైన అనంతములగు ఖండముండాదుల యందుగల నొక్కొక్క వస్తువునందు పూర్ణముగా వర్తించునది జాతియని చెప్పుచు జాతివిషయమున ఇతరవస్తు దృష్టాంతమును చూపజాలనట్లు బ్రహ్మస్వరూపమును నిరూపింప శబ్దమే మూలంబనుట సమంజసంబేను.

సూ. "ఆత్మని చైవం విచిత్రాశ్చ హి" 2-1-28

జీవాత్మయందును చిత్తుగాని ప్రపంచముఁదగు ధర్మమునకంటె విలక్షణం బగు కర్తృత్వ భోక్తృత్వాది ధర్మముఃదగు సంబంధముండునట్లు నచిద్విశేషము లగు నగ్నిజలాదులు పరస్పరము విలక్షణమైన శక్తి కలిగి విచిత్రములుగా కనఁబడునట్లును బ్రహ్మంబును శబ్దైకప్రమాణకమై విచిత్ర అనంతశక్తులు గలదియగు ననుటలో విరోధ మెద్దియు గానరాదు. సర్వంబు సమంజసంబేను.

సూ. "స్వపక్షదోషాచ్చ" 2-1-29

అచిత్తుతో సమానమగు ప్రధానము మొదలగునవి సాంఖ్యుల మతమున నిర వయవములగుటచే ప్రధానకారణవాదమునకు తర్కమే ముఖ్యప్రమాణ మగుటను సాంఖ్యమతమునందే ప్రధానము జగదాకారముగా పరిణమించునను వాదమునందు కృత్స్నప్రసక్తి (మొత్తము పరిణమించుటయు ఏమాత్రము శేషింపకుండుటయు) మొదలగు దోషములు చేకూరుచున్నవి. కాని శాస్త్రప్రమాణకమగు బ్రహ్మము విషయమై ఎట్టి దోషంబును గానంబడుట లేదు.

బ్రహ్మము సర్వశక్తి సంపన్నమగుటఁజేసి సర్వంబు నుపపన్నంబగునని దిగువసూత్రముతో వక్కాణించుచున్నవారు.

సూ. "సర్వోపేతా చ తద్దర్శనాత్" 2-1-30

"పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే, స్వాభావికీ జ్ఞానబలక్రియా చ"

"బ్రహ్మముఁదగు శక్తి-సహజమై నానావిధమై ఇచ్ఛాజ్ఞాన క్రియారూపము లతో నొప్పారుచుండును."

"మాయాంతు ప్రకృతిం విద్యా-న్మాయినంతు మహేశ్వరమ్"

("మాయ (ఆదిశక్తి) ప్రపంచమునకు ప్రకృతి (మూలకారణము) అనియు మహేశ్వరుఁడు స్వాశ్రితురాలైన మాయతో నవినాభావము (నిరంతర సంయోగము) కలిగియుండుననియు గురుతెఱుగవలెను."

ఇత్యాదిశ్రుతులయందు గానంబడుటచే ప్రతి శక్తియు బ్రహ్మము నాశ్రయించియుండునని తేటపడుచున్నయది. కావున సర్వవిధ సామర్థ్యము గల పరమేశ్వరునకు నసాధ్య మెద్దిగలదు ?

సూ. "వికరణత్వాన్నేతిచే త్తదుక్తమ్" 2-1-31

"న తస్య కార్యం కరణం చ విద్యతే" అనుచో బ్రహ్మము ఎట్టి కరణము (క్రియ) లేనిదని చెప్పఁబడినందున బ్రహ్మము జగమును నిర్మించి యద్దానికి కారణంబగునని చెప్పరాదను ప్రశ్నకు - బ్రహ్మము శబ్దమూలంబు గావున సర్వశక్తిసంపన్నమై జగత్కారణంబగునని యీ వరకే సమాధానము వక్కాణింపఁబడినది.

విచిత్రములైన అనంతములగు శక్తులతో నానారూపములు గల మాయ యనఁబడు పరమశక్తితో గూడియుండు పరమేశ్వరుఁడు తన శక్తిఁదగు ఒకానొక భాగము (పురుషుని)తో ప్రపంచాకారుడై స్వయముగా ప్రపంచము నతిక్రమించియుండు ననుటకు "మాయాంతు ప్రకృతిం విద్యాత్" అను భగవతియగు శ్రుతయే ప్రబలప్రమాణమగునది.

ఇవ్విషయమై పురాణఫణితిని క్రిందివిధము గాననగును.

శ్లో॥ విశ్వోత్తరోత్తర విచిత్ర మనోరథస్య
యస్యైకశక్తిశకలే సకలః సమాప్తః ।
అధ్వాన మధ్వపతి మధ్వవిదో వదంతి
తస్మై నమః సకలలోక విలక్షణాయః ॥

ప్రపంచమునకంటె శ్రేష్ఠమగు ప్రకృతికన్న మిన్నయగు విచిత్రమైన సంకల్పముగల పరమేశ్వరుని శక్తిఁదగు ఒకానొక విభాగము నందు పదునాలుగు

లోకములు మున్నగువానితో నిండియుండు బ్రహ్మాండమంతయు విశ్రాంతిఁజెంది యుండును.

వేదమార్గమును కనుగొనిన మహానుభావులు - పరమేశ్వరుని షడ్విధమైన వేదమార్గముగాను మార్గములన్నిటి యధిపతిగాను చెప్పుచున్నారు. చరాచరము నంతటికంటె విలక్షణుండగు అట్టి పరమేశ్వరునికొరకు నమస్కారము.

ఇందుకు శ్రుతిప్రమాణము— "అధ్వనా మధ్వపతేః శ్రేష్ఠస్యాధ్వనః పార మశీయ" "మంత్రాధ్వ మొదలగు మార్గములకధిపతియగు పరమేశ్వరుని యనుగ్రహమున శ్రేష్ఠమైన ముక్తిమార్గముఁదగు పారమును అనఁగా శివపదమును పొందువాడను."

ఇట్లు సకలదోషకళంకములు బొత్తుగా లేనట్టి, శబ్దప్రమాణము తోడనే సిద్ధించునట్టి, సర్వవిధశక్తుల సంపదఁ దగు విలాసముగల యట్టియు పరబ్రహ్మము నందు (పరమేశ్వరునియందు) ఇద్ది సంభవించును ఇద్ది సంభవింపదు అను విచారమున కంతటికిని ఎట్టి యవకాశము లేదనియే సిద్ధాంతము.

## లీలాకైవల్యాధికరణము

మరియొకరీతిగా నాక్షేపించుకొని పరిహరించుచున్నవారు.

సూ. ''న ప్రయోజనవత్త్వాత్'' 2-1-32

పూర్వపక్షసూత్రము.

శాస్త్రమువలన తెలియఁబడు సర్వవిధ సామర్థ్యముగల బ్రహ్మము-కార్యము లన్నిటియందు కారణస్వరూపముతో నుండునని ఈ వరకు నిర్ణయింపఁబడినది. ఐనను ప్రతివాడు ప్రతికార్యమును చేయుటకు నొకానొక ప్రయోజనము తప్పక నుండితీరును. ఐతే అవాప్తసకలకాముడైన పరమేశ్వరుఁడు జగత్సృష్ట్యాదివ్యాపారమును గావించుట పొసగునా లేదా ? యని సందేహము.

ప్రశ్న : ఎట్లు పొసగును ? ''ఆనందో బ్రహ్మ'' ''విభుం చిదానంద మరూప మద్భుతమ్'' ఇత్యాది శ్రుతివాక్యములు - పరమేశ్వరుఁడు అత్యంత శ్రేష్ఠమైన ఆనందము స్వరూపముగా కలవాడనియు నిత్యతృప్తుడనియు చెప్పుచున్నవి కావున

నీ పరమాత్మ-ప్రయోజనము నపేక్షింపకుండా సృష్ట్యాది వ్యాపారములయందెట్లు ప్రవర్తించును ? ఒకవేళ భగవానుని ప్రవృత్తి ప్రయోజనము నపేక్షించునెడ పరమేశ్వరునకు గల నిత్యతృప్తత్వము భంగపడును.

ప్రయోజనము లేదనునెడ జడబుద్ధి గలవానివలె నుచితముగాని కార్యముఁ జేయువాడగును కాదా ?

ఉత్తరము :

సిద్ధాంతసూత్రము.

సూ. ''లోకవత్తు లీలా కైవల్యమ్'' 2-1-33

నిత్యతృప్తుడైన పరమేశ్వరుఁడు జగత్సృష్ట్యాదులయందు ప్రవర్తించుట ప్రయోజనము లేనిదగుటచే వ్యర్థమైనదని చెప్పఁబడిన యంశము యుక్తము కాజాలదు. పరమేశ్వరుని ప్రవృత్తి నిష్ప్రయోజనమైనను కేవలము లీలామాత్రమైనది. లోకములో ధనికుడగువానికి ప్రయోజనము లేకున్నను బంతి నాడుకొనుటమున్నగువానియందు లీలగా ప్రవృత్తి యగునట్లు పరమేశ్వరుఁడవాప్త సకలకాముఁడైనను విలాసముగా సృష్టి మొదలగువానియందు ప్రవృత్తుఁడగుటలో విరోధ మెద్దియు లేదు.

లీలయనఁగా-స్వభావమని చెప్పవచ్చును. లోకమున దుఃఖమతిశయించినపుడు కలుగు రోదనము, సుఖము ఎక్కువైనపుడు ఏర్పడు పరిహాసము సంగీతమున్ను ప్రయోజనము లేనట్టివి. ఇట్లే పరమేశ్వరుఁడు జగమును సృజించుట నిత్య నిరతిశయానందానుభవ ప్రయుక్తమై కేవలము లీలామాత్రంబగునది. ఇఁట లీలాశబ్దము- క్రియను మాత్రము చెప్పును. కాని విలాసమును చెప్పునది కాదు.

లోకమున సంగీత వ్యాఖ్యానము నందు కొందరు గావించు శిరఃకుంపన అంగుళిచాలనాదులు ప్రయోజనములేనివని గ్రహింపనగును. కావున ''స్వాభావికీ జ్ఞానబలక్రియాచ'' అను శ్రుతివాక్యము ననుసరించి పరమేశ్వరుని సృష్ట్యాది ప్రవృత్తి-సహజమైనదని విదితమగుచున్న యది.

"క్రీడార్థం సృష్టి రిత్యన్యే-భోగార్థ మితి చాపరే,
దేవస్యైష స్వభావోఽయ-మాప్తకామస్య కా స్పృహా ॥
మాండూక్యము

''పరశివుఁడు చేయు సృష్టి - విలాసరూపమైనదని కొందరు చెప్పుదురు. జీవులు పూర్వ పూర్వకల్పములయందు గావించిన కర్మలఁదగు ఫలితముల ననుభ వించుట కొరకని మరికొందరు నిరూపింతురు. సృష్ట్యాదివ్యాపారమంతయు పర మాత్మకు స్వభావమగుననియు ఆప్తకాముఁడైన శివున కెట్టి యపేక్ష యుంటజాల దనియు నింక కొందరు నిర్ణయించినారు '''

ఇంతియేగాక నిట లీలాశబ్దము ఎట్టి శ్రమలేని క్రియఁజెప్పునది. లీలాశబ్ద ముతో కైవల్యశబ్దమునిట ప్రయోగించుటచే ఎట్టి ఆయాసమునైనను గణింపని విలా సంబగునని తెలియుచున్నయది.

ఇట్లు పరమేశ్వరుఁడనాయాసముగా సాధించు సృష్ట్యాదిక్రియలు స్వాభావిక ములై నిట్టూర్పువలె నెట్టి ప్రయోజన (ఫలిత)ము నపేక్షింపనివని సారాంశము.

## వైషమ్యనైర్ఘృణ్యాధికరణము

సూ. "వైషమ్య నైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్తథాహి దర్శయతి"
2-1-34

పరమేశ్వరుఁడు జగమును సృజించుటమున్నగు కార్యములయందు ప్రయో జనములేకున్నను లీలగా ప్రవర్తించునని చెప్పఁబడినది గదా! అట్టి ప్రవృత్తి సంగతమైనదా కాదా యని సందేహము.

ప్రశ్న. పరమేశ్వరుఁడు లీలగానైనను ప్రపంచ సృష్టిఁజేయుట పొసగఁ జాలదు. ఎందుకనగా? పరమాత్మ - పరిపూర్ణుడగుటవలనను రాగద్వేషాదులు లేనివాడగుటను సకల సమానుఁడై మధ్యస్థుడగువాడు. అట్లుగాక సృష్టిలో కొంద రికి సుఖమయములైన దేవాదిశరీరములను మరికొందరికి దుఃఖపూర్ణములగు మనుష్యాదిశరీరముల నొనఃగూర్చుటయను వైషమ్య (పక్షపాత)ము సంభ వించును. మరియు సృష్టి-సంహార పూర్వకమగుటఁజేసి సమస్తము నొకేకాలమున సంహరించుటయను నైర్ఘృణ్య (కాఠిన్యఁము సమకూరుచున్నయది. కావున నివ్వి ధము అపురుషార్థసంబధమును కలుగఁజేయు జగత్సృష్టితో పరమేశ్వరున కెట్టి ప్రయోజనంబు గానంబడదు గదా!

ఉత్తరము : జగమును సృజించు పరమేశ్వరునకు వైషమ్య నైర్ఘృణ్యములనఁబడు దోషములు ఎప్పుడును సంభవింపఁజాలవు, ఎందుకనఁగా ? సృష్టి-జీవులనాదికాలమునుండి గావించు కర్మల ననుసరించి యగునది. ఇఁక సృష్టిలో గల వ్యత్యాసము "జ్ఞాజ్ఞౌ ద్వా వజా వీశానీశౌ" ఇత్యాది శ్రుతులవలన జీవులనాదికారమునుండి యున్నట్లు వారు చేయుకర్మలనాదులనియు తెలియనగును. సంసారము కర్మప్రవాహమును పురస్కరించుకొని యేర్పడునది గదా ! పరమేశ్వరుఁడు జీవులు గావించిన నానావిధమైన కర్మను సర్వజ్ఞుడగుటచే పరిశీలించి తన సామర్థ్యముతో భోగసాధనంబగు దేవాదిశరీరము నేర్పరచువాడు. సృష్టివైషమ్యంబును కర్మమూలమైనదేను; సంహారమైతేనో జీవులు సంసారమునందనేక కోటి జన్మగత సుఖదుఃఖానుభవ వ్యాపారమువలన నలసియుందురు గావున ప్రతి దినము ఉదయము మొదలుకొని సాయంకాలమువరకు పరిశ్రమఁజేసిననవారికి సుషుప్తి (గాఢనిద్ర)వలె విశ్రాంతిహేతు వగుటచే పరమేశ్వరునకు నైర్ఘృణ్యము (నిర్దయ)ను కలుగఁజేయునది కాదు.

ప్రశ్న : ఓయీ ? జీవులనుభవించు సుఖదుఃఖములు మున్నగువాని విషయమై కర్మయే ప్రయోజకంబగుటచే నప్రయోజకుండగు పరమేశ్వరునితో పని యేమి ?

ఉత్తరము : జీవులాచరించు కర్మలు ఈశ్వరాధీనములగుటచే పరమేశ్వరుఁడు సర్వస్వతంత్రుఁడనుటకెట్టి భంగము లేదు. అట్టితఱి కర్మలు స్వతంత్రములు కాకుండునెడ ఘట్టకుటీ ప్రభాతన్యాయముగా పరమేశ్వరుఁడు వైషమ్యము గలవాడు కావలసివచ్చునని చెప్పగూడదు.

ఘట్టకుటీ ప్రభాత న్యాయమనఁగా ? ఒకానొకఁడు రాత్రిసమయమున శకటము నధిష్ఠించి ప్రయాణమును చేయుచు నొకానొక పట్టణము చెంతనుండు కాపఱి యగువాని గుడిసెముందు నుండి వెళ్ళినచో కప్పమునుచెల్లించవలసివచ్చునని భావించి మరియొక దారిగుండా రాత్రియంతయు బండిపై సంతరించి తెల్లవారుసరికి మరల నదే కాపఱి గుడిసెముందుకు వచ్చియుండెను. ఘట్టమనఁగా కప్పమును చెల్లించు చోటు. అట గల గుడిసె కుటి యనఁబడును. ప్రభాతమనఁగా తెల్లవారు వేళ; వస్తుతః

అనంతములైన కర్మశక్తులు మాయాగతములై సృష్టివైషమ్యమునకు

కారణములైనను అట్టి కర్మశక్తులు తన యధీనములు గాన పరమేశ్వరుఁడు నవ్వాని సృష్టియందు ప్రవర్తింపఁజేయునని సారాంశము.

ప్రశ్న : జీవులకు శరీర సంబంధము నేర్పరచుటకు నచేతనము, చేతనునిచే నధిష్టిపఁబడనిదియు నగు కర్మ సమర్థముగాకుండుటచే పరమేశ్వరుఁడే జీవశరీరాది నిర్మాణమునకు కారకుఁడని చెప్పవలెను కాఁదా ? మరియు సృష్టికిమున్ను జీవుల భోగసాధనములనన్నిటి నుపసంహరించి సంసారక్లేశముల లేకుండఁజేసియు జీవులను సుఖపెట్టిన పరమేశ్వరుఁడు పరమకారుణికుఁడనఁబఱగును. ఇట్టి దయామయుఁడు మరల సృష్టిసమయమున సంసార నిదానములగు శరీరములతో నెట్లు జీవుల ననుసంధింపఁజేయును ?

ఉత్తరము : పరమేశ్వరుఁడు సర్వానుగ్రాహకుండేను; జీవుల కర్మలు పరిపక్వములు గానిది జ్ఞానోదయము కాజాలదు. జ్ఞానములేనిది నిరతిశయమైన ఆనందము గల మోక్షము సంభవింపదు. కర్మపరిపాకము అనుభవములేనిది కాజాలదు. అట్టి కర్మఫలముల భోగమునకై పునఃపునః జీవులకు శరీరాదులను కల్పించువాడు పరమేశ్వరుండేను ; ఇట్లు జీవుల కర్మలు క్రమముగా భోగముతో నశింపగా శుద్ధమైన అంతఃకరణము (హృదయము) గల జీవులకు తనను కనుగొను జ్ఞానమును కలుగఁజేసి, యత్యంతశ్రేష్ఠమగు ఆనందము స్వరూపముగా గల మోక్షలక్ష్మిని ప్రకాశింపఁజేయును.

ప్రశ్న : ఇట్లు పరమేశ్వరుఁడు ఉత్తమోత్తమశక్తి గలవాడై పరమకరుణాస్వభావము గలవాడు కావున జీవులందరికి నొకేమారు కర్మలను పరిపక్వములంగావించి యొకే కాలమున మోక్షమును ప్రసాదింపడెందులకు ?

ఉత్తరము : నీవనినది నిజమేగాని పరమేశ్వరుఁడు జీవులనందరి నొకేతడవ ననుగ్రహించువాడైనను పక్వమలురగువారు వెంటనే ముక్తులగుదురు. అపక్వమలురగువారు కాలక్రమముగా తరించువారు. పరమేశ్వరుడు ప్రళయకాలములో ప్రసుప్తములై యుండు జీవకర్మలను సృష్టిసమయమున నుద్బోధించి నాకర్మలఁజెందియుండు శరీరాదులతో ప్రళయ విశ్రాంతులగు జీవుల ననుసంధింపఁజేయుననియు పూర్వమువలె తరతమ భావముతో జీవులను దుఃఖింపఁజేయుననియు వివేకము.

ఆకాశమున సూర్యుని కిరణముల సముదాయము సమముగా ప్రసరించు చున్నను పక్వములైన కమలములే వికసించునవి. పక్వములు కానివి వికసింపవు.

అందువలన పరమేశ్వరుడు పరిపూర్ణుఁడైనను సర్వవిధమైన సృష్ట్యాది ప్రవృత్తిని పరార్థమే చేయువాడు- ఇందుకు పురాణ ప్రమాణము పరమేశ్వరుఁడు సర్వాను గ్రాహకుఁడని చెప్పుచు పై విషయమునంతయు విశదీకరించుచున్న యది.

శ్లో॥ అదిత్యేన యథా హీనం-తమోభూత మిదం జగత్,
శివేనాపి వినా తద్వత్-తమోభూత మిదం జగత్ ॥

వైద్యం వినా నిరానందాః-క్లిశ్యంతే రోగిణో యథా,
శివం వినా నిరానందం-క్లిశ్యతే హి జగత్తథా ॥

వ్యాధీనాం భేషజంయద్వత్-ప్రతిపక్ష స్వభావతః,
శివః సంసారదోషాణాం-ప్రతిపక్ష స్వభావతః ॥

యథాఽనాదిః ప్రవృత్తోఽయం-ఘోరః సంసారమండలః,
తథాఽనాదిః ప్రవృత్తోఽయం-శివః సంసారమోచకః ॥

సూర్యుడు లేనిది జగమంతయు చీకటి యగునట్లు శివుఁడులేనిది ప్రపంచము సర్వంబును తమోమయంబగును. లోకమున వైద్యుడు లేనిది రోగులు దుఃఖించు నట్లు శివుఁడు లేనిది చచాచరమంతయు ఎట్టి యానందము లేనిదై బాధపడును. రోగములకు నౌషధము వలె సంసారగత దోషములకు శివుఁడు ప్రతిపక్షమగు వాడు అనఁగా-నవ్వానిని తొలగించువాడు. ఘోరమైన నీ సంసారము ఎట్లు అనాదికాలమునుండి ప్రవర్తించుచున్నదో నట్లే శివుఁడు ననాదికాలవర్తనుడై పక్వ మలు రగువారిని సంసార బంధమునుండి తొలగించువాడు.

ఇత్యాది సందర్భమువలన పరమేశ్వరుఁడు జీవాత్మల నందరి నను గ్రహించు నుద్దేశముతో జగత్సృష్ట్యాది వ్యాపారముఁజేయుట సమంజసంబని విశద మైనది.

అనుగ్రహమనఁగా ? సంసారబంధమును బొత్తుగా తొలగించి తనతో సమానత నొసగుటయగును.

బంధమనఁగా ? సర్వజ్ఞత్వమును సర్వకర్తృత్వమును తత్సంబంధి సర్వవిధ విజ్ఞానమును తత్క్రియయునున్న మఱుగుపఱచునదియై ఏకవిధముగా నుండున దైనను విచిత్రములు ఆనంతములు నగు శక్తులతో రాగి ఇత్తడి మున్నగు లోహములను వ్యాపించు కళాయివలె సహజముగా నేర్పడు ఆవరణముగా నుండును.

మలమనఁగా ? పరిణామముఁజెందు ఒకానొక ద్రవ్యమగును. అట్టిమలము (వ్రణము గడ్డ పుండు మున్నగునది) వలె పరిపాకానంతరమే తొలగునది. పాకమైతేనో వ్రణమునకు క్షారాదులతో వలె జీవులాచరించు నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానముతోడను సంసారక్లేశముల ననుభవించుటతోడను సంపాదింపఁదగినది. కర్మలు పరిపాకముఁ జెందునపుడు వైరాగ్యము శివభక్తి శివతత్త్వజిజ్ఞాస మున్నగు ప్రణాళికతో సంసార మోచకమైన జ్ఞాన నుదయించును.

కర్మభోగమైతేనో తదుచితములైన లోకములయందు సుఖదుఃఖముల ననుభవించుటకు సాధనములగు ద్రవ్యములు దేవతలు తదితరములున్న లేనిది సంభవింపనట్టిది. అట్టి కర్మభోగమునకు ప్రాణులాచరించు విచిత్రములైన కర్మలు కారణములగును.

అందువలన పరమేశ్వరుఁడు జీవులతో పూర్వపూర్వ సంస్కారముల ననుసరించి కర్మలు చేయించి యవ్వారు చేయు విచిత్రములైన కర్మల ననుసరించి యవ్వాని కుపకరించు దేహాదులను పుట్టించి సుఖదుఃఖముల ననుభవింపఁ జేయువాడగును కావున నిదియంతయు కరుణతో నేర్పడునదని గ్రహింపవలెను. ఇందువలన పరమేశ్వరునకు ఎట్టి వైషమ్యముగాని కాఠిన్యముగాని కలుగఁ జాలవని తెలియనైనది.

లోకములో వ్రణాదులతో బాధపడు రోగులకు వారి వారి తారతమ్యముఁ గురుతెఱిగి క్షారము నొదవఁజేసి బాధపెట్టు వైద్యుఁడు కారుణికుడే యనియు కఠినుడు కాదనియు భావింపఁబడుచున్నయది. పరమేశ్వరునకు జీవులందరిపై దయ సమానమైన నవ్వారి నావరించియుండు మాయామలశక్తులు విచిత్రస్వభావము గలవై వ్రణముల పాకమువలె పరిపాకముఁజెందుటకు నొకానొకకాలము నియతముగా లేమింజేసి యందరికి నొకేమారు ముక్తి కలుగకుండుట పొసగుచున్నయది.

సూత్రములోని "సాపేక్షత్వాత్" అను పదమునకు మలపాకమును అధవా

పాకమునకుపకరించుటకు పరమేశ్వరునితో చేయించఁబడు కర్మలను సృష్ట్యాది వ్యాపార మపేక్షించుటవలన యని యర్థము.

పరార్థమనఁగా? పరులనఁగా స్వఅపృథక్‌సిద్ధ స్వభిన్నజీవులు. అవ్వారి ననుగ్రహించుటకు అని తెలియవలెను.

## సర్వ ధర్మోపపత్త్యధికరణము

సూ. "సర్వధర్మోప పత్తేశ్చ" 2-1-35

అనేకముగా వక్కాణించుట యెందులకు? ప్రధానమునకు పరమాణువులకు కర్మకు కాలాదులకున్ను సంభవింపనట్టి ధర్మములు (స్వతంత్రముగా జగత్కారణమగుట మున్నగునవి) యన్నియు బ్రహ్మమునందు నుపపన్నములగుచున్నవి. కావున బ్రహ్మమే సర్వాతీతము జగత్సృష్ట్యాదికారణంబు నగు ననుట సమంజసం బగుచున్నయది.

ఇయ్యది
శ్రీ నీలకంఠ శివాచార్య విరచితమైన
బ్రహ్మ మీమాంసా భాష్యమునందు
రెండవ యధ్యాయముఁదగు మొదటి పాదము
శ్రీ కంఠమణి ప్రభామయూఖమను ఆంధ్రానువాదముతో ముగిసినది

---

## ప్రకటన

శ్రీ నీలకంఠీయ భగవద్గీతా భాష్యము తెలుగు ననువదింపఁబడుచున్నది. గ్రాహకులు- ముద్రణకై సహకరించుటకు త్వరపడగలరని కోరుచున్నాను.

నిర్మల శంకరశాస్త్రి

శ్రీమహాగణాధిపతయే నమః

శ్రీ నీలకంఠ భగవత్పాదకృత

# శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

## ద్వితీయాధ్యాయము

## ద్వితీయమపాదము

### ఆంధ్రీకరణము

సూ. "రచనానుపపత్తేశ్చ నానుమానం ప్రవృత్తేశ్చ" 2-2-1

ద్వితీయాధ్యాయమునందు ప్రథమపాదములో సాంఖ్యాది మతములవారు కేవల తర్కము నూతగా గొని చూపెట్టిన దోషములను నిరాకరించి జగదభిన్నో పాదాననిమిత్తమగు పరశివునియందు వేదాంతముల సమన్వయము నిరూపింపఁ బడినది.

మరల నీ పాదమున సాంఖ్యాదిపరపక్షములు తర్కాధారముగా నిరాక రింపఁబడుచున్నవి.

మొదట సాంఖ్యులు వక్కాణించు ప్రధానకారణవాదము యుక్తమా కాదా యని సందేహము.

పూర్వపక్ష సిద్ధాంతములయందు చూపఁబడు యుక్తిజాతముఁదగు బలా బలములను నిర్ణయించుతఱి కలుగు నభిప్రాయము సందేహబీజ మనఁబఱగును-

ప్రశ్న : ప్రధాన కారణవాదమే యుక్తమని తోచెడిని. ప్రధానమనఁగా మా మతమున రజఃసత్త్వతమోరూపమైనది. అట్టి ప్రకృతియే జగత్కార ణము కాదగును. సత్త్వరజస్తమోగుణముల కార్యములగు సుఖదుఃఖమోహములఁ దగు సంబంధము జీవులందరియందు గానఁబడుట సుప్రసిద్ధమే గదా! వస్త్ర

ములు మున్నగునవి లోకమున లభించినచో అచ్ఛాదనాద్యుపయోగముతో సుఖ మయము లగుచున్నవి. అయ్యవియే ఇతరులచే నపహరింపఁబడినచో దుఃఖజనకము లగుచున్నవి. ఒకప్పుడు నవ్వాని యవసరము లేనందున నుపేక్షింపఁబడుచు మోహాత్మకములగుచున్నవి. కావున నివ్విధము సుఖాదుల సంబంధముచే త్రిగు ణాత్మకమైన ప్రధానమే జగత్కారణమని చెప్పుట సంగతంబగును గదా?

ఉత్తరము : మీ యభిమతమైన ప్రధానము జగత్కారణము కాజాలదు. సుఖాదుల సంబంధముచే త్రిగుణాత్మకమైన ప్రధానము జగత్కారణ మగునని చెప్పుట సరి కాదు. సుఖము మున్నగునవి మానసికములగుటను వస్త్రాదులు బాహ్య ములగుటఁజేసియు నవ్వానికి పరస్పరము వైలక్షణ్యము కలదు. కావున ప్రధాన కారణవాదము సమంజసంబైనది కాదు.

మరియొక ఆశంకకు సమాధానమీ దిగువ సూత్రము.

సూ. "పయోంబువచ్చే త్తత్రాపి" 2-2-2

ఉదకము వానరాయిగాను క్షీరము పెరుగుగాను అధిష్ఠాతలేనిదియే పరిణ మించునట్లు ప్రధానంబు ప్రపంచముగా పరిణమించుననుట కూడదు. ఇఁట జలము గాని పాలు గాని చేతనుని యోజకత్వముతో కరక దధి భావమును పొందునవగుటచే నచేతనమగు ప్రధానము స్వతంత్రముగా ప్రపంచరూపమును పొందజాలదని సారాంశము.

మరియు

సూ. "వ్యతిరేకానవస్థితే శ్చానపేక్షత్వాత్" 2-2-3

ప్రాజ్ఞునిచే నధిష్ఠింపఁబడకున్నను అచేతనమగు ప్రధానము జగముగా పరిణ మించు నందురేని యెల్లకాలము సృష్టియే ఉండవలసి వచ్చును గావున సృష్టికి వ్యతిరేకమగు ప్రళయము ఎప్పుడును సంభవింపఁజాలదు అందువలన నచేతన మగు ప్రధానము జగత్కారణము కాకుండును.

సూ. "అన్యత్రాభావాచ్చ న, తృణాదివత్" 2-2.4

పాలుగా పరిణమించుటకు నుపయోగించు గడ్డి మున్నగువానివలె నచేతన మగు ప్రధానంబు జగత్కారణ మగునని వక్కాణింపఁగూడదు. తృణాదులను

వృషభాదులు అనుభవింపకుండునెడ తదితరులెవరు నుపయోగింపకుండునెడను తృణాదులు క్షీరముగా పరిణమింపఁజాలవు గదా ! అందువలన నచేతనము లన్నియు ప్రాజ్ఞాధిష్ఠితంబు లేను,

సూ. "పురుషాశ్మవదితిచే త్తథాపి" 2-2-5

అచేతనమగు ప్రధానము కుంటివాడు గ్రుడ్డివానిని వలెను, సూదంటురాయి ఇనుమును వలెను పురుషుని చెంత నుండియే ప్రవర్తింపఁజేయును. కావున ప్రాజ్ఞుని యవసరము లేదనుట సరి కాదు. అట్లైనను ప్రధానము స్వతంత్రముగా ప్రవర్తింపఁ జాలదు. సాంఖ్యమతమున పురుషుడు నిర్వికారుడని యంగీకరింపఁబడినందున నిర్వికారుడైన పురుషునికి ప్రధానము చేరువయైన నాతండెట్టి ప్రవర్తనముఁ జెందు వాడు కాడు. కుంటివాడు గ్రుడ్డివానికి మార్గము నుపదేశించుటకై సమీపప్రదేశ ములో నుండుట మొదలగు వికారము ఏర్పడుచునే యున్నది. కావున నిర్వికారుఁ డైన పురుషుని సన్నిధానము- ప్రధానము జగద్రూపముగా వరిణమించుటకు నిదా నము కాజాలదని విశదమైనది.

సూ. "అంగిత్వానుపపత్తేశ్చ" 2-2-6

సత్త్వరజస్తమోగుణములలో నొకటి ముఖ్యముగాను మరి రెండు నంగ ములుగా నంగాంగీభావముఁ జెందునపుడు సృష్టియగునని సాంఖ్యులు చెప్పుదురు. ఇట్టి త్రిగుణముల వైషమ్యము ప్రళయకాలమున నుండజాలదనియు వారే వక్కా ణించిరి. అట్టితటి మూడుగుణములలో గల పరస్పర అంగాంగీభావము పొసగఁ జాలదు. ప్రళయకాలమున లేని వైషమ్యము సృష్టికాలమున నెట్లు సంభవించును? ఇందువలనను జగదారంభము ప్రధానకారణవాదమునందు సమకూరుట లేదు.

సూ. "అన్యథాఽనుమితౌ చ జ్ఞశక్తి వియోగాత్" 2-2-7

పూర్వోక్తమునకంటె మరియొకరీతిగా - అనాదికాలమునుండి ప్రవర్తించు సృష్టి పళయముల ప్రవాహము మూలముగా గల సంస్కారము ద్వివిధమై యను వర్తించు సద్భావమున ఆయా సంస్కారములు ఉద్బుద్ధములగునపుడు వరుసగా సామ్యము వైషమ్యమున్ను సంభవించుటఁజేసి సామ్యవైషమ్యోభయస్వభావమైన ప్రధానము ఊహింపఁబడును - అని భావించునెడ నట్టి ప్రధానమునకు జ్ఞానశక్తి లేనందున జగమును సృజించుట పొసగఁజాలదు.

సూ. "అభ్యుపగమేప్యర్థాభావాత్" 2-2-8

ప్రధానమే జగత్కారణమగుటలో ప్రయోజనముండునెడ ఎట్లో నంగీకరింప నగును. ప్రయోజనంబు నిసుమంతయు గానరాదు. ఎందుకనఁగా ? సాంఖ్యమత మున పురుషుఁడు వికారములేనివాడగుటచే ప్రధానముఁజూచుట మొదలగు వికార ములు సంభవింపనందున ప్రకృతిధర్మములను తనయందారోపించుకొనుటయను అధ్యాస వలన నైన భోగము, ప్రకృతితో విడిబడి నిజరూపానుసంధానమున సంభ వించు కైవల్యంబు నసంగతములగునవి. ఇట్లు ప్రయోజనంబు లేమింజేసి జగ త్కారణముగా ప్రధానము స్వీకార్యంబు కాజాలదు.

సూ. "విప్రతిషేధా చ్చాసమంజసమ్" 2-2-9

పురుషుఁడు నిర్వికారుఁడనియు ద్రష్టృత్వ భోక్తృత్వాది వికారములు గల వాడనియు పరస్పర విరుద్ధధర్మములు వేలకొలది చెప్పఁబడుచున్నందునను కపిల ప్రోక్తమైన సాంఖ్యమతము సమంజసము కాజాలదని సిద్ధాంతము.

## వైశేషికాధికరణము

ఇట్లు ప్రధానకారణవాదము ప్రమాణము కాదని నిరూపించితిమి. ఇక మీద పరమాణు కారణవాదమును నిరాకరింప నీ యధికరణము ప్రారంభింపఁబడు చున్నయది.

సూ. "మహద్దీర్ఘవద్వా హ్రస్వ పరిమండలాభ్యామ్" 2-2-10

ఇఁట వైశేషికులు నిరూపించు పరమాణుకారణవాదము సమంజసమైనదా కాదా యని సందేహము.

ప్రశ్న : సాంఖ్యుల ప్రధానకారణవాదమునందు నధిష్ఠాతయగు పరమేశ్వ రుని యంగీకరింపనందున నయ్యది వేదవిరుద్ధమగుటచే నిరసింపఁబడినను వైశే షికులు వక్కాణించు పరమాణు కారణవాదము విహితంబైనదేను, ఎట్లనఁగా ? జగము ప్రళయముఁజెందినపుడు పరమేశ్వరుఁడు సృష్టిఁజేయఁదలచినవాడై ప్రాణులీవరకు చేసిన కర్మల ననుసరించి నిశ్చలములైన పరమాణువుల యందు ఒకానొక కదలికను పుట్టించును. అట్టి సంచలనమువలన నొక పరమాణువు మరి

యొక పరమాణువుతో కూడును. అట్టి సంయోగమువలన ద్వ్యణుకము ఏర్ప డును. అట్టి ద్వ్యణుకములు మూడిటి కలయికచే త్ర్యణుకము మున్నగు క్రమ ముతో జగమంతయు నావిర్భవించును.

ఇందువలన పరమాణుకారణవాదమునందు విరోధమెద్దియు గానరాదు కదా !

ఉత్తరము : కణాదమతమునందు మహత్త్వము దీర్ఘత్వము అనువానితో కూడిన త్ర్యణుకము, హ్రస్వమునుండియు అణుత్వము; హ్రస్వత్వము అనువానితో కూడిన ద్వ్యణుకంబును పరిమండలమునుండియు జనించునని చెప్పఁబడును. (హ్రస్వమనఁగా ద్వ్యణుకము, పరిమండలమనఁగా పరమాణువు అణువున్నూ:) ఇది యెట్లు పొసగును ? ఎందుకనఁగా ? పరమాణువులు పారిమాండల్యముఁదగు కొలత గలవనియు అణుపరిమాణయుక్తములు కాజాలవనియు, అణుపరిమాణము లేనట్టి రెండు పరమాణువులవలన అణుపరిమాణముతో కూడిన ద్వ్యణుకము జనించు ననియ హ్రస్వపరిమాణమునుండి దీర్ఘపరిమాణము లేని ద్వ్యణుకమావిర్భవించు ననియు అట్టి ద్వ్యణుకములు మూడిటివలన దీర్ఘపరిమాణముతో కూడిన అణుపరి మాణము లేనట్టి త్ర్యణుకము నుద్భవించుననియు వైశేషికులు చెప్పుదురు. ఇది యంతయు నసమంజంబేను; కారణగుణములు కార్యములయందు సంక్రమించునని వారు చెప్పు ప్రక్రియ యిట విరోధించుచున్నయది. అవయవములైతేనో తమకు గల ఆరు పార్శ్వములతో కూడినవై మిక్కిలి గొప్పదైన నవయవి నేర్పరచునవి గదా !

పరమాణువులు పార్శ్వములు లేనివని వైశేషికులు చెప్పుచున్నందున నయ్యవి ఒకానొక గొప్పదైన ద్రవ్యము నారంభింపఁజాలవు. కావున పరమాణు కారణవాదము విహితమైనది కాజాలదు.

మరియు నొక యనుపపత్తిఁజెప్పుచున్నవారు.

సూ. ఉభయథాఽపి న కర్మాత స్తదభావః' 2-2-11

ప్రళయకాలమునందు పరమాణువులు నిశ్చలములై యుండును. సర్గాది యందు ప్రాణికర్మ ననుసరించి పరమాణువులయందు సంచలన మనదగు మొదటికర్మ యుదయించును. కావున పరమాణువుల సంయోగ మగుసరికి ద్వ్యణు

కము మున్నగు వరుసతో జగదుత్పత్తి యగునని వైశేషికులు చెప్పుదురు. పరమాణువులయందు సంచలనము ప్రాణుల యదృష్టముల ననుసరించి కలుగునని గూడ వారంగీకరించిరి. అట్టి యదృష్టము అణుగతమైనదా? జీవగతమైనదా? రెండు విధములని చెప్పినను జీవులకుగాని పరమాణువులకు గాని యెప్పుడో నొకప్పుడు సంభవించునది కానందున నెల్లకాలము (అదృష్టము) నుత్పాదకంబు కావలసివచ్చును. ప్రాణికర్మలు నొకేతడవ నొకేరూపమును పొందు వికాసంబును పొసగఁజాలదు. అణుగతమైన ఆద్యకర్మ లేనిచో తత్సంయోగము కాకుండును. జీవగతములగు నదృష్టములు కర్మ విపాకము నపేక్షింపకుండునెడ తత్పూర్వంబు నణుగతమైన కర్మోత్పత్తి కావలసివచ్చును.

విపాకము నపేక్షించునెడ జీవాదృష్టములవలన నేర్పడు ఒకానొక సమయమందలి యణుగతమైన కర్మ సంభవింపదు. అనఁగా విపాకము జీవులందరికి నొకేకాలమునందు ఏకరూపముగా సంభవింపనిదగుటఁజేసి ప్రళయానంతరము సృష్టి (జీవుల కర్మలఁదగు విపాకము ననుసరించి యేర్పడునది) నియమిత కాలమునందు కాకుండునని భావము.

విపాకమనఁగా - అదృష్టగతమైన ఒకానొక నిర్ణీతధర్మము కాజాలదు. కాని కర్మవిధితో కాలవిశేషమునందు నియతమైన ఫలము నిచ్చునదియగును. కాలవిశేషము నియతముగా లేనట్టి కర్మలకు ప్రబలములైన కర్మాంతరముల ప్రతిబంధముండుటయు విపాకమనంబడును. అదృష్టము లైతేనో ఆయా కర్మల కనుగుణములైన ఫలములనిచ్చు స్వభావము గలవి. కావున ననంతులైన జీవులు అనేకవిధ సమయములయందు ఫలముల నిచ్చునవిగా నాచరించు కర్మలకు నొక్కేమారు నొకేవిధమైన విపాకము సంభవింపనట్టిది. ఇందువలనను పరమాణు కారణ వాదము యుక్తమైనది కాజాలదు.

ఇదియు మరియొక అనుపపత్తి యని చెప్పుచున్నవారు.

సూ. "సమవాయాభ్యుపగమాచ్చ సామ్యా దనవస్థితేః"

2-2-12

ద్వ్యణుకము మున్నగు కార్యములకు పరమాణువు మూలకారణమనియు, కార్యకారణములకు గల సంబంధము సమవాయమనియు సమవాయ

సంబంధమనఁగా ? విడిగా లేనివానికి ఆధారాధేయ భావమును కల్పించు నిత్య సంబంధమనియు వైశేషికులు చెప్పుచున్నవారు. ఇట్టి సమవాయము నంగీకరించు తఱి సమవాయము సమవాయితో నపృథక్సిద్ధమై యుండుటకు గల యుపపత్తిని నిర్వహించుటకు మఱియొక సంబంధమును చెప్పవలసియుండును కావున ననవస్థాదోషము ఘటించుచున్నయది ఇందువలన పరమాణుకారణవాదము సమంజసము కానిదని విశదమైనది.

సూ. "నిత్యమేవ చ భావాత్" 2-2-13

సమవాయము నిత్యమని కాణాదులంగీకరించుటవలన సంబంధము గల వస్తువు నిత్యము కానిది సమవాయ సంబంధము నిత్యము కాజాలదు కావున అవయవము అవయవియు నిత్యములు కావలసివచ్చుటచేతను కార్యములగు త్ర్యణుకాదులు నశించినచో తద్గతమైన సమవాయము నశింపవలసివచ్చుటవలనను సమవాయము నిత్యమని యంగీకరించువారు త్ర్యణుకాదులును నిత్యములని యంగీకరింపవలసివచ్చును కావున నీ మతము సమంజసము కాజాలదని తెలియనగును.

సూ. "రూపాదిమత్త్వాచ్చ విపర్యయో దర్శనాత్" 2-2-14

పరమాణువులు రూపాదులు గలవని వైశేషికులు చెప్పుచున్నందున నయ్యవి నిత్యములు కాజాలవు. లోకమున ఘటాదులు రూపాది సంబంధముగలిగి యుండునవి యగుటచే నవ్వానికి నిత్యత్వము భంగపడుటను చూచుచున్నాము. ఇందువలనను కాణాదము సమంజసము కాజాలదు.

సూ. "ఉభయథా చ దోషాత్" 2-2-15

పరమాణువులకు అనిత్యత్వమును తొలగించుటకై రూపాదులు లేవని చెప్పునెడ "కారణగుణములు కార్యమునందు సంక్రమించు"నను న్యాయము ననుసరించి ద్వ్యణుకాదులు రూపాదిరహితములని తేటపడును. అట్టితఱి జగము నిరాకారము కావలసివచ్చును" కారణగుణములు కార్యమునందు సంక్రమించుటకై మరల పరమాణువులకు రూపాదుల నంగీకరించునెడ నవ్వానికి ననిత్యత్వాది అనర్థములు సంభవించును. ఇట్లు రెండు విధములయందును దోషముండుటఁ జేసి కణాద సిద్ధాంతము సమంజసమైనది కాజాలదు.

సూ. "అపరిగ్రహా చ్చాత్యంత మనపేక్షా" 2-2-16

సాంఖ్యమతము శ్రుతిన్యాయవిరుద్ధమైనను సత్కార్యవాదము మొదలగు నొకానొక యంశమున వైదికజనపరిగ్రహము కనఁబడుచున్నయది. కణాద పక్షమైతేనో ఏదేనొక అంశమునకు వైదిక పరిగ్రహము లేనిదగుటచే నిఃశ్రేయసము గోరువారందరు నివ్విషయమును ఎంతమాత్రము ఆపేక్షింపరాదనియు సాంఖ్యమతమునందు ప్రధానమునకు గల స్వాతంత్ర్యము వైదికులచే నంగీకరింపఁబడలేదనియు ప్రధానకారణముగా సద్రూపమై యుండు ఆకాశాది కార్యము సర్గాదియందభివ్యక్తమగుననుట వైదిక పరిగ్రాహ్యంబగుననియు న్యాయశాస్త్రము చతుర్దశ విద్యాస్థానాంతర్గతమైనను పరమాణు కారణ వాదమునందు మాత్రము ప్రమాణము కాజాలదనియు సర్వసమ్మతమైన సిద్ధాంతము.

## సముదాయాధికరణము

సూ. "సముదాయ ఉభయహేతుకేఽపి తదప్రాప్తిః" 2-2-17

వైదికులలో ఏకదేశీయులగు సాంఖ్యులు వైశేషికులు మున్నగు వారి మతములను నిరాకరించితిమి. ప్రస్తుతము వేదబాహ్యులైన బౌద్ధుల మతము నిరాకరింపఁబడుచున్నయది.

మొదట బౌద్ధమత సిద్ధాంతమగు సముదాయ కారణవాదము విహితమా? కాదా? అని సందేహము.

ప్రశ్న: సముదాయకారణవాదము విహితంబని తోచెడిని. సముదాయము బాహ్యమనియు అభ్యంతరమనియు రెండు విధములు గలది. బాహ్యము పృథివ్యాదికము, ఆంతరము చిత్తచైత్యాదికము, ఈ రెండు సముదాయములే జగమంతయు నగును. ఎట్లనఁగా? బాహ్యసముదాయమునకు పరమాణువులు కారణమగునవి. అట్టి పరమాణువులు-పార్థివములనియు, ఆప్యములనియు, తైజసములనియు, వాయవ్యములనియు నాలుగు విధములుగా నుండునవి.

నాలుగు విధములైన పరమాణులొకచో కూడినపుడు బాహ్యసముదాయము ఏర్పడును. ఆంతరమైన సముదాయమునకు స్కంధపంచకము కారణమగు

చున్న యది. రూపస్కంధము, వేదనా స్కంధము, విజ్ఞాన స్కంధము. సంజ్ఞా స్కంధము, సంస్కార స్కంధంబు నని పంచస్కంధములనఁబడుగుచున్నవి. చిత్తముతో నిరూపింపఁబడు శబ్దస్పర్శరూపాదులు రూపస్కంధములగును. అట్టి శబ్ద స్పర్శరూపాదులు ప్రకటింపఁబడుట విజ్ఞాన స్కంధము. శబ్దస్పర్శాదుల వలన కలుగు దుఃఖము వేదనా స్కంధము. దేవదత్తాది నామధేయము సంజ్ఞా స్కంధమనఁబడును. పై నాలుగిటిఁదగు వాసనయే సంస్కారస్కంధ మనఁబడుగును. ఇట్టి స్కంధములైదు నొకచో చేరినపుడు నభ్యంతర సముదాయము సంభవించును. కావున సముదాయకారణవాదము సందెట్టి విరోధంబును గాన వచ్చుట లేదు కదా?

ఉత్తరము సముదాయకారణవాదము యుక్తమైనది కాదు. ఎందుకనఁగా? బౌద్ధులు ప్రతివస్తువుకు క్షణికత్వముఁజెప్పువారు. అట్టి బాహ్యములకు గాని ఆంతరములకు గాని సముదాయమెట్లు సంభవించును? వీరి మతమున కారణములు క్షణికములు కావునసే అప్పుడే నశించునవగుటఁజేసి కార్యోపాదానములగుటకు సమర్థములు కాకుండును గదా!

సూ. "ఇతరేతర ప్రత్యయత్వా దుపపన్నమితి చేన్న,
సంఘాతభావానిమిత్తత్వాత్" 2-2-18

అస్థిరములయందు స్థిరములనెడు బుద్ధి యవిద్య యగును ఇట్టి అవిద్య రాగాదులున్ను పరస్పరము కారణములగుటచే సముదాయ భావము సరిపడునని చెప్పగూడదు. అవిద్య సంఘాతభావమును కలిగించునది కాజాలదు శుక్తికాదుల యందు రజతాది బుద్ధిరూపమైన అవిద్యవలన రజతాదికార్యము ఏర్పడకుండుటను లోకమున గాననగును. శుక్తికాదులయందు రజతాది జ్ఞానముగల వ్యక్తి-ఉత్తర క్షణమునందు నుండువాడు కాడు గదా! అట్టితటి అవిద్యవలన కలుగు రాగాదులు నా వ్యక్తియందు సంభవింపకుండును. ఇత్యాది సందర్భమువలన సముదాయకారణవాదము సమంజసము కాజాలదని గ్రహింపనగును.

మఱియొక సుపాయముఁజెప్పుచున్నవారు.

సూ, "ఉత్తరోత్పాదే చ పూర్వనిరోధాత్" 2-2-19

ఉత్తర ఘటక్షణోత్పత్తి యగుసరికి పూర్వ ఘటక్షణము నశించుట బౌద్ధ

మతమున ననివార్యంబగుటచేత నభావమే యుత్పాదకము కావలసివచ్చును. అట్టి తఱి యెల్లకాలము అంతటను సమస్తంబు నుదయించునని యంగీకరింపక తప్పదు. కావున సముదాయవాదము నిరసింపఁబడుచున్న యది.

సూ. "అసతి ప్రతిజ్ఞోపరోధో యౌగపద్య మన్యథా" 2-2-20

కారణదశయందు లేనిదియే కార్యదశయందు జనించునందురేని అధిపతి సహకారి మున్నగునవి జ్ఞాన కారణములగునని బౌద్ధులు చెప్పు ప్రతిజ్ఞ భంగ పడును.

బౌద్ధమతములో అధిపతియనఁగా-చక్షురాదీంద్రియము, సహకారియనఁగా చూచుట మున్నగునది. ఆలంబనమునఁగా ఘటాదికము. సమనంతర ప్రత్యయ మనఁగా - పూర్వజ్ఞానము, ఈ నాలుగు-జ్ఞానమును చిత్తసంబంధములైన సుఖా దులను కలుగఁజేయునని వ్రాయబడినది.

కారణము కార్యదశయందుండునని యంగీకరించునెడ నేకకాలమునందే పూర్వోత్తర ఘటద్వయము ఉపలబ్ధము కావలసివచ్చును అట్టితఱి బౌద్ధులు చెప్పు క్షణికత్వంబును కొట్టుబడును.

ఒకవేళ కారణము కార్యోత్పత్తి క్షణమునందుండుటను నిరాకరించి కారణ క్షణమునందే విషయమగునని చెప్పునెడ కారణ కార్యములగు సంప్రయోగ జ్ఞానాదులొకేకాలమునందుండవలసి వచ్చును.

సూ. "ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యా నిరోధాప్రాప్తి రవిచ్ఛేదాత్" 2-2-21

బౌద్ధమతములో నిరోధమనఁగా వినాశము, అట్టిది స్థూలము సూక్ష్మ మనియు రెండు విధములగునది. కఱ్ఱతో కొట్టుట మొదలగువాని తరువాత నందరిచే గుర్తింపఁబడు ఘటాదివినాశము ప్రతిసంఖ్యానిరోధమనఁబడుగును. ఇద్దియే స్థూలము. ప్రతిసంఖ్యయనఁగా విషయముఁదగు ఉనికిని నిరోధించునది, విషయ ముఁదగు లేమిని గ్రహించునదియు నగు లౌకికుల బుద్ధి యగును. ఇట్టి బుద్ధిఁ జెందిన నిరోధము ప్రతిసంఖ్యా నిరోధంబగునది. ఇద్దానికి విరుద్ధంబగు నిరోధము అప్రతిసంఖ్యా నిరోధమనఁబడుగును. సూక్ష్మంబు నిద్దియే యగుచున్నయది. ఈ

రెండు నిరోధంబులు (వినాశములు)ను సంగతములు కాకుండును. ఎందుకనఁగా ? మృత్తిక కపాలద్వయము మున్నగు నవస్థాంతరమును పొందుటయు వినాశమగు నని బౌద్ధులు వక్కాణించుచున్నందున నీ రెండు నిరోధములు నిత్యములగునని వారంగీకరించుటఁజేసియు సర్వదా సర్వత్ర సర్వకార్యోత్పత్తి కావలసివచ్చును.

సూ. "ఉభయథా చ దోషాత్" 2-2-22

ఉదయించినది తుచ్ఛ (క్షణిక) మగునెడ తుచ్ఛము నుండి యుత్పత్తి యగునెడను రెండు విధంబులయందు నభావమునుండి యుత్పత్తి యనునది పొసగదు కావున నభావరూపమైన కార్యముదయించుట యను దోషము ఏర్పడు చునే యున్నది. ఇందువలన నీ బౌద్ధదర్శనము సమంజసము కాదని విశదమైనది.

సూ. "ఆకాశే చావిశేషాత్" 2-2-23

ఆకాశమునందును తుచ్ఛత్వమును బౌద్ధులంగీకరించినందున నట్టిది పొసగఁ జాలదు. శ్యేనపక్షి మున్నగునవి పడుటకు నవకాశమును కలిగించు ఆకాశము బాధితముకాని ప్రతీతి (జ్ఞానము)కి విషయంబగుచున్నది కావున నాకాశము తుచ్ఛము కాజాలదు.

సూ. "అనుస్మృతేశ్చ" 2-2-24

అనుస్మృతి యనఁగా ప్రత్యభిజ్ఞానము. "అద్దియే నిద్ది"యను సమానాధి కరణభావముతో నతీత వర్తమాన కాల విశిష్టమగు వస్తువు నొక్కటియే యని విదితమగుచున్నయది. ఇఁట సాధనమేమనఁగా ? పూర్వానుభవజనితమైన సంస్కారము గల పురుషునకు నేర్పడు ఇంద్రియ సంయోగము ప్రత్యభిజ్ఞానమునకు సామగ్రి యగుచున్నయది.

ఇత్యాది సందర్భమున క్షణికత్వము మున్నగునవి యుపపన్నములు కాకుండుటవలన సముదాయ కారణవాదము సుసంగతము కాదనియు అసంబద్ధప్రలాపంబనియు సారాంశము.

## దృష్టత్వాధికరణము

బాహ్యవస్తువులు నిజమని వాదించువారిలో గోఘటాదులు ప్రత్యక్షములని నిరూపించువారు పూర్వాధికరణమునందు నిరాకరింపఁబడిరి. ప్రస్తుతమీ యధి కరణమున జ్ఞానానుమేయత్వ వాదులు నిరసింపఁబడుచున్న వారు.

సూ. "నాసతో దృష్టత్వాత్" 2-2-25

ఇఁట బౌద్ధులలో నొకరగువారి జ్ఞానానుమేయత్వ వాదము యుక్త మగునా కాదా ? అని సందేహము.

జ్ఞానానుమేయాత్వవాద మనఁగా ? "ఇదం నీలమ్" అను జ్ఞానము హృద యమునందు కలిగిన తరువాత నీలత్వాద్యాకారము గల వస్తువు ఊహింపఁబడును. అనఁగా ? ఒకానొక వస్తువును తదాకృతి విశేషముల పరిజ్ఞానముతో ఊహించి నిర్ణయించుట యగునని భావము.

ప్రశ్న : యుక్తమని తోచెడిని. జ్ఞాత యగువాడు - జ్ఞానమునందు తన యాకృతిని సమర్పించి నశించు వస్తువును జ్ఞానాకారముఁదగు వైచిత్రంముతో నను మానించును. కావున జ్ఞానమునందలి విచిత్రభావ (నానావిధత్వ)ముతో బాహ్య వస్తువుల విచిత్రత్వము ఊహింపఁబడుట యుక్తము కాదా ?

ఉత్తరము : ఇద్ది యుక్తము కాదు. ఎట్లనఁగా ? బౌద్ధమతమున సర్వం బును క్షణికమగుటఁజేసి నశించు నట్టి ధర్మికి మరియొక ధర్మము సంక్రమించుట యెచ్చటను గానంబడుట లేదు

సూ. "ఉదాసీనానా మపి చైవం సిద్ధిః" 2-2-26

బౌద్ధులు సర్వము క్షణికంబని యంగీకరించుటచే కర్మననుష్ఠించువాడొ కఁడు, ఫలము ననుభవించువాడు మరియొకఁడు కావలసివచ్చును. అందువలన నెట్టి పరిశ్రమఁజేయని వారికి సర్వఫలితములు సిద్ధించునవగును. కావున నీ వాదము సమర్థింప నలవి కానిదని తెలియనగును.

## ఉపలబ్ధ్యధికరణము

సూ. "నాభావ ఉపలబ్ధేః" 2-2-27

ఇట బౌద్ధులలో కేవలము విజ్ఞానమును నిరూపించు వారి వాదము సమంజసమైనదా ? కాదా ? అని సందేహము.

ప్రశ్న : సమంజసమైనది కేవల విజ్ఞానవాదము; ఎట్లనఁగా ? ఆకారముతో కూడిన విజ్ఞానమే ఆంతరమైన తత్త్వము. బాహ్యపదార్థము లేవియు యథార్థములు కాజాలవు. స్వప్నమునందు బాహ్యవస్తువులు లేకయే కేవలము బుద్ధితోడనే వ్యవహారము ఏర్పడుచున్నయది. అట్లే జాగ్రద్దశయందు జరుగు వ్యవహారమంతయు ఆంతరమైన విజ్ఞానము నాశ్రయించి యుండునదియే; కావున విజ్ఞానమే తత్త్వమగు ననుట సరిపడును కాదా ?

ఉత్తరము : కుండఁ గురుతెఱుగుదునను కర్తకు ఘటమను వస్తువు ఉపలబ్ధ (ప్రత్యక్షప్రాప్త)మగు చుండుటచే బాహ్యార్థము లేనిదని చెప్ప నలవి కాదు. జ్ఞానాకారమనఁగా? ఒకానొక వస్తువును వ్యవహరించుటకు వలయు సౌకర్యమును కలుగఁ జేయునది యగుమ.

స్వప్నదృష్టాంతముతో జాగ్రద్వ్యవహారంబును శూన్యమగు నను ఆశంకకు దిగువ సూత్రము సమాధానము.

సూ "వైధర్మ్యాచ్చ న, స్వప్నాదివత్" 2-2-28

స్వప్నములో ఇంద్రియములు నిద్రాది దోష కలుషితము లగునవి. జాగ్రత్తయందట్లు గాక నింద్రియములు కారణగత దోషములతో బాధింపఁబడకుండుట యను వైధర్మ్యమువలన స్వప్నాది జ్ఞానమువలె జాగరిత జ్ఞానము మిథ్య కాజాలదు. కావున విజ్ఞానమే తత్త్వమనియు బాహ్యములు తత్త్వములు కావనియు చెప్పుట సమంజసము కాజాలదు.

సూ. "న భావోఽనుపలబ్ధేః" 2-2-29

స్వప్నమునందు గల జ్ఞానము అర్థశూన్యమైనను ఒక విధముగా నద్దియు యథార్థమైనదియేను; ఇకముందు నీ భాష్యముననే సంధ్యధికరణమునందు స్వప్నము

నిజమైనదని నిర్ణయించువారము. అందువలన విజ్ఞానమాత్రము తత్త్వమగు నను వాదము సరియైనది కాదని సిద్ధాంతము.

## సర్వథాఽనుపపత్త్యధికరణము

సూ. "సర్వథాఽనుపపత్తేశ్చ" 2-2-30

మాధ్యమికులైన బౌద్ధులు నిరూపించు సర్వశూన్యత్వవాదము విహితమైనదా? కాదా? అని సందేహము

ప్రశ్న : యుక్తమగునని తోచెడివి. ఎట్లనఁగా? జగమంతయు మార్పు గలది యగుటచే సత్తు కాదు. ప్రత్యక్షముగా కనఁబడునదగుటఁజేసి యసత్తున్ను కాదు పరస్పరము విరోధము గల సదసత్తులున్ను కాదు. సదసత్తులు కానిదియు నసంభవమునఁజేసి కాజాలదు. కాని యిట్టి నాలుగువిధములైన రీతుల నతిక్రమించునదై సమస్తంబు శూన్యంబగునదియే; ఇట్టితఱి ప్రపంచము ప్రత్యక్షముగా భాసించుచున్నదెందుకందురేని సంవృతి (భ్రాంతి వాసనారూపము) వలన ప్రపంచము భాసించుచున్నయది. కావున శూన్యవాదము విహితమైనది గదా!

ఉత్తరము : సర్వశూన్యవాదము సంభవింపఁజాలదు. ఎందుకనఁగా? "ప్రపంచము సత్తు కాదు"అను ప్రతిజ్ఞయందు వలెనే "అసత్తు కాదు" అను ప్రతిజ్ఞయందును జగము తుచ్ఛము కాజాలదు. వస్తుతః సదసద్బుద్ధి గతములైన శబ్దములన్నియు వస్తువులఁజెందియుండు అన్యోన్యవిరుద్ధములైన భావాభావములుగా అవస్థావిశేషములఁజెప్పునవి. "జగము ప్రత్యక్షముగా భాసించుట సంవృతిమూలమైన"దనుట హాస్యాస్పదంబేను; సర్వంబు శూన్యమగునెడ సంవృతి ఎవని నాశ్రయించి యుండును? ఇత్యాది అసందర్భమునఁజేసి సర్వశూన్యత్వవాదము సమంజసము కానిదని విశదమైనది.

## ఏకస్మిన్నసంభవాధికరణము

సూ. "నైకస్మిన్నసంభవాత్" 2-2-31

బౌద్ధులను నిరాకరించి జైనమతమును పరిహరింపఁజేయుచున్నవారము.

జైనులైతేనో సప్తభంగీన్యాయముతో నొకే వస్తువునందు ననేకవిధ భావముల నుపపాదించుచున్నవారు. అట్టిది యుక్తమగునా ? కాదా ? అని సందేహము.

ప్రశ్న : దిగువ విధము జైనమతముఁదగు స్వరూపమును తెలియనగును. జీవుఁడనియు అజీవమనియు పదార్థము రెండు విధములు గలది. చేతనుఁడైన జీవుఁడు సావయవుఁడై శరీర పరిమాణము గలవాడు; అజీవము ఆరు విధము లగునది. వనపర్వతాదు లొకవిధము, ఆశ్రవము రెండవది; సంవరము మూడవది; నిర్జరము నాలుగవది; బంధము ఐదవది; మోక్షము ఆరవదియు ;

ఆశ్రవమనఁగా ? జీవుని విషయములయందు ప్రవర్తింపఁజేయు ఇంద్రియ సంఘాతమగును. వివేకమును కప్పివేయు అవివేకాదులు సంవర మనఁబడును. జీవుని కామక్రోధాదులను పూర్తిగా తొలగించు కేశోల్లుంఛన తప్త శిలారోహణాది కము నిర్జర మగునది. బంధమనఁగా? కర్మాష్టకముతో సంభవించు జన్మపరంపర యగును. పైపైన లోకముల నతిక్రమించుచుయుండు నిరవధికమగు అలోకా కాశమునందు నివసించుట మోక్షమనఁబఱగును. పాపరూపములైన ఘాతికర్మలు నాలుగున్ను, పుణ్యరూపములగు అఘాతికర్మలు నాలుగున్ను ; ఇట్టి నెనిమిది విధములైన కర్మలనుండి విడిబడిన జీవుఁడు ఎల్లకాలము పై యలోకాకాశము నందు పయనించుట మోక్ష మనఁబఱగును

జీవుడు మొదలగు సప్త పదార్థములు సప్తభంగీ న్యాయముతో నేర్పరు పఁదగినవి. సప్తభంగము లెట్లనఁగా ?

కొద్దిగా కలదు ; కొద్దిగా లేదు ; కొద్దిగా ఉన్నదియు లేనిదియు ; కొద్దిగా చెప్పరానిది ; కొద్దిగా చెప్పరానిది కలదు ; కొద్దిగా చెప్పరానిది లేదు. కొద్దిగా నవక్తవ్యము కలదు, లేదున్ను ;

ఇందువలన సప్తభంగీన్యాయమునఁజేసి సప్తపదార్థములు సిద్ధించును గదా ?

ఉత్తరము : జైనమతము సమంజసమైనదరి కాజాలదు. ఎందుకనఁగా ? ఒకే వస్తువునందు సత్త్వము (ఉనికి) అసత్త్వము (లేమి) నిత్యత్వము అనిత్య త్వము భేదము అభేదము మున్నగునవి సంభవించుట పొసగఁజాలదు. ఎందు కనఁగా ? అస్తిత్వ నాస్తిత్వాదిశబ్ద గోచరములు పరస్పర విరుద్ధములు నగు

విషయములు-పిండత్వ కపాలత్వ ఘటత్వాదులగు అవస్థలవలె క్రమభావము గలవి యగుటచే నేకకాలమునందు సంభవించునవి కావు. కావున జైనవాదము విరుద్ధంబైనదియేను;

సూ ''ఏవం చాత్మాకార్త్స్న్యమ్'' 2-2-32

గజదేహమునందు జీవుఁడు ప్రవేశించి గజదేహమంత వాడుగా నుండునని జైనులు చెప్పుదురు. అట్టితఱి గజదేహమునుండి మశకశరీరములో ప్రవేశించు జీవాత్మ - పూర్ణరూపమునకు వికలత్వము చేకూరును. దోమయొదలినుండి యేనుగు శరీరమునందు ప్రవేశించుతఱి మశకశరీర పరిమాణము గల జీవుడు మతంగ దేహములో పూర్తిగా వ్యాపింపఁజాలకుండును. ఇందువలన జీవుడు శరీరపరిమాణము మున్నగు లక్షణములు కలవాడనుట యుక్తము కాదని తెలియుచున్నయది.

ఘటము గృహము మున్నగువానియందు గల దీపమువలె జీవుఁడు సంకోచవికాసములఁజెందునను యాశంకకు సమాధానమీ దిగువసూత్రము.

సూ. ''న చ పర్యాయా దప్యవిరోధో వికారాదిభ్యః'' 2-2-33

అట్లు అల్పత్వము బృహత్త్వము అను అవస్థలుండునని యంగీకరించినను విరోధము సంభవించునదియేను ; ఘటాదులకువలె జననమరణాది వికారములు జీవునకు ననివార్యములగుచున్నందున ననిత్యత్వము చేకూరుచున్నయది.

సూ. ''అంత్యావస్థితే శ్చోభయ నిత్యత్వా దవిశేషః'' 2-2-34

చివరిదగు మోక్షదశయందలి జీవుని పరిమాణము ఏకరూపమై నిత్యమగునని జైనులు చెప్పుదురు. అట్టి పరిమాణము స్వాభావిక మగుటఁజేసి ఆత్మ, తత్పరిమాణము రెండున్ను నిత్యములు కావలసివచ్చుచున్నందున బద్ధదశయందు జీవునకు గల పరిమాణమున విశేష (భేద)మును చెప్పరాదు. అనేక శరీరములయందు జీవుఁడు ప్రవేశించునపుడు పరిమాణము మారుచుండునని చెప్పునెడ ఆత్మవైకల్యము సంభవించును. ఇందువలనను ఒకే వస్తువునందు సత్త్వాసత్త్వాదులు కలవనునసంగతమైన వాదము వలనను,

శరీర పరిమాణవాదము వలనను జైనమతంబు విరుద్ధమైనదని విశదమగు చున్నది.

## పాశుపతాధికరణము

ఈ యధికరణమునందు "పరమాత్మ అనుమానమువలన సిద్ధించును. అనుమానమువలన నేర్పడు నిమిత్తకారణత్వమే గాని యుపాదానమగుట పరమేశ్వరునకు చెల్లనేర"దను మతము నిరాకరింపఁబడుచున్నయది.

శాస్త్రయోనిత్వాధికరణమునందు పరమేశ్వరునియందు శాస్త్రమే ప్రమాణమగును కాని యనుమానము కాదని నిరూపించితిమి

ప్రకృత్యధికరణమునందును పరమేశ్వరుఁడు జగదుపాదానమగుట శాస్త్రము వలన సిద్ధించునని బాగుగా ప్రతిపాదింపఁబడినది. పరమాత్మ-అనుమాన ప్రమాణ సాధ్యుండని చెప్పు కాణాదులు గౌతమీయులున్ను తర్కాప్రతిష్ఠాన వైదిక అపరిగ్రహములను కారణములఁజేసి నిరాకరింపఁబడిరి.

వేదసమానములైన శివాగమములయందు చెప్పఁబడినట్లు సూచింపఁబడు చున్న కేవల నిమిత్తకారణవాదమును నిరాకరింప నీ యధికరణము అత్యావశ్యకమైనదని తెలియనగును.

సూ. "పత్యు రసామంజస్యాత్" 2-2-35

జగత్పతియగు పరమేశ్వరునకు జగన్నిమిత్తోపాదానోభయ కారణత్వము శ్రుతిసిద్ధమైయున్నను కేవల నిమిత్త్వమును ఆభాసమాత్రము నిరూపించు ఆగమములయందు నిష్ఠగలిగియు అట్టి ఆగమముల యభిప్రాయమును పూర్తిగా గురుతెఱుగఁజాలనివారు ఆగమములయందలి కొన్ని భాగములను మాత్రము ప్రమాణములుగ నంగీకరించువారు నగు తాంత్రికులు పరమాత్మకు కేవల నిమిత్తత్వమును వక్కాణించుచున్నవారు.

అట్టిది సమంజసమా ? కాదా ? అని సందేహము.

ప్రశ్న : లోకమున కుమ్మరి మున్నగువాడు నుపాదానము గాకయే దండము మొదలగువానిని నియమించుచు కర్త యగుచున్నవాడు. అట్లే పరమేశ్వ

రుడును తటస్థుడై జగన్నిమిత్తమగువాడు. శక్తివిశేషములు జగదుపాదాన కారణములగునని చెప్పనగును. అట్లుగాక ఘటాదులకు మన్నుమున్నగునని వలె పరమాత్మయే జగమునకుపాదానమగునని చెప్పునెడ పరబ్రహ్మమునకు జగద్గతములైన వికారాది దోషములు సంఘటిల్లుచున్నయవి. కావున పరమేశ్వరుఁడు జగన్నిత్తకారణంబేయగును కాదా ?

ఉత్తరము : జగత్పతియగు మహాదేవుఁడు కేవలము నిమిత్తంబగునని చెప్పుట-శ్రుతిన్యాయ విరోధము వలనను అసామంజస్యమువలనను విహితము కాజాలదు.

ప్రకృత్యధికరణమునందు చూపఁబడిన "యదా తమస్తన్నదివా నరాత్రిః" ఇత్యాది శ్రుతులకు కేవలనిమిత్తవాదము విరుద్ధమైనదని గ్రహింపనగును.

ఇఁక న్యాయ విరోధముఁజెప్పుచున్నవారు.

సూ. "అధిష్ఠానానుపపత్తేశ్చ" 2-2-36

శుద్ధమాయ యను నుపాదానము నధిష్ఠించుట యశరీరుడైన పరమేశ్వరునకు పొసగఁజాలదు. లోకమున కులాలుడు మున్నగువారు సశరీరులయ్యే మృత్పిండము మొదలగు నుపాదానముల నధిష్ఠించుటను గాంచుచున్నారము. కావున కులాలాదిదృష్టాంతము అనుకూలించునది కాదు. పరమేశ్వరుఁడు మాయాధిష్ఠాత కాదని చెప్పునెడ నీశ్వరుని యంగీకరింపకుండుటచే అగమైక దేశియులగు వారి కేవల నిమిత్తవాదముకన్న పూర్వోక్త సాంఖ్యమతమే యుక్తమని తోచెదిని కేవల నిమిత్తవాదమున పరమేశ్వరుఁడధిష్ఠాత కాదనుటలో నీశ్వరునితో ప్రయోజన మిసుమంతయు గానరాదు.

అందువలన పరమేశ్వరుఁడు నిమిత్తము గూడ కాజాలడు.

సూ. "కరణవచ్చేన్న భోగాదిభ్యః" 2-2-37

"మాయ నధిష్ఠించుటకై పరమేశ్వరునకు శరీరముతో నవసరము లేదు. ఎట్లనఁగా ? కరణములగు ఇంద్రియమును శరీరమును శరీరములేని జీవుఁడు నధిష్ఠించునట్లు పరమేశ్వరుఁడు ప్రధానము నధిష్ఠించు"నని చెప్పుట సరికాదు. అట్లైనచో ప్రధానగతములైన అనర్థముల ననుభవించుట మొదలగు దోషములు

పరమేశ్వరునకు చేకూరుచున్నయవి. శరీరములేని జీవాత్మ-శరీరము నధిష్ఠించు నెడ శరీరగతములైన సుఖదుఃఖముల ననుభవించునట్లు పరమేశ్వరుఁడును మాయ నధిష్ఠించునెడల మాయాగతములైన భోగములఁజెందువాడగును కావున నీశ్వరుడు జగన్నిమిత్తమగునని చెప్పరాదు.

సూ. "అంతవత్త్వ మసర్వజ్ఞతా వా" 2-2-38

వా శబ్దము సముచ్చయార్థముఁజెప్పును. "పరమేశ్వరుఁడు సశరీరుడయ్యే కుమ్మరివాడు మృత్పిండమును వలె మాయోపాదానమును వేరుగా నుండి యధిష్ఠించు"నని యంగీకరించునెడ జగత్పతియగు శివునకు సంసారియైన జీవునకు వలె అంతవత్త్వము అసర్వజ్ఞత్వమున్ను సంభవించును కావున భోగాదిప్రసక్తి కారణముగా ప్రధానము నీశ్వరుఁడధిష్ఠించుట పొసగఁజాలదు. "పరమశివుఁడు ప్రధానము నధిష్ఠించినను "అనశ్నన్నన్యో అభిచాకశీతి" అను శ్రుతి ననుసరించి మాయాగత భోగాది ప్రసక్తికి-ఎంతమాత్ర మవకాశము లేనివాడగు"నని చెప్పగూడదు.

అట్లగునెడ తర్కబలమును విడనాడి శ్రుతియే ఆశ్రయింపఁదగినదియగును. అట్టితఱి "తదాత్మానం స్వయమకురుత, బహు స్యాం ప్రజాయేయ" "సర్వో వై రుద్రః" ఇత్యాది శ్రుతి ప్రామాణ్యమున పరమేశ్వరుఁడే జగదుపాదాన మగునని యంగీకరింపవలసివచ్చును.

ఇట్లు పరమాత్మ - జగదుపాదాన నిమిత్తకారణమైనను "నిష్కళం నిష్క్రియం" ఇత్యాదిశ్రుతులవలన ఎట్టి వికారములు లేనివాడని విదితమగుచున్నయది.

ఐతే నీ యధికరణమునందు నిరాకరింపఁబడిన కేవల నిమిత్తత్వవాదము శివాగమమూలమైనది కాదనియు శివాగమాభిప్రాయమును బాగుగా తెలియని వ్యాఖ్యాతల పరంపరయే మూలముగా కలదనియు విశదీకరించుటకు శివుఁడు జగదుపాదాన మగునని గ్రహించుటకున్ను సర్వజ్ఞానోత్తర మనఁబడు శివాగమము మూలముగా గలిగినట్టి వాయుసంహితా వచనజాతము నుదాహరించుచున్నవారు.

శ్లో॥ శక్తిః ప్రథమ సంభూతా-శాంత్యతీత పదోత్తరా।
తతో మాయా తతోఽవ్యక్తం-శివాచ్ఛక్తిమతః ప్రభోః॥
శాంత్యతీత పదం జజ్ఞే-తతః శాంతిపదం క్రమాత్॥

ఇత్యాది ప్రమాణములవలన మాయాది ప్రపంచమునకు శక్తివిశిష్టుడైన శివుఁడే యుపాదాన మగునని బోధపడుచున్నయది.

("అంతవంత ఇమే దేహాః" అను స్మృతిఁబట్టి యిట కరచరణాది విశిష్ట శరీరము నిత్యము కాదనియు జననమరణావృత్తిగలవారు సర్వజ్ఞులు కాజాల కుండుటయు గమనార్హములగుచున్నవి.) సూక్ష్మ చిద్రూపమును పొందిన చిచ్ఛక్తితో కూడియుండువాడు సకల తత్త్వముల నతిక్రమించువాడు నగు శివుఁడొక్కడే సృష్ట్యాది కాలమునందు వర్తించువాడు. శాంత్యతీత పదమున కతీతయగు పరాశక్తి-సృష్టిఁ జేయ సంకల్పించిన శివునినుండి మొదట యావిర్భవించినది. ఇదియే శివ తత్త్వమనియు పరబిందువనియు పరమాయ యనియు శుద్ధమాయ యనియు మహామాయ యనియు కుటిల యనియు కుండలినియనియు ప్రసిద్ధమై శుద్ధాధ్వఁ జెందిన సకలతను భువనముల యందలి భోగోపకరణములకు నుపాదానంబు నగునట్టిది. పరాశక్తివలన శక్తియు సదాశివుఁడును మహేశ్వరుఁడును శుద్ధవిద్యయు అను నాలుగు తత్త్వములు నుదయించినవి. అటుపిమ్మట మిశ్రాధ్వఁజెందిన సకల తను భువనాదులకు నుపాదానమగు నపరమాయ జన్మించి నది. ఆ తరువాత కాలము, నియతి, కళ, విద్య, రాగము, పురుషుఁడు నను ఆరు తత్త్వములావిర్భవించినవి. అశుద్ధాధ్వఁజెందిన తనుభువనాదులకునుపాదానమగు నవ్యక్తము తదనంతరము ఏర్పడినది. ఆ యవ్యక్తమునుండి బుద్ధి, యహం కారము, మనస్సు పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, శబ్దాది విషయపంచకము, ఆకాశాది పంచతన్మాత్రలు నను ఇరువదిమూడు తత్త్వము లావిర్భవించినవి. ఇట్లు పరాశక్తి మొదలుకొని పృథివి వరకు గల ముప్పది యారు తత్త్వములు శివశాస్త్రముల యందు ప్రసిద్ధములగుచున్నవి.

ఐతే పరాశక్తి గాక నితరములగు తత్త్వములకు ఆయా తత్త్వముల ప్రతిష్ఠఁజెందిన భువనములకు-నివృత్తి, ప్రతిష్ఠ, విద్య, శాంతి శాంత్యతీతము అను సంజ్ఞలతో ప్రసిద్ధములగు పంచకళ (పదము)లు పైపైన నుండునవియై పరాశక్తివలన నావిర్భవించినవియునై-ఆధారములగుచున్నవి.

అందు శతకోటి యోజన విస్తీర్ణమగు పృథివీతత్త్వము నివృత్తి కళ యందును, జలము మొదలుకొని యవ్యక్తమువరకు గల యిరువదిమూడు తత్త్వ

ములు ప్రతిష్ఠాకళయందును, పురుషుఁడు మొదలుకొని యపరమాయ వరకు గల సప్తతత్త్వములు విద్యాకళయందును, శుద్ధవిద్య మహేశ్వరుఁడును శాంతికళ యందును శక్తి-సదాశివులు శాంత్యతీత కళయందును నెలకొనియుండువారు. పరాశక్తి యైతేనో ఇట్టి యైదుకళలను తత్కారణముగా వ్యాపించి యైదుకళలకు పైపైన నుండునదగుటఁజేసి శాంత్యతీతపదోత్తర యనఁబడుచున్నయది.

ఈ శ్లోకమున గల శక్తిపదము—శివతత్త్వమనఁదగు పరాశక్తిఁజెప్పనది. ఇట్టి పరాశక్తియే తత్కార్యమగు శక్త్యాది తత్త్వచతుష్టయమునకు నుపలక్షక మగుచున్నయది. మరియు మాయాపదము కాల నియతి కళా విద్యా రాగ పురుష లకు నుపలక్షక మగునది. అవ్యక్తపదము బుద్ధ్యహంకారమనః ప్రభృతిక త్రయో వింశతి తత్త్వములకు నుపలక్షక మగునది. మరియు నదే వాయు సంహితయందు.

శ్లో॥ శక్త్యాది చ పృథివ్యంతం-శివతత్త్వ సముద్భవమ్।
తేనైకేన తు తద్వ్యాప్తం-మృదా కుంభాదికం యథా॥

"శక్తి మొదలుకొని పృథివివరకు గల ప్రపంచము శివతత్త్వము నుండి యావిర్భవించునది కావున శివుడొకనిచేతనే సమస్త విశ్వము-మృత్తికతో ఘటా దులవలె-వ్యాపింపఁబడినది."

ఇఁట శక్తియనగా శివతత్త్వరూపయగు పరాశక్తి యగును. శివతత్త్వ మనఁగా శివుఁడగును. పురోక్తమువలె శివతత్త్వ శబ్దమునకు పరాశక్తియను నర్థము నీ శ్లోకమున సంగతము కాజాలదు.

మరియొక ప్రహణము నీ నందర్భమున గాననగును.

శ్లో॥ శివతత్త్వాది భూమ్యంతం-శరీరాది ఘటాది చ।
వ్యాప్యాధిష్ఠతి శివ- స్తస్మా ద్విష్ణు రుదాహృతః॥

"శివతత్త్వము మొదలుకొని భూమివరకును గల శరీరాదులను ఘటాదుల నున్ను వ్యాపించి యవ్వాని నధిష్ఠించి యుండువాడగుటఁజేసి శివుఁడు విష్ణువని యుదాహరింపఁబడును."

ఇఁట శివతత్త్వము వ్యాప్యకోటిలో చేరినందునను వ్యాపకుఁడు శివుఁడగుట

వలనను పై శ్లోకముతో నేకార్థము కలిగియుండుటకై శివతత్త్వ శబ్దమునకు పరాశక్తియను నర్థము సమంజసమైనది.

వాయు సంహితయందు శివతత్త్వ శబ్దము శివునియందుగూడ ప్రయోగింపఁబడినట్లు దిగువ శ్లోకము వలన తెలియనగును.

శ్లో॥ ఆదిమధ్యాంతరహితం-భేషజం భవరోగిణామ్।
శివతత్త్వమితి ఖ్యాతం—శివార్థం జగతః స్థితమ్॥
పంచోపచారవద్భక్త్యా-పూజయే ల్లింగమూర్ధని॥

"సంసారమను మహారోగముతో బాధపడువారికి మహౌషధము వంటిదియు ఆదిమధ్యాంత రహితంబు జగత్కల్యాణార్థమైనదియునని వేదలోకముల యందు ప్రసిద్ధిఁజెందినదియు నగు శివతత్త్వమును శివలింగ శిరస్సునందు పంచోపచారములతో భక్తిగలవారై పూజింపవలెను."

ఇట్లు శక్త్యాది ప్రపంచమునకు శివుఁడు ఉపాదానమగుననియు మృద్ఘటాది న్యాయముతో సర్వవ్యాపకుఁడగునియు వాయు సంహితాది ప్రమాణములు చాటుచున్నవి.

మఱియు

శ్లో॥ చిదాత్మైవ హి దేవోఽంతః-స్థిత మిచ్ఛావశా ద్బహిః॥
యోగీవ నిరుపాదాన-మర్థజాతం ప్రకాశయేత్॥

"చిద్రూపుడైన శివుఁడే తనలో సూక్ష్మముగా నుండు ప్రపంచమును-యోగిపురుషుఁడు ఎట్టి యుపకరణము లేకయే నానా వస్తువులను వలె-ప్రకాశింపఁజేయును."

ఇత్యాది శివాగమ ప్రామాణ్యమున పరమేశ్వరుఁడు జగన్నిమిత్తోపాదానోభయకారణమగుట విహితమైనను "శివాగమైకదేశమునందు పరబ్రహ్మంబగు శివునకు కేవల నిమిత్తత్వము ప్రతిపాదింపఁబడినందున నద్దానిని పరిహరించుటకు నీ యధికరణముపయుక్తం"బగునని పూర్వాచార్యులు వ్యాఖ్యానించిరి.

మేమైతేనో వేదములకు శివాగమములకును భేదమును పాటించువారము

కాము. వేదమునందును శివాగమమను వ్యవహార ముపయుక్తమగునది. వేదము శివాగమంబును శివకర్తృకములగునవి. ఇందువలన శివాగమము-త్రైవర్ణికవిషయ మనియు సర్వవిషయక మనియు రెండు విధములగుచున్నయది. వేదము బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులన(బడు త్రైవర్ణికుల నుద్దేశించినదనియు శివాగమము బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులన(బడు చాతుర్వర్ణ్యమును గురించినదనియు తెలియునది. రెంటికిని శివు(డొక(డే కర్తయగువాడు.

## శివాగమప్రామాణ్యము

ప్రశ్న : "అంగాని వేదా శ్చత్వారో-మీమాంసా న్యాయవిస్తరః,
పురాణం ధర్మశాస్త్రంచ-విద్యా హ్యేతా శ్చతుర్దశ''

"ఆరు వేదాంగములు, వేధములు నాలుగు, మీమాంస, న్యాయ శాస్త్రము, పురాణము, ధర్మశాస్త్రంబు"నను పదునాలుగు విద్యలయందు చేరనందున శివాగమములు ప్రమాణములన(జెల్లునా?

ఉత్తరము : "అంగాని" ఇత్యాదివచనమునందు ధర్మమును ప్రతిపాదించు ధర్మశాస్త్రము ఎట్టిదియను ఆకాంక్ష కలుగగా వేదములు ఆగమములు కల్పములు పురాణములును ధర్మప్రతిపాదకములగుటచే ధర్మశాస్త్రపదము ధర్మప్రతిపాదకములన్నిటికిని వాచకమగునది. ఒకవేళ వేదములు కల్పములు పదునాలుగు విద్యలలో పరిగణింప(బడినందున ధర్మశాస్త్రపదముతో చెప్ప(బడకున్నను ఆగమములు స్మృతులును వాచ్యంబులగుచున్నను ముఖ్యముగా ధర్మశాస్త్రపదము శివాగమములనే బోధించునట్టిది. చ శబ్దముతో స్మృతులు పరిగ్రహింప(బడుచున్నయవి. ఇవ్విషయము శివధర్మమను గ్రంథమునందు దిగువవిధము పక్కాణింప(బడినది.

శ్లో॥ స యోనిః సర్వవిద్యానాం-పురుషః కారణం పరః,
నిశ్వాసతుల్యా ముద్భూతా-నఖిలా న్నిగమా నపి॥

సావశేషాన్ క్రియాభాగై-రవేద్యాన్ పశుచేతసః,
విచింత్య ధర్మశాస్త్రం త-చ్ఛైవ మాఖ్యాతవాం స్తదా॥

అనంత వేద సందిష్ట-సర్వార్థస్యోపబృంహణమ్,
కామికాది ప్రభేదేన-భిన్న మేకార్థశోభితమ్॥

తత్తత్కాలావతీర్ణై స్తు-మునిభిః శంసితవ్రతైః,
శాస్త్రం తదనుసృత్యైవ-కథ్యతే ధర్మసంగ్రహః॥

ఆదితః శైవమేవాహు-రార్షం తదనుసారతః,
ధర్మశాస్త్ర మితి ప్రాజ్ఞాః-శాస్త్రనిర్ణయతత్పరాః॥

"పురుషుఁడు, కారణము, పరుడునగు శివుఁడు విద్యలన్నిటికి నుత్పత్తి స్థాన మగువాడు. నిట్టూర్పుతో సమానముగా నుదయించినవి, కర్మకాండతో పరిపూర్ణతఁజెందునవి యగు వేదములు మందబుద్ధిగలవారికి విశదములు కావని చింతించి అనంతములైన వేదములయందు నిర్దేశింపఁబడిన సర్వవిధాంశములను తెలుపునట్టి శైవమగు ధర్మశాస్త్రమును శివుఁడు రచించినవాడు.

అద్ది-కామికము మొదలగు నామధేయములతో భిన్నమైన నొకే యర్థముతో విరాజిల్లుచుండునది. శంసితవ్రతులగు ఋషులు ఆయా శుభసమయములయందు నుద్భవించి శైవశాస్త్రము (శివాగమముల) ననుసరించియే ధర్మప్రతిపాదక శాస్త్రము (స్మృతు)లను కల్పించినవారైరి. మొదట శైవశాస్త్రము, తరువాత ఋషిప్రోక్తము నని శాస్త్ర నిర్ణయతత్పరులగు విద్వాంసులు ధర్మశాస్త్రమును నిర్ణయించినవారు."

ఇట్లు చెప్పుటవలన శివాగమములు ధర్మశాస్త్రమనఁదగుననియు "చతుర్దశ విద్యాస్థానములయందు చేరనందున శివాగమములు ప్రమాణములుకావని" పరులు ప్రతిపాదించుట - సముద్రతీరమునందు పడవేయఁబడినదనియు పాఠకులు గ్రహింపనగును.

ఇందువలననే శ్రీ విద్యారణ్యులవారు జైమినీయ న్యాయమాలయందు "సర్వోపనిషత్తులలో స్ఫురించు పరబ్రహ్మమే శివాగమములయందు ప్రతిపాదింపఁబడు"నని శివాగమముల ప్రామాణ్యమును ధృవపఱచినవారు.

ప్రశ్న : ఋషికృతములగు స్మృతులు శివాగమములు ధర్మశాస్త్రములగునెడ రెంటికిని సమానత్వము చేకూరును కాదా ?

ఉత్తరము : ప్రమాణగత వైషమ్యము కర్తృగత సర్వజ్ఞత్వ కించిజ్ఞత్వ ములఁబట్టి విశదమగునది- కావున పతివచనము పశువచనముకన్న నధికతర మగుట న్యాయసిద్ధము గదా! శివాగమములు కల్పములకంటెను స్మృతులకంటె నధికతమములై ప్రశస్తములగుచున్నయవి. మఱియు శివాగమములు బహుళ ములగుటవలనను నిశ్శేషముగా ధర్మమును ప్రతిపాదించు ఆయా కల్పము (శాస్త్రము) లను బోధించునవియగుటచేతను సంకోచమున కవకాశములేనివి యగుటఁజేసియు ఆద్యములగుటను పరమాప్తుడైన సర్వజ్ఞునిచే వక్కాణింపఁబడి నందునను "శాస్త్రయోనిత్వాత్" అను సూత్రముఁదగు వివరణయందు సూత్ర కృత్సమ్మతమైన ప్రామాణ్యము కలిగియుండుటవలనను స్మృతులకన్నను కల్ప ములకంటె నధికమైన పరత్వము గలవియనుట నిర్వివాదమైనది.

"ఈశానః సర్వవిద్యానామ్" "అస్య మహతో భూతస్య నిశ్వసితమ్" ఇత్యాది శ్రుతులవలనను "అష్టాదశానాం విద్యానా- మేతాసాం భిన్నవర్త్మనామ్, ఆదికర్తా శివః సాక్షాత్- శూలపాణిరితి శ్రుతిః" అను స్మృతిచేతను వేదమునకు శివాగమము లకును కర్త శివుఁడొక్కఁడే యని విదితమగుచున్నయది. కావున కర్తృసామా న్యమువలన వేదశివాగమములు రెండు నేకార్థపరములగుచు ప్రమాణమూర్ధన్యము లగుచున్నవియేను. వేదములయందు "వ్రతమేతచ్చాంభవం" "వ్రత మేతత్పాశు పతం'' ఇత్యాదిని శాంభవ పాశుపతాది శబ్దములతో భస్మ రుద్రాక్ష శివలింగధార ణాత్మక శివవ్రత ముపదేశింపఁబడుచున్నయది. శ్రుతులయందు చెప్పినట్లుగానే భస్మ రుద్రాక్ష శివలింగధారణాద్యాత్మక నిత్యవ్రతము- సమయ, వేధా, క్రియలను విధములతో శివాగమములయందు విశదీకరింపఁబడినది.

ప్రశ్న : వేదములు అపౌరుషేయములగుటను ఆగమములు పౌరుషేయ ములగుటవలన నారెంటికి నేక కర్తృకత్వ మెట్లు పొసగును ?

ఉత్తరము : మహాభారతము "పదునెనిమిది విద్యలకు కవియగు మహా దేవుడే ఆదికర్త యగునని శ్రుతి వక్కాణించినద"ని చెప్పుచున్నందునను "ఈశానః సర్వవిద్యానాం" అను శ్రుతివలనను ''శాస్త్రయోనిత్వాత్" అను వ్యాససూత్రము చేతను వేదాగమకర్తృత్వము శివునకు చెల్లుచున్నందున వేదములవలె శివాగమ ములు నపౌరుషేయము లనఁబఁడుచున్నవి. ఐతే నొక విశేషము నిట గాననగును. వేదములలో శబ్దములు ఆగమములలో అర్థములు నపౌరుషేయములగును. వేదశివా

గమముల రెంటిని సర్వజ్ఞుడైన శివుఁడు రచించినందున నవ్వానికి హీనాధిక భావ మిసుమంతయు పాటింపఁబడ నవసరము లేదు. వేద శివాగమములు రెండును స్వతంత్రములేను; స్వాతంత్ర్యము - ప్రామాణ్యానపేక్షమనియు క్రియానపేక్ష మనియు రెండు విధములగునది. వేదములు ఆగమోక్త క్రియాసాపేక్షము లగుట చేతను శివాగమములు వేదోక్తమంత్ర సాపేక్షములగుటఁ జేసియు రెంటికిని ప్రామాణ్యానపేక్షమైన స్వాతంత్ర్యము సహజమగుచున్నయది.

ప్రశ్న - ఏతావతా కామికము మొదలగు ఇరువది యెనిమిది భేదములు గల సిద్ధాంత తంత్రమంతయు వైదికంబగునని చెప్పరాదు. ఎట్లనఁగా? "శైవాగమము – శ్రౌతమనియు అశ్రౌతమనియు రెండు విధములు గలది. శ్రుతిసారమయము శ్రౌతమనియు స్వతంత్రము అశ్రౌతమనియు స్వతంత్రము అష్టావింశతి భేదములు కలదనియు శ్రుతిసారమయంబగు శ్రౌతమైతేనో శతకోటి ప్రవిస్తరమై పాశుపతవ్రతమును బాగుగా నిరూపించునది యనియు వాయు సంహితయందు చెప్పఁబడినట్లు కామికాద్యాగమములు అవైదికములనియు సర్వజ్ఞానోత్తరాద్యాగమములు వైదికములనియు విభజింపఁబడుట యనివార్యంబైనది గదా?

ఉత్తరము : కామికాదులు అవైదికములని చెప్పుటలోని తాత్పర్యము మీరు భావించినట్లు కాదు. కాని వేదములో చెప్పఁబడనట్టి వేదోక్తపూజాదుల కవసరమగు నట్టియు కర్షణాది ప్రతిష్ఠాంత విషయము కామికాదులయందు ప్రతిపాదింపఁబడి నందున నయ్యవి వైదికములే యగుచున్నయవి.

ఇందుకు సిద్ధాంత శిఖామణియందు

శ్లో॥ శైవతంత్రమితి ప్రోక్తం - సిద్ధాంతాఖ్యం శివోదితమ్,
సర్వవేదార్థ రూపత్వాత్ - ప్రామాణ్యం వేదవత్సదా॥

"శివునిచే చెప్పఁబడిన సిద్ధాంతమను పేరు గల శివాగమశాస్త్రమంతయు వేదములన్నిటి యర్థముఁదగు స్వరూపము గలది యగుటఁజేసి వేదమువలె సర్వథా ప్రమాణమగుచున్నయది."

## వేద శివాగమ ఏకార్థనిరూపణము

"ఈశానః సర్వవిద్యానామ్'' ఇత్యాది పంచబ్రహ్మ మంత్రములు యజుర్వేదారణ్యకమునందు వక్కాణింపఁబడినవి. ప్రణవము ''ఓమితి" "బ్రహ్మేతి" అనుచోట్ల నుపదేశింపఁబడినది. పంచాక్షరీ మంత్రము యజుః సంహితయందు నిర్దేశింపఁబడినది. పశుపాశపతి వ్యవహారము "ఏతావంతోవై పశవో ద్విపద శ్చతుష్పదః'' ''ఏషా మీశే పశుపతిః పశూనామ్" అను శ్వేతాశ్వతర మంత్రోపనిషత్తులయందు ప్రసిద్ధంబైనది. భస్మోద్ధూళన త్రిపుండ్ర రుద్రాక్ష మహాలింగధారణములు అథర్వశిరమునందు కాలాగ్ని రుద్రోపనిషత్తునందు బృహజ్జాబాల మహాలింగ జాబాలాద్యుపనిషత్తుల యందును ప్రతిపాదింపఁబడియున్నవి.

"నిత్యం త్రిసంధ్యం శివలింగ మభ్యర్చ్యమ్" "తవ శ్రియే మరుతో మర్జయంత" ఇత్యాది మంత్రములయందు నిరూపింపఁబడిన శివలింగధారణమును "రౌద్రం లింగం మహావిష్ణుః ర్భక్త్యా శుద్ధం శిలామయమ్, చారుచిత్రం సమభ్యర్చ్య లబ్ధవాన్ పరమం పదమ్" అనుచో పౌరాణికులు నుపబృంహణఁ జేసియున్నవారు.

శివాగమములలో కొన్ని శివాధిక్యమును మరికొన్ని పశుపాశపతిరూప పదార్థత్రయమును తదితరములు భస్మరుద్రాక్ష శివలింగధారణములను శివారాధనమును ప్రణవ పంచాక్షర్యనుసంధానమును తద్భిన్నములు – షడధ్వలను మరికొన్ని షట్త్రింశత్తత్త్వములను ప్రతిపాదించినవి. ఈ పదార్థములన్నియు వేదములయందు వినఁబడుచున్నయవియేను, మఱియు ''శివ ఏవ కేవలః" "విశ్వాధికో రుద్రోమహర్షిః'' అను మంత్రోపనిషద్వాక్యములయందు శివుఁడును నారాయణోపనిషత్తునందు షట్త్రింశత్తత్త్వములున్ను ''నమో బ్రహ్మణే ధారణం మే అస్తు'' ''సర్వలింగగ్ స్థాపయతి" ఇత్యాది మంత్రములయందు లింగధారణమున్ను నిరూపింపఁబడినవి.

ఇట్లు శివాగమములు వేదములు నేకార్థపరములగునేవి శివాగమములొకచో పరమేశ్వరుని యుపాదాన కారణత్వము నెందుకు నిరాకరించినవి యనునెడ-వేదమునందు పరమాత్మకు నిర్వికారత్వము చెప్పఁబడినది కావున నట్టి నిర్వికారత్వమునే శివాగమములు వివరించినవని తెలియుటలో విరోధ మిసుమంతయు గానరాదు.

ఈ యధికరణము ఈశ్వరుఁడు కేవలము నిమిత్త కారణమగుటను చెప్పు

హిరణ్యగర్భోక్తమైన యోగస్మృతిని నిరాకరింప నుపయుక్తమగునని మేము (శ్రీ నీలకంఠాచార్యులవారు) చెప్పుదుము. కావున నియ్యది హిరణ్యగర్భాగమ వాద నిరాకరణ పరమైనదనుట సమంజసంబైనది. ఇంతియే గాక నీ భాష్యము నందు ఆకాశాద్యుత్పత్తిఁజెందిన ఆశంకలను పరిహరించుటవలె నవాంతరమగు కేవల నిమిత్తవాదమును పరిహరించి శివాగమతాత్పర్య పర్యవసానమగు నిమిత్తోపాదానోభయ వాదమును నెలుకొలుపఁ బ్రవర్తించినదని చెప్పుటలో నెట్టి దోషంబును లేదు గావున సర్వథా ఈశ్వరుఁడు జగమునకు కేవలము నిమిత్తకారణము కాజాలడని (మా) సిద్ధాంతము

## పాంచరాత్రాధికరణము

సూ. 'ఉత్పత్త్యసంభవాత్'' 2-2-39

పాంచరాత్రమతమును శ్రీవాసుదేవ భగవానుఁడు ప్రవచించెను. అందు జీవోత్పత్త్యాది విషయము గలదు. అది సంభవించునా లేదా యని సంశయము.

ప్రశ్న : పాంచరాత్ర మతమునందుగల జీవోత్పత్త్యాది విషయము సమంజసంబగునది. ఎందుకనఁగా ? భగవానుడైన వాసుదేవుఁడు పరాశక్త్యంశ సంభూతుడగుటఁజేసి తత్ప్రోక్తమగు పాంచరాత్రము ప్రమాణంబగునదియే;

పాంచరాత్ర మతము నిర్విధము తెలియనగును.

భగవానుడైన వాసుదేవుఁడొకఁడే పరమాత్మ యగువాడు. వాసుదేవుని నుండి సంకర్షణుడను జీవుఁడుదయించును. జీవునివలన ప్రద్యుమ్నుడను పేరు గల మనస్సు జనించును. మనస్సునుండి అనిరుద్ధుడను అహంకారము కలుగును. ఈ నాలుగు వ్యూహముగా కూడి సర్వప్రపంచ మగునవి. కావున వాసుదేవుఁడు హిరణ్యగర్భాదుల నతిక్రమించువాడగుటచే నాతడు వక్కాణించిన పాంచ రాత్రము ప్రమాణమగుటకతన అందు చెప్పబడిన అంశమంతయు ఉపపన్నమగుట లేదా ?

ఉత్తరము : పాంచరాత్రశాస్త్రము జీవుని యుత్పత్తిఁ జెప్పునదగుటచే ప్రమాణము కాజాలదు. ఎందుకనఁగా? కృతనాశము అకృతాభ్యాగమము అను దోషములు సంఘటిల్లుట వలన జీవోత్పత్తి యుపపన్నము కాజాలదు. ఒకానొకఁడు

పుణ్యపాపరూపమైన కర్మనాచరించి ప్రళయమునందు నశింపగా సృష్టికాలమున మరియొక జీవుఁడు అట్టి కర్మఁజెందుట అకృతాగమమను దోషమగును. ఒకానొక జీవునిచే పూర్వము గావింపఁబడిన కర్మ-కర్తృగతము కాకుండుట కృతనాశమను దోషమగును. అందువలన జీవోత్పత్త్యభిధాయకమగు పాంచరాత్ర శాస్త్రము ప్రమాణము కాజాలకుండును.

మరియొక యనుపపత్తిఁజెప్పుచున్నవారు.

సూ. "న చ కర్తుః కరణమ్" 2-2-40

సంకర్షణుడనఁబడు జీవునివలన ప్రద్యుమ్నుడను పేరుగల మనస్సు ఉదయించునని పాంచరాత్రులు చెప్పుదురు. అట్టితఱి కర్తయగు జీవునివలన కరణము పుట్టుట పొసగఁజాలదు గదా! కరణములగు మనస్సు మొదలగునవి ప్రకృతి కార్యములగుటచే చేతనుఁడగు జీవునినుండి యుదయించుట యుపపన్నము కాజాలదు.

పూర్వపక్ష సూత్రము.

సూ. "విజ్ఞానాదిభావే వా తదప్రతిషేధః" 2-2-41

విజ్ఞానశబ్దము జీవునిఁజెప్పును. ఈ సందర్భమున జీవుఁడు మొదలగు వారి యుదయము నంగీకరింపక సంకర్షణాదులకు జీవాదిభావమేర్పడునని చెప్పుదుము. జీవాదిభావమనగా జీవుడు మున్నగువానియందు సంకర్షణాదులు అధిష్ఠించి యుండుట యగును. కావున పాంచరాత్రశాస్త్రముఁదగు ప్రామాణ్యమును నిషేధింప వలనుపడదు గదా?

సిద్ధాంత సూత్రము.

సూ. "విప్రతిషేధాచ్చ" 2-2-42

ఇట్లు జీవోత్పత్త్యభిధానము పరిహరింపఁబడినను పాంచరాత్రమతము నంగీకరింపరాదు. ఎందుకనఁగా?

శ్రుతి విరుద్ధమగు విష్ణు కారణవాదము ముక్తిహేతువులు గాని తప్తముద్రాధారణాదులు మున్నగు నిషిద్ధాంశములున్నందువలన పాంచరాత్రమతము సమంజసము కాజాలదు.

ఐతే పాంచరాత్రమునందు వైదికులు గానివారికి నధికారము గలదని దిగువ సందర్భము విశదీకరించుచున్నయది.

కూర్మ పూరాణమునందు

శ్లో॥ స తేషాం మాయయా జాతం–గోవధం గౌతమో మునిః।
కేనాపి హేతునా జ్ఞాత్వా–శశాపాతీవ కోపనః॥
భవిష్యథ త్రయీబాహ్యాః–మహాపాతకిభిః సమాః॥

"గౌతమ మహాముని ఋషుల కపటమువలన గోహత్య సంభవించినదని దివ్యదృష్టితో కనుగొని మిక్కిలి క్రోధము గలవాడై ''వేదబాహ్యులు మహాపాపులతో సమానులున్ను కాగల"రని ఋషులను శపించెను.

అట్లు శపింపఁబడిన ఋషులందరును దేవదేవుడైన శంకరుని అవ్యయుండగు విష్ణువును వేదాధికారములేని శూద్రులవలె లౌకికభాషాస్తోత్రములతో ప్రార్థింపగా శివకేశవులాలోచించిన పిమ్మట శివునిచే ప్రేరేపింపఁబడిన కేశవుఁడు పాంచరాత్రము మొదలగు మోహశాస్త్రములను రచించెను. ఇట్టి శాస్త్రములు- వేదబాహ్యలైనను అంతఃకరణశుద్ధి గలవారిని కాపాడుచు వైదికులైనను మలిన చిత్తము గలవారిని మోహింపఁజేయుచున్నవి.

"సాత్త్వతుడను విష్ణుభక్తుఁడు ధనుర్విదులలో శ్రేష్ఠుడై దాననిరతుడగుచు నారదుని యుపదేశమువలన వాసుదేవుని పూజించుచు కుండగోళకాదుల కుపయోగించు నాకానాక శాస్త్రమును కల్పించినందున నా శాస్త్రము సాత్త్వతమను పేరుతో విఖ్యాతమై మహాశాస్త్రమనఁబఱగుచున్నయది" ఇట్లు కూర్మపురాణమునందు కుండగోళకాదులకున్ను పాంచరాత్రమునందధికారము గలదని నిరూపింపఁబడినది.

త్రివకాపుత్రుడైన ఉపశ్లోకునుద్దేశించి భాగవతమునందు దిగువ విధము చెప్పఁబడినందున పాంచరాత్రమునందు స్త్రీ శూద్రాదులకధికారము గలదని తెలియుచున్నయది.

''ఉపశ్లోకుఁడు సాత్త్వత తంత్రము నాశ్రయించి ముముక్షువయ్యెను. సాత్త్వతతంత్రము తప్తముద్రాధారణాది వైష్ణవ సంస్కారము నుపదేశించినది."

వాసిష్ఠలైంగమునందు శాండిల్యుని గురించి భగవానుఁడు ఇట్లు చెప్పెను.

"మత్తంత్రాశ్రయణేనైవ – మత్పూజా చ కృతా త్వయా।
తయా న ప్రీతవానస్మి – తవ శాండిల్య దుర్మతే॥

కుమార్గేణాపి శాండిల్య – కృతా పూజా మమ త్వయా।
అతః కాలేన మహతా – వేదమార్గం గమిష్యసి ॥

''దుష్టబుద్ధి గల శాండిల్యుడా ? నా (పాంచరాత్ర) తంత్రము నవలంబించి నన్ను పూజించినందువలన నీ విషయమై సంతృప్తుడను కాలేదు. కాని కుత్సిత మార్గముననైన నన్ను సేవించినవాడవగుటచే చాలాకాలమునకు వైదికమార్గము నాశ్రయింతువు."

ఎవరైతే పాంచరాత్రమార్గముగా విష్ణువు నాశ్రయించియు ప్రాచీన దధీచ్యాదిశాపదోషవమున శివ నిందాదులయందు ప్రవర్తింతురో నవ్వారికి కల్పాంతము వరకు నరకప్రాప్తి యనియు జన్మాంతరములయందును వైదికమార్గము గోచరింపదనియు కూర్మపురాణమునందు దిగువవిధము గాననగును.

శ్లో॥ ఏవముక్త్వా తు విప్రర్షిః – శశాపేశ్వరవిద్విషః,
సమాగతాన్ బ్రాహ్మణాం స్తాన్ – దక్షసాహాయ్యకారిణః॥

యస్మాత్ బహిష్కృతా వేదా - భవద్భిః పరమేశ్వరః।
వినిందితో మహాదేవః - శంకరో లోకవందితః।

భవిష్యథ త్రయీబాహ్యాః - సర్వేఽపీశ్వర విద్విషః।
నిందంతో హ్యైశ్వరం మార్గం - కుశాస్త్రాసక్తమానసాః॥

మిథ్యాఽధీతసమాచారా - మిథ్యాజ్ఞాన ప్రలోభినః!
ప్రాప్య ఘోరం కలియుగం - కలహైః కలిపీడితాః ॥

త్యక్త్వా తపోవనం కృత్స్నన్ - గచ్ఛధ్వం నరకాన్ పునః,
భవిష్యతి హృషీకేశః-స్వాశ్రితోఽపి పరాఙ్ముఖః ॥

అట్టివారిఁగూర్చి సౌరపురాణము "పురుషోత్తము నాశ్రయించి శివుని నిందించు ద్విజులు కలియుగములో పెక్కురుందురు. వారిని లక్ష్మీపతి రక్షించువాడు కాడ"ని చెప్పుచున్నయది.

స్కాందమున శంకరసంహితయందు శివపూజా విధానములో

"నేక్షేత పూజావేళాయాం-నరం వత్స బహిష్కృతమ్''

"శివపూజా సమయమున బహిష్కృతుడైన మానవుని చూడగూడ"దని చెప్పగా -బహిష్కృతుఁడెవఁడని యాశంక కలిగినందున దిగువవిధము బహిష్కృతులు పేర్కొనఁబడిరి.

"దధీచినా గౌతమేన-యే శప్తా బ్రాహ్మణాధమాః,

కలా వవతరిష్యంతి-నిందకా స్తే బహిష్కృతాః"

వరాహపురాణమునందు పాంచరాత్ర ప్రశంస యనేక విధములుగా చేయఁబడినను పాంచరాత్రమునందు అవైదికులకు మాత్రము అధికారము కలదని యందే చెప్పబడినది.

"అభావే వేదమంత్రాణాం-పాంచరాత్రోదితేన చ,

మార్గేణ మాం ప్రపద్యంతే-తే మాం ప్రాప్స్యంతి మానవాః''

ఇఁట వేదమంత్రాణాం అభావేయనగా ? వేదములు నిత్యములగుటచే వేదమంత్రములు స్వరూపతః శూన్యములని చెప్పరాదు కాని యవ్వానియందు అధికారము లేకుండుట యను నర్థము సమంజసంబగును.

పాశుపతమునకువలె పాంచరాత్రమునకు వైదికావైదికవిభాగము లేనందున ఎట్టి సువ్యవస్థ యేర్పడఁజాలదని తెలియునది.

"శివ ఏవ కేవలః'' ఇత్యాది శ్రుతి విరుద్ధముగా శివేతర జగత్కారణ వాదము "యదా చర్మవదాకాశం'' ఇత్యాది శ్రుతివిరుద్ధముగా శివేతర జ్ఞానము వలన ముక్తి కలుగునను నంశంబును పాంచరాత్రమునందు ప్రతిపాదింపఁబడుటచే నయ్యది పరిగ్రాహ్యము కాకున్నయది.

ప్రశ్న : ఓయీ ? "పురుషో వై రుద్రః" ఇత్యాది శ్రుతిని పరమేశ్వరుఁడే పురుషుడనఁబఱగుచు వాసుదేవుడగుననియు వాసుదేవుని గురుతెఱిగి యారాధించుట మున్నగునది క్రమముగా పరమేశ్వరప్రాప్తిసాధనమగు ననియు వినఁబడుచున్నయది. అట్టితఱి వాసుదేవారాధనప్రతిపాదకమగు పాంచరాత్రశాస్త్రము ప్రమాణము కాకున్నచో వాసుదేవుడు ఆరాధనీయుఁడు ఎట్లగును ?

**ఉత్తరము** : శ్రుతివిరోధమునఁజేసి పాంచరాత్రము ప్రమాణము కాకున్నను వాసుదేవునకెట్టి హానియులేదు. వైదికములగు బోధాయన వైఖానసాది సూత్రములయందు ప్రతిపాదితమైన ప్రతిష్ఠోత్సవాది మార్గమున కేశవు నారాధించి కృతార్థులు కావచ్చును.

మఱియు మహాభారతమున

"సమాభవంతి మే సర్వే-దానవా శ్చామరాశ్చ యే,
శివోఽస్మి సర్వజంతూనాం-శివత్వం తేన మే సురాః"

"రాక్షసులు దేవతలున్ను నాకు సమానులగుచున్నారు. ప్రాణులందరికిని శుభమును కలుగఁజేయువాడ నగుటచే శివుఁడను పేరఁబఱగుచున్నా"నని శంకరుఁడు దేవతలకు నుపదేశించెను.

ఇందువలన శివుఁడు సర్వేశ్వరుఁడనియు సర్వహితైషియనియు విష్ణువు దైత్యారియని సర్వప్రమాణములచే నేర్పడుచున్నదనియు గ్రహించునది. హయగ్రీవకథా సంద్యమును పరికించినచో విష్ణువుఁదగు సామర్థ్యము తేటపడును. ఒకప్పుడు వాసుదేవుఁడు దానవులతో దీర్ఘకాలము పోరాడినందున యలసినవాడై శార్ఙ్గధనుస్సుపై గడ్డము నునిచి కొంతకాలము నిలువఁబడియెను. అప్పుడు ఒకానొక రాక్షసుఁడు వజ్రకీటరూపముఁ దాల్చి శార్ఙ్గమునకు నుండు అల్లెత్రాడుఁ గఱచినందున ధనుష్కోటి ప్రహారముతో విష్ణుశిరము ఎగిరిపోయెను. అట్టితఱి యమరులు ఒకానొక గుఱ్ఱపు తలకాయఁదెచ్చి విష్ణుకాయమున కనుసంధింపగా విష్ణువు హయగ్రీవుఁడయ్యెను.

ఇట్లు చెప్పుటనే విష్ణువునందు సర్వాంతర్యామిత్వము, సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్త్వము మొదలగు పరమాత్మగుణములు లేవని తెలియుచున్నది. ఒకవేళ సర్వజ్ఞత్వము, సర్వాంతర్యామిత్వము కలదు అనినచో తన తలకాయ నెగురవేయఁబ్రయత్నించు శత్రువుఁదగు సంకల్పము నెట్లు గురుతెఱగకుండును ? మరియు సర్వశక్తి మత్త్వము కలదనిన యెడల స్వశిరః పరిరక్షణము నెందులకు గావించుకొనకుండును ?

ఒకవేళ నిదియంతయు విష్ణుపారమ్య విరుద్ధంబని మదినెంచి హయగ్రీవ

కథ హయగ్రీవ మూర్తియు యథార్థములు కావని పరులు చెప్పునెడ నద్ది విమర్శాసహమగును.

కావుననే

"హయగ్రీవోత్పత్తి గాథా-బడబాగ్న్యత్ర సంజ్ఞితా,
ఏకైవ హి సుపర్యాప్తా-వైష్ణవాంబోధిశోషణే"

అను నానుడి యథార్థ మగుచున్నయది.

"హయగ్రీవుని జన్మ వృత్తాంత మొక్కటియే వైష్ణవమత మను సముద్రమును శోషింపఁజేయుటకు బడబాగ్నివంటిదై సుపర్యాప్త మగుచున్నయది"

ఇయ్యది
శ్రీ నీలకంఠ శివాచార్య విరచితమైన
బ్రహ్మ మీమాంసా భాష్యమునందు
రెండవ యధ్యాయముఁదగు రెండవ పాదము
శ్రీ కంఠమణి ప్రభామయూఖమను ఆంధ్రానువాదముతో ముగిసినది

---

ప్రకటన

శ్రీదేవీ నవరాత్ర పూజావిధానమును లఘురీతిని వ్రాయనైనది మరియు గురువార ఏకాదశీవ్రతము వ్రాయఁబడినది. ఈ రెండు గ్రంథములు-దైవభక్తులకు అత్యంతావశ్యకములగుటచే ముద్రణకై సహకరింపగలరని కోరుచున్నాను.

116/- 58/- వీనిలో ఏదేనాక విరాళం స్వసంతోషముతో దిగువ అడ్రసునకు పంపి తమ పేరు నమోదు చేయించుకొనవలెను.

నిర్మల శంకరశాస్త్రి
సర్వమంగళా-శివవిజ్ఞాన-సదనము,
184/A. వెస్ట్ మారేడుపల్లి, రోడ్ నెం. 6
సికింద్రాబాద్, 500026, ఆం. ప్ర.

శ్రీమహాగణాధిపతయే నమః

శ్రీ నీలకంఠ భగవత్పాదకృత

# శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

## ద్వితీయాధ్యాయము

### మూడవపాదము

### ఆంధ్రీకరణము

## వియదధికరణము

శివాద్వైత విరుద్ధములగు ఇతర దర్శనముల న్యాయమంతయు నిరసింపఁబడినది. ఇఁక నీ యధ్యాయ శేషమున నవాంతర విరోధములు పరిహరింపఁబడుచున్నవి.

పూర్వపక్షసూత్రము.

సూ. "న వియ దశ్రుతేః" 2-3-1

ఆకాశము అవయవములు లేనిదగుటచే కార్యము కాదను భ్రాంతివలన ఆకాశముఁదగు నుదయము సరిపడునా లేదా యని సందేహము.

ప్రశ్న : ఆకాశము శ్రుతియందు నుదయించునని లేదు గావున కార్య కోటిలో చేరకుండును. ఛాందోగ్యమున "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్" మొదలు కొని "త త్తేజోఽసృజత" వరకు గల సందర్భమును పరికించినచో తేజస్సు మొదలగు భూతములు సృజింపఁబడుననియు ఆకాశము సృజింపఁబడదనియు తేటపడును. "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" అని తైత్తిరీయ మునందు చెప్పఁబడిన ఆకాశసృష్టి గౌణమని చెప్పవచ్చును. ఆకాశమునుదయింపఁ

జేయు సమవాయికారణము మొదలగు వానిని నిరూపింప నశక్యము గావున జీవాత్మ వలె నాకాశంబు నుత్పన్నము కానిదని చెప్పుట సమంజసము కాదా ?

సిద్ధాంతసూత్రము.

సూ. "అస్తి తు" 2-3-2

"తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః"

ఇత్యాది శ్రుతి ప్రమాణముఁబట్టి యాకాశము నుదయము కలదియేను; ఆత్మయైతేనో "న జాయతే మ్రియతే వా విపశ్చిత్" అనుచో జనన మరణాదులు లేనివాడని చెప్పఁబడినందున-అనాదికాలమునుండి యుత్పత్తి లేనివాడని తెలియు చున్నది. ఇట్లే ఆకాశముఁదగు నుదయమును నిషేధించు శ్రుతి గానంబడుట లేదు. కావున నాకాశము నుదయించునదియేను;

ఆకాశోదయము గౌణమను విషయమును సమర్థించునదీ పూర్వపక్ష సూత్రము.

సూ "గౌణ్యసంభవా చ్ఛబ్దాచ్చ" 3-3-2

"తత్తేజోఽసృజత" "బ్రహ్మము తేజస్సును సృజించెమ" అనుచో మొదట తేజఃసృష్టి వినఁబడుచున్నందున నిరవయవమగు ఆకాశము పుట్టుట పొసగనందు నను "వాయుశ్చాంతరిక్షం చైత దమృతమ్" "వాయువు ఆకాశము అనునవి ఉత్పత్తి వినాశములు లేనివి" అనుచో నిత్యత్వ శబ్దము వలనను "ఆకాశః సంభూతః" అనుచో గల ఆకాశోదయము గౌణమని చెప్పవలెను కాదా ?

మఱియు (పూర్వపక్ష సూత్రము)

సూ. స్యాచ్చైకస్య బ్రహ్మశబ్దవత్" 2-3-4

ఒకే సంభూత శబ్దము ఆకాశము విషయమై గౌణమగుననియు తేజఃప్రభృతులయందు ముఖ్యమగువనియు తెలియునది. ఎట్లనఁగా ? బ్రహ్మశబ్దమొక్కటియే "తస్మాదేతద్బ్రహ్మ నామరూప మన్నం చ జాయతే" అనుచో నామరూపములు అన్నాదులు నగు ప్రకృతియందు గౌణముగా వ్యవహరింపఁబడినది. "తపసా చీయతే బ్రహ్మ" అనుచో బ్రహ్మమునందు ముఖ్యముగా నుపయోగింపఁబడినది. అట్లే ఆకాశమునందు సంభూతశబ్దము గౌణమని చెప్పనగును. కావున ఆకాశము ఉదయించునని చెప్పుట సమంజసము కాజాలదు.

ఇఁక పరిహారముఁజెప్పుచున్నవారు.

సూ. "ప్రతిజ్ఞాఽహాని రవ్యతిరేకాత్" 2-3-5

"యేనాశ్రుతం శ్రుతం భవతి" అనుచో ఏకవిజ్ఞానముతో సర్వవిజ్ఞానము కలుగునని చెప్పఁబడిన ప్రతిజ్ఞకు-ఆకాశాదులు బ్రహ్మకార్యములగుటచే బ్రహ్మము నుండి విడిబడనివగుటఁజేసియు భంగము చేకూరకున్నయది. మఱియు సంభూత శబ్దము గౌణమనినచో ప్రతిజ్ఞాహాని మొదలగునవి సంభవించును. ఎట్లు సర్వ విజ్ఞాన ప్రతిజ్ఞ నెరవేరునో అట్లు ఏర్పాటు కావలెను గదా ?

సూ. "శబ్దేభ్యః" 2-3-6

"ఆత్మన ఆకాశః సంభూతః" ఇత్యాది శ్రుతిగతములైన సంభూతాది శబ్ద ములవలన నవగతమగు ఆకాశోత్పత్తిని "తత్తేజోఽసృజత" అనుచో ఆకాశమును చెప్పనందువలన బోధపడు తేజఃప్రథమభావము నిరసింపఁజాలదు.

సూ. "యావద్వికారం తు విభాగో లోకవత్" 2-3-7

"ఐతదాత్మ్యమిదగ్ం సర్వమ్" "ఇదియంతయు పరమేశ్వరుఁడంతర్యా మిగా కలిగియుండును." అనుచో ఆకాశము మొదలగునవి వికారములని బోధ పడుచున్నందున తేజస్సు మున్నగు వికారములఁజెప్పుట ఆకాశాది సమస్తమును సృజ్యమానములుగా చూపెట్టుటకొరకని తెలియునది. లోకమున నొకానొకఁడు "నాకు కుమారులు పదుగుడు" అని వక్కాణించి కుమారులలో కొందరి జన్మ వృత్తాంతముఁ జెప్పునట్లు తేజఃప్రథమముగా చెప్పఁబడిన సృష్టి యాకాశాదులకును వర్తించునని సారాంశము.

## మాతరిశ్వాధికరణము

సూ. "ఏతేన మాతరిశ్వా వ్యాఖ్యాతః" 2-3-7

"తేజోఽతః" అని ముందు చెప్పఁబడును కావున వాయువు నిట ప్రత్యే కించి నిరూపింప వలసి వచ్చినది.

ఆకాశమునుండి వాయువు ఉత్పన్నమగునా కాదా ? యని సందేహము.

ప్రశ్న : ఛాందోగ్యమునందు సృష్టిలో తేజస్సు మొదటిదని చెప్పఁబడి నందున వాయూదయము వినఁబడుట లేనందునను బృహదారణ్యకమునందు "నైషాఽనస్తమితా దేవతా యద్వాయుః'' అనుచో వాయువుఁదగు జన్మము నిషేధింపఁబడుటచే నన్నివిధములను వాయువు ఉదయింపదనియే నంగీకరింపనగును కాదా ?

ఉత్తరము : ఛాందోగ్యమున వాయువు ఉదయించునని చెప్పఁబడకున్నను "ఆకాశాద్వాయుః" అను తైత్తిరీయవాక్యము నుపసంహరించు సందర్భమున ఆకాశమునుండి వాయువు పుట్టునని నిర్దేశింపఁబడినందున గుణోపసంహారన్యాయము ననుసరించి ఛాందోగ్యమునందును వాయుజన్మము కలదనియే భావింపవలెను. "నైషా నాస్తమితా" అను శ్రుతివాక్యము ఉపాసనా ప్రకరణ మగుటచే స్తుతిపరమగు నట్టిది. అందువలన వాయువున్ను జన్మించునదియేను,

## అసంభవాధికరణము

సూ. "అసంభవస్తు సతోఽనుపపత్తేః" 2-2-9

"సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్" అనుచో సద్రూపమగు బ్రహ్మమునుండి ఆకాశము మొదలగునవి యుదయించునని యీ వరకు నిరూపింపఁబడినది కావున నిట్టితటి సర్వకారణము సద్రూపంబు నగు బ్రహ్మంబును ఏదే నొక కారణము నుండి యుదయించునా లేదా యని సందేహము.

ప్రశ్న : ఆకాశము పృథివ్యాదికారణమైనను బ్రహ్మకార్యమైనట్లు బ్రహ్మమునకు నుదయము కలదని చెప్పుదుము కాని పూర్వోక్త శ్రుతివాక్యము నందు "అగ్రే" అను పదమున్నందున భూమ్యాది వికారములన్నిటికన్న పూర్వము బ్రహ్మము ఉదయించునని తెలియునది. ఐతే బ్రహ్మమునకు కారణ మెద్ది యనినచో అసత్తే యగును. ''అసద్వా ఇద మగ్ర ఆసీత్తతో వై సదజాయత" "సృష్టికి మున్ను జగము అసత్తుగానే యుండెను. అసత్తునుండి సత్తు ఉదయించినది" అను వాక్యమువలన బ్రహ్మము సద్రూపమైనను అసత్తునుండి యుదయించునని యంగీకరింపవలెను కాదా ?

ఉత్తరము : బ్రహ్మము జన్మించునది కాదు. ఎందుకనఁగా? "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీ దేకమేవాద్వితీయమ్" ''యదా తమ స్తన్న దివా న రాత్రిః స సన్నచాసచ్ఛివ ఏవ కేవలః" అను వాక్యములు బ్రహ్మంబగు శివుడొకండేయని నిర్ణయించుటవలన బ్రహ్మము పుట్టుట పొసగఁజాలదు. బ్రహ్మేతరములన్నియు జన్మింపవని చెప్పుటయు సరిపడదు. "కథ మసతః సజ్జాయేత" అనుచో అసత్తు నుండి సద్రూపము ఉదయించదను నిషేధముండుటఁజేసి సద్రూపమగు బ్రహ్మమునకు మాత్రము సంభవము (జననము) పొసగకుండును. ఇక తదితరములన్నియు సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ యుపపన్నమగుటకు సంభవించు (జన్మించు)నవియే యని సిద్ధాంతము.

సర్వవిజ్ఞానప్రతిజ్ఞ యనఁగా? ''మృత్పిండమును కనుగొనునెడ ఘటాది కార్యములు తెలియునట్లు బ్రహ్మమును గురుతెఱుగుచో బ్రహ్మకార్యమగు ప్రపంచమంతయు విదితమగును" అని శ్రుతియందు చెప్పఁబడినది.

## తేజోఽధికరణము

పూర్వపక్ష సూత్రము.

సూ. "తేజోఽత స్తథా హ్యాహ'' 2-3-10

ఇటు వాయువు మొదలగు కార్యములు బ్రహ్మమునుండి సాక్షాత్తుగా ఉదయించునా? లేక తమ తమ పూర్వకారణమునుండి యావిర్భవించునా? అని సందేహము.

ప్రశ్న : స్వస్వ పూర్వకారణముల నుండియే వాయ్వాది కార్యములు ఉదయించును. "ఆకాశా ద్వాయుః" అను శ్రుతివలన వాయువు ఆకాశమువలననే యుదయించుననియు బ్రహ్మమునుండి సాక్షాత్తు ఉదయింపదనియు విదితమగుచున్నయది. అట్లే తేజస్సు వాయువునుండి యుదయించునని "వాయో రగ్నిః'' అను శ్రుతి వక్కాణించుచున్నది కాదా?

## అబధికరణము

పూర్వపక్ష సూత్రము.

సూ. "ఆపః" 2-3-11

"అగ్నేరాపః" అను శ్రుతివలన ఉదకములున్ను అగ్ని వలన నుదయించు నని బోధపడును కాదా?

## పృథివ్యధికరణము

పూర్వపక్ష సూత్రములు.

సూ. "పృథివీ" 2-3-12

"అద్భ్యః పృథివీ" అను శ్రుతి వాక్యము ననుసరించి జలమునుండి భూమి యుదయించునని తేటపడును కావున బ్రహ్మమునుండి పంచభూతములు సాక్షాత్తు ఆవిర్భవింపఁజాలవు.

సూ. "అధికార రూప శబ్దాంతరేభ్యః" 2-3-13

ఛాందోగ్యమునందును "తా అన్న మసృజంత" అనుచో అన్న శబ్దము పృథివిఁజెప్పునది. ఇట్లే సర్వభూతములకు సృష్టిఁజేయు అధికారము కలదనియు "యత్ కృష్ణం తదన్నమ్" అనుచో అన్న శబ్దితమగు పృథివికి గల రూపము నల్లనిదనియు "అద్భ్యః పృథివీ" ఇత్యాదిని పృథివ్యాది శబ్దములుండుటఁజేసి పృథివి యుదకమునుండి యుదయించుననియు ఇందువలన బ్రహ్మము కార్యములన్నిటికిని సాక్షాత్కారణము కాదనియు కాని పరంపరాకారణమనియు విశదమగుచున్నది గాదా?

## తదభిధ్యానాధికరణము

సిద్ధాంతముఁజెప్పువారము.

సూ. "తదభిధ్యానా దేవ తు తల్లింగా త్సః" 2-3-14

పృథివ్యాది పంచభూతములు బ్రహ్మమునుండియే సాక్షాదుదయమును పొందుచున్నవి. ఎట్లనఁగా ?

"తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః" అను వాక్యము మొదలుకొని వాయ్వాది పృథివ్యంతములు స్వస్వ పూర్వకారణములనుండి యుదయించునని చెప్పఁబడలేదు. కాని పూర్వ పూర్వకారణములైన ఆకాశాదులతో కూడియుండు బ్రహ్మము నుండియే ఉత్తరోత్తరములగు వాయ్వాది కార్యములు సంభవించునని వివరింపఁబడినది కావున పరమాత్మయగు శివుఁడే సర్వభూతములను సాక్షాత్తుగా నుదయింపఁజేయునని తెలియనగును. ఎందుకనఁగా ?

"తదైక్షత బహు స్యామ్ ప్రజాయేయ" "బ్రహ్మము అనేకముగా నావిర్భవింతునని యుద్దేశించెను" అనుచో బ్రహ్మముఁదగు అభిధ్యానము (బహుభవన సంకల్పము)ను "తత్తేజ ఐక్షత బహు స్యాం ప్రజాయేయ" "తా ఆప ఐక్షంత బహ్వ్యః స్యామ ప్రజాయేమహి" అనుచోట నావర్తించినందునను అట్టి యభిధ్యానమే ఇట గుర్తింపఁబడుటఁజేసియు పరబ్రహ్మభిదేయుఁడైన శివుడే సర్వంబునకు సాక్షాత్కారణ మగువాడని విశదమైనది.

మఱియు

శ్లో॥ సదాశివః శబ్దమూర్తిః - స్పర్శమూర్తి రథేశ్వరః,
రుద్ర స్తేజోమయః సాక్షాత్ - రసమూర్తి ర్జనార్దనః।
గంధమూర్తి శ్చతుర్వక్త్రః - ఇత్యేతాః పంచమూర్తయః॥

అను పురాణవచనముఁ బట్టి సదాశివుఁడు మున్నగు రూపము, శబ్దాదులపై నధిష్ఠించుటయు గల శివునినుండి వాయువు మొదలగునవి యుదయించునని తెలియుచున్నయది.

సదాశివుఁడు మహేశ్వరుఁడు రుద్రుఁడు విష్ణువు చతుర్ముఖుఁడు అనువారు పంచబ్రహ్మములనఁబడుచు పంచభూతముల నధిష్ఠించువారై శివునకు శరీరమగువారు. పంచబ్రహ్మశరీరుఁడైన పరమాత్మ నుండియే ప్రపంచముఁదగు సృష్ట్యాదులు ప్రవర్తించునవి. సదాశివుఁడు మున్నగువారు పంచభూతస్వరూపులై పరమాత్మయగు శివుని నుండి యావిర్భవించుచున్నారు.

ప్రశ్న : పంచభూతములఁ దగు నుత్పత్తియే "ఆకాశః సంభూతః"ఇత్యాది సందర్భమున చెప్పఁబడినది కాని సదాశివుఁడు మున్నగువారి యుదయము సాక్షాత్తు వక్కాణింపఁబడలేదు కదా ?

ఉత్తరము : శ్రుత్యంతరము నిట పరిగ్రహించుటవలన నివ్విషయము విశదమగును. అథర్వశిఖయందు "ధ్యాయీతేశానం ప్రధ్యాయితవ్యం సర్వ మిదం బ్రహ్మవిష్ణు రుద్రేంద్రా స్తే సంప్రసూయంతే, సర్వాణి చేంద్రియాణి సహ భూతై ర్నకారణం కారణానాం ధ్యాతా కారణంతు ధ్యేయః సర్వైశ్వర్య సంపన్నః సర్వేశ్వరశ్చ శంభు రాకాశమధ్యగః" అనుచో బ్రహ్మాదిదేవతలు ఇంద్రియము లన్నియు పంచభూతములతో కూడ జన్మించుచున్నవనియు కారణకారణుడైన పరమేశ్వరుఁడు చిదాకాశ (హృదయాకాశ)ము నందు ధ్యానింపఁదగిన వాడనియు వినఁబడుచున్నయది

కావున ఆయా పదార్థములకు కారణములగువాని రూపము గల బ్రహ్మము నుండి సాక్షాత్తుగానే ఆయా కార్యములు ఉదయించుచున్నవనియు శివుఁడు మాత్రము ఎద్దానినుండియు జన్మించువాడు కాడనియు సారాంశము.

## పారంపర్యాధికరణము

సూ. ''పారంపర్యేణ క్రమోఽత ఉపపద్యతే చ'' 2-3-15

ఇట పూర్వాధికరణమునందు చూపఁబడిన సృష్టిక్రమము పొసగునా ? లేదా ? అని సందేహము.

ప్రశ్న : పూర్వోక్త సృష్టిక్రమము సరిపడదు ఎందుకనఁగా? "ఏతస్మా జ్జాయతే ప్రాణో-మనః సర్వేంద్రియాణి చ, ఖం వాయు ర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ" "ప్రాణవాయువు. మనస్సు, ఇంద్రియములన్నియు పరమాత్మ వలన పుట్టినపిమ్మట ఆకాశ వాయు తేజస్సులు జలము భూమియు జన్మించినవి" అను ముండకోపనిషద్వాక్యమున ఆకాశాదులకన్న ముందు ప్రాణాదుల యుత్పత్తి వినఁబడుచున్నయది. మరియు నథర్వశిఖయందు "బ్రహ్మవిష్ణు రుద్రేంద్రాః సంప్రసూయంతే, సర్వాణి చేంద్రియాణి సహభూతైః" అనుచో బ్రహ్మాదులు ఇంద్రియాదులు నొకే పర్యాయము పుట్టుటను గమనింపఁదగును

కావున పూర్వోక్తమైన ఆకాశాదుల సృష్టిక్రమము ఉపపన్నము కాదు గదా ?

ఉత్తరము : పరమాత్మవలన ఆకాశము. ఆకాశమునుండి వాయువు, ఇత్యాది పూర్వోక్త సృష్టిక్రమము సరిపడునది. ఎట్లనఁగా? "అన్నమయంహి సౌమ్య! మనః, ఆపోమయః ప్రాణః, తేజోమయీ వాక్'' "సౌమ్యుడా ? మనస్సు అన్నమయమైనది, ప్రాణము జలమయమైనది. వాక్కు తేజోమయమైనది" అనుచో ప్రాణము మున్నగునవి పృథివ్యాది పంచభూత మయములైనవని వినఁబడుచుండుటఁ జేసి ప్రాణాదులు భూతములలో చేరినవి యగుటకతన నాకాశాదుల యుత్పత్తిఁదగు క్రమము వేరుగా కా నవసరము లేదు.

బ్రహ్మాదులు భూతములతో కూడ నుదయించుట యైతేనో బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివులు పృథివ్యాది పంచభూతముల స్వరూపములు గలవారని చెప్పఁబడినందున పంచభూత సృష్టిక్రమముఁజెప్పినపుడు బ్రహ్మాదులు నుదయించుటయు నందే చెప్పినట్లగును కావున పూర్వోక్త సృష్టిక్రమము సమంజసంబైనదియేను ;

సూ. ''అంతరా విజ్ఞానమనసీ క్రమేణ తల్లింగాదితి చే
న్నావిశేషాత్" 2-3-16

ప్రశ్న : "ఏతస్మా జ్జాయతే ప్రాణః" ఇత్యాది వాక్యము-ప్రాణము పంచభూతములు అనువాని మధ్య-మనస్సు ఇంద్రియములన్నియు జన్మించినవని చెప్పుచున్నందున "ఖం వాయు ర్జ్యోతిః'' ఇత్యాది వాక్యమున శ్రుత్యంతరమున నేర్పడిన క్రమముఁదగు ప్రత్యభిజ్ఞానము (గుఱుతు) అను లింగమువలన నిద్దియు నొకానొక సృష్టిపరంపరను తెలియఁజేయును కాదా ?

ఉత్తరము : "ఏతస్మా జ్జాయతే" ఇత్యాది వాక్యమున ప్రాణము మొదలు కొని పృథివి వరకు గల వస్తువులన్నిటిలో నొక్కొక్కటి పరమేశ్వరునివలన నుదయించునని యన్వయించుటయందు విరోధమెద్దియు గానరాదు. కావున ప్రాణాదులన్నిటికిని పరమేశ్వరుఁడే కారణమగువాడు.

ఇందుకు పురాణ వాక్యమును ప్రమాణముగా గాననగును.

శ్లో॥ శక్త్యాది చ పృథివ్యంతం-శివతత్త్వ సముద్భవమ్,
తేనైకేన తు తద్వ్యాప్తం-మృదా కుంభాదికం యథా॥

"శక్తి మొదలుకొని పృథివి వరకు గల ప్రపంచమంతయు శివతత్త్వము నుండి నుదయించినది కావున శివుఁడొకఁడే ప్రపంచమును— మన్ను కడవలు మున్నగువానివలె- వ్యాపించువాడు"

ఇట్లు ఆయా స్థలములయందు చెప్పఁబడిన సృష్టిక్రమమంతయు శివతత్త్వమునే జనకముగా నిరూపించుచున్నందువలన బ్రహ్మము సర్వకారణమైనదనుట సమీచీనంబేను ;

## చరాచరవ్యపాశ్రయాధికరణము

సూ. ""చరాచరవ్యపాశ్రయస్తు స్యాత్ తద్వ్యపదేశోఽ భాక్త స్తద్భావ భావిత్వాత్" 2-6-17

ఇంతకుమున్ను బ్రహ్మము ఆకాశాది శబ్దవాచ్య మగునని నిరూపింపఁబడినది. అద్ది యిట విచారింపఁబడుచున్నయది.

చేతనాచేతనములగు చరాచరముల నాశ్రయించి చెప్పు శబ్దములు బ్రహ్మమునందు ముఖ్యములగునా కాదా? అని సందేహము.

ప్రశ్న : ముఖ్యములు కావని చెప్పుదుము. ఒకానొకశబ్దము ఒకానొక వస్తువుఁజెప్పునపుడు నద్దానియందే ముఖ్యమగును. మరియొక దానియందు ముఖ్యము కాజాలదు. ఎట్లనఁగా? "ఆదిత్యో యూపః'' ''యజమానః ప్రస్తరః" ఇత్యాదిని యూపము మొదలగునవి సూర్యాది- శబ్దములతో నమాన రూపాది గుణముల సంబంధము వలననే చెప్పఁబడుచున్నవి కాని ముఖ్యములుగా చెప్పఁబడుటలేదు. అట్లే ఈ సందర్భమునను "తత్తేజ ఐక్షత" ఇత్యాది వాక్యముల యందు నచేతనములగు తేజస్సు మున్నగువానికి చేతనధర్మమగు ఈక్షణము సంబంధింపదు కావున తేజః ప్రభృతి శబ్దములతో తేజస్సు మున్నగువానికి నాశ్రయమైన బ్రహ్మము గుర్తింపఁబడును. "మంచాః క్రోశంతి" అనుచో మంచములపై నధిష్ఠించువారిని మంచ శబ్దము తెలుపుట యిట గమనింపఁదగినది.

అందువలన ఆకాశాదిశబ్దములు తదాశ్రయమైన బ్రహ్మమును గౌణముగా చెప్పునని యంగీకరింపఁదగును కాదా ?

ఉత్తరము : చరాచరములైన వస్తువుల నుద్దేశించి చెప్పఁబడు ప్రతిశబ్దంబును బ్రహ్మమునందు గౌణమైనది కాదు. ముఖ్యంబేను ;

ఇందుకు ప్రమాణము-

"తేషాం ఖల్వేతేషాం భూతానాం త్రీణ్యేవ బీజాని భవంతి, అండజం జీవజ ముద్భిజ్జమితి. సేయం దేవతైక్షత హంతాహ మిమా స్తిస్రో దేవతా, అనేన జీవేనాత్మనాఽను ప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి"

"ఆ యా ప్రాణులకు బీజములు మూడే యగుచున్నవి. అండజమనియు జీవజమనియు ఉద్భిజ్జమనియు అవ్వాని నామధేయములు. ఆ పరబ్రహ్మము ఈ ముగ్గురు దేవతల నగుదునని సంకల్పించెను. మరియు ఈ జీవుని ద్వారా చరాచరమునందు ప్రవేశించి యన్నిటికిని నామరూపముల నేర్పరతును గాక"

ఇట్లు వస్తువులన్నిటికిని నామరూపముల విభాగమునకై ఆయా వస్తువులలో నంతర్యామిగా ప్రవేశించు బ్రహ్మముతో నేకీభావముండుటఁజేసి చరాచర గత శబ్దములన్నిటియందును బ్రహ్మము ముఖ్యంబే యగుచున్నయది.

యూపాది శబ్దములైతేనో ఆదిత్యాదిశబ్దములతో చెప్పఁబడుటకు వలయు నుపపత్తి (సమర్థనము) గానంబడుటలేదు. ఇఁక మంచాదులయందు పురుషులు ఉన్నంత మాత్రమున పురుషులు మంచాది శబ్దవాచ్యులగుటకు వీలులేదు. మఱియు

బ్రాహ్మణాది శరీరమునందు ప్రవేశించిన జీవాత్మ బ్రాహ్మణాదిశబ్దముతో చెప్పఁబడుట ముఖ్యమగునట్లు సర్వాంతర్యామియగు పరమేశ్వరుని చరాచర శబ్దములన్నియు ముఖ్యముగా చెప్పుననుట సమంజసంబే యగుచున్నది.

అట్లు కానియెడల "అష్టవర్షం బ్రాహ్మణ ముపనయీత" ఇత్యాదిశ్రుతి వాక్యములు నిరూపించు ఉపనయన సంస్కారము మున్నగునవి-శరీరమాత్రమునందు పర్యవసానముఁజెందుననియై జీవాత్మను సంస్కరించునవి కాకుండును. అట్టితఱి "యస్యైతే చత్వారింశ త్సంస్కారాః, అష్టౌ చాత్మగుణాః, స బ్రహ్మణః సాయుజ్యం" ఇత్యాదిశ్రుతులు-జాతకర్మ మొదలగు నలుబది సంస్కారములు ఎనిమిది ఆత్మగుణంబులు నెవనికి గలవో వాడు బ్రహ్మ (శివ) సాయుజ్యమును

పొందువాడగును అని బోధించు ఫలస్వరూపంబు వ్యర్థ మగుచున్నయది. మఱియు "బ్రాహ్మణో యజేత" ఇత్యాది విధి వాక్యంబులును నిరర్థకములగు చున్నయవి.

అందువలన చరములు అచరములు నగు వస్తువులన్నిటిఁదగు శరీరముల యందు ప్రవేశించు బ్రహ్మము- ఆ యా చరాచరశబ్దములతో వక్కాణింపఁబడుట ముఖ్యంబే యని సిద్ధాంతము.

## ఆత్మాఽధికరణము

సూ. "నాత్మా శ్రుతే ర్నిత్యత్వాచ్చ తాభ్యః" 2-3-18

ఆకాశము మొదలగునవి బ్రహ్మమునుండి జన్మించుచున్నవని పూర్వాధికర ణములయందు నిరూపింపఁబడినది. అదే రీతిగా జీవాత్మయు బ్రహ్మమునుండి యుదయించునా లేదా అని సందేహము.

ప్రశ్న : జీవుఁడు ఆకాశాదులవలె బ్రహ్మమునుండి పుట్టువాడేను; ఎట్లనఁగా? "యదా తమ స్తన్నదివా న రాత్రి ర్నసన్న చాస చ్ఛివ ఏవ కేవలః" "ఏక మేవాద్వితీయమ్" ఇత్యాది శ్రుతులు - సృష్టికి మున్ను బ్రహ్మమొకటే యుండెననియు సత్తుగాని అసత్తుగాని లేకుండె ననియు నిర్ధారించినందున సృష్టి కాలమునందు బ్రహ్మమునుండి జీవుఁడు జన్మించుచున్నవాడు ఇందుకు అనువైన అగ్ని విస్ఫులింగ దృష్టాంతమును శ్రుతి దిగువవిధము నిరూపించినది.

"యథాఽగ్నేః క్షుద్రా విస్ఫులింగా వ్యుచ్చరంతి, ఏవ మేవైతస్మా దాత్మనః సర్వే ప్రాణాః సర్వే లోకాః సర్వే దేవాః సర్వాణి భూతాని సర్వ ఏవా త్మానో వ్యుచ్చరంతి"

"అగ్నినుండి చిన్న మిణుగురులు (విస్ఫులింగములు) ఉదయించునట్లు పరమాత్మనుండి ప్రాణులు లోకములు దేవతలు భూతములు జీవాత్మలు అన్నియు పుట్టుచుండును."

అందువలన అగ్నినుండి విస్ఫులింగములు ఉదయించునట్లు బ్రహ్మము నుండి జీవాత్మలు జన్మించుచున్నవారని చెప్పుటయే సమంజసంబగును కాదా?

ఉత్తరము : ఆత్మ పుట్టునది కాదు. "న జాయతే మ్రియతే వా విపశ్చిత్" అను శ్రుతియు "నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానామ్" "జ్ఞాజ్ఞౌ ద్వావజా వీశానీశా'' ఇత్యాది శ్రుతులున్ను "జీవుఁడు జనన మరణములు లేనివాఁడనియు నిత్యుఁడనియు చేతనుఁడనియు" చాటుచున్నయవి. సృష్టికి మున్ను బ్రహ్మమొక్కటియే యని నిర్ణయించుట యెందుకనఁగా? పరమేశ్వరునకు స్వరూపమగు జీవునకు గాని అచేతనమునకు గాని నామరూపముల వ్యవహారము ప్రళయకాలమున నుండ నందున నవ్యక్తములుగా పడియుండు చేతనాచేతనములు బ్రహ్మకోటిలోనే చేరి యుండునని ''బ్రహ్మమొక్కటియే యుండెను'' అని శ్రుతి బోధించినది కాని జీవాజీవములు స్వరూపతః ఉండవని బోధింపలేదు. విస్ఫులింగ దృష్టాంతంబును జీవాత్మలకు నామరూపముల అభివ్యక్తి నుద్దేశించి సార్థకంబగునది కాని జీవులు ఉదయించువారని చెప్పునది కాదు. ఒకవేళ అట్లు కాదందురేని వెనుక చెప్పినట్లు కృతనాశాది దోషములు సంభవించును. కావున బ్రహ్మమునుండి జీవుఁడు పుట్టువాడు కాకుండునని సిద్ధాంతము.

## జ్ఞాధికరణము

సూ. "జ్ఞోఽత ఏవ" 2-3-19

పూర్వాధికరణమునందు జీవాత్మ నిత్యుండని యేర్పడినది. మరల నిచట జీవునకు స్వాభావికమైన జ్ఞానము కలదా లేదా అని సందేహము.

ప్రశ్న : జీవునకు సహజమైన జ్ఞానము లేదనియే చెప్పవలెను. ''జ్ఞాజ్ఞౌ ద్వౌ" అను శ్రుతి-జీవుఁడు జ్ఞానము లేనివాఁడను విషయమును సమర్థించినది. కావున నీ జీవాత్మ- చైతన్యమాత్ర రూపుడై అజ్ఞుడగువాడేను; కాని మాయాశక్తి సంబంధమునఁజేసి శరీరేంద్రియాదులఁ జెందినవాడై ''ఘటోఽయం, పటోఽయం, మనుష్యోఽహం, దేవోఽహం, అను నహంకారమును కల్పించుకొని సంసారమునఁ బ్రవర్తించువాడగుటచే సంసారిదశయందు మాత్రము జీవునకు జ్ఞానము కలదనియు స్వయముగా జ్ఞాత కాజాలడనియు భావింపవలసి యున్నది. అట్లు కానిచో జీవునకు ముక్తి కలుగుటయు దుర్ఘటమగును కాదా?

ఉత్తరము : ఈ జీవాత్మ జ్ఞాత యగువాడేను; "అథ యోవేదేదం జిఘ్రాణీతి స ఆత్మా" "ఇద్దాని వాసనఁ జూచుచున్నానని తెలిసికొనువాడు ఆత్మ యనఁ

బడును." "మనసైతాన్ కామాన్ పశ్యన్ రమతే య ఏతే బ్రహ్మలోకే" "ముక్తుడైన ఆత్మ శివలోకమునందు కోరికల నన్నిటిని మనస్సుతోడనే అనుభవించుచు ఆనందించును'' "మనోఽస్య దైవం చక్షుః'' "జీవునకు గల మనస్సు - దివ్యమైన జ్ఞాననేత్ర మగును" ఇత్యాది శ్రుతుల ననుసరించి జీవుని సహజధర్మమగు జ్ఞానమే అప్రాకృతమగు మనస్సుగా గుర్తింపఁబడుచున్నది కావున నీతడు స్వయముగా జ్ఞాత యగు వాడేను;

''మాయాశక్తి సంబంధమున జీవునకు సంసారిదశయందు జ్ఞాతృత్వ మేర్పడు''నని చెప్పిన యంశము యథార్థంబగునదియేను; ఎట్లనఁగా ? జీవుఁడు సహజమైన జ్ఞానముఁదగు వికాసమును మాయాశక్తి సంబంధమువలన మఱుగు పఱచుకొని ప్రాకృతమైన మనస్సు కలవాడై సుఖదుఃఖములను గురుతెఱగుటయు అనుభవించుటయు శరీరగతమగు అహంకారమున మాత్రము విశ్రాంతిఁజెందుచు సంసారమునఁ బ్రవృత్తుడగుటయు గమనింపఁదగినవి.

ఇఁక ఎప్పుడైతే ఈతడు బ్రహ్మజ్ఞానాత్మకమైన ఉపాసన నభ్యసించుచు చరమదశఁ జెందినవాడై మలత్రయమును పోగొట్టుకొనునో అప్పుడు బ్రహ్మసాక్షాత్కారము గలవాడై బ్రహ్మముతో సమానముగ నిజనిరతిశయ జ్ఞానధర్మములను బయలుపఱచుకొని ముక్తుడనఁబఱగుచున్నవాడు.

మఱియు ''ప్రాణారామం మన ఆనందమ్" అను వాక్యముఁబట్టి బ్రహ్మమునకు నిరతిశయమైన ఆత్మానందము విషయముగా గల మనస్సు సహజమైన సాధనముగా కలదని బోధపడుచున్నయది. ముక్తజీవుఁడును శివునితో సమానములైన గుణములు కలవాడగుటఁజేసి స్వరూపమగు ఆనందము ననుభవించుటకు బాహ్యకరణముల యవసరము లేనట్టి మనోరూపమైన అంతఃకరణము సాధనముగ కలవాడగుననియు తేటపడుచున్నయది.

"జ్ఞాజ్ఞౌ" అనుచో చెప్పఁబడిన జీవుని అజ్ఞత్వమును కించిజ్ఞత్వముగా తెలియునది. సంసారికానట్టి పరమేశ్వరుఁడైతేనో సర్వజ్ఞుడగుచున్నవాడు. కావున జీవుఁడు సంసారిదశయందు కించిజ్ఞుఁడు, ముక్తియందు సర్వజ్ఞుఁడు నగుటచే జ్ఞాతయే కాదగునని సిద్ధాంతము.

## ఉత్క్రాంత్యధికరణము

సూ. "ఉత్క్రాంతి గత్యాగతీనామ్" 2-3-20

పూర్వము జ్ఞాతగా నేర్పడిన జీవాత్మకు ఉత్క్రాంతి గమన ఆగమనములు కనఁబడుచున్నందున అణుత్వము ఏర్పడుచున్నయది.

అద్ది యుక్తమగునా కాదా ? అని సందేహము

ప్రశ్న : జీవాత్మ అణువు కాజాలదని "స వా ఏష మహా నజ ఆత్మా"అను శ్రుతి వాక్యము విశదీకరించినది. మరియు ''అహం విశ్వం భువన మభ్యభవమ్" అనుచో జీవుడు "నేను మొత్తం ప్రపంచమును వ్యాపించితినని" తనను విభువుగా ప్రకటించుకొనినందున జీవాత్మ విభువనియే చెప్పవలెను కాదా ?

ఉత్తరము : ఆత్మ- అణువగువాడేను; ఎందుకనఁగా ? జీవాత్మ- శరీరము నుండి బయలుదేరుటయు పరలోకమునకు వెడలుటయు భూలోకమునకు వచ్చుటయు శ్రుతులయందు ప్రతిపాదింపఁబడుచున్నవి.

''తేన ప్రద్యోతే నైష ఆత్మా నిష్క్రామతి" ఉత్క్రాంతిశ్రుతి.

"మరణ సమయములో బయలువెడలు ఒకానొక ఆవిరితో కూడ ఈ జీవుఁడు శరీరమునుండి నిష్క్రమించును"

''యే వైకే చాస్మా ల్లోకా త్ప్రయంతి చంద్రమసమేవ తే గచ్ఛంతి'' గతి శ్రుతి.

''ఈ లోకమునుండి వెళ్ళినవారందరు మొదట చంద్రలోకమునే పొందుదురు"

"తస్మాల్లోకా త్పునరేత్యస్మై లోకాయ కర్మణే" ఆగతి శ్రుతి.

"చంద్రాదిలోకముల నుండి మరల భూలోకమునకు స్వకృత కర్మననుభవించుటకై జీవాత్మలు వచ్చువారు"

జీవుడు విభువు (సర్వవ్యాపకుఁడు) ఐనచో ఉత్క్రాంతి గత్యాగతులు సంభవింపకుండును.

ఒకవేళ జీవుఁడు విభువైనను శరీరవియోగ రూపమైన ఉత్క్రాంతి యేర్పడునని యంగీకరించినను గత్యాగతులు (గమనాగమనములు) మాత్రము సంభవింపఁజాలవని దిగువ సూత్రముతో నిరూపించుచున్నవారు.

సూ, "స్వాత్మనా చోత్తరయోః" 2-3-21

ఉత్క్రాంతి తరువాత నేర్పడు పరలోకగమనము ఇహలోకాగమనము అను వానిని తానే చేయువాడు కావున జీవాత్మ - అణువు కాదగినవాడేను; "మహానజ ఆత్మా" అని చెప్పఁబడిన సందర్భము పరమేశ్వరుని ప్రకరణమగుటచే జీవాత్మను గురించినది కాదని ముందు సూత్రమున నిరూపింపఁబడును. వ్యాపించుటఁ జేసి సమస్త ప్రపంచముఁ జెందియుండుట - జీవాత్మకు మలము అనఁబడు ఆవరణము తొలగుటవలన నిజశక్తిఁదగు కిరణములతో నిండియుండు ముక్తజీవుని విషయమగును కావున జీవాత్మ- అణువగువాడేను;

మరియొక ఆశంకకు సమాధాన మీ దిగువ సూత్రము.

సూ. "నాణు రతచ్ఛ్రుతి చే న్నేతరాధికారాత్" 2-3-22

''స వా ఏష మహా నజ ఆత్మా" "ఆ యీ జీవాత్మ-జన్మ లేనివాడు, గొప్పవాడున్ను'' అను శ్రుతి వాక్యముఁబట్టి "జీవుడు అణువు కాజాలడు" అని చెప్పకూడదు. ఎందుకనఁగా ? ''యస్యాను విత్తః ప్రతిబుద్ధ ఆత్మా'' సర్వజ్ఞుడైన పరమేశ్వరుని జీవాత్మ శ్రవణ మననాదులతో పొందఁజాలును" అనుచో పరమేశ్వరుని ప్రకరణము ప్రారంభింపఁబడినది.

సూ. "స్వశబ్దోన్మానాభ్యాం చ" 2-3-23

"ఏషోఽణు రాత్మా చేతసా వేదితవ్యో, యస్మిన్ ప్రాణః పంచధా సంవివేశ" ''అణువైన జీవుని బుద్ధిబలమున గురుతెఱగవలెను. మరియు, ఈ జీవుని ఆశ్రయించి పంచవిధమైన ప్రాణవాయువు నెలకొనియున్నది" అను శ్రుతియందు జీవుని గురించి అణుశబ్దము ప్రయోగింపఁబడినది. మఱియు "ఆరాగ్రమాత్రో హ్యవరోఽపి దృష్టః" "అతి స్వల్పమైన (సూచ్యగ్రసన్నిభ) స్వరూపముగల మరియొకడు చూడఁబడినాడు" అనుచో జీవుని పరిమాణంబును వక్కాణింపఁబడినది. ఒకానొక వస్తువును అణువుతో సమానమని యుదాహరించి ఆ వస్తు

వుఁ దగు కొలతను చూపుట-ఉన్మాన మనఁబడును.

ఐతే జీవుఁడు అణువైనచో దేహమునంతయు వ్యాపించియుండు బాధ ననుభవించుట యెట్లు పొసగు నను ఆశంకకు సమాధానముగ నీ సూత్రము నుల్లేఖించినవారు.

సూ. "అవిరోధ శ్చందనవత్" 2-3-24

శ్రీగంధపు బిందువు ఒకే ప్రదేశమునందున్నను శరీరమునంతయు వ్యాపించి సుఖమును కలుగఁజేయునట్లు జీవాత్మ (హృదయములో నొకచోనుండు వాడైనను) శరీరగతమైన సుఖమును దుఃఖము ననుభవించువాడగును.

మరియొక ఆశంకకు సమాధానము.

సూ. "అవస్థితివైశేష్యాదితి చేన్నాభ్యుపగమాద్ధృది హి" 2-3-25

ప్రశ్న : చందనము శరీరమున నొకానొకచోట నుండునది కావున శరీరమునంతయు సుఖపెట్టజాలును. జీవుఁడట్లు గాక దేహమునందంతట సంచరించు వాడగుటచే శరీరగతమైన అనుభవమును పూర్తిగా పొందజాలడు గదా ?

ఉత్తరము : జీవాత్మయు శరీరములో "హృది హ్యేష ఆత్మా" "యోఽపి విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంతర్జ్యోతిః పురుషః" అను శ్రుతి వాక్యముల ననుసరించి హృదయమున నివసించునని విశదమగుచున్నందున జీవుఁడు అణువైనను శరీరగత సుఖదుఃఖముల ననుభవింపఁజాలునని చెప్పుటలో విరోధమేమియు లేదు. ఇద్ది మతాంతరము.

స్వమతముఁ జెప్పుచున్నవారు.

సూ. "గుణాద్వా ఽఽ లోకవత్ 2-3-26

లోకములో ఒకానొక మణి—తన ప్రకాశముతో చేరువనుండు వస్తువును వ్యాపించి ప్రకాశింపఁజేయునట్లు జీవుఁడు-స్వగుణమగు జ్ఞానముతో దేహమునంతయు వ్యాపించి సుఖదుఃఖముల ననుభవింపఁజాలును.

జ్ఞానమునకును ఆత్మకును భేదము లేదను ఆశంకకు సమాధాన మీ దిగువ సూత్రము.

సూ. ''వ్యతిరేకో గంధవ త్తథాహి దర్శయతి" 2-3-27

"గంధవతీ పృథివీ" అనుచో పృథివికి గంధము గుణముగా నిర్దేశింపఁబడినట్లు గుణమగు జ్ఞానము గుణియగు ఆత్మకన్న వేఱైయుండును.

''జ్ఞానాత్యేవాయం పురుషః""ఈ పురుషుడు గుర్తెరుగుచున్నవాడేను" అను శ్రుతియు జ్ఞానమునకును ఆత్మకును వ్యతిరేకము (భేదము)ను చూపుచున్నయది.

సూ. ''పృథగుపదేశాత్" 2-3-28

"న విజ్ఞాతృవిజ్ఞాతే ర్విపరిలోపో విద్యతే" అను శ్రుతి-ఆత్మకన్న జ్ఞానము వేరగుటను నిరూపించినది కావున ఆత్మ-నిత్యమైన జ్ఞానము గుణముగా కలవాడని తెలియనగును.

ఇట్లు ఆత్మ జ్ఞానగుణము గలవాడగుచో ఆత్మ జ్ఞానమాత్రమగువాడని నిరూపించుట యెట్లు పొసగునను ఆశంకకు దిగువ సూత్రమును సమాధానముగా చెప్పుచున్నవారు.

సూ. "తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్" 2-3-29

ఆత్మ-జ్ఞానగుణమే సారముగా గలవాడగుటఁజేసి జ్ఞానముగా నిర్దేశింపఁబడును కాని జ్ఞానమాత్రమని కాదు. "సత్యం జ్ఞానం'' ఇత్యాది శ్రుతియందు పరమేశ్వరుఁడును జ్ఞానము సారముగా గలవాడగుటచే జ్ఞానముగా వక్కాణింపఁబడినవాడు. అట్లే జీవాత్మ విషయమని గ్రహింపనగును.

వస్తుతః"సత్యం జ్ఞానం''అనుచో ఉదాత్తమగు చిత్స్వరముతో నిర్దేశింపఁబడు జ్ఞానశబ్దము మత్వర్థీయమగు అచ్ ప్రత్యయము అంతముగా కలదగుటచే జ్ఞానము కలదియను నర్థము గలది యగును. ఐనను జ్ఞానమాత్రముగా పరిగ్రహించుటలో ఎట్టి అనుపపత్తి లేదని పై రీతిని సమర్థింపఁబడినది.

మరియొక ఉపపత్తిఁ జెప్పుచున్నవారు.

సూ. ''యావదాత్మభావిత్వాచ్చ న దోష స్తద్దర్శనాత్"

2-3-30

జ్ఞానము ఆత్మయుండునంతవరకు నుండునదగుటచే జ్ఞానముతో ఆత్మను వ్యవహరించుటలో దోషమేమియు లేదు. లోకమునందును ఇట్టి వ్యవహారమును గాననగును.

గోత్వము మొదలగునవి స్వరూపానుబంధి ధర్మములగుటచే ఖండితములైన వ్యక్తులయందును నిరూపింపఁబడుచున్నవి, కావున జ్ఞానమనెడు ధర్మము ఆత్మ స్వరూపము ననువర్తించునదగుటఁజేసి జ్ఞానముగా ఆత్మ నిర్దేశింపఁబడినదని భావము.

జ్ఞానమువలె ఆత్మ స్వప్రకాశమగుటచే జ్ఞానశబ్దముతో వ్యవహరింపఁబడుచున్నదని సూత్రములోని చకారము తెలుపుచున్నయది.

సుషుప్తి (గాఢనిద్ర) మొదలగువానియందు జ్ఞానము లోపించును కావున జ్ఞానము ఆత్మయుండువరకు నుండుననుట యెట్లు పొసగు నను ఆశంకకు సమాధాన మీ దిగువ సూత్రము.

సూ. "పుంస్త్వాదివత్త్వస్య సతోఽభివ్యక్తియోగాత్" 2-3-31

జ్ఞానము సుషుప్త్యాదులయందు లేదని కాదు. కాని యభివ్యక్త మగుట లేదు. జాగ్రదాదిదశలలో నభివ్యక్తమగును. ఎట్లనఁగా? లోకములో పుంస్త్వమునకు అసాధారణమగు సప్తమధాతువు బాల్యమునందు కలిగియున్నను యౌవనమున నభివ్యక్తమగుటను మనము చూచుచునేయున్నాము. అందువలన జ్ఞానము ఆత్మ స్వరూపానుబంధి యనుట సమంజసంబేను.

ఆత్మ-జ్ఞాతయనియు అణువనియు ప్రతిపాదించుటకు ప్రయోజమును చెప్పుచున్నవారు.

సూ. "నిత్యోపలబ్ధ్యనుపలబ్ధిప్రసంగోఽన్యతర నియమో వాన్యథా" 2-3-32

జీవాత్మ జ్ఞానమాత్రమగునను పక్షమున జీవాత్మయు జ్ఞానంబును నిత్యములగుటచే జ్ఞాన సంకోచము లేమింజేసి జ్ఞానము జీవాత్మకు ఎల్లకాలము ఉపలబ్ధ్యము కావలసివచ్చును. ఒకవేళ శరీరములో జ్ఞానముకలిగి బాహ్యమున మనఃసంయోగాదులు లేనిది జ్ఞానము కలుగనివాడు ఆత్మయని యందురేవి అట్లుగూడ

సర్వకాలము జీవునకు శరీరబాహ్యమునందు జ్ఞానము అనుపలభ్యము కావలసి వచ్చును. ఆగంతుక జ్ఞానమే జీవాత్మయను పక్షమునను పూర్వోక్త దోషమే సంభవించును. మీవాదమున ఆత్మలన్నియు సర్వగతములు కావలసివచ్చును గావున జ్ఞాననిమిత్తములగు మనఃసంయోగాదులు సర్వసాధారణములగును. అదృష్టముఁబట్టి మనఃసంయోగము ఏర్పడి స్వజ్ఞానమును కలిగించు నందురేని అదియు పొసగదు. అదృష్ట హేతువులున్ను సర్వసాధారణము లగుటఁజేసి యవ్విధము చెప్పుటవలన గూడ ఒకానొక నియమము ఏర్పడకుండును. ఇక ఉపలబ్ధికి అనుపలబ్ధికిని విరోధముండుటఁజేసి యుపలబ్ధికేగాని అనుపలబ్ధికే గాని కారణములు సంభవించునని యంగీకరింపక తప్పదు. అట్లైనచో ఏదేనొకదానిని గురించి నియమము కావలెను. కావున పూర్వోక్తమగు "సంకోచ వికాసములు గల జ్ఞానము గుణముగా గలవాడు అణువగువాడున్ను ఆత్మ యను నంశమే సమీచీనంబైనది.

ఇఁట నొక సారాంశము.

"ఉత్క్రాంతిగత్యాగతీనాం" "స్వాత్మనా చోత్తరయోః" అను సూత్రములయందు వ్యాసభగవానుఁడు జీవునకు అణుత్వమును సాధించి జీవుఁడు అణువగునెడ సకల శరీరవ్యాపి యెట్లగునను ఆశంకకు ''అవిరోధశ్చందనవత్" అను సూత్రమున శరీరైకదేశమునందున్నను చందనబిందువు శరీరమునంతయు వ్యాపించి ఆహ్లాదింపఁజేయునట్లు జీవుఁడు హృదయమునందుండువాడై చైతన్య గుణము ద్వారా సకలశరీరవ్యాపి కాఁజాలునని సమాధానము సమర్థింపఁబడినది. చైతన్య (జ్ఞాన)ము అగు గుణమునకు గుణియగు జీవాత్మకును భేదము "పృథగుపదేశాత్" అను సూత్రమున వక్కాణింపఁబడినది. విజ్ఞానము గుణమగునెడ "విజ్ఞానం యజ్ఞం తనుతే'' "జ్ఞానము యజ్ఞాది సత్కర్మలను చేయును" అనుచో ఆత్మజ్ఞానాభిన్నము అను వ్యవహారము ఎట్లు పొసగునను ఆశంకకు సమాధానముగా "తద్గుణసారత్వాత్తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్'' అను సూత్రము చెప్పఁబడినది.

సచాసౌ గుణశ్చ తద్గుణః, తద్గుణః సారో యస్య సః తద్గుణసారః, తస్య భావః తద్గుణసారత్వం, తస్మాత్ తద్వ్యపదేశః-జ్ఞానాత్మనా జీవస్య వ్యపదేశః;

జ్ఞానగుణము శ్రేష్ఠముగా కలవాడగుటఁజేసి జీవుని జ్ఞానముగా "విజ్ఞానం యజ్ఞం తనుతే" ఇత్యాదిని వ్యవహరించినారని సూత్రార్థము.

సర్వజ్ఞుడైన పరమాత్మ జ్ఞానగుణము సారముగా కలవాడగుటచే జ్ఞానముగా "ప్రజ్ఞానం బ్రహ్మ" ఇత్యాది వాక్యములయందు వ్యవహరింపఁబడుట యుక్తంబేను, కాని జీవుఁడు జ్ఞానము గుణము కలవాడగుచో జ్ఞానముతో బేదములేనివాడను వ్యపదేశమును సమర్ధించుట యెట్లను ఆకాంక్షకు సమాధానముగా "నిత్యోపలబ్ధి" ఇత్యాది సూత్రము ప్రవర్తించినదని తెలియనగును.

## కర్త్రధికరణము

జీవాత్మ- జ్ఞాతయనియు అణువనియును పూర్వాధికరణమునందు చెప్పఁబడినది అట్టితటి జీవునకు కర్తృత్వము పొసగునా లేదా అని సందేహము పొడముచున్నయది.

ప్రశ్న : జీవుఁడు కూటస్థుడగుటచే కర్త యెట్లగును? బుద్ధియైనను ప్రకృతియైనను కర్త కాదగును. బుద్ధి లేక ప్రకృతిఁదగు కర్తృత్వ ధర్మమును జీవుఁడు తనయందారోపించుకొని కర్తవలె కనఁబడుచుండువాడు. అందువలన జీవాత్మకు కర్తృత్వము పొసగుట లేదు గదా ?

ఉత్తరము : జీవాత్మ కర్త యగువాడేను. "ఇదం కురు! ఇదం మాకురు!" అను శాస్త్రార్థమంతయు జీవునియందే సార్థకమగునది. ఒకవేళ జీవాత్మ కర్త కాదందురేని విధినిషేధ శాస్త్రము విఫలము కావలసి వచ్చును. కర్తయగువాడే శాస్త్రముచే నియోగింపఁబడును. భోక్తయగువాడే కర్త యగును. "శాస్త్రఫలం ప్రయోక్తరి" "శాస్త్రముచే చెప్పబడు ఐహిక ఆముష్మిక ఫలమంతయు చేయువానియందు ఉపయోగించును" అను న్యాయము ననుసరించి కర్తయగు జీవాత్మయే సుఖదుఃఖముల ననుభవించువాడగును. బుద్ధి గాని ప్రకృతి గాని యచేతనములగుటచే నవ్వానికి భోక్తృత్వము సరిపడకుండును. మరియు జీవునకు ప్రబోధము కలిగించుట ద్వారా శాస్త్రము ప్రేరకంబగునది. అచేతనములైన బుద్ధి ప్రకృతులకు ప్రబోధము కలుగఁజాలదు గదా ! భోక్తయగుటను బోధనీయుఁడగుటఁ జేసియు జీవాత్మనే శాస్త్రము నియోగించుచున్నది. కావున జీవుడే కర్తయగుట సముచితంబగును.

"అసంగో హ్యయం పురుషః" అను శ్రుతి వాక్యము - జ్ఞాన కార్యరూపముగా తానే పరిణమించువాడు జీవాత్మ కాదు- అను అర్థము గలదిగా సమంజసం

బగుచున్నయది. "య ఏనం వేత్తి హంతారం" ఇత్యాది స్మృతియు "శరీరము నతిక్రమించియుండు ఆత్మ - చంపఁదగినవాడు కాకుండుటచే ఆత్మను చంపుదు నను అభిమానము భ్రమరూపమైనదను వివరణముతో సార్ధకంబగునది.

సూ. "ఉపాదానా ద్విహారోపదేశాచ్చ" 2-3-34

"సయథా మహారాజో జానపదాన్ గృహీత్వా స్వే జనపదే యథాకామం పరివర్తతే, ఏవ మేవైష ఏతాన్ ప్రాణాన్ గృహీత్వా స్వే శరీరే యథాకామం వరివర్తతే" "ఒకానొక మహారాజు ప్రజలను చేరదీసి తన దేశమున స్వేచ్ఛాను సారము విహరించునట్లు జీవాత్మయు ఇంద్రియములను పరిగ్రహించి తన శరీర ములో స్వప్నము (నిద్ర) నందు యథేష్టము విహరించును" అను శ్రుతియందు ఇంద్రియగ్రహణమను ఉపాదానము, మరియు స్వప్నసంచారమను విహారమున్ను ఉపదేశింపఁబడినందున ఇట్టి ఉపాదాన విహారములు బుద్ధికి గాని ప్రకృతికి గాని సరిపడనందునను జీవాత్మయే కర్తయగువాడు.

బుద్ధి ప్రకృతులకు కర్తృత్వము కలదను పక్షమున బుద్ధికి చెప్పఁబడు కర్తృత్వమును దిగువ సూత్రమున నిరాకరించుచున్నవారు.

సూ. "వ్యపదేశాచ్చ క్రియాయాం, నచే, న్నిర్దేశ విపర్యయః" 2-3-35

"విజ్ఞానం యజ్ఞం తనుతే" ఇత్యాది శ్రుతియందు యజ్ఞాదిక్రియల విషయ మున విజ్ఞానరూపుడైన జీవాత్మకు కర్తృత్వము చెప్పఁబడినందున జీవుఁడే కర్త యగువాడు. "ఇట విజ్ఞాన శబ్దము బుద్ధిఁజెప్పును కాని ఆత్మఁజెప్పదు" అనుచో అట్లు కాదు. విజ్ఞానశబ్దము బుద్ధివాచకమగునెడ పై శ్రుతియందు "విజ్ఞానేన" అని నిర్దేశము మరియొకవిధముగా నుండవలెను.

ఇంకనొక శ్రుతియందు బుద్ధిప్రసంగమున విజ్ఞాన శబ్దమునకు కరణ (తృతీయా విభక్తి) నిర్దేశము కనఁబడుచున్నయది. "తదేషాం ప్రాణానాం విజ్ఞా నేన విజ్ఞాన మాదాయ" "స్వప్నదశ యందు చక్షురాది ఇంద్రియములఁదగు గ్రహణశక్తిని బుద్ధితో పరిగ్రహించును జీవాత్మ" యని శ్రుత్యర్థము.

ఇందువలన బుద్ధి - కరణ (సాధన) మగుటచే కర్త కాజాలదని సారాం శము,

ప్రకృతి కర్తయను వాదమును దిగువ సూత్రముతో నిరాకరించుచున్నవారు.

సూ. "ఉపలబ్ధివదనియమః" 2-3-36

ప్రకృతి కర్త యగునెడ నయ్యది సర్వసాధారణ మగుటచే పూర్వోక్త మైన (ఆత్మ సర్వగతమగునెడ నదృష్టము మనః సయోగము మొదలగునవియు అందరికిని ఏకరూపములగుటచే నియమము లేనట్లు) ఉపలబ్ధికి వలె ప్రకృతి విషయమునను ఫలముఁదగు నియమము లేకుండును.

సూ. "శక్తి విపర్యయాత్" 2-3-37

ప్రకృతి కర్తయగునెడ "కర్త యగునదియే భోక్తయగును" అను నియమము ననుసరించి ప్రకృతియే కర్మఫలము ననుభవించునది కావలసి వచ్చును. కావున జీవాత్మకు గల భోక్తృత్వశక్తి క్షీణించునదగును.

సూ. "సమాధ్యభావాచ్చ" 2-3-38

ప్రకృతి కర్త యగునెడ సమాధియందును ప్రకృతియే కర్త కావలసి వచ్చును. ఇట్టితఱి సమాధియందు ప్రకృతిపురుషవివేకము గలిగి పురుషుఁడు తనను ప్రకృతికన్న వేరువానిగా భావింపఁజాలడు గావున సమాధి యనునదియే సిద్ధింపకుండును.

సూ. యథా చ తక్షోభయథా" 2-3-39

ఆత్మ కర్త యగునెడ తన యిష్టముండినచో చేయును. లేకున్న చేయకుండును. వడ్రంగి బాడిస మున్నగు పనిముట్లు చెంత నున్నను స్వకార్యమునందు స్వేచ్ఛ ననుసరించియే ప్రవర్తించును. లేనిచో ప్రవర్తింపడు గదా! బుద్ధియే ఇచ్ఛ కలిగినచో ప్రవర్తించుననుట - సరికాదు. ఇచ్ఛయనునది చేతనుని ధర్మమగును. అందువలన ఆత్మయే కర్తయగుననియు బుద్ధిగాని ప్రకృతి గాని కర్తలు కాజాలవనియు సిద్ధాంతము.

## పరాయత్తాఽధికరణము

సూ. "పరాత్తు తచ్ఛ్రుతేః" 2-3-40

ఆత్మ- కర్తయనియు జ్ఞాతయనియు పూర్వాధికరణమునందు ప్రతిపాదింపఁబడినది. అట్టి కర్తృత్వము స్వాధీనమైనదా? లేక ఈశ్వరాధీనమైనదా? అని సందేహము.

ప్రశ్న : జీవుని కర్తృత్వము స్వాధీనమైనది. అట్లు కానిచో ఇష్టములైనట్టియు అనిష్టములైనట్టియు కార్యముల యందు జీవుని ప్రవర్తింపఁజేయు పరమేశ్వరుఁడు వైషమ్యము మొదలగు దోషములఁ గూడినవాఁడగును. మఱియు జీవుని ప్రవర్తనము ఈశ్వరాధీనమగునెడ జీవునికి కర్తృత్వము లేకుండును. విధినిషేధములు వ్యర్థములగును. కావున జీవుని ప్రవృత్తి యంతయు స్వాధీనమైనదనియే చెప్పవలెను కాదా?

ఉత్తరము : జీవుని కర్తృత్వము పరమేశ్వరుని యధీనమైనది కాని స్వాధీనము కాజాలదు. "య ఆత్మాన మంతరో యమయతి" "పరమాత్మ జీవాత్మలోనుండువాఁడై జీవాత్మను ప్రేరేపించును" అను శ్రుతివాక్యంబు పై యంశమునే సమర్థించుచున్నయది.

జీవుని శుభాశుభముల యందు ప్రవర్తింపఁజేయు పరమేశ్వరునకు వైషమ్యాదికము సంభవించుననియు జీవుని గురించి చెప్పఁబడిన విధినిషేధములు నిరుపయోగములగుననియు చేయఁబడిన ఆశంకకు సమాధానమీ దిగువ సూత్రము.

సూ. "కృత ప్రయత్నాపేక్షస్తు విహిత ప్రతిషిద్ధా వైయర్థ్యాదిభ్యః" 2-3-41

జీవుఁడు తాను పూర్వజన్మలయందు చేసిన కర్మఁదగు విపాకము ననుసరించు స్వేచ్ఛతో ప్రవృత్తికిని నివృత్తికిని నిదానములగు పనులయందు ప్రవర్తించువాఁడగును. ప్రవృత్తి నివృత్తి హేతువు జీవకృతంబునగు ప్రయత్నమును కనుగొని యట్టి కార్యములయందు తాననుమతి నిచ్చుట ద్వారా జీవుని ప్రవర్తిం-

పఁజేయువాఁడు పరమేశ్వరుఁడు కావున ''ఇదం కుర్యాత్'' "ఇద్దానిని చేయవలెను" అను విధియు "ఇదం మా కుర్యాత్'' "ఇద్దానిని చేయకూడదు" అను నిషేధంబును వ్యర్థములు కాజాలవని పరమేశ్వరుఁడు గావించు అనుగ్రహ నిగ్రహములు మున్నగువాని వలన తేటపడుచున్నయది.

లోకమున గొప్ప బరువు గల పాషాణము కట్టి మున్నగు వానిని లేపుటయందు ప్రవృత్తుడైన బాలుఁడు బలవంతుల తోడ్పాటు కలిగియున్నను తన ప్రయత్నము విషయమై చేయుటకు చేయకుండుటకును తగియున్నట్లు జీవుఁడు పరమేశ్వర సహాయుఁడైనను తానే విధి నిషేధములకు పాత్రుడగుచున్నవాఁడు. ఇందువలన పరమేశ్వరుఁడు జీవుఁడు గావించు ప్రయత్నము ననుసరించి పుణ్య పాపముల యందు ప్రవర్తింపఁజేయువాడగుటచే పరమేశ్వరుఁడు వైషమ్య (పక్షపాత) ముఁజెందువాడు కాదని తెలియునది. జీవుఁడును శుభాశుభ కర్మలయందు పూర్వకృతము ననుసరించి స్వతంత్రముగా ప్రవర్తించువాడగుటచే విధినిషేధములు మున్నగువాని వైయర్థ్యము సంభవింపదని విశదమైనది.

జీవుని పూర్వకర్మయు పరమేశ్వరునితో చేయించఁబడిన తత్ పూర్వకర్మ ననుసరించిన స్వేచ్ఛకు లోఁబడియుండునది కావున నీ కర్మప్రవాహము అనాదియని తెలియునది.

శాస్త్రీయ విధిఁబట్టి ఇష్ట సాధనమని గుర్తించి యట్టి కార్యమునందు ప్రవర్తించు జీవునకు సహకరించువాడు మాత్రము పరమేశ్వరుఁడగును. కాని రాజాభృత్యునివలె నియమించువాడు కాడు. అందువలననే పరమేశ్వరుఁడు అనుమంతయే కాని కారయిత కాదని శ్రుతి స్మృత్యాది ప్రమాణములు నిర్ణయించినవి.

## అంశాధికరణము

సూ. ''అంశో నానావ్యపదేశా దన్యథా చాపి
దాశ కిత వాదిత్వ మధీయత ఏకే" 2-3-42

జీవుఁడు_నిత్యుఁడనియు జ్ఞాత యనియు అణువనియు కర్తయనియు పరమేశ్వరుని సహాయమును కోరు ప్రవృత్తి గలవాడనియు పూర్వాధికరణముల యందు నిరూపింపఁబడినది.

అట్టి జీవాత్మ - పరమేశ్వరుడేనా ? లేక పరమేశ్వరుని అంశమా ? అని సందేహము.

ప్రశ్న : పరమేశ్వరుఁడే జీవాత్మ యగు నందుము. ఎట్లనఁగా ? పరమాత్మయే అనేకవిధములగు ఉపాధుల సంబంధమునఁజేసి జీవభావమును పొందినవాడుగా కనఁబడును. ఆకాశ మొక్కటి యైనను ఘటము మొదలగు ఉపాధుల వశమున నానావిధము గాను పరిచ్ఛిన్నము గాను గోచర మగుచుండును కదా ! ఇందువలననే శ్రుతియు "అయమాత్మా బ్రహ్మ" "ఈ జీవాత్మ బ్రహ్మంబేను" అని వక్కాణించుచున్నయది. కావున పరమేశ్వరుఁడే అజ్ఞానవశమున జీవుఁడగుచున్నవాడు కాదా ?

ఉత్తరము : జీవాత్మ- పరమేశ్వరుని యంశము గలిగిన ఒకానొక మూర్తి యని సిద్ధాంతము. "అనేన జీవేనాఽత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" "ఈ జీవాత్మ ద్వారా స్థూలప్రపంచమునఁ బ్రవేశించి నామరూపములను ప్రతివస్తువునకు ఏర్పరతును."

"య ఆత్మని తిష్ఠన్" "జీవాత్మలో పరమేశ్వరుఁడు ఉండువాడు" "పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా" "తనను, తన్ను ప్రేరేపించు పరమాత్మను వేరుగా భావించువాడు ముక్తుఁడగును." "మాయాం తు ప్రకృతిం విద్యా - న్మాయినం తు మహేశ్వరమ్, తస్యావయవభూతేన-వ్యాప్తం సర్వమిదం జగత్" "పరమేశ్వరుని ఎప్పుడు నెడబాయనందున మాయ యనఁబడు ఆదిశక్తిని జగత్కారణము (జనని) గాను మహేశ్వరుని మాయాధిష్ఠాతగాను తెలిసికొనవలెను. మాయావిశిష్టుడైన మహేశ్వరుని యంశమగు పురుషునితో నీ జగమంతయు వ్యాపింపఁబడినది." ఇత్యాది శ్రుతులయందు జీవేశ్వరులకు భేదము (నానాత్వము) చెప్పఁబడినది. "అయమాత్మాబ్రహ్మ" అను వాక్యముఁబట్టి బ్రహ్మమునకే జీవత్వమని వక్కాణించిన యంశము సరి కాదు. మఱియు "తత్త్వమసి" "అయమాత్మాబ్రహ్మ" ఇత్యాది శ్రుతులు జీవబ్రహ్మములకు వ్యాప్యవ్యాపకభావముద్వారా అనన్యత్వ (అభిన్నత్వ) మును సమర్థించుచున్నయవి. ఇవ్విధమైన అనన్యత్వమును ఆధర్వణికులు "బ్రహ్మదాశా బ్రహ్మ దాసా బ్రహ్మేమే కితవా ఉత" "బ్రహ్మము జాలరులనియు బ్రహ్మము బంట్రోతులనియు బ్రహ్మము జూదరులనియు" ఇత్యాది శ్రుతివాక్యములఁజదువుచున్నవారు. ఐతే జీవుడు బ్రహ్మాంశంబైనను బ్రహ్మముతో వ్యాపింపఁబడి

యున్నందున బ్రహ్మముగా నిర్దేశింపఁబడుట సమంజసంబే నగుచున్నది. లోక మున నగ్నితో వ్యాపింపఁబడు కాష్ఠాదికము వహ్నిగా వ్యవహరింపఁ బడినను వహ్ని కాష్ఠములు భిన్నములుగానే గుర్తింపఁబడుచున్నవి. అందువలన జీవుఁడు బ్రహ్మముఁదగు అంశమునయ్యే బ్రహ్మస్వరూపమును పొందువాడగును. బ్రహ్మము నకే అజ్ఞానము అవహించి జీవభావ మేర్పడు ననుటయందు బహుశ్రుతులు విరో ధించుట మున్నగు దోషములు యనివార్యంబులగును.

శరీర శరీరిభావముఁబట్టి యొకానొక జీవాత్మ "అయంబ్రాహ్మణః" ఇత్యాది వ్యపదేశముఃబొందునట్లు "అయమాత్మాబ్రహ్మ" అను వ్యవహారంబు నుపపన్నంబే యగునని సారాంశము.

సూ. "మంత్రవర్ణాత్" 2-3-43

"పాదోఽస్య విశ్వాభూతాని" అను పురుషసూక్త వాక్యము జీవుఁడు బ్రహ్మాంశంబని తేటపఱచినది. "మాయాంతు ప్రకృతిం విద్యాత్" ఇత్యాదిశ్రుతియు మాయ-జగత్ప్రకృతియనియు, మహేశ్వరుఁడు మాయావిశిష్టుడనియు సర్వజగంబు మాయావిశిష్ట మహేశ్వరుని యంశంబనియు విశదీకరించినది.

(ఇట పురుషసూక్తవచనము మంత్రాంతరంబు నేకార్థములని తెలిపినందున పురుషసూక్తంబు శివపరమగునని కోవిదులు గమనింతురుగాత !)

ఏవమాది సందర్భమువలన మాయియగు మహేశ్వరుని యంశలేశంబే జీవుఁడని గ్రహింపనగును.

సూ. "అపిచ స్మర్యతే" 2-3-44

శ్లో॥ ఆత్మా తస్యాష్టమీ మూర్తిః-శివస్య పరమాత్మనః,
వ్యాపికేతరమూర్తీనాం-విశ్వం తస్మాచ్ఛివాత్మకమ్.

"పరమాత్మయగు శివుని ఎనిమిదవ మూర్తియే జీవాత్మయగును. అట్టి జీవాత్మ-పృథివ్యాది మూర్తుల నేడిటిని వ్యాపించియుండువాడు కావున విశ్వ మంతయు శివమయముగానే భావింపఁదగినది."

అను స్మృతిప్రమాణమునఁజేసి శివుని మూర్తిలో నొకభాగము ఆత్మయని గుర్తెరుగవలెను.

సూ. "ప్రకాశాది వత్తు నైవం పరః" 2-3-45

జీవుఁడు బ్రహ్మాంశంబైనను ఎట్టి స్వరూపముగలవాడో ఎట్టి స్వభావము గలవాడో అట్టి స్వరూపస్వభావములు పరమేశ్వరునకు ఉండవని తెలియునది. ఐతే పరమేశ్వరుఁడు సర్వజ్ఞత్వాదులతో కూడినవాడై జీవవిలక్షణుఁడగుచున్నవాడు. ఎట్లనగా ? ప్రకాశముతో కూడిన మణి మొదలగువానిలో ప్రకాశము విశిష్టైకదేశమై అంశమగునట్లు బ్రహ్మము జీవశరీరుఁడగుటఁజేసి జీవుఁడు బ్రహ్మముఁదగు నంశమగుచున్నవాడు. సూత్రములోని ఆదిశబ్దమువలన విశేషణమగుటయే స్వభావముగా గల జాతిగుణాదులు గ్రహింపఁబడుచున్నవి. విశేషణములు విశిష్టైకదేశములై విశేష్యముఁదగు సంశములగుచున్నందున విశేషణవిశేష్యములకు స్వరూపము భిన్నంబగుట విరుద్ధము కాజాలదు.

"య ఆత్మని తిష్ఠన్" ఇత్యాదిశ్రుతులు జీవేశ్వర భిన్నత్వమునే నిరూపించుచున్నయవి.

సూ. "స్మరంతి చ" 2-3-46

శ్లో॥ విగ్రహం దేవదేవస్య-జగదేత చ్చరాచరమ్,
ఏతమర్థం న జానంతి-పశవః పాశగౌరవాత్.

చరులు (తిరుగాడు ప్రాణులు) అచరములు (స్థిరములగు వృక్షలతాదులు) వీనితో నిండియుండు ప్రపంచము పరమేశ్వరునకు విగ్రహ (స్వరూప) మగును. పశువులు (అజ్ఞానులైన జీవులు) సంసారపాశముఁదగు భారమువలన పై విషయమును (ప్రపంచము శివాత్మకంబని) గుర్తెరుగకున్నవారు. ఇట్లు చరాచరగత జీవులందరును పరమేశ్వరుని శరీరము అగుటచే జీవుఁడు శివాంశమగుననియే విదితమగును. ఇట్టి జీవునితో కూడియుండువాడగుటఁజేసి పరమేశ్వరునకు జీవాత్మకును స్వరూపభేదము అనివార్యంబగుచున్నయది.

సూ. "అనుజ్ఞాపరిహారౌ దేహసంబంధా జ్జ్యోతిరాదివత్" 2-3-47

జీవులందరు బ్రహ్మాంశములైనను ఒకానొకనికి వేదాధ్యయనాదులయందు అనుజ్ఞ నొసగుటయు మరియొకని నిషేధించుటయు ఎట్లు పొసగు నందురేని బ్రాహ్మణాది దేహముల సంబంధమువలన వేదాధ్యయనంబునందనుజ్ఞయు తత్పరి

హారంబునని తెలియునది. లోకములో అగ్ని యొకటే యైనను శ్రోత్రియుని యింట నుండు అగ్నిహోత్రము కర్మార్హమగుటయు శ్మశానాగ్ని అనుపయుక్తం బగుటయు గమనింపదగినవి.

సూ. "అసంతతే శ్చావ్యతిరేకః" 2-3-48

సమంతాత్ తతిః సంతతిః అను వ్యుత్పత్తిఁబట్టి సంతతియనగా విభుత్వము (వ్యాపించుట) అసంతతి యనఁగా అవ్యాప్తి (అణుత్వము) జీవులు ప్రతి శరీరము నందు భిన్నులై ఆయా శరీరముల యందు అణుస్వరూపముతో కూడినవారై వ్యాపించువారు కాకుండుటఁజేసి- స్థూలముగా నున్నవాడను కృశించినవాడను సుఖ పడువాడను దుఃఖించువాడను బ్రాహ్మణుడను క్షత్రియుడను - అను దేహాభిమా నము గలవారై జ్ఞానము సుఖము మున్నగు వానిని సమానముగా కలిగియుందురు. సారాంశమేమన ? దేహాభిమానము గల జీవులందరికి నణుత్వము సమానమగుటఁ జేసి పరిచ్ఛిన్నములు సాంసారికములు నగు జ్ఞాన సుఖాదులు ఏకవిధములై సంకీ ర్ణములు (వ్యాపకములు లేక ఒకటితో నొకటి కలిగినవి) కాకుండును.

ఇట్లు చెప్పుటవలన తేలినదేమనఁగా ? పరబ్రహ్మము నుపాసించుట ద్వారా గురుతెఱగు జ్ఞానవిశేషము వలన దేహాభిమానమును తొలగించుకొని గొప్ప వ్యాప్తి గలవారై "సర్వాత్మకః శివోఽహమ్" అను పరాహంభావము జెందియుండు ముక్త పురుషులకు స్వాభావికములైన జ్ఞానాదులు నిరతిశయములుగాను నిత్య ములుగాను వ్యక్తములగుటచే సాంసారికములగు జ్ఞానాదులకంటె భిన్నములగు చున్నవి.

అజ్ఞానమువలన ఉపాధి సంబంధము వలనను బ్రహ్మము జీవభావమును పొందునని చెప్పఁబడిన యంశము సరియైనది కాదని దిగువ సూత్రములతో నిరూ పించుచున్నవారు.

సూ. "ఆభాసా ఏవ చ" 2-3-49

సత్యమైన ఉపాధితో కూడినది బ్రహ్మంబను పక్షమునను మిథ్యాభూత ఉపాధితో కూడినది బ్రహ్మంబను పక్షమునను బ్రహ్మమునకు జీవభావమేర్పడు ననుటకు చూపఁబడిన యుక్తులు ఆభాస మాత్రములగుచున్నవి.

అసత్యోపాధి - అజ్ఞానము, సత్యోపాధి - శరీరాంతః కరణాదికము, ఇట్టి యుపాధులు భిన్నములైనను ఒకే బ్రహ్మము( జెందియుండునవి. ఉపాధులు భిన్నములైనంత మాత్రమున బ్రహ్మము తద్విశిష్టంబైనను భిన్నము కాజాలదు. భోగాశ్రయములైన ఉపాధులు భిన్నములగుటచే విచిత్రభోగముల ననుభవించు బ్రహ్మ మొక్కటియే యగుటకతన అనేకోపాధిగత జీవచైతన్య భోగములు సంకరము(జెందు ననుట తప్పనిసరి యగుచున్నయది. ఇట్లు నానాశరీరగత భోగములు సంకరములు కావని నిరూపించు యుక్తులన్నియు ఆభాసంబు లగునని సారాంశము.

సూ. "అదృష్టానియమాత్" 2-5-50

సత్యములు మిథ్యాభూతములు నగు ఉపాధులతో కూడియుండు బ్రహ్మమునకే అజ్ఞానము ఉపాధియు కావున అజ్ఞాన ఉపాధులతో చేయ(బడు కర్మలు అదృష్టములుగా పరిణమించునవైనను అజ్ఞానోపాధి విశిష్టము బ్రహ్మమొక్కటియే గావున జీవాత్మలకు అదృష్టములు వేరు వేరుగా ఏర్పడి భోగములు భిన్న భిన్నములుగా నుండునని చెప్పరాదు. అదృష్ట మొక్కటి కావలసివచ్చును. అట్టితఱి జీవులకు చిత్ర విచిత్ర అనుభవములు సరిపడకుండును. కావున బ్రహ్మ జీవాభేద పక్షమున భోగసాంకర్యము అనివార్యంబగునని తెలియునది.

మఱియు

సూ. "అభిసంధ్యాదిష్వపి చైవమ్" 2-3-51

అదృష్ట హేతువులైన సంకల్పానుష్ఠాన శరీరాదుల వలన భోగసాంకర్యము సంభవింపదందురేని పూర్వోక్త న్యాయమే (శరీరాద్యుపాధుల యందు ఉండునది బ్రహంబొక్కటే కావున సంకల్పానుష్ఠానాదులును ఏకరూపములు కావలసి వచ్చుచున్నందున భోగసాంకర్యము తప్పదనుటయే) సరిపడునని భావము.

సూ. "ప్రదేశా దితి చే ద్నాంతర్భావాత్" 2-3-52

ఉపాధుల(జెందిన బ్రహ్మప్రదేశములు భిన్నములగుటచే భోగవ్యవస్థ యేర్పడు నందురేని ఉపాధులు నశించినచో ప్రదేశములన్నియు ఉపాధులతోనే లోపించునవి యగును. అందువలన సత్య మిథ్యోపాధిపరిచ్ఛిన్నమై బ్రహ్మము

జీవభావమును పొందుననుట పొసగకుండుటఁజేసి - జీవుఁడు బ్రహ్మాంశంబై బ్రహ్మలో విశేషణమగుటయే స్వభావముగా కలవాడనుట- సర్వప్రమాణ యుక్తి సహంబైనదని వివేకము.

ఇయ్యది
శ్రీ నీలకంఠ శివాచార్య విరచితమైన
బ్రహ్మ మీమాంసా భాష్యము నందు
రెండవ యధ్యాయముఁదగు మూడవ పాదము
శ్రీ కంఠమణి ప్రభా మయూఖ మను ఆంధ్రానువాదముతో ముగిసినది

---

# శ్రీ నందికేశ్వర పురాణము
## (మోక్షసామ్రాజ్యపథము)

విష్ణుమతస్థులకు స్మార్తులకును ముఖ్యమగు గరుడపురాణం మాదిరి - నందికేశ్వరునకు మహేశ్వరుఁడు చెప్పినట్టి నందికేశ్వర పురాణము - సంస్కృత శ్లోక సంకలనముతో, రచనతోడను, తెలుగర్థము తోడను 12 అధ్యాయాలలో నాచే వ్రాయఁబడి ముద్రింపఁబడనున్నది.

ఇందు జీవాత్మ- మరణవేదన; అంత్యకాలమున చేయవలసిన దాన ధర్మములు, యమలోక భైరవలోకముల వర్ణనములు, మృతులైన పాపాత్ములు మార్గమున అనుభవించు బాధలు; నరకయాతనలు; శివమంత్రమును మాత్రము స్వీకరించినవారికి లభించు మోక్షము; శివలింగధారులైన మాహేశ్వరులకు లభించు శివసాయుజ్యము; లింగదారుల శివాపచారములు, వాని పరిహారము, భస్మరుద్రాక్ష మహిమ; సమాధి సంస్కారావశ్యకత; శివమేధ ప్రాముఖ్యము; కర్తృనిరూపణము; శివనామస్మరణము, శివ పంచాక్షరీమహిమ; శివస్వరూప వర్ణనము; పరమపద మనఁబడు మోక్షసామ్రాజ్యముఁదగు వర్ణనము; సానందోపాఖ్యానము ఇత్యాదులు వ్రాయఁబడినవి, వలయువారు- గ్రంథసన్మానముగ విరాళం పంపగలరని కోరుచున్నాను.

నిర్మల శంకర శాస్త్రి

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ నీలకంఠ భగవత్పాదకృత

# శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

## ద్వితీయాధ్యాయము

### నాలుగవపాదము

### ఆంధ్రీకరణము

# ప్రాణోత్పత్త్యధికరణము

సూ. "తథా ప్రాణాః" 2-4-1

తృతీయ పాదమునందు ఆకాశాది పంచభూతములు పరమాత్మనుండి ఉదయించునవి యనియు జీవాత్మ నిత్యుఁడైనను స్వరూపాన్యథాభావలక్షణము లేని కార్యమగుననియు ప్రసంగవశమున జ్ఞాతృత్వ కర్తృత్వాదులు జీవునకు కలవనియు నిరూపించితిమి. ఇక నిట పంచభూతములకు వలె నింద్రియములకును బ్రహ్మమునుండి యుత్పత్తి కలదా? లేక జీవునకు వలె నిత్యత్వమా? అని సందేహము.

ప్రశ్న : ఎవ్విధము జీవుఁడు నిత్యుఁడగుటఁజేసి యుత్పత్తి లేనివాడో అవ్విధము (తథా) ఇంద్రియములును శ్రుతి ప్రమాణము ననుసరించి యుదయము లేనివై నిత్యములగుచున్నవి. "అసద్వా ఇద మగ్ర ఆసీత్" "సృష్టికిఁబూర్వము జగము అసద్రూపముగా నుండెను" "ఋషయో వావ తే అగ్రే సదాసన్, తదాహుః, కే తే ఋషయ ఇతి, ప్రాణా వా ఋషయః" "సృష్టికి మున్ను ఋషులుండిరి. ఎవరా ఋషులనఁగా? ఋషులనఁగా ప్రాణములు (ఇంద్రియములు) అగును" అను శ్రుతులంబట్టి ప్రాణశబ్దితములైన ఇంద్రియములు ప్రళయకాలమున కలవని విదిత

మగుచున్నందున ప్రాణములు బ్రహ్మమునుండి యుదయింపవని యంగీకరింప వలెను కాదా?

ఉత్తరము :

సూ. "గౌణ్యసంభవా త్తత్ప్రాక్ చ్ఛ్రుతే శ్చ" 2-4-2

సృష్టికి మున్ను ప్రాణములు (ఇంద్రియములు) ఉండజాలవు. పరమేశ్వరుఁడైతేనో "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్" అను శ్రుతి ననుసరించి సృష్టి స్థితి లయ సర్వకాలములయందుండువాడేను; ఋషి శబ్దము ప్రాణశబ్దంబును పరమేశ్వరునే చెప్పునట్టివి. "శివ ఏవ కేవలః" అను శ్రుతియు ప్రళయమున పరమేశ్వరుడొక్కడే నుండువాడని నిర్ధారించినందున సృష్టిపూర్వస్థితి గలవిగా చెప్పఁబడు శబ్దములన్నియు పరమేశ్వరవాచకంబులగునని తెలియునది. పరమేశ్వరుఁ డొక్కడే యగుటచే బహువచనము ఎట్లు పొసగునందురేని "ఋషయః" "ప్రాణాః" అను బహువచనము పరమేశ్వరు నుద్దేశించియే గౌణముగా ప్రయోగింపఁ బడినదని సమన్వయించుట సముచితంబగును. కావున పరబ్రహ్మమే సృష్టికి పూర్వముండు ననియు ఇంద్రియములుండఁజాలవనియు సిద్ధాంతము.

మరియొక రీతిగా సమర్థించుచున్నవారు.

సూ. "తత్పూర్వకత్వా ద్వాచః" 2-4-3

సకలచరాచరములకు నామరూపయోగము - పరమేశ్వరుఁడు గావించు సృష్టియే పూర్వముగా గలదగును. అట్టితటి ప్రాణశబ్దము ఇంద్రియముల నెట్లు చెప్పును? అనఁగా- ఏ వస్తువునకైనను నామరూపములు పంచభూతముల వలనను ఇంద్రియముల వలన నేర్పడును కావున సృష్టికర్తయే ఆ యా జీవుల కర్మలననుసరించి నామరూపముల నేర్పరచుటకు వలయు ఆకాశాది పంచభూతములను చక్షురాదీంద్రియములను పుట్టించునని భావము. కావున బ్రహ్మమే సకలపూర్వభావి యగు ననుట నిర్వివాదమగుచున్నయది.

## సప్తగత్యధికరణము

సూ. "సప్తగతే ర్విశేషితత్వా చ్చ" 2-4-4

పూర్వాధికరణము నందు బ్రహ్మకార్యములుగా ఏర్పడిన ఇంద్రియములు ఎన్ని యగునని సందేహము.

ప్రశ్న : ఇంద్రియములు సప్త సంఖ్యాకములగును. ఎట్లనఁగా ? "యదా పంచావతిష్ఠంతే జ్ఞానాని మనసా సహ, బుద్ధిశ్చ న విచేష్టేత తా మాహుః పరమాం గతిమ్"

"మనోబుద్ధి సాహచర్యమునఁజేసి ఇంద్రియములు జ్ఞాన శబ్దముతో వ్యవహరింపఁబడును. త్వక్ చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణములను జ్ఞానేంద్రియములు ఐదు, మరియు మనస్సు బుద్ధియు చలింపనివై స్థిరపడు పరిస్థితిని మోక్షసాధనమగు యోగముగా చెప్పుదురు'' అను శ్రుతియందు ఇంద్రియములు ఏడే కలవని బోధపడుచున్నయది. మఱియు "సప్తప్రాణాః ప్రభవంతి" "ఏడు ఇంద్రియములు సంభవించుచున్నవి." అను శ్రుతియు ఇంద్రియములఁదగు సప్త సంఖ్యనే నిర్దేశించినది.

ఉత్తరము :

సూ. హస్తాదయస్తు స్థితేఽతో నైవమ్" 2-4-5

ఇంద్రియములు ఏడే కాజాలవు. హస్తము మున్నగునవియు ఇంద్రియములేను; జీవాత్మ దేహములో నుండగా చక్షుః శ్రోత్రాదులవలె హస్తాదులు నుపకరణము లగుచున్నవి. ఐతే ఇంద్రియములు పదునొకండని ''దశేమే పురుషే ప్రాణా ఆత్మైకాదశః" అను శ్రుతియు "ఇంద్రియాణి దశైకం చ" అను స్మృతియు విశదీకరించినవి. ఇట శ్రుతిగతమైన ఆత్మశబ్దము మనోవాచకంబగునది. బుద్ధి మొదలగునవి మనోవృత్తి భేదములగుటచే ఇంద్రియములు కాజాలవు. ఐతే పూర్వోక్త శ్రుతియందు సప్త సంఖ్య- ఇంద్రియములలో ఏడు ముఖ్యములగుటచే నిర్దేశింపఁబడినదని తెలియనగును. కావున నింద్రియములు పదునొకండు కాని యేడు కాజాలవని సారాంశము.

## ప్రాణాణుత్వాధికరణము

సూ. "అణవశ్చ" 2-4-6

పదునొకఁడుగా నిరూపింపఁబడిన ఇంద్రియములు విభువులా ? లేక అణువులా ? అని సందేహము.

ప్రశ్న : చక్షుస్సు మొదలగు ఇంద్రియములు - దూరముగా నుండు వస్తువులను కనిపెట్టు సామర్థ్యము కలిగియుండుటఁజేసి విభువులనియే చెప్పవలెను కాదా ?

ఉత్తరము : ఇంద్రియములు అణువులగునవియేను; ఎందుకనఁగా? "ప్రాణ మనూత్క్రామంతం సర్వే ప్రాణా అనూత్క్రామంతి" "శరీరము నుండి నిష్క్రమించు ప్రాణవాయువు ననుసరించి ఇంద్రియములన్నియు బయలుదేరును." అను శ్రుతి యందు ఇంద్రియములకు గమనము వినఁబడుటచే విభుత్వము సరిపడకుండును. చక్షురాదీంద్రియములకు దూరగత వస్తుగ్రహణ సామర్థ్యము విభుత్వము వలన సంభవించుట లేదు. కాని తేజోరూపములగుట చేతను అణువులగుటవలనను శీఘ్రగతి గలవగుటఁజేసియు ఇంద్రియములు దూరగత వస్తుగ్రహణ సమర్థములగుచున్నవి కావున విభువులు కాజాలవని సిద్ధాంతము.

## శ్రైష్ఠ్యాధికరణము

సూ. "శ్రేష్ఠశ్చ" 2-4-7

"ప్రాణ మనూత్క్రామంతం సర్వే ప్రాణా అనూత్క్రామంతి" అను శ్రుతి యందు సర్వప్రాణశ్రేష్ఠముగా వినఁబడునట్టియు ఐదు తెఱఁగుల నుండు స్వరూపము గల యట్టి ప్రాణవాయువు బ్రహ్మము నుండి ఉదయించునా ? లేదా ? అని సందేహము.

ప్రశ్న : ప్రాణవాయువు ఉదయించునది కాదందుము "ఆనీదవాతమ్" అను నాసదాసీయ సూక్తము - సృష్టికిముష్న గూడా ప్రాణవాయువుఁదగు వ్యాపారము కలదని చెప్పుచున్నయది.

ఉత్తరము : ప్రాణవాయువు గూడ పుట్టుచున్నదనియే చెప్పువారము. పై వాక్యమున గల "ఆనీత్" అను శబ్దము ప్రాణవ్యాపారమును చెప్పుట లేదు. "అవాతమ్" అను శబ్దము వాయువును విషేధించినందున వస్తువిశేషాపేక్ష లేనట్టి నిరు

పాధికమైన బ్రహ్మసత్తనే నిరూపించుచున్నయది. కావున ప్రాణవాయువు అనాది కాదని తెలియనగును.

ప్రశ్న : ఐతే ప్రాణవాయువు ఉత్పత్తి గలది యగు గాక ! కాని "సామాన్యకరణవృత్తిః, ప్రాణాద్యవయవాః పంచ'' "ఇంద్రియముల వర్తనముః దగు స్వరూపము గలదై ప్రాణాది పంచవిధములుగ నుండు"నని తంత్రాంతరమున చెప్పఁబడినట్లు ఇంద్రియవృత్తుల కంటెను పంచభూతాంతర్గత వాయువు కంటెను భిన్నమైనది కాజాలదు గదా ?

ఉత్తరము :

సూ. "న వాయుక్రియే, పృథ గుపదేశాత్" 2-4-8

పంచవృత్తులు గల ప్రాణము వాయువు కాజాలదు. మరియు వాయుకార్యమగు స్పందనమున్ను కాదు. ఇంద్రియవృత్తి రూపంబును కాజాలదు.

"ఏతస్మా జ్జాయతే ప్రాణో-మనః సర్వేంద్రియాణి చ,
ఖం వాయు ర్జ్యోతి రాపః - పృథివీ విశ్వస్య ధారిణీ"

"ప్రాణము, మనస్సు, ఇంద్రియములన్నియు, ఆకాశము, వాయువు, తేజస్సు, ఉదకము, ప్రపంచాధారమగు భూమియు పరమాత్మ నుండి ఉదయించునవి." అను శ్రుతియందు ప్రాణము వాయువుకంటెను ఇంద్రియవృత్తి కంటెను వేరైనదిగా నిర్దేశింపఁబడినది.

ప్రాణము వాయుభిన్నమైనను భూతాంతరము కాజాలదని దిగువ సూత్రముతో నిరూపించుచున్నవారు.

సూ. "చక్షురాదివత్తు తత్సహశిష్ట్యాదిభ్యః'' 2-4-9

ప్రాణవాయువు - భూతవాయువుకన్న వేరైనను అగ్ని మొదలగువానివలె భూతాంతరము కాజాలదు. కాని భూతవాయువే స్వయముగా పరమేశ్వరు నాశ్రయించి దేహధారణ యోగ్యతను పొందునట్టిది. ఇందుకు ప్రమాణము "భర్తా సన్ భ్రియమాణో బిభర్తి" "ఏకో దేవో బహుధా నివిష్టః" "పరమేశ్వరునిచే భరింపఁబడుచున్నందుననే ప్రాణవాయువు కార్యకరణ సంఘాతమును భరించునదై భర్త యనఁబడుచున్నయది."

"ముఖ్యప్రాణ మొక్కటే యైనను ప్రాణాపానాది బహువిధముగా నుండు నది."

"త్వ మేకోఽసి బహూ ననుప్రవిష్టః" పరమేశ్వరా ? నీవు ఒక్కడ వైన ననేకులఁ బ్రవేశించినవాడవు."

ప్రాణానాం గ్రంధి రసి రుద్రో మా విశాంతకః" శ్రు.

"పరమేశ్వరా ? ప్రాణము అపానము మొదలగువాని వృత్తులను నెలకొలుపు వాడవైనాలో ప్రవేశించుము ! ప్రాణాంతకుడవు మాత్రము కావలదని ప్రార్థించు చున్నాను."

"న ప్రాణేన నాపానేన - మర్త్యో జీవతి కశ్చన, ఇతరేణ తు జీవంతి - యస్మి న్నేతా వుపాశ్రితౌ" శ్రు.

"మానవుఁడు (ప్రాణిమాత్రము) ప్రాణవాయువుతోడ అపానవాయువుతో డను జీవించువాడు కాడు. కాని ప్రాణాపానములు ఎవని నాశ్రయించి యుండునో అట్టి పరమేశ్వరుని వలననే బ్రతుకువాడు.''

ఐతే ఈ ప్రాణవాయువు "అథ యోఽయం ముఖ్యప్రాణః" ఇత్యాది ప్రాణ సంవాదము మున్నగుచో చక్షురాదులతో కూడ నుపకరణముగా నుపదేశింపఁ బడుటచేతను ఇంద్రియములతో సమానముగా నుపకరించుటలో ముఖ్యమగుట మొదలగు కారణముల వలనను చక్షురాదులవలె జీవాత్మకు నుపకరణ మగువాడు.

సూ. "అకరణత్వాచ్చ న దోష స్తథా హి దర్శయతి" 2-4-10

జీవునకు ఉపకారము కాదను దోషము ప్రాణవాయువునందు ప్రవర్తింపదు. ఎందుకనఁగా ? ప్రాణసంవాదమునందు "యస్మి న్నుత్క్రాంతే ఇదం శరీరం పాపిష్ఠతర మివ దృశ్యతే స వః శ్రేష్ఠః" "ప్రాణవాయువు నిష్క్రమించినపుడు ఈ శరీరము మిక్కిలి మలినముగా కనఁబడును కావున ప్రాణము శ్రేష్ఠమైనది." అను శ్రుతియే దేహేంద్రియాదులు శిథిలములు కాకుండుటకు కారణము ప్రాణ వాయువని నిరూపించుచున్నయది. ఐతే ఈ సందర్భమున శరీరములో వాక్కు మొదలగునవి లోపించినను ప్రాణవాయువు ఉన్నచో దేహము ఇంద్రియములు

నుండుననియు ప్రాణము గతించినయెడల దేహేంద్రియాదులు క్షీణించుననియు ముఖ్యముగా గమనింపవలెను.

సూ. ''పంచవృత్తి ర్మనోవ ద్వ్యపదిశ్యతే'' 2-4-11

ప్రాణ మొక్కటియే తన వృత్తు లైదిటితో ప్రాణ అపానాది సంజ్ఞా భేదమును పొందునట్టిది. మనస్సు కామ సంకల్పాది రూపములు కలిగియున్నను ఏకమైనట్లు నాకే ప్రాణము భూతవాయువు కంటెను ఇంద్రియముల యొక్క వృత్తికన్నను వేరైనదై జీవోపకారకమగునది యని సారాంశము.

## ముఖ్యప్రాణాణుత్వాధికరణము

సూ. "అణు శ్చ" 2-4-12

ఐదు విధముల నుండు ఈ ప్రాణవాయువు - ఇంద్రియములవలె నణువగునా? లేక విభువగునా? అని సందేహము.

ప్రశ్న : ప్రాణవాయువు అణువు కాదు. "సమః ప్లుషిణా సమో మశకేన సమో నాగేన సమ ఏభి స్త్రిభి ర్లోకైః సమోఽనేన సర్వేణ" ''ప్రాణవాయువు దోమతోడను ఏనుగ తోడను సమానమైనది. మరియు నీ మూడులోకములు ప్రాణవాయువు నాకే పరిమాణము (కొలత) గలవి యగును. ఇంక నీ బ్రహ్మాండమంతటితో సరిదూగునది ప్రాణవాయువేను''

"ప్రాణే సర్వం ప్రతిష్ఠితమ్'' ''చరాచర మంతయు ప్రాణవాయువు నందు నెలకొనియున్నది" "సర్వం హీదం ప్రాణేనావృతమ్" "జగంబంతయు ప్రాణవాయువుతో కప్పఁబడియున్నది"అను శ్రుతులఁబట్టి ప్రాణవాయువు సర్వంబు నదిష్ఠించియుండునదని తెలియుచున్నందున ప్రాణము విభువగుచున్నది కాదా ?

ఉత్తరము : ప్రాణము అణువేను; "ప్రాణమనూత్క్రామంతమ్" అను శ్రుతియందు జీవాత్మ ననుసరించి ప్రాణవాయువు నిష్క్రమించునని చెప్పఁబడుటచే ప్రాణవాయువు గమనము (గతి) కలదని విశదమగుటఁజేసి అణువగునదియేను; ఐతే హిరణ్యగర్భుని ప్రాణము సృష్టిప్రారంభమున దైవచోదితమగుటచే విభువు కాజాలును కాని ప్రతి జీవాత్మఁదగు ప్రాణము మాత్రము వ్యష్టిరూపమగుట కతన

విభువు (వ్యాపి)కాజాలదనియు ఐదు తెఱఁగుల నుండునదైనను అణువే యనియు సిద్ధాంతము.

## జ్యోతిరాద్యధిష్ఠానాధికరణము

సూ. జ్యోతిరాద్యధిష్ఠానం తు తదామననాత్ ప్రాణవతా శబ్దాత్" 2-4-13

ఈ సందర్భమున "ఆదిత్య శ్చక్షు ర్భూత్వాఽక్షిణీ ప్రావిశత్" సూర్యుఁడు నేత్రరూపమై కన్నులలో ప్రవేశించెను'' ఇత్యాది శ్రుతిని నేత్రములు మున్నగు వానిపై సూర్యాదుల యధిష్ఠానము వినఁబడుచున్నయది. మరియు ''ఏవ మేవైష ఏతాన్ ప్రాణాన్ గృహీత్వా స్వే శరీరే యథాకామం పరివర్తతే" "జీవాత్మ ఇంద్రియముల నన్నిటిని కైవసము జేసికొని తన శరీరమునందు యథేచ్ఛగా విహరించును" అను శ్రుతియందు జీవుఁడు రూపాదులను గ్రహించుటకు చక్షురాదుల నధిష్ఠించియుండునని నిరూపింపఁబడినది కావున సూర్యాదులు గాని జీవాత్మగాని ఇంద్రియముల నధిష్ఠించి యుండుట స్వతంత్రమైనదా ? లేక పరమేశ్వరాధీనమైనదా ? అని సందేహము.

ప్రశ్న : "ఆదిత్య శ్చక్షు ర్భూత్వాఽక్షిణీ ప్రావిశత్" ఇత్యాది శ్రుతుల యందు సూర్యాదులకు స్వతంత్రభావము వినఁబడుటచేతను పరమేశ్వరునివలె సూర్యాదిదేవతలు ఆరాధింపఁబడుచు కామ్య ఫలప్రదులగుట వలనను ''పరాత్తు తచ్ఛ్రుతేః" అను సూత్రమున చూపఁబడిన పరాధీనత్వము మనుష్యుల విషయ మగుటఁజేసియు చక్షురాదీంద్రియములను సూర్యాదులు అధిష్ఠించియుండుట స్వతంత్ర మైనదనియు పరమేశ్వరాధీనమైనది కాదనియు చెప్పవలెను కాదా ?

ఉత్తరము : సూర్యుడు మొదలగువారు నేత్రము మున్నగు ఇంద్రియములఁ బ్రవేశించి యుండుట పరమేశ్వరుని యధీనమైనది. ఎందుకనఁగా ? "య ఆదిత్య మంతరో యమయతి" "య ఆత్మాన మంతరో యమయతి" "సూర్యునిలో నుండువాడై సూర్యుని ప్రేరేపించువాడు పరమాత్మ" ''పరమేశ్వరుఁడు జీవాంతర్యామియై జీవాత్మను నియమించును." ఇత్యాది శ్రుతులు — సూర్యాది దేవతల ప్రవర్తనము జీవుని విషయభోగాది స్థితియు పరమేశ్వరుని సంకల్పము ననుసరించి

యుండునని విశదపఱచుచున్నందున జీవాత్మ ఆదిత్యాదులును ఇంద్రియముల నావరించియుండుట పరమేశ్వరుని యధీనమగునదియే నని తెలియవలెను.

సూ. "తస్య చ నిత్యత్వాత్" 2-4-14

"స ఈశోఽస్య జగతో నిత్యమేవ" "ఈ జగమును పరమేశ్వరుఁడు శాసించుట నిత్యంబైనదే" ఇత్యాది శ్రుతి ప్రమాణముఁబట్టియు సూర్యజీవాదుల ఇంద్రియాధిష్ఠానము పరమేశ్వరాయత్తంబైనదియే యని ధృవపడుచున్నయది.

త ఇంద్రియాధికరణము

సూ. "త ఇంద్రియాణి తద్వ్యపదేశా దన్యత్ర శ్రేష్ఠాత్" 2-4-15

ముఖ్య ప్రాణమునకంటె వేరైన ఇంద్రియములయందు ఇంద్రియములు అను నిర్దేశ ముండుటఁజేసి ఇంద్రియములు ప్రాణభిన్నము లైనవియే యని సూత్రార్థము.

పూర్వోక్తములగు వాగాది ఇంద్రియములు . ప్రాణవాయువుఁదగు పంచ వృత్తులకన్న వేరైనవా కావా అని సందేహము.

ప్రశ్న : ఇంద్రియములు ముఖ్య ప్రాణవృత్తులనియే చెప్పనగును. "ఏతస్యైవ సర్వే రూప మభవన్" "ఇంద్రియములన్నియు, ముఖ్య ప్రాణముఁదగు స్వరూప మగునవి" ఇత్యాది శ్రుతిఁబట్టి ఇంద్రియములు ప్రాణరూపముగలవి యగుటను తెలియనగును. ఎందుకనఁగా ? వాక్కుమున్నగు ఇంద్రియములు లోపించు మరణము సంభవించినపుడు ప్రాణము పోయినదను వ్యవహారమును లోకమున చూచుచున్నాము. కావున ఇంద్రియములు ప్రాణభిన్నములు కాజాలవు గదా !

ఉత్తరము : ముఖ్యప్రాణమునంటె నింద్రియములు వేరైనవి. "ఇంద్రియాణి దశైకంచ" "పదునొకండు ఇంద్రియములు" అను వ్యవహారము ప్రాణభిన్నములగు ఇంద్రియముల నుద్దేశించియే గావింపఁబడినదని సిద్ధాంతము.

సూ. "భేదశ్రుతే ర్వైలక్షణ్యాచ్చ" 2-4-16

"ఏతస్మా జ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణి చ" "పరమాత్మవలన ప్రాణవాయువు మనస్సు, ఇంద్రియములన్నియు పుట్టుచున్నవి" అను శ్రుతి

యందు ప్రాణము ఇంద్రియములు వేరువేరుగా నుదయించుటను గాననగును. మరణసమయమున ఇంద్రియములు లోపించినను ప్రాణవాయువు కొంత తడవు దనుక నుపరమింప కుండుట గానంబడుచున్నందున ప్రాణవృత్తులకన్న నింద్రియములు భిన్నము (విలక్షణము)లైనవియే యని గ్రహింపనగును.

## సంజ్ఞామూర్తిక్లృప్త్యధికరణము

సూ. "సంజ్ఞామూర్తి క్లృప్తి స్తు త్రివృత్కుర్వత ఉపదేశాత్''
2-4-17

ఆకాశాది పంచభూతముల నధిష్ఠించియుండు సదాశివ మహేశ్వర రుద్ర విష్ణు బ్రహ్మలతో గూడ పృథివ్యప్ తేజోవాయ్వాకాశములు పరమేశ్వరుని వలన జనించునవి యని పూర్వము చెప్పఁబడినది. కావున పంచభూతములు బ్రహ్మాది పంచమూర్తులును సంభవించిన పిదప ఇంద్రాది దేవతలకు నామరూపాదులు ఏర్పడుట - మూలకారణమగు పరమేశ్వరుని వలననా లేక నితరులవలననా అని సందేహము.

ప్రశ్న : ఇట్లుండగా "తత్తేజ ఐక్షత, బహు స్యాం ప్రజాయేయేతి, తదపోఽసృజత" "తేజస్సు అనేకముగా నగుదు నని విచారించి యుదకమును పుట్టించెను'' అను శ్రుతివలన తేజస్సునందభిమానము గల రుద్రుఁడు నీటి నుదయింపఁ జేసి యవ్వానియందు తన సంకల్పమను వీర్యమును నెలకొలుపుననియు ఆ యుదకములలో సత్త్వగుణసంపన్నుడైన మహావిష్ణువు ఆవిర్భవించుననియు తెలియుచున్నది. మఱియు

"ఆపో నారా నరో రుద్రః" ''ఉదకములు నారము లనఁబడును. రుద్రుఁడు నరుఁడనఁబఱగును"అను శ్రుతిఁబట్టి రుద్రునివలనఁబుట్టిన జలతత్త్వమే స్థానముగా గలిగియుండుటఁజేసి విష్ణువు నారాయణుఁడను సంజ్ఞ కలవాడయ్యెనని గమనింప నగును. ''తా ఆప ఐక్షంత" "తా అన్న మసృజంత" "ఉదకములు విచారించి భూమిఁ జనింపఁజేసినవి" అను శ్రుతి ననుసరించి జలాభిమానియగు నారాయణుఁడు అన్న శబ్దముతో చెప్పఁబడు పృథివిని సృజించెనని తెలియనగును. అదే సందర్భమున పృథివీ తత్త్వరూపమగు హిరణ్మయమైన అండమునందు

సముద్ర మధ్యమున హిరణ్యగర్భుఁడనఁబడు బ్రహ్మదేవుఁడు, విష్ణుశబ్దవాచ్యుడైన దేవేంద్రుడు తదితరులు అగ్న్యాదులు నుదయించిరని దిగువ శ్రుతియందు గాననగును.

"అండం హిరణ్మయం మధ్యేసముద్రం రుద్రస్య వీర్యాత్ ప్రథమం సంబభూవ, తస్మిన్ బ్రహ్మ విష్ణు ర్జాతో జాతవేదాః" శ్రుతి.

ఇవ్విషయమునే మనుస్మృతి దిగువవిధముగా సమర్థించినది.

శ్లో॥ అప ఏవ ససర్జాదౌ- తాసు వీర్య మవాసృజత్ ।
తదండ మభవ ద్దైమం—సహస్రాంశు సమప్రభమ్ ॥

తస్మిన్ జజ్ఞే స్వయం బ్రహ్మ-సర్వలోక పితామహః।
ఆపో నారా ఇతి ప్రోక్తా-ఆపోవై నరసూనవః ॥
అయనం తస్య తా యస్మాత్-తతో నారాయణః స్మృతః ।
నారాయణః పరోఽవ్యక్తా-దవ్యక్తా దండసంభవః॥

"రుద్రుఁడు మొదట ఉదకములనే పుట్టించి యవ్వానియందు తన వీర్య (సంకల్ప) మును విడనాడినందున అట్టిది సూర్యునివలె ప్రకాశించు హిరణ్మయమైన అండముగా పరిణమించినది. సర్వలోక పితామహుఁడైన బ్రహ్మదేవుఁడు స్వయముగా (ఇతర వస్తువుల తోడ్పాటు లేకుండ) అండమునందు జనించెను.''

''ఉదకములు నరుఁడనఁబడు రుద్రునిచే పుట్టింపఁబడినందున నారములనఁబడుననియు, ఇట్టి నారము (ఉదకము)లు ఆశ్రయముగా కలవాడగుటఁజేసి హరి నారాయణుఁడయ్యెననియు ఇట్టి నారాయణుఁడు తన యుద్దేశమనఁబడు అవ్యక్తము కన్న నతీతుఁడనియు అట్టి యవ్యక్తము నుండి బ్రహ్మాండము సంభవించెననియు ప్రాణులందరును సప్తద్వీపములు గల భూమియు బ్రహ్మాండములోనివారే యనియు తెలియవలెను."

ఇందుకు పురాణప్రమాణము.

శ్లో॥ రుద్ర సంజ్ఞస్యదేవస్య- రూపే మూర్తిః ప్రజాయతే ।
తేన క్షిప్తం రసే వీర్యం—పరం మూర్త్యభిమానినా ॥

తదండ మభవ ద్వీర్యం-సహస్ర కిరణప్రభమ్ ।
విష్ణు స్తత్ర్పావిశ త్సాక్షా-న్మమ శక్తే స్తు వైభవాత్ ॥

పున ర్నారాయణాఖ్యాం మే-నియోగా త్ప్రాప్తవా నసౌ ।
ఇమం చోదాహరం త్యత్ర-శ్లోకం నారాయణం ప్రతి ॥

ఆపః సూక్ష్మో రసో జ్ఞేయో-రసో నారః ప్రకీర్తితః ।
నరజాత స్తతో బ్రహ్మ-నరః సాక్షా చ్ఛివః స్మృతః ॥

నార మస్యాయనం ప్రోక్తం-తేన నారాయణః స్మృతః ।
బ్రహ్మాపి నరశార్దూల-గంధమూర్తిం సమావిశత్ ॥

"రుద్రుఁడను పేరు గల దేవునికి ఒకానొక స్వరూపమేర్పడెను. అట్టి మూర్తియందభిమానముగల రుద్రుఁడు రసము (ఉదకము) నందు విడనాడిన వీర్యము సూర్యప్రకాశము గల యండముగా పరిణమించినది. పరమేశ్వరుని శాసనశక్తిఁదగు మహిమవలన విష్ణువు ఆ యండమునం బ్రవేశించెను. పిదప పరమేశ్వరుని ఆజ్ఞఁజేసి నారాయణుఁడను పేరు గలిగియుండు విష్ణువు నుద్దేశించి పూరావిదులు దిగువవిధము చెప్పుచున్నారు.

"ఉదకము సూక్ష్మరసమనియు రసము నరుని (రుద్రుని)చే పుట్టింపఁబడినందున నార మనఁబడుననియు నరుఁడు (రుద్రుఁడు) నారాయణుని ద్వారా బ్రహ్మను పుట్టించెననియు నరుఁడు సాక్షాత్తు శివుఁడే కాని మరియొకడు కాడనియు ఇట్టి నారము అయనముగా కలవాడగుటచే విష్ణువు నారాయణుఁడయ్యె ననియు బ్రహ్మదేవుఁడును శివశాసనవశమున పృథివ్యభిమానము గల స్వరూపము గలవాడయ్యె ననియు గ్రహింపనగును. ఇట్టితటి

"వేదేన రూపే వ్యాకరోత్, సతాసతీ ప్రజాపతిః" "బ్రహ్మదేవుఁడు వేదము నాధారముగా గొని సదసద్రూపములను సృజించెను" ఇత్యాది శ్రుతి ననుసరించి అండాంతర్వర్తియగు హిరణ్యగర్భుఁడైనను "అద్భ్యః సంభూతః పృథివ్యై రసాచ్చ" "రసాత్మకములగు ఉదకముల వలన భూమ్యాది సృష్టికొరకు నారాయణుఁడు ప్రాదుర్భవించెను" ఇత్యాది శ్రుతింబట్టి నారాయణుండైనను అండములోని దేవమానవాదులకు నామరూపముల నేర్పరచువాడు కావలసియుండును. కాని బ్రహ్మం

దము మున్నగువాని నతిక్రమించియుండు పరమేశ్వరుఁడు నామరూప కర్త-కాజా లడు గదా !

ఉత్తరము : ఇంతవరకు నిరూపింపఁబడిన సృష్టిక్రమము సరియైనది కాదు. ఎందుకనఁగా? "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీ దేకమేవాద్వితీయమ్" "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి" "తత్తేజోఽసృజత" "సౌమ్యుడా సృష్టికిమున్ను ఈ జగమంతయు సదాత్మకమై రెండవది లేనిదై ఏకరూపముగానే యుండెను." "అట్టి బ్రహ్మము ప్రళయానంతరము అనేకము నగుదునని విచారించెను" "బ్రహ్మము తేజస్సును పుట్టించెను" ఇత్యాది శ్రుతి ప్రమాణమున సచ్ఛబ్దముతో చెప్పఁబడు బ్రహ్మమే పంచభూతములకు కారణమగునని విదితమగుచున్నయది.

ఇట్లు చెప్పుటవలన సృష్టిలో తేజస్సు మొదటిదను నంశము సరియైనది కాదని తేటపడినది.

ఆకాశము మొదలుకొని పృథివివరకు సదాశివుఁడు మున్నగు సంజ్ఞా రూపములతో పూర్వపూర్వకారణమగు బ్రహ్మము (శివుఁడు) ఉత్తరోత్తరకార్యమును సృజించునని "తదైక్షత" "తత్తేజ ఐక్షత" "తా అప ఐక్షంత" అను శ్రుతివాక్యములవలన తెలియుచున్నయది.

"హంతాహ మిమా స్తిస్రో దేవతా, అనేన జీవేనాఽఽత్మనాను ప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీతి, తాసాం త్రివృతం త్రివృత మేకైకాం కరవాణి" శ్రుతి.

"ఓయీ ? ఈ బ్రహ్మవిష్ణురుద్రులను ముప్వురు దేవతలు నేనేను ; మరియు నీ బ్రహ్మవిష్ణురుద్రరూప జీవుని ద్వారా బ్రహ్మాండమునందు ప్రవేశించి సమస్త ప్రాణివర్గమునకు నామరూపముల నేర్పఱచువాడను, ఐతే బ్రహ్మవిష్ణురుద్రులచే నధిష్ఠింపఁబడు పృథివీ జల తేజస్సులలో నొక్కొక తత్త్వమును తదితర తత్త్వ ద్వయముతో కలిపి మూడిటిని మూడుకలవిగా నొనరింతును. ఒక్కొక తత్త్వమున మరిరెండు ముఖ్యములు కాకుండుటచేతను ఒకటి మాత్రము ముఖ్యమగుటఁ జేసియు ఆయా తత్త్వములు ఆయా సంజ్ఞలతో నేర్పడినవనియు తెలియనగును.

ఇట్లు త్రివృత్కరణము (ఒక్కదానిలో రెంటిని కలుపుట)ను గావించు

బ్రహ్మమే చతుర్ముఖాది దేవతల ద్వారా నామరూపముల నేర్పరచునని చెప్పుట సమంజసంబగుచున్నయది

వాయువు మొదలగు రూపములును పరమేశ్వరునివే యగుచున్నవి. త్రివృత్కరణమైతేనో కేవలము చతుర్ముఖునకు నశక్యంబగునది. తేజస్సు, ఉదకము, పృథివి అనునవి పరమేశ్వరునిచే కలుపఁబడిన తరువాతనే బ్రహ్మాండము ఏర్పడునట్టిది. త్రివృత్కరణము పిదపనే అట్టి బ్రహ్మాండమున చతుర్ముఖాదులు సంభవించువారు.

ఇందుకు పూర్వోక్తమైన "అండం హిరణ్మయం మధ్యేసముద్రం రుద్రస్య వీర్యా త్ప్రథమం సంబభూవ, తత్ర బ్రహ్మవిష్ణుర్జాతో జాతవేదాః" అను శ్రుతియు ప్రబలప్రమాణమగునది.

ప్రశ్న : ఓయీ ? త్రివృత్కరణమునకు కేవలము చతుర్ముఖ బ్రహ్మయే కర్త యగును. ఎట్లనఁగా ? అండము పుట్టిన పిదప చతుర్ముఖునిచే జనింపఁ జేయఁబడిన ప్రాణులలో త్రివృత్కరణముఁదగు విధానమును దిగువ శ్రుతియందు గాననగును.

"యథా ఖలు సౌమ్యేమా స్తిస్రో దేవతాః పురుషం ప్రాప్య త్రివృత్, త్రివృదేకైకా భవతి, తన్మే విజానీహీతి; అన్న మసితం త్రేధా విధీయతే, తస్య యః స్థవిష్ఠోధాతు స్తత్పురీషం భవతి, యో మధ్యమ స్తన్మాంసం, యోఽణిష్ఠ స్తన్మనః"

సౌమ్యుఁడా? బ్రహ్మవిష్ణురుద్రులనఁబడు ముప్పురు దేవతలు పృథివీజల తేజస్సుల ద్వారా ప్రాణిశరీరమునఁ బ్రవేశించి యొక్కొక దానిని మూఁడుమూఁడు విధములుగచేయు నంశమును నా వలనఁ దెలిసికొనుము !

భుజింపఁబడిన అన్నము ముప్త్రిధముగా పరిణమింపఁజేయఁబడును. ఎట్లనఁగా ? ఆహారముఁదగు స్థూలభాగము మలంబగును. మధ్యమభాగము మాంసంబగును. సూక్ష్మభాగము మనస్సగును."

ఉత్తరము :

సూ. "మాంసాది భౌమం యథాశబ్ద మితరయో శ్చ" 2-4-18

"అన్న మశితం త్రేధా విధీయతే" ఇత్యాది సందర్భమున చూపబడిన త్రివృత్ కరణము అనఁగా ? బ్రహ్మాండములో ప్రాణులు భుజించు అన్నము మున్నగునవి పరిణమించు విధానము పూర్వోక్తమైన పృథివ్యప్ తేజస్సుల త్రివృత్ కరణమునకన్న భిన్నంబైనదేను : అట్లుకానియెడల భుక్తమైన అన్నము పరిణమించుటలో పురీషమునకన్న మాంసమనస్సులు సూక్ష్మంబులగుటఁజేసి పృథివీ సంబంధములేనివై జలతేజః సంబంధము కలవి కావలసివచ్చును. అట్లైనచో "అన్నమశితం త్రేధా" అనుచో చెప్పఁబడిన పృథివీ త్రివిధభావముఁదగు నుపక్రమము; "అన్నమయం హి సౌమ్య మనః" అనుచో తెలుపఁబడిన మనస్సుఁదగు భౌమత్వంబును విరోధించును. మఱియు పృథివీ భిన్నములగు జలతేజస్సులు త్రివిధములగుటయు విరుద్ధంబగునది.

కావున పురీషమువలె మాంసము మనస్సున్ను భౌమంబులనియు మూత్రమువలె రక్తము ప్రాణవాయువున్ను జలసంబంధములనియు అస్థి (ఎముక) వలె మజ్జావాక్కులు తేజః సంబంధము గలవనియు గ్రహింపనగును.

ప్రశ్న : ఓయీ ? బ్రహ్మాండోదయమునకంటె ముందు తేజోజలభూములు త్రివృత్కృతములగుచో ప్రతిభూతము (పృథివ్యాదికము) మువ్విధమగు నెడల బ్రహ్మాండము ఏర్పడిన తరువాత గూడా భూమియనియు జలమనియు తేజస్సనియు వ్యవహరించుట యెట్లు పొసగును ?

ఉత్తరము :

సూ "వైశేష్యాత్తు తద్వాద స్తద్వాదః" 2-4-19

పృథివిలో భూభాగము సగము జలతేజస్సులు మిగతా సగమగుటఁజేసి పృథివియనియు అటులే జలమనియు తేజస్సనియు వ్యవహారము గావింపబడుచున్నయది.

అందువలన పరమేశ్వరుఁడే త్రివృత్ కరణముఁగావించువాడనియు త్రివృత్కృతములైన తేజోజల భూములచే నేర్పడు బ్రహ్మాండమున రుద్రనారాయణ చతుర్ముఖుల ద్వారా సకలచరాచరమునకు నామరూపములను కల్పించు

వాడు శివుఁడే నసియు ప్రతిపాదించుట సకలప్రమాణయుక్తి సమ్మతమై సమంజసం బగుచున్నయది.

ఇయ్యది
శ్రీ నీలకంఠ శివాచార్య విరచితంబైన
బ్రహ్మమీమాంసాసూత్ర భాష్యమునందు
రెండవ యధ్యాయముఁదగు నాలుగవ పాదము
శ్రీకంఠమణి ప్రభామయూఖంబను ఆంధ్రానువాదముతో
ద్వితీయాధ్యాయము సర్వంబు సమాప్తము

---

సారాంశము

ఈ రెండవ అధ్యాయమున నాలుగు పాదములయందు-ప్రకృతి జగత్కారణమను కపిలసాంఖ్యవాదముఁదగు నిరాకరణము, హిరణ్యగర్భప్రోక్తమగు ప్రధానకారణవాదముఁదగు నిరాకరణము, ప్రపంచమునకు బ్రహ్మమే నిమిత్త కారణము ఉపాదానకారణంబగునని నిరూపించుటయు, పరమేశ్వరుఁడు సర్వ స్వతంత్రుఁడగుటచే జగమును లీలార్థము సృజించుననుటయు, అణుకారణవాదమును నిరాకరించుటయు, బౌద్ధుల విజ్ఞాన క్షణికశూన్య వాదములను నిరాకరించుటయు, జైనుల శరీరపరిమాణజీవస్థితి వాదమును ఖండించుటయు, పాశుపతుల కేవల నిమిత్తకారణ వాదమును త్రోసి పుచ్చుటద్వారా శివాగమప్రామాణ్యమును నిరూపించుటయు, పాంచరాత్రుల జీవోత్పత్తివాదమును నిరాకరించుటయు, ఆకాశాది పంచభూతములు, దశేంద్రియములు, పంచప్రాణములు, మనోబుద్ధ్యాది అంతఃకరణము, బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివులును పరమేశ్వరునివలననే ఆవిర్భవించునవి (వారు) అని సిద్ధాంతపఱచుటయు తదితర ముఖ్యాంశములను విశదపఱచుటయు ప్రశ్నోత్తర రూపముగ వ్రాయఁబడినవి.

గాన జిజ్ఞాసువులు-ఓపికతో చదివి-అర్థము కాని సందర్భమును గురుముఖతః తెలిసికొనగలరని ప్రోత్సహించుచున్నాను.

నిర్మల శంకర శాస్త్రి
10-8-1994

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

## తృతీయాధ్యాయము

## ప్రథమపాదము

## ఆంధ్రీకరణము

## తదంతర ప్రతిపత్త్యధికరణము

సూ. "తదంతర ప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః
ప్రశ్న నిరూపణాభ్యామ్" 3-1-1

ప్రథమాధ్యాయమున నిరూపింపఁబడిన బ్రహ్మకారణవాదముఁదగు సమన్వయమునకు గల విరోధమును ద్వితీయాధ్యాయమునందు పరిహరించితిమి. ఎట్లనఁగా? మొదటి పాదమున సాంఖ్యులు మున్నగువారి తర్కవిరోధము తొలగింపఁబడినది. రెండవ పాదమునందు ప్రధానము జగత్కారణము మొదలగు వాదములలో తర్కవిరోదము చూపఁబడినది. మూడవ పాదమున పంచభూతముల యుత్పత్తిఁదగు నవాంతరవిరోధమును పరిహరించుట ద్వారా జీవుఁడు నిత్యత్వము మున్నగు ధర్మములు గలవాడని ప్రతిపాదింపఁబడినది. నాలుగవ పాదములో ప్రాణవాయువు యొక్కయు ఇంద్రియముల యొక్కయు స్వరూపమును మఱియు ప్రాణము ఇంద్రియములును బ్రహ్మమునుండి ఉదయించుటను అన్నిటిఁదగు నామరూపకరణము బ్రహ్మమువలననే సంభవించు నను నంశమును వక్కాణింపవైనది.

ఈ మూడవ యధ్యాయమున ప్రథమ పాదమునందు నిత్యత్వాదులతో కూడిన జీవాత్మకు గమనాగమన (పరలోకమునకు వెళ్ళుట, ఇహలోకమునకు వచ్చుటయు) నిరూపణము గావింపబడుచున్నయది. ద్వితీయపాదమున జీవుని

స్వప్నాది అవస్థలను నిరూపించుట ద్వారా పరమేశ్వరుని స్వరూపలక్షణము ప్రతిపాదింపఁబడును. మూడవ పాదమునందు పరమేశ్వరుని ఉపాసన విధానముల యందలి ధర్మ (గుణ) ముల యుపసంహారమును గాననగును. నాలుగవ పాదమున ఆశ్రమాది ధర్మములు తెలుపఁబడును.

ఇఁట మొదటి యధికరణమునందు జీవాత్మ పరలోకమును గురించి వెళ్ళుట యందును భూలోకమునకు వచ్చుటయందును రెండవ దేహమును పొందుటకై సూక్ష్మభూతములతో కూడి వెళ్లునా? లేక సూక్ష్మభూతములను విడనాడియే వెళ్లునా? అని సందేహము.

ప్రశ్న : దేహమునుండి వెళ్ళునపుడు జీవుఁడు-రాబోవు జననమునకు వలయు బీజములగు సూక్ష్మభూతములను విడనాడియే ప్రయాణమును చేయునని చెప్పవలెను. ఎందుకనఁగా ? పంచభూతములు అంతటను సులభములగుటఁజేసి జీవుఁడు శరీరమునుండి నిష్క్రమించుతఱి ఆకాశాది సూక్ష్మభూతములను గొంపోవుట వృథాశ్రమ యగును కాదా ?

ఉత్తరము : జీవాత్మ-మరియొక దేహమును పొందుటకై సూక్ష్మభూతములతో కూడియే పయనించునని పంచాగ్ని విద్యయందలి ప్రశ్నోత్తరముల సందర్భము విశదీకరించినది. ఎట్లనఁగా? ఆరుణేయుడైన శ్వేతకేతువును గురించి పాంచాలరాజైన ప్రవాహణుఁడు "వేత్థ యథా పంచమ్యా మాహుతా వాపః పురుషవచసో భవంతి" "ఆపః అనగా ఉదకములు ఉపలక్షణముగా గల పంచభూతములు మున్నగువానితో కూడిన సూక్ష్మశరీరముగల జీవాత్మ-ఐదవ అహుతియగు రేతస్సునందు ఎట్లు ఒకానొక శరీరము గలవాడగును ?" అను ప్రశ్నకు సమాధానముగా ద్యులోకమును మేఘమును పృథివిని పురుషుని వనితను పంచాగ్నులుగా నిరూపించి యవ్వానియందు శ్రద్ధను చంద్రుని వర్షమును అన్నమును రేతస్సును ఆహుతులుగా ప్రతిపాదించి తరువాత "ఇతి తు పంచమ్యా మాహుతా వాపః పురుషవచసో భవంతి" "ఇవ్విధముగానే పంచమఅహుతియగు పురుషేంద్రియమునందు ఉదకాది సూక్ష్మభూత పరివేష్టిత జీవుఁడు స్వకృతకర్మ కనుకూలమైన కళేబరము గలవాడగును." అని వివరించినవాడు.

ఈ సందర్భమున నీ సారాంశమును దిగువవిధము గ్రహింపనగును. బ్రాహ్మణాదిదేహమునందు గల జీవుఁడు-స్వాహాదానాది పుణ్యకర్మల నాచరించి

యవ్వాని ఫలము ననుభవించుటకు ఈ శరీరము నుండి బయలుదేరి తన దేహము నందున్నట్టి ఇతర సూక్ష్మభూతములతో కూడియున్న సూక్ష్మ ఉదకములను వెంటనిడుకొని ప్రథమ అగ్నిగా నిరూపింపఁబడు స్వర్గలోకముఁజెంది యట అమృతమయ దేహాకారముగా పరిణమించు పూర్వ ఉదకములవలన దేవతలకు శేషభావమును పొంది దేవతలతో గూడ స్వర్గమునందు భోగవిశేషముల ననుభవించి భుక్తావశిష్టము బ్రాహ్మణాదిదేహము నొసగునది యగు కర్మతోగూడి మరల నీ లోకమున కేతెంచి కర్మనాచరించుటకు పూర్వోక్త ఉదకములఁగలసినవాడై ద్వితీయ అగ్నియగు మేఘము నాశ్రయించి వర్షధారల ద్వారా తృతీయాగ్నిగా భావింపఁబడు భూమిఁబ్రవేశించి ఆహారముగా పరిణమించు వ్రీహ్యాది ధాన్యము ద్వారా చతుర్థాగ్నియగు పురుషునిఁజేరి పురుషునియందు శుక్లాకారముగా పరిణమించు సూక్ష్మఉదకాది భూతముల నాశ్రయించియే పంచమ అగ్నిగా నిర్ణయింపఁబడు వనితయందు చొరబడి యట దేహాకారముగా పరిణమించునవి పురుషశబ్దముతో చెప్పఁబడునవి యగు ఉదకాది సూక్ష్మభూతములవలన స్వకృతము ననుసరించు బ్రాహ్మణాదిదేహముతో జన్మించువాడగును.

కావున జీవాత్మ - సూక్ష్మభూతములఁజెందియే రెండవ దేవమానవాది జన్మలు గలవాడగునని ముఖ్యముగా తెలియనగును.

సూ. "త్ర్యాత్మకత్వా త్తు భూయస్త్వాత్" 3-1-2

తేజోజలభూమ్యాత్మకమగు సమస్తంబును త్రివృత్కరణముతో ముప్విధంబగుటఁజేసి మరియొకభూతములతో కూడిన యుదకములే శరీరములో రసరక్తాది కార్యము నెక్కువగా గావించునవి కావున నిట అప్ఛబ్దమును ముఖ్యముగా గ్రహింపవలసివచ్చెను. ఇందువలన "పంచమ్యా మాహుతా వాపః" ఇత్యాదిని కేవలము అప్ఛబ్దము నుపయోగించుటలో విరోధమెద్దియు లేదని తెలియవలెను.

సూ. "ప్రాణగతేశ్చ" 3-1-3

"ప్రాణమనూత్క్రామంతం సర్వేప్రాణా అనూత్క్రామంతి" అను శ్రుతియందు జీవుని వెంట ఇంద్రియములు వెళ్ళునని యుండుటచే ఇంద్రియముల కాశ్రయమగు సూక్ష్మదేహము గూడ నిష్క్రమించుటవలనను భూతసూక్ష్మముల తోడను తదాశ్రయమగు సూక్ష్మదేహముతోడను జీవుఁడు బయలుదేరునని తెలియనగును.

మరియొక ఆశంకకు సమాధానముగా దిగువ సూత్రమును నిరూపించిన వారు.

సూ. అగ్న్యాదిగతిశ్రుతే రితి చేన్న, భాక్తత్వాత్ 3-1-4

ప్రశ్న : "యత్రాస్య పురుషస్య మృతస్యాగ్నిం వాగప్యేతి. వాతం ప్రాణశ్చక్షు రాదిత్యమ్" "పురుషుఁడు మరణించుచుండగా వాక్కు అగ్నిఁజెందును. ప్రాణము వాయువుఁగలియును. నేత్రము సూర్యునాశ్రయించును" ఇత్యాదిశ్రుతిని వాక్కు మొదలగు ఇంద్రియములు అగ్నిమున్నగువానిలో కలియునని వినఁబడుటచే జీవాత్మ-దేహమునుండి వెళ్ళునపుడు ఇంద్రియములు సహగమనము చేయవని చెప్పవలెను గాదా ?

ఉత్తరము : వాక్కు మొదలగు ఇంద్రియములు తమయందభిమానము గల అగ్ని మున్నగు దేవతలఁజెందునని చెప్పుట ముఖ్యము కాజాలదు. ఎందుకనఁగా ? "ఓషధీ ర్లోమాని, వనస్పతీన్ కేశాః'' "రోమములు ఓషధులను తలవెంట్రుకలు వనస్పతులఁజెందును" అను పాఠము ననుసరించి "యత్రాస్య పురుషస్య" ఇత్యాధి వాక్యము పఠింపఁబడినది. ఇఁట వాస్తవముగా వెంట్రుకలు మున్నగునవి మృత శరీరము నాశ్రయించి యుండునవి యైనను వనస్పత్యాదులఁజెందుననుట గౌణమైనట్లు వాగాదీంద్రియములు అగ్న్యాది దేవతలను పొందుటయు ముఖ్యము కాకుండుట గమనింపఁదగినది.

సూ. ''ప్రథమేఽశ్రవణా దితి చేత్తా ఏవ హ్యుపపత్తేః 3-1-5

ప్రశ్న : పంచాగ్నులలో మొదటిదైన ద్యులోకాగ్నియందు చెప్పఁబడనందున నుదకములు జీవాత్మవెంట బయలుదేరవని తెలియుచున్నది. మఱియు "ఏతస్మి న్నగ్నౌ దేవాః శ్రద్ధాం జుహ్వతి" ''స్వర్గలోకమనఁబడు అగ్నియందు దేవతలు శ్రద్ధను హవనముఁజేయువారు" అను శ్రుతివాక్యము ననునరించి పంచమాగ్నియందు శ్రద్ధ యనియే చెప్పవలెను కాని యుదకములని చెప్పుట సరిపడదు గదా !

ఉత్తరము : ఉదకములే శ్రద్ధాశబ్దముతో చెప్పఁబడును. ఎట్లనఁగా ? ఉదకములఁగూర్చి ప్రశ్నించినపుడు శ్రద్ధయని సమాధానము లభించినందున శ్రద్ధా శబ్దము సిటియందు సరిపడుచున్నయది. ఇందుకు "శ్రద్ధా వా ఆపః" అను శ్రుతియే ప్రబల ప్రమాణ మగును.

మరియొక ఆశంకకు దిగువ సూత్రము సమాధానము

సూ. "అశ్రుతత్వా దితి చే న్నేష్టాదికారిణాం ప్రతీతేః" 3-1-6

ప్రశ్న : ఈ సందర్భమున ప్రశ్నోత్తరములయందు ఉదకములే స్ఫురించు చున్నవి కాని యవ్వానితో కౌగలింపఁబడిన జీవాత్మ బోధపడుట లేదు గదా ?

ఉత్తరము : ఇదే సందర్భమున తరువాత ''అథ య ఇమే గ్రామే ఇష్టా. పూర్తే దత్తమిత్యుపాసతే, తే ధూమ మభిసంభవంతి, ధూమాద్రాత్రిం, రాత్రే రపరపక్ష మపరపక్షా ద్యాన్ షడ్దక్షిణైతి మాసాం స్తా నైతే సంవత్సర మభి ప్రాప్నువంతి, మా సేభ్యః పితృలోకం, పితృలోకా దాదిత్య, మాదిత్యా చ్చంద్ర మస మేష సోమో రాజా తద్దేవానా మన్నం, తం దేహా భక్షయంతి, తస్మిన్ యావత్సంపాత ముషిత్వాఽథైత మేవాధ్వానం పున ర్నివర్తంతే. యథేతమాకాశ మాకాశా ద్వాయుం, వాయు ర్భూత్వాధూమో భవతి, ధూమోభూత్వాఽభ్రంభవతి, అభ్రంభూత్వా మేఘో భవతి, మేఘో భూత్వా ప్రవర్షతి, త ఇహ వ్రీహియవా ఓషధివనస్పతయ స్తిలమాషా ఇతి జాయంతే, అతోవై ఖలు దుర్నిష్ప్రపతరం యో యో హ్యన్న మత్తి, యో రేతః సించతి తద్భూయ ఏవ భవతి''

"జీవాత్మలు భూలోకమున యజ్ఞములను వాపీకూపతటాకాదులను త్రికరణశుద్ధిగా గావించి జీవితాంతమున పొగలో పయనింతురు. ఆ పిమ్మట రాత్రి యందభిమానముగల దేవతల నాశ్రయించి కృష్ణపక్షాభిమానులగు అమరులఁజెంది దక్షిణాయనమునందభినివేశము గల దివ్యవ్యక్తులఁదెసకు వెళ్ళుదురు. ఆ తరువాత దక్షిణాయనగత మాసషట్కమునుండి పితృలోకమును, పితృలోకమునుండి సూర్యుని, సూర్యునుండి చంద్రునాశ్రయింతురు. చంద్రసన్నిధినుండు జీవులు చంద్రసమాన స్వరూపము గలవారై దేవతలకు శేషభావము నొంది యట కర్మ భోగము వరకు నివసింతురు. పిమ్మట యత్కించిత్ కర్మశేషమును వెంట నిడుకొని పూర్వోక్త మార్గము ననుసరించియే స్వర్గమునుండి భూలోకమునకు మఱలి వత్తురు. ఎట్లనఁగా? మొదట ఆకాశమునఁబ్రవేశించి వాయువు నాశ్రయించి వాయువు ద్వారా ధూమముఁజెందుదురు. ధూమముద్వారా మేఘములో చొఱబడి మేఘమునుండి వర్షముద్వారా వరిధాన్యములయందు ఓషధివనస్పతులలోను అథవా నువ్వులు మినుములు

ములు గోధుమలు మున్నగు ధాన్యములయందును ప్రవేశింతురు. ఈధాన్య ప్రవేశము తప్పించుకొన నలవి గానిదగును. ఇఁక నెవరెవరు ఏయే ఆహారము ననుభవింతురో రేతస్సుగా పరిణమించు ఆ యా భుక్తాన్నముద్వారా వారువారు గర్భమునఁబ్రవేశించి క్రమాభివృద్ధిని వ్యక్తులుగా జన్మింతురు." అను శ్రుతియందు స్వర్గమున చంద్రుల లగుదురని చెప్పఁబడిన జీవులు అమృతమయ దేహములతో పుణ్యఫలము ననుభవింతురనియు పుణ్యకర్మ ముగిసిన పిమ్మట భూలోకమునకేతెంచి గర్భవాసము నొందుదురనియు నిరూపించుటఁజేసి యజ్ఞాది పుణ్యకర్మల నాచరించు జీవులే "తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవాః శ్రద్ధాం జుహ్వతి, తస్యా ఆహుతేః సోమో రాజా సంభవతి" "అగ్నివంటి స్వర్గమునందు దేవతలు శ్రద్ధయనఁబడు ఉదకాదివిశిష్ట సూక్ష్మదేహముతోకూడిన జీవాత్మను ప్రవేశింపఁజేయుదురు గావున నాతడు చంద్రునివలెఁ బ్రకాశించు రూపము గలవాడగును." అను శ్రుతియందు సోమ రాజశబ్దముతో జ్ఞాపకము గావింపఁబడినందున నీ సందర్భమున ప్రశ్నోత్తరముల యందు ఉదకములతో కూడియున్న జీవులే "ఆపః, అను శబ్దముతో చెప్పఁబడుచున్నవారు కావున నెట్టి విరోధంబును లేదు.

సూ. "భాక్తం వాఽనాత్మవిత్త్వాత్ తథా హి దర్శయతి" 3-1-7

ప్రశ్న. "ఏష సోమో రాజా తద్దేవానా మన్నం, తం దేవా భక్షయంతి" అనుచో సోమరాజభావముగల వాడే దేవతలతో ననుభవింపఁబడునని వినఁబడుచున్నందున నిట్టివాడు జీవుఁడు కాజాలడు గదా ?

ఉత్తరము ; ఇఁట దేవతలతో ననుభవింపఁబడునని చెప్పుటలో సారాంశ మేమనఁగా ? భూలోకమందున్నపుడు పరమేశ్వరోపాసనరహితులై కేవలము కామ్యకర్మల నాచరించి స్వర్గముఁజెందినవారు దేవతలకు పరిచారకులు అనఁగా నవ్వారి యానతిని స్వర్గసుఖము ననుభవించువారని తెలియునది. మరియు "యథా పశురేవం స దేవానామ్" అను శ్రుతియు పరమేశ్వరు నుపాసింపనివారు (మానవులకు పశువులవలె) దేవతలకు నుపకరణములగుదురని వక్కాణించినది. అందువలన శివోపాసకులు పరమేశ్వరునికి నుపకరణములగునట్లు- అనుపాసకులు దేవోపకరణములగుదురనియు జీవుఁడు సర్వథా దేహాంతరము నొందుటలో భూత సూక్ష్మములఁగూడుకొనియే ప్రకృత శరీరమునుండి బయలువెడుననియు సిద్ధాంతము.

## కృతాత్యయాధికరణము

సూ. "కృతాత్యయేఽనుశయవాన్ దృష్టస్మృతిభ్యాం యథేత మనేవం చ"
3-1-8

పూర్వాధికరణమునందు జీవాత్మ - భూతసూక్ష్మములతో కూడిన లింగ శరీరము గలవాడయ్యే స్వర్గాదిలోకములఁ బ్రవేశించి దేవాదిశరీరమున నిజకర్మ ననుసరించి సుఖము ననుభవించునని నిరూపింపఁబడినది.

ఐతే నీ యధికరణమునందు స్వర్గాదిలోకములయందు సుఖభోగము ముగిసిన పిమ్మట జీవుఁడు భూలోకమునకు కర్మశేషముతో గూడి నవతరించునా? లేక పూర్తిగా కర్మల ననుభవించియే వచ్చునా? అని సందేహము.

ప్రశ్న : ఈ సందర్భమున పురుషుఁడు ఎట్టి కర్మశేషము లేకయే స్వర్గము నుండి యీ లోకమును గురించి వచ్చునని చెప్పుట సమంజసమని తోచెడిని. అనుశయమనఁగా? జీవు ననుసరించు కర్మశేషమగును. స్వర్గమునుండి యవతరించు పురుషునకు కర్మశేషము సంగతము కాజాలదు. ఎందుకనఁగా? "యావత్సంపాత ముషిత్వా అథైతమేవాధ్వానం పునర్నివర్తంతే" "సంపాతము (కర్మసమూహము) అనుభుక్త మగువరకు స్వర్గాదిలోకములయందు నివసించి తరువాత ఆకాశాది మార్గమున భూలోకమునకు ప్రాణులు మఱలివత్తురు" అను శ్రుతి అనుశయ(కర్మశేష)మును గూడ స్వర్గమున జీవుఁడనుభవించునని తెలుపుచున్నందున స్వర్గాది లోకములయందే నిశ్శేషముగా కర్మఫలము ననుభవించి కర్మరహితుడయ్యే జీవుడు (స్వర్గమునుండి) దిగి వచ్చునని భావింపవలెను గదా?

ఉత్తరము : సుకృతభోగము తరువాత స్వర్గము నుండి యవతరించునపుడు కర్మశేషముఁగూడియే వచ్చునని దిగువ నుదహరింపఁబడిన శ్రుతిస్మృతులఁ బట్టి విదిత మగుచున్నది.

"రమణీయచరణా అభ్యాశో హ యత్తే రమణీయాం యోని మాపద్యేరన్ బ్రాహ్మణయోనింవా క్షత్రియయోనింవా వైశ్యయోనింవా: అథ య ఇహ కపూయచరణా అభ్యాశో హ యత్తే కపూయాం యోని మాపద్యేరన్ శ్వయోనిం సూకరయోనింవా చండాలయోనింవా" శ్రుతి.

"చరణమనఁగా కర్మశేషము; పుణ్యకర్మశేషముగలవారు స్వర్గమునుండి యవతరించిన వెంటనే శ్రేష్ఠమైన బ్రాహ్మణ క్షత్రియ వైశ్యాది జన్మముల నొందుదురు. ఇఁక పాప కర్మశేషము గలవారు నరకాదులనుండి బయలుదేరిన తోడనే కుక్కజన్మనుగాని పందిశరీరమునుగాని చండాలాది దేహములఁగాని పొందుదురు".

"జాయంతే పుణ్యకర్మణా"స్మృతి.

"పుణ్యకర్మశేషముతోడను లేక పాపకర్మశేషముతోడను భూలోకమున జీవులు జన్మింతురు."

అట్లు కానియెడల తత్కాలమున జన్మించిన బాలుఁడు ధర్మమును గాని అధర్మమునుగాని చేయువాడు కాకుండుటచే సుఖమునుగాని దుఃఖమునుగాని యనుభవించుట పొసగకుండును. కావున కర్మశేషముఁగూడియే పూర్వము మరణానంతరము ఏమార్గమునవెళ్ళినాడో ఆమార్గము ననుసరించియైనను మరియొక మార్గమునైనను భూలోకమునకేతెంచునని తెలియునది.

ధూమము రాత్రి కృష్ణపక్షము దక్షిణాయనము షణ్మాసములు పితృలోకము ఆకాశము అనువాని క్రమముగాను మరియొక విధముగాను జీవుఁడు వచ్చునని సారాంశము.

మరియొక ఆశంకకు మతాంతరమున సమాధానము దిగువ సూత్రము.

సూ. "చరణా దితి చేన్న, తదుపలక్షణార్థేతి కార్ష్ణాజినిః" 3-1-9

ప్రశ్న : "రమణీయ చరణాః" "కపూయ చరణాః" అనుచో చరణ శబ్దము ఉన్నంతమాత్రమున అనుశయమను నర్థమును చెప్పరాదు. వస్తుతః చరణశబ్దము సంధ్యావందనాది స్మార్తాచారమును తెలుపునది గదా !

ఉత్తరము : అట్లు కాదు. చరణశబ్దఘటితమైన శ్రుతి - అనుశయమే ఉపలక్షణముగా గల కర్మసమూహమును నిరూపించినది కావున నట్టి కర్మసమూహమే స్వర్గసుఖాదుల నొనగూర్చునని కార్ష్ణాజిని యభిప్రాయము.

సూ. "అనర్థక్యమితి చేన్న తదపేక్షత్వాత్" 3-1-10

ప్రశ్న : చరణశబ్దమునకు సశేషమగు కర్మసమూహమను నర్థముఁ జెప్పిన యెడల స్మార్తాచారమునకు ఉపయోగము లేమింజేసి సంధ్యావందనాదికము నిరర్థకమగును కాదా ?

ఉత్తరము : సుకృత (పుణ్యకర్మ) మంతయు సంధ్యావందనము మొద లగు నిత్యకర్మను పురస్కరించుకొనియే యుండునది.

శ్లో॥ సంధ్యాహీనోఽశుచిర్నిత్య-మనర్హః సర్వకర్మసు ।
యదన్య త్కురుతే కర్మ - న తస్యఫల భాక్ భవేత్॥

ప్రతిదినము సంధ్యావందనాది నిత్యకర్మలను ఆచరింపనివాడు ఇతర పుణ్యకర్మల నన్నిటి నాచరించుటకు వలయు నధికారమును గోల్పోవును. ఒక వేళ నిత్యకర్మలఁ గావింపక కామ్యకర్మల నాచరించునెడల నట్టి పుణ్యములు ఫలింపకుండును.

అనఁగా సంధ్యావందనాది స్మార్తాచారము - కర్మాధికారమును నిరోధించు నపవిత్రత్వమును కలుగఁజేయు పాపములను బోకార్చును గావున స్మార్తాచారము నిరర్థకము కాజాలదని భావము.

సూ. "సుకృతదుష్కృతే ఏవేతి తు బాదరిః 3-1-11

"రమణీయచరణాః" "కపూయచరణాః" అనుచో గల చరణశబ్దముతో సుకృతము దుష్కృతంబును చెప్పఁబడుచున్నవి. "పుణ్యకర్మము ఆచరించు చున్నవాడని" లోకమున ప్రసిద్ధిని గాననగునని బాదరిమహర్షి భావించెను. ఇదియే సూత్రకారుని మతము.

ఆచరణశబ్దము పుణ్యపాపములఁ జెందునదియేను; ప్రతి పుణకర్మయు స్మార్తాచారమును పురస్కరించుకొని యుండునదని మేమును అంగీకరించితిమి.

ఇందువలన సుకృతము దుష్కృతము అనువాని శేషము (అనుశయము) గలవాడయ్యే జీవుఁడు స్వర్గాదులనుండి యవతరించునని విశదమైనది.

## అనిష్టాదికార్యధికరణము

పూర్వపక్షసూత్రము.

సూ. "అనిష్టాదికారిణా మపి చ శ్రుతమ్" 3-1-12

జ్యోతిష్టోమాది యాగములను ఆరామకూపాది అపూర్తములను చేయువారికి చంద్రలోక(స్వర్గ) గమనము ఉన్నట్లు పుణ్యముల నాచరింపక పాపములఁ గావించినవారికిని చంద్రగమనము కలదా? లేదా? అని సందేహము.

ప్రశ్న. ఇట్టి సందర్భమున ఇష్టాపూర్తములను చేయనివారు గూడ చంద్రలోకమునకు వెళ్లుదురని "య ఏవైకే చాస్మా ల్లోకాత్ ప్రయంతి చంద్రమస మేవ తే సర్వే గచ్ఛంతి" "ఈ లోకమునుండి వెళ్లువారందరు చంద్రుడు మొదలగు దేవతలు నివసించు స్వర్గముఁ బ్రవేశింతురు" అని-శ్రుతి తెలుపుచున్నందున పుణ్యాత్ములకు పాపాత్ములకును సర్వసాధారణముగా చంద్రలోక గమనము కలదని తెలియుచున్నయది.

ఒకవేళ పాపాత్ములకు చంద్రలోకమున సుఖానుభవము లేదందురేని-నరకాదులయందు పాపఫలము ననుభవించినపిమ్మట భూలోకమున శరీరముఁ గ్రహించుటకు ఐదవ ఆహుతియగు రేతస్సుఁ బ్రవేశించుటకై మొదటి ఆహుతియగు శ్రద్ధను పొందుటకు స్వర్గ (చంద్ర) గమనము అనివార్యంబగుచున్నయది.

కావున ఇష్టాపూర్తాదుల నాచరింపనివారికిని చంద్రగమనము సమంజసంబే యగును కాదా?

ఉత్తరము:

సూ. "సంయమనే త్వనుభూయేతరేషా మారోహావరోహౌ తద్గతిదర్శనాత్" 3-4-13

ఇష్టాపూర్తాది పుణ్యములను చేయనివారు చంద్రలోకమునకు వెళ్ళజాలరనియు యమలోకమునందు కర్మఫలము ననుభవించి దిగి వత్తురనియు ఇట్టిదే అవ్వారి ఆరోహణము అవరోహణంబుననియు తెలియునది. ఇందుకు శ్రుతిప్రమాణము "వైవస్వతం సంగమనం జనానామ్" "జనానాం=అనగా పాపాత్ములకు యమలోకము గమ్యస్థానమగును" చంద్రలోకమునఁబడు స్వర్గమునకు వెళ్ళుట పుణ్యభోగము కొరకనియు ఐదవ ఆహుతిఁబొందు స్త్రీరూప అగ్నిఁజెందుటకు గాదనియు గ్రహింపనగును. పూర్వము ద్రోణాచార్యుడుమున్నగువారు స్త్రీరూపాగ్నియందు వలయు

ఆహుతి లేకయే జన్మించుట గమనింపఁదగినది. కావున పాపాత్ములకు యమలోక ప్రాప్తియే సమంజసంబైనదని సారాంశము.

సూ. "స్మరంతి చ" 3-1-14

శ్లో॥ సర్వే చైతే వశం యాంతి–యమస్య భగవన్ కిల;

"పాపాత్ములందరు యమధర్మరాజు ఆధీనులగుదు" రని పరాశర స్మృతి మొదలగు ప్రమాణములు చాటుచున్నవి.

సూ. "అపిచ సప్త" 3-1-15

సాధారణముగా పాపఫలము ననుభవించుటకు యమలోకము సరిపడును గాని యపరిమితపాపములఁ గావించినవారు తమ పాపఫలముల ననుభవించుటకు పాతాళమునందు రౌరవాదిమహానరకములు ఏడు కలవని స్మృతికారులు నిరూపించిరి.

సూ. "తత్రాపి చ తద్వ్యాపారా దవిరోధః" 3-1-16

చిత్రగుప్తుడు మొదలగువారి ఏలుబడిలో నున్న రౌరవాది నరకములయందును చిత్రగుప్తాదులను ప్రేరేపించు యముని శాసనముండుటఁజేసి యమలోకము నరకములున్ను యమాధీనములనుటలో విరోధమేమియు లేదు.

సూ. "విద్యాకర్మణో రితి తు ప్రకృతత్వాత్" 3-1-17

విద్యయనఁగా-శివోపాసనము, కర్మయనగా-పుణ్యములనాచరించుట, ఇవ్వానికి బ్రహ్మప్రాప్తియు స్వర్గప్రాప్తియు ఎట్లనఁగా?

"తద్య ఇత్థం విదు ర్యే చేమేఽరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే తేఽర్చిష మభిసంభవంతి, అథయఇమే గ్రామే ఇష్టాపూర్తే దత్తమిత్యుపాసతే తే ధూమ మభిసంభవంతి" శ్రుతి.

"అరణ్యము మొదలగు పవిత్రస్థలములయందు శ్రద్ధాభక్తులు గలవారై నక్తవ్రతాది కఠిననియమముల నవలంబించి పరమేశ్వరుని ఆరాధించువారు అర్చిరాది మార్గమున పునరావృత్తిరహితమగు శివపదమునఁ బ్రవేశింతురు. ఇఁక గ్రామము

మున్నగు చోటులయందు యజ్ఞములను ఆరామకూపాదులను దానములను గావించిన వారు ధూమాదిమార్గమున స్వర్గాది పుణ్యలోకములకు వెళ్లుదురు" అనుచో బ్రహ్మ గమనమును గురించియు చంద్రగమనమును గురించియు ఉపాసనా పుణ్యకర్మలే ప్రశంసింపబడినందున పాపాత్ములకు బ్రహ్మగమనము గాని చంద్రగమనముగాని విహితములు కాజాలవని సిద్ధాంతము.

సూ. ''న తృతీయే తథోపలబ్ధేః'' 3-1-18

కొందరికి-శరీరారంభము పంచమాగ్నియగు స్త్రీయందు ఆహుతి లేకయే సంభవించుటఁజేసి తృతీయస్థానీయులగు పాపాత్ములు ప్రథమాహుతి బొందుటకు స్వర్గమునకు వెళ్ళవలసిన యవసరము లేదని దిగువశ్రుతియందు గాననగును.

"అథై తయోః పథో ర్న కతరేణ చ, తానీమాని క్షుద్రాణ్యసకృదావర్తీని భూతాని భవంతి, జాయస్వమ్రియస్వేత్యేతత్ తృతీయస్థానం, తేనాసౌ లోకో న సంపూర్యతే"

ప్రవాహణుడు ''వేత్థయథా ఽసౌ లోకో న సంపూర్యతే" ''అనేకులు పుణ్యాత్ములు వెళ్ళినను స్వర్గలోకము పరిపూర్ణము కాదెందులకు? అని శ్వేతకేతుని ప్రశ్నించి యాతడు ప్రతివచనమును చెప్పఁజాలనందున తానే సమాధానమును దిగువవిధము వక్కాణించెను.

"దేవయాన పితృయానములనఁబడు రెండు మార్గములలో నేదే నొక మార్గమున పాపాత్ములు వెళ్ళఁజాలరు. మరియు "పుట్టుము"! "చావుము"! అను మాటలను సార్థకమొనర్చుటకు ననేకపర్యాయములు పేను ఈగ దోమ మున్నగు క్షుద్రజన్మలనుపొందుచు మరణించుచుందురు. ఇట్టి అసంఖ్యాకమైన ఆవృత్తిగల జన్మపరంపరతో కూడినది, యమలోక నరకభుక్త పాపశేషము గలవారు ఆశ్రయించునదియు తృతీయస్థానమగును. (అనగా నరకములు నరకవాసమునుండి బయలుదేరి పొందఁబడు నీచజన్మలున్ను తృతీయస్థానమనఁబడుననియు దేవయాన పితృయానమార్గములు రెండున్ను పాపాత్ములకు లభింపవనియు భావము) క్షుద్రజంతువులకు మార్గాంతరములు అనంతములుండుట చేతను దేవయానపితృయానమార్గ ప్రాప్యమగు చంద్రలోకము పాపులకు లభింపదు.

గావునను ఎన్నియో క్షుద్రజంతువులచే భూలోకము నిండనట్లు స్వర్గలోకంబు నసంఖ్యాక పుణ్యాత్ముల వలనను సంపూర్ణము కాజాలదు.

ముఖ్యముగా పాపాత్ములే తృతీయస్థాన మనఁబడుదురు. కావున పాపాత్ములకు స్వర్గగమనము లేదని తెలియనగును.

సూ "దర్శనా చ్చ" 3-1-20

మరియు "తేషాం ఖల్వేషాం భూతానాం త్రీణ్యేవ బీజాని భవంతి, అండజం జీవజ మద్భిజ్జ మితి" జన్మించు ప్రాణులందరికి అండజత్వమనియు జీవజత్వ మనియు ఉద్భిజ్జత్వ మనియు మూడే బీజములు ఒప్పారును"

అండజమనఁగా? గ్రుడ్డువలనఁ బుట్టునది, జీవజమనఁగా గర్భమువలన జనించునది, ఉద్భిజ్జమనగా భూమిఁబెకిలించుకొని జన్మించునది, ఇవ్వానిలో స్వేదజములకు ఉద్భిజ్జములకును పంచమాహ్వతి యవసరము లేదని శ్రుతియందును లోకమునందును గాననగును.

"జీవజం ఉద్భిజ్జం" అనుచో స్వేదజశబ్దము లేదు గదా యను ప్రశ్నకు సమాధానము దిగువ సూత్రము.

సూ. "తృతీయశబ్దావరోధః సంశోకజస్య" 3-1-21

సంశోకజ మనఁగా స్వేదజమగును. (అనఁగా చెమటవలనఁబుట్టు ప్రాణిజాతము) పై శ్రుతియందు మూడవదగు ఉద్భిజ్జశబ్దముతో స్వేదజము గ్రహింపఁబడుచున్నయది.

ఇత్యాది సందర్భమునఁజేసి పాపాత్ములకు స్వర్గగమనములేదని తేటతెల్లమైనది.

## తత్స్వాభావ్యాపత్త్యధికరణము

సూ. "తత్స్వాభావ్యాపత్తి రుపపత్తేః" 3-1-22

సుకృతఫలము ననుభవించిన తరువాత స్వర్గమునుండి కర్మశేషముతో గూడియే జీవుఁడవతరించునని పూర్వము నిరూపింపఁబడినది. ఐతే స్వర్గమునుండి దిగివచ్చు జీవాత్మ- ఆకాశాదిభావమును పొందునని "అథైతమేవాధ్వానం పునర్నివర్తంతే, యథేత మాకాశ మాకాశా ద్వాయుం, వాయుర్భూత్వా ధూమో భవతి, ధూమో భూత్వాఽభ్రం భవతి, అభ్రం భూత్వా మేఘో భవతి, మేఘో భూత్వా ప్రవర్షతి" అను శ్రుతి విశదీకరించుచున్నందున జీవునకు ఆకాశాదిరూపము ఏర్పడునా ? లేక ఆకాశ వాయు ధూమ అభ్ర మేఘములతో సమానత్వమా? అని సంశయము కలుగుచున్నయది.

ప్రశ్న : పై శ్రుతియందు "భూత్వా" అను శబ్దముండుటఁజేసి జీవుడు స్వర్గమునుండి దిగివచ్చునపుడు ఆకాశము మున్నగు రూపములు కలవాడగునని చెప్పవలెను కాదా ?

ఉత్తరము : స్వర్గావరోహణముఁజేయు జీవుఁడు ఆకాశాదిరూపముల నొందువాడు కాదనియు అవ్వానితో సమానభావముఁజెందుననియు చెప్పుట సమంజసమగును. ఎందుకనఁగా ? ఆకాశాదిభావము నొందునపుడు సుఖము గాని దుఃఖము గాని యనుభవింపఁబడదు. లోకమున సుఖదుఃఖానుభవముకొరకే జీవునకు ఆ యా శరీరముల సంబంధ మేర్పడును గదా ! మఱియు ఒకనికి మరియొకని రూపము సంభవింపకుండును. కావున స్వర్గమునుండి యవతరించు జీవుఁడు ఆకాశాదిభావమును పొందునపుడు సుఖదుఃఖముల ననుభవింపడను యుపపత్తివలన తత్స్వాభావ్యమును అనఁగా ఆకాశాది సాదృశ్యమును పొందునని గ్రహింపవలెను.

## నాతిచిరాధికరణము

సూ. "నాతిచిరేణ విశేషాత్" 3-1-23

స్వర్గమునుండి దిగివచ్చునపుడు ఆకాశాదులయందు తడవుఁజేయునా ? లేదా ? అని సందేహము.

ప్రశ్న : అవతరణ సందర్భమున మేఘముద్వారా వర్షము కురిసిన పిమ్మట "త ఇహ వ్రీహియవా ఓషధివనస్పతయ స్తిల మాషా జాయంతే" "జీవులు వరిధాన్యములుగాను ఓషధులుగాను వనస్పతులుగాను నువ్వులు మినుములు మున్నగునవిగాను జన్మింతురు, అను శ్రుతివాక్యము. జీవాత్మలకు వ్రీహ్యాదిభావమును చెప్పుచున్నందున వ్రీహియవాదిభావమునకు ముందు ఆకాశాదులయందు జీవులు జాగు సేయవచ్చును, లేక త్వరపడవచ్చుననియు ఆలస్యమును గూర్చి గాని శీఘ్రత్వమును గురించి గాని నియమము లేదనియు చెప్పవలెను కాదా ?

ఉత్తరము : వరిధాన్యము మున్నగువానిఁ బ్రవేశించుటకు ముందు ఆకాశాదులయందు జీవుఁడు మిక్కిలి జాగు సేయడనియే చెప్పవలెను, ఎందుకనగా ? "అతో వై ఖలు దుర్నిష్ప్రపతరమ్" అను శ్రుతివాక్యము వ్రీహ్యాదిభావమునుండి బయలుపడుట సులభము కాజాలదని తెలుపుచున్నయది. ఐతే జీవుఁడు ఆకాశాదులయందు త్వరపడుననియు వ్రీహిధాన్యాదులయందు విలంబముఁ జేయుననియు సారాంశముగ తెలియవలెను.

## అన్యాధిష్ఠితాధికరణము

సూ. "అన్యాధిష్ఠితే పూర్వవ దభిలాపాత్" 3-1-24

ఈ సందర్భమున జీవాత్మ వరిధాన్యములు మున్నగువానిని కలిసికొనునా? తద్రూపమున జన్మించునా ? అని సందేహము.

ప్రశ్న : "జాయంతే" అను పదము వలన జీవులు వ్రీహ్యాదిరూపమున జన్మింతురని చెప్పవలెను కాదా ?

ఉత్తరము : వ్రీహ్యాదులు మరియొక జీవులతో నధిష్ఠింపఁబడుటఁ జేసి బ్రాహ్మణాది జన్మలను పొందు జీవుఁడు ధాన్యములయందు సంక్రమించి మాత్ర ముండును. ఆకాశాదులయందువలె ధాన్యములయందును జన్మ హేతువగు కర్మ విశేషము చెప్పఁబడనందున జీవునకు సంశ్లేషము మాత్ర మగును. "జాయంతే" అను శ్రుతి గౌణార్థకమైనది. అనఁగా జన్మార్థమును ముఖ్యముగా బోధించుటలేదు

బ్రాహ్మణాది జన్మ గల చోట "రమణీయచరణాః" "కపూయచరణాః" "శుభ కర్మాచరణ గలవారు" "దుష్టకర్మ నాచరించువారు" అను నంశము వక్కాణింపఁబడుచున్నది. కావున బ్రాహ్మణాదిజన్మలకంటె నితరములైన ధాన్యాదుల యందు జీవునకు సంబంధము మాత్రమని సిద్ధాంతము.

సూ. అశుద్ధ మితిచే న్న శబ్దాత్" 3-1-25

ప్రశ్న: స్వర్గమునుండి యవతరించు పురుషుఁడు పూర్వానుష్ఠితములైన యాగాదులయందు పశుహింసఁజేసినవాడగుటచే నశుద్ధమగు సుకృతముఁ దగు ఫలము ననుభవించుటకు ధాన్యాది జన్మల నొందవలసి వచ్చును గదా !

ఉత్తరము : "హిరణ్యశరీర ఊర్ధ్వం స్వర్గం లోక మేతి"

"యాగపశువు హింసింపఁబడినను ప్రస్తుత శరీరవిమోచన సమనంతరమే పైన స్వర్గలోకమునకు వెళ్ళును"

" న వా ఉ వేతన్మ్రియసే, నరిష్యసి"

ఓ యాగపశువా ? ఇప్పుడు నీవైతే మరణించుచులేవు. హింసింపఁబడుచు లేవు గూడా"

అనుశ్రుతులఁబట్టి యజ్ఞయాగములలో చేయఁబడు పశుహింసను అహింసగా భావింపవలెను కావున యాగాదులయందు వస్తుతః హింస లేమింజేసియట్టి సుకృతములు పరిపూర్ణశుద్ధిగలవగుటఁజేసియు స్వర్గావరోహణముఁజేయు పుణ్యాత్ములు ధాన్యాదిజన్మలను పొందువారు కాజాలరని సారాంశము.

మరియొక నుపపత్తిఁ జెప్పుచున్నవారు.

సూ. "రేతఃసిగ్యోఽథ" 3-1-26

"యో యో హ్యన్న మత్తి యో రేతః సించతి తద్భూయ ఏవ భవతి"

"ఎవడెవడు ఎట్టి ఆహారమును భుజించునో తన్మూలకమగు రేతస్సును విడుచునో అట్టి రేతస్సువలన గొప్పవాడగును. అనఁగా శరీరియగును" అనుశ్రుతి వాక్యము -పురుషేంద్రియముఁ దగు సంబంధమును మాత్రము చెప్పుచున్నందున పూర్వము గూడ ధాన్యాదులయందు జీవునకు సంయోగంబే యని తెలియవలెను.

సూ. "యోనేః శరీరమ్" 3-1-27

జన్మించు పురుషునకు రేతస్సుద్వారా యోనిలో ప్రవేశించిన పిమ్మటనే శరీరము ఏర్పడును. కావున యోనిప్రాప్తికిముందు అకాశాది సర్వస్థలములయందు సంశ్లేషము చూత్రమగునని తెలియునది.

ఇయ్యది
శ్రీ నీలకంఠ శివాచార్యవిరచితంబైన
బ్రహ్మమీమాంసాసూత్ర భాష్యమునందు
మూడవ యధ్యాయముఁదగు మొదటిపాదము
శ్రీకంఠమణిప్రభామయూఖంబను ఆంధ్రానువాదముతో ముగిసినది.

---


శ్రీ శివసహస్రనామ రహస్యార్థము
ముద్రితము
రచన :- శివశ్రీ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు
ప్రాప్తిస్థానము- 184/ఎ, వెస్ట్ మారేడుపల్లి. సికింద్రాబాద్-500 026
వెల రూ. 21=00

క్రౌన్ 1/8 346 పేజీలలో ప్రతినామమునకు విశదమైన అర్థము వ్రాయబడినది. శ్రీ ఆద్యశంకరాచార్యులు- విష్ణుసహస్రనామములకు అర్థమును వ్రాసి-శివసహస్రనామార్థమును. శ్రీ శాస్త్రిగారికి అవకాశము నీయవలెనని కాబోలు- ఉపేక్షించిరి. శివమహాపురాణాంతర్గతములగు ఈ శివసహస్రనామముల పారాయణ విధానము, పూర్వాపరసందర్భము, ఫలశ్రుతి, ఋషి, ఛందస్సు, దేవత, బీజము శక్తి, కీలకము సంకల్పము పొందుపరుపఁబడినందున పారాయణముఁజేయువారికి మరియు శివు నర్చించువారికి నుపయుక్తముగ నున్నయది. ఇందు సహస్రనామ శ్లోకములు, నామావళి కలవు. మొత్తం 1101 శివనామార్థము వ్రాయబడినది.

కొలది ప్రతులు మాత్రము గలవు గాన వలయువారు త్వరపడి నేడే కార్డు వ్రాస్తూ అడ్వాన్సుపై అడ్రసునకు పంపవలెను

శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్యకృత
# శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

## తృతీయాధ్యాయము

## ద్వితీయపాదము

## అంధ్రీకరణము

# సంధ్యాధికరణము

పూర్వపక్ష సూత్రములు.

సూ. "సంధ్యే సృష్టి రాహ హి" 3-2-1

ప్రథమపాదమునందు అధికారుల వైరాగ్యమును దృఢపఱచుటకు జీవాత్మ౦ దగు పరలోకగమనము ఇహలోకాగమనము తదితరములున్ను నిరూపింపఁబడినవి. ఇఁక నీ రెండవ పాదమునందు జీవుని స్వప్నాదిదశ విచారింపఁబడును. జాగ్రత్సుషుప్తుల రెంటి సంధియందుండు స్వప్నమునందు-

"న తత్ర రథా రథయోగా న పంథానో భవంతి, అథ రథాన్ రథయోగాన్ పథః సృజతే" "రథములు గాని, రథములను వహించు అశ్వములు గాని రథమార్గములు గాని ప్రత్యక్షగోచరములుగా నుండవు. కాని రథములను రథవాహనములను మార్గములను రచించును" ఇత్యాద్యశ్రుతి-సృష్టిఁజెప్పుచున్నందున నిద్ది జీవకృతమా పరమేశ్వరుని రచనయా అని సందేహము.

ప్రశ్న : స్వప్నసృష్టి జీవకృతమనియే తోచెడిని.

"అథ వేశాంతాః పుష్కరిణ్యః స్రవంత్యః సృజతే, సహి కర్తా" "మడుగులు

కొలనులు, నదులు ఇట్టివానిని స్వప్నమునఁ బుట్టించు జీవాత్మ కర్త యనఁదగును" అను శ్రుతివాక్యము- స్వప్నముఁగాంచు జీవుడే స్వప్నగత పదార్థములను నిర్మించు నవి చెప్పుచున్నది గదా!

మఱియు

సూ. "నిర్మాతారం చైకే పుత్రాదయశ్చ" 3-2-2

"య ఏష సుప్తేషు జాగర్తి కామంకామం పురుషో నిర్మిమాణః" "ఇంద్రియములన్నియు నిద్రించినపుడు పురుషుఁడు జాగరూకుడై తన యభీష్టములను నిర్మించుకొనును" అను శ్రుతిననుసరించి జీవుఁడు స్వప్నమున కామితముల నేర్పరచుకొనువాడని కొందరు వక్కాణించుచున్నవారు. శ్రుతివాక్యగతకామ శబ్దము పుత్రాదులఁజెప్పునది. ఇద్దానికి పూర్వమగు సందర్భమున "సర్వాన్ కామాన్ ఛందతః ప్రార్థయస్వ" "కోర్కెలన్నిటిని యథేష్టము ప్రార్థించుము" అని నుడివి "శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ" "శతవత్సరములు జీవించు కుమారులను మనుమలను వరించుము" అని విశదకరించినందున స్వప్నములో నెరవేరుచున్న రథాదిరచనను జీవాత్మయే గావించునని బోధపడుచున్నది కాదా?

అనఁగా కోర్కెలఁబడయుట పుత్రపౌత్రాదులను వరించుటయు జీవాత్మకు సంబంధించినవి యగుటచే నియ్యది జీవప్రకరణమగును కావున స్వప్నగత వస్తు రచనయు జీవకృతము కాదగునని సారాంశము.

ఉత్తరము :

సూ. మాయామాత్రం తు కార్త్స్న్యేనానభివ్యక్తరూపత్వాత్" 3-2-3

స్వప్నములో కనఁబడు రథములు మున్నగు వస్తువులను కల్పించువాడు పరమేశ్వరుఁడే గాని జీవుఁడు కాజాలడు ఒక్కడే జీవాత్మ యనుభవింపఁదగిన స్వప్నపదార్థమంతయు తత్కాలమున మాత్రము నుండునదగుటఁజేసి ఆశ్చర్యరూప మగును కావున మాయామాత్రమనఁబడుచున్నయది. జీవునికి గల సత్యసంకల్ప త్వాదికము ఆచ్ఛాదింపఁబడుటచే స్వప్నమున రథాదివస్తుజాతమును జీవుఁడు కల్పించుకొనఁజాలడు. కావున "పురుషో నిర్మిమాణః" అను వాక్యము జీవునిగురించి చెప్పఁబడినది కాదని తెలియనగును.

మఱియు

"తదేవ శుక్రం తద్బ్రహ్మ, తదేవామృత ముచ్యతే,
తస్మిం ల్లోకాః శ్రితాః సర్వే, తదు నాత్యేతి కశ్చన"

"అద్దియే నిర్మలమైనదనియు బ్రహ్మంబనియు అమృతమనియు చెప్పఁబడును. అట్టి బ్రహ్మమునందు లోకములన్నియు ఆధారపడియున్నవి. ఒకానొకడెవడును బ్రహ్మము నతిక్రమింపఁజాలడు."

అను వాక్యశేషమువలన నీ సందర్భమంతయు బ్రహ్మమును గురించియే యని విదిత మగుచున్నయది.

"తదేవ శుక్రమ్" ఇత్యాది వాక్యముతో నేకార్థము కలదగుటచే "సహికర్తా" అను వాక్యంబు పరమేశ్వరునిఁ జెప్పునదియేను: లోకమున ఐంద్రజాలికుడు చూపెట్టు వస్తువులను చూచువాడు మరియొకఁడు కావలెను. కాని తానే కల్పించుకొని తానే చూచుట సరిపడదు కావున స్వప్నగతసృష్టియు పరమేశ్వరకృతంబేనని విశదమైనది.

జీవుని సత్యసంకల్పత్వాదులతో కూడిన పూర్వరూపము అభివ్యక్తము కాకుండుటకు గల కారణమును దిగువసూత్రమున వక్కాణించుచున్నవారు.

సూ. పరాభిధ్యానాత్తు తిరోహితం తతో హ్యస్య
బంధవిపర్యయౌ" 3-2-4

జీవుఁడు అనాదికాలమునుండి చేయు అపచారముల పరంపరవలన పరమేశ్వరుఁడు జీవుని సత్యసంకల్పత్వాదికమును మఱుగుపఱచును. కావున జీవుని యపచారమును పురస్కరించుకొని సంభవించు పరమేశ్వర సంకల్పమునఁజేసి (జీవునికి) బంధము, జీవుఁడు తన్ననుసరించి చేయు నుపాసనను పురస్కరించుకొని యేర్పడు ఈశ్వరసంకల్పమువలన మోక్షంబును చేకూరునవి.

ఇందుకు శ్రుతిప్రమాణమును గాననగును.

"యదా హ్యేవైష ఏతస్మి న్నుదర మంతరం కురుతే, అథ తస్య భయం భవతి. యదా హ్యేవైష ఏతస్మి న్నదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విందతే, అథ సోఽభయం గతో భవతి"

శ్రుత్యర్థము- యదా = ఎప్పుడు, ఏషజీవః = ఈ జీవాత్మ, ఏతస్మిన్ = ప్రకృతము, ఆనందమయరూపము గలదియు నగు బ్రహ్మము విషయమై అరం = ఛిద్రమును అనఁగా శివోపాసనను మఱచియుండుటను, అంతరం = అవకాశము గాను, ఉత్కురుతే = లెస్సగా చేయునో, అథ = అప్పుడు, తస్య = ఆ జీవాత్మకు భయం = సంసారమున జననమరణ సుఖదుఃఖభోగాది భయము, భవతి = సంభవించును. అనఁగా జీవుఁడు ప్రప్రథమమున పరమేశ్వరు నుపాసింపక నాతని మఱచియుండుటయను అపచారమువలన సంసారప్రవృత్తుఁడయ్యెనని భావము. ఇఁక నెప్పుడైతే పూర్వపుణ్యబలమున జీవాత్మ అదృశ్యే = ప్రత్యక్షముగా గోచరింపనదియు, అనాత్మ్యే = అనుమానగమ్యము కానట్టిదియు అనిరుక్తే = శబ్దము తోడను ఇట్టిదని నిర్దేశించి చెప్పనలవి కానిదియు, అనిలయనే = ఎట్టి ఆశ్రయము లేనిదియు నగు ఏతస్మిన్ = ప్రకృతబ్రహ్మమునందు, అభయం = సర్వవిధములైన లౌకిక భయములను విడనాడుట ద్వారా ప్రతిష్ఠాం = శరణాగతిని, విందతే = పొందుచున్నాడో, అథ = ఆ సమయమున, సః = శాంభవదీక్షితుడైన జీవాత్మ, అభయం = సంసారభయనివృత్తిని, అనఁగా మోక్షమును గతోభవతి = పొందుచున్నవాడు. "సంసారమోక్షస్థితిబంధహేతుః" ఇత్యాది శ్రుతివాక్యంబును బంధమోక్షములకు కారణము పరమేశ్వరుఁడే నని చెప్పుటవలన- ఆత్మానాత్మవివేకము మోక్షావహమనియు తదవివేకము బంధహేతువనియు వక్కాణించువారి యుద్దేశము శ్రుతిసూత్రవిరుద్ధంబైనదని పాఠకులు గ్రహింపవలసి యుండును.

సూ. "దేహయోగా ద్వా సోఽపి" 3-2-5

జీవుని స్వరూపమగు సత్యసంకల్పత్వాదికము మరుగుపడుట- దేవమనుష్యాదిదేహాకారమగు ప్రకృతిఁదగు సంబంధమునఁజేసి సృష్టిసమయమున- సంభవించును. ప్రళయకాలమునందైతేనో నామరూప విభాగము లేని సూక్ష్మాకారమగు ప్రకృతిఁదగు సంయోగమున జీవుని సత్యసంకల్పత్వాదికము మరుగుపడును కావున స్వప్నమునందు తాత్కాలికములైన విచిత్రములను కల్పించు సామర్థ్యము జీవునకు ఉండఁజాలదని సారాంశము.

మఱియొక నుపపత్తిఁ జెప్పుచున్నవారు.

సూ. "సూచకశ్చ శ్రుతే రాచక్షతే చ తద్విదః" 3-2-6

"యదా కర్మసు కామ్యేషు-స్త్రియం స్వప్నేషు పశ్యతి,
సమృద్ధిం తత్ర జానీయాత్-తస్మిన్ స్వప్ననిదర్శనే"

"కామ్యకర్మలగు పుణ్యములను ఆచరించువేళ స్వప్నములయందు సౌభాగ్యవతియగు సువాసినీవనితను గాంచువానికి తా జేయు సుకృతములందగు ఫలముల సమృద్ధి చేకూరునని తెలియవలెను"

"అథ స్వప్నాః— పురుషం కృష్ణం కృష్ణదంతం పశ్యతి, స ఏనం హంతి" "ఇక స్వప్నవిషయము నిరూపింపబడును. నల్లనిదంతములు గల నీలపురుషుని చూచునెడ నట్టివానిని నీలపురుషుడు సంహరించును" ఇత్యాదిశ్రుతి ననుసరించియే స్వప్నము శుభమును అశుభమును సూచించునదని విదితమగుచున్నయది. మఱియు స్వప్నాధ్యాయమును గుఱ్ఱెరుగువారు స్వప్నవిశేషములను శుభాశుభసూచకములుగా నిర్ణయించి చెప్పుచున్నవారు. ఇందువలన స్వప్నములోని వస్తువులు జీవసృష్టములు కావని విశదమైనది. స్వప్నార్థములు జీవసృష్టములగునెడ తనకు అశుభమును తెలుపువానిని జీవుడు స్వప్నములో నిర్మించుకొనుట సరిపడదు గదా! ఐతే స్వప్నసృష్టి- పరమేశ్వరకృతంబైనదియే యని చెప్పుట సమంజసంబగును.

## తదభావాధికరణము

సూ. "తదభావో నాడీషు తచ్ఛ్రుతే రాత్మని చ" 3-2-7

స్వప్నము తరువాత కలుగు సుషుప్తి స్వప్నాభావమనబడును. అట్టితఱి "తద్యత్రైతత్సుప్తః సమస్తః సంప్రసన్నః స్వప్నం నవిజానాతి, ఆసు తదా నాడీషు సుప్తో భవతి" "పురుషుడు గాఢనిద్రజెంది ఇంద్రియములన్నిటిదగు వ్యాపారమును విరమించి నిద్రించుచున్నాననియు తెలియకుండును. ఆ సమయమున హితములనబడు నాడులయందు శయనించును" "అథ యదా సుషుప్తోభవతి యదా స కస్యచన వేద, హితా నామ నాడ్యో ద్వాసప్తతిసహస్రాణి, హృదయాత్పురీతత మభిప్రతిష్ఠంతే, తాభిః ప్రత్యవసృప్య పురీతతి శేతే" జీవాత్మ గాఢనిద్రజెందునపుడు బాహ్యమును గాని యభ్యంతరమును గాని తెలియకుండును. అట్టితఱి డెబ్బదిరెండువేల నాడులు హృదయమునుండి పురీతత్ అనుచోటున వ్యాపించియుండును. అట్టి నాడులద్వారా పురీతతిఁ బ్రవేశించి యచట శయనించును".

"యత్రైతత్ పురుషః స్వపితి నామ సతా సౌమ్య! తదా సంపన్నో భవతి" సౌమ్యుడా !

"దేహి యగువాడు గాఢముగా నిద్రించువేళ బ్రహ్మముతో నేకీభవించి యుండును"

అను శ్రుతులు జీవుఁడు సుషుప్తియందు నాడులలో పురీతతిని బ్రహ్మము నను శయనించునని తెలుపుచున్నందున నాడీపురీతత్‌బ్రహ్మములకు వికల్పమా? సముచ్చయమా? అని సందేహము.

ప్రశ్న : నాడ్యాది శయనస్థానములు వికల్పితములనఁజెల్లును ఎట్లనగా "వ్రీహిభి ర్యజేత" "యవై ర్యజేత" అను సందర్భమున పురోడాశము నేర్పరచుట యను ప్రయోజనమొకటియైనందున వ్రీహియవ యజనము విషయమై వికల్పము నంగీకరించినట్లు జీవుని శయనమునను సుషుప్తి యనఁబడు ప్రయోజనము ఏక మగుటఁజేసి ఒకప్పుడు పురీతతిని శయనించుననియు మఱియొకప్పుడు నాడుల యందు పడుకొనుననియు ఇంకనొకవేళ బ్రహ్మమునందు నిద్రించుననియు వికల్పమును చెప్పుటయే సమంజసమగును కాదా?

ఉత్తరము : సముచ్చయంబనియే సిద్ధాంతము. ఎందుకనఁగా? నాడీపురీతత్‌బ్రహ్మముల వలన ఏకప్రయోజనంబు లేనందున వికల్పము నంగీకరింపరాదు. మఱియు హృదయములోనుండు బ్రహ్మముఁజేర్చు మార్గముగా నాడులు సాధనము లనియు పురీతత్తు మేడవంటిదనియు బ్రహ్మము పర్యంకమువంటిదనియు చెప్పుటలో విరోధమెద్దియు గానరాదు. కావున నాడులగుండా పురీతత్తునందు బ్రహ్మము నందును, జీవుఁడు నిద్రించునని నిరూపించుటలో ప్రయోజనములు వేరువేరుగా కనఁబడుచున్నందున సముచ్చయమనియే అంగీకరింపవలెను.

విశేషము— జీవుఁడు నాడులయందున్నపుడు ప్రాణవాయువుతో కూడి యున్నచో స్వప్నమున నదీనగరములను సౌధము ప్రాకారము మున్నగువాని నవ లోకించును. వ్యానవాయువుఁజెందినపుడు దేవర్షులను గాంచును. అపానముఁగూడిన తఱి యక్ష, రాక్షస, గంధర్వులను, ఉదానవాయువుఁ గలిసినపుడు దేవలోకము లను దేవతలను కుమారస్వామిని జయంతునిన్ని, సమానవాయువుతో కూడియున్న పుడు దేవలోకములను దేవతలనేగాక ధననిధులనుగూడ చూచునని సుబాలోపని షత్తునందు వ్రాయఁబడినది.

సూ. "అతః ప్రబోధోఽస్మాత్" 3-2-8

"సత ఆగమ్య నవిదుః సత ఆగచ్ఛామహే" "సుషుప్తిఁజెందినపుడు బ్రహ్మము నుండి జాగ్రద్దశకు వచ్చియు బ్రహ్మమునుండి వచ్చుచున్నామని జీవులు తెలియ కున్నారు" అను శ్రుతివాక్యము- జీవుని ప్రబోధము బ్రహ్మమునుండియే యని చెప్పుచున్నందున నాడీపురీతత్‌బ్రహ్మములు మూడును జీవుని శయనముఁదగు స్థానములని సముచ్చయమునే నిర్ణయింపవలెను. వికల్పము నంగీకరించునెడ నెని మిది దోషములు చేకూరు నవకాశము కలదు. ఎట్లఁనగా? "జీవాత్మ నాడులయందు నిద్రించు" ననునెడ పురీతత్ బ్రహ్మవాక్యములకు గల ప్రామాణ్యము విసర్జింపఁ బడుటయు, మఱియు నవ్వానికే అప్రాప్తమగు అప్రామాణ్యము అంగీకరింపఁబడు టయు, ఇఁక "పురీతత్ బ్రహ్మములందు శయనించునని చెప్పునెడ పూర్వము విడువఁబడిన ప్రామాణ్యము పురీతత్ బ్రహ్మవాక్యముల విషయమై స్వీకరింపఁ బడుటయు, పూర్వము అంగీకరింపబడిన అప్రామాణ్యము విడువఁబడుటయు నివ్వి ధముగా ప్రాప్తపరిత్యాగము అప్రాప్తస్వీకారము పరిత్యక్తస్వీకారము స్వీకృతపరి త్యాగంబు నను నాలుగు దోషంబులును అట్లే పురీతత్ బ్రహ్మవాక్యకోటియందు నాలుగుదోషంబులును సమకూరుచున్నయవి. ఏతాదృశమైన ఉపపత్తిఁజేసి సము చ్చయము సరిపడుచున్నందున వికల్పము కానే కాజాలదని విశదీకరింపనైనది.

## కర్మానుస్మృత్యధికరణము

సూ. "స ఏవ తు కర్మానుస్మృతిశబ్దవిధిభ్యః" 3-2-9

ఇఁట "సతా సౌమ్య! తదా సంపన్నోభవతి" అనునది విషయ వాక్యము.

పూర్వాధికరణమునందు నిరూపింపఁబడిన సుషుప్తియందు బ్రహ్మమున న్నిద్రించినవాడే మేలుకొనునా? లేక మరియొకఁడా? అని సందేహము.

ప్రశ్న : సుషుప్తిఁజెందినవాడు గాక మరియొక జీవుఁడు మేలుకొనునని చెప్పుట సమంజసమని తోచెడిని. ఎందుకనఁగా? సుషుప్తిని బ్రహ్మఁజెందినవాడు మఱలివచ్చుట సముచితము కాజాలదు. నిరతిశయమైన ఆనందము గల బ్రహ్మము తోడ నేకీభవించిన పురుషుఁడు దుఃఖమయ సంసారము లోనికి నేతెంచుట పొసగదు

గదా! పరమేశ్వరుని పొందినవాడు ఎట్లు సంసారి యగును. ఇవ్విషయమున పరా మర్శ నెట్లు గావింతురు?

ఉత్తరము : సుషుప్తిని బ్రహ్మముఁ బొందినవాడైనను నిద్రించినవాడే మేలుకొని లేచి వచ్చును. జ్ఞానరహితముగా తానుచేసిన కర్మను తానే అనుభవింప వలసియుండును. సుషుప్తికిమున్ను తాననుభవించిన యంశము మఱల గుర్తునకు వచ్చుట నిట గమనింప నగును

"త ఇహ వ్యాఘ్రోవా సింహోవా వృకోవా వరాహో వా కీటో వా పతంగో వా దంశో వా మశకో వా యద్యద్భవంతి తదా భవంతి" "పెద్దపులిగాను సింహము గాను, తోడేలుగాను, పందిగాను, పురుగుఁగాను, పక్షిగాను, ఈగగాను, దోమ గాను సుషుప్తిఁజెందునపుడు ఉన్నట్లు జాగ్రద్దశయందు నుందురు"

ఇట్లు శ్రుతి-జాగ్రత్స్వప్న సుషుప్తులయందు జీవునిఁదగు ఏకభావమునే చెప్పుచున్నందున మోక్షమును గురించి ఉపాయమును విధించు వాక్యములు సార్థ కములు కాకుండుటఁజేసియు "సత ఆగమ్య నవిదుః" అనుచో పరమేశ్వరునిఁ జెందియు బ్రహ్మానందమును గుర్తెరుగఁజాలడని చెప్పఁబడినందునను ముక్తియందు వలె సుషుప్తియందు పరమేశ్వరునితో నత్యంత సామ్యము జీవునకు సంభవింపఁ జాలదనియు నిద్రించిన జీవుఁడే లేచి వచ్చుననియు నిరూపించుట యుక్తంబగునని తెలియవలెను.

## ముగ్ధాధికరణము

సూ. "ముగ్ధేఽర్ధసంపత్తిః పరిశేషాత్" 3-2-10

"మూర్చితః పురుషః" పురుషుఁడు మూర్ఛఁజెందినవాడు" అను వ్యవహార మును బట్టి మూర్ఛయనునది ఒకానొకయవస్థగా అనుభవింపఁబడుచున్నయది.

అట్టి మూర్ఛ- సుషుప్తి మొదలగు దశలకన్న వేరైనదా కాదా? అని సందేహము.

ప్రశ్న : జాగ్రత్ స్వప్న సుషుప్తుల కంటే వేరగు నవస్థ-ప్రసిద్ధము కాకుం డుటఁజేసి మూర్ఛ- జాగరము మొదలగు నవస్థలలో చేరినది కావలెను.

**ఉత్తరము :** మూర్ఛితుడైన పురుషుని యనుభవము- మరణముఁదగు సగము లక్షణముగా శేషించి యుండును గావున సుషుప్తిమున్నగువానికన్న వేఱైనది కావలెను. మూర్ఛయందు ప్రపంచము పొడగట్టదు కావున జాగరమునందు స్వప్నమునను మూర్ఛ యంతర్భూతము కాదు. సుషుప్తిని ప్రసన్నముఖము మొదలగు లక్షణములుండుటయు మూర్ఛయందు వికారముఖాదిలక్షణములుండుటయు అను భేదము వలన సుషుప్తికంటెను మూర్ఛ భిన్నమైనదనియు, చిన్నగా ఊపిరి యుండుటఁజేసి మరణములో చేరదనియు సిద్ధాంతము.

## ఉభయలింగాధికరణము

### సూ. "న స్థానతోఽపి పరస్యోభయలింగం సర్వత్ర హి" 3-2-11

పూర్వాధికరణములయందు త్వంపదార్థమగు జీవుని స్వరూపము స్వప్రకాశ జ్ఞానాత్మకమనియు (జీవుని) ధర్మము– గుణాష్టకమును మరుగుపరుచుకొనునది యనియు (జీవునికి) గమనాగమనములు కలవనియు జాగరాది ఐదు దశలు (జీవునిచే) వేరువేరుగా అనుభవింపఁబడుననియు విశదీకరింపఁబడినది. ఇకమీద తత్పదార్థమగు పరమేశ్వరుని స్వరూపధర్మాదికము నిరూపింపఁబడును.

"సోఽంతరా దంతరం ప్రావిశత్" 'దిశశ్చాంతరం స ప్రావిశత్" "యః పృథివ్యాం తిష్ఠన్" ఇత్యాదిశ్రుతివాక్యములయందు పరమేశ్వరుఁడు సర్వాంతర్యామిగా చరాచరముఁ ప్రవేశించునని వినఁబడుచున్నయది. ఐతే బ్రహ్మము సర్వాత్మకుడుఁగా అవస్థలన్నిటియందు సంతట నుండునెడ నాయా వస్తువులఁజెంది యుండు దోషములఁదగు కళంకము కలది యగునా? కాదా? అని సందేహము.

ప్రశ్న : తత్తద్దోషకళంకము బ్రహ్మముఁజెందునని చెప్పనగును. ఎట్లనఁగా? "అస్థూలమనణ్వహ్రస్వమ్" "నిష్కళం నిష్క్రియం శాంతమ్, నిరవద్యం నిరంజనమ్" "పెద్దది కానిది, చిన్నది కానిది, పొట్టిది కానిది బ్రహ్మము"

"ఎట్టి విభాగము లేనిదియు, ఎట్టి క్రియాకలాపము లేనిదియు, నిర్వికారమైనదియు ఎట్టి నిందలు ఆరోపణలు లేనిదియు పుణ్యపాపలేశరహితమైనదియు బ్రహ్మము" ఇత్యాది ప్రమాణములు- పరమేశ్వరుని రూపాదికమును నిషేధించుచున్నయవి. మఱియు రూపాదిగతములగు దోషములు బ్రహ్మమును స్పృశించుననుభయము వలననే "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అను శ్రుతి- బ్రహ్మము

అపరిచ్ఛిన్నసత్యజ్ఞానరూపమైన"దని వక్కాణించుచున్నయది. ఒకవేళ బ్రహ్మము ప్రకృతివికారసంబంధము గలదనునెడ- జీవునివలె పరమేశ్వరుఁడును సమస్త వికారములఁదగు దోషములకు నిలయము కావలసివచ్చును-గాదా?

ఉత్తరము: పృథివ్యాదిస్థానములయందు అంతర్యామిగా ఉన్నను పరమేశ్వరునకు ఆ యా శరీరములయందు నివసించు జీవునికివలె స్థానగతములైనదోషములు సంభవింపవు. ఎందుకనఁగా? శ్రుతిస్మృతులన్నిటియందు నిరస్తసమస్తదోషంబును సకలకల్యాణగుణవిశిష్టంబు ఉభయలింగము బ్రహ్మంబునని బోధపడుచున్నదని సూత్రార్థము. ఇక నన్నిదశలయందు సర్వాంతర్యామిగా నున్నను పరమేశ్వరునకు ఎట్టి దోషములఁదగు కళంకము చేకూరునను ప్రసంగమున కెంతమాత్ర మవకాశము లేదు.

"ఏష ఆత్మాఽపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సోఽపిపాసః సత్యకామః సత్యసంకల్పః"

శ్లో॥ అస్తి కశ్చిదపర్యంత రమణీయ గుణాశ్రయః।
సర్వలోక వినిర్మాతా- పశుపాశవిలక్షణః॥

ఇత్యాది శ్రుతి స్మృతి ప్రమాణములు - పరమేశ్వరుఁడు- ఎట్టి దోషములు లేనివాడనియు, ముసలితనము మృత్యువు దుఃఖము ఆకలి దప్పియు లేని వాడనియు, యథార్థములైన కోరికలు గలవాడనియు సఫలములగు సంకల్పములు కలవాడనియు, అనంతములు మనోహరములు నగు కల్యాణగుణములకు ఆధారమగు వాడనియు లోకములనన్నిటిని నిర్మించువాడనియు పశువగు జీవునికంటెను పాశమగు సంసారమునకంటెను విలక్షణుఁడనియు చాటుచున్నవి. కావున పృథివి మొదలగువానిలో పరమేశ్వరుఁడు అంతర్యామిగా నున్నను ఎట్టి దోషంబు చేకూరనివాడని గ్రహింపనగును.

సూ. "భేదాదితి చే న్న, ప్రత్యేక మతద్వచనాత్" 3-2-12

ప్రశ్న: జీవుఁడు సహజముగా అపహతపాప్మత్వాది గుణములు కలవాడైనను దేవమానవాది శరీరములఁదగు సంబంధమున నేర్పడు నవస్థలఁజెందిన భేదము వలన క్షుత్పిపాసాది దోషములు గలవాడైనట్లు "యస్య పృథివీ శరీరమ్"ఇత్యాది

ప్రమాణములఁబట్టి శరీర సంబంధవశమున నేర్పడు నవస్థా భేదమునఁజేసి శరీర గత దోషములు పరమేశ్వరునకు చేకూరును గాదా ?

ఉత్తరము : "యస్య పృథివీ శరీరమ్" ఇత్యాది వాక్యములయందు ప్రతి వాక్యమున "ఏష త ఆత్మాఽన్తర్యామ్యమృతః" అనుటతో సర్వాంతర్యామియగు పరమాత్మ - శరీరగత దోషములు లేనివాడనియు, జీవుఁడైతేనో పరమేశ్వరుని సంకల్పము వలన తన సహజరూపమును గోలుపోవువాడనియు విదితమగుచున్న యది.

సూ. "అపి చైవ మేకే" 3-2-13

మఱియు నొకే శరీరమున శరీరులుగా జీవేశ్వరులిరువురు నివసించు చున్నను జీవునకు దోషములుండుటయు పరమేశ్వరునకు దోషములు లేకుండు టయు అను విశేషము సిద్ధించునట్లు ఒకానొక వైదిక శాఖీయులు దిగువవిధము చదువుచున్నవారు.

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే,
తయో రన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి" శ్రుతి.

"మంచి రెక్కలు గల రెండు పక్షులు (జీవేశ్వరులు) ఒకరినొకరు కూడి యుండు చెలికాండ్రై ఒకే వృక్షము (శరీరము) నధిష్ఠించి యుండునవి. అవ్వా నిలో నొక పక్షి (జీవాత్మ) రుచికరమైన ఫలము (సంసారభోగము) ననుభవిం చును. మరియొక పక్షి (పరమాత్మ)యైతే నెట్టి ఫలము ననుభవింపనిదై మిక్కిలి ప్రకాశించును."

కావున జీవువికి వలె పరమేశ్వరునకు శరీరగత దోషములు సమకూరవని సారాంశము.

సూ. "అరూపవదేవ హి తత్ప్రధానత్వాత్" 3-2-14

పరమాత్మ - దేవాదిశరీరములయందు శరీరిగా రూపములేని వస్తువువలె నుండువాడు. ఎందుకనఁగా ? నామరూపముల నేర్పరచుటయే పరమేశ్వరుని ముఖ్య కర్తవ్యమగునది. ఇందుకు శ్రుతిప్రమాణము "ఆకాశో వై నామ నామరూపయో ర్నిర్వహితా, తే యదంతరా తద్బ్రహ్మ" "ఆకాశ శబ్దవాచ్యంబగు బ్రహ్మము -

సకల జగముఁదగు నామరూపముల నేర్పరచి యవ్వాని నడుమ నామరూపములు గల కార్యములన్నిటిఁదగు సంబంధము లేకయే నుండునది.''

నామరూపముల మధ్య నుండునని చెప్పుటచే అవ్వానికి వశము గానివాడగును కావున పరమేశ్వరుఁడు సర్వస్వతంత్రుడని తెలియునది. జీవుఁడైతేనో కర్మఫలము ననుభవించుటకు శరీరములో నుండు వాడగుటఁజేసి జీవేశ్వరులకు ఇట్టి వ్యత్యాసము కలదని భావము.

మనుష్యాది శరీరములయందు పరబ్రహ్మము శరీరిగా నున్నను రూపము లేని వస్తువవలె దుఃఖభాజనము కాదనియు నామరూపములఁజెందు జీవుని కర్మఫలము ననుభవింపఁజేయుటకు పరమేశ్వరుఁడు ఆ యా శరీరములయందు నివసించుననియు "యస్య పృథివీ శరీరమ్" "యస్యాత్మా శరీరమ్" ఇత్యాది శ్రుతిప్రమాణములు ఇందుకు నిదర్శనములనియు సారాంశము.

సూ. ''ప్రకాశ వచ్చావై యర్థ్యాత్'' 3-2-15

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అను వాక్యమును సార్థక మొనర్చుటకు బ్రహ్మము స్వప్రకాశరూప మగుటచే జ్ఞానస్వరూపంబని యంగీకరించినట్లు "నిష్కళం నిష్క్రియం శాంతమ్" "సత్యాత్మ ప్రాణారామం మనఆనందమ్, ''యః సర్వజ్ఞః సర్వవిత్" "ప్రధాన క్షేత్రజ్ఞపతి ర్గుణేశః" "పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే" "అథ కస్మాదుచ్యతే మహాదేవో, యః సర్వాన్ భావాన్ పరిత్యజ్యాత్మ జ్ఞానయోగైశ్వర్యే మహతి మహీయతే, తస్మాదుచ్యతే మహాదేవః" శతాధికములగు ఇత్యాది వాక్యములు సార్థకములగుటకై బ్రహ్మము నిర్గుణము కల్యాణగుణాస్పదంబు నగును కావున నుభయలింగంబనియే చెప్పుట సమంజసంబగుచున్నయది.

సత్యజ్ఞానాదిశ్రుతి - బ్రహ్మము జ్ఞానమాత్రమని చెప్పుటలేదు గాని జ్ఞానము బ్రహ్మంబని నిర్వచించుచున్నందున జ్ఞానము గుణవిశేష మగుటఁజేసి సర్వజ్ఞత్వాది గుణములకు నాశ్రయమగునది యని విదితమగుచున్నయది.

సూ ''ఆహ చ తన్మాత్రమ్'' 3-2-16

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అను శ్రుతి - అపరిచ్ఛిన్నమగు జ్ఞానము రూపముగా గలది బ్రహ్మంబని చెప్పుచు బ్రహ్మమునందు ఇతరమును నిషేధించుట లేదు. జ్ఞానము బ్రహ్మంబని చెప్పుటలో విశేషమేమియు లేనందునను జ్ఞాన

స్వరూపమని చెప్పినంతమాత్రమున సర్వజ్ఞత్వాది గుణములు బ్రహ్మమునందు కల వని చెప్పుటకు ఎట్టి విరోధము గానరానందునను బ్రహ్మము ఉభయలింగంబని తెలియనగును.

కిరీటము స్వర్ణరూపమైన దనుట- కిరీటముఁదగు స్వర్ణరూపమును మాత్రము చెప్పును కాని కిరీటఖచిత రత్నాదులను తొలగింపదు గదా !

మఱియు-

"సత్యం జ్ఞాన మనంతమ్"అను శ్రుతివాక్యము- బ్రహ్మము స్వయముగానే మహాప్రకాశరూపమగుటఁజేసి శ్రేష్ఠమైన జ్ఞానముఁదగు స్వరూపము కలదని మాత్రము చెప్పుచు - తరువాత వక్కాణింపఁబడు విపశ్చిత్త్వమును సర్వజ్ఞత్వ మును నివారించుటకు ఎట్లు నుద్యుక్తమగును ?

వివిధమైన వస్తుజాతమును విమర్శించు జ్ఞానము గలవాడు విపశ్చిత్ అనఁ బడును కావున నీ సందర్భమున ఎట్టి విరోధము లేదని భావము.

సూ. "దర్శయతి చాథో అపి స్మర్యతే" 3-2-17

పూజ్యురాలైన వేదమాత - బ్రహ్మము నింద్యగుణములు లేనిదై కల్యాణ గుణవిశిష్టమై యుభయలింగంబగునని శ్రుతి వాక్యములన్నిటియందును విశదీక రించుచున్నయది.

"ఆకాశశరీరం బ్రహ్మ, సత్యాత్మ ప్రాణారామం మనఆనందం శాంతి సమృద్ధ మమృతమ్, ఇతి ప్రాచీనయోగ్యోపాస్వ''

"ఆ కాశత ఇత్యాకాశః = అంతట వెలుగొందునది కావున ఆకాశమనఁగా ప్రకాశ మగును. ప్రకాశమే రూపముగా గలది యగుటచే బ్రహ్మము చిదంబర స్వరూపంబగుచున్నయది. సత్యాత్మ యనగా సత్తారూపంబగునది; ప్రాణారామం= ప్రాణమనగా ఆత్మ, ఆత్మయందే అనఁగా తనయందే ఆరామము (విహారము) గలిగి బాహ్యమునందు లేనిదియు, మనస్సునందే ఆనందము ననుభవించుచు బాహ్య సాధనముల యవసరము లేనిదియు, (ఇచట మనస్సనఁగా జ్ఞానరూపమైన అంతఃకరణమని చెప్పఁబడును).

వెలుపలి సాధనముల యవసరము లేకయే బాహ్యవస్తువుల నన్నిటిఁదగు

విలాసమును కనుగొనునదియు నిత్యమైనదియు ఎట్టి కళంకములు లేనిదియు నగు విజ్ఞానముతో సర్వజ్ఞమగుచు అపరిమిత స్వరూపానందము ననుభవించునది గావున బ్రహ్మము మన ఆనందమనఁబడును. కనిష్ఠగుణములైన రాగద్వేషాదులు బొత్తుగా లేకుండుట శాంతి యనఁబడును. అట్టి శాంతితో నిండియుండునది గావుననే దోషములన్నిటిఁదగు కళంకము పూర్తిగా లేనిదియు అనాదికాలమునుండి సంసార బంధము లేనిదియు సత్యజ్ఞానరూపంబు సర్వజ్ఞము నిరతిశయాత్మానంద శక్తివిలాసంబు సమస్తదోషములు లేనిదియు నగు పరబ్రహ్మము ఉభయలింగంబగునని గ్రహింప నగును.

మఱియు "నిష్కళం నిష్క్రియం శాంతం" "ధర్మావహం పాపనుదం భగేశం" "తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్"

"ఎట్టి విభాగములు లేనిదియు ఎట్టి క్రియా కలాపములు లేనిదియు శాంతంబగునదియు బ్రహ్మము."

"పరమేశ్వరుఁడు- పుణ్యములను పెంపొందించువాడు, పాపములను బోకాట్చువాడు, ఐశ్వర్యముల కధిపతియు"

"జగమును శాసించు ప్రభువులందరిని నియమించువాడగుటఁజేసి సహజమైన అధికారము గల మహేశ్వరుఁడు పరమాత్మ యగును"

ఇత్యాది శ్రుతివాక్యములు బ్రహ్మము ఉభయలింగంబని నిరూపించుచున్నయవి.

శ్లో॥ అనాదిమల సంశ్లేష ప్రాగభావా ద్విశేషతః।
అత్యంత పరిశుద్ధాత్మా శివ ఇత్యుచ్యతే విభుః॥
అనంతానంద కల్యాణగుణైక ఘన ఈశ్వరః।
శివ ఇత్యుచ్యతే సద్భిః శివతత్త్వార్థవేదిభిః॥

అనాదికాలమునుండి ప్రవర్తించుచున్న అజ్ఞానముఁదగు సంబంధము పూర్వాపూర్వము లేనివాడగుటచే మిక్కిలి పవిత్రమైన స్వరూపము గలవాడు సర్వవ్యాపకుఁడును శివుడని చెప్పఁబడును.

అవధిలేని ఆనందమునకు కల్యాణగుణములకు ఒకే ఒక నిలయమగు పరమాత్మ- శివుఁడని శివతత్త్వార్థవిదులగు మహానుభావులు వక్కాణింతురు.

ఏతాదృశ ప్రమాణములు — శివశబ్ద వాచ్యమైన బ్రహ్మము - నిర్గుణము నిరాకారము, సగుణము సాకారంబు గావున నుభయలింగంబగునని నిర్దేశించు చున్నయవి.

అత్యంత పవిత్రములైన మంగళ గుణములను తెలుపు శివశబ్దముతో దోషములన్నిటిఁదగు కళంకము బొత్తుగా లేనిదియు నిరతిశయపురుషార్థ గుణముల నిండియుండునదియు నగు బ్రహ్మము చెప్పఁబడుటచే బ్రహ్మము శివశబ్ద వాచ్యం బగుచున్నయది. అందువలన నుభయలింగసిద్ధి యని తెలియునది.

సూ. "అత ఏవ చోపమా సూర్యకాదివత్" 3-2-18

పృథివి మొదలగు ప్రపంచమునందంతట నుండువాడైనను పరమేశ్వరుఁడు దోషములు లేనివాడనియు కల్యాణగుణములకు ఆస్పదమగువాడనియు శాస్త్రముల యందు జలసూర్యాది ఉపమానము (పరమాత్మకు) విధింపఁబడుచున్నయది.

శ్లో॥ ఆకాశ మేకంహి యథా—ఘటాదిషు పృథక్ భవేత్,
తథాఽఽత్మైకో హ్యనేకస్థో—జలాధారేష్వివాంశుమాన్ ॥

ఆకాశ మొక్కటియైనను ఘటము మున్నగువానియందు వేరువేరుగా కనఁబడునట్లు సూర్యుఁడొక్కడే యైనను జలాశయములలో భిన్నభిన్నముగా నగువడు నట్లును ఒకే పరమాత్మ- అనేక ప్రాణులయందు అంతర్యామిగా నివసించుచు తన యఖండత్వమునకు భంగము నాపాదించుకొనువాడు కాడు.

ఈ సందర్భమున ఆకాశము ఘటాదులయందు వాస్తవముగా నుండుటను జలాశయములలో సూర్యుడు వస్తుతః లేకుండుటను గమనించినచో దిగువవిధము బోధపడును.

ఆకాశమొక్కటేయైనను ఘటాదులయందు వేరు వేరుగానే వాస్తవముగా నుండునట్లు పరమేశ్వరుఁడు ఒక్కడేయైనను పృథివి మొదలగు వానియందు వేరువేరుగా నంతర్యామిగా వస్తుతః నివసించునని ఆకాశోపమానమువలన విదిత మగుచున్నయది.

జలాశయములయందు సూర్యుఁడు వాస్తవముగా లేనివాడై జలాశయగత వికారాది దోషముల నంటకుండునట్లు పృథివ్యాదులయందు వస్తుతః నివసించు

వాడైనను పరమాత్మ పృథివ్యాదిగతములైన వికారాదిదోషములను స్పృశింపకుండును గావున సర్వాంతర్యామియగు పరమేశ్వరుఁడు ఎట్టిదోషములు లేనివాడనియు స్వరూపమునకు గుణములకున్ను ఎట్టి భంగము లేనివాడనియు సూర్యోపమానమువలన తేటపడుచున్నయది.

ఇందువలన ఆకాశాది ఉపమానమునఁజేసియు సర్వాంతర్యామియగు పరమేశ్వరునకు ఉభయలింగత్వము ఏర్పడుచున్నయది.
పూర్వపక్ష సూత్రము.

సూ. "అంబువదగ్రహణాత్తు న తథాత్వమ్" 3-2-19

ఉదకమునందు సూర్యుఁడు పరమార్థముగా ఎవ్విధము లేడో అవ్విధము పరమాత్మ పృథివ్యాదులయందు పరమార్థముగా నుండువాడు కావున పరమేశ్వరునకు నిర్దోషత్వమెట్లు సంభవించును ?

సిద్ధాంతసూత్రము

సూ. వృద్ధిహ్రాసభాక్త్వ మంతర్భావా దుభయసామంజస్యా
దేవం దర్శనాచ్చ" 3-2-20

ఈ సూత్రమున "న" అనుదానిని గ్రహింపవలెను.

పరమాత్మ పృథివ్యాదులయందు వస్తుతః ఉండువాడైనను పృథివ్యాదులఁ జెందియుండు వృద్ధిక్షయముల ననుభవించువాడు కాడు. పూర్వోక్తములగు ఆకాశ సూర్య దృష్టాంతముల రెంటిఁదగు సమంజసభావముఁబట్టి దిగువవిధము బోధపడును.

వస్తుతః సర్వత్ర నివసింపని సూర్యునియొక్కయు వాస్తవముగా అంతట నుండు ఆకాశముయొక్కయు ఉపమానభావము - సర్వత్ర నుండు పరమాత్మకు అంతట నుండనిదానికి వలె ఆ యా వస్తువులఁజెందియుండు దోషములు అంటకుండునని తెలుపుట కొరకని గ్రహించునది.

లోకములో వివక్షితధర్మముఁ దగు సమానతఁ దెలుపుట కొరకే "చంద్రునివంటి ముఖము, ఇత్యాది దృష్టాంతములు పొసగుచుండును.

కావున పృథివ్యాదులయందు పరమార్థముగా నుండువాడైనను పరమేశ్వరునకు ఉభయలింగత్వము సిద్ధించునది.

ఇంతియే గాక వివక్షిత ధర్మ సామ్యమునఁజేసి శ్రుతియందు దృష్టాంతము గానంబడుచున్నయది.

"అశ్వ ఇవ రోమాణి విధూయ పాపమ్" శ్రుతి.

"గుఱ్ఱము వెంట్రుకలను దులుపునట్లు శివోపాసకుఁడు పాపముల నన్నిటిని బోకార్చుకొనును."

ఇందువలన నీ సందర్భమునను చెప్పఁదలచిన ధర్మముఁ దగు పోలిక యుండుట వలన ఆకాశసూర్యదృష్టాంతములు రెండును సరిపడుటచే బ్రహ్మము ఉభయలింగంబనుట కడుంగడు శ్లాఘనీయ మగుచున్నయది.

బ్రహ్మము నిర్విశేషమను వాదమున శరీరస్థితిప్రసక్తియే రాజాలదు కావున శరీరగతదోషములు బ్రహ్మమును స్పృశింపవని చెప్పుట కవకాశము లేకుండును. కాని బ్రహ్మము సవిశేషమని చెప్పునెడ పృథివ్యాదులయందు బ్రహ్మము ఆంతర్యామిగా నుండుటఁబట్టి యేర్పడు ఆ యా శరీరములఁజెంది యుండు దోషములను పరిహరించుటకు ఈ యధికరణము ప్రసక్తంబైనది.

ఇక శివేతరదేవతలను జగత్కారణముగా నిరూపించువారు స్వాభిమతములైన సుబాలోపనిషదాదులయందు ప్రకృతార్థముఁదెలుపు మంత్ర మొక్కటి యైనను లేనందున శివైకప్రతిపాదకమగు శ్వేతాశ్వతరోపనిషత్తునే అవశముగా ఆశ్రయింపవలసి వచ్చెను.

మరియు జగత్కారణముగా నిరూపింపఁబడు దేవునకు ఉభయలింగత్వము ప్రవర్తించుటకు వలయు వాచకశబ్దము లేమింజేసియు ఇయ్యధికరణము వారికి ప్రతికూలంబేను;

ఐతే "శివాని=అస్య సంతీతి శివః" అఖిలమాంగళ్యగుణరత్నములు కలవాడు శివుఁడను వ్యుత్పత్తి ననుసరించి శివశబ్దవాచ్యుడైన పరమాత్మ కల్యాణగుణవిశిష్టుఁడనియు "శామ్యంత్యస్మిన్ దోషా ఇతి శివః" అను విగ్రహముఁబట్టి ఎట్టి దోషములు లేనివాడనియు ఇట్లు ఉభయలింగత్వము శివునకే చెల్లుననియు సారాంశము.

# ప్రకృతైతావత్త్వాధికరణము

బ్రహ్మము ఉభయలింగంబగుటను శంకించి దిగువ సూత్రముఁ జెప్పుచున్నవారు.

సూ. "ప్రకృతైతావత్త్వం హి ప్రతిషేధతి తతో బ్రవీతి చ భూయః"
3-2-21

పూర్వ అధికరణమునందు బ్రహ్మము ఉభయలింగంబని సాధించితిమి. అట్టి లక్షణము బాధింపఁబడునా ? లేదా ? అని సందేహము.

ప్రశ్న : "ద్వే వావ బ్రహ్మణో రూపే, మూర్తం చామూర్తం చ" అను శ్రుతి ననుసరించి పృథివ్యప్తేజోవాయ్వాకాశమయ మూర్తా మూర్త ప్రపంచ రూపమును బ్రహ్మమునకుఁజెప్పి "అథాత ఆదేశో నేతి నేతి" అను శ్రుతియందు గల ఇతి శబ్దముఁబట్టి పూర్వోక్తమైన మూర్తామూర్త ప్రపంచరూపము"న,న" అని నిషేధింపఁబడుచున్నది. కావున బ్రహ్మము సవిశేష మెట్లగును ?

ఉత్తరము : బ్రహ్మమునకు పూర్వసిద్ధమైన ప్రపంచరూపము "నేతి నేతి" అను వాక్యముతో నిషేధింపఁబడుట లేదు. ఎందుకనఁగా ? ప్రత్యక్షగోచరముగాని ప్రపంచరూపమును తొలగించుటకు శ్రుతికిని శక్యము కాదు. కాని ప్రకృతమైన ప్రపంచము మాత్రము బ్రహ్మము కాదని ''నేతినేతి" అను వాక్యము - ఇది ఇంతియే ననుటను నిషేధించుచున్నయది. ఎట్లనఁగా ? నేతినేతి అను వాక్యము తరువాత పూర్వము చెప్పఁబడనట్టి గుణసముదాయమును శ్రుతి వక్కాణించినది.

"న హ్యేతస్మా దితి నేత్యన్యత్ పరమస్తి. అథ నామధేయం సత్యస్య సత్యమితి, ప్రాణా వై సత్యం, తేషా మేష సత్యమ్".

''న హి ఏతస్మాత్ న ఇతి అన్యత్ పరం అస్తి" ఇత్యాది పదచ్ఛేదము.

అర్థము - "నఇతి" నేతి అను వాక్యముతో నిర్దేశింపఁబడిన ఏతస్మాత్= మూర్తామూర్త ప్రపంచమున కన్న పరం = బ్రహ్మభిన్నమగు శ్రేష్ఠపదార్థము నాస్తి= లేదు. అథ = ఇక, నామధేయం = బ్రహ్మముఁదగు నిర్వచనము ''సత్యస్య సత్యమ్"అని చెప్పఁబడును. ప్రాణాః = ప్రాణాధిష్ఠాతలగు జీవాత్మలు- సత్యం = వికారరహిత స్వరూపము గలవారు. ఆకాశాదులవలె ఉత్పత్తి లేనివారని

భావము. ఇట ఉత్పత్తియనఁగా ? స్వరూపము మారుట యగును. అట్టి జీవుల కంటెను సత్యరూపమైనది బ్రహ్మంబని తెలియునది. జీవులకైతేనో జ్ఞానసంకోచ వికాసాత్మకమగు ధర్మపరివర్తనముండును అట్టి పరివర్తనము లేనిదై సర్వదా మూర్త (ఆకారము గల) అమూర్త (ఆకారము లేనట్టి) ప్రపంచస్వరూపము గల దగుటఁజేసి బ్రహ్మము జీవులకంటె నుత్కృష్టమైనదని భావము.

ఇందువలన విశదమగునది యేమనఁగా ? నేతి నేతి అను వాక్యము ప్రకృత మైన ప్రపంచము మాత్రము బ్రహ్మస్వరూపము కాదనియు తదధిక గుణసంప న్నంబనియు తెలుపునది కావున పూర్వసిద్ధమైన ఉభయలింగత్వమునకు ఎట్టి హానియు లేదని విశదార్థము.

ఓయీ ? సన్ ఘటః, సన్ పటః, ఇత్యాదిని అనువర్తించు సద్రూపమైన బ్రహ్మము సత్యమైనది; వ్యావర్తమానమై (కొంతకాలమునకు తొలగు)నట్టి ఘటాది కమును ''నేతి నేతి" అనుచు శ్రుతి ప్రతిషేధించుచున్నది గదా ? అను ఆశంకకు సమాధానము దిగువసూత్రము.

సూ. "తదవ్యక్త మాహ హి" 3-2-22

ప్రత్యక్షము మున్నగు ప్రమాణాంతరములతో బ్రహ్మము గోచర మగునది కాదు. "న సందృశే తిష్ఠతి రూప మస్య - న చక్షుషా పశ్యతి కశ్చ - నైనమ్, హృదా" ''భగవానుని రూపము ప్రత్యక్షముగా కనఁబడునది కాదు. ఎట్టి మేధావి యైనను పరమాత్మను నేత్రముతో చూడజాలడు. కాని ఉపాసకుఁడు తన హృదయ మున గాంచగలుగును." ఇత్యాది సందర్భమున శ్రుతి-ఘటాదులయందు అనువర్తించు సత్ (ఉనికి) మాత్రము బ్రహ్మము కాదని వక్కాణించిన యంశమును గమనింప వలెను.

ఇట్లు భాష్యమునందు శ్రీ నీలకంఠ శివాచార్యులవారు కంఠరవమున నిరా కరించిన "ఘటపటాద్యనువర్తమాన సన్మాత్రము బ్రహ్మంబ"ను వాదమును భాష్య మునందనేక పర్యాయములు జొప్పించి శ్రీవారికి శుద్ధాద్వైతమునందే పరమతాత్ప ర్యంబని సాధింపఁజూచిన శ్రీ దీక్షితవర్యులు శివాద్వైతనిర్ణయాది గ్రంథరచనఁ జేసి శ్లాఘనీయులైనను స్వమతమునందభినివేశమును పెంచుకొనిరని మహో పాధ్యాయ, శివయోగి శ్రీ॥ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు స్వవిరచిత బ్రహ్మ పథమునందు బాగుగా నిరూపించియున్నవారు.

బ్రహ్మస్వరూపమును కనుగొనుటకు వలయు కారణమును వ్రాక్రుచ్చుచున్నవారు.

సూ. ‘‘అపి సంరాధనే ప్రత్యక్షానుమానాభ్యామ్” 3-2-23

ఐతే ధ్యానరూపమైన ఉపాసనతో లెస్సగా నారాధించినయెడల బ్రహ్మస్వరూపము గోచరమగును. ఎవరు పరమేశ్వరునిచేతనే తనయందు దృఢభక్తిఁ గలిగింపఁబడినారో వారికే బ్రహ్మస్వరూపము అనఁగా సచ్చిదానందమయ శివరూపము క్రమక్రమముగా గానంబడునని దిగువ శ్రుతిస్మృతులు విశదీకరించినవి.

“నాయ మాత్మా ప్రవచనేన లభ్యో, న మేధయా న బహునా శ్రుతేన; యమేవైష వృణుతే తేన లభ్యః, తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్” శ్రు.

“తత స్తు తం పశ్యతే నిష్కళం ధ్యాయమానః” శ్రు.

శ్రుత్యర్థము - పరమాత్మను బహువేద పరిశ్రమతో కనుగొనరాదు. అనేక విద్యల నవధరించు బుద్ధివైశద్యముగలవారును పరమేశ్వరుని తెలిసికొనఁజాలరు. తర్కమీమాంసాది పరిశ్రమ వలనను శివదర్శనము దుష్కరంబే యగునది. కాని కర్మయోగమున దృఢమైన ఉపాసనతోడను శుద్ధమైన అంతఃకరణము గలవానిని పరమాత్మ తనవానిగా “నాయందలి భక్తివలన వీడు కృతార్థుండగుగాక” యని కటాక్షించినపుడు అట్టి భక్తుఁడు పరమేశ్వరుని గాంచగలుగును. అట్టి పురుషశిఖామణికే శివుఁడు సచ్చిదానంద లక్షణంబగు నిజరూపమును ప్రకాశింపఁజేయును.

మఱియు ఉపాసనాదార్ఢ్యానంతరము ఉపాసకుఁడు పరిపూర్ణుడైన శివుని ధ్యానించుచు చూడఁగలుగును.

“నాసౌ ప్రత్యక్ష విషయః” స్మృతి.

‘‘పరమాత్మ- ప్రత్యక్ష గోచరమగువాడు కాడు”

సూ. ‘‘ప్రకాశాది వచ్చావైశేష్యం, ప్రకాశశ్చ
కర్మణ్యభ్యాసాత్’’ 3-2-24

ఎడతెగని ధ్యానముఁదగు ఉపాసన వలన బ్రహ్మమును కనుగొను వారికి బ్రహ్మముఁజెందియుండు జ్ఞాన ఆనందాదులు సమకూరునట్లు ప్రపంచముఁదగు

ఐశ్వర్యంబును చేకూరుటలో ఎట్టి వ్యత్యాసము లేదు. "అహం మను రభవం సూర్యశ్చ" "నేను మనువును సూర్యుడ నైతిని" అనుచో వామదేవుని సర్వాత్మ భావనయు "తం మా మాయు రమృత మిత్యుపాస్స్వ" "అట్టి నన్ను ఆయుఃస్వరూపునిగా అమృతునిగాను గురుతెఱుగుము" అనుచో దేవేంద్రుని స్వాంతర్యామ్యభిన్న స్థితియు పరిశీలింపఁబడు నెడల "బ్రహ్మోపాసకులు బ్రహ్మముతోడ నేకీభవించియుండుటఁజేసి పరమేశ్వరుని యసాధారణ గుణములు కలిగియుందు"రని విశదమగును.

మఱియు "దివ్యం దదామి తే చక్షుః-పశ్య మే యోగ మైశ్వరమ్" ఇత్యాదిని శ్రీకృష్ణమూర్తి మున్నగువారు- శివైక్యభావనతో శివుని యైశ్వర్యమును ప్రకటించినట్లు గాననగును. భగవానుడైన శ్రీకృష్ణుఁడు శివోపాసన మనఁదగు సత్క్రియయందు నిరంతరాభ్యాసమున శివసాక్షాత్కారముఁజెంది శివునివలె జగదైశ్వర్యము గలవాడై పార్థునకు ప్రబోధముఁ గావించెనని భగవద్గీతలయందు బాగుగా చెప్పఁబడినది. విశ్వామిత్ర అగస్త్యాదులును బ్రహ్మభావనాభ్యాసవశమున స్వర్గాంతరకరణ సముద్రపానాది సామర్థ్యము గలవారైరి. లోకమున గరుడమంత్రోపాసకుఁడు గరుత్మంతుని నిరంతరము భావించుటచే గరుత్మంతుని యసాధారణ ధర్మము గలవాడగును.

అందువలన బ్రహ్మము నేను అనుభావన దృఢమగుచో బ్రహ్మముఁదగు నసాధారణ ధర్మాంశములతో కూడియుండుట - ఉపాసకులకు నసాధారణ మగునది. కావున ఘటాదులయందు అనువర్తించు సన్మాత్రము-ప్రత్యక్షమైన బ్రహ్మము అను వాదము శ్రుతి స్మృతి న్యాయ విరుద్ధంబైనదని గురుతెఱుగునది.

సన్మాత్రము బ్రహ్మంబని చెప్పునెడ - బ్రహ్మసాక్షాత్కారమునకు సాధనములుగా నిరూపింపఁబడిన శ్రవణ మనన నిదిధ్యాసనాదులు వ్యర్థములు కావలసి వచ్చును. బ్రహ్మము ప్రత్యక్షమగుటకు వలయు సచ్చిదానందమయత్వాది లక్షణ పరిజ్ఞానంబు నిరుపయోగమగును. ఇందువలన "సన్మాత్రము ప్రత్యక్షమైన బ్రహ్మమనియు బ్రహ్మేతరమును "నేతి నేతి" అను శ్రుతివాక్యము నిషేధించుచున్నదనియు" చెప్పుట యసమంజసంబైనదియే యని సిద్ధాంతము.

సూ. ''అతోఽనంతేన తథా హి లింగమ్'' 3-2-25

ఎందువలన బ్రహ్మము నుపాసించువారికిని బ్రహ్మముయొక్క అసాధారణ మగు జ్ఞానానంద పరమైశ్వర్యము ప్రకాశించునో అందువలన "ద్వే వా వ బ్రహ్మణో రూపే" ఇత్యాది సందర్భమున చెప్పఁబడిన అనంత కల్యాణ గుణగణముతో సంబంధము బ్రహ్మమునకు అనివార్యముగా నుండునదియేను; కావున బ్రహ్మము ఉభయలింగంబగునది.

ప్రశ్న : "ద్వే వా వ బ్రహ్మణో రూపే'' ఇత్యాదిని చెప్పఁబడిన ప్రపంచము బ్రహ్మరూపమను విషయము - బ్రహ్మప్రపంచములకు ఆధ్యాసిక సంబంధము నంగీకరించుటతోడనే సరిపడునది. మరియొక విధముగా ప్రపంచము బ్రహ్మరూప మను సంశమును సమర్థింపరాదు. అందువలన "అథాత ఆదేశో నేతి నేతి" అను నిషేధము-అధ్యస్తమైన ప్రపంచమును నిషేధించుట యగునని చెప్పుట సమంజసంబగును కాదా ?

ఉత్తరము : అధ్యాస సంబంధము లేకున్నను స్వాభిమతమైన విధానముతో ప్రపంచము బ్రహ్మరూప మను విషయమును సమర్థింపఁదలచి మొదట పక్షాంతరమును చెప్పుచున్నవారు.

సూ. "ఉభయవ్యపదేశా త్త్వహికుండలవత్" 3-2-26

"సర్వో వై రుద్రః" "ద్యావాపృథివీ జనయన్ దేవ ఏకః" "శివుఁడు సర్వాత్మకుఁడు" "ఒకే దేవుడు పృథివ్యాకాశాది ప్రపంచమును పుట్టించువాడు" అనుచో నాగసర్పమునకు కుండలభావము ఋజుభావంబువలె పరమేశ్వరునకు ఏకత్వము బహుత్వంబు నొప్పారునవి. "ద్వే వా వ బ్రహ్మణో రూపే" ఇత్యాది సందర్భమున పృథివ్యాది రూపముతో నుండుట పరమేశ్వరునికే చెల్లునని చెప్పఁబడినదియు గమనింపఁదగినది.

సూ. "ప్రకాశాశ్రయవద్వా తేజస్త్వాత్" 3-2-27

ప్రకాశమునకు, ప్రకాశము ఆశ్రయించి యుండుదానికి స్వరూపము వేరైనను తేజఃసంబంధముగా నొకే భావముండునట్లు అచిత్తునకు బ్రహ్మమునకు నొకే జాతియగుటకతన బ్రహ్మము పృథివ్యాదిభావము కలది యగు నని గ్రహించునది.

సూ. "పూర్వవ ద్వా" 3-2-28

వా శబ్దము పక్షద్వయమును నివారించును. ఎట్లనఁగా ? ప్రకాశము జాతి గుణము అనునవి విశేషణమగుటయే ముఖ్యమగు స్వభావము కలవగుటచే విశిష్ట మగుదానిలో ఏకదేశములై అంశత్వము కలిగియుండును. చిద్వస్తువు అచిద్వస్తు వును అట్టివియేను; "సర్వోవై రుద్రః" "పరమాత్మ సర్వాత్మకుఁడు" చిదచిద్వస్తు వుల నొకేశబ్దముతో నుచ్చరించుట - ప్రపంచబ్రహ్మములు ఏకరూపము నాశ్ర యించి యుండునవగుటచే నవ్వానికి శరీర శరీరిభావము సరిపడునని- గావింపఁ బడినది. పూర్వోక్తమగు పక్షద్వయమున బ్రహ్మము సదోషంబగుచున్నయది. సర్పకుండలోపమాన పక్షమున బ్రహ్మమునకు పరిణామిత్వము జడత్వంబు నను దోషములు, ప్రకాశ తదాశ్రయోపమాన పక్షమున బ్రహ్మత్వము అను జాతి నాశ్ర యించి యుండుటచే ప్రపంచము గూడ బ్రహ్మంబగు నను ఆక్షేపణము ననివార్య ములగుచున్నవి.

"యస్య పృథివీ శరీరం" "యస్యాత్మా శరీరం" ఇత్యాది శ్రుతివాక్యములు ప్రపంచ బ్రహ్మములకు శరీరశరీరి భావమునే సమర్థించుచున్నవి.

శ్లో॥ విద్యేతి చేతనాం ప్రాహు- స్తథాఽవిద్యా మచేతనాం,
విద్యాఽవిద్యాత్మకం సర్వం-విశ్వం విశ్వగురో ర్విభోః।
రూపమేవ న సందేహో-విశ్వం తస్య వశే యతః॥

చైతన్యమును విద్య యందురు. అచేతనము నవిద్యగా చెప్పుదురు. ప్రపంచ మంతయు చేతనాచేతనాత్మకమై విశ్వనియామకుఁడగు పరమేశ్వరునికి శరీర మనఁదగి యున్నది. ఎందుకనఁగా ? జగమంతయు పరమాత్మ యధీనమగునది. ఇవ్విషయమున ఎట్టి సందేహంబును లేదు.

ఇత్యాది పురాణ వచనములు ప్రమాణములుగా నున్నందున అష్టమూర్తి యగు సదాశివునకు చిదచిద్వస్తువులు శరీరములగుట సుసంభవ మగునని బోధ పడుచున్నయది.

సూ. "ప్రతిషేధాచ్చ" 3-2-29

"నాస్య జరయైత జ్జీర్యతి" "అస్థూల మనణ్వహ్రస్వమ్" ప్రపంచములో నంతర్యామిగా నున్నను బ్రహ్మము ప్రపంచగతములైన జరామరణాది వికారము లచే జీర్ణించునది కాదు"

"బ్రహ్మము జగచ్ఛరీరక మైనను స్థూలము కాదు సూక్ష్మము కాదు చిన్నది కాదు''

ఇత్యాది శ్రుతి వాక్యములయందు బ్రహ్మము చిదచిదాత్మక మైనప్పటికిని చిదచిత్తులఁజెందియుండు వికారములు కలది గాదని చెప్పఁబడుటచే బ్రహ్మము చిదచిద్విశిష్టమైనను నిర్దోషంబుని ఖిలమంగళ గుణాస్పదంబు నగునని తెలియ నగును.

ఇద్ది సారాంశము.

పరమాత్మయగు శివుఁడు చిదచిత్తులకు కారణమై చిదచిద్విశిష్టుఁడైనను వికారములు అజ్ఞత్వము మున్నగు అపురుషార్థ ధర్మములు లేనివాడనియు సర్వజ్ఞత్వము నిత్యతృప్తత్వము అనాదిబోధత్వము స్వతంత్రత్వము అలుప్తశక్తిత్వము అనంత శక్తిత్వము మొదలగు పరమపురుషార్థ ధర్మములు కలవాడనియు తప్పని సరిగా గ్రాహ్యంబగుచున్నయది.

## పరాధికరణము

సమస్తచిదచిదాకార యగు పరశక్తిఁదగు విలాసముతో సమరసంబగు స్వరూపము గల యట్టియు దోషములన్నిటిఁజెందిన వాసనలఁదగు కళంకము లేనట్టియు సర్వజ్ఞత్వము మున్నగు మంగళగుణములన్నిటికి రత్నాకరమనఁదగు నట్టియు పరబ్రహ్మంబు విరూపాక్షంబు నగు శివునికన్న నతీతంబగు ఒకానొక వస్తు వెద్దియు లేదని చెప్పుటకు మొదట దిగువవిధము ఆశంకించుచున్నవారు

పూర్వపక్ష సూత్రము.

సూ. 'పరమతః సేతూన్మాన సంబంధ భేద
వ్యపదేశేభ్యః" 3-2-30

"జన్మాద్యస్య యతః" అను సూత్రము మొదలుకొని "ప్రతిషేధాచ్చ" అను సూత్రము వరకు పరమకారణముగా పరమేశ్వరుఁడు ప్రతిపాదింపఁబడినవాడు. ఐతే ఇట్టి పరమేశ్వరునికన్న మించిన వస్తువు కలదా లేదా అని సందేహము.

ప్రశ్న : "అథ య ఆత్మా, స సేతు ర్విధృతిః"

"ఆత్మశబ్దవాచ్యుండైన పరమేశ్వరుఁడు సంసార మహాసముద్రమునకు తీరమువంటివాడు, లోకముల నన్నిటిని ధరించువాడున్ను"

"ఏతం సేతుం తీర్త్వా అంధః సన్ననంధో భవతి"

"సంసార సముద్రతీరమనఁదగు పరమేశ్వరు నాశ్రయించినయెడల గ్రుడ్డి వాడైనను కనుచూపు గలవాడగును"

"చతుష్పాత్ బ్రహ్మ" "బ్రహ్మము విభాగచతుష్టయముగలది" "అమృత స్యైష సేతుః" "మోక్ష సామ్రాజ్యమునకు పరమేశ్వరుఁడు అవధి యగువాడు"

ఇత్యాది శ్రుతివాక్యములు- పరమేశ్వరుఁడు సేతువు అనఁగా అవతలిగట్టు వంటి వాడనియు, భాగచతుష్టయము గలవాడగుటఁజేసి పరిమిత స్వరూపము గల వాడనియు ముక్తప్రాప్యంబగు అపరిమిత బ్రహ్మమునకు పరమేశ్వరునకును ప్రాప్య ప్రాపక సంబంధము కలదనియు వేదాంతములయందు పరముగా ప్రసిద్ధంబగు వస్తువు పరమేశ్వరునికన్న భిన్నంబనియు - చెప్పుచుండుటవలన పరమేశ్వరుని కంటె నతీతంబొండు కలదని చెప్పుట సరిపడును కాదా ?

సిద్ధాంత సూత్రము.

ఉత్తరము :

సూ. "సామాన్యా త్తు" 3-2-31

సూత్రములోని తు శబ్దము పూర్వపక్షమును నివారించును. కావున సర్వో త్తరుండైన శివునికన్న మించిన వస్తువు కలదని వక్కాణించుట సమంజసము కాదని భావము.

"విశ్వాధికో రుద్రో మహర్షిః" ఇత్యాది శ్రుతి వాక్యములు శివుఁడు చరాచర ప్రపంచమంతటికన్న నధికుఁడని నిరూపించుచున్నయవి.

ఇఁట సేతుత్వాదివ్యపదేశమునకు అర్థమేమనఁగా ? లోకములన్నియు ఒక దానియందొకటి కలియకుండునట్లు ఆ యా స్థలములయందు నవ్వానిని శాశ్వత ముగా నెలకొలుపువాడని పరమేశ్వరునకు సేతుత్వాదికము సామాన్యలక్షణముగా చెప్పఁబడినది. ఈ యర్థమునే దిగువ శ్రుతియందు గాననగును.

"అథ య ఆత్మా ససేతు ర్విధృతి, రేషాం లోకానా మసంభేదాయ"

ఇఁట సంభేద మనఁగా సంకరము; ఇట్టి సంకరము లోకములకు కలుగ కుండుటకై పరమేశ్వరుఁడు చతుర్దశభువనముల బాధ్యతను వహించువాడు కావున జలమును భూమిని వేరువేరుగా చూపెట్టు గట్టువలె సకల బ్రహ్మాండ సేతు వనఁ బఱగుచున్నవాఁడు.

"సర్వం ఖల్విదం బ్రహ్మ" అనుచో సకల జగన్నిమిత్తోపాదానోభయ కారణముగా ప్రతిపాదింపఁబడిన పరమశివుఁడే "ఏత మితః ప్రేత్యాభిసంభవి తాఽస్మి" "ఈ లోకమునుండి వెడలగానే పరమేశ్వరు నాశ్రయించి నిజరూప సంపన్నుని కాగలను'' అనుచో ముక్తప్రాప్యుడుగా చెప్పఁబడుచున్నవాడని విశద మగుచున్నది.

మరియొకచో "త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం ధ్యాత్వా ముని ర్గచ్ఛతి భూతయోనిమ్, సమస్తసాక్షిం తమసః వరస్తాత్"

"మూడు కన్నులు గలవాడు నీలకంఠుడు ప్రశాంతుడు నగు మహాదేవుని ధ్యానించి పూజించు నెడల జగత్కారణుఁడు జీవలోక సాక్షియు ప్రకృత్యతీతుఁడు నగు శివుని పొందగలుగును"

అనుచో శివుఁడే సర్వోత్తరుఁడగుటకతన ముక్త ప్రాప్యుడుగా చెప్పఁబడు చున్నవాడు. కావున నీ సందర్భమున "తీర్త్వా" అను తఱతిశబ్దము ప్రాప్తిని తెలు పునదని గ్రహింపవలెను.

ఒకవేళ పరమప్రాప్యుఁడు విశ్వాధికుఁడు పరమకారణుఁడు నగు శివుని కంటె నింకొక వస్తువు కలదనునెడల నద్దానిపైన గూడ మరియొకటి కలదని చెప్పవలసి వచ్చును కావున వేదాంతవాక్యములు అనవస్థా దోషజుష్టములు కావలసి వచ్చును.

ఇందువలన సర్వాతీతుఁడు పరమశివుఁడే యనియు శివుని మించిన వస్తు వెద్దియు లేదనియు ముఖ్యముగా తెలియనైనది.

బ్రహ్మము పరిమిత స్వరూపము గలదనుటకు దిగువ సూత్రము సమా ధానము.

సూ. "బుద్ధ్యర్థః పాదవత్" 3-2-32

"చతుష్పాత్ బ్రహ్మ" అనుచో చెప్పబడిన నాలుగు పాదముల విభాగము "వాక్పాద శ్చతుష్పాదః" ఇత్యాదిని చెప్పఁబడినట్లు బ్రహ్మోపాసనకై నిరూపింపఁబడినదని తెలియవలెను.

సూ. "స్థానవిశేషాత్ ప్రకాశాదివత్" 3-2-33

పరమేశ్వరుఁడు వస్తుతః అపరిమిత స్వరూపము గలవాడైనను సర్వవ్యాపియగు ప్రకాశమును- గవాక్షములు మున్నగు స్థానములందగు సంబంధమువలన గ్రహించునట్లు- హృదయాది స్థలములయందు పరిచ్ఛిన్న స్వరూపము గలవాడని ధ్యానింపఁబడుటలో అనుపపత్తి యెద్దియు గానరాదు.

పరమేశ్వరుఁడు ప్రాప్యుఁడైనను ప్రాపకుఁడు నగునని దిగువసూత్రముతో వివరించుచున్నవారు.

సూ. "ఉపపత్తే శ్చ" 3-2-34

"యమేవైష వృణుతే తేన లభ్యః"

"పరమాత్మ యెవని కటాక్షించునో అట్టివాడే పరమాత్మను పొందఁగలుగును"

అను శ్రుతివాక్యము ప్రాప్యుడైన పరమేశ్వరుఁడే ప్రాపకుఁడు అనఁగా మోక్షముఁజెందించువాడని విశదీకరించినందున పరమేశ్వరునికన్న నతీతుఁడు మరియొకఁడు లేడని తెలియవలెను.

## అన్యప్రతిషేధాధికరణము

సూ. "తథాఽన్య ప్రతిషేధాత్" 3-2-35

పూర్వాధికరణమునందు విరూపాక్షంబగు పరబ్రహ్మమున కంటె నతీతంబైనది మరియొకటి లేదని నిరూపింపఁబడినది. ఇక నీ యధికరణమున పరమేశ్వరునితో సమానుఁడు కలడా లేడా అని సందేహము కలుగుచున్నందున విచారింపఁబడుచున్నయది.

ప్రశ్న : పరమేశ్వరునికంటె నుత్కృష్టుఁడగువాడు లేకుండు గాక? జగత్కారణము గాను జగమున కధిపతి గాను పరమేశ్వరునితో సమానుఁడు మరి యొకఁడు కలడని దిగువ నుదహరింపఁబడిన శ్రుతుల వలన తెలియుచున్నది.

"సహస్రశీర్షా పురుషః, సహస్రాక్షః సహస్రపాత్" అనుచో ఒకానొక పురుషుఁడు బహుముఖములు అనేకపాదములు మున్నగు లక్షణములు కలవాడని వినఁబడుచున్నయది. మఱియు "పాదోఽస్య విశ్వా భూతాని" అనుచో తన విభూతియందు చతుర్థాంశమగు సమస్త చరాచరముతో కూడియుండుటయు "త్రిపాదస్యామృతం దివి" అనుచో మిగత మూడంశముల విభూతి పరమాకాశ మనఁబడు దివ్యాంతరిక్షమున కలిగియుండుటయు "తస్మా ద్విరాడజాయత, విరాజో అధిపూరుషః" అనుచో అవ్యక్తమునకు హిరణ్యగర్భునకును కారణ మగుటయు, "ఆదిత్యవర్ణం తమసస్తు పారే" అనుచో తమస్సనఁబడు ప్రకృతికన్న నతీతుడగుటయు "తమేవ విద్వా నమృత ఇహ భవతి" అనుచో మోక్షహేతు వగుటయు నిరూపింపఁబడినవి.

ఇట్టి పురుషునే "సహస్రశీర్షం దేవమ్" మొదలుకొని "పతిం విశ్వస్య" ఇత్యాదిని విశ్వపతిగాను "నారాయణపరం బ్రహ్మ" అనుచో నారాయణశబ్దవాచ్యు నిగాను పరబ్రహ్మముగాను "పరమాత్మా వ్యవస్థితః" అనుచో దహరాకాశము నందు నుపాస్యునిగాను శ్రుతి వక్కాణించినందున పురుషుడనఁదగు నారాయ ణుఁడు పరమేశ్వరునితో సమానములైన లక్షణములు గలవాడని గ్రహింపనగును. ఇట్టివే గదా పరమేశ్వరుని ధర్మములు;

"సర్వానన శిరోగ్రీవః - సర్వభూత గుహాశయః,
సర్వవ్యాపీ చ భగవాం - స్తస్మా త్సర్వగతః శివః"

అను మంత్రోపనిషత్తు, "విశ్వతశ్చక్షు రుత విశ్వతోముఖః" అను మహోపనిషద్వాక్యము "సర్వతోముఖః" ఇత్యాది శ్రుతివాక్యంబులును పరమేశ్వ రుఁడు బహుముఖపాదాదులు కలవాడని విశదీకరించినవి. మఱియు "మాయాంతు ప్రకృతిం విద్యా - న్మాయినంతు మహేశ్వరం, తస్యావయవభూతేన - వ్యాప్తం సర్వమిదం జగత్" అను శ్వేతాశ్వతరమంత్రము జగదంశవిశిష్టుఁడ నియు తెలుపుచున్నయది. "హిరణ్యగర్భం పశ్యత" ఇత్యాదిని హిరణ్యగర్భజన

కుఁడనియు ''సమస్తసాక్షిం తమసః పరస్తాత్" అనుచో తమఃపరుఁడనియు "దహరం విపాప్మం" ఇత్యాదిని దహరోపాస్యుఁడనియు "జ్ఞాత్వా శివం శాంతి మత్యంత మేతి" అనుచో మోక్షకారకుఁడనియు ''సర్వైశ్వర్య సంపన్నః" ఇత్యాదిని జగదీశ్వరుఁడనియు పరమేశ్వర నిర్దేశము వినఁబడుచున్నయది.

ఇవ్విధము శివకేశవులకు విశ్వరూపత్వాది ధర్మముల వలన సమానత్వం బని తెలియునది. మరియు స్మృత్యాదులయందు పూజా విధానమున "శివం వా విష్ణుమేవ వా''అను వికల్పమును గాననగును. లోకమునందున పూజాస్థానములు మున్నగునవియు శివకేశవులను ప్రతిపాదించు పురాణములు అగమములును సమానములుగా నున్నందున నారాయణుఁడనఁబఱగు పురుషుఁడు పరమేశ్వరునితో సమానుఁడని యంగీకరింపవలెను గదా ?

ఉత్తరము : పరమేశ్వరునికన్న శ్రేష్ఠమగు వస్తువు లేనట్లు పరమేశ్వరునితో సమానమైనదియు లేదని చెప్పవలెను. జగత్కారణత్వము ఈశ్వరత్వము మున్నగు లక్షణములు పరమేశ్వరునికి దక్క నితరులకు నుండజాలవని దిగువ ప్రమాణములు చాటుచున్నవి.

ఎట్లనఁగా ? "ఏకఏవ రుద్రో న ద్వితీయాయ తస్థుః, య ఇమాన్లోకానీశత ఈశనీయు ర్జననీయుః"

"ద్యావాపృథివీ జనయన్ దేవ ఏకః''
''య ఏకో రుద్ర ఉచ్యతే"
"హరః క్షరాత్మానా వీశతే దేవ ఏకః"

సృష్టికి మున్ను రుద్రుఁడొకడే యుండెను. రెండవనాడు లేకుండెను. అట్టి రుద్రుఁడే శాసించునట్టి పుట్టించునట్టియు శక్తులతో కూడియుండువాడగుటచే చరాచరప్రాణులను శాసించువాడు."

"భూమి ఆకాశము అనువానితో కూడియుండు బ్రహ్మాండమును పుట్టించు దేవు డొకఁడేను"

"పరమాత్మ యొక్కడే రుద్రుడని చెప్పఁబడును."

''ప్రకృతి పురుషుల నిద్దరిని శాసించు దేవుఁడు హరుఁడనఁబఱగి యద్వితీయుడుగా నుండువాడు''

మఱియు

> "యదా చర్మవదాకాశం - వేష్టయిష్యంతి మానవాః,
> తదా శివ మవిజ్ఞాయ - దుఃఖస్యాంతో భవిష్యతి"
> శివ ఏకో ధ్యేయః శివంకరః సర్వ మన్యత్పరిత్యజ్య''
> "యదా తమస్తన్న దివా న రాత్రిః, నసన్నచాస చ్ఛివ
> ఏవ కేవలః"

"మానవోపలక్షితులైన సకల ప్రాణులు ఆకసమును తోలునువలె చుట్ట గలుగుదురేని శివుని తెలిసికొనకయే ముక్తులు కాగలుగుదురు. అనఁగా ఆకాశ వేష్టనము సరిపడనట్లు శివోపాసనలేనిది మోక్షము నొందఁజాలరని భావము"

"ఇతర దేవతా పూజనాదికమునంతయు విడనాడి మోక్షప్రదాతయగు శివు నొకనినే ధ్యానింపవలెను."

"జీవుల గాఢసుషుప్తి యనఁబడు ప్రళయమున పగలుగాని రాత్రిగాని సత్తుగాని అసత్తుగాని లేకుండెను. అట్టి సమయమున నామరూపవిభాగానర్హ సూక్ష్మచిదచిచ్ఛక్తి విశిష్టుడైన శివుఁడొకఁడే విరాజిల్లుచుండెను."

ఇత్యాది శ్రుతివాక్యములు పరమేశ్వరుఁడు గాక నితరుఁడు జగత్కార ణము కాజాలడని నిషేధించినవి. కావున పరమేశ్వరునితో సమానుడైన మరి యొకఁడు లేడనియే సుదృఢమైన సిద్ధాంతము.

పరమశక్తులు కలవాడగుటచే జగన్నిమిత్తమగువాడు శివుఁడేను, "పురు షుఁడు జగదుపాదానకారణ"మని చెప్పిన యంశము - హిరణ్యగర్భజనకుఁడను టను సమర్థించును. నారాయణుఁడు ప్రకృత్యంశసంభూతుఁ డగుటఁజేసి జగదు పాదానము కావచ్చును. కాని జగన్నిమిత్తకారణము శివుఁడే యగును. విష్ణువు పరమేశ్వరుని నిరంతరము భావించుటఁజేసి శ్రుత్యాది ప్రమాణములయందు క్వచిత్తు జగత్కారణముగా చెప్పఁబడెను విష్ణువు దహరవిద్యయందు నుపా స్యుఁడగుటయు మధ్యమాధికారులను గురించి యని తెలియవలెను. నారాయ ణుని యుపాసించువారికి విష్ణుపదము లభించుట ద్వారా శివసాయుజ్యము సమ కూరును కాని సాక్షాత్తు కైవల్యము లభింపదు.

ఇందువలననే మహాభారతమునందు అనుశాసనిక పర్వమున

శ్లో॥ రుద్రభక్త్యా తు కృష్ణేన-జగద్వ్యాప్తం మహాత్మనా,
తం ప్రసాద్య తథా దేవం-బదర్యాం కిల భారత.
అర్థా త్ప్రియతరత్వం చ-సర్వలోకేషు వై తథా,
ప్రాప్తవానేవ రాజేంద్ర-సువర్ణాక్షా న్మహేశ్వరాత్॥

మహానుభావుఁడైన నారాయణుఁడు శంకరు నారాధించి జగమును వ్యాపించు శక్తి గలవాడగుటయే గాక శివానుగ్రహమును బదరికాశ్రమమునందు సంపాదించి లోకములన్నిటియందు నభీష్టవస్తువు (లేక)ధనమునకన్న మిక్కిలి ప్రియుఁడయ్యెను. ఇది యంతయు సువర్ణాక్షుడనఁబడు మహేశ్వరుని కరుణా కటాక్ష విశేషము గదా!

"తస్మాద్విరాట్" అను వాక్యము పురుషుఁడు జగదుపాదానమని తెలుపును.

"హిరణ్యగర్భం పశ్యత జాయమానమ్" "ద్యావాభూమీ జనయన్ దేవ ఏకః" ఇత్యాది శ్రుతులు పరమేశ్వరుఁడు జగన్నిమిత్తమని విశదీకరించును.

సర్వజ్ఞుఁడు సర్వశక్తిమంతుడు పరబ్రహ్మము విశ్వాధికుఁడు నగు శివుని వలన మొదట పరప్రకృతి యనఁబడుగు పరాశక్తి ప్రాదుర్భవించును. అట్టి పరాశక్తికి చెప్పఁబడిన మొదటి భోక్తృత్వదశయందు "సహస్రశీర్షా పురుషః" అనునట్లు పురుషుఁడేర్పడును. పురుష స్వరూపుడైన శివునినుండి సకలచేతనాచేతన ప్రపంచ పరిణామము సంభవించును. ఇందువలననే "సర్వో వై రుద్రః" అనుచో పరమేశ్వరుని సర్వాంతర్యామిత్వమును ప్రారంభించి ఉపాదానమగు నారాయణుఁడు సర్వాత్మకుండెట్లగునని ప్రశ్నించుకొని "పురుషస్య విద్మ సహస్రాక్షస్య మహాదేవస్య ధీమహి" అనుచో పురుషుఁడనఁబడుగు నారాయణుఁడు పరమేశ్వరుని మహావిభూతిలో చేరినవాడై జగదాకారుఁడు కాజాలునని నిరూపింపనైనది.

సర్వజ్ఞము సర్వశక్తికము నిత్యతృప్తము స్వతంత్రము విశ్వాధికము నిమిత్తంబగు పరబ్రహ్మమే సృష్టికాలమున "బహు స్యామ్" అని సంకల్పించి తన నుండి పురుషుని (నారాయణుని) విడదీయును. తనచే విభజింపఁబడి తన యంశంబగు నారాయణుని ద్వారా జగము సిద్ధంబగునని భావము.

''తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్, తదను ప్రవిశ్య సచ్చ త్యచ్చాభవత్" పరమేశ్వరుఁడు జగమును సృజించి యద్దాని ననుసరించి ప్రవేశించినవాడై చేత నునిగా అచేతనముగా నేర్పడెను''

"మాయాం తు ప్రకృతిం విద్యా—న్మాయినం తు మహేశ్వరమ్,
తస్యావయవభూతేన—వ్యాప్తం సర్వమిదం జగత్''

ఇత్యాది శ్రుతి వాక్యములు - నారాయణుఁడు మాయావిశిష్టుడైన మహేశ్వరుని యంశభూతుడై జగమునంతయు వ్యాపించెనని విశదీకరించినవి. నిమిత్త మగువాడు సంకల్పింపనిది ఉపాదానము ఏర్పడదు గావున నిమిత్తము ఉపాదాన ముకన్న నధికంబగును. ఉపాధానము నిమిత్తము ననుసరించి యుండునదగుటచే నిమిత్త ధర్మముల నుపాదానమునందు ప్రతిపాదించుట వినఁబడును.

ఇందువలన పరమేశ్వరునితో సమానమైనది కాని శ్రేష్ఠమైన వస్తువు కాని లేదనియే విదితమైనది.

దిగువ చూపఁబడు కారణమువలన నైనను పరమేశ్వరునితో సమాన మైనదియు తదుత్కృష్టమైనదియు నగు వస్తువెద్దియు లేదని చెప్పుచున్నవారు.

సూ. "అనేన సర్వగతత్వ మాయామ శబ్దాదిభ్యః" 3-2-26

ఆయామ మనఁగా మహావ్యాప్తి యగును.

"సర్వానన శిరో గ్రీవః" "విశ్వత శ్చక్షు రుత విశ్వతోముఖః" ఇత్యాది శ్రుతి వాక్యములు "అణో రణీయాన్" మొదలుకొని "సర్వో హ్యేష రుద్రః" వరకు గల మహోపనిషద్వాక్యములున్ను "యో వై రుద్రః స భగవాన్" మొదలుకొని "యచ్చ సత్యమ్'' వరకు గల అధర్వవాక్యములును పరమాత్మ జగమునంతయు వ్యాపించువాడని ప్రతిపాదించుచున్నవి కావున జగదుపాదానము స్వధర్మాంశము పురుషుఁడు నగు నారాయణుని ద్వారా పరమేశ్వరుఁడు సర్వగతుండగునని బోధ పడుచున్నయది. ఆకాశమువలె సర్వమును వ్యాపించువాడని "సర్వానన శిరో గ్రీవః" ఇత్యాది వాక్యము సూచించును. ప్రాణులందరిని నియమించుటకై అవ్వారి హృదయగుహల యందు నివసించునని "సర్వభూత గుహాశయః" ఇత్యాది వాక్యము విశదీకరించును.

"కేచి దద్వైత మాశ్రిత్య-బిడాలవ్రతినో నరాః, రుద్రేణ సామ్య మన్యేషాం

ప్రవదంతి విమోహితాః" అను సూతసంహితావచనము శంకరునితో విష్ణ్వాదిదేవతలు సమానులు కాజాలరని స్పష్టీకరించినది. ఏవ మాది సందర్భమునఁజేసి ప్రపంచమంతయు పరమేశ్వరుని విభూతియని తెలియుచున్నందున శివునితో సమానుడుగాని శివునికంటె గొప్పవాడు గాని లేడని గ్రహింపవలసి యుండును.

ఇవ్విధము సర్వాధిపతియగుట చేతను సర్వాంతర్యామి యగుట వలనను పరమేశ్వరుఁడే ఆ యా దేవతల రూపమున స్వరూపమునను కర్మలన్నిటికి ఫలము నొసగువాడని దిగువ యధికరణమున గాననగును.

## ఫలాధికరణము

సూ. "ఫల మత ఉపపత్తేః" 3-2-37

పూర్వాధికరణమున సర్వేశ్వరుఁడుగా నిరూపింపఁబడిన పరమేశ్వరుఁడే కర్మోపాసనాపరులందరికిని అనుష్ఠానఫలము నొసగునా ? లేక కర్మయా ? అని యిట సందేహము పొడముచున్నది.

ప్రశ్న : వస్తుతః కర్మ యనునది అనుక్షణవినాశధర్మము కలదైనను కర్మ ననుసరించు ఒకానొక అపూర్వము నేర్పరచినచో కాలాంతరమున సంభవించు ఫలము నొసగుటయందు కర్మ సమర్థంబగును గదా !

అందువలన కర్మకు ఫలప్రదత్వము సరిపడుచుండగా కర్మభిన్నుఁడు అప్రసిద్ధుఁడు నగు పరమేశ్వరుని కల్పించుటయందు గౌరవము కలదు గాన పరమేశ్వరుఁడు గాక కర్మయే అపూర్వము ద్వారా ఫలప్రద మగునని చెప్పుట సమంజసము కాదా ?

ఉత్తరము : కర్మలన్నియు ఫలింపవలెనన్నచో పరమేశ్వరుని ఆరాధింపవలసి యుండును. లోకమున రాజును సేవించుటచే భృత్యులందరు అనుకూలురై రాజానుగ్రహ ప్రాప్తికి దోహదము చేయునట్లు భక్తులచే నుపాసింపఁబడు పరమేశ్వరుఁడే ఉపాసకులందరి మనోభీష్టముల ననుగ్రహించునని చెప్పుట సరిపడును. కాని అచేతనమగు కర్మకు గాని జడమగు అపూర్వమునకు గాని కర్మలలో నుండు తారతమ్యమును (అనఁగా ఏయే కర్మకు ఎట్టి ఫలమును ఎంతెంత నొసగవలెనో)

కనిపెట్టి ఫలప్రదము అగు సామర్థ్యము ఉండజాలదు. ఇట్లే అచేతనమగు రాజ సేవనమని తెలియునది.

ఇందుకు ప్రమాణము

"ఏష హ్యేవ సాధు కర్మ కారయతి తమ్, యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతి, ఏష ఏవాసాధు కర్మ కారయతి, యమధో నినీషతి" "ఎవనిని ఈ భూరాది లోకములనుండి యుద్ధరింపఁ బూనునో అవ్వానితో సుకృతము నాచరింపఁ జేయువాడు పరమెశ్వరుఁడేను; ఇఁక నెవని నధోలోకములకు పంపఁదలచునో నవ్వానితో దుష్కృతములను చేయించువాడు పరమేశ్వరుఁడేను;" అను శ్రుతి వాక్యము- ధర్మాధర్మ ఫలముల నొసగువాడు నవ్వానిని ఆ యా జీవుల పూర్వ కృతము ననుసరించి చేయించువాడును శివుఁడే యని నొక్కి వక్కాణించినది. విచారింపగా కర్మఫలసిద్ధికి అపూర్వమును కల్పించుటయే గౌరవమని తేటపడును. సుకృతములన్నియు ఈశ్వరారాధన రూపములగుటచే నవ్వానిచే ఆరాధింపఁబడు పరమేశ్వరుఁడే ఫలప్రదాత యగును కాని కర్మ కాజాలదని సిద్ధాంతము.

సూ. "శ్రుతత్వాచ్చ" 3-2-38

"గాధపతిం మేధపతిం రుద్రం జలాషభేషజమ్" "ఆ వో రాజాన మధ్వరస్య రుద్రమ్"

"గాధలనఁగా స్తోత్రములు, మేధములనఁగా యజ్ఞములు, జలాషమనఁగా సుఖము, (పుట్టువారు గాన జాః అనఁగా ప్రాణులు, వారిచే లాష మనఁగా కోరఁబడునది) స్తోత్రములకు యజ్ఞములకు నధిపతియై సుఖరూపమైన ఔషధము వంటివాడు శివుఁడు" ఇత్యాది శ్రుతి వాక్యములయందు శంకరుఁడే కర్మలన్నిటికి ప్రభువనియు కర్మలచే ఆరాధింపఁబడువాడగుటఁజేసి కర్మఫలప్రదాత యనియు వినఁబడుచున్నయది.

"సోమేనారాధయే ద్దేవం-సోమం సోమవిభూషణమ్"

"నాశ్వమేధా త్పరో యజ్ఞో-రుద్రస్యారాధనం ప్రతి"

రామాయణము.

ఇత్యాది స్మృతి వాక్యంబులును పరమేశ్వరుఁడే సర్వయజ్ఞాధిపతి యని చాటుచున్నవి.

చమకముల యందును "వాజశ్చ మే ప్రసవశ్చ మే ధాతాచ మే విష్ణుశ్చ మే" "వాజ మనఁగా అన్నము. ప్రసవమనఁగా బీజము, ఇవియు బ్రహ్మ విష్ణువులును నాకు కావలెను" అనుచో అన్నాదులవలె విష్ణ్వాదులు దేయకోటిలో చెప్పఁబడినందున పరిశేషన్యాయమున శివుఁడే సర్వకర్మఫలదాత యగునని విశదమగును.

ఇందుకు ప్రోద్బలకముగా శివ మహాపురాణమున దక్షయజ్ఞ ప్రస్తావమున

"కిమేభి రమరై రన్యై-రధ్వరే పూజితైః ఫలమ్?
రాజా చే దధ్వరస్యాన్య-న రుద్రః పూజ్యతే త్వయా"

"దక్షా! నీ చేయు యజ్ఞమున ఇతరదేవతలను పూజించిన నేమి లాభము? సర్వ యజ్ఞాధిపతియగు శివుని పూజింపకున్నావు" అని దధీచి మహాముని దక్ష ప్రజాపతికి హితమునుపదేశించిన సందర్భమును గాననగును.

ఈ యర్థమునే శ్రీ సుదర్శనాచార్య చరణులు దిగువ విధముగా పేర్కొనినవారు.

శ్లో॥ విష్ణు ప్రజాపతి పురందర పూర్వకేషు
వాజాదితుల్య మఖిలేష్వపి దైవతేషు।
ఆశంసితేషు చమకాః పరిశిష్యమాణం
దాతార మీశ్వర! భవంత మశాబ్ద మాహుః॥

"పరమేశ్వరా! చమకములయందు ఇంద్ర బ్రహ్మ విష్ణుప్రభృతిక దేవతలందరును అన్నము మొదలగు దేయవస్తువులలో పరిగణింపఁబడినందున శబ్దాతీతుడవగు నీవే మిగిలియున్నందునను నిన్ను సర్వకర్మఫలప్రదాతగా చెప్పుదురు."

కావున సర్వవిధ యజ్ఞములయందు ఆరాధింపఁబడువాడును నిత్య నైమిత్తిక కర్మల నాచరించుటచే సంతృప్తిపడువాడును కామ్యకర్మలన్నిఁటిఁదగు ఫలముల నొసగువాడును పరమేశ్వరుఁడే యని సారాంశము.

పూర్వపక్ష సూత్రము (పక్షాంతరము)

సూ. ధర్మం జైమిని రత ఏవ" 3-2-39

ఉపపత్తి యుండుటఁజేసి ధర్మమునే ఫలప్రదముగా జైమిని మహర్షి భావించెను. వ్యవసాయము మర్దనము మొదలగు క్రియలకు సాక్షాత్తు గాని పరంపరగా గాని ఫలము ఏర్పడుటను లోకమున చూచుచున్నాము. (ఇద్దియే ఉపపత్తి)

ఫలాభిసంధి గల పురుషుఁడు యిజ్ఞాది సుకృతము నవశ్య మాచరింపవలసి యుండు నని "యజేత స్వర్గ కామః" ఇత్యాది శ్రుతి వాక్యములయందు వినఁబడుటచే కర్మయే అపూర్వముద్వారా ఫలప్రదమగునట్టిది.

సిద్ధాంత సూత్రము.

సూ. "పూర్వం తు బాదరాయణో హేతువ్యపదేశాత్" 3-2-40

పూర్వోక్తమైన "పరమేశ్వరుఁడే సర్వకర్మ ఫలదాత" యను సంశమును భగవానుడైన వేదవ్యాసుఁడు భావించును. వాయ్వాదిరూపమున శివుఁడే భక్తులకు ఫలము నొసగుననియు వాయ్వాదులు పరమేశ్వరాత్మకులగుటచే ఫలహేతువు లగుచుందురనియు "వాయవ్యం శ్వేత మాలభేత భూతికామః" "స ఏవైనం భూతిం గమయతి" ఇత్యాది వాక్యములయందు సముచితార్థమును గాననగును.

ఒకవేళ పరమేశ్వరుఁడు ఫలప్రదాతగా లేకుండినచో కర్మ-క్షణికమగుటఁ జేసి ఫలసాధనముగా నేర్పడుటకు నపూర్వమును కల్పింపవలసి యుండును

"యో వై రుద్రః స భగవాన్" ఇత్యాది వాక్యములతో పరమేశ్వరుఁడు వాయువు మొదలగు దేవతలందరి స్వరూపము గలవాడని తెలుపఁబడుచున్నయది. మఱియు ఆ అధర్వశిరమునందే "యో మాం వేద, స సర్వాన్ దేవాన్ వేద" అనుచో తనను తెలిసికొనుట వలన తానంతర్యామిగా కలిగిన దేవతల నందదిని గుర్తెరిగినవాడగునని పరమేశ్వరుఁడు నిర్వచించెను.

కావున సకలదేవతాస్వరూపుడును సర్వకర్మారాధ్యుఁడును సర్వఫలదాతయు పరమేశ్వరుఁడును పరబ్రహ్మంబును సాక్షా దుమాపతియగు శివుఁడే నని విశదమైనది.

ఇయ్యది
శ్రీ నీలకంఠ శివాచార్యవిరచితంబైన
బ్రహ్మమీమాంసా సూత్రభాష్యమునందు
మూడవ యధ్యాయముఁదగు రెండవ పాదము
శ్రీకంఠమణిప్రభామయూఖంబను శాంకరీయ ఆంధ్రానువాదముతో ముగిసినది.

---

# శ్రీ శివమహాస్తోత్రము

ఇది- శ్రీ శివమహా పురాణములోనిది, ఇందు బ్రహ్మ విష్ణు రుద్రకుమార గణపత్యాది దేవతలు, పార్వతీదేవి మొదలగు దేవీమూర్తులు, ఆ యా ఆవరణములయందు పరిచారకులుగ నిరూపింపఁబడినవారై శివాజ్ఞ ననుసరించియే భక్తులకు అభీష్టముల నొసఁగుదురని వ్రాయఁబడినది.

దీనిని - నెలరోజులు - ఆకసము వంక చూచుచు నిలువఁబడి భక్తితో పవిత్రతతోడను పఠించువారికి - కోరికలు సిద్ధించును. శివుఁడు ప్రసన్నుఁడగును. తెలుగర్థముతో సంస్కృత శ్లోకములు అనువదింపఁబడినవి. ఇది - సులభముగ బోధపడు గ్రంథము; శివభక్తి గలిగి బ్రహ్మవిష్ణ్వాదులను గూడ ప్రార్థింపవలెనని దీనిని చదివినవారికి విదితమగును.

అనువాదము, సంకలనము, ప్రకాశనము
**ఆచార్య శివశ్రీ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు**

వెల రూ. 5—00
ప్రాప్తిస్థానము- శివాద్వైత విజ్ఞాన సదనము,
184/ఎ, వెస్ట్ మారేడుపల్లి,
సికిందరాబాద్-500026, (ఆం.ప్ర.)
షరా- ఎక్కువ ప్రతులు వలయుచో రేటు తగ్గింపఁబడును. నేడే కార్డువ్రాయుడు!

శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య కృత శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

## తృతీయాధ్యాయము

## తృతీయపాదము

### ఆంధ్రీకరణము

# సర్వవేదాంత ప్రత్యయాధికరణము

పూర్వభాష్యము నందు త్వం పదార్థమగు జీవుఁడు - ఉపాసకుఁడనియు నిత్యత్వ జ్ఞాతృత్వాది గుణములు కలవాడనియు; తత్పదార్థమగు శివుఁడు- సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్త్వ నిరతిశయదయాశాలిత్వ మహావదాన్యత్వాది కల్యాణ గుణములు గలవాడనియు ఉపాస్యుఁడనియు పది పాదములలో బాగుగా నిరూపింపఁబడినది. ఇక నట్టి శివుని ఆరాధించుట ఎట్లు అను అకాంక్ష కలుగుట సహజము కావున నీ పాదమునందు శివోపాసనము ప్రతిపాదింపఁబడుచున్నయది.

సూ. "సర్వ వేదాంత ప్రత్యయం చోదనాద్యవిశేషాత్''

3-3-1

వేదాంతము లన్నిటియందు దహరోపాసనము మొదలగునది వినంబడుచున్నయది. అట్టి యుపాసనము ఒక్కటియా ? లేక శాఖాభేదము మున్నగువాని వలన వేరగునా ? అని సందేహము.

ప్రశ్న : శాఖాభేదమున ప్రకరణము గూడ భిన్నమగును కావున ప్రతి శాఖయందు బ్రహ్మోపాసనము వేరగుననియే చెప్పవలసి యుండును. ఎట్లనఁగా? ఛాందోగ్యమునందు "య ఆత్మాఽపహతపాప్మా విజరో విమృత్యుః" అను

వాక్యము మొదలుకొని అపహతపాప్మత్వాది గుణములు పేర్కొనఁబడినవి. తైత్తిరీయకమునందైతేనో ''ఋతం సత్యం" ఇత్యాదిని కృష్ణపింగళత్వాది గుణములు నిర్దేశింపఁబడినవి. ఇట గుణభేదముండుటఁజేసి యుపాసనంబు భిన్నంబగునని తేటపడుచున్నయది. మఱియు ఛాందోగ్యమునందు పంచాగ్ని విద్యఁదగు సందర్భము కౌథుమమనియు, బృహదారణ్యకమున వాజసనేయ మనియు నామభేద ముండుటవలన నుపాసనంబును భిన్నంబగునది. ముండకశాఖయందు "తేషా మేవైతాం బ్రహ్మవిద్యాం వదేత, శిరోవ్రతం విధివద్యైస్తు చీర్ణమ్" అనుచో శిరోవ్రత మనఁబడు ధర్మము వినంబడుచున్నయది.

శిరోవ్రతమనఁగా ? అధర్వణికుల నుద్దేశించి మాత్రము చెప్పఁబడిన ఒకానొక వేదవ్రత మనఁబఱగునది.

ఇక ధర్మభేదముండుటఁజేసి ఉపాసనము భిన్నంబగుచున్నయది. ఇందువలన శాఖాదిభేదము కారణముగా ఉపాసనాభేదము ననివార్యముగ నంగీకరింపవలెను కాదా ?

ఉత్తరము : సర్వవేదాంత ప్రత్యయం అనఁగా వేదాంతములన్నిటియందు ప్రతీయమానంబగు శివోపాసనము - చోదన మొదలగువానియందు విశేషము లేమింజేసి యొక్కటియే యగునది. "విద్యాత్" "ఉపాసీత" అను చోదన (ప్రేరణము) శాఖాభేదమునందును సమానమైనదియేను: బ్రహ్మప్రాప్తి రూపమైన ఫలసంయోగంబు నేకవిధంబేను; వైశ్వానరాదిరూపమగు బ్రహ్మము వేద్యము (తెలియఁదగినది) అను నంశంబొక్కటేను; వైశ్వానరవిద్య ఇత్యాది సమాఖ్యయు నేకవిధంబగునదియేను; కావున శివోపాసనము భిన్నమగునది కాజాలదు. మఱియు విద్యాదిభేదమున్నను ఉపాసనము వేరు కాదు. ఎట్లనఁగా ? "తస్మిన్ యదంత స్తదన్వేష్టవ్యం" ఇట్లు చాందోగ్యమునందు దహరవిద్య విధింపఁబడినది. "తస్మిన్ యదంతస్త దుపాసితవ్యమ్" ఇట్లు తైత్తిరీయకమున గలదు. ఈ రెండు శ్రుతుల యందు స్థానాదిభేదమును చెప్పనందువలన నుపాస్యంబగు బ్రహ్మము వేరు కానందునను రెంటియందలి ధర్మములు విరుద్ధములు గాకుండుటను బ్రహ్మవిద్య యేకవిధంబే నగుచున్నయది.

ఆకాశ పర్జన్య పృథివీ పురుష స్త్రీ సమాఖ్యతో చెప్పఁబడు అగ్నిపంచ

కము వేద్యముగా నిరూపింపఁబడిన స్వరూపము - ఛాందోగ్య బృహదారణ్యకముల రెంటియందును సమానంబైనది కావున విద్యాభేదము నంగీకరింప వలనుపడదు.

సూ. "భేదా న్నేతి చే న్నైకస్యా మపి" 3-3-2

చోదన మున్నగువానిఁ జెప్పుటయందు విశేషము (భేదము) లేకున్న నవ్వానిని తెలుపు ప్రకరణములు భిన్నములగుటచే నుపాసనంబు వేరగునని యెంచుట పాడికాదు. బ్రహ్మవిద్య (శివోపాసనము) ఒక్కటేయైనను వేదశాఖలు అనేకములగుటఁజేసి యొక్కొక్క శాఖయందు ఆ యా శాఖవారు స్వశాఖామాత్ర మైన నధ్యయనము చేయవలెనను ప్రతిపత్తృభేనమును పాటించి ప్రకరణాది భేదమును సమర్థించుకొనవలెను కాని ప్రకరణాదిభేదము వలన విద్యాభేదమని చెప్పుట సమంజసము కాజాలదు.

సూ. "స్వాధ్యాయస్య తథాత్వేన హి సమాచారేఽ
ధికారాచ్చ సవవచ్చ తన్నియమః" 3-3-3

"తేషా మేవైతాం బ్రహ్మవిద్యాం వదేత"అని యథర్వవేదమునందు చెప్పఁ బడిన శిరోవ్రతము నాచరించు నియమము వేదాధ్యయనమునకు సంగమగును. కాని బ్రహ్మోపాసనమునకు సంగము కాజాలదని "నైత దచీర్ణవ్రతోఽధీతే" అను వాక్యమునందు స్పష్టమగుచున్నయది. మఱియు "ఇదమపి వేదవ్రతేన వ్యాఖ్యాతమ్"అని సమాచారగ్రంథమునందు శిరోవ్రతము వేదాధ్యయన సంబంధము గలదిగా పేర్కొనఁబడినది. అథర్వవాక్యమునందలి "బ్రహ్మవిద్యాం" అనుచో బ్రహ్మ శబ్దమునకు వేద మను నర్థముఁజేయవలెను.

ఆథర్వణికులకు సప్తసూర్యాఖ్యహవనము మొదలుకొని శతౌదనాఖ్య హవనమువరకు గల సవహోమగణము తదీయ ఏకాగ్ని సంబంధమువలన విహితంబగునట్లు శిరోవ్రతంబును సాధ్యాయాంగమగునది కావున నియ్యది విద్యా భేదము నాపాదించునది కాజాలదు. ఇంతవరకు సూత్రకారుని నిర్వచనము ననుస రించి శిరోవ్రత స్వరూపమును నిరూపించితిమి కాని వస్తుతః సూత్రకారాశయా విరుద్ధముగా శిరోవ్రతమన నెట్టిదో విచారింపఁబడుచున్నయది.

సూత్రగతమగు "తన్నియమః" అను పదమునకు "తస్యవ్రతస్య నియమః అని నిర్వచనము.

శిరోవ్రతమనఁగా శాంభవ పాశుపతాది సంజ్ఞలు కలదై బ్రహ్మవిద్యాధికారము నొసగునది యని వేదాంతవాక్యము లెన్నియో నిరూపించుచున్నవి. కావున శివోపాసనాంగముగా శిరోవ్రతము ననఁగా పాశుపతవ్రతమును తప్పనిసరిగా ఆచరింపవలెనని గ్రహింపనగును.

ఎట్లనఁగా ? సౌరసంహితయందు

శ్లో॥ బ్రహ్మవిద్యోపదేశస్య - యోగ్యం వక్ష్యామి సువ్రతే"

"బ్రహ్మవిద్యోపదేశమునకు నర్హతగలవానిని గురించి చెప్పుదునని ప్రారంభించి

శ్లో॥ విధివచ్ఛ్రద్ధయా సార్థం - న చీర్ణం యైః శిరోవ్రతం।
బ్రహ్మవిద్యా మిమాం తేషాం - న వదేత కదాచన ॥

ఇదం శిరోవ్రతం చీర్ణం - విధివచ్ఛ్రద్ధయా యదిః।
తేషామేవ పరాం విద్యాం - వదే దజ్ఞానబాధికామ్॥

శిరోవ్రత మిదం నామ - శిరస్యాధర్వణశ్రుతేః।
యదుక్తం తద్ధి నైవాన్యత్ - తత్పాశుపత సంజ్ఞకమ్॥

శాఖాభేదేషు నామాని - వ్రతస్యాస్య విభేదతః।
పఠ్యంతే మునిశార్దూల - శాఖాస్వేకం వ్రతం హి తత్॥

అగ్ని రిత్యాదిభి ర్మంత్రైః - షడ్భిః శుద్దేన భస్మనా
సర్వాంగోద్ధూళనం కుర్యా - చ్ఛిరోవ్రత సమాహ్వయమ్॥

"శిరోవ్రతమును ఆసక్తితో నాచరింపనివారికి బ్రహ్మవిద్య నుపదేశింపఁగూడదు. విధియుక్తముగా నీవ్రతము నాచరించువారికి మాత్రము సంసార సంబంధమైన అజ్ఞానమును తొలగించు పరావిద్య (శివజ్ఞానము) నుపదేశింపవలెను. శిరోవ్రతమనఁగా ? అధర్వశిరమునందు వేదాధ్యయనాంగముగ చెప్పఁబడినది గాక పాశుపతమను సంజ్ఞ గలది యగును. ఇద్దాని నామధేయములు భిన్నములుగా అనేకవేదశాఖలయందు చెప్పఁబడినను సమస్త శాఖలయందు నొకే వ్రతంబని తెలియవలెను. "అగ్నిరితి భస్మ" ఇత్యాది షణ్మంత్రముల గో

ఘృతంబుతో హవనము చేయఁబడిన విభూతిని తీసికొని శరీరమంతట నుద్ధూళనమును గావించుకొనుటయు శిరోవ్రతమనఁబడును.

బ్రహ్మోత్తర ఖండము నందు

శ్లో॥ అయ మత్యాశ్రమో ధర్మో - యైః సమాచరితో ముదా,
ప్రాప్తం తైః పరమం జ్ఞానం - సంసారచ్ఛేదకారణమ్।
ఉద్ధూళనం త్రిపుండ్రం చ - ముముక్షుః సమ్యగాచరేత్॥

"అత్యాశ్రమ మనఁబడు పాశుపతవ్రతము నుత్సాహముతో ననుష్ఠించువారు సంసారచ్ఛేదకారణమగు శివజ్ఞానమును పొందిరి కావున మోక్షమును కోరువాడు శుద్ధమైన భస్మను మేనునిండ పూసుకొని అట్టి విభూతిని తడిపి యద్దానిని నొసలు మున్నగుచోట్ల మూడురేఖలుగా ధరింపవలెను."

శ్వేతాశ్వతరోపనిషత్తునందు

"తపః ప్రభావా ద్దేవప్రసాదాచ్చ బ్రహ్మవి చ్ఛ్వేతాశ్వతరోఽథ విద్వాన్, అత్యాశ్రమిభ్యః పరమం ప్రోవాచ సమ్య గృషిసంఘజుష్టమ్"

"బ్రహ్మోపాసకుడైన శ్వేతాశ్వతర మహర్షి - స్వకీయతపః ప్రభావము వల్లను పరమేశ్వరుని యనుగ్రహముఁబట్టియు అత్యాశ్రములనఁబడు శైవులకు ఋషులందరిచే స్వీకరింపఁబడిన శ్రేష్ఠమైన శివజ్ఞానము నుపదేశించె"నని కలదు. మఱియు నత్యాశ్రములకు శివజ్ఞానమును ప్రసాదించిన శ్వేతాశ్వతరుండును పాశుపతవ్రతనిష్ఠుండని దిగువప్రమాణము చాటుచున్నయది.

కూర్మపురాణమునందు

శ్లో॥ అథాస్మి న్నంతరేఽపశ్య - త్సమాయాంతం మహామునిమ్,
శ్వేతాశ్వతరనామానం - మహాపాశుపతోత్తమమ్॥

"అటు తరువాత నింతలోనే వచ్చుచున్న శ్వేతాశ్వతరుఁడను మహామునిని పాశుపతవ్రతశ్రేష్ఠులలో నుత్తమునిగా నవలోకించిరి" ఇవ్విధముననే "అత్యాశ్రమస్థః సకలేంద్రియాణి - నిరుధ్య భక్త్యా స్వగురుం ప్రణమ్య" "దహరోపాసనఁ జేయువాడు మొదట అత్యాశ్రమ (పాశుపత) వ్రతనిష్ఠుడై ఇంద్రియముల నన్నిటిని

వశపఱచుకొని తన ఆచార్యుని భక్తితో నమస్కరింపవలెను." కైవల్యమునందు దహరవిద్యాఽనుష్ఠానమునకు పాశుపతవ్రతము ప్రధానాంగమని నిరూపింపఁబడినది.

సూ. "దర్శయతి చ" 3-3-4

మహోపనిషత్తునందు కైవల్యోపనిషత్తునందును దహరవిద్య ఒక్కటే యని శ్రుతియే చూపెట్టుచున్నయది.

"ఋతం సత్యం పరంబ్రహ్మ - పురుషం కృష్ణపింగళమ్,
ఊర్ధ్వరేతం విరూపాక్షమ్" మహోపనిషత్తు.

"ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం - త్రిలోచనం నీలకంఠం
ప్రశాంతమ్" కైవల్యోపనిషత్తు.

ఇత్యాది వాక్యముల నుద్ఘాటింపఁబడిన పరమేశ్వరుని రూపవత్త్వమును పురస్కరించుకొని కలుగు పాప జరా మరణాదులు సంభవించు నను ఆశంకను తొలగించుటకై ''అథ యదిద మస్మిన్'' మొదలుకొని ఛాందోగ్యము సర్వజ్ఞత్వాది గుణములు కలవాడు పరమేశ్వరుఁడు కావున పాపజరామరణాదులు లేనివాడని బాగుగా ప్రతిపాదించినది.

ఇది యిట్లుండగా "శ్రుతులయందు కొన్నిచోట్ల ధర్మ విశేషములను ప్రతిపాదించుటఁజేసి విద్యాభేదంబగు"నను ఆశంకకు నవకాశము సుతరాము లేదని యీ సందర్భమున గమనింపనగును. అందువలన చోదనాదులయందు విశేషము లేమింజేసియు పూర్వతంత్రమునందు శబ్దాంతరాభ్యాస సంఖ్యా గుణ ప్రక్రియా నామధేయములు కర్మభేదమునకు ప్రమాణంబులగునని చెప్పఁబడినట్లు నిట నట్టివి కనఁబడుట లేనందునను సకలవేదాంతములయందు ప్రతీయమానంబగు శివోపాసనం బొక్కటియే యని సిద్ధాంతము.

## ఉపసంహారాధికరణము

వేదాంతములన్నిటియందు చెప్పఁబడిన విద్య (ఉపాసన)లు ఒక్కటియే యని ప్రతిపాదించుటకు వలయు ప్రయోజనమును చెప్పుచున్నవారు.

సూ. "ఉపసంహారోఽర్థాభేదా ద్విధిశేష
వ త్సమానే చ" 3-3-5

ఈ సందర్భమున విద్యైక్యమును చెప్పుట పొసగినను ఒకానొక శాఖయందు చెప్పఁబడిన గుణములను మరియొకశాఖయందు నుపసంహరించుట (స్వీకరించుట) యుక్తమగునా ? కాదా ? అని సందేహము.

ప్రశ్న : ఒక శాఖలోని గుణములను మరియొక శాఖయందు నుపసంహరింపఁగూడదు. ఎట్లనఁగా ? ఛాందోగ్యమునందు దహరవిద్యలో అపహతపాప్మత్వాది గుణములు చెప్పఁబడినవి. కాని తైత్తిరీయమునందు వక్కాణింపఁబడనందున నవ్వానిని తైత్తిరీయమున తీసికొనగూడదు. ఎందుకనఁగా ? శివోపాసనకు వలయు నుపకారము తైత్తిరీయమునందుగల కృష్ణపింగళత్వాది గుణములతో నేర్పడుచుండగా నపహత పాప్మత్వాది గుణములను గ్రహించుట యనవసరము కాదా ?

ఉత్తరము : వేదాంతములన్నిటియందు గల శివోపాసన మొక్కటియే యని యంగీకరించినపుడు - ఛాందోగ్యము మున్నగువానియందు చెప్పఁబడిన దహరోపాసన మొదలగువాని ధర్మములగు అపహత పాప్మత్వాదులను తైత్తిరీయకమున గల దహరోపాసన మొదలగువానియందు పరిగ్రహించుట యుక్తంబే యగుచున్నయది. ఎందుకనఁగా ? విద్యోపకారమనెడు ప్రయోజన మొక్కటియే గదా ! ఏకవిధిశేషములుగా చెప్పఁబడిన అంగములను అగ్నిహోత్రాదులయందు పరిగ్రహించినట్లు చోదన మున్నగువానిఁబట్టి దహరాద్యుపాసనము సమానమగుచుండగా ఉపాసనానుకూల గుణములన్నియు ప్రాప్తించును కావున గుణోపసంహారము సమంజసంబే యని సిద్ధాంతము.

## అన్యథాత్వాధికరణము

పూర్వపక్షసూత్రము.

సూ. "అన్యథాత్వం శబ్దాదితి చే న్నావిశేషాత్" 3-3-6

శ్రుతిప్రమాణముఁబట్టి ఉద్గీథోపాసనము భిన్నంబగునని చెప్పఁగూడదు.

శ్రుతులయందు ఉపక్రమభేదము లేమింజేసి యుద్గీథముఁదగు నుపాసన మొక్కటియే కాదగునని పూర్వపక్షసూత్రభాష్యసారాంశము.

సిద్ధాంతసూత్రములు.

సూ. "న వా, ప్రకరణభేదా త్పరోవరీయస్త్వాదివత్" 3-3-7

పై విధము చెప్పుట యుక్తము కాదు. ఎందుకనఁగా ? ప్రకరణము భిన్నంబగుచున్నయది.

"ఓ మిత్యేత దక్షర ముద్గీథ ముపాసీత" అనుచో సామవేదీయులు ఉద్గీథమునకు నవయవముగా నుండు ప్రణవము నుపాసింపవలెనని నిర్వచించిరి. బృహదారణ్యకమునందైతేనో ఉద్గీథమును సమగ్రముగా నుపాసింపవలెనని చెప్పఁబడినది. పరోవరీయస్త్వాది గుణవిశేషములను భావించుటవలన నేర్పడు రూపభేదము వలె నిట ప్రకరణ భేదముండుటఁజేసి యుపాసనము భిన్నంబగునని సిద్ధాంతము.

దిగువ సూత్రమున మరియొక నాశంకకు సమాధానముఁ జెప్పుచున్నవారు.

సూ. "సంజ్ఞాతశ్చేత్ తదుక్త మస్తి తు తదపి" 3-3-8

ఉద్గీథవిద్యయవి రెండుచోట్లను సంజ్ఞ యొకటే యగుట వలన విద్యాభేదంబు కాదని చెప్పఁగూడదు. ఇద్దానికి సమాధానము పూర్వసూత్రమునందే చెప్పఁబడినది. అదియునుగాక నిత్యాగ్నిహోత్రమునందు అగ్నిహోత్ర విశేషమునందును నామధేయ మొక్కటియైనను కర్మభేదము వలె నీ సందర్భమునఁగూడ విద్యాభేదము తప్పనిసరి యగుచున్నయది.

## వ్యాప్త్యధికరణము

సూ. "వ్యాప్తేశ్చ సమంజసమ్" 3-3-9

శ్రుతులయందు ప్రణవముఁదగు వ్యాప్తి యుండుటఁజేసి ఉద్గీథోపాసనమనఁగా ప్రణవోపాసనమని చెప్పుటయే సమంజసంబగునని సారాంశము.

## సర్వాభేదాధికరణము

"సర్వాభేదా దన్యత్రేమే" 3-3-10

ప్రాణవాయువునకు చెప్పఁబడిన వసిష్ఠత్వాదిగుణములు కౌషీతకి శాఖ మున్నగు వానియందును తీసికొనఁదగినవి ఎందుకనఁగా ? శాఖలన్నిటి యందును ప్రాణవిద్య భిన్నంబు కాజాలదని సూత్రభాష్యసారాంశము.

## ఆనందాద్యధికరణము

సూ. "ఆనందాదయః ప్రధానస్య" 3-3-11

"అభేదాత్"అను పదము సూత్రమునందు స్వీకరింపఁదగినది.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" "ఆనందో బ్రహ్మ" "ఋతం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగళమ్" "ఆకాశశరీరం బ్రహ్మ సత్యాత్మ ప్రాణా రామం మన ఆనందం శాంతిసమృద్ధ మమృతమ్" ఇత్యాది వాక్యములయందలి ఆనందాది గుణములు బ్రహ్మమునకు సంబంధించినవని పరవిద్యలయందు వినంబడుచున్నయది. ఇట్టి గుణములు పరవిద్యలన్నిటియందు నుపసంహ రింపఁదగినవి యగునా కాదా ? అని సందేహము.

ప్రశ్న : పరవిద్యలయందు చెప్పఁబడిన ఆనందాది గుణములు ఉపాసన లన్నిటియందు నుపసంహరింపఁదగినవి కావు. ఎందుకనఁగా ? ఒకే బ్రహ్మము ఆనందాద్యనేక గుణములతో కూడియుండుట పొసగదు కావున ఒక్కొక్క గుణముతో కూడియుండునని చెప్పునెడ ననేక బ్రహ్మములు ఉండవలసివచ్చును. అందువలన ఆ యా విద్యలయందు గల గుణములను మాత్రము పరిగ్రహించి బ్రహ్మము నుపాసింపవచ్చును కాదా ?

ఉత్తరము : గుణియగు బ్రహ్మమొక్కటే కావున పరవిద్య లన్నిటి యందును ఆనందాదిగుణముల నన్నిటిని పరిగ్రహించుట సమంజసంబే యగునది.

"నీలో ధవళో రక్తః ఖండః పూర్ణశృంగః" అనుచో ఒకదానికి మరియొకటి విరుద్ధమగుటఁజేసి "నలుపైనది తెలుపైనది కాదు" అను రీతిగా నైల్యాదిధర్మములు

ఒకే వస్తువునందు సంస్థితములు కానివగుటచే ధర్మిభేదము పాటింపఁ దగినది కాని "నీలం సుగంధి మహదుత్పలమ్" అనుచో నలుపు, పరిమళము, గొప్పదనము అనుధర్మములు ఒకే కలువయందు నెలకొనియుండునవగుటచే ధర్మిని అనఁగా నైల్యాదిధర్మములుగల కలువనే నిరూపించునవగుచున్నవి.

ఇందువలన తేటపడుచున్నదేమనఁగా ? బ్రహ్మమునకు గల ఆనందాది గుణములు పరస్పరవిరుద్ధములు కానివగుటచే బ్రహ్మానేకత్వము నాపాదించునవి కావు మరియు గుణియగు బ్రహ్మము విద్యలన్నిటియందు నొక్కటియే యగుటఁజేసి ఆనందాది గుణములన్నియు సమస్తోపాసనలయందు స్వీకరింపఁ దగినవియే యని సారాంశము

## ప్రియశిరస్త్వాధికరణము

సూ. "ప్రియశిరస్త్వాద్యప్రాప్తి రుపచయాపచయౌ హి భేదే" 3-3-12

"తస్య ప్రియ మేవ శిరః" ఇత్యాదిశ్రుతి వాక్యములయందు ప్రియశిరస్త్వాదులు బ్రహ్మధర్మములుగా వినఁబడుచున్నవి. ఇవియు ఆనందాదులవలె పరవిద్యల యందు గ్రహింపఁదగినవి యగునా ? కాదా ? అని సందేహము.

ప్రశ్న : సత్యసంకల్పత్వాది గుణముల వలె ప్రియ శిరస్త్వాదిధర్మములను బ్రహ్మోపాసనములయందు పరిగ్రహించుటలో ఎట్టి విరోధంబును లేదు కదా ?

ఉత్తరము : సత్యసంకల్పత్వాదుల వలె ప్రియశిరస్త్వాదులు బ్రహ్మధర్మములు కాకుండుటచే పరవిద్యలయందు స్వీకరింపఁదగినవి కావు. ఒకవేళ నవ్వానిని తీసికొనునెడ బ్రహ్మము సావయవము కావలసివచ్చును. కావున బ్రహ్మస్వరూపమునకు స్థూలత్వకృశత్వములు (హెచ్చు తగ్గులు) సంభవించును. మరియు బ్రహ్మమునకు ప్రియశిరస్త్వాదులు సహజములగునెడ ఆనందమయుని కంటె బ్రహ్మము భిన్నంబు కావలసివచ్చును. అందువలన ప్రియశిరస్త్వాదులు ఉపసంహరింపఁదగినవి కాజాలవని తెలియునది.

ఆనందాదుల వలె సర్వజ్ఞత్వాది ధర్మములు బ్రహ్మస్వరూపములో చేరిన

గుణములగుటచే ఎట్టి విరోధంబును లేదని దిగువ సూత్రముతో వక్కాణించుచున్న వారు.

సూ. "ఇతరే త్వర్థసామాన్యాత్" 3–3–13

సర్వజ్ఞత్వము నిత్యతృప్తత్వము మున్నగునవి బ్రహ్మస్వరూపములో నంతర్గతములగుటచే పరవిద్యలన్నిటియందు నుపసంహరింపఁదగినవియేను: ఎందుకనఁగా? సర్వజ్ఞత్వాదులు ఎప్పుడు నెడబాయనట్టి బహ్మస్వరూపధర్మములగుట యనఁబడు సాదృశ్యము కలిగియున్నది.

ప్రియశిరస్త్వాదులైతేనో బ్రహ్మధర్మములలో చేరనివగుటంజేసి యవ్వానిని బ్రహ్మోపాసనములయందు పరిగ్రహింపఁగూడదు.

ఆధ్యానాధికరణము

సూ. "అధ్యానాయ ప్రయోజనాభావాత్" 3-3-14

ఈ సందర్భమున పూర్వోక్తమైన ఆనందమయాత్మానుసంధానము వలె అన్నమయాదులను గూడ నుపాసించుట నియతమగునా? కాదా ? అని సందేహము కలుగుచున్నయది.

ప్రశ్న : ఆనందమయుఁడైన పరమాత్మ- అన్నమయము మొదలగు కోశములలోని వాడగుటచే అన్నమయాదులను భావింపనిది ఆనందమయు ననుసంధింపవలను పడదు కావున శివోపాసనయందు అన్నమయాదికోశములను భావించుట నియతము (తప్పనిసరి) కావలసివచ్చును కాదా?

ఉత్తరము : అన్నమయాదుల నుపాసించుట నియతము కాజాలదు. ఆనందమయు నుపాసించుటకు ప్రయోజనము బ్రహ్మప్రాప్తి కావున అన్నమయాదులను భావించుటకు అట్టి ప్రయోజన మిసుమంతయు గానరాదు. ఇందువలన ఆనందమయానుసంధానము సిద్ధించువరకే అన్నమయ మనోమయప్రాణమయ విజ్ఞానమయములు భావింపఁదగినవి కాని తదనంతరము సంభావ్యములు కాజాలవు కావున నన్నమయాద్యనుసంధానము అనియతంబే యని సారాంశము.

సూ. "ఆత్మశబ్దాచ్చ" 3-3-15

"ఏత మన్నమయ మాత్మాన ముపసంక్రమ్య" ఇత్యాది వాక్యముల యందు ప్రత్యేకముగా నుపయోగింపఁబడిన ఆత్మశబ్దము- అన్నమయాదికోశము లలో అన్నాదుల నధిష్ఠించు చేతనుని తెలుపును. ధ్యానమునకు ముందు శివుడు బ్రహ్మవిష్ణ్వాదులకంటె నతీతుఁడను భావము దృఢపడుటకై అన్నమయాదులను తదధిష్ఠాతలైన చేతనులను భావించుట యవసరము. "శివ ఏకో ధ్యేయః శివంకరః సర్వ మన్యత్ పరిత్యజ్య" అను అథర్వశిఖావచనము- ముముక్షువులు శివేతర దేవతలను ధ్యానించుటను నిషేధించుచున్నందున ధ్యానకాలమునందు ఆనంద మయుడైన శివునొకనినే భావింపవలెనని విశదమగుచున్నది. కావున అన్నమయా ద్యనుసంధానము నియతము కాజాలదని సిద్ధాంతము.

సూ. "ఆత్మగృహీతి రితరవ దుత్తరాత్" 3-3-16

"అన్యోఽంతర ఆత్మాఽఽనందమయః" అనుచో గ్రహింపఁబడిన ఆత్మ శబ్దము- "ఆత్మన ఆకాశః సంభూతః" అనుచో గల ఆత్మశబ్దమువలె పరమాత్మను చెప్పును కాని ప్రత్యగాత్మను (జీవుని) చెప్పుటలేదు.

ఈ యంశము "ఆనందమయ మాత్మాన ముపసంక్రమ్య" "ఆనందమయు డైన పరమాత్మనాశ్రయించి ముక్తుఁడగును" అను తర్వాతి సందర్భమును బట్టి ధృవపడుచున్నయది.

కావున ఆనందమయాత్మానుసంధానమే బ్రహ్మానుసంధానంబగుటచే ముఖ్యంబైనదని సారాంశము.

సూ. "అన్వయా దితి చేత్ స్యా దవధారణాత్" 3-3-17

ప్రశ్న : అన్నమయాదులకును ఆత్మశబ్దముతో సంబంధము కలదు గావున నవ్వానిని గూడ నుపాసించుట యుక్తంబని తోచెడిని!

ఉత్తరము : అన్యోఽంతర ఆత్మాఽఽనందమయః" అనుచో ఆనంద మయుఁడైన పరమాత్మయగు శివుఁడు- అన్నమయాదులకన్న భిన్నుఁడగుననియు "శివ ఏకోధ్యేయః శివంకరః సర్వమన్యత్ పరిత్యజ్య" అనుచో శివేతరులైన సమస్త దేవతలను విడనాడి శివునొకనినే ధ్యానింపవలెననియు విశదమగుచున్నయది. పరబ్రహ్మ- సమస్తకళంకములు బొత్తుగా లేనిదియు సకలమంగళగుణములు

కలదియు నగుటచే శివశబ్దముతో చెప్పఁబడుసది. మఱియు విరూపాక్షము కృష్ణ పింగళంబు నగు శివుని నిరంతరము ధ్యానించుటఁజేసి శివసారూప్యము యనఁ బడు ముక్తి లభించునది. కావున నుపాసన ననుసరించి ఫలము చేకూరుననియు శివత్వము లేనట్టి శివేతరదేవతల నుపాసించుట శివత్వమును అనగా ముక్తిని ప్రసాదించునది కాదనియు ఆనందమయుండైన శివుఁడొకఁడే భావింపఁదగినవాడనియు గ్రహింపవలెను.

## కార్యాఖ్యానాధికరణము

సూ. "కార్యాఖ్యానా దపూర్వమ్" 3-3-18

కాణ్వ మాధ్యందిన శాఖలయందు అపూర్వంబగు ప్రాణవాసస్త్వమే విధింపఁ బడుచున్నది. ఆచమనము స్మృతిప్రాప్తమగుటచే విధింపఁబడుట లేదు కావున ఉదకములు ప్రాణజీవనములని భావించుట సమంజసంబగునని సూత్రభాష్య సారాంశము.

## సమానాధికరణము

సూ. "సమాన ఏవం చాభేదాత్" 3-3-19

శాండిల్యవిద్య - అగ్నిరహస్యమునందు బృహదారణ్యకమునందును వినంబడుచున్నయది. రెంటియందును మనోమయత్వాదిధర్మములు సమానము లగుచుండగా ఆకాశమువలె స్వచ్ఛత కలిగియుండునని ప్రశంసించుట పొసగును కావున వశిత్వము మున్నగు లక్షణములు సత్యసంకల్పత్వమునకు విశేషరూపము లగుటచేత నుభయత్ర చెప్పఁబడిన శాండిల్యవిద్య యొక్కటియే యని సారాంశము.

## సంబంధాధికరణము

సూ. "సంబంధా దేవ మన్యత్రాపి" 3-3-20

పూర్వపక్షసూత్రము

శాండిల్యవిద్యయందు ఏకవిద్యాసంబంధము వలన పరస్పరము గుణముల నుపసంహరించుట న్యాయమైనట్లు సత్యవిద్యయందు "అహః" "అహమ్" అను రహస్యనామధేయములు రెండును ఆదిత్యమండలమున దక్షిణనేత్రమునను భావింపఁదగినవి కాదా?

సిద్ధాంతసూత్రము

సూ. "న వా విశేషాత్'' 3-3-21

ఈ సందర్భమున విద్య యొక్కటి కాజాలదు. సూర్యుఁడు, కన్ను, అను స్థానభేదమునఁజేసి ఉపాస్యము భిన్నంబగునది. కావున రహస్యనామదేయములు ఆ యా స్థానమునందు నియతముగా భావింపదగినవియే యని తెలియునది.

## మండలవిద్యాఽధికరణము

సూ. "దర్శయతి చ"" 3-3-22

ఛాందోగ్యమునందు తైత్తిరీయమునందును చెప్పబఁడిన మండలవిద్య ఒక్కటియా? భిన్నమా? అని సంశయము.

ప్రశ్న : ఒకచో "య ఏషోఽంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే, హిరణ్యశ్మశ్రు ర్హిరణ్యకేశ ఆప్రణఖా త్సర్వఏవ సువర్ణః" "సూర్యునిలో నుపాసింపఁబడు పురుషుఁడు (పరమాత్మ) బంగారువన్నె బంగారువెంట్రుకలు గోరు మొదలుకొని శరీరమంతయు సువర్ణమయముగా కలిగియుండువాడు" అనియు మరియొకచో "య ఏషోఽంతరాదిత్యే హిరణ్మయః పురుషః" "మండలాంతర్వర్తి యగు సూర్యునిలో పురుషుఁడు సువర్ణమయుఁడు" అనియు చెప్పి ఉపసంహారము నందు "సర్వోవై రుద్రః"అని ప్రారంభించి "నమో హిరణ్యబాహవే హిరణ్యవర్ణాయ హిరణ్యరూపాయ హిరణ్యపతయేఽంబికాపతయ ఉమాపతయే పశుపతయే నమో నమః" అను వాక్యము వరకు పరమేశ్వరుఁడు సర్వాంతర్యామియనియు హిరణ్యబాహువనియు ఉమాపతియనియు చెప్పబడినది. ఐతే ఒకచో సర్వాంగసువర్ణత్వము మరియొకచో బాహుమాత్ర సువర్ణత్వంబు నున్నందున రూపభేదము;

"సర్వోవై రుద్రః" అనుచో సర్వాత్మకత్వంబు ''సర్వేషాం లోకానామీష్టే" అనుచో సర్వాధిపత్యంబు నున్నందున ధర్మభేదము కనఁబడుటచే మండలవిద్య యొక్కటి కాజాలదు గదా?

ఉత్తరము : మండలవిద్య యొక్కటేను; ఉభయత్ర ''అంతరాదిత్యే" అను స్థానైక్యమే విద్యైక్యమును చూపెట్టునది. "హిరణ్మయః పురుషః" అని తైత్తిరీయమునందు గల యుపక్రమమున బాహ్యగ్రహణము శరీరము మొత్తమునకు నుపలక్షణమగుటచే ఉపసంహారమునందును సర్వాంగసువర్ణత్వము వివక్షితంబైన దనియే గ్రహింపవలెను. భగవానుఁడు సూక్ష్మమైన శరీరమునందు ప్రవేశించి నప్పుడు శరీరమయుఁడుగా నుండుట సమంజసంబగును. కావున రెండుచోట్లను ప్రతిపాద్యయొక్కటియే యగుటఁజేసి ఉభయస్థలములయందును ఉమాపతిత్వాది ధర్మములు స్వీకరింపఁదగినవియే యని సిద్ధాంతము.

## సంభృత్యధికరణము

సూ. ''సంభృతి ద్యువ్యాప్త్యపి చాతః'' 3-3-23

బ్రహ్మజ్యేష్ఠా వీర్యా సంభృతాని, బ్రహ్మాగ్రే జ్యేష్ఠం దివ మాతతాన, ఋతస్య బ్రహ్మ ప్రథమోత జజ్ఞే, తేనార్హతి బ్రహ్మణా స్పర్ధితుం కః?"

శ్రుత్యర్థము- లోకమున సంభవించిన త్రిపురదహనకాలకూటకబళనాది వృత్తాంతములు అనన్యసాధ్యములగుటచే శ్రేష్ఠములై పరమేశ్వరుని లీలారూపము లగు శ్రీకంఠమూర్త్యాదులచే గావింపఁబడినవి. అట్టి లోకోత్తరకార్యములను పరమేశ్వరుఁడే చేయఁగలుగును. కావుననే శివతత్త్వము హరిహరహిరణ్యగర్భాదుల కన్న మిన్నయైనదని గ్రహింపవలెను. మరియు హరిహరాదులకంటెఁ బూర్వమే సృష్టికిమున్ను పరమాకాశమును వ్యాపించియుండువాడు పరమేశ్వరుఁడే యగును. అందువలన పరమేశ్వరునితో సరిఁదూగుటకు నెట్టివాడును సమర్థుడు కాడని భావము.

ఐతే ఈ సందర్భమున త్రిపురదహనాది మహాకార్యముల సంపాదనము పరమాకాశవ్యాప్తియు పరవిద్యలన్నిటియందు నుపసంహరింపఁదగినవా? కావా? అని సంశయము.

ప్రశ్న : త్రిపురదహన పరమాకాశవ్యాప్త్యాదులు బ్రహ్మగుణములగుటచే పరవిద్యలన్నిటియందు నుపసంహరింపఁదగినవి గదా?

**ఉత్తరము** : పరమాకాశవ్యాప్త్యాదులు విద్యలన్నిటియందు స్వీకరింపఁదగినవి **కావు.** స్వల్పస్థానమునకన్న వేరైనచోటులందు పరిగ్రహింపఁదగినవి. "దేవాహ వై స్వర్గం లోక మగమం స్తే దేవా రుద్ర మపృచ్ఛన్, కో భవానితి" అనుచో నిరతిశయమైన సుఖమునకు అస్పదమైనదియు స్వర్గశబ్దవాచ్యంబు, చతుర్ముఖాదుల స్థానములకన్న నుత్కృష్టంబు నగు మహాస్థానము పరమేశ్వరునకు కలదని వినఁబడుటచే స్వల్పస్థానవ్యతిరిక్తములగు వైశ్వానరాద్యుపాసనలయందు మాత్రము ద్యువ్యాప్త్యాదిధర్మములు పరిగ్రహింపఁదగినవియని తేటపడుచున్నయది. అవ్వానితో కూడియుండుటఁజేసి త్రిపురదహనాది మహాకార్యకర్తృత్వంబును వైశ్వానరాదివిద్యలయందే భావింపఁదగినదవి సారాంశము.

## పురుషవిద్యాఽధికరణము

సూ. "పురుషవిద్యాయామపి చేతరేషా మనామ్నానాత్ 3-3-24

ఛాందోగ్యమునందు తైత్తిరీయకమునందును పురుషవిద్య వినఁబడుచున్నది ఐతే తైత్తిరీయమునందు చెప్పఁబడిన యజమానపత్న్యాదులు సవనత్రయాదులును ఛాందోద్యమునందు చెప్పఁబడనందున ఛాందోగ్యమునందు మరియొకరీతిగా చెప్పఁబడినందునను ఫలభేదము అవయవభేదంబు నుండుటచేతను రెంటియందు పురుషవిద్య భిన్నంబైనదియే యని సూత్రభాష్య సారాంశము.

## వేధాద్యధికరణము

సూ. "వేధాద్యర్థభేదాత్" 3-3-25

తైత్తిరీయుల ఉపనిషత్ప్రారంభమునందు గల "శం నో మిత్రః శం వరుణః" "సహ నా వవతు" అను మంత్రములు విద్యాంగములగునా కాదా ? అని సంశయము.

ప్రశ్న : విద్యాసన్నిధి నుండుటఁజేసి విద్యాంగములగునని చెప్పవలెను కాదా?

ఉత్తరము : అధర్వణికుల ఉపనిషత్ ప్రారంభమున గల వేధాదిమంత్రముల వలె వాజసనేయుల ఉపనిషదారంభమున గల మహావ్రతాదులవలె నీ మంత్రములు రెండును "ఋతం వదిష్యామి" "తేజస్వినా వధీత మస్తు" ఇత్యాది లింగముల వలన వేదాధ్యయనాంగములనియే భావింపవలెను కాని విద్యాంగములు కాజాలవు. శ్రుతిలింగవాక్యములకన్న సన్నిధి దుర్బలంబగును గదా! ప్రయోజనంబు భిన్నంబు నని గమనింపవలెను.

## హానోపాయనాధికరణము

సూ. హానౌ తూపాయన శబ్దశేషత్వాత్ కుశా ఛంద
స్తుత్యుపగానవ త్తదుక్తమ్" 3_3-26

విద్వాంసుడై బ్రహ్మమును పొందువాని సుకృతదుష్కృతములు విడిబడు నను విషయము వలె అట్టి పుణ్యపాపములను మిత్రులు శత్రువులు పరిగ్రహింతురను నంశంబు పరిగ్రాహ్యంబగును. హానివాక్యము ఉపాయనవాక్యమునకు శేషమగును. కుశలను ప్రతిపాదించువాక్యములు, ఛందస్సులు, స్తోత్రము, ఉపగానము అనునవి మరియొకచో చెప్పఁబడినవానికి శేషములగునని యంగీకరించినట్లు పై విషయమును గ్రహింపనగును. ఇవ్విషయము "అపి తు వాక్యశేషః స్యా దన్యాయ్యత్వాత్ వికల్పస్య" అనుచో పూర్వకాండమునందు ప్రతిపాదింపఁబడినదని సూత్రభాష్యసారాంశము.

## సాంపరాయాధికరణము

పూర్వపక్షసూత్రము

సూ. "సాంపరాయే తర్తవ్యాభావాత్ తథా హ్యన్యే" 3-3-27

పూర్వోక్తమైన పుణ్యపాపవిమోచనము దేహవియోగ కాలమునందగునా? లేక దేవయానమార్గమునందా? అని సంశయము.

ప్రశ్న : "అశ్వ ఇవ రోమాణి విధూయ పాపం, ధూత్వా శరీరమ్" "శరీరమును విడుచునపుడే గుఱ్ఱము వెంట్రుకలను వలె పాపపుణ్యములను శివోపాసకుఁడు

పోగొట్టుకొనును" అనుచో సుకృతదుష్కృతపరిత్యాగము శరీరవియోగసమయము నందే వినంబడుచున్నయది. "స ఆగచ్ఛతి విరజాం నదీం తాం మనసాత్యేతి తత్సుకృతదుష్కృతే విధునుతే" "ముక్తపురుషుఁడు విరజానదిని సూక్ష్మశరీరముతో నతిక్రమించుతఱి పుణ్యపాపములను విడనాడును" అనుచో మోక్షమార్గమున పుణ్యపాపవిమోచనము చెప్పఁబడినది. ఇట్లు ఉభయశ్రుతులు ఉన్నను దేహ వియోగకాలమునందే సుకృతదుష్కృతములు బొత్తుగా నశించునని భావింపవలసి యుండును. దేహవియోగానంతరము బ్రహ్మప్రాప్తిగాక కర్మసాధ్యమైన సుఖ దుఃఖభోగమెద్దియు ప్రాప్తవ్యముగా నుండదుగదా! ఇవ్విషయమునే కొందరు దిగువశ్రుతి నధ్యయనముఁ జేసియున్నవారు. "తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే, అథ సంపత్స్యే" "శరీరము విడిబడుటయే తడవుగా ముక్తపురుషుడు బ్రహ్మమును పొందువాడగును. కావున దేహవియోగము కాగానే బ్రహ్మప్రాప్తి సంభవించునని నిరూపించుట సమంజసము కాదా ?

రెండవ పూర్వపక్షసూత్రము.

సూ. "ఛందత ఉభయావిరోధాత్" 3-3-28

దేహవియోగ కాలమున పుణ్యపాప విమోచనమును చెప్పు శ్రుతికి దేహ వియోగానంతరమే బ్రహ్మప్రాప్తిని నిరూపించు శ్రుతికిని విరోధము లేకుండునట్లు "తత్సుకృత దుష్కృతే విధునుతే" అను శ్రుతి వాక్యమును యథేష్టముగా "ఏతం దేవయానం పంథాన మాపద్య"అను వాక్యఖండమున కన్న మున్ను సమన్వయింప వచ్చును గదా ?

మూడవ పూర్వపక్షసూత్రము.

సూ "ఉపపన్న స్తల్లక్షణార్థోపలబ్ధే ర్లోకవత్" 3-3-29

బ్రహ్మోపాసకులకు దేహవియోగ కాలమునందు సర్వకర్మక్షయ మైనను అర్చిరాదిగతి పొసగునని యంగీకరింపవలెను. ఎట్లనఁగా ? "స స్వరాట్ భవతి, తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి" ఇత్యాది ప్రమాణములఁబట్టి పుణ్యలోక ములయందు ముక్త పురుషుఁడు విహరించునని తెలియుచుండుటచే కర్మానుబంధము లేకున్న నర్చిరాదిగతి సంభవించునని గ్రహింపనగును.

లోకమున రాజాశ్రయము గల మహాపురుషులు - ఇతరులకు లభ్యము కాని భోగజాతము ననుభవింపఁజాలుదురు కావున మార్గశ్రుతికి ఎట్టి బాధయు లేదని భావము. దేహత్యాగ సమయమున కర్మలన్నియు నశించినను విద్యాసామర్థ్యముఁ జేసి లింగశరీరసంబంధము వలన అర్చిరాది మార్గము ననుసరించుట పొసగునది. మరియు ఆ యా ప్రదేశముల యందు విహరించుటయు చంద్రసంవాదాది సర్వార్థంబులును సిద్ధించును కావున దేహవియోగ కాలమునందే బ్రహ్మోపాసకునకు సుకృత దుష్కృత హాని యగునని ప్రతిపాదించుట యుక్తంబగును. కాదా ?

సిద్ధాంత సూత్రము.

సూ. "గతే రర్థవత్త్వ ముభయథాఽన్యథా హి విరోధః"

3-3-30

దేహవియోగ కాలమునందు విరజానదిని అతిక్రమించు సమయమునను రెండు విధములుగా కర్మక్షయ మగునని యంగీకరించు నెడల దేవయాన గతి సార్థకంబగును. అట్లుగాక దేహవియోగ కాలమునందే సర్వ కర్మక్షయ మగునని చెప్పునెడ దేహవియోగానంతరమే ముక్తుఁడు కావలసివచ్చును కావున ముక్తునకు గతి యవసరము లేదనుటచే శ్రుతుల యందు చెప్పఁబడిన దేవయాన గతి నిరర్థకంబగును.

మఱియు

"పరం జ్యోతి రుప సంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే"

అనుచో దేవయాన మార్గమున బ్రహ్మమును పొందిన తరువాతనే బుద్ధి వికాసరూపమైన స్వరూపావిర్భావము ఏర్పడు నని చెప్పఁబడిన సందర్భమునకును విరోధము సంభవించును.

ఒకవేళ విద్యా సామర్థ్యమునఁజేసి దేవయాన మార్గముగా వెళ్ళుటయు ఆ యా లోకములయందు విహరించుటయు చంద్రునితో సంవాదంబును తదితరములన్నియు శివపద ప్రవేశానంతరము ఏర్పడు విహారాదుల వలె సంభవింపఁజాలు నని చెప్పుట పొసగినను బ్రహ్మప్రాప్తివరకు అనుస్యూతముగా నుండెడు ధీసంకోచ

రూపమైన సంసారముఁదగు ననువృత్తి - విద్యాసామర్థ్యము వలన కలుగునని చెప్పుట పొసగదు కావునను ధీసంకోచరూప సంసారానువృత్తికి మూలమగు కర్మ లేశము జీవాత్మకు బ్రహ్మప్రాప్తి వరకు సంబంధించి యుండునని అవశ్య మంగీ కరింపవలెను.

"పరమేశ్వరుని సంకల్పవిశేషము వలననే ముక్తునకు గూడ ధీసంకోచా త్మక సంసారము బ్రహ్మప్రాప్తి వరకు అనువర్తించు"నని చెప్పుటయు సరిపడదు. అట్టి పరమేశ్వర సంకల్పమునే కర్మమూలముగా మేము చెప్పువారము. మఱియు జీవుడు గావించు విహిత నిషిద్ధ కర్మలను పురస్కరించుకొని యుండు పరమేశ్వర సంకల్పము గాక పుణ్య పాపములు వేరుగా నుండజాలవనియే మా యభిమతము.

ప్రశ్న : బ్రహ్మమును పొందిన తరువాతనే బుద్ధివికాసము మున్నగు వానితో జీవునకు నిజరూపము ఆవిర్భవించునెడ బ్రహ్మప్రాప్తి వరకు ధీసంకోచ మునకు వలయు కర్మానువృత్తి యుండవలెను గదా! అట్టితఱి విరజానదిని దాటిన పిమ్మటనే కర్మక్షయ మగునని చెప్పుట యెట్లు పొసగును ?

ఉత్తరము : ప్రాకృతమగు ప్రపంచమునకు పొలిమేఱయగు అవధి నతిక్ర మించుటయే పరమాకాశ మనఁదగు పరమశివ పదములో నడుగిడుటగా భావింపఁ దగినది. అట్టి శివపద ప్రాప్తినే "పరంజ్యోతి రుపసంపద్య" ఇత్యాది వాక్యము బ్రహ్మప్రాప్తిగా చెప్పుచున్నదని గమనింపవలెను. విష్ణుపదమునకు చెందిన విరజా నదియే ప్రాకృత ప్రపంచ సీమావధిగా గుర్తింపఁదగినది. విరజానది నతిక్రమించి పరమాకాశములో శివయోగులు ప్రవేశించుతఱి సర్వవిధ కర్మలేపములను పోగొట్టు కొని విష్ణుపదమునకు పైభాగమున గల అప్రాకృతమైన పరమానందమయంబగు శివపదమునఁ బ్రవేశించువారు.

''సోఽధ్వనః పార మాప్నోతి, తద్విష్ణోః పరమం పదమ్''

అను శ్రుతి వాక్యంబు ఈ యర్థమునే ధృవీకరించుచున్నది కావున ఇందు ఎట్టి విరోధంబును లేదని సారాంశము.

విష్ణుపదము ఉమాదేవిఁదగు అంశముగా ప్రాదుర్భవించిన పరనారాయణుని నివాసస్థానమనియు అయ్యది పరశివ లోకమునకన్న దిగువ నుండుననియు.

"తా వాం వాస్తూ న్యుశ్మసి గమధ్యై గావో యత్ర భూరిశృంగా అయాసః,

అత్రాహ తదురుగాయస్య వృష్ణః పరమం పద మవభాతి భూరేః'' అను మంత్రము విశదీకరించుచున్నయది.

మంత్రార్థము- "హే విష్ణో! నీయొక్క వాస్తూని = స్థానములను, గమధ్యై = పొందుట కొరకు, ఉశ్మసి = కోరుచున్నాము. యత్ర = ఏ నీ స్థానముల యందు, అయాసః=ఎప్పుడు నెడబాయనట్టి, భూరిశృంగా గావః= పెద్దకొమ్ములు గల నందిని మొదలగు గోమాతలు కలరో, అత్రాహ = ఈ స్థానములయందే, తత్ = ప్రసిద్ధమైన, ఉరుగాయస్య = గొప్పవారిచే కీర్తింపఁబడునట్టియు, భూరేః = మహనీయుడునగు, వృష్ణః = విష్ణువైన నీయొక్క, పరమం = అధస్తన విష్ణు లోకమునకన్న నుత్కృష్టమగు స్థానము, అవభాతి = పరమశివ లోకమునకు క్రిందుగా ప్రకాశించుచున్నది."

ఈ సందర్భముఁబట్టి పరమశివ పదము విష్ణుపదోపరిభాగమున కలదనియు అద్దియే ముముక్షువులందరికిని ప్రాప్యము, పునరావృత్తిరహితంబు నగు శాశ్వత స్థానంబనియు కర్మయోగముతో శివు నుపాసించువారికి శివక్షేత్రములయందు మరణించిన వారికిని ప్రాప్యంబగు భోగరూపమైన శివలోకము మఱియొకటి యనియు శాంభవ దీక్షతో శివయోగము ననుష్ఠించువారికి మాత్రము ప్రాప్యము పరమశివ లోకంబనియు చదువరులు గ్రహింతురు గాత!

## ఆధికారికాధికరణము

సూ. ''యావదధికార మవస్థితి రాధికారికాణామ్'' 3-3-31

శివోపాసకులకు పుణ్యాపాప విమోచనము బ్రహ్మ ప్రాప్తియు పూర్వాధికరణములయందు చెప్పఁబడినవి. ఇఁక నీ యధికరణము నందు ఆధికారిక (ఒకానొక పదవియందు గల) పురుషులకు అధికార భోగము (అనుభవము) పూర్తి కానిది మోక్షము చేకూరునా? లేదా? అని సంశయము.

ప్రశ్న : ఆధికారికులైన వసిష్ఠాది మహాపురుషులకు జన్మాంతరము కల దని పురాణాదులయందు వినఁబడుటచే నవ్వారికి మోక్షము లేదనియే చెప్పవలసి యుండును. కావున తత్త్వవిదులకు మోక్షము చేకూరుట నియతము కాదని యంగీకరింపవలెను కాదా?

ఉత్తరము : ఒకానొక పదవియందు గల మహాపురుషుఁడు ప్రకృతశరీర మును విడిచినను ప్రారబ్ధము పూర్తిగా నశింపదు గావున జన్మాంతరమున భోగ విశేషముల ననుభవించువాడై తన యధికారమునకు నిదానమగు కర్మను పోగొట్టు కొని ముక్తుఁడు కాజాలును. ఎంతవరకు పదవియుండునో అంతవరకు తత్కార ణమగు కర్మ ననుభవించుటకు నా పదవియందే ఆధికారిక పురుషులు అధిష్ఠించి యుందురు కాని యద్దానిలోపుగా అర్చిరాదిగతి లభింపదు. జ్ఞానులకు గూడ ప్రారబ్ధకర్మ - అనుభవముతోడనే నశించునది. ఇందువలన అధికారులకు అధి కారము తొలగిన పిమ్మటనే మోక్షము చేకూరుననియు తత్త్వవిదులకు మోక్ష ప్రాప్తి నియతంబే యనియు విశదమైనది.

## అనియమాధికరణము

సూ "అనియమః సర్వేషా మవిరోధః శబ్దానుమానాభ్యామ్" 3-3-32

"అస్థూల మనణ్వహ్రస్వమ్" "స్థూలము కానిది, అణువు కానిది హ్రస్వము కానిది బ్రహ్మము" స్థూలత్వాభావాది నిషేధములు కొన్ని బ్రహ్మబోధ కొరకు గార్గి బ్రాహ్మణమునందు కొన్నిచోట్ల వినంబడుచున్నవి. మఱియు "యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణమ్" బ్రహ్మము నిర్దేశింప నలవిగానిదియు కనుగొన శక్యము కానిదియు గోత్రము లేనిదియు వర్ణరహితంబును" ఇత్యాది ఆథర్వణిక వాక్యములయందు నిర్దేశాభావాది నిషేధములు వినఁబడుచున్నయవి.

ఇట్టి నిషేధములను ఆనందాది గుణముల వలె పరవిద్యలన్నిటియందు నుపసంహరింప వలెనా ? లేదా ? అని సంశయము.

ప్రశ్న : పూర్వోక్త నిషేధములు ఆనందాదులవలె గుణములు కానందున పరవిద్యలన్నిటియందు స్వీకరింపఁదగినవి కావని చెప్పవలెను గదా ?

ఉత్తరము : అక్షరమనఁబడు బ్రహ్మమును గూర్చి చెప్పఁబడిన నిషేధ ములు సమస్త పరవిద్యలయందు స్వీకరింపఁదగినవి. ఎందుకనఁగా ? గుణియగు బ్రహ్మము పరవిద్యలందంతట నొక్కటియే గదా ! బ్రహ్మమునకంటె నితరము లైన వస్తువులను నిషేధించిన తరువాతనే బ్రహ్మము ననుసంధించుటకు ఆనందాది

గుణముల యుపసంహారము ఉపపన్నం బగునది. మఱియు హేయగుణ సంబంధము లేనట్టి ఆనందాది సద్గుణములు ప్రత్యగాత్మయగు జీవునినుండి బ్రహ్మమును వేఱుపఱచును. ఎట్టి సద్గుణమైనను ముఖ్యవస్తువు నాశ్రయించి యుండును గదా! పూర్వ కాండమునందు జామదగ్న్య చతూరాత్ర పురోడాశములు మున్నగు వాని సంబంధము గల "అగ్నిహోత్రం వేత్త్యధ్వరమ్" అను మంత్రము సామవేదీయ మగుటఁజేసి హెచ్చు స్వరముతో నుచ్చరింపఁదగినదైనను యజుర్వేద సంబంధమైన కర్మ ననుసరించుట వలన ఉపాంశువుగ నుచ్చరింపఁదగినదని "గుణ ముఖ్య వ్యతిక్రమే తదర్థత్వా న్ముఖ్యేన వేదసంయోగః" అనుచో చెప్పఁబడి నట్లు పరవిద్యలన్నిటియందు ముఖ్యంబగు బ్రహ్మమును సంబంధించి చెప్పఁబడు నిషేధములు భావింపఁదగినవి యని సారాంశముగా గ్రహింపనగును.

ఇట్లు చెప్పినందున నిషేధములన్నిటి నుపసంహరింపవచ్చునని భావింపఁగూడదని దిగువ సూత్రముతో నిర్వచించుచున్నవారు.

సూ. "ఇయ దామనవాత్" 3-3-34

ఆమనన మనఁగా ? ఆదరముతో భావించుట; ఇంతమాత్రము గుణసముదాయము పరవిద్యలన్నిటి యందు స్వీకరింపఁదగినది. బ్రహ్మేతరములైన వస్తువులన్నిటిని తొలగించి బ్రహ్మమునందే నిష్ఠఁగలిగించు లక్షణములు మననమునందావశ్యకము లగును. కావున అక్షరబ్రహ్మ సంబంధము గల అస్థూలత్వాది నిషేధ భావనలే సకలేతర వ్యావర్తకములైన ధర్మములగుటఁజేసి పరవిద్యలన్నిటి నుపసంహరింపఁదగినవి కాని "సర్వకర్మా సర్వకామః సర్వగంధః సర్వరసః" ఇత్యాది లక్షణములు మాత్రము గ్రహింపఁదగినవి కావని సిద్ధాంతము.

## అంతరా భూతగ్రామాధికరణము

సూ. "అంతరా భూతగ్రామవత్ స్వాత్మనోఽన్యథా
భేదానుపపత్తి రితి చే న్నోపదేశవత్" 3-3-35

బృహదారణ్యకమునందు ఉషస్తి యనువాడు "సర్వాంతరుడైన ఆత్మ-పరోక్షముగాను ప్రత్యక్షము గాను బ్రహ్మమనఁబడుచుండును గదా! అట్టి యాత్మను గుఱించి చెప్పు"దని యాజ్ఞవల్క్యుని ప్రశ్నించెను. మరియు నదే యుపనిషత్తన

కహోలుడనువాడు నట్లే యాజ్ఞవల్క్యు నడిగెను. ఐతే "ప్రాణాపానములతో జీవించువాడు ఆత్మ యనియు తదితర మంతయు తుచ్ఛంబనియు" ఉషస్తికి; "ఆకలి దప్పులు లేనివాడైశోకమోహజరామృత్యువుల నతిక్రమించి యుండువాడు ఆత్మయనియు ఇట్టి యాత్మను కనుగొనవలెననియు తద్భిన్నంబంతయు పరిగ్రాహ్యము కాదనియు" కహోలునకు యాజ్ఞవల్క్యుఁడు సమాధానములను నిర్వచించెను."

ఇట్టి తఱి విద్య యొకటియా కాదా అని సంశయము పొడముచున్నయది.

ప్రశ్న : ఉషస్తి గావించిన ప్రశ్నయందు పృథివ్యాది పంచభూతములను గురించివలె ప్రత్యగాత్మయగు జీవుని విషయము పొడగట్టును. అట్లు కానియెడల "ప్రాణముతో జీవించువాడు ఆత్మ" యను సమాధానమునకు ''క్షుత్పిపాసాద్యతీతుఁడు'' యను సమాధానమునకును భేదము పాటింప వలనుపడదు గదా?

ఉత్తరము : ఉభయత్ర భేదమును పాటింపరాదు. "య ఆత్మా సర్వాంతరః" అను వాక్యము ప్రశ్నద్వయమునందు కలదు గావున పరమేశ్వరుఁడే రెండుచోట్ల ప్రతిపాదింపఁబడుచున్నవాడు. ఎట్లనఁగా? ఎట్టి యుపాధి లేకుండా ప్రాణనాది హేతువగుటయు క్షుత్పిపాసాదుల నతిక్రమించి యుండుటయు పరమేశ్వరుని యందే ఉపపన్నంబులగునవి.

సద్విద్యోపదేశమునందు వలె ప్రశ్నప్రతివచనములయందలి విషయము పరమేశ్వరుఁజెందినదేను; ప్రష్టృభేదము రూపభేదంబు - విద్యాభేదమునాపాదించునది కాజాలదు.

మఱియు

సూ. "వ్యతిహారో విశింషంతి హీతరవత్" 3-3-36

ప్రతిపాద్యము ఒక్కటేయని నిర్ణయ మగుతఱి ప్రశ్నించువారికి భావించుటలో పరివర్తనము కాజాలును. క్షుత్పిపాసాద్యతీతత్వ భావనను ఉషస్తి చేయవచ్చును. ప్రాణనాది హేతుత్వభావనను కహోలుఁడు గావింపవచ్చును. ప్రకరణముల రెంటియందు గల వాక్యములు పరమేశ్వరునే నిర్దేశించినవి. "తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" అను వాక్యము సద్విద్యయందు పునఃపునః చెప్పఁబడినను తత్త్వజ్ఞానముకొరకు నుపయోగించినట్లు ఒకే ఒక పరమాత్మ -

ఇట ప్రశ్నప్రతివచనములయందుండుటఁజేసి విద్యాభేద మిసుమంతయు కాజాల దని సిద్ధాంతము.

## సత్యాధికరణము

సూ. "సైవ హి సత్యాదయః" 3-3-37

సద్విద్యాదృష్టాంతముతో పూర్వాధికరణమునందు చేయఁబడిన నిర్ణయ మును గమనించినను సద్విద్య ఒక్కటియా ? ద్వివిధమా ? అని సంశయము కలుగుచున్నయది.

ప్రశ్న : సద్విద్యయందు చేయఁబడిన ప్రశ్నను మఱల మఱల గావించుటఁ జేసి ప్రత్యుత్తరమునందు భేదము గానవచ్చుటను ప్రతి ఆవర్తనమున సద్విద్య భిన్నంబగునని చెప్పవలెను కాదా ?

ఉత్తరము : సద్విద్య భిన్నము కాజాలదు. ఎందుకనఁగా? సద్విద్య నుపదే శించు సందర్భమున "సేయం దేవతా" అని మహాదేవత - ప్రశ్నప్రతివచనము లన్నిటియందును పరిగ్రహింపఁబడినది. మరియు "తత్సత్యం, స ఆత్మా, తత్త్వ మసి" ఈ విధముగా సత్యత్వాదిగుణములను మాటిమాటికి ఆవర్తనము చేయఁబడుట ఇందు గమనింపఁదగియున్నది. ఇంతియే గాక ప్రతిపాదింపఁబడు వస్తువు ఒక్కటే యగుటకతన సద్విద్య ఏకవిధంబైనదియే నని సిద్ధాంతము.

## కామాధికరణము

సూ. "కామాదయ స్తత్ర తత్ర చాయతనాదిభ్యః" 3-3-38

దహరవిద్య - ఛాందోగ్యమునందు తైత్తిరీయకమునను వాజిశాఖయందును కైవల్యోపనిషత్తునందును వినంబడుచున్నయది. ఇట్టి దహరవిద్య ఒక్కటియా? వేరు వేరా ? అని సంశయము.

ప్రశ్న : "యదిద మస్మిన్ పురే దహరం పుండరీకం, వేశ్మ, దహరోఽ స్మిన్నంతర ఆకాశః" అనుచో ఛాందోగ్యమునందు "దహరపుండరీకమునందు గల

దహరాకాశమునకు అపహత పాప్మత్వాది అష్ట గుణములు ముఖ్యముగా నుండు" నని చెప్పఁబడినది. తైత్తిరీయకమునందైతేనో "దహరం విపాప్మం" మొదలుకొని దహరపుండరీకవర్తియగు వానికి ప్రణవవాచ్యత్వము ప్రకృత్యాత్మకత్వము నాద రూపత్వము మహేశ్వరశబ్దవాచ్యత్వము కృష్ణపింగళత్వము విరూపాక్షత్వము మున్నగు ధర్మములు ప్రతిపాదింపఁబడినవి. వాజిశాఖయందు "య ఏషోఽన్తర్హృదయ ఆకాశస్తస్మిన్ శేతే సర్వస్య వశీ సర్వస్యేశానః సర్వస్యాధిపతిః"అనుచో వశిత్వాది లక్షణంబులు వక్కాణింపఁబడినవి. కైవల్యోపనిషత్తున "హృత్పుండరీకం విరజం" మొదలుకొని "విభుం చిదానంద మరూప మద్భుతం ఉమా సహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతమ్" అను వాక్యము వరకు హృదయ పుండరీకమున నివసించు పరమాత్మ - త్రిలోచనుండనియు నీలకంఠుఁడనియు చిదానందరూపుడనియు ఉమాసహాయుండనియు తదితర లక్షణ లక్షితుండనియు నిరూపింపఁబడినది. ఐతే ఇందు నీలకంఠత్వాదులు శరీరధర్మములగుటఁజేసియు సత్యత్వాదులు ఆత్మధర్మములగుటఁజేసియు విరుద్ధములు కావున వీని నన్నిటిని ఒకే దహరవిద్యయందు నుపసంహరింప వలను పడదు. ఇందువలన దహరవిద్య భిన్నంబనియే యంగీకరింప వలెను కాదా ?

ఉత్తరము : ఆ యా ఉపనిషత్తులయందు దహరపుండరీకమనఁబడు ఆయతనమొకటియే యగుట మున్నగు కారణములవలన సత్య కామత్వాది ధర్మములు దహరవిద్యయందంతట నుపసంహరింపఁదగినవి.

ఛాందోగ్యమునందలి అపహత పాప్మత్వాది ధర్మములను వాజిశాఖయందలి వశిత్వాది లక్షణములను తైత్తిరీయకములోని ప్రణవవాచ్యత్వాదులను కైవల్యమునందలి చిదానందరూపత్వాదులను ఒకే ఒక దహరవిద్యయందు బ్రహ్మమును గురించి యనుసంధించుట సమంజసంబగును.

కైవల్యమునందలి ఉమాసహాయత్వ త్రిలోచనత్వములు తైత్తిరీయమునందలి కృష్ణపింగళత్వ విరూపాక్షత్వములు ఏకార్థకములేను ; "నీలకంఠం" అనుచో కంఠమాత్రనైల్యము, "కృష్ణపింగళం" అనుచో శరీరార్ధనైల్యంబు, "త్రిలోచనం" అనుచో నేత్రత్రయవిశిష్టత్వము, "విరూపాక్షం" అనుచో అక్షి నేత్రత్రయము హెచ్చుతగ్గులుగా నుండుటయు పొడగట్టుచున్నందున ప్రతిపాద్య

మొక్కటియే యని యెట్లు చెప్పవచ్చునని శంకింపఁగూడదు. కృష్ణపింగళ శబ్దముతో ఉమాసహాయత్వము చెప్పఁబడె ననియు విరూపాక్ష శబ్దముతో త్రిలోచనత్వము సమర్థింపఁబడె ననియు విరూపశబ్దము సంఖ్యాత్రయమును మాత్రము చెప్పును కాని వైరూప్యమును చెప్పదనియు గ్రహింపవలెను. "సత్యకామత్వ" మనుచో సృష్టి స్థితి లయాది సత్య సంకల్పములు కలవాడనియు "ప్రశాంతం" అనుచో నిత్యతృప్తుఁడగుటచే స్వయముగా భోగతృష్ణారహితుండనియు వివేకము.

ఒక యుపనిషత్తునందు చెప్పఁబడిన లక్షణములను మరియొక నుపనిషత్తునందు ఆవర్తించుట పరమేశ్వరునియందు శ్రుతికి గల ఆదరమువలననే యని తెలియునది.

ఈ సందర్భమున ముఖ్యముగా గమనింపఁదగినది ఏద్ది యనుచో? గుణియగు బ్రహ్మమొక్కటియే ఉపాస్యంబగుటచే అపహత పాప్మత్వాది ధర్మములఁజెంది యుండునదియు సర్వేశ్వరంబును ఓంకారవాచ్యంబు ఉమాసహాయంబును త్రిలోచనంబు నీలకంఠమున్ను చిదానంద రూపంబును అనంతంబు అమృతంబు అద్భుతంబు నగు పరబ్రహ్మమును హృదయ పుండరీకమధ్యంబున భావింపవలెనని తేటపడుచున్నది గావున దహరవిద్య పరవిద్యలన్నిటియందు ప్రధానంబైనదని గమనించుట శ్రేయస్కరంబగును. ఇట్టి దహరవిద్యయు శివవిషయకమైనందుననే పరవిద్యాశ్రేష్ఠము కాదగును. నారాయణుని ఉపాసింపవలసినదిగా ఆత్మబోధోపనిషత్తునందు వినంబడు దహరవిద్య - కైవల్యాదులయందు చెప్పఁబడిన దహరవిద్యకంటె భిన్నంబైనది. ఇట్లు రెండు దహరవిద్యలుండగా బృహదారణ్యకము శైవీదహరవిద్యను ప్రతిపాదించుటఁజేసియు ఈశాన, భూతాధిపతి, భూతపాలాది శబ్దములు శివరూఢములుగా లోకవేద ప్రసిద్ధము లగుటఁజేసియు కైవల్యమునందు "తమసః పరస్తాత్" అని యుండుటచేత ఛాందోగ్యగతములగు అపహత పాప్మత్వాది ధర్మములను శివునియందే సమన్వయింపవలనుపడును కావునను శైవీదహరవిద్యయే ముఖ్యంబైనదని చదువరులు గ్రహింతురు గాత! వైష్ణవీదహరవిద్యా పద్ధతిని విష్ణువు నుపాసించిన వారు వైకుంఠప్రాప్తిద్వారా శివోపాసనఁజేసి శివపదమునఁ బ్రవేశింతురని భాష్యకారుల యభిమతము.

ఇట్టి శైవీదహర విద్యానిష్ఠునకు "పరంజ్యోతి రుప సంపద్య స్వేన రూపే

ణాభినిష్పద్యతే" "ధ్యాత్వా ముని ర్గచ్ఛతి భూతయోనిం సమస్తసాక్షిం తమసః పరస్తాత్" అను వాక్యములయందు ఛాందోగ్యము కైవల్యంబును—సాక్షాదుపాసింపఁబడునట్టి ప్రకృతి మండలము నతిక్రమించియున్నట్టి పరబ్రహ్మంబునగు శివుని పొందుటయే ఫలంబని నొక్కి వక్కాణించినవి.

ఇందువలననే నీలకంఠత్వాది ధర్మములు అపహత పాప్మత్వాది లక్షణంబులును పరస్పరము సాపేక్షములగుచు నిత్యమైన బ్రహ్మమునందు భావింపఁబడుటకు ఎట్టి విరోధంబును లేదు. త్రిలోచనత్వము మున్నగు లక్షణములు గల శరీరముతో కూడియున్న పరమేశ్వరునియందు శరీరధర్మములుగా ప్రసక్తములగు పాపజరామరణములను క్షుత్పిపాసలను అసత్యకామత్వ అసత్య సంకల్పములను తొలగించుటకే అపహతపాప్మత్వాది ధర్మములు ప్రతిపాదింపఁబడినవి. పరబ్రహ్మము- త్రిలోచనత్వాదియుక్త శరీరకంబైనను పాపములులేనిదనియు జరారహితంబనియు దుఃఖవర్జితంబనియు ఆకలిదప్పులు లేనిదనియు సత్యకామంబనియు సత్యసంకల్పంబనియు చిదానందస్వరూపంబనియు శ్రుతిసమ్మతముగా విశదమగుచున్నది కావున ఇందు ఎంతమాత్రము విరోధము ఉండజాలదని సారాంశము.

## అలోపాధికరణము

ప్రియశిరస్త్వాదులవలె నీలకంఠత్వము మున్నగు అవయవములు బ్రహ్మస్వరూపములో చేరునెడ అట్టి బ్రహ్మస్వరూపమునకు వృద్ధిక్షయములు సంభవించును కావున నీలకంఠత్వాదిలక్షణములు లోపించునను ఆశంకకు సమాధానమీదిగువసూత్రము.

సూ. "ఆదరా దలోపః" 3-3-36

పూర్వాధికరణమునందు పరమేశ్వరుని రూపము నీలకంఠత్వాది విశిష్టమనియు ఉమ యనుపేరుగల పరమశక్తితో కూడియుండునదనియు సత్యసంకల్పత్వాది గుణములు కలదనియు నిరూపింపఁబడినది. ఐతే ఇట నయ్యవి పరబ్రహ్మమునందు ఒకప్పుడు లోపించునా ? లేక ఎప్పుడును లోపింపవా ? అని సంశయము కలుగుచున్నయది.

ప్రశ్న : నీలకంఠత్వాది గుణములున్ను ఉపాసనకై పరబ్రహ్మమునందు కల్పింపఁబడుటచే నయ్యవి ఒకప్పుడు లోపించునని చెప్పుట భావ్యము గదా ?

ఉత్తరము : పరబ్రహ్మమునకు ఉమాసాహిత్యాదులు శ్రుతులన్నిటియందు నభ్యసించుట శ్రుతులకు పరమేశ్వరునియందుగల అదరమువలన యని గ్రహించునది. అందువలన నయ్యవి ఎప్పుడును లోపించునవికావు. కావుననే పరబ్రహ్మము అలుప్తశక్తిక మనఁబఅగుచున్నయది. మఱియు అదరమువలన శ్రుతులన్నిటియందు నభ్యాసమును గాననగును. "కృష్ణపింగళం విరూపాక్షం" అనుచో శక్తిసహితత్వము త్రిలోచనత్వంబు సిద్ధించినను మరల నాదరముతోడనే "ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం'' అనుచో నభ్యాసము చేయబఁబడినది సవితృమండలవిద్యయందైతేనో ''నమో హిరణ్యబాహనే హిరణ్యపతయేఽంబికాపతయ ఉమాపతయే" అనుచో ఉమాపతిత్వము ఆదరమువలన నభ్యసింపఁబడినది. మఱియొకచో "నీలగ్రీవో విలోహితః.... నీలగ్రీవాయ చ శితికంఠాయ చ" ఇత్యాదివాక్యములయందు పరమేశ్వరునియందలి ఆదరముతో నీలగ్రీవత్వము ఆవర్తింపఁబడినది. మఱియు సత్యసంకల్పత్వాదులు ఒకచో చెప్పఁబడినను మరియొకచో నవ్వానిని మరల వక్కాణించుట ఆదరమువలననే యని గ్రహించునది.

అందువలన ఉమాపతిత్వాదిలక్షణములు ఆదరమువలన నభ్యసింపఁబడుటచే పరమేశ్వరున కెప్పుడును లోపింపవని విశదమైనది. మఱియొక ప్రమాణము వలన తెలియునట్టి ధర్మబ్రహ్మములను గూర్చి యెట్టి స్వరూపమును భగవతియగు శ్రుతి నిర్వచించునో అట్టి స్వరూపమునే శ్రుతిప్రామాణ్యవాదులు అంగీకరింపవలసి వచ్చును. అట్లుగాక శ్రుతివిరుద్ధమగు తర్కము నవలంబించునెడ జగదుపాదానత్వాది లక్షణములు సిద్ధింపకుండును. ఇందువలన శ్రుతియే "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అనుచో బ్రహ్మము సత్యజ్ఞానాకారమైనను అపరిచ్ఛిన్నంబని చెప్పియు, "ఋతం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగళమ్, ఊర్ధ్వరేతం విరూపాక్షం" ఇత్యాది వాక్యములతో త్రిలోచనంబు పరమశక్తియనఁబడు ఉమాదేవితో విశిష్టంబు నగు రూపము కలవాడు పరమేశ్వరుఁడని నొక్కివక్కాణించినది. మరల నా పరమాత్మ ''స ఏకో బ్రహ్మణ ఆనందః" అనుచో నిరతిశయమైన ఆనందము కలవాడని వాక్రుచ్చినది. అట్టి పరమేశ్వరునకే "ఆకాశశరీరం బ్రహ్మ

సత్యాత్మ, ప్రాణారామం, మనఆనందం, కాంతి సమృద్ధ మమృతమ్" ఇత్యాది సందర్భమున చిదాకాశరూపము సత్యస్వరూపము కలిగియుండుటను ప్రాణమనఁబడు చిదంబరశక్తియందు క్రీడించుటను (అనఁగా ఆత్మారామత్వమును) బాహ్యసాధనముల యవసరము లేనట్టి యంతఃకరణమొకదానితోడనే యనుభవింపఁబడునట్టి పరమానందముఁదగు విలాసము కలిగియుండుటను సర్వవిధ కళంకములు ఉపద్రవములును బొత్తుగా లేకుండుటను అనాదిముక్తత్వంబును భగవతియగు శ్రుతి ప్రకటించుచున్నయది. మఱియు పరమేశ్వరునకు విరూపాక్షత్వాది లక్షణములు గల శరీరముఁదగు సంబంధము వలన జీవునికి వలె కలవని తోచెడు జరామరణాదులను ''అపహతపాప్మా'' ఇత్యాదిని నిరాకరించినది.

"యః సర్వజ్ఞః సర్వవిత్" "పరాఽస్య శక్తిః" "పశూనాం పతయే" ఇత్యాది వాక్యములయందు పరమాత్మ-సర్వజ్ఞుఁడనియు సర్వవిధశక్తులు కలవాడనియు స్వతంత్రత్వాదిసంపన్నుఁడనియు నిరూపించినది.

ఇవ్విధము సకలప్రమాణమూర్ధన్యమగు శ్రుతియే శివుఁడు సత్యజ్ఞానానంద స్వరూపుఁడనియు అపరిచ్ఛిన్నుడనియు సర్వజ్ఞుఁడనియు నిత్యతృప్తుఁడనియు స్వతంత్రుఁడనియు అనాదిప్రకాశుఁడనియు అనంత అలుప్తశక్తులు కలవాడనియు ఆత్మారాముండనియు అంతఃకరణములోని అనుభవమునకు ఏకమాత్రవిషయమగు ఆనందము కలవాడనియు ఎట్టివికారములు లేనివాడనియు నీలకంఠుఁడనియు విరూపాక్షుఁడనియు ఉమాసహాయుఁడనియు పరబ్రహ్మంబనియు సర్వాత్మకుఁడనియు ముక్తిసాధకుఁడనియు అంతట నుద్ఘోషించుచుండగా నట్టి శ్రుతిని నివారింప నెవని తరమగును? అందువలన పరమేశ్వరునకు చెప్పఁబడిన స్వరూపధర్మములు లోపించునవి కావనియే సిద్ధాంతము.

ఈ యధికరణద్వయము నిర్గుణబ్రహ్మవాదులకు సంగతము కాకుండును. ఎట్లనఁగా? పూర్వాధికరణమునందు వశిత్వాదిగుణములు స్తుతికొరకే వాజసనేయమున చెప్పఁబడినవని వారి యభిప్రాయము. మఱియు భిన్నవిద్యలయందు గల గుణములు ఆయతనాదిసామ్యమున బుద్ధిస్థములగుటకు స్తుత్యర్థము ఉపసంహరింపఁబడినవని రత్నప్రభావ్యాఖ్యానమున వివరింపబడినది. నిర్గుణమును సగుణముగా ప్రశంసించుట బీదవానిని శ్రీమంతుడఁని పేర్కొనుటవలె నిరర్థకంబగునని

యవ్వారే తెలిపినట్లు విశదమగును. ఇందువలననే సర్వావేదాంతప్రత్యయాధికరణమునందు బ్రహ్మోపాసనఁదగు భేదాభేదముల విచారము సగుణవిషయకమైనదని చెప్పుటవలన సాధనాధ్యాయము తమ పక్షమున సంగతము కాదని స్వయముగానే కంఠతః అంగీకరింపఁబడినట్లేను, ఇంకను వారు ఆలోపాధికరణమును ప్రాణాగ్నిహోత్రపరముగా వ్యాఖ్యానించిరి. ఇయ్యది ప్రాణాగ్నిహోత్రపరమగునెడల ఈ సందర్భమున విచారము ఉపాసనను గురించికాని తదుపయుక్త విషయముల నుద్దేశించికాని చేయఁబడలేదనియు పాదసంగతి యనావశ్యకమనియు తేటపడును కావున నవ్వారి యభిమతము పరిగ్రాహ్యము కాకుండును. ఇట్లు తమ వివరణము ఎందుకు బయలుదేరినదనఁగా? పరమేశ్వరుని రూపమునందు గాని గుణములయందు గాని వారికి గల యనాదరణమేయని భావింపవలసియున్నది.

మఱియు నియ్యది శ్రీభాష్యకారుల పక్షమున నసంగతంబే యగును. ఎట్లనఁగా? ఛాందోగ్యాదులు నిర్ణయించిన దహరవిద్య-తైత్తిరీయ కైవల్యాదులయందు వినఁబడు నీలకంఠత్వాది స్వరూపగుణవిశేషముల కారణముగా భాగపతవ్యాయమున శివపరమగునని తప్పనిసరిగా అంగీకరింపవలసివచ్చును కావునను స్వాభిమతంబగు నారాయణవిషయక రూపవిశేషగుణజాతోదాహరణంబును గానింపలేదు కావునను పరమేశ్వరుని రూపగుణములు సమ్మతములు కాకుండుటను స్వాభిమత నారాయణ రూపవిశేష గుణములు శ్రుతివిషయములు కాకుండుటఁజేసియు నీ సందర్భమంతయు శ్రీభాష్యకారులకు విరుద్ధంబనియే తేటపడుచున్నయది.

## తద్వచనాధికరణము

సూ. "ఉపస్థితేఽత స్తద్వచనాత్" 3-3-40

ఇఁట పూర్వాధికరణప్రోక్తమగు బ్రహ్మస్వరూపమే ముక్తపురుషులచే పొందఁబడునా ? లేక మరియొకటియా ? అని సందేహింపఁబడుచున్నయది.

ప్రశ్న : "నిష్కళం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం" ఇత్యాది శ్రుతివాక్యములయందు పరబ్రహ్మము నిర్విశేషముగానే వినంబడుచున్నయది. మఱియు "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" అనుచో ముక్తుఁడు బ్రహ్మమే యగునని

చెప్పఁబడినది కావున నిర్విశేష(నిర్గుణ) బ్రహ్మమే ముక్తప్రాప్యమగును కాని మరి యొకటి కాదు గదా ?

ఉత్తరము : పూర్వోక్తమైన సవిశేష (సగుణ) బ్రహ్మమే ముక్తప్రాప్యం బగునది. ఎట్లనగా ? దహరపుండరీకమునందు భావింపఁదగినదిగా ప్రతిపాదింపఁ బడిన విరూపాక్షపరబ్రహ్మమును "పరంజ్యోతి రుపసంపద్య" అనుచో ముక్తుఁడు పొందుననియు "స్వేన రూపేణాభినిష్పద్యతే" అనుచో ప్రాప్తి అనంతరము నిజ రూపము నావిష్కరించుకొనుననియు "జక్షన్ క్రీడన్ రమమాణః స్త్రీభిర్వా జ్ఞాతి భిర్వా'' అనుచో ముక్తపురుషుఁడు స్వేచ్ఛగా శివానందము ననుభవించుచు ఒక ప్పుడు దివ్యస్త్రీలతోగాని దివ్యరూపములుగల ఆప్తులతోగాని విహరించుననియు నిరంజనః "పరమం సామ్యముపైతి" అను శ్రుతివాక్యమునందు "ముక్తః శివసమో భవేత్" అను స్మృతివాక్యమునందును ముక్తపురుషుఁడు పరమాత్మతో సామ్యము (శివసాయుజ్యము)ను పొందుననియు విశదముగా చెప్పఁబడినది కావున ముక్తులు సాక్షాత్ పొందదగినదియే పూర్వోక్తమగు నీలకంఠత్వాది లక్షణములు గల శివ స్వరూపంబని తెలియవలెను. సాంసారికమైన రూపము మాత్రము ముక్తప్రాప్యం బగునది కాదు. '"అపహతపాప్మా" ఇత్యాదిని పాపజరామరణాదివిశిష్టమగు సాంసారికరూపము పరమాత్మకు నిషేధింపఁబడినది కావున పరవిద్యయంతయు సగుణంబైనదియేను.

"నిష్కళం నిష్క్రియం" ఇత్యాది వాక్యములయందు హేయగుణములు నిషేధింపఁబడినవి కాని కల్యాణగుణములు నిషేధింపఁబడలేదని గ్రహింపవలెను. ఎట్లనఁగా? ''నిష్కళం నిష్క్రియం'' ఇత్యాదిని నిర్గుణత్వము ''ప్రధానక్షేత్రజ్ఞ పతి ర్గుణేశః" ఇత్యాదిని సగుణత్వంబు సమానములుగా ఏర్పడుచుండ "అప హతపాప్మా" ఇత్యాది విశేష శ్రుతివాక్యముల ననుసరించి నిర్గుణశ్రుతికి హేయ గుణరాహిత్యమను నర్థముఁజేసి "యః సర్వజ్ఞః సర్వవిత్" ఇత్యాది విశేషశ్రుతి వాక్యములఁబట్టి కల్యాణగుణసాహిత్యమను నర్థముఁ జెప్పవలసియుండును.

మఱియు దిగువ శ్రుతివచనమే మోక్షఫలమును సగుణముగా నిర్వచించి నది.

"సోఽశ్నుతే సర్వాన్ కామాన్, సహ బ్రహ్మణా విపశ్చితా" ఇఁట "విప శ్చితా=అనఁగా సర్వజ్ఞుఁడైన పరమాత్మతో ముక్తపురుషుఁడు వాంఛితముల

నన్నిటిని. సహ=శివునితో ఏకకాలమున ఆనందభోగము గలవాడగును అను నర్థము సమంజసంబగును. ఇందువలన సగుణమైన బ్రహ్మస్వరూపమే ముక్తప్రాప్యముగ ఫలరూపమైనదని విశదమైనది.

## తన్నిర్ధారణానియమాధికరణము

సూ. "తన్నిర్ధారణానియమ స్తద్దృష్టేః పృథగ్ఘ్యప్రతిబంధః ఫలమ్"

3-3-41

కర్మాంగములుగా చెప్పఁబడిన ఉద్గీథము మున్నగు ఉపాసనములు కర్మల నాచరించునపుడు తప్పనిసరిగా చేయఁదగినవా? కావా? అని యిట సందేహింపఁ బడుచున్నయది.

ప్రశ్న: కర్మానుష్ఠానసమయమున కర్మాంగములైన ఉద్గీథాద్యుపాసనలు నియతముగా ఆచరింపఁదగినవేను, ఒకవేళ కర్మప్రకరణము నారంభింపక చదువఁబడినను ఉద్గీథాద్యుపాసనలు వాక్యమువలననే క్రతుసంబంధము కలిగి యుండునని చెప్పవలసియుండును. కావున కర్మలయందు ఉద్గీథాద్యుపాసనములు నియతములైనవి గదా?

ఉత్తరము: గోదోహనాదులవలె ఉద్గీథాది ఉపాసనలు అనియతంబుల గును. ఉద్గీథాద్యుపాసనలను గావింపనివాడును క్రత్వనుష్ఠానమునకుఁ దగినవాడని "తేనోభౌ కురుతో యశ్చైతదేవం వేద, యశ్చ న వేద" అను ప్రమాణము చాటుచున్నయది. ఉపాసనతో కర్మనాచరించుట ఎందుకఁనగా? "యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా, తదేవ వీర్యవత్తరం భవతి" అను శ్రుతివాక్యము ననుస రించి ప్రణవము నుద్గీథముగా నుపాసించుటవలన ప్రబల కర్మాంతరముల ప్రతి బంధములేకుండ సమాచరితమైన కర్మము శీఘ్రఫలప్రదమగును.

సూత్రార్థము— తన్నిర్ధారణానియమః = ఉద్గీథ ఆది ఉపాసనములఁదగు నియమము లేదు, ఎందువలననఁగా? తద్దృష్టేః = అట్టి నియమాభావము శ్రుతి యందు గానంబడుచున్నయది. ఐతే ఉద్గీథాద్యుపాసనలెందుకనఁగా? పృథక్ అప్రతిబంధః ఫలమ్ = ఉద్గీథాద్యుపాసనములకు విఘ్నరూపములైన కర్మాంతర ముల ప్రభావము లేకుండుట యను ఫలము వేరుగా చెప్పఁబడినది.

# ప్రదానాధికరణము

సూ. "ప్రదానవదేవ తదుక్తమ్" 3-3-42

పరవిద్యలన్నిటియందు నొకే శివాభిధేయ పరబ్రహ్మమును ఆ యా గుణములతో కూడినదిగా వేరుగా చింతింపవచ్చునని చెప్పఁబడినది. ఐతే నవ్విధము చింతించుట సరిపడునా? లేదా? అని సందేహింపఁబడుచున్న యది.

ప్రశ్న : గుణియగు బ్రహ్మమొక్కటే యగుటఁజేసి గుణభేదమున్నను బ్రహ్మోపాసనము భిన్నము కాజాలదు. ఎట్లనఁగా? లోకమున రాజు ఆ యా భూషణాదివిశేషములతో కూడియున్నవాడై కర్తవ్యములను పరిశీలించుట, వ్యాయామము, బోజన ఆసనములు, వేట, యుద్ధము, ఇత్యాది వ్యాపారములయందు సింహాసనము మున్నగు స్థానభేదము గానవచ్చినను వ్యక్తియొకఁడేయైనట్లు దహరాది స్థానభేదమున్నను ఆ యా గుణభేదములతో కూడిన బ్రహ్మమొక్కటే యగుటఁ జేసి బ్రహ్మోపాసన మొక్కటియే యగును కాని వేరువేరు కాజాలదు గదా!

ఉత్తరము : శివాభిధేయమగు బ్రహ్మమునకు స్వరూపముఁదగు భేదము లేకున్నను ఆ యా గుణములతో కూడిన స్వరూపము కలదగుటఁజేసి గుణవిశేష భేదకారణముగా నుపాసనము భిన్నమగును కావున గుణవిశిష్టమైన గుణి నావర్తించుటకై వేరువేరుగా శివోపాసనము విహితంబగుచున్న యది.

ఎట్లనఁగా? ''ఇంద్రాయ రాజ్ఞే పురోడాశ మేకాదశకపాల మింద్రాయాధిరాజాయేంద్రాయ స్వరాజ్ఞే" అనుచో గుణభేదముండుటఁజేసి పురోడాశమును వేరువేరుగా సమర్పింపవలెనని "నానా దేవతా పృథక్త్వాత్" అనుచో సంకర్షణ కాండమునందు చెప్పఁబడినది.

ఇవ్విధముగానే పరబ్రహ్మమొక్కటేయైనను గుణభేదమునఁజేసి ఉపాసన విధానమును వేరువేరుగా గావింపవలెనని తెలియునది. రాజదృష్టాంతమున రాజ స్వరూపమొక్కటేయైనను, స్థానగుణాదిభేదమును పాటించి భృత్యులు సేవించు విధానము ఏకరూపము కాదని గమనింపవలెను.

## లింగభూయస్త్వాధికరణము

సూ. "లింగభూయస్త్వా త్తద్ధి బలీయ స్తదపి" 3-3-43

పరవిద్యలన్నిటియందును బ్రహ్మము ఉపాస్యంబని పూర్వాధికరములవలన కనుగొంటిమి. ఐతే అట్టి బ్రహ్మమును విశేషించి నిర్ణయించుటకీ యధికరణము ప్రస్తావింపఁబడినది.

తైత్తిరీయమునందు-

"సర్వో వై రుద్ర స్తస్మై రుద్రాయ నమో అస్తు నమో అస్తు" "పురుషో వైరుద్రః సన్మహో వైరుద్రః సన్మహో నమోనమః" "విశ్వం భూతం భువనం చిత్రం బహుధా జాతం జాయమానంచయత్, సర్వో హ్యేష రుద్ర స్తస్మై రుద్రాయ నమో అస్తు"

"కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే, వోచేమ శంతమం హృదే; సర్వోహ్యేష రుద్ర స్తస్మై రుద్రాయ నమో అస్తు" "నమో హిరణ్యబాహవే హిరణ్యవర్ణాయ హిరణ్యపతయేఽంబికా పతయ ఉమాపతయే పశుపతయే నమో నమః"

ఇఁట సర్వాత్మత్వము మున్నగు లక్షణములు గలిగి ఉమాపతిగా వినఁబడు పరబ్రహ్మము ప్రకృతమైన సవితృమండలవిద్యయందు మాత్రము ఉపాస్యమా? లేక పరవిద్యలన్నిటియందా? అని సంశయము.

ప్రశ్న: సవితృమండలవిద్యా ప్రకరణమునకు ఎద్దానితోఁను బాధ లేమిం జేసి ప్రకృతమండలవిద్యయందే సర్వాత్మత్వ ఉమాపతిత్వాది లక్షణములు గలదిగా పరబ్రహ్మముపాసింపఁదగినదని నిరూపింపవలెను కాదా?

ఉత్తరము: ఉమాసహితమైన పరబ్రహ్మము పరవిద్యలన్నిటియందు నుపాసింపఁదగినదియేను, ఉపాస్యముఁదగు లింగముల (లక్షణముల)ను సమర్పించు పదములతో నుండు వాక్యములు పెక్కు శ్రుతులయందు గానఁబడుచున్నవి. ఎట్లనఁగా?

"సర్వం ఖల్విదం బ్రహ్మ, తజ్జలానితి శాంత ఉపాసీత" అను శాండిల్య

విద్యయందలి ఉపాస్యలింగమగు సర్వాత్మత్వమును "సర్వో వై రుద్రః ఇత్యాది వాక్యమునందు గాననగును.

పురుష సూక్తమునందు ఉపకోసల విద్య మున్నగు వానియందును గల ఉపాస్య లింగమును "పురుషో వై రుద్రః" ఇత్యాది వాక్యమునందు గ్రహింపనగును. ''సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్" అనుచో గల సద్విద్యోపాస్య లింగమగు సదాత్మకత్వమును "సత్" అనుచో గమనింపనగును. "మహ ఇతి తద్బ్రహ్మ, స ఆత్మా, అంగాన్యన్యా దేవతా" అను వ్యాహృతి విద్యయందు ఉపాస్యలింగముగా చెప్పఁబడిన మహస్త్వమును "మహః" అనుచో తెలియనగును. "శంతమం హృదే" అనుచో హృదయము చెప్పఁబడి నందున దహరవిద్యోపాస్యలింగమును గమనింపనగును. "హిరణ్య బాహవే'' ఇత్యాది వాక్యమునందు గల హిరణ్య రూపత్వము సవితృ మండలోపాస్య లింగమగునని గుర్తింపనగును. "ఉమాపతయే" అనునది పరవిద్యలన్నిటియందు నుపాస్యలింగంబగునది; సంసారమను రోగమును పోగొట్టువాడగుటచే పరమాత్మయగు శివుఁడు రుద్రుఁడని పేర్కొనఁబడుచున్నవాడు. ఇవ్విధము ఉమాపతియు పరబ్రహ్మంబు నగు శివుఁడు- సమస్త పరవిద్యలయందు నుపాస్యుండగునని నానా శ్రుతి వాక్యముల వలన విదితమగుచున్నయది. ప్రకరణమునకన్న వాక్యము బలీయంబని ''శ్రుతి లింగ వాక్య ప్రకరణ స్థాన- సమాఖ్యానాం సమవాయే పారదౌర్బల్య మర్థవిప్రకర్షాత్" అనుచో చెప్పఁబడినది. అందువలన ఉమాసహితంబు సంసార రుక్ ద్రావకంబు నగు పరతత్త్వమును ముముక్షువులందరును సకల పరవిద్యలయందు నుపాసింపవలెనని విశదమైనది.

"సర్వో వై రుద్రః" ఇత్యాది వాక్యములయందు గల నమః శబ్దయోగము-

''శ్రీ రుద్రాః పావనాః'' "శ్రీశైలో ముక్తిదః" ఇత్యాది ప్రయోగములయందు శ్రీశబ్దము ముఖ్యత్వమును చెప్పునట్లు పరమేశ్వరుని నమః శేషిత్వరూపమునందు గల గౌరవమును చాటునదని-దిగువ లింగపురాణ ప్రమాణము తెలిపినది.

శ్లో॥ సర్వం రుద్రేతి వై ప్రాహు-ర్మునయ స్తత్త్వదర్శినః,
నమస్కారేణ సహితం-గౌరవాత్ పరమేశితుః ॥

"కద్రుద్రాయ" మంత్రార్థము-

ప్రచేతసే = గొప్ప మనస్సు గలవాడు, "మీడుష్టమాయ = సృజించు

వారిలో శ్రేష్ఠుఁడు, అనఁగా- జీవాత్మలందరికిని తండ్రి యగునని భావము. తవ్యసే = పెంపొందువారిలో నగ్రేసరుఁడును, హృదే=హృదయములో నివసించువాడు నగు రుద్రునికొరకు శంతమం = సర్వ దుఃఖములను పోగొట్టువానిలో మేటియు సుఖమును కలుగఁజేయుటలో గొప్పదియు నగు కత్ = శ్లాఘావచనరూపమైన స్తోత్రమును, వోచేమ = పలుకుదుము.

## పూర్వ వికల్పాధికరణము

పూర్వపక్షసూత్రము.

సూ. "పూర్వవికల్పః ప్రకరణా త్స్యాత్ క్రియా,
మానసవత్" 3-3-44

పురుషునికి గల శతసంవత్సర పరిమితమైన జీవితమునందు వచ్చెడు ముప్పదియారు వేల దినములలో కలుగు మనోవృత్తి- ఒక్కొక్క- అగ్నిగా భావింపఁదగినది. అట్లే వాక్ ప్రాణ చక్షుః శ్రోత్ర కర్మ జఠరాగ్నికృత్యము లన్నియు అగ్నులుగా భావింపఁదగినవి. ఐతే ఇట్టి మనోవాక్చితాదులు విద్యాంగములా ? కర్మాంగములా ? అని సంశయము.

ప్రశ్న : క్రియామయ క్రతువుఁజెందిన ప్రకరణమునందు చెప్పఁబడుటచే ద్వాదశాహ మనఁబడు క్రతువునకు మానసగ్రహము అంగమైనట్లు మనశ్చిదాదులు కర్మాంగములుగా భావింపదగినవి గదా ?

మరియొక పూర్వపక్షసూత్రము.

సూ. "అతిదేశాచ్చ" 3-3-45

అగ్నికార్యముతో మనశ్చిదాదులకు అతిదేశంబు వినంబడుచున్నయది.

సిద్ధాంత సూత్రములు.

సూ. "విద్యైవ తు నిర్ధారణా ద్దర్శనాచ్చ" 3-3-46

మనశ్చిదాదులు విద్యామయములని చెప్పుటయే గాక విద్యాంగములగునని శ్రుతియందు నిర్ణయించినట్లు శ్రుత్యంతరమునందు గాననగును.

సూ. "శ్రుత్యాది బలీయస్త్వాచ్చ న బాధః" 3-3-47

శ్రుతి చేతను వాక్యము వలనను లింగమునను మనశ్చిదాదులు విద్యామయ క్రతువుఁజెంది యుండునవని యేర్పడుచుండుటఁజేసి శ్రుతి వాక్య లింగములకన్న దుర్బలమగు ప్రకరణము— మనశ్చిదాదులు విద్యాంగములను నంశమును బాధింపఁ జాలదు.

సూ. "అనుబంధాదిభ్యః ప్రజ్ఞాంతర పృథక్త్వవ ద్దృష్టశ్చ తదుక్తమ్" 3-3-48

క్రత్వనుబంధము తోడను శ్రుత్యాదుల వలనను మనశ్చిదాదుల నుద్దేశించి విద్యామయ క్రతువిధిని కల్పింపవలెను. దహర విద్యాదులకు క్రియామయమున కంటె పృథక్ భావము ఏర్పడినట్లు నీ విద్యామయ క్రతువునకు పృథక్ భావము సిద్ధంబగుచున్నయది. ఇట్టి విధి "యదేవ విద్యయా కరోతి" అనుచో గానంబడు చున్నయది. ''వచనాని త్వపూర్వత్వాత్'' అనునది ఇద్దానిని సమర్థించునట్టిది.

సూ. న సామాన్యా దప్యుపలబ్ధే ర్మృత్యువ న్నహి లోకాపత్తిః" 3-3-49

ఇష్టకచితాగ్ని- స్వక్రతువు ద్వారా ఎట్టి ఫలమును సమకూర్చునో అట్టి ఫలమే మనశ్చిదాదులు విద్యామయ క్రత్వంగములని భావించుటవలన నేర్పడునని చెప్పఁబడిన ఫల సామాన్యము తుల్యదేశత్వమును బోధింపదు.

మండల పురుషుఁడు మత్యువని చెప్పినంత మాత్రమున మృత్యువు నివసించు లోకమున మండల పురుషుఁడు నివసించునని భావింపరాదు.

సూ. "పరేణ చ శబ్దస్య తాద్విధ్యం భూయస్త్వా త్త్వనుబంధః" 3-3-50

మనశ్చిదాదులఁజెప్పు శబ్దమునకు విద్యామయత్వమును ప్రతిపాదించుట సరి పడునని బ్రాహ్మణమువలన తెలియుచున్నయది. క్రియాప్రకరణమునందు మనశ్చిదాదుల యనుబంధ మెందుకనఁగా? సంపాదింపఁదగిన అగ్న్యంగములనేకము లుండుటచే మనశ్చిదాదులు నగ్న్యంగములుగా భావింపఁదగినవి మాత్రము కావున మనశ్చిదాదులు విద్యాంగంబులేను;

## శరీరేభావాధికరణము

పూర్వపక్ష సూత్రము.

సూ. "ఏక ఆత్మనః శరీరే భావాత్" 3-3-51

పూర్వోక్తమైన బ్రహ్మస్వరూపానుసంధానము పరవిద్యలన్నిటియందు పొసగునా? లేదా? అని యిట సందేహింపఁబడుచున్నయది. ఇవ్విషయమై కొందరు దిగువవిధము శంకించుచున్నవారు.

ఉపాసకుఁడైన జీవుఁడు శరీరములో నుండువాడగుటచే కర్తృత్వము భోక్తృత్వము గల స్వరూపము గలిగి యుండుటఁజేసియు అట్టి తనకు నంత రాత్మగా నుండు పరమేశ్వరుని పరవిద్యలయందు త్రిలోచనత్వాది లక్షణములు గల స్వరూపము గలవానిగా ధ్యానించుట పొసగదు గదా?

సిద్ధాంతసూత్రము.

సూ. "వ్యతిరేక స్తద్భావభావిత్వా న్నతూపలబ్ధివత్" 3-3-52

కర్తృత్వ భోక్త్వత్వాది రూపము గల ఉపాసకుఁడు తన యాత్మగా పరమాత్మ నుపాసింపవలెనని కాదు. కాని సాంసారిక స్వభావము నుండి విడిబడిన జీవాత్మ యందుగల అపహత పాప్మత్వాది గుణరూపమైన వ్యతిరేకము భావింపఁదగినది. అట్లు భావించిననే గాని నిజరూపము ఉపలభ్యమానము కాజాలదు.

యథార్థమైన స్వరూపము గల బ్రహ్మము నుపాసించినయెడల నవ్వారికి బ్రహ్మప్రాప్తి యెట్లగునో అట్లే జీవాత్మ- అపహత పాప్మత్వాది విశిష్టతను భావించు నెడల నిజమైన పూర్వరూపమును పొందువాడగునని తెలియునది.

"యథాక్రతు రస్మింల్లోకే పురుషః" అను శ్రుతి ప్రమాణము ఇందుకు ప్రోద్బలకమగును.

ఇందువలన విశదమైనదేమనఁగా? సంసార ధర్మములగు జరామరణాదులు లేనట్టి నిజరూపమును జీవాత్మ-భావింపవలసిన వాడనియు, పరమాత్మను

స్వాంతర్యామిగాను త్రిలోచనత్వాది లక్షణములతో కూడిన స్వరూపము గలవాని గాను ముముక్షువు భావించుటలో ఎట్టి విరోధము లేదనియు సారాంశము.

## అంగావబద్ధాధికరణము

సూ. "అంగావబద్ధాస్తు న శాఖాసు, హి ప్రతి వేదమ్" 3-3-53

బ్రహ్మోపాసనాంగములుగా కొన్నివేదశాఖలయందు వినఁబడు విధానములు-ఉపాసనలన్నిటియందు పరిగ్రాహ్యములగునా? కావా? అని సంశయము.

ప్రశ్న : "ఆత్మాన మరణిం కృత్వా-ప్రణవం చోత్తరారణిమ్, ధ్యాన నిర్మథనాదేవ-పాశం దహతి పండితః" "జిజ్ఞాసువగు ఉపాసకుఁడు-తనను (స్వహృదయమును) క్రింది అరణి గాను ప్రణవము (ఓంకారము)ను పైయరణిగా నమర్చి ధ్యానమనఁబడు మథనము నొనర్చునెడల సంసారపాశమును కాల్చఁజాలును" అని - కైవల్యోపనిషత్తున దహరోపాసనయందు ప్రణవాభ్యాసము వినంబడుచున్నయది

"అగ్ని" రిత్యాదినా భస్మ గృహీత్వా విమృజ్యాంగాని సంస్పృశేత్" "తస్మాద్వ్రతమేతత్ పాశుపతం పశుపాశవిమోక్షాయ" "ఇషమూర్ధ్వం తపసా నియచ్ఛేత"

"అగ్నిరితి భస్మ" మున్నగు మంత్రములతో శుద్ధమైన విభూతిని పరిగ్రహించి పరిశుభ్రజలమునఁదడిపియు విహితములగు శరీరావయవములయందు దాల్పవలెను"

"ఇద్ది పాశుపతవ్రతమనంబడును. ఇద్దానినాచరించుటఁజేసి పశువు(సంసారి జీవుఁడు) పాశము (సంసారబంధము) నుండి విడిబడును"

"ముముక్షువు శాంభవదీక్షా విధానమున సూక్ష్మశివలింగము నిష్ఠముగ భావించి హృదయాది (ప్రశంసనీయ) స్థలమునందు ధరింపవలెను" అను నంశములు అధర్వ శిరమునందు పాశుపత విద్యయందును గానంబడుచున్నవి.

మఱియు

''రుద్రాక్షాన్ శ్వేతానేవ బిభృయాత్'' ''స్వచ్ఛములైన రుద్రాక్షములను కంఠాది స్థానములయందు భక్తుఁడు ధరింపవలెను'' అని - రుద్రాక్షధారణము రుద్రాక్షజాబాలోపనిషత్తు నందు సముల్లేఖింపఁబడినది.

కాలాగ్నిరుద్రోపనిషత్తున "తిర్యక్ తిస్రో రేఖాః ప్రకుర్వీత'' అనుచో భస్మత్రి పుండ్రధారణమును గాననగును.

ఇంతియే గాక మహాలింగజాబాలమునందు-

"వేదా మను క్రియా దీక్షాభిః కారణాదితనుత్రయే భావప్రాణేష్టాఖ్య మహాలింగత్రయం బిభృయాత్''

"శాంభవదీక్ష-వేధాదీక్షయనియు మనుదీక్షయనియు క్రియాదీక్షయనియు ముత్త్విధము; తనువు-కారణ సూక్ష్మ స్థూల సంజ్ఞలతో త్రివిధము ; మహాలింగము-భావలింగమనియు ప్రాణలింగమనియు ఇష్టలింగమనియు మూడుతెఱగులు గలిగి యుండును. సాధకుఁడు ఇట్టి దీక్షాత్రయముతో కారణాది శరీరత్రయము నందు మహాలింగత్రయమును ధరింపవలె నని కలదు. ఏవంసతి భస్మరుద్రాక్ష మంత్ర లింగధారణములకు మహాఫలము-శివసాయుజ్యంబని విశదీకరింపఁబడుట చేత నీ శాంభవదీక్ష-పరవిద్యాంగమని బోధపడుచున్నయది.

ఐతే ఇట్లు విద్యాంగములుగా వినంబడునవి ఏయే శాఖలయందు కలవో ఆయా శాఖలయందు మాత్రము ఆచరింపదగినవి కాని శాఖలయందన్నిటిని ఉపాసకులు అవలంబింపఁదగినవి కాజాలవు. ఎందుకనఁగా? సన్నిధి ప్రకరణము అనువాని కతన సమస్త వేదశాఖలయందు భస్మధారణాదులు ఉపయోగింపఁదగినవి కావని చెప్పవలెను గాదా ?

ఉత్తరము : సావధానముగా వినుము! ''ఉపాసనాంగములైన భస్మరుద్రాక్ష ఇష్టలింగ ధారణాదులు ఏ శాఖలయందు వినంబడుచున్నవో ఆ శాఖలయందే ఆచరింపదగినవి" అను నియమము లేదు. ఐతే ప్రతివేదమునందుగల అన్నిశాఖలయందును బ్రహ్మోపాసకులందరును భస్మరుద్రాక్ష మహాలింగధారణాదులను తప్పక నాచరింపవలసియుండును. ఇవ్విషయమును శ్రుతి నొక్కి చెప్పుచున్నందున సన్నిధికి గాని ప్రకరణమునకు గాని ప్రాబల్యము లేదని తెలియవలెను.

ఇందుకు మరికొన్ని ముఖ్యప్రమాణములు :-

"వ్రత మేత చ్ఛాంభవం, తత్సమాచరే న్ముముక్షు రపునర్భవాయ" "ఏతత్త్రిపుండ్రం భస్మనా కరోతి, యో విద్వాన్ బ్రహ్మచారీ గృహీ వానప్రస్థో యతిర్వా, స సమస్త పాతకోపపాతకేభ్యః పూతో భవతి" "దేహం త్యక్త్వా శివ సాయుజ్య మాప్నోతి, న స పునరావర్తతే" "ఈ శాంభవ వ్రతమును ముముక్షువు జన్మరాహిత్యము కొరకు నవలంబింపవలెను"

"బ్రహ్మచారి గాని, గృహస్థుడు గాని, వానప్రస్థుడు గాని, సన్న్యాసి గాని భస్మతో త్రిపుండ్రముల (మూడురేఖల)ను ధరించునెడల మహాపాతకములనుండి ఉపపాతకములనుండియు విడిబడుటయేగాక ప్రారబ్ధము ముగియువరకు సుఖముగా జీవించి దేహాంతమునందు శివసాయుజ్యమును పొందువాడగును. వెండియు నీ మర్త్యలోకమునకు వచ్చువాడు కాడు. అనగా- పరమదివ్యపదమున ప్రకాశించువాడై శివానంధరసాస్వాదపరుడై యుండునని భావము".

సూ. "మంత్రాదివద్వాఽవిరోధః" 3-3-54

క్రత్వంగములైన మంత్రములు ఒక్కొక శాఖయందు చెప్పఁబడినను సర్వశాఖాగతములగు క్రతువులందెట్లు పరిగ్రహింపఁబడుచున్నవో అట్లు భస్మ రుద్రాక్షలింగధారణాది విద్యాంగములు సమస్తవేదశాఖలయందు నుపాసకులందరు నవలంబింపఁదగినవి యనుటలో విరోధమెద్దియు లేదని సారాంశము.

## క్రతువజ్జ్యాయస్త్వాధికరణము

సూ. "భూమ్నః క్రతువజ్జ్యాయస్త్వం తథా హి దర్శయతి" 3-3-55

వైశ్వానరవిద్యయందలి యుపాసనము ఒకానొక భాగముగనా? సమస్తముగనా? అని యిట సందేహింపఁబడుచున్నయది

ప్రశ్న : వైశ్వానరవిద్యయందు ద్యులోకనము సూర్యుడు వాయువు ఆకాశము ఉదకము పృథివి యనునవి- వైశ్వానరునకు శిరస్సు, నేత్రము, ప్రాణము, మధ్యశరీరము, మూత్రస్థానము, పాదములు అనువానిగా భావించి

ధ్యానింపవలెనని చెప్పఁబడినది. మరియు పై యంగములలో నొక్కొకదానిని భావింపవలెననియు "అత్యన్నం పశ్యతి ప్రియం భవత్యస్య బ్రహ్మవర్చసం కులే, య ఏతమేవ మాత్మానం వైశ్వానర ముపాస్తే" "వైశ్వానరుని ఆత్మగా నుపాసించువాడు ప్రియమైన ఆహారము నధికముగా పొందును. మఱియు నీతని వంశమున బ్రహ్మవర్చస్సు కలిగినవారు జన్మింతురు" ఇట్లు వేరువేరుగా దివాదివర్యాయగతంబులగు వాక్యములయందు ఫలనిర్దేశ పురస్సరముగా వక్కాణింపఁబడినది.

ఇవ్విధము నిట నుపాసనఁజెప్పు వాక్యము, ఫలమును నిరూపించు వాక్యంబు ప్రత్యేకముగా గానంబడుచున్నందున అంశోపాసనమే విహితంబని తోచెడిని.

ఉత్తరము: వైశ్వానరుని సమస్తముగా నుపాసించుటయే సమంజసమగును. ఎట్లనఁగా? వైశ్వానరుని త్రైలోక్యశరీరుడైన పరమాత్మగా భావింపవలెననియు ఇట్టి వైశ్వానరునకు స్వర్గలోకము మొదలుకొని పృథివివరకు గలవానిని శిరస్సు మొదలుకొని పాదములవరకు గల అవయవములుగా నిరూపించి "యస్త్వేత మేవం ప్రాదేశమాత్ర మభివిమాన మాత్మానం వైశ్వానర ముపాస్తే స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మస్వన్న మత్తి" "ప్రాదేశమాత్రుడైన వైశ్వానరుని ఎట్టి పరిమాణములేని పరమాత్మగా ధ్యానించు నుపాసకుఁడు లోకములన్నిటియందు ప్రాణులందరియందును సమస్తజీవాత్మలయందు ననుభవింపఁబడు అహారము నాస్వాదించును" అనుచో వైశ్వానరుని సమస్తస్వరూపునిగా భావించువానికి బ్రహ్మానుభవము ఫలముగా నిర్దేశింపఁబడినది. ఐతే నిట శిరస్సుమొదలగు నవయవములను ప్రత్యేకముగా నుపాసించుటకన్న సమస్తస్వరూపము నుపాసించుటయే శ్రేష్ఠంబని యీ సందర్భమున చెప్పఁబడిన బ్రహ్మానుభవఫలముఁబట్టి తెలియనగును.

"పుత్రుఁడు కలుగగా ద్వాదశకపాలమనఁబడు వైశ్వానరయాగమును చేయవలెను" "అష్టాకపాలమనఁ బడు యజ్ఞము- కర్తను బ్రహ్మవర్చస్సుతో ధన్యుని గావించును" అనుచో చెప్పఁబడిన అష్టాకపాలాదికము తత్ఫలమున్ను వివక్షితము కానట్లు నిట నవయవోపాసనము ఫలకీర్తనంబు నవక్షితంబులని తెలియవలెను.

ఇవ్విషయమున శ్రుతియందు దిగువ విధము గాననగును.

"ఔపమన్యవ? కం త్వ మాత్మాన ముపాస్సే"

"ప్రాచీనయోగ్య? కం త్వ మాత్మాన ముపాస్సే"

"ఔపమన్యుడా? నీవు ఎట్టి పరమాత్మ నుపాసించుచున్నావు"? "ప్రాచీన యోగ్యుడా? నీవు పరమాత్మ నెట్టివానిగా భావించుచున్నావు? ఇత్యాదిప్రశ్నల పిదప "దివమేవ భగవో రాజన్" ''స్వర్గమునే పరమాత్మగా నుపాసించు చున్నాను" "ఆదిత్యమేవ భగవో రాజన్'' సూర్యునే పరమాత్మగా భావించు చున్నాను" ఇత్యాది సమాధానములతో అవయవోపాసనము చెప్పఁబడినను "అత్త్యన్నం పశ్యతి ప్రియం'' ఇత్యాదిని ఫలనిర్దేశంబు చేయఁబడినను ''మూర్ధా తే వ్యపతిష్య ద్యన్మాం నాగమిష్యః'' "నన్ను గురించి రాకుండినచో నీ శిరస్సు పడిపోయెడిది" ఇత్యాది రాజవచనముల వలన అవయవోపాసనము అనర్థకరంబని శ్రుతి నిరూపించినది కావున వైశ్వానరుని సమస్తస్వరూపుడైన పరమాత్మగా నుపాసించుటయే శ్రేయస్కరంబనియు వైశ్వానరశబ్దవాచ్యుండు పరమాత్మ యగు సదాశివుండేయగుననియు ఫలితార్థమును గ్రహింపవలెను.

## నానాశబ్దాద్యధికరణము

సూ. "నానా శబ్దాది భేదాత్" 3-3-56

సద్విద్యయనియు, దహరవిద్యయనియు, శాండిల్యవిద్యయనియు ఇత్యాది విద్యాభేదములు కలవు. ఇట్టి విద్యలన్నిటి నొకచోట చేర్చి పరమేశ్వరు నుపాసించుటయా? లేక వేరువేరుగనా? అని సందేహము.

ప్రశ్న : విద్యలనేకములు నానావిధశాఖలయందున్నను ఉపాసింపఁదగిన బ్రహ్మము ఒక్కటే యగుటఁజేసి విద్యలన్నిటి నొకచో చేర్చి బ్రహ్మము నుపాసించుట సముచితము కాదా?

ఉత్తరము : బ్రహ్మవిద్యలు అనంతశ్రుతులయందు దెలుపఁబడుచు నసంఖ్యాతములుగా నుండుటచే వీని నన్నిటి నొకచో చేర్చి యుపాసించుట సముచితము కాజాలదు. బ్రహ్మముఁదగు స్వరూపము ఒక్కటే యైనను బ్రహ్మమునకు

గల గుణములు ఒక్కొక విద్యయందు భిన్నములుగా చెప్పఁబడుటచే విద్యాభేదమును పాటింపవలసియుండును. గుణభేదములేని విద్యయందు స్థానాదిభేదమైనను గమనింపఁదగినది.

ఇంద్రునకు రాజాదిగుణభేదమును పురస్కరించుకొని పురోడాశము నిచ్చుటలో ఏర్పడు భేదము వలెను గార్హపత్యము మున్నగు స్థానముఁదగు భేదమున నగ్నికి చేయఁబడు నుపచారములఁదగు భేదమువలెను విద్యాభేదము ఉపపన్నంబగునది. కావున శబ్దాద్యనుబంధముల భేదము వలన విద్యలు నానావిధంబులగుననియు ఏకీకృత్య యుపాసనము కూడదనియు సారాంశము.

## వికల్పాధికరణము

సూ. "వికల్పోఽవిశిష్టఫలత్వాత్" 3-3-57

ఇట్లు విద్యలు నానావిధంబులని పూర్వాధికరణమునందు నిరూపింపఁబడినది. ఐతే ఉపాసకుఁడు వికల్పముగా విద్యలను పరిగ్రహింపవలెనా? లేక సముచ్చయముగనా? అని సందేహము.

ప్రశ్న: దహరవిద్య సద్విద్య మున్నగువానిని సముచ్చయముగా ననుష్ఠించుటలో ఆచరణబాహుళ్యముండుటచే విశేషఫలము సమకూరును. వికల్పమును అనఁగా ఏదేనొక విద్య ననుష్ఠింపవలెనని నియామక మేమియు లేదు గదా?

ఉత్తరము: ఒక్క ఉపాసకుని విషయమై పరవిద్యలన్నిటియందు వికల్పమునే చెప్పవలెను. ఎందువలన ననఁగా? బ్రహ్మసాక్షాత్కారమునకు ఫలంబగు నిరతిశయబ్రహ్మానందానుభవము ఏకరూపమైనదియేను ఇంతియే గాక ఒకే యుపాసనతో ప్రయోజనము సిద్ధించుచుండగా ఇతర ప్రయోజనములతో నవసరము లేదుగదా! మరియు నొకే యుపాసనమున ధ్యేయముతో తాదాత్మ్యమును పొందువాడగుటచే నిరతిశయంబగు బ్రహ్మభావనతో బ్రహ్మస్వరూప సాక్షాత్కారమును సిద్ధింపజేసికొనువాడగును. ఇట్టి సౌకర్యముండగా ఒక విద్యను విడనాడి

మరియొక విద్యనవలంబించిన యెడల చిత్తవిక్షేపము కలుగును, కావున వికల్పమే అభ్యర్థితంబని సారాంశము.

## యథాకామాధికరణము

సూ. "కామ్యాస్తు యథాకామం సముచ్చీయేర
న్నవా పూర్వహేత్వభావాత్" 3-3-58

బ్రహ్మసాక్షాత్కారమునకన్న వేరైన ఫలము గల విద్యలకు పూర్వాధికరణన్యాయము ననుసరించి వికల్పమా? సముచ్చయమా? అను సందేహమును పురస్కరించుకొని వికల్పమే విహితంబని కలుగు అశంకకు సమాధాన మేమనఁగా?

బ్రహ్మవిద్యలకు కామ్యవిద్యలకును వైషమ్యము కలదు. "దేవో భూత్వా దేవా నప్యేతి" ఇత్యాదివి ఉపాసకుఁడు జీవించియుండగానే భావనాతిశయమునఁ జేసి శివభావసాక్షాత్కారము కలవాడగునని అహంగ్రహము గల పరవిద్యలన్నిటియందు బోధపడుచున్నయది. ఇట్లుగాక కామ్యోపాసనలయందు అభీష్టదైవము సాక్షాత్కరించుననుటకు ఎట్టి ప్రమాణము గానరాదు, అట్టి సాక్షాత్కారఫలము లేదు కావునను ఆ యా స్థలములయందు భోగవిశేషములు అపేక్షితములు కావునను కామ్యోపాసనలకు సముచ్చయమునే అంగీకరింపవలెను. పరవిద్యలలో బ్రహ్మసాక్షాత్కారఫలము ఏకమగునట్లు కామ్యవిద్యలయందు ఫలైక్యము లేదు కావున సాధకుడు కామ్యవిద్యలలో నొకదానిని గాని అనేకములను గాని యవలంబించి యనుష్ఠింపవలసియుండునని సిద్ధాంతము.

## యథాశ్రయాధికరణము

పూర్వపక్షసూత్రములు

సూ. "అంగేషు యథాఽఽశ్రయభావః" 3-3-59

ఉద్గీథము మొదలగు నుపాసనలు క్రత్వంగములా? స్వతంత్రములా? అని సందేహము ఇట పొడముచున్నయది.

ప్రశ్న : ఉద్గీథాది అంగములయందు వినంబడు ఉపాసనములు ఉద్గీథాదులవలె క్రత్వంగములే యగును. గోదోహనము మొదలగువానికి వలె స్వవాక్యమునందు ఫలము చెప్పఁబడనందున పై యుపాసనలన్నియు క్రత్వంగములు కాదగునని తోచెడిని.

సూ. "శిష్టేశ్చ" 3-3-60

"ఉద్గీథ ముపాసీత" అనుచో విధి యుండుటయు "యదేవ విద్యయా కరోతి" అనుచో ఉద్గీథాద్యంగోపాసనల విషయమై విధి లేకుండుటయు ఈ సందర్భమున క్రత్వంగభావమునకై ప్రబలహేతువులని తెలియవలెను.

సూ. "సమాహారాత్" 3-3-61

ఉద్గీథాద్యుపాసనలయందు అంగములగువాని సమాహారమును చేయవలెనని చెప్పఁబడినందున క్రత్వంగభావమే విహితంబగును.

సూ. "గుణసాధారణ్యశ్రుతేశ్చ" 3-3-62

ప్రణవమునకు గుణముగా నుపాసనము విహితంబగుటచే ఉద్గీథాద్యంగోపాసనములు క్రత్వంగములే యగును.

సిద్ధాంతసూత్రములు

సూ. "న వా తత్సహభావాశ్రుతేః" 3-3-63

ఉద్గీథాద్యుపాసనములకు సహభావము అనఁగా అంగత్వము వినంబడుట లేదు. మరియు "యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరమ్" అనుచో రెండవ ఫలమునకు సాధనములుగా వినంబడు ఉపాసనములు అంగములు కాజాలవు.

"ఉద్గీథ ముపాసీత" అనుచో ఉద్గీథమును మాత్రము విధించుటఁజేసి యవ్వానికి క్రత్వంగభావము లేదని భావము.

సూ. "దర్శనాచ్చ" 3-3-64

బ్రహ్మమును తెలియుటవలన సర్వరక్షణంబగునని చెప్పు శ్రుతియే ఉద్గాత మొదలగువారిని తెలియుట నియమబద్ధము కానందున అంగము కాదని

చూపెట్టుచున్నది కావున పూర్వోక్త ఉపాసనములన్నియు క్రత్వంగములగు నను టకు ఎట్టి నియమము లేదని సిద్ధాంతము.

ఇయ్యది
శ్రీ నీలకంఠ శివాచార్య విరచితంబైన
బ్రహ్మమీమాంసాసూత్ర భాష్యమునందు
మూడవ యధ్యాయముఁదగు మూడవ పాదము
శ్రీకంఠమణి ప్రభామయూఖంబను శాంకరీయ ఆంధ్రానువాదముతో
ముగిసినది.

---

అష్టోత్తరశత (108) శివనామార్థము అను

## శివతత్త్వ రహస్యము

నూటనెనిమిది శివనామములకు విశదార్థము, ముఖ్య నామదేయములకు కథలు, ప్రమాణములు వ్రాయబడినవి. ఋషి, ఛందస్సు, దేవత ఇత్యాదులు చేర్పఁబడినవి. ఇందు శ్రీ శాస్త్రిగారి ఏకైకపుత్రికయగు సర్వమంగళయొక్క జీవిత సంగ్రహము, స్వప్నవృత్తాంతంబు కలవు. కొద్ది ప్రతులు మాత్రము మిగిలినవి. వెల పది (10) రూ॥లు మాత్రము వలయువారు త్వరపడుడు! ఆలసించిన ఆశాభంగము.

మూలము– బ్ర॥ శ్రీ॥ నీలకంఠదీక్షితులు
అనువాదము, సంకలనము, ప్రకాశనము
**ఆచార్య శివశ్రీ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు**

ప్రాప్తిస్థానము- శివాద్వైత విజ్ఞాన సదనము,
184/ఎ, రోడ్ నెం॥ 6, వెస్ట్‌మారేడుపల్లి,
సికిందరాబాద్-500 026, (ఆం.ప్ర.)

శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య కృత
# శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము
## తృతీయాధ్యాయము
### చతుర్థపాదము
### ఆంధ్రీకరణము
### పురుషార్థాధికరణము

సిద్ధాంతసూత్రము

సూ. "పురుషార్థోఽతః శబ్దా దితి బాదరాయణః" 3-4-1

ఇద్దానికి పూర్వమగు తృతీయపాదమునందు బ్రహ్మవిద్యలందగు విచారము నిరూపింపబడినది. ఈ నాలుగవ పాదమునందైతేనో పరవిద్యలకు సహకరించు ఆశ్రమధర్మాదులను ప్రతిపాదించుటతో విద్య (ఉపాసన) వలననే మోక్షమనబడు పురుషార్థము లభించునని చూపెట్టుచున్నవారు.

అతః = విద్యవలననే పురుషార్థము సంభవించునని "బ్రహ్మవిదాప్నోతి పరమ్" "జ్ఞాత్వా శివం శాంతి మత్యంత మేతి" ఇత్యాది శబ్దప్రమాణము వలననే నిర్ధారింపవచ్చునని పూజ్యుడైన బాదరాయణుడు (వ్యాసుడు) భావించుచున్నవాడు.

ఐనచో నియ్యది సంభవించునా? లేదా? అని సంశయము.

పూర్వపక్షసూత్రములు

సూ. "శేషత్వాత్ పురుషార్థవాదో యథాఽన్యే ష్వితి
జైమినిః" 3-4-2

ప్రశ్న : విద్యవలన పురుషార్థము సంభవింపదు. ఎందుకనఁగా? "తత్త్వమసి" ఇత్యాదిని గల సామానాధికరణ్యమున కర్మలయందు కర్తయే బ్రహ్మముగ భావింపఁబడుచున్నవాడు. మఱియు బ్రహ్మోపాసనము కర్మసంస్కారముగా కర్మశేషమగునది. బ్రహ్మోపాసనమునకు చెప్పఁబడిన ఫలశ్రుతియైతేనో "ద్రవ్య సంస్కారకర్మసు పరార్థత్వాత్ఫలశ్రుతి రర్థవాదః స్యాత్" అను జైమిని సూత్రము ననుసరించి యర్థవాదంబే యగునది. కావున విద్యవలన పురుషార్థము లభింపదని జైమినిమహర్షిగారి యభిమతమని తెలియునది.

సూ. "ఆచారదర్శనాత్" 3-4-3

ఇవ్విషయమున శ్రుతియందు ఆచారమును గాననగును. బ్రహ్మవిదుడగు కేకయుఁడను అశ్వపతి మహారాజు యజ్ఞమును చేయుచు నేను భగవంతుదనని భావించెనని "యక్ష్యమాణో హ వై భగవంతోఽహ మస్మి" అను వాక్యమునందు కలదు గావున బ్రహ్మోపాసకులగు కేకయుఁడు మున్నగువారికిని కర్మయే ముఖ్యంబని బోధపడుచుండుటఁజేసియు విద్య కర్మాంగంబేను.

సూ. "తచ్ఛ్రుతేః" 3-4-4

"యదేవ విద్యయా కరోతి" అను శ్రుతివాక్యమే కర్మలయందు విద్యనుపయోగింపవలెనని చెప్పుచుండుటవలనను విద్య కర్మాంగంబగునది. ఏ కర్మను చేయుచున్నవాడో ఆ కర్మను విద్యతో గూడ గావింపవలెనని శ్రుతికి అర్థముఁ జెప్పవలెను.

సూ. "సమన్వారంభణాత్" 3-4-5

"తం విద్యాకర్మణీ సమన్వారభేతే" అనుచో నొక్కపురుషుని యందు విద్యాకర్మల సాహిత్యము కనంబడుచున్నది కావునను కర్మాంగము విద్యయని గమనింపవలెను.

సూ. "తద్వతో విధానాత్" 3-4-6

"ఆచార్యకులా ద్వేద మధీత్య యథావిధానం గురోః కర్మాతిశేషేణాభి సమావృత్య కుటుంబే శుచౌ దేశే స్వాధ్యాయ మధీయానో ధార్మికాన్ విదధత్"

"ఆచార్యుని చెంత వేదము నభ్యసించి గురువుగారిని శుశ్రూషచే సంతృప్తి పఱచియు గృహస్థుడై పవిత్రప్రదేశమున నివసించుచు వేదాధ్యయనముఁ జేయుచు వేదార్థమగు ధర్మము నాచరించుచుండవలెను"

అనుచో అర్థజ్ఞానము కలుగువరకు వేదము నభ్యసించిన వానికి కర్మ విధింపఁబడుచున్నందునను జ్ఞానము (విద్య) కర్మాంగంబగునదియేను;

సూ. "నియమాత్" 3-4-7

"కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతగ్ం సమాః" అను శ్రుతి వాక్యమునందు- శివు నుపాసించువాడు జీవితకాలమంతయు కర్మలనే చేయుచుండ వలెనను నియమంబును గాననగును.

ఇందువలన తేటపడుచున్నదేమనఁగా? విద్య (శివోపాసన) సర్వవిధ కర్మకు అంగమగుననియు కేవల విద్యవలన మోక్షమను మహాపురుషార్థము సంభవింపదని యంగీకరింపవలెను గదా?

ఇక సిద్ధాంత సూత్రములయందు సమాధానము చెప్పఁబడుచున్నయది.

సూ. అధికోపదేశాత్తు బాదరాయణస్యైవం
తద్దర్శనాత్" 3-4-8

విద్య- కర్మాంగము కాజాలదు. కాని విద్యవలననే మోక్షపురుషార్థంబను బాదరాయణుని మతమే సమంజసంబైనది. ఎందుకనఁగా? కర్తయగు ప్రత్యగాత్మకంటె వేరైన బ్రహ్మమే వేద్య (ఉపాసనీయ ముగా నుపదేశింపఁబడుచున్నయది. ఎట్లనఁగా? "బహు స్యాం ప్రజాయేయ" "స కారణం కరణాధిపాధిపః" "విశ్వాధికో రుద్రో మహర్షిః" ఇత్యాది శ్రుతివాక్యములయందు జీవునికంటె భిన్నంబగు బ్రహ్మము వేద్యముగా నధికముగాను వినంబడుచున్నయది. కావున విద్య కర్మశేషము కాజాలదు. కర్మ ప్రధానమను నంశమును గురించి శ్రుతులయందు ఆచారము కలదను నాశంకకు సమాధానమీ దిగువ సూత్రము.

సూ. "తుల్యం తు దర్శనమ్" 3-4-9

విద్యయే ప్రధానమను నంశమును గురించియు శ్రుతులయందు ఆచారమును గాననగును. కావున కేవలము కర్మయే ముఖ్యమైనదనుట సరి కాదు.

ఎట్లనఁగా ? "ఏతద్ధస్మ వై తదిద్వాంస ఆహు ఋషయః కావషేయాః, కిమర్థా వయ మధ్యేష్యామహే, కిమర్థా వయం యక్ష్యామహే, కిం ప్రజయా కరిష్యామః"

"బ్రహ్మోపాసకులైన కావషేయ ఋషులు - ఎందుకు మేము వేదాధ్యయనముఁ జేయవలెను ? ఎందుకు మేము యజ్ఞములను గావింపవలెను ? సంతానాదికముతో నెద్ది సాధింతుము ?"

ఇత్యాది శ్రుతులయందు బ్రహ్మవిదులు కర్మను విడనాడినట్లు గాననగును. ఐతే ఈ సందర్భమున గమనింపవలసినదేమనఁగా ? ఫలాభిసంధి లేనట్టి కర్మయే ఆచరింపఁదగినదనియు ఫలాభిసంధి కలిగినట్టి కర్మ విడువఁదగినదనియు చెప్పుటలో విరోధ మేమియు లేదు కావున కర్మయే విద్యాంగమగుటంజేసియు విద్య- ప్రధానంబైనదియేను;

"యదేవ విద్యయా" అను శ్రుతి వాక్యమునందు చెప్పఁబడిన కర్మ ప్రాధాన్యమును గురించి దిగువ సూత్రమునందు సమాధానమును గాననగును.

3-4-10

సూ. "అసార్వత్రికీ"

"యదేవ విద్యయా కరోతి" అనుచో చెప్పఁబడిన విద్య - ప్రత్యేకమైనది. అనఁగా నాకానాక సందర్భమున ప్రసిద్ధమగు ఉద్గీథ విద్యయని తెలియవలెను. "యదేవ విద్యయా కరోతి తదేవ వీర్య వత్తరమ్" అనుచో ప్రకృతమైన ఉద్గీథ విద్యతో కూడిన కర్మము మిక్కిలి సమర్థంబగునని విధింపఁబడినది కావున విద్య కర్మాంగంబగునని చెప్పుట విహితము కాజాలదు.

"తం విద్యాకర్మణీ" అనుచో గల విద్యా కర్మ సాహిత్యమును గురించి సమాధానమీ దిగువ సూత్రము.

3-4-11

సూ. "విభాగః శతవత్"

"తం విద్యా కర్మణీ సమన్వారభేతే" అనుచో చెప్పఁబడిన విద్యా కర్మలు వేరు వేరు ఫలములు గలవని బోధపడుచున్నందున విద్య- స్వఫలమును, కర్మ— స్వఫలమును కలుగఁజేయునని విభాగము నంగీకరింపవలెను. ఎట్లనఁగా? లోకమున క్షేత్రరత్న విక్రయముతో రెండు వందలు లభించినవనుట యందు క్షేత్ర విక్రయ

మున వంద యనియు రత్న విక్రయమున శతంబనియు విభాగము విహితంబై నట్లు గానవగును.

సూ. "అధ్యయన మాత్రవతః" 3-4-12

"వేద మధీత్య" అనుచో వేదాధ్యయనమును మాత్రము చేసిన వానికే కర్మ విధింపఁబడుటచే విద్య కర్మాంగము కాజాలదు. అధ్యయన విధి యైతేనో అక్షరములను గ్రహించుటయందే పర్యవసానముఁ బెందునది. వేదాధ్యయనము అర్థజ్ఞానము కొరకు విహితంబను పక్షమునను విద్య- వేదార్థ జ్ఞానమునకన్న భిన్నంబే యగును. "ఉపాసీత" ఇత్యాదిని విధింపఁబడిన విద్య - మనోవృత్తిఁదగు అవర్తనమే స్వరూపముగా గలది యగును. ఇందువలన విద్య (ఉపాసన)కు ఏ సందర్భమునను విశేషణ భావము (అంగత్వము) లేదని విశదమైనది.

సూ. "నావిశేషాత్" 3-4-13

"కుర్వ న్నేవేహ కర్మాణి" అనుచో నుపాసకుని జీవితమున్నంత వరకు స్వతంత్రములైన కర్మలు ఆచరణీయంబులని చెప్పుటకు విశేషకారణ మెద్దియు గానరాదు. "ఈశావాస్య మిదం సర్వమ్" అనునది విద్యాప్రకరణంబగు కతన కర్మయంతయు విద్యాంగంబగును కావున కర్మాంగము విద్య కాజాలదని సిద్ధాంతము.

సూ. "స్తుతయేఽనుమతి ర్వా" 3-4-14

ఎల్లకాలము కర్మలఁజేయుచున్నను విద్యామహిమ వలన కర్మలతో బద్ధుఁడు కాజాలడని "న కర్మణా లిప్యతే నరః" అను వాక్యశేషమువలన తెలియుచున్నది కావున విద్యయే ప్రధానంబైనదని సారాంశము.

సూ. "కామకారేణ చైకే" 3-4-15

"కిం ప్రజయా కరిష్యామః" ఇత్యాదిని గృహస్థ ధర్మము విద్వాంసునకు స్వేచ్ఛగా పరిత్యాజ్యంబని కొందరు వాక్రుచ్చిరి. ఇందువలనను విద్య ప్రధానంబే యని గుర్తింపవలెను.

సూ. "ఉపమర్దం చ" 3-4-16

"క్షీయంతే చాస్య కర్మాణి, తస్మిన్ దృష్టే పరావరే" అనుచో విద్యవలన కర్మలన్నియు క్షీణించునని కొందరు భావించుచున్నవారు కావున కర్మప్రాధాన్యము అంగీకార్యము కాజాలదు.

సూ. ''ఊర్ధ్వరేతస్సు చ శబ్దే హి'' 3-4-17

ఆశ్రమముల యందు గల జితేంద్రియులలో విద్య కనంబడుట చేతను వారికి అగ్నిహోత్రము మొదలగు కర్మలు సంభవింపకుండుటఁ జేసియు విద్య-కర్మాంగము కాజాలదు.

మఱియు "త్రయో ధర్మస్కంధాః" అను వాక్యము- బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ ఆశ్రమములు మాత్రము ధర్మసాధనములగునని తెలుపుచున్నది కావున విద్యయే ప్రధానంబై మోక్ష పురుషార్థ హేతు వగుననియు, ఇట్టి విద్య (శివోపాసన)కు ఫలాపేక్ష లేనట్టి విహిత కర్మము అంగముగా ఆవశ్యకంబైనదనియు ఫలితార్థము.

## పరామర్శాధికరణము

పూర్వపక్షసూత్రము.

సూ. ''పరామర్శం జైమిని రచోదనా చ్చాపవదతి హి''
3-4-18

పూర్వాధికరణము నందు "త్రయో ధర్మస్కంధాః"అను ప్రమాణము ననుసరించి బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థాశ్రమములు ధర్మాధారములని చెప్పఁబడినది కావుననే ఈ సందర్భమున చతుర్థాశ్రమ ధర్మము కలదా ? లేదా? అను సంశయము కలుగుచున్నయది.

ప్రశ్న : "త్రయో ధర్మస్కంధాః" ఇత్యాదిని చతుర్థాశ్రమము చెప్పఁబడనందున "ఏ తమేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛంతః ప్రవ్రజంతి" "శివ లోకమును కోరువారు సన్యసింతురు" ఇత్యాదిని చతుర్థాశ్రమమును నిరూపించుట. ఉపాసనస్తుతి రూపమైన అర్థవాదంబని జైమిని మహర్షి భావించెను. మఱియు "వీరహా వా ఏష దేవానాం, యోఽగ్ని ముద్వాసయతే" "అగ్ని నుద్వాసనఁజేయువాడు దేవతల

యభిమతమున వీర హత్యాపాతకము నొనర్చినవాడగును" అను శ్రుతి వాక్యము- అగ్న్యుద్వాసన గల సన్న్యాసమును నిందించుచున్నది.

ఇందువలన అగ్నిహోత్ర పరిత్యాగము మహాదోషావహంబనియు అగ్నిహోత్రమును పరిత్యజించి చతుర్థాశ్రమమును స్వీకరింపరాదనియు నిర్ణయించుట సమంజసము కాదా ?

సిద్ధాంత సూత్రము.

సూ. "అనుష్ఠేయం బాదరాయణః సామ్యశ్రుతేః" 3-4-19

ఉత్తరము : గృహస్థాశ్రమము మొదలగువాని వలె సన్న్యాసంబు ఆచరణీయంబని వేదవ్యాస భగవానుని యభిప్రాయము. ఎట్లనఁగా ? "త్రయో ధర్మస్కంధాః" "ఏత మేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛంతః ప్రవ్రజంతి" అను శ్రుతి వాక్యములు- సర్వాశ్రమములను సమానములుగా నిరూపించునట్టివి. ''అగ్నినుద్వాసనఁ జేయగూడ"దను నిషేధము గృహస్థునకు సంబంధించినదని తెలియవలెను.

అందువలన చతుర్థాశ్రమము (సన్న్యాసము) అద్దానికి చెందిన ధర్మంబులును పరిగ్రాహ్యంబులగునని వివేకము.

ఈ సందర్భమున నొక విశేషమును గాననగును.

ఒకవేళ నిర్ణయ సింధువునందు సన్న్యాస అగ్నిహోత్రములు కలియుగంబునను పరిగ్రాహ్యంబులని చెప్పఁబడినను "అగ్నిహోత్రం గవాలంబం - సన్న్యాసం పలపైతృకమ్, దేవరాచ్చ సుతోత్పత్తిః- కలౌ పంచ వివర్జయేత్'' అను ప్రమాణముఁబట్టి కలియుగమున నిషిద్ధములగునని బోధపడుచున్నయది. ఐతే

"చత్వార్యబ్ద సహస్రాణి - చత్వార్యబ్ద శతాని చ,
కలౌ యదా గమిష్యంతి - తదా త్రేతాఽపరిగ్రహః''

"నాలుగువేల నాలుగువందల వత్సరములు గడచిన పిమ్మట కలియుగమున అగ్నిహోత్ర సన్న్యాసములను పరిగ్రహింపఁగూడదు'' అను వచనము ననుసరించి కలియుగమున కొంతకాలము వరకే అగ్నిహోత్ర సన్న్యాసాదులు ఆచరణీయంబులని పాఠకులు గ్రహింతురు గాత !

సూ. "విధి ర్వా ధారణవత్" 3-4-20

"ఉపరి హి దేవేభ్యో ధారయతి"అనుచో లింగ్ ధాతువుతో ప్రాప్తము కాకున్నను "అధస్తాత్సమిధం ధారయ న్ననుద్రవేత్" అను పూర్వవాక్యములోని లింగ్ ధాతువుఁబట్టి విధి నంగీకరించినట్లు ఇటఁగూడ సన్న్యాసమును గురించి విధి కలదనియే చెప్పవలెను. ఇంతియేగాక జాబాల శ్రుతియందు "బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్, గృహీ వా వనీ భూత్వా ప్రవ్రజేత్" అను వాక్యమున సన్న్యాసము ప్రత్యక్షముగా విధింపఁబడినది. ఐతే ఇవ్విషయమున క్రమనియమమును పాటింప రాదు. "ఉత్సన్నాగ్ని రనగ్నికో వా యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్" "అగ్న్యుద్వాసనఁ జేసినవాడు అగ్నిహోత్ర నియమము లేని బ్రహ్మచారి యైనను ఏనాడు విరక్తిఁజెందునో ఆనాడే సన్న్యసింపవలెను'' అను శ్రుతివాక్యము బ్రహ్మచర్యాద్యాశ్రమ క్రమ నియమమును చెప్పనందున జన్మాంతర సుకృత పరిపాకమున విశుద్ధమైన అంతఃకరణము గలవాడు బ్రహ్మచర్యము నుండియే సన్న్యాసమును గ్రహింపవచ్చునని బోధపడుచున్నయది.

శ్లో॥ ఋణాని త్రీణ్యపాకృత్య-మనో మోక్షే నివేశయేత్,
అనపాకృత్య మోక్షంతు-భజమానో వ్రజత్యధః"

"దైవికము పైతృకము మానుషికము అని ముప్విధము ఋణము; ఇట్టి ఋణములను సంతానప్రాప్తి మున్నగువానితో తొలగించుకొని మనస్సును మోక్షము కొరకై వినియోగింపవలెను. ఒకవేళ పై ఋణత్రయమును తీసివేయక మోక్షమునకై పాటుపడినచో అట్టి వాడు భ్రష్టుండగును" ఇత్యాది నిషేధము అవిరక్తుల విషయమైనదని తెలియవలెను. "వీరహా వా ఏష దేవానాం, యోఽగ్నిముద్వాసయతే" అను అగ్న్యుద్వాసననిషేధమున్నందున బ్రహ్మచర్యము నుండియే సన్న్యాసము కాని గృహస్థాశ్రమము నుండి (సన్న్యాసము) కూడదని కొందరి యభిప్రాయము.

అట్లైనచో "వనీ భూత్వా ప్రవ్రజేత్" "ఉత్సన్నాగ్ని రనగ్నికో వా యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్" ఇత్యాది విధివాక్యములు నిష్ప్రయోజనంబులగును.

కావున బ్రహ్మచర్యము నుండియే సన్న్యసింప వలెను అని కాని

వానప్రస్థుడయ్యే చతుర్థాశ్రమమును స్వీకరింపవలెను అని కాని నిర్బంధమును చేయరాదు.

బ్రహ్మచర్యము నుండియే సన్న్యాసమును స్వీకరింపవలెనని చెప్పు వారి యుద్దేశ మేమనఁగా ?

ఆశ్రమము సాగ్ని యనియు అనగ్ని యనియు రెండే విధములు. అందు బ్రహ్మచారి సన్న్యాసియు అనగ్నులనఁబడుదురు. గృహస్థుఁడు వానప్రస్థుడున్ను సాగ్నులనఁబడుదురు. అగ్నిఁ బరిగ్రహించిన తరువాత ఉద్వాసనఁ జేసి సన్న్యాసమును పరిగ్రహించుటకన్న బ్రహ్మచర్యము నుండియే సన్న్యాసమును స్వీకరించుట మిక్కిలి ముఖ్యంబగును. అట్లు కాదన్నచో శ్రుతి విరోధము సమకూరును. ఇందువలన సర్వాశ్రమ ధర్మములు సిద్ధించుననియు సన్న్యాసులకును విద్య (శివోపాసన) తప్పనిసరి యనియు విద్యవలననే మోక్షపురుషార్థము చేకూరు ననియు విశదమైనది.

## స్తుతిమాత్రాధికరణము

సూ. "స్తుతిమాత్ర ముపాదానా దితి చే న్నాపూర్వత్వాత్" 3-4-21

"కర్మాంగములగు ఉద్గీథము మున్నగు వానిని పరిగ్రహించి నయ్యవి రసతమంబులని నిరూపించుట - స్తోత్ర రూపమైనదని చెప్పుట సరి కాదు. అపూర్వమగుటచే రసతమత్వాదిప్రవచనము ఉపాసనాత్మకం బగునని సూత్రభాష్య సారాంశము.

సూ. "భావశబ్దా చ్చ" 3-4-22

"ఉద్గీథ ముపాసీత" అనుచో భావశబ్దము అనఁగా విధిప్రత్యయము వినఁబడుచున్నందున ఉద్గీథము అనఁగా ప్రణవమునందు రసతమత్వమును భావించుట సమంజసంబగుచున్నయది.

## పారిప్లవాధికరణము

సూ. "పారిప్లవార్థా ఇతి చేన్న, విశేషితత్వాత్" 3-4-23

వేదాంతముల యందు ఉపాసన నారంభించునపుడు "ప్రతర్దనో హ వై దైవోదాసిః" ఇత్యాది ఆఖ్యాయికలు వినంబడుచున్నవి. ఇట్టి వికర్మరూపములా ? విద్యాస్తుతి రూపములా ? అని సంశయము.

ప్రశ్న : ఉపనిషదారంభగతములైన కథానికలు కర్మరూపములగును. ఎట్లనఁగా ? అశ్వమేధ యాగమునందు రాజును సకుటుంబముగా కూర్చుండఁజేసి రాజుముందు వైదికములగు ఆఖ్యాయికలను అధ్వర్యుఁడు చెప్పవలెను. ఇట్టి విధానమునకు "పారిప్లవం" అను పేరు కలదని "పారిప్లవ మాచక్షీత" అను వాక్యము నందు తెలియుచున్నది. మఱియు "సర్వాణ్యాఖ్యానాని పారిప్లవే శంసంతి" "పారిప్లవ మనఁబడు విధానమునందు వైదికములైన కథల నన్నిటిని చెప్పుదురు" అనుచో వినియోగమును గాననగును కావున ఆఖ్యాయికలు పారిప్లవార్థములని చెప్పవలెను కాదా ?

ఉత్తరము : ఆఖ్యాయికలన్నియు పారిప్లవార్థకములు కాజాలవు. ఎందుకనఁగా ? "ప్రథమేఽహని మను ర్వైవస్వతో రాజా" "ద్వితీయేఽహని యమో వైవస్వతో రాజా" ఇత్యాది వాక్యములతో కొన్ని ఆఖ్యాయికలు యాగారంభదినముల యందు ప్రత్యేకములుగా వినిపింపఁదగినవని చెప్పఁబడుటచే కథలన్నియు పారిప్లవార్థములని భావించుట యుక్తము కాజాలదు.

ఉపనిషద్గతములైన చరిత్రలు- సన్నిధిలో నుండు విద్యావిధులతో ఏకవాక్యము కలిగియుండుటఁజేసి విద్యా సంబంధము కలవి యగునని దిగువసూత్రమున నిరూపించుచున్నవారు.

సూ. "తథా చైకవాక్యతోపబంధాత్" 3-4-24

"సోఽరోదీత్" ఇత్యాది కథానికలు కర్మవిధులతో ఏకవాక్యము కలిగియున్నవని పూర్వతంత్రమునందంగీకరించినట్లు విద్యావిధులతో ఏకవాక్యము కలిగియున్న వైదిక చరిత్రములు విద్యాస్తుతిరూపములైనవనియే గ్రహింపవలెను.

ఉపాసనాదార్ఢ్యమునకై వలయు చిత్తస్థైర్యమునకు ఉపనిషత్తులు "ప్రతర్దనో హ వై దైవోదాసిః" "దివోదాసపుత్రుఁడగు ప్రతర్దన మహారాజు వక్ష్యమాణ రీతిని ప్రవర్తించెను" ఇత్యాది ఆఖ్యాయికలను పొందుపఱిచినవని సారాంశము.

## అగ్నీంధనాధికరణము

సూ. "అత ఏవ చాగ్నీంధనాద్యనపేక్షా" 3-4-25

పరామర్శాధికరణమునందు సన్న్యాసము విహితంబని నిరూపింపఁబడినది. ఐతే సన్న్యాసమునందు విద్యాసిద్ధికి వలయు అగ్నిహోత్రము మున్నగు ధర్మముల నాచరించు ఆవశ్యకత ఉన్నదా ? లేదా ? అని సంశయము.

ప్రశ్న : విద్యాంగము కర్మయని నిరూపించుటఁజేసి ఉపాసకులగు యతులును ఉపాసన (విద్య)కు నంగములుగా అగ్నిహోత్రాదులను అవశ్యము అనుష్ఠింపవలెను కాదా ?

ఉత్తరము : ఊర్ధ్వ రేతస్కుల (సన్న్యాసుల)కు విద్య - అగ్నిహోత్రము మున్నగువాని యవసరము లేనట్టిది. "ఏతమేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛంతః ప్రవ్రజంతి" "సర్వోత్తరమగు శివపదమును పొందగోరువారు సన్న్యసింతురు" ఇత్యాది శ్రుతి వాక్యములఁబట్టి కర్మత్యాగము చేతనే విద్యావత్త్వము అనఁగా ఉపాసనాదార్ఢ్యము సిద్ధించునని తేటపడుచున్నయది. ఐతే విద్యాకర్మసముచ్చయమునకు భంగము కలుగనట్లు సన్న్యాసులకు విద్య అనఁగా శివోపాసనము సన్న్యాసాశ్రమ విశేష ధర్మములగు త్రిషవణస్నానము సమధికశౌచము అష్టగ్రాస ఆహారము మున్నగు వానితో కూడి యుండునది అని చెప్పుట సమంజసము కావున యతులకు అగ్నిహోత్రాదుల యవసరము లేదని భావము.

## సర్వాపేక్షాఽధికరణము

సూ. "సర్వాపేక్షా చ యజ్ఞాది శ్రుతే రశ్వవత్" 3-4-26

అంత్యాశ్రమము గల వారికి విద్య - అగ్నిహోత్రాదుల సంబంధము లేనిదని బాగుగా నిరూపింపఁబడినది. ఐతే ఈ సందర్భమున గృహస్థులకు గూడ

విద్య- అగ్నిహోత్రాదుల యపేక్ష గలదగునా ? కాదా ? అని సంశయింపఁబడు చున్నది.

ప్రశ్న : ఇట్టి తటి గృహస్థులకు గూడ అగ్నిహోత్రము మొదలగు కర్మలతో నవసరము లేనట్టి విద్యయే సమాచరణీయంబని తోచెడిని. ఒకవేళ గృహస్థులకు అగ్నిహోత్రాది కర్మలు అనివార్యములందురేని "కర్మ - విద్యాంగము" అను నియమమునకు భంగము వాటిల్లును. అనఁగా కర్మప్రాధాన్యము ఏర్పడును గదా ?

ఉత్తరము : గృహస్థులు కర్మిష్ఠులు కావున నవ్వారు అగ్నిహోత్రాది సర్వ కర్మల నవశ్య మాచరింపవలసి యుండును. ''యజ్ఞేన దానేన'' అను శ్రుతి వాక్యము ఇవ్విషయమునే సమర్థించుచున్నయది. ఎట్లనఁగా ? "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి, యజ్ఞేన దానేన, తపసాఽనాశకేన" "బ్రాహ్మణులు వేదాభ్యాసముతో యజ్ఞదానముల తోడను తపస్సుచేతను ఉపవాసముననుపరమాత్మను తెలియఁ గోరువారు" అనుచో బ్రహ్మచారులు వేదాభ్యాసముతోడను గృహస్థులు యజ్ఞదాన ప్రధానమైన కర్మాచరణతోడను వానప్రస్థులు కృచ్ఛ్ర చాంద్రాయణ పంచాగ్ని మధ్యనివాసాది తపశ్చర్యతోడను సన్న్యాసులు ఉపవాస తుల్యమగు అష్ట కబళ ఆహారముతోడను శివు నుపాసింతురని బోధపడుచుండుటఁ జేసి యజ్ఞాది కర్మలు పరమేశ్వరుని ఆజ్ఞారూపములగుట వలనను గృహస్థులు అగ్నిహోత్రాది కర్మల నన్నిటిని తప్పనిసరిగా ఆచరింపవలెనని యంగీకరింపవలసి యుండును. ఐతే ''యస్య యావత్స్వగృహ్యోక్తం బహు వా స్వల్పమేవ వా, తస్య తావతి శాస్త్రార్థే - కృతే సర్వం కృతం భవేత్" "స్వ శాఖయందు చెప్పఁబడిన కర్మము కొద్ది యైనను ఎక్కువ యైనను అంతమాత్రమును గృహస్థుఁడు ఆచరించినయెడల శాస్త్రార్థమగు కర్మ నంతయు చేసినవాడగును" అను స్మృతి ప్రమాణముఁ బట్టి, స్వవర్ణ ఆశ్రమ కులములకు వలయునది పరమేశ్వర నియోగాత్మకంబు నగు కర్మ అవశ్యాచరణీయంబగుచున్నయది.

అశ్వము (గుఱ్ఱము) ప్రయాణ సాధనంబైనను గమనమునకు వలయు పరికరములు (కళ్లెం మొదలగునవి) లేనిది నడువఁజాలనట్లు విద్య - మోక్షమునకు సాక్షాత్సాధనంబైనను ఫలాభిసంధి లేనట్టి కర్మను విడచియుండునది కాదని తెలియనగును.

ఇట్టి తటి మోక్షమను మహాఫలము కర్మజన్యంబై అనిత్యంబగునని భావించుటకు ఎంతమాత్రము అవకాశము లేదు. కావున సాక్షాత్ జ్ఞానఫలకమైనదియే మోక్షంబని చెప్పవలెను.

ఇందువలన గృహస్థులకు విద్య - యజ్ఞాది సాపేక్షంబగుననియు అట్లే అన్ని ఆశ్రమములవారికి తమతమ ఆశ్రమములకు తగిన కర్మలతో కూడియుండుననియు నిర్ధారిత మగుటచేసి విద్య - కర్మసాపేక్షంబైనదని చెప్పుట సమంజసంబైనదియేను;

## శమదమాద్యధికరణము

సూ. "శమదమా ద్యుపేతః స్యా త్తథాఽపి తు తద్విధే
స్తదంగతయా తేషా మప్యవశ్యానుష్ఠేయత్వాత్"

3-4-27

"శాంతో దాంత ఉపరత స్తితిక్షుః సమాహితో భూత్వాఽఽత్మన్యేవాత్మానం పశ్యేత్" "శ్రద్ధా భక్తి జ్ఞానయోగా దవేహి" ఇత్యాది వాక్యములయందు విద్య (శివోపాసన)కు శమదమాది సంపత్తి యవసరమని తేటపడుచున్నయది. అట్టి సంపత్తి- గృహస్థులకు సంభవించునా ? లేదా ? అని సందేహము.

ప్రశ్న : గృహస్థులు యజ్ఞాది సత్కార్యములకొరకు నానావిధ ప్రయత్నములచేవ్యాకులపడుచుందురు కావున నవ్వారు బహువిధ బాధ్యతలను తగ్గించుకొని శమదమాది సద్గుణ సంపన్నులు కాజాలరు గదా ?

ఉత్తరము : గృహస్థుడు విహితములైన శాస్త్రీయ లౌకిక కర్మలయందాసక్తుడైనను నిషిద్ధములు కామ్యములు నగు కర్మలను విసర్జించి శమదమాదులు కలిగి యుండవలెను. "శాంతో దాంతః" "శ్రద్ధా భక్తి జ్ఞానయోగా దవేహి" ఇత్యాది వాక్యములు గృహస్థునకు గూడ శాంతి మున్నగు గుణములు అవశ్యకములని విధించుచున్నవి. కావున విద్యానిష్పత్తి (ఉపాసనా దార్ఢ్యము) కొరకు విద్యాంగములుగా శమదమాదులను శివోపాసకులు తప్పనిసరిగా అవలంబింప వలసియుండును.

శమ మనఁగా ? శివోపాసనకు విరుద్ధములైన అంతరింద్రియ వ్యాపారములగు రాగద్వేషాదులను అణచుట యగును.

దమ మనఁగా ? జ్ఞానేంద్రియములను విహితములు కాని కృత్యములనుండి మఱల్చుట యగును.

ఉపరతి యనఁగా ? కర్మేంద్రియములను నిషిద్ధములు కామ్యములు నగు కర్మల నుండి మఱల్చుటయగును.

తితిక్ష యనఁగా ? శివోపాసనాకాలమునందు శీతోష్ణాది ద్వంద్వములను ఓర్చుకొనుట యగును.

సమాధాన మనఁగా ? శివపూజా సమయమున కునికిపాటు మున్నగు వికారములను పోనాడి చిత్తమును శివతత్త్వమున కభిముఖముగా చేయుట యగును.

శ్రద్ధయనఁగా ? మోక్ష పురుషార్థమునకు ఘాతుకములైన శాస్త్రములయం దభిరుచి లేకుండ పరవిద్యయనఁదగు శివాగమ శాస్త్రమునందలి విషయములను పరామర్శించుకొను సత్త్వకళ యగును.

భక్తి యనఁగా ? శివేతరులైన బ్రహ్మవిష్ణ్వాది సమస్త దేవతల నారాధింపక మనోవాక్కాయ శుద్ధిగా అష్టాంగములతో కూడిన వైదికక్రియ యగును.

భక్తిఁదగు ఎనిమిది యంగములను దిగువ విధము గాననగును.

1. శివభక్తజనులయందు వాత్సల్యము, (దయ)
2. శివభక్తులు గావించు పూజనము నామోదించుటయు
3. తానును శివుని పూజించుటయు
4. శివునికొరకు నవయవముల నుపయోగించుట
   అనఁగా పుష్పములు బిల్వము మున్నగు శివపూజా పరికరములను సమకూర్చుకొనుటయని భావము.
5. శివచరిత్రములను వినుటయందనురాగము
6. శివవిషయముల నవధరించుటయందు కంఠస్వరము కన్నులు
   మొదలగునవి మార్పుఁజెందుటయు

7. ప్రతిదినము శివనామమును కీర్తించుటయు

8. శివునియందు ఎట్టి కపటమును చూపకుండుటయు

ఐతే ఇహలోకసంబంధములు పరలోకసంబంధములు నగు సర్వవిధ సుఖభోగముల నపేక్షింపని వైరాగ్యముతోడను నిత్యములు అనిత్యములు నగు వస్తువులను నిర్ణయించు స్వరూపము గల వివేకముతోడను మనోవాక్కాయశుద్ధిని శివునినే సర్వాత్మకునిగా భావించి యారాధించు భక్తితోడను కూడిన మహాపురుషునకు శమదమాదిసంపత్తిద్వారా ముముక్ష (మోక్షేచ్ఛ) యేర్పడును. వివేకము వైరాగ్యము భక్తి ముముక్షి అను నాలుగు, శమదమాదులును పరమధర్మములనబఱగుచు అన్ని ఆశ్రమములవారికి నుపాసనాసిద్ధికై ప్రత్యేకముగా నవలంబింపఁదగినవనియు శమదమాదిసంపత్తి గృహస్థులకు నుపపన్నంబగుననియు సారాంశము.

గృహస్థుఁడు యజ్ఞాదికర్మల నాచరించుచున్నను శమదమాది సంపన్నుడు కావలెను. ఎందువలన ననఁగా? "శాంతో దాంతః" ఇత్యాదివాక్యమున శ్రుతి— శమాదులను విధించుచున్నది. ఉపాసనాంగములుగా శమదామాదులుగూడ తప్పనిసరి నవలంబింపఁదగినవై ఏకాగ్రతను సిద్ధింపఁజేయునవని సూత్రార్థము.

## సర్వాన్నానుమత్యధికరణము

సూ. "సర్వాన్నానుమతి శ్చ ప్రాణాత్యయే
తద్దర్శనాత్'' 3-4-28

"న హ వా ఏవంవిది కించనానన్నం భవతి" ''ప్రాణవిద్యానిష్ఠునకు భుజింపరాని ఆహారమెద్దియు నుండదు. అనఁగా ప్రాణబ్రహ్మోపాసఁకుడు సర్వత్ర సర్వదా ఆహారమును తీసికోవచ్చునని భావము" అనుచో ప్రాణవిద్యాప్రకరణమున ప్రాణవిద్యానిష్ఠునకు సర్వాన్నానుమతి వినంబడుచున్నయది.

ఇద్ది యుక్తమగునా? కాదా? అని సందేహము.

ప్రశ్న : ప్రత్యక్షప్రమాణములతో నేర్పడు భోజనము విధింపఁబడునది కాదు గావున అన్యప్రమాణముతో ప్రాప్తము కానట్టి సర్వాన్నానుమతియే ఇట విధింపఁబడుచున్నదని చెప్పవలెను కాదా?

ఉత్తరము : ప్రాణవిద్యయందు నిష్ఠ గలవాడు వెల్లకాలము సర్వులనుండి ఆహారమును గైకొనవలెనని శ్రుత్యాదివాఙ్మయము అనుమతింపలేదు. కాని ప్రాణ సంకటసమయమున మాత్రము సర్వాన్నగ్రహణమును ఆమోదించినట్లు దిగువ సందర్భమునందు గాననగును.

అధికసామర్థ్యముగల ఉషస్తి యనువాడు బ్రహ్మవేత్తయైనను ప్రాణసంకట సమయముననే మరియొకరు తినుచుండగా మిగిలిన ఆహారమును స్వీకరించెనని శ్రుతియందు కలదు. ఎట్లనఁగా? మిణతలు మున్నగువానితో వ్యాపింపఁబడిన సస్యములుగల కురుదేశములయందు ఉషస్తి యను మహానుబావుఁడు వ్యక్తురాలు కానట్టి తన భార్యతోగూడ మావటివానిఊరునందు మార్గవశమున ఒకనాడు నివసించెను. అప్పుడీతడు భోజనము లేక తహతహలాడుచుండెను. చక్రుఁడను వాని కుమారుఁడగు ఉషస్తి-మినుపగుడాలు తినుచున్న మావటివానిని యాచింపగా మావటివాడు "నే తినుచున్నవానికంటె వేరే లేవ"ని చెప్పెను. ఇవ్వానినే ఈయుమని ఉషస్తి పలుకఁగా స్వామీ? ఇయ్యవి ఉచ్ఛిష్టములుగదా యని మావటివాడు వచించెను. ఉచ్ఛిష్టములైనను ఉపయుక్తములేయని మావటివానినుండి ఉషస్తి గుడాలు తీసికొని భక్షించెను. తరువాత మావటివాడు త్రాగుటకు నీరు కావలెనా? అని యడుగగా పానీయ మెచ్చటనైనను లభించును గాన యవసరము లేదనియు నీ కుళుత్థములను భక్షించుటతోడనే నా ప్రాణము స్థిరపడెననియు ఇతోఽధికముఁబరి గ్రహింతునేని ఉచ్ఛిష్టగ్రహణదోషము సంబవించుననియు ఉషస్తి మావటికి చెప్పి యటనుండి పయనించెను"

ఇందువలన పరవిద్యానిష్ఠునకుగూడ ప్రాణసంకటముననే సర్వాన్నానుమతి కాని సర్వత్ర సర్వదా యుండజాలదనియు విద్యానిష్ఠులు కానివారికిని సర్వత్ర సర్వదా సర్వాన్నానుమతి లేదని చెప్పవలసిన యవసరము లేదనియు గ్రహింపవలెను.

సూ. ''అబాధాచ్చ'' 3-4-29

"ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః, సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః, స్మృతిలంబే సర్వ గ్రంథీనాం విప్రమోక్షః''

"స్వవర్ణాశ్రమాద్యుచిత మగు ఆహారము పరిశుద్ధమగునెడల అంతఃకరణము

నిర్మలమగును. అంతఃకరణశుద్ధి యేర్పడునేని నిరంతరము శివస్మరణ పరంపరతో గూడిన ధ్యానము సిద్ధించును. ధ్యానసిద్ధితో సంశయములన్నియు పటాపంచ లగును" అను నిర్వచనమునఁజేసి.... ఆహారశుద్ధికి ఎట్టి బాధయు కనఁబడుట లేనందున ప్రాణసంశయమునందే సర్వాన్నానుమతి యని నిర్ణయింపనైనది.

సూ. ''అపి చ స్మర్యతే'' 3-4-30

శ్లో॥ ప్రాణసంశయ మాపన్నో - యోఽన్న మత్తి యత స్తతః।
లిప్యతే న స పాపేన - పద్మపత్ర మివాంభసా॥

ప్రాణసంకటమును పొందినవాడు ఎవరివద్దనైనను ఎప్పుడైనను ఆహారమును పరిగ్రహించునెడల- తామరాకు నీటితో తడుపఁబడనట్లు ఎట్టి దోషమునకును పాత్రుఁడు కాజాలడు"

అను స్మృతివాక్యము పై విషయమునే సమర్థించుచున్నయది.

సూ "శబ్ద శ్చాతోఽకామకారే'' 3-4-31

ఇందువలననే "బ్రాహ్మణః సురాం న పిబేత్" "బ్రాహ్మణుఁడు సురాపానము చేయరాదు" అను శబ్దము బ్రాహ్మణాదులు స్వేచ్ఛాప్రవృత్తి కలవారు కాగూడదని శాసించుచున్నది. కావున విద్వాంసుఁడైనను ప్రాణసంశయమునందే సర్వాన్నపరిగ్రహణముఁజేయవచ్చుననియు అట్లు కానిచో నిషిద్ధాచరణమువలన శివాజ్ఞ నుల్లంఘించి ద్రోహి యగుననియు సారాంశము.

## ఆశ్రమకర్మాధికరణము

పూర్వపక్షసూత్రములు

సూ. "విహితత్వా చ్చాశ్రమకర్మాపి" 3.4-32

ఉపాసనారహితుఁడగు గృహస్థుఁడు "యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి" ఇత్యాది ప్రమాణముల ననుసరించి విహితమైన యజ్ఞాది ఆశ్రమకర్మను "యజ్ఞేన

దానేన" ఇత్యాది శ్రుతింబట్టి విద్యాంగముగ యజ్ఞాదికర్మనాచరింపవలెనని తెలియుచున్నది.

సూ. "సహకారిత్వేన చ" 3-4-33

ఉపాసకుఁడును "విద్యాంచావిద్యాంచ" ఇత్యాది శ్రుతి ననుసరించి యజ్ఞాది కర్మను విద్యాసహకారిగ ననుష్ఠింపవలెనని తెలియుచున్నది. ఐతే విద్యాసంపన్నుఁడును యజ్ఞాదికర్మను విద్యాసాధనముగాను విద్యాంగముగాను రెండు పర్యాయములు ఆచరింపవలెనా? లేక ఒకే పర్యాయము ఆచరింపవలెనా? అని సంశయము.

ప్రశ్న : రెండువిధములుగా విధి యున్నందున యజ్ఞాదికర్మలను రెండు పర్యాయములు ఆచరింపవలెనని చెప్పనగును కాదా?

సిద్ధాంతసూత్రములు

సూ. "సర్వథాఽపి తఏవోభయలింగాత్" 3-4-34

విద్యాసాధనముగా విద్యాంగముగాను వినియోగింపఁదగు యజ్ఞాదికర్మము రెండువిధములైనను ఏకస్వరూపమే యగుచున్నది. యజ్ఞాదికర్మలు అంతట నొకే రూపములుగా గుర్తింపఁబడుచున్నవి. యజ్ఞాదికర్మ నొకే పర్యాయ మాచరించినను వచనద్వయబలమున (ఒకేకర్మకు) ఆకారద్వయము నిష్పన్నంబగునది కావున విద్యాసంపన్నుడైనను విద్యావిహీనుఁడైనను విద్యాజనకముగను విద్యాంగముగాను యజ్ఞాదికర్మ నొకే పర్యాయము గావింపవలెనని తెలియవలెను.

సూ. "అనభిభవం చ దర్శయతి" 3-4-35

"ధర్మేణ పాప మపనుదతి" అను శ్రుతివాక్యము శివోపాసన నడ్డగించు పాపములను యజ్ఞాదికర్మల నాచరించుటతో పోగొట్టుకొనవచ్చునని తెలుపుచున్నది కావున కర్మానుష్ఠానసమయముననే శివోపాసనయందు అభిరుచిని యజ్ఞాది కర్మ కలుగఁజేయునని గ్రహింపవలెను.

ఇట్లు చెప్పుటచే పూర్వపక్షి చూపిన విరోధము పరిహరింపఁబడినదని భావము.

## అంతరాధికరణము

సూ. "అంతరా చాపి తు తద్దృష్టేః" 3-4-36

బ్రహ్మచర్యము మున్నగు నాలుగు ఆశ్రమములవారికిని విద్య (శివోపాసన) యుపపన్నంబగునని బాగుగా చెప్పఁబడినది కాని ఆశ్రమరహితులకు విద్య-ఉపపన్నంబగునా? లేదా అని సందేహము.

ప్రశ్న : గురుకులములో విద్యాభ్యాసమును ముగించుకొని వివాహమును కోరి యుండు స్నాతకులు; వివాహానంతరము భార్యచనిపోయినవారున్ను ఆశ్రమరహితులనఁబడుదురు. వీరికి బ్రహ్మోపాసనము సంభవింపదు. ఎందుకనఁగా? విద్యాసాధనములగు ఆశ్రమధర్మములు స్నాతకవిధురులయందు ప్రవర్తింపవు గదా?

ఉత్తరము : రైక్వుడు మున్నగు అనాశ్రములయందు బ్రహ్మవిద్య కనబడుచున్నది కావున స్నాతకులు (వివాహము కానివారు) విధురులు (భార్యను పోగొట్టుకొనినవారు)ను బ్రహ్మము నుపాసింపవచ్చును.

విద్యాసాధనములగు ఆశ్రమధర్మములు స్నాతకవిధురులయందు ఉండజాలవను సంశమునకు సమాధానమీ దిగువసూత్రము.

సూ. "అపిచ స్మర్యతే" 3-4-37

ఆశ్రమరహితులును జపము మున్నగువాని వలనను బ్రహ్మవిద్య నవలంబింపవచ్చునని స్మృతిప్రమాణము చాటుచున్నది.

శ్లో॥ జప్యేనైవ తు సంసిద్ధ్యేత్ - బ్రాహ్మణో నాత్ర సంశయః ।
కుర్యా దన్య న్నవా కుర్యాత్ - మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే ॥

ఎట్టి ఆశ్రమముఁజెందని బ్రాహ్మణుఁడు గాయత్రీ శివపంచాక్షర్యర్యనరమంత్రముయొక్కయు అథవా రెంటియొక్కయు నియమితసంఖ్యగల జపమువలననే అనఁగా జపపూర్వక శివోపాసనముననే ముక్తుఁడు కాజాలును. యజ్ఞాదికములగు ఇతరకర్మలను చేసినను చేయకున్నను, జపాదులతో కృతార్థుఁడగును. ఇట్టివాడు యజ్ఞప్రయుక్తములగు పశుహింసాదులు లేనివాడై సర్వజీవమైత్రి కలిగి యుండుటఁజేసియు మైత్ర బ్రాహ్మణుఁడనఁబడును.

కేవలము స్నాతకవిధురులను గురించియే గాక ఆశ్రమములఁజెందియుండు వారికిని పై యంశము వర్తించునని (స్మృతి) సందర్భమువలన స్ఫురించుటను విద్వాంసులు గమనింప నగును.

సూ. "విశేషానుగ్రహాశ్చ" 3-4-38

ఆశ్రమనియతములగు ధర్మవిశేషములు కొన్ని ఆశ్రమరహితులకును విహితములగుటకతన నవ్వాని నవలంబించియైనను స్నాతకవిధురులు బ్రహ్మము నుపాసింపవచ్చును.

ఇందుకు శ్రుతిప్రమాణము

"తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్యయా చాత్మాన మన్విష్య"

"శివపంచాక్షరీ జపాత్మకమగు తపస్సు; రుద్రాధ్యాయాది వేదపఠనము ఇంద్రియనిగ్రహము ఇత్యాది బ్రహ్మచర్యము; దృఢవిశ్వాసముగల శ్రద్ధ (పట్టుదల) ఉపాసన (ఆరాధన) యనువానితో పరమేశ్వరుని ధ్యానింపవలెను"

సూ. అత స్త్వితర జ్జ్యాయో లింగాచ్చ" 3-4-39

ఆశ్రమరహితుఁడుగా నుండుటకన్న ఆశ్రమిగా నుండుట శ్రేష్ఠమగును. ఎందుకనఁగా? యజ్ఞాదిధర్మములనేకములను గృహస్థాద్యాశ్రమముగలవాడు ఆచరించుచు శ్రేయోభాజనుఁడు కావచ్చును.

ఇందుకు "అనాశ్రమీ న తిష్ఠేత్తు - దిన మేక మపి ద్విజః" "బ్రాహ్మణ క్షత్రియవైశ్యులు- ఎట్టి ఆశ్రమము లేకుండ ఒక్క దినమైన నుండకూడదు" అను స్మృతిప్రమాణము ప్రబలనిదర్శనము. ఐనను ఏదేనొక ఆశ్రమముఁజెందిన పిమ్మట రెండవ ఆశ్రమముఁజెందుటకు వలయు సౌకర్యము లేనివారు అపద్ధర్మముగా జపాదిసాధనములతో బ్రహ్మవిద్యావలంబనమును గావింప నర్హులనియే నని సిద్ధాంతము.

## తద్భూతాధికరణము

సూ. "తద్భూతస్య తు నాతద్భావో జైమినే రపి
నియమా త్తద్రూపాభావేభ్యః" 3-4-40

సన్న్యాసాశ్రమముఁ బరిగ్రహించినవారికి పూర్వాశ్రమమును పొందు నవకాశము కలదా? లేదా? అని యిట సందేహింపఁబడుచున్నయది.

ప్రశ్న : బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్, గృహాద్వా వనీ భూత్వా ప్రవ్రజేత్" అనుప్రమాణము ననుసరించి బ్రహ్మచర్యమునుండియైనను గృహస్థాశ్రమమునుండియైనను వానప్రస్థమునుండియైనను సన్న్యసింపవచ్చునని తెలియుచున్నందున ఒకానొక ఆశ్రమమునుండి మరియొక ఆశ్రమముఁజెందుట సాధకుని ఇష్టానుసారమని తోచెడిని. అట్లే చతుర్థాశ్రమమునుండిగాని తృతీయాశ్రమము నుండిగాని గృహస్థాశ్రమమును పొందుటయు స్వేచ్ఛాధీనమగునవి యంగీకరింపవలెను గాదా?

ఉత్తరము : ఊర్ధ్వరేతస్కుఁడై నైష్ఠికుఁడుగ నుండువానికి పూర్వాశ్రమమును పరిగ్రహించుటవలన పతితత్వము సంభవించును. ఎందుకనఁగా "అత్యంత మాత్మాన మాచార్యకులేఽవసాదయన్" "ఆచార్యసన్నిధిని తాను మిక్కిలి వేదాధ్యయనాదులతో పరిశుద్ధుడు కావలెను"

"అరణ్య మియాత్, తతో న పున రేయాత్"

"వనమును గురించి వెళ్ళవలెను. వనమునుండి మరల గృహమునకు రాకూడదు''

"సన్న్యస్యాగ్నీన్ న పున రావర్తయేత్"

''సన్న్యసించిన తరువాత అగ్నిహోత్రమును మరల రగుల్కొలుపరాదు" అను శాస్త్రములు ఆశ్రమావరోహము కూడదని నియమించుచున్నవి. ఆశ్రమారోహమును గురించి శాస్త్రములున్నట్లు అవరోహమును గురించి లేనందున నైష్ఠికులు పతితులు కాగూడదని నియమించు శ్రుతులు ఉన్నందునను అనంతరాశ్రమము నుండి పూర్వాశ్రమముఁబరిగ్రహించువారు బ్రహ్మవిద్యయందధికారమును గోలుపోవుదురని తెలియవలెను. జైమిని మహర్షిగారి యభిమత మిద్దియేను;

ఆరూఢపతితుడగువానికి బ్రహ్మవిద్యాధికారము లేదని దిగువ సూత్రముతో స్పష్టముగా చెప్పుచున్నవారు.

తద్భూతాధికరణము

సూ. న చాధికారిక మపి, పతనానుమానా త్తదయోగాత్"
3-4-41

పూర్వతంత్రమున గల అధికారాధ్యాయము నందలి ప్రాయశ్చిత్తంబు ఆరూఢపతితునకు సంభవింపదు. ఇందుకు స్మృతిప్రమాణమును గాననగును.

శ్లో॥ ఆరూఢో నైష్ఠికం ధర్మం-యస్తు ప్రచ్యవతే నరః,
ప్రాయశ్చిత్తం న పశ్యామి-యేన శుద్ధ్యే త్స ఆత్మహా ॥

నైష్ఠిక ధర్మమును అనఁగా వానప్రస్థ సన్న్యాసముల నవలంబించిన వారు ఆరూఢులనఁబడుదురు. ఇట్టివారు మరల గృహస్థ ధర్మమును అనఁగా భార్యా పరిగ్రహమును గావింతురేని ఆరూఢపతితులగుదురు. ఇట్టి ఆత్మహంతకులకు ఎట్టి ప్రాయశ్చిత్తమును శాస్త్రములు నిర్వచింపలేదు" కావున అరూఢపతితులకు బ్రహ్మవిద్యాధికారము లేదని సారాంశము.

సూ. "ఉపపూర్వ మపీత్యేకే, భావ మశనవత్తదుక్తమ్" 3-4-42

మధ్వాశనమునకు ప్రాయశ్చిత్తము చెప్పఁబడినట్లు ఆశ్రమావరోహము ఉపపాతకమగుటచే నిద్దానికి ప్రాయశ్చిత్తము కలదని కొందరు భావించుచున్నారు.

అనఁగా బ్రహ్మచారి స్త్రీ పరిగ్రహముఁ జేయునెడ ప్రాయశ్చిత్తమును చేసి కాని పరిశుద్ధుడు కావచ్చునని చెప్పఁబడుటవలన బ్రహ్మచారితుల్యులగు వానప్రస్థ యతులకు గూడ నిద్ది వర్తించునని కొందరి యభిప్రాయము.

సూ. "బహిస్తూభయథాఽపి స్మృతే రాచారాచ్చ" 3-4-43

కాని ఆశ్రమావరోహము మహాపాతకమైనను ఉపపాతకమైనను ప్రాయశ్చిత్తార్హము కాజాలదు. ఎందుకనఁగా ? వీరు (ఆరూఢపతితులు) కర్మాధికార బహిష్కృతులు; "ప్రాయశ్చిత్తం న పశ్యామి, యేన శుద్ధ్యేత్ స ఆత్మహా" అను స్మృతి వలనను శిష్టులు బహిష్కరించుట వలనను ఆరూఢపతితులు బ్రహ్మవిద్య (శివోపాసన) యందు అధికారములేనివారగుదురనియు అవ్వారికి నరకప్రాప్తియే గాని స్వర్గాది పుణ్యలోకములును లభింపవనియు సిద్ధాంతము విశదమైనది.

## స్వామ్యధికరణము

పూర్వపక్ష సూత్రము.

సూ. "స్వామినః ఫలశ్రుతే రిత్యాత్రేయః" 3-4-44

ఉద్గీథము మున్నగు ఉపాసనము యజమానునిచే గావింపఁదగినదా? ఋత్విజులచేతనా? అని సంశయము

ప్రశ్న : ఉద్గీథాది ఉపాసనమును యజమానుఁడే చేయవలెను. ఎందు కనఁగా? లోగా చెప్పఁబడిన వీర్యవత్తరత్వఫలము యజమానునే చెందును గాని ఋత్విజులను చెందదు గదా!

ఉత్తరము :

సిద్ధాంత సూత్రము.

సూ. "ఆర్త్విజ్య మిత్యౌడులోమి స్తస్మై హి పరిక్రియతే" 3-4-45

"ఏవంవిదుద్గాతా బ్రూయాత్" అను వాక్యశేషమునందు ఉద్గాతయే ఉద్గీథాదుల నుపాసింపవలెనని స్ఫుటముగా తెలియుచున్నది కావున ఉద్గీథాద్యుపాసనము ఋత్విజులదే యని ఔడులోమి భావించెను. అన్యకర్తృకమైన ఉపాసనము ఇతరు నెట్లు చెందు ననఁగా? యజమానుఁడు కర్మస్వరూపమును వలె ఋత్విజులను గూడ సాంగ కర్మానుష్ఠానమునకై కొనుచున్నవాడు. అందువలన ఋత్విజులు ఆచరించినది యజమానుని తప్పక చెందుననియు కర్మోపాసనఫలమంతయు యజమానునకే యనియు చెప్పుటలో విరోధ మెద్దియు గానరాదు.

## సహకార్యంతర విధ్యధికరణము

సూ. "సహకార్యంతరవిధిః పక్షేణ తృతీయం తద్వతో విద్యాదివత్" 3-4-46

"తస్మాద్బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్, బాల్యం చ

పాండిత్యం చ నిర్విద్యాథ మునిః'' "బ్రాహ్మణుఁడు పాండిత్యమును సంపాదించి బాల్యముతో నుండవలెను. బాల్య పాండిత్యముల వలె నాతనికి మునిధర్మంబు నవ సరము" కహోలబ్రాహ్మణము.

ఇఁట పాండిత్యమనఁగా ? బహూపనిషత్తుల తాత్పర్యము నేకార్థముగా నిర్ణయించుట యగును. బాల్యమనఁగా ? రాగద్వేషాది వికారములు లేక బాలుని వలె ప్రవర్తించుట; ఇఁక మునిధర్మ (మౌన)మెట్టిదో విచారింపఁబడును. ఐతే పాండిత్య బాల్యముల వలె మౌనము విధింపఁబడుచున్నదా ? లేదా ? అని సంశయము.

ప్రశ్న : ''మునిః" అనుచో "భవేత్" అని లేనందున మౌనము విధింపఁ బడుట లేదని చెప్పుట సమంజసము కాదా ?

ఉత్తరము: బ్రహ్మవిద్య గలవానికి యజ్ఞాదులు విధింపఁబడినట్లు పాండిత్య బాల్యములకు మూడవ సహకారి యగు మౌనము విధింపఁబడుచున్నదియేను; యజ్ఞాదులనఁగా - నిత్య నైమిత్తికర్మలు మరియు శమదమాదులు శ్రవణమననం బులు నని తెలియవలెను. మౌనమనఁగా ? ప్రకృష్టమైన మననము; చిరకాలము ఎడబాటుఁజెందిన నాయిక - నాయకుని నిరంతరము స్మరించునట్లు ఉపాసకుఁడు ఉపాస్య వస్తువును గురించి పలువిధములుగా చర్చించుచు భావించుట - ప్రకృష్ట మననంబగును. ప్రకృష్ట మననశీలునియందే మునిశబ్దము ప్రసిద్ధంబగునది.

జ్ఞానదార్ఢ్యమునకై ఉపాస్యమునకు చెందిన యంశముల నభ్యసించుట యగు ప్రకృష్టమననము నుపాసకుఁడు అవలంబింపవలెనని భావము.

నిరంతర శివాహంభావనకు వలయు షట్స్థలోపాసనమున కనువైన లింగాంగసంయోగ మనఁదగు సర్వాంగలింగసాహిత్యమే ప్రకృష్ట మననంబగు నని సిద్ధాంత సారాంశము.

ఉపాసనాకాలమునందు ఏదేనొకరీతిని శివునుపాసించినను ఇతర సమయ ములయందు సాంసారిక చింతలనేకములు ఆవహించుచుండును. అట్టివాడు శివో పాసనా కాలమునందును సమయాంతర చింతితములైన విషయముల నాలోచించును గావున నట్టివానికి ఉపాసనాదార్ఢ్యము అనఁగా ఏకాగ్రచిత్తము కలుగదు. అందు వలన ఇతర సమయములయందును పరమాత్మను గురించి భావించుట అభ్యసింపఁ

బడునేని ఉపాసనాకాలమున ఉపాస్యమునందు చిత్తము ఏకాగ్రముగా స్థిరపడుట కవకాశ మేర్పడునని గ్రహించునది.

షట్స్థలములయందు శివు నుపాసించుటకు వలయు లింగాంగసంయోగము, అద్దానివలన సంభవించు ప్రకృష్టమననంబును శాంభవదీక్షాప్రయుక్త శివలింగధారులకే సిద్ధించును గాని తదితరులకు సిద్ధింపదనియు బ్రహ్మోపాసకునకు మౌనము తప్పనిసరి యనియు వివేకము.

## కృత్స్నభావాధికరణము

సూ. "కృత్స్నభావాత్తు గృహిణోపసంహారః" 3-4-47

సమస్త ఆశ్రమములవారికిని శివోపాసనము సాధారణమా? లేక విశేషము కలదా? అని సందేహము.

ప్రశ్న: బ్రహ్మచారి వేదాభ్యాస నిమిత్తముగా ఆచార్యునకు అధీనుఁడగుట వలనను గృహస్థుఁడు కుటుంబమును పోషించు శ్రమ కలవాడగుటను వానప్రస్థుఁడు వైఖానస ధర్మముల నాచరించుట యందు ఆసక్తుడగుటఁ జేసియు వీరికి శివోపాసనమనఁబడు జ్ఞానము కాని శివధ్యానము గాని సంభవింపవు గదా! "వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః - సన్న్యాసయోగా ద్యతయః శుద్ధసత్త్వాః" అను శ్రుతియు వేదాంత జ్ఞానము గలవారికే సన్న్యాసయోగము కుదుటపడుననియు "అంత్యాశ్రమస్థః" ఇత్యాది శ్రుతి వాక్యంబును చివరి ఆశ్రమము గలవారే ధ్యానయోగము నవలంబింప నర్హులనియు తెలుపుటచే అంత్యాశ్రమము వారికే జ్ఞాన ధ్యానములు సరిపడును కాని తదితరులకు చెల్లనేరవని చెప్పవలెను కాదా?

ఉత్తరము: ఆశ్రమములన్నిటియందును విద్య (శివోపాసనము) సంభవించియే తీరును. ఎట్లనఁగా? ఛాందోగ్యమునందు "కుటుంబే శుచౌ దేశే స్వాధ్యాయ మధీయానః" "కుటుంబము గలవాడు ఒకానొక పవిత్రస్థలమున స్వశాఖోక్త వేదము నావర్తించుచు శివు నుపాసింపవలెను" అను వాక్యము మొదలుకొని "సఖల్వేవం వర్తయన్ యావదాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే నచ పునరావర్తతే" "ఉపాసకుఁడు పూర్వోక్తవిధముగా జీవితమున్నంతవరకు శివునుపాసించునెడల పరమపదమును పొందఁజాలును, మరల సంసారములోనికి రాజాలడు" అను

వాక్యముపరకు అన్ని యాశ్రమములవారికిని విద్యాసద్భావము బాగుగా నిరూపింపఁబడినది.

ఇఁట గృహస్థుని ప్రత్యేకించి చెప్పుట- ఇతర ఆశ్రమములవారి నందరి నుపసంహరించుట యగును. ఇట్లే అంత్యాశ్రమవచనంబును ఆశ్రమములన్నిటికిఁ జెందినదేయని గ్రహింపనగును. ఇందువలన తేటపడునదేమనఁగా? బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థ సన్న్యాసు లందరికిని విద్య (శివోపాసనము) సంభవించునది యేను; సన్న్యాసమనఁగా? కర్మఫలత్యాగముగాని కర్మత్యాగము కాజాలదు. యతిత్వమనఁగా? జితేంద్రియత్వము; ఇదియంతయు అన్ని యాశ్రమములవారికిని సంభవించునదియేను;

మఱియు "అత్యాశ్రమస్థః సకలేంద్రియాణి నిరుధ్య భక్త్యా స్వగురుం ప్రణమ్య" అను కైవల్యమందలి పాఠము సుప్రసిద్ధమైనది. కాని "అంత్యాశ్రమస్థః" అను పాఠము సుప్రసిద్ధము కాదు. అత్యాశ్రమమనఁగా?

శ్లో॥ అగ్ని రిత్యాదిభి ర్మంత్రైః - భస్మనోద్ధూళనం తథా ।
త్రిపుండ్రధారణం చైవ - వదంత్యత్యాశ్రమం బుధాః॥

"అగ్నిరితిభస్మ'' మున్నగు వైదికమంత్రములతో మంత్రింపఁబడిన శుద్ధ విభూతి నలఁదుకొనుట, భస్మను మూడురేఖలుగా ఫాలప్రదేశాదులయందు ధరించుటయు పండితులు అత్యాశ్రమంబని చెప్పుదురు" అను పురాణప్రమాణంబును ఇందుకు ప్రోద్బలకమగును. జాబాలశాఖయందును "భస్మరుద్రాక్ష లింగానామేకైకస్య త్రయస్య వా, సాధారణం స్యా త్పాశుపతం- వ్రతమత్యాశ్రమాహ్వయమ్" "భస్మ రుద్రాక్ష శివలింగములలో ఒక్కొకదానిని లేక మూడింటినైన నవలంబించుట- అత్యాశ్రమమనఁబడు పాశుపతంబగును" ఇట్టి అత్యాశ్రమ లక్షములు సర్వాశ్రమములవారికిని సాధారణములే యగునని సారాంశము.

## మౌనవదధికరణము

సూ. "మౌనవదితరేషా మప్యుపదేశాత్" 3-4-48

"తృష్ణాం ఛిత్వా హేతుజాలస్య మూలం- బుద్ధ్యా సంచింత్య స్థాపయిత్వా చ

రుద్రే, రుద్ర ఏకత్వ మాహుః, రుద్రం శాశ్వతం వై పురాణ మిష మూర్జం తపసా నియచ్ఛత! వ్రతమేతత్పాశుపతమ్" "ప్రాణేష్వంతర్మనసో లింగ మాహుర్యస్మిన్ క్రోధో యా చతృష్ణా క్షమా చ''

"రాగద్వేషమదమాత్సర్యాదులగు సంసారకారణములకు మూలమగునది తృష్ణ (ఆశ) అని బుద్ధిబలమున నిర్ణయించుకొని అట్టి బుద్ధిని పరమేశ్వరుని యందు నిలుపవలెను. శాంభవదీక్షితుఁడు లింగాంగ సంయోగము కలవాఁడగుటఁ జేసి శివునితో తాదాత్మ్యమును పొందునని చెప్పుదురు. అనఁగా "శివోఽహం"అను భావనను అభ్యసింపవలెనని అభిజ్ఞులు వక్కాణింతురని భావము. (ఇద్ది ప్రాణలింగానుసంధానవిధాయకమంత్రము) ఇఁక ఇష్టలింగధారణము విధింపఁ బడుచున్నది- శాశ్వతుఁడు అనాదియు ఇష్టలింగస్వరూపుఁడు స్ఫటికశిలాది మయుఁడు నగు పరశివుని దీక్షతో కంఠాదిప్రదేశములయందు ధరింపవలెను. (ఇద్ది పాశుపతవ్రతస్థూలస్వరూపమనఁబడును, పంచప్రాణములమధ్య మనస్సును ప్రేరేపించునదిగా సూక్ష్మశరీరమునందు ప్రాణలింగము నెలకొనియున్నది. ఇట్టి మనస్సునందు క్రోధము, తృష్ణయు, క్షమయు తదితరకామాది వికారంబులును కలుగుచుండును.

ఇట్లు అధర్వశిరమునందు వినఁబడుచున్నదియు మహాలింగజాబాలాదుల యందు విపులీకరింపఁబడినదియు పురాణములయందు సుప్రసిద్ధంబు నగు పాశుపతవ్రతము నవలంబించినవారికి జ్ఞానప్రాప్తియు మోక్షంబును సమకూరునా? లేదా? అని సంశయింపఁబడుచున్నది.

ప్రశ్న: పాశుపతము ఆశ్రమములలో చేరనిదగుటచేతను అవధి కలదగుటఁ జేసియు పుత్రాదిఫలప్రాప్తికై శ్రీకృష్ణుడు మున్నగువారిచే ఆచరింపఁబడుటను పాశుపతవ్రతస్థులకు అవాంతరఫలంబే సమకూరును కాని మోక్షము సిద్ధింపదని చెప్పుట సమంజసము కాదా?

ఉత్తరము: పాశుపతవ్రతమును ఆజన్మాంతము ఆచరించువారికి ముక్తియే ఫలంబగుచున్నయది.

ప్రశ్న. అధర్వశిరంబునందు "అగ్నిరితి భస్మ వాయురితి భస్మ జలమితి భస్మ, స్థలమితి భస్మ, వ్యోమేతి భస్మ, సర్వగ్ం హ వా ఇదగ్ం భస్మ, వాఙ్మన ఇత్యేతాని చక్షూగ్ంషి కరణాని భస్మాని, "వ్రతమిదం పాశుపతం పశుపాశవిమోక్షాయ" "భస్మ-అగ్నివలె పావనమైనది; విభూతి-వాయువు

వలె నిర్దుష్టమగునది; భస్మ-జలముఁబోలినదై మాలిన్యముఁబోగొట్టునది; విభూతి-స్థలమువలె శ్రేయోనిలయమగునట్టిది; భస్మ-ఆకాశమువలె స్వచ్ఛమైనది; వేయేల? చరాచరమంతయు భస్మగా (అనఁగా శివునకు సమర్పణీయముగా) పేర్కొనంబడుచున్నయది. మఱియు వాక్కు మనస్సుమొదలగు ఇంద్రియములన్నియు వరమేశ్వరుని విభూతిలేశములని భావింపవలెను. ఇట్టి భస్మను ధరించువారి వ్రతము పాశుపతమనంబడుచున్నయది. పశువగు జీవుఁడు పాశుపతదీక్షితుఁడై పాశముఁబోలిన సంసారమునుండి విడిబడి శివసముండగును" ఇట్లు చెప్పఁబడుటవలన పాశుపతవ్రతము కేవలము భస్మధారణాత్మకంబైనదని తెలియుచున్నది కాదా?

ఉత్తరము: ఇఁట భస్మపదము— మహాలింగమును రుద్రాక్షములను సూచించుచున్నయది. ఇందుకు మహాలింగజాబాలోపనిషద్వాక్యమును ప్రోద్బలకముగ గాననగును.

"తత్ర భస్మ రుద్రాక్ష మహాలింగధారణాత్మకం వేధా మనుక్రియాఽఽఖ్య త్రివిధ మహాదీక్షా విశిష్ట ముత్తమ మితి" "భస్మరుద్రాక్ష శివలింగధారణాత్మక దీక్షాత్రయమున భస్మరుద్రాక్ష మహాలింగములను ధరించునట్టిది, వేధా మను క్రియలను ముప్విధములు గలదియు నగు వ్రతము ఉత్తమంబైనది" అథర్వ శిరంబునందును "ఇష్టమూర్జం తపసా నియచ్ఛత" "ఊర్జం- ఊర్గ్వై అన్నం" అనుటచే పృథివీసంబంధమగు శిలాదిరూపము గల, ఇష్టం— ఇష్టలింగమును తపసా-దీక్షతో, నియచ్ఛత-ధరింపుడు!" ఇట్లు ఇష్టలింగధాణము విధింపఁబడియున్నది.

మఱియు "మృత్యుతారకం గురుణా లబ్ధం కంఠే బాహౌ శిఖాయాం వా బధ్నీత" అను బృహజ్జాబాలవాక్యము- మృత్యుమయమగు సంసారసాగరమునుండి తరింపఁజేయునది మహాలింగమే యగును కాని మరియొకటి కాజాలదని నొక్కి వక్కాణించుచున్నది కావుననే వేదములన్నిటియందు వైదికులతో నిర్వచింపఁబడిన పాశుపతవ్రతమును ముముక్షువు తప్పక ఆచరింపవలెనని ప్రామాణిక వాఙ్మయమంతయు చాటుచున్నది. వేదములన్నిటియందును మహాలింగధారణము స్పష్టముగా నిర్ణయింపఁబడినది.

ఇట్లు స్థూలసూక్ష్మకారణ శరీరముల నంటియుండు ఆణవ కార్మిక మాయికములనఁబడు మలత్రయమును పోనాడు దీక్షాత్రయమును స్వీకరించి ఇష్ట ప్రాణ

భావము లనఁబడు మహాలింగముల మూఁడిటి నుపాసింపనియెడల అనాదియగు సంసారప్రణాళిక యెట్లు అంతరించును? పూర్వోక్త పాశుపతమును గ్రహింపని యెడల ఎప్పుడైనను మోక్షము చేకూరదు. మఱియు "చిదానందరూపః శివోఽహం'' అను భావన- నిరంతరసర్వాంగ లింగసాహిత్యము ననుసంధించుటయని తెలియనగును. ఇట్టి శివాహంభావము లేనిది జ్ఞానసిద్ధిగాని శివరూపమగు ముక్తి చేకూరుట గాని సంభవింపవు గదా!

ఇంకను కొంత పరిశీలింతము

అర్చిరాదిగతి లేనిది పరంజ్యోతిఁబొందుటకు వీలులేదు. మూర్ధన్యనాడీ ద్వారా నిష్క్రమణము లేనిది అర్చిరాదిగతి సిద్ధింపదు. లోపల బయట నుపాసించుటకు ధరింపఁబడు మహేశ్వరుని ప్రసారము లేనిది మూర్ధన్యనాడీద్వారము ప్రకాశింపదు.

శాంభవదీక్ష ననుగ్రహించు కళ్యాణదేశికుని కరుణతో పొందఁబడువాఁడును ఇష్టప్రాణభావాఖ్య త్రివిధ స్వరూపుఁడు నగు పరమేశ్వరుని పరమానుగ్రహమునఁ జేసి మూర్ధన్యనాడిద్వారా బయలుదేరి దేవయాన మార్గమున పరంజ్యోతి నాశ్రయించినవానికే స్వస్వరూపము నావిష్కరించు పరమముక్తి సంభవించును. ఇట్లు చెప్పటవలన పరమేశ్వరుని పరమప్రసాదమును కలిగించునది, భస్మరుద్రాక్షశివలింగధారణాత్మకంబునగు పాశుపతవ్రతమే ముక్తికి మూలంబగునని విశదమైనది.

మహాభారతమునందు

శ్లో॥ గతాంతై రధ్యవసిత - మత్యాశ్రమ మిదం వ్రతం।
మయా పాశుపతం దక్ష - శుభ ముత్పాదితం పురా ॥

భగవత్తత్త్వమును గురించి అత్యంత దృఢనిశ్చయము గల మహానుభావులు అవలంబించుటకై అత్యాశ్రమమనఁబడు శుభకరమైన పాశుపతవ్రతమును అనాది కాలమునుండి ప్రవర్తింపఁజేసితిని" అని పరమేశ్వరుఁడు దక్షప్రజాపతికి వాక్రుచ్చెను.

కావున భస్మ రుద్రాక్ష మహాలింగ ధారణాత్మకంబగు పాశుపతవ్రతంబే.

ముక్తి నిదానములన్నిటిలో నుత్తమంబనుట యుక్తంబని గ్రహింపవలెను. పాశుపతము- భస్మోద్ధూళన త్రిపుండ్రధారణాత్మకంబనియు, భస్మరుద్రాక్షధారణాత్మకంబనియు భస్మరుద్రాక్ష మహాలింగధారణాత్మకంబనియు ముప్విధములు కలిగియున్నది.

సూత్రములోని మౌనపదమునకు మునిధర్మమని యర్థము. మునిధర్మమనఁగా? ప్రకృష్టమననముగల వాని యాచరణము. ప్రకృష్టమననమనఁగా? షట్స్థలములయందు లింగాంగసంయోగమున సర్వాంగలింగసాహిత్యము గలవాడై శివు నుపాసించుట యగును.

వాయుసంహితయందును

శ్లో॥ యః కృత్వాఽఽత్యంతికీం దీక్షా - మాదేహాంత మనాకులః ।
సువ్రతం తత్ ప్రకుర్వీత - స తు వై నైష్ఠికః స్మృతః ॥

సోఽత్యాశ్రమీ చ విజ్ఞేయో - మహాపాశుపత స్తథా ।
స ఏవ తపతాం శ్రేష్ఠ - స్స ఏవ తు మహావ్రతీ ॥

న తేన సదృశః కశ్చిత్ - కృతకృత్యో ముముక్షుషు ।
శివార్పితాత్మా సతతం -మననం సాధయే న్మునిః ॥

"దేహాంతమగువరకు ఆచరింతునని అత్యంతనిష్ఠతో శాంభవదీక్షఁ బరిగ్రహించి పాశుపతవ్రతస్థుఁడు కావలెను. అట్టివాడే నైష్ఠికుఁడనఁబఱగును. అతడే అత్యాశ్రమియనియు మహాపాశుపతుడనియు తపించువారిలో మేటియనియు మహావ్రతముగలవాడనియు పేర్కొనఁబడును. నిజముగా విచారించి చూచినచో పాశుపతవ్రతస్థునితో సమానుడైన మరియొక కృతార్థుఁడు ముముక్షువులలో లేడని చెప్పవచ్చును. ఇందువలననే శాంభవదీక్షితుఁడు నిరంతరము శివునియందు తన యంతఃకరణమును సమర్పించి ప్రకృష్టమననమును సాధించును కావున ముని యనఁబడును.

ఇట్టి మౌనమువలె నితర ధర్మములు గూడ నుపదేశింపఁబడినవి.

శ్లో॥ పయోవ్రతీ వా భిక్షాశీ - భవే దేకాశన స్తథా।
నక్తయుక్తాశనో నిత్యం - భూశయ్యాభిరతః శుచిః ॥

భస్మశాయీ తృణశాయీ - చీరాజినశయోఽథవా।
బ్రహ్మచర్యరతో నిత్యం - వ్రతమేత త్సమాచరేత్ ॥

క్షమా దాన దయా సత్యా - హింసాశీలః సదా భవేత్ ।
సంతుష్ట శ్చ ప్రశాంత శ్చ - జపధ్యానరత స్తథా ॥

"అజన్మాంతము పాశుపతవ్రతము నవలంబించిన మహానుభావుఁడు పాలు మాత్రము శివునకు నివేదించి పరిగ్రహింపవలెను. అథవా యాచించియైనను జీవింప వలెను. ఏకభుక్తము లేక నక్తభోజనము పాశుపతునకు విహితములు ఎప్పుడును పరిశుభ్రతగలవాడై భూశయనము, భస్మశయనము. తృణశయనము, వస్త్రఖండ శయనము, అజిన(మృగచర్మ)శయనము అనువానిలో ఏదేనొకరీతిగా రాత్రులందు యుక్తసమయమున నిద్రింపవలెను. శైవుఁడు గృహస్థుఁడైనను సాధ్యమైనంత వరకు బ్రహ్మచర్యమును పాటించుచు నిత్యము వ్రతాంగముల నాచరించుచుండ వలెను.

ఐతే పాశుపతునకు భస్మరుద్రాక్ష శివలింగధారణములు శివపంచాక్షరీ జపము త్రికాల షట్కాల శివపూజనము ఎట్లు విహితములో అట్లే క్షమ (ఓర్పు) దానము, దయ, సత్యము, అహింస, సంతోషము, ప్రశాంతి అను గుణంబులును ముఖ్యములని భావింపవలెను.

శివారాధనాంగముగాను తదితరయుక్త సమయములయందును శివమంత్ర జపమును శివధ్యానమును శైవుఁడు గావించుచుండుట శ్రేయస్కరంబగును"

ఇఁట "పయోవ్రతీ" అనుటవలన "శివపూజాసమయమున వరి అన్నమునే నివేదింపవలె" నను అవైదిక సంప్రదాయమునకు అవకాశము చిక్కుట లేదు. ప్రాజ్ఞులు పెద్దలు ఇట్టి మూఢాచారములను పామరులనుండి విడదీసి సత్సంప్రదాయమును ప్రచార మొనర్తురు గాత !

"వాలాగ్రమాత్రం హృదయస్య మధ్యే - విశ్వేదేవం
జాతవేదసం వరేణ్యం,
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా - స్తేషాం
శాంతిః శాశ్వతీ నేతరేషామ్"

సర్వతః ప్రకాశమానుఁడును వేదముల నావిర్భవింపఁజేయువాఁడును ప్రకృతి పురుషులకన్న మిన్నయు నగు పరమాత్మ వెంట్రుకకొనవంటి సూక్ష్మరూపమున హృదయమునందు నివసించువాఁడు.

అట్టి శివుని తమ హృదయములో నున్నవానిగా నుపాసించి దర్శించువారికే అనఁగా- భావలింగసాక్షాత్కారముగలవారికే శాశ్వతమైన శాంతి అనఁగా శివానందప్రాప్తి సమకూరును గాని ఇతరులకు అనఁగా శివేతరోపాసకులకు సాయుజ్యము సంభవింపఁజాలదు"

ఇట్టి భావలింగసాక్షాత్కారమునకు సాధనము ప్రాణలింగానుసంధానము అనఁగా శివషడక్షరీ మంత్రానుష్ఠానమనియు ప్రాణలింగాను సంధానము నాపాదించునది ఇష్టలింగారాధనమనియు ఇష్టలింగారాధనమునకు వలయు యోగ్యత నావహించునది శాంభవదీక్షాస్వీకారంబనియు వివేకము.

"సర్వలింగగ్ స్థాపయతి" అని యజుర్వేదంబును "పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే, అతప్తతనూ ర్నతదామో అశ్నుతే, శ్రుతాస ఇద్వహంత స్తత్సమాసతే" అని ఋగ్వేదంబును "అంతర్ధారణశక్తోవా హ్యశక్తో వా ద్విజోత్తమః, సంస్కృత్య గురుణా దత్త- మిష్టలింగ మురఃస్థలే- ధార్యం విప్రేణ ముక్త్యర్థమ్" అని సామవేదమునందలి జైగీషవ్యశాఖలోని సదానందోపనిషత్తును "యో వామహస్తార్పిత లింగమేకం- పరాత్పరం ధారయతే విప్రః క్షత్రియో వా, తస్యైవ లభ్యః పరమేశ్వరోఽసౌ - నిరంజనః పరమం సామ్య ముపైతి" అని అధర్వవేదము నందలి ఐశ్వరశాఖయు లింగధారణమును సమర్థించుచున్నవి.

పరబ్రహ్మంబగు శివుని అనుసంధించుటయే విద్యాసంపత్తి యగును. మునిధర్మము పాశుపతునకు అవసరమైనట్లు భిక్షాచర్య శమదమాదులగు పరధర్మంబులును పాశుపతవ్రతమునందు ఉపదేశింపఁబడినవి.

"రుద్ర ఏకత్వ మాహుః" రుద్రం శాశ్వతం వై పురాణ మిష మూర్జం తపసా నియచ్ఛత! వ్రతమేతత్ పాశుపతం: అగ్నిరిత్యాదినా భస్మగృహీత్వా విమృజ్యాంగాని సంస్పృశేత్, తస్మాద్వ్రతమేతత్ పాశుపతం పశుపాశవిమోక్షాయ" ఇట్లు శ్రుతి- శివధ్యానము పాశవిచ్ఛేదమను మోక్షఫలము నొసగునని నిర్వచించుచున్నది. కావున యావజ్జీవము పాశుపతవ్రతము నవలంబించు వారికి ముక్తియే ఫలంబని సారాంశముగా విదితమైనది.

ప్రశ్న : తాము అంతర్లింగధారణమువలె బహిర్లింగధారణము విహితం బని సప్రమాణముగా నిరూపించితిరి. సరియే కాని శరీరము సహజముగా అశుచి యగుటఁజేసి అట్టి అపవిత్ర శరీరమునందు లింగధారణము కూడదు గదా?

ఉత్తరము : శరీరము నీవనినట్లు సహజమాలిన్యముగలదను సంశయమును మేమును అంగీకరింతుము కాని శాంభవదీక్షఁ బరిగ్రహించునపుడు షడధ్వశోధన మున శరీరము పవిత్రమగునని భావింపఁబడును. కావున నట్టి అపవిత్రశంకకు ఎంతమాత్రము అవకాశము లేదు.

ప్రశ్న : అట్లైనను శరీరము - మలత్యాగాదులతో దూషితమగుట అని వార్యంబగుకతన అట్టి దేహమునందు శివలింగమును ధరించుట సరిపడదు గదా!

ఉత్తరము : మలత్యాగాది సమయములందు శాస్త్రములో చెప్పఁబడిన శౌచ విధి అట్టి అశుచిత్వమును పోగొట్టునదగుటచే ఆస్తికులు తాదృశ అపవిత్రత్వమును గురించి శంకింపఁగూడదు గదా! మఱియు "సర్వా వై దేవతా వేదవిది బ్రాహ్మణే వసంతి" అను శ్రుతిప్రమాణము వేదవిదుడైన బ్రాహ్మణునియందు దేవతలందరు నివసింతురని చెప్పుచున్నందున బ్రాహ్మణుఁడు నిత్యశుచిగా నుండువాడని భావింప వలెను కావునను అట్టి భావనకలవాడే లింగధారణమునందు అధికారము కలవా డగుననియు ఎట్టి విధులున్నను శరీరము అపవిత్రంబేయని భావించువాడు లింగ ధారణమునకు అనధికృతుండనియు తెలియవలెను.

ప్రశ్న : మీరు చెప్పినంతవరకు అంగీకరింపవచ్చును కాని స్త్రీలు రజో దూషితమైన శరీరము కలవారగుటచే నవ్వారికి లింగధారణము విహితము కాదు గదా!

ఉత్తరము : స్త్రీలుగూడ మోక్షముఁ బొందుటకు అధికారము కలిగియుం డుట యనివార్యంబగటచే నవ్వారికిని లింగధారణము తప్పనిసరియగుచున్నది. ఇందువలననే [కారణోత్తరాగమమునందు "దీక్షాపవిత్రాంగత్వాల్లింగస్పర్శో న దుష్యతే" "స్త్రీలు-శాంభవ దీక్షఁబరిగ్రహింతురు కావున వారిశరీరమునకు శివలింగ ధారణము విహితంబే యగు" నని చెప్పఁబడినందున స్త్రీలకు లింగధారణము సమంజస మగుచున్నయది.

ఒకవేళ వారు అపవిత్ర శరీరము కలవారని భావించి లింగధారణమును నిషేధించునెడ స్త్రీలు ఎల్లకాలము సంసారాంధకూపమునందే నివసింతురనునంశము ధృవపడును. ఇద్ది విమర్శసహము కాదు. గార్గిమొదలగు స్త్రీలనేకులు బ్రహ్మవిద్యా పరినిష్ఠగలవారని వేదము సిద్ధపఱచినది.

ప్రశ్న : స్త్రీలకు బ్రహ్మవిద్యయందధికారము చెల్లుగాత! కాని వీరికి బహిర్లింగధారణవిద్యయందు అధికారము లేదని చెప్పుట సమంజసము కాదా?

ఉత్తరము: ఓయీ! నీవనునది మోహవిజృంభిత మగును. లింగావబద్ధాధికరణమునందు పాశుపతవ్రతము ననుష్ఠించువారికే బ్రహ్మవిద్యయందధికారము కలుగునని చెప్పఁబడుటచే స్త్రీలకు పాశుపతవ్రత స్వరూపమగు లింగధారణము నంగీరింపవలసియుండును. ఒకవేళ పాశుపతవ్రతమును నిషేధించి బ్రహ్మవిద్యాధికారమును సాధించునెడ- ఉపనయనమునందు అధికారమును తీసివేసి యజ్ఞమునందధికారము నపేక్షించుటవలె పరిహాసాస్పదంబగును.

ప్రశ్న : తాము చెప్పినట్లు స్త్రీలింగధారణము నంగీకరించినను రజస్వలా సమయమున అన్నము రజోదూషితమగును కావున నివేదనీయము కాజాలదు. అందువలన బహిర్లింగధారణమే స్త్రీలకు కూడదని చెప్పవలసియుండును. కాని స్త్రీలు పాశుపతవ్రతమునందు బ్రహ్మవిద్యయందును అధికారము కలిగియుందురని మాత్రము నిరూపింపవలెను కాదా?

ఉత్తరము : ఇదియు సమంజసము కాదు. స్వర్గప్రాప్తిమూలమగు పౌండరీకయాగమును నలుబది దినములవరకు గావింపవలసియుండును. ఇట్టి యాగమున రజోదూషితమైన అన్నమును యజమానుఁడే గాక ఋత్విజులును భుజింపవలెనను నియమము నంగీరించువారు - మోక్షఫలంబగు లింగధారణమునందు రజస్వల స్పృశించిన అన్నము ఆమె ధరించిన శివలింగమునకే నివేదింపఁగూడదని చెప్పుటఁజూడ నట్టివారికి మోక్షమును గురించిన సందర్భమునందే గొప్పద్వేషము కలదని విశదపడుచుండుటచే ఇదియంతయు అసంబద్ధ ప్రలాపముగా తోచెడిని.

అందువలన ముముక్షువులందరిచే భస్మరుద్రాక్ష మహాలింగధారణాత్మకంబగు పాశుపతవ్రతము తప్పనిసరి ననుష్ఠింపఁదగినదని తెలియవలెను.

సూ. "అనావిష్కుర్వ న్నన్వయాత్" 3-4-49

పాశుపతము తనను మఱియొక ఆశ్రమముగా తెలుపకున్నను ఇందు విద్యా సాధనములగు బ్రహ్మచర్యాదిధర్మములు చేరియుండుటచేసి అత్యాశ్రమ మనఁబఱు గుచు స్వతంత్రమైన ఆశ్రమంబై పరమశివప్రాప్తికి నిదానమగుచున్నయది.

పాశుపతము - ఉపాసన మున్నగు పరమహంసధర్మములు కొన్నియుండు టచే బ్రహ్మచర్యాశ్రమంబును కాదు. సన్న్యాసాశ్రమమగునందుమా? అగ్ని హోత్రాదిధర్మములు పాశుపతమునందు విహితములై గానఁబడుచున్నవి. పరమ హంసధర్మములు కలిగియుండుట కతన గృహస్థాశ్రమంబును కాజాలదు. గ్రామ నివాసమువలన వానప్రస్థ ఆశ్రమమునగుటకు వీలులేదు. కావుననే పాశుపతము స్వతంత్రమైన ఆశ్రమవిశేషంబని నిర్ధారింపఁబడినది. ఐతే ఇట్టి పాశుపతము పూర్వోక్త రీతిని "యావచ్ఛరీరపాతం వా ద్వాదశాబ్ద మథాపి వా" అను ప్రమాణము ననుసరించి ఆత్యంతికమనియు సావధికమనియు రెండు తెఱఁగులు. ఇందు ఆత్యంతికమే అనఁగా జీవితాంతమువరకు ఆచరింపఁబడు పాశుపతమే అత్యా శ్రమ మనఁబఱగుచు అపవర్గ (మోక్ష)మునకు హేతువగుననియు తదితరమైన సావధికము అనఁగా పండ్రెండ్రువత్సరముల యవధిగల పాశుపతము భోగప్రద మగు ననియు వివేకము. ఇట్లు భుక్తిముక్తిజనకముగా ద్వివిధంబైన పాశుపతము శివానుగ్రహకరంబని శ్రుతియే నిరూపించినది. మరియు ఇద్దానికి ప్రమాణకోటి మూర్ధన్యత బాగుగా శివాగమాదులయందు ప్రతిపాదింపఁబడినది.

ఆశ్రమవిశేషంబగు పాశుపతమును సంవర్తాది మహాయోగులు అవలంబించి నట్లు మహాభారతములోని ఆశ్వమేధికపర్వమునందు గాననగును. తన అగ్రజు డైన బృహస్పతి బాధించుచున్నందున సంవర్తుఁడు అట్టి బాధను సహింపఁజాలక దాయభాగమునంతయు విడనాడి వనమున నివసించుచు దేహాభిమానవర్జితుడై శివ ధ్యానమును చేయుచుండెను. మరియు కొంతకాలమైన పిమ్మట వారాణసియందు నివాసము నేర్పరచుకొని దిగువవిధము పరమేశ్వరుని గురించి శరణాగతుండ య్యెను.

శ్లో॥ యస్య నిత్యం విదుః స్థానం - మోక్ష మధ్యాత్మచింతకాః,
యోగిన స్తత్త్వమార్గస్థాః - కైవల్యం పరమం పదమ్ ॥
యం విదుః సంగనిర్ముక్తాః - సామాన్యం సమదర్శినః,
తం ప్రపద్యే జగద్యోని - మయోనిం నిర్గుణాత్మకమ్ ॥

అసృజ ద్యస్తు భూతాదీన్ - సప్తలోకాన్ సనాతనాన్,
స్థితః సత్యోపరి స్థాణు - స్తం ప్రపద్యే సనాతనమ్॥
భక్తానాం సులభం తం హి - దుర్లభం దూరపాతినాం,
అదూరస్థ మజం దేవం - ప్రకృతేః పరతఃస్థితమ్॥

మనస్సులో శివుని ధ్యానించువారు బాహ్యమున శివుని పూజించు యోగులును తత్త్వములను పరామర్శించి ఇవ్వానికంటె నతీతమైన నిత్యమగు స్థానము కలదనియు అట్టి పరమపదముఁ బ్రవేశించుటయే మోక్ష స్వరూపంబనియు కైవల్య ప్రాప్తియనియు గురుతెఱుగుచున్నారు. సర్వసంగపరిత్యాగులైన మహానుభావులు శివుని సర్వత్ర సమానవ్యాపకునిగా భావించుచున్నారు.

జగత్కారణుఁడు అకారుణుఁడు నిర్గుణస్వరూపుఁడు నగు శివుని శరణు బొందుచున్నాను. అట్టి శివుఁడే సనాతనములైన సప్తలోకములను పంచభూతములను సృజించి సత్యలోకముపై నుండువాడు. భక్తులకు సులభుఁడు సమీపమందుండువాడు తదితరులకు దుర్లభుండును ప్రకృతిని మించియుండువాడు నగు శివుని ధ్యానించుచున్నాను'' ఇవ్విధము సంవర్తుఁడు శివు నాశ్రయించి మరుత్తునకు శివ స్తోత్రమునందు శివునికిగల ఆద్యస్థానమే పరమపదమనఁబఱిగి మోక్షస్థానమగునని యుపదేశించెను.

ఇత్యాది సందర్భమును పరిశీలించినచో సంవర్తుడు మున్నగువారు పాశుపతాశ్రములనియు శ్వేతాచార్యుఁడు మొదలుకొని లకులీశుని వరకు గల నూట పంద్రెండ్రుగురు మహానుభావులు శివయోగము ననుష్ఠించినవారనియు విశదమగును కావుననే పాశుపతము ఉత్తమోత్తమంబైన మోక్షసాధన మగుననుటలో సందియ మిసుమంతయు గానరాదు.

## ఐహికాధికరణము

సూ. "ఐహిక మప్రస్తుత ప్రతిబంధే తద్దర్శనాత్" 3-4-50

సూత్రార్థము -

"ఉపాసనాఫలమగు ముక్తి - శాస్త్రమునందు ప్రశంసింపఁబడిన ప్రబల

కర్మాంతరరూప ప్రారబ్ధముఁదగు ప్రతిబంధము లేనియెడల - ఈ జన్మ చివరిదశ యందే సంభవించును. ఇట్లు శ్రుతులయందు గాననగును "

ఈ వరకు చెప్పఁబడిన క్రమముగా శివోపాసనయందు నిష్ఠ గలవారికి ముక్తిఫలము ఈ జన్మయందే సంభవించునా ? లేక జన్మాంతరమునందా ? అని సంశయము.

ప్రశ్న : పురుషుఁడు శాంభవదీక్షితుఁడై ఈ జన్మయందే ముక్తుఁడనగుదు నని మనసునందిడుకొని శివోపాసనమునందు ప్రవర్తించును కాని జన్మాంతరము నందు ముక్తుఁడ నగుదునని ప్రవర్తింపఁడు గదా ! లోకములో ప్రయోజనము సిద్ధిం చుటకు ఆలస్యము నెట్టివాడును కోరడు కావున ముక్తిఫలము అనునది యున్నచో ఈ జన్మయందే సిద్ధింపవలెను. కానిచో ఎప్పుడును ముక్తిఫలము చేకూరదని చెప్పవలెను గదా ?

ఉత్తరము : ప్రబలమైన కర్మాంతర ప్రతిబంధము లేనియెడల శివోపాసన ఫలమగు మోక్షము (శివసాయుజ్యము) ఇహజన్మమునందే సంభవించును. ఒకవేళ ప్రబల కర్మాంతర ప్రతిబంధ రూపమైన ప్రారబ్ధము శేషించునెడ అద్దాని ఫల మును జన్మాంతరమునందు అనుభవించి శివోపాసకుఁడు ముక్తుండగును.

సుకృతఫలమగు అభ్యుదయము ఇహజన్మ కృత పుణ్యకర్మ యనంతరమే సంభవించునను నియమము లేదనియు ప్రతిబంధకముండుతఱి జన్మాంతరమున ఐహిక సుకృతఫలము చేకూరుననియు కర్మకాండ యందు ప్రతిపాదింపఁబడి నట్లు పై విషయమును గ్రహింపనగును.

వామదేవుఁడు మున్నగువారు పూర్వజన్మకృత శ్రవణాది బలమున గర్భస్థు లయ్యే జ్ఞానవంతులైనట్లు వైదిక వాఙ్మయము చాటుచున్నయది. ఇందువలన తేట పడినదేమనఁగా ? ముక్తిఫలము ఈ జన్మయందే ప్రతిబంధము లేనిచో కలుగు ననియు ప్రతిబంధమున్నచో జన్మాంతరమునందు సంభవించుననియు సిద్ధాం తము.

## ముక్తిఫలాధికరణము

సూ. "ఏవం ముక్తిఫలానియమ స్తదవస్థావధృతే స్తదవస్థావధృతేః" 3-4-51

కేవలకర్మముఁదగు ఫలమైన అభ్యుదయము వలె ముక్తిఫలము గూడ బలవంతమైన కర్మాంతర మనఁదగు ప్రతిబంధము లేనియెడల సిద్ధించునని నిరూపింపఁ బడినది. ఐతే కర్మఫలము ఎట్లు అవధి కలదో జ్ఞానఫలంబు నట్లే ఒకానొక కాల వ్యవధి కలిగియుండునను నియమము పొసగునా ? లేదా ? అని సంశయము

ప్రశ్న : కర్మఫలమువలె ముక్తిఫలంబును సమయాతిశయము కలిగినదని చెప్పవలెను. ఎట్లనఁగా ? "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" "స్వర్ణసుఖమును కోరువాడు జ్యోతిష్టోమయాగమును చేయవలెను'' "వాజపేయేన స్వారాజ్యకామో యజేత" "స్వర్గమున ఉన్నత స్థానము నపేక్షించువాడు వాజపేయమను యజ్ఞమును ఆచరింపవలెను" ఇత్యాది శ్రుతివాక్యములు కర్మఫలము ఒకానొక సమయ విశేషము అవధిగా కలదని బోధించుచున్నవి. అటులే ఉపాసనరూపమైన జ్ఞానముఁదగు ఫలంబును సావధికమైనదని చెప్పుట సమంజసము కాదా ?

ఉత్తరము : కర్మఫలమునకు వలె జ్ఞానరూపమైన ఉపాసనఁదగు ఫలము ఒకానొక కాలవ్యవధి కలిగియుండునను నియమము లేదు. ఉపాసనకు బ్రహ్మ స్వరూపమును పొందు దశయే ఫలముగా నిర్ణయింపఁబడినది. ఉపాసకులందరికిని బ్రహ్మస్వరూపము ఒక్కటియే యగుటఁజేసి యుపాసనఫలమున హెచ్చుతగ్గులను భావింప వలనుపడదు.

"ఉపాసనలో నుండు తారతమ్యముఁబట్టి తత్ఫలంబగు ముక్తిలో హెచ్చు తగ్గులుండు'నని చెప్పఁగూడదు. ఉపాసనలకన్నిటికిని ముక్తిఫలము దక్క మరియొక ఫలము సంభవింపదు. బ్రహ్మము ఒక్కటియే యగుటకతన బ్రహ్మ ప్రాప్తి రూపమైన ముక్తిఫలంబు నొక్కటియే యగును గావున మోక్షఫలములో వైషమ్యము లేదని సిద్ధాంతము

దప్పిగొని దూరమునుండి కాని సమీపమునుండి కాని తటాకముఁజెంది మంచినీరు త్రాగువారికి సమానముగానే సంతృప్తి కలుగుచున్నట్లు లోకమున గాంచుచున్నవారము. మఱియు మేధాబలమునఁగాని బుద్ధిమాంద్యమునఁగాని వేదము నభ్యసించువారికి వేదాక్షరావాప్తియను ఫలమొక్కటియే యగుచున్నది గదా !

అట్లే ఉపాసనలకు బ్రహ్మ (శివ) ప్రాప్తి యొక్కటియే ఫలంబై నిరతిశయంబగునని సారాంశము.

ఇయ్యది
శ్రీ నీలకంఠ శివాచార్య విరచితమైన
బ్రహ్మ మీమాంసా సూత్ర భాష్యము నందు
మూడవ యధ్యాయముఁదగు నాలుగవ పాదము
శ్రీ కంఠమణి ప్రభా మయూఖ మను శాంకరీయ ఆంధ్రానువాదముతో
ముగిసినది.

---

పుస్తక పరిచయ శీర్షిక— ఆంధ్రప్రభ, 4 అక్టోబర్, 1970, ఆదివారము.

# శ్రీ నీలకంఠ భాష్యము

అనువాదము, ప్రకాశనము
**ఆచార్య శివశ్రీ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు**
184/ఎ, సర్వమంగళా సదనము, నెహ్రూనగర్,
సికింద్రాబాద్, 500 026, (ఆం. ప్ర.)

అనువాదకులు బహుగ్రంధ రచనలో సిద్ధహస్తులు. శ్రీ నీలకంఠాచార్యులు వేదవ్యాసకృత బ్రహ్మ సూత్రములపై రచించిన సంస్కృత భాష్యమునకు ఇది ఆంధ్రీకరణము. లోగడ ఈ గ్రంథం ప్రథమభాగమును ఆంధ్రప్రభలో 28-2-67 సమీక్షించితిమి. శైవ సిద్ధాంతానుగుణంగా వ్యాససూత్రాలను అవగాహన చేసికోవలె ననువారికి ఈ తెలుగు అనువాదము చాల సుగమముగ నున్నది.

దీనిని చదివితే ఇందు ప్రతిపాద్యమగు వస్తువు శివుఁడని తేటపడును. శాంకరమతం మాత్రం భక్తి భూమికలో ఈ శివాద్వైతమును సమర్థించినట్లు శ్రీ మదప్పయ దీక్షితేంద్రుల శివార్కమణిదీపికయందు విదిత మగును.

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

## చతుర్థాధ్యాయము

## ప్రథమపాదము

## ఆంధ్రీకరణము

# ఆవృత్త్యధికరణము

సూ. "ఆవృత్తి రసకృ దుపదేశాత్" 4-1-1

తృతీయాధ్యాయమునందు ఉపాసకుని లక్షణము, ఉపాస్య స్వరూపంబు, ఉపాసనభేదములు, ఆశ్రమ ధర్మాదులున్ను విచారింపఁబడినవి. ఈ చతుర్థాధ్యాయమునందైతేనో మొదటిపాదమున ఉపాసనావిధానము, రెండవ పాదమున ఉపాసకుశగు జీవుని ఉత్క్రాంతిదశయు, మూడవపాదమున అర్చిరాదిమార్గము, నాలుగవపాదమున బ్రహ్మమును పొందినవాని అవస్థయు నిరూపింపఁబడుచున్నవి.

ఇందు ప్రథమాధికరణమున "బ్రహ్మవిదాప్నోతి పరమ్" "జ్ఞాత్వా శివం శాంతి మత్యంత మేతి" ఇత్యాది శ్రుతి వాక్యములయందు మోక్షసాధనముగా చెప్పఁబడిన జ్ఞానము (ఉపాసనము) ఒకేసారి అనుష్ఠింపఁదగినదా ? లేక పునః పునః ఆవర్తింపఁదగినదా ? అని సందేహింపఁబడుచున్నది.

ప్రశ్న : ఉపాసనము ఒకేసారి అనుష్ఠింపఁదగినది. ఎందుకనఁగా? "సకృత్కృతే కృతః శాస్త్రార్థః" "సదనుష్ఠానము ఒక్కమారు చేయఁబడునెడ శాస్త్రముచే నుపదేశింపఁబడిస యంశము - పూర్తిగా ఆచరింపఁబడినదగును" అను

న్యాయము ననుసరించి ప్రయాజాదులవలె బ్రహ్మోపాసనము నొక్కసారి గావించినను జ్ఞానఫలము సిద్ధించునని చెప్పుట సమంజసము కాదా ?

ఉత్తరము : "బ్రహ్మవిదాప్నోతి పరమ్" ఇత్యాది వాక్యముల యందు మోక్షసాధనముగా చెప్పఁబడిన వేదన (ఉపాసన)ము అనేక పర్యాయములు అనుష్ఠింపఁదగినదియేను;

వేదనము ఉపాసనము ఈ రెండు శబ్దములు ఏకార్థకములే యని దిగువ సందర్భము తెలుపుచున్నయది "మనో బ్రహ్మేత్యుపాసీత - భాతి చ తపతి చ కీర్త్యా యశసా బ్రహ్మ వర్చసేన, య ఏవం వేద, యత్స వేద, స మయైత దుక్తః" "అను మ ఏతాం భగవో దేవతాం శాధి ! యాం దేవతా ముపాస్సే'' "శుద్ధమైన మనస్సును బ్రహ్మముగా భావింపవలెను. ఇట్లు ఉపాసించువాడు కీర్తిచేతను యశస్సుతోడను బ్రహ్మవర్చస్సు తోడను బాగుగా ప్రకాశించును. ఇట్టి ఉపాసకుడే నా చేత నిర్వచింపఁబడినవాడు."

"పూజ్యుడా ! ఏ దేవత నుపాసించుచున్నావో ఆ దేవతను గురించియే నాకు బోధించుము !"

ఇత్యాది శ్రుతులయందు ఉపక్రమ ఉపసంహారములలో వేదన ఉపాసనములను నిరూపించుటఁజేసి మోక్ష సాధనమగు వేదనము - ఉపాసనరూపం బగునని బోధపడుచున్నయది.

ఉపాసనమనఁగా ? ఏకాగ్రమైన మనస్సున బ్రహ్మమును స్మరించుటఁదగు పరంపర యగును.

ప్రయాజాదులు - అదృష్టఫలము కలవగుటచే ఒక్క పర్యాయము మాత్రము అనుష్ఠింపఁదగినవి. అట్లుగాక వేదన (ఉపాసన) ఫలము బ్రహ్మసాక్షాత్కారముగా ప్రత్యక్ష అనుభూత మగునని తెలియుచున్నందున ఫలోదయమగు వరకు బ్రహ్మోపాసనము చేయఁదగినదియే యని సిద్ధాంతము.

బ్రహ్మప్రాప్తి సాధనమగు ఉపాసనము (వేదనము-ధ్యానము) అసకృత్ = అనేక పర్యాయములు, ఆవృత్తిః = ఆవర్తింపఁబడుటయే శాస్త్రార్థమగును. ఇట్లు ధ్యాన పూజనాది వేదనము-ఆజన్మాంతము అనుష్ఠింపఁదగినదని శాస్త్రము నందు ఉపదేశింపఁబడినదని సూత్రార్థము.

సూ. "లింగాచ్చ" 4-1-2

ఇవ్విషయమున శ్రుత్యనుకూలమగు లింగము అనఁగా స్మృతిప్రమాణంబును కలదు.

శ్లో॥ క్షేత్రజ్ఞస్యేశ్వరజ్ఞానా - ద్విశుద్ధిః పరమా మతా।
మహాపాతక యుక్తో వా - యుక్తో వా ప్యుపపాతకైః॥
ప్రవిశ్య రజనీపాదం - బ్రహ్మధ్యానం సమభ్యసేత్।
ఆధ్యాత్మికాన్ యోగా ననుతిష్ఠేత్॥
రుక్మాభం స్వప్నధీ గమ్యం - విద్యాత్తు పురుషం పరమ్॥

జీవాత్మ- పరమేశ్వరుని తెలిసికొనుట వలన అత్యంత నిర్మలుఁడగును. ఎట్లనఁగా ? గొప్ప పాతకములను చేసినవాడైనను ఉపపాతకముల నాచరించినవాడైనను ఒక యామము వరకు శివధ్యానమును గావింపవలెను.

అనఁగా ధ్యానమును తదంగములైన మానసిక ఉపచార సమర్పణాదులను చేయవలెను. ఇట్లు ధ్యానించుతఱి బంగారుకాంతి గల పరమపురుషుడు సాక్షాత్కరించును. ఇదియే సకల పాపములకు ప్రాయశ్చిత్త మనఁబఱగుచున్నయది.

ఇందువలన బ్రహ్మోపాసనము మరల మరల ఆవర్తింపఁదగినదియే అని విశదమైనది.

## ఆత్మత్వోపాసనాధికరణము

సూ. "ఆత్మేతి తూపగచ్ఛంతి గ్రాహయంతి చ" 4-1-3

బ్రహ్మోపాసనము పునః పునః గావింపఁదగినదని పూర్వాధికరణమునందు బాగుగా నిరూపింపఁబడినది. ఐతే పరమేశ్వరుని స్వాత్మగా భావింపవలెనా ? లేక తనకంటె వేరుగా నుపాసింపవలెనా ? అని సందేహము.

ప్రశ్న : "విశ్వాధికో రుద్రో మహర్షిః" "సర్వజ్ఞుడైన శివుఁడు విశ్వము (చరాచరము)నకన్న మించినవాడు" "అధికం తు భేదనిర్దేశాత్" శివ జీవులకు భేదము శాస్త్రములయందు నిర్దేశింపఁబడుటచే జీవునికన్న శివుఁడధికుడగువాడు"

ఇత్యాది శ్రుతి సూత్రములు - ప్రత్యగాత్మయగు జీవాత్మకంటె పతియగు పరమాత్మ భిన్నుఁడగునని విశదపఱచుచున్నందునను జీవునికి సర్వజ్ఞత్వాది సంపన్నమగు బ్రహ్మభావము పొసగనందునను జీవుఁడు శివుని తనకంటె వేరువానిగా నుపాసించుట యుక్తము కాదా ?

ఉత్తరము : శివాఖ్యమైన పరబ్రహ్మము- జీవునికన్న నధికమైనను ఉపాసకుడు "అహం బ్రహ్మాస్మి" "నేను బ్రహ్మమును'' అను భావనతో బ్రహ్మము నుపాసింపవలెను. ఎందువలన ననఁగా ? పూర్వికులైన ఉపాసకులందరును "నీవే నేనగుదును. ఓ భగవానుడా ? నేను నీలోనివాడను" ఇట్లు తాను బ్రహ్మమే యని భావించిరి. పరమాత్మ - ఉపాసించువానికన్న వేరైనను "శివోఽహం' భావనతో తన్నుపాసించువారిని స్వస్వరూపము నొసగుట ద్వారా అనుగ్రహించును. అట్టి అనుగ్రహ పాత్రులైన ఆచార్య మహాపురుషులు శిష్యులకు "తత్త్వమని" ఇత్యాది వాక్యములతో "నీలో పరమాత్మ అంత్యరామిగా నుండువాడని" బోధించుచున్నవారు. ముక్తి యనఁగా ? అవధి లేనట్టి పరమానందముఁదగు నిష్కళంకమైన శివత్వమును పొందుట యగును. జీవాత్మకు పశుత్వము తొలగనిది శివత్వము ప్రాప్తింపదు గదా ! పశుత్వము తొలగవలెనంటే శివోపాసనఁ జేయవలసి యుండును. కావున ఎల్లకాలము (ఉపాసన కాలములయందు) శివోహమను భావనఁదగు ప్రవాహముతో పాశము ఛేదింపఁబడుటఁజేసి పశుభావమును పోగొట్టుకొనిన ఉపాసకుఁడు శివుఁడే యగుచున్నవాడు. శివత్వమనఁగా ? ఎట్టి దోషములఁదగు కళంకముల శంకయు బొత్తుగా లేనిదై అత్యంతోత్కృష్టమగు మంగళగుణజాతము గలిగియుండుట యగును. పరబ్రహ్మంబు నట్టిదే యగును. ఇట్టి శివత్వముగల పరమాత్మను భావించుటచే నుపాసకుఁడు శివత్వము గలవాడగునని చెప్పుటలో వింత యేమియు లేదు. కావుననే శివేతర తత్త్వములు ముముక్షుధ్యేయములు కావని "శివ ఏకో ధ్యేయః శివంకరః సర్వమన్యత్పరిత్యాజ్య" ఇత్యాది శ్రుతులు నొక్కి వక్కాణించుచున్నవి.

బ్రాహ్మణాది దేహాభిమానము గల పశుభావమును విడనాడిన వానికి- నిరతిశయమైన స్వరూపానందమునకు సాక్షియు స్వప్రకాశుఁడు నగు శివునిఁజెందియుండు పరాహంభావమును పొందియుండుట- ముక్తియని శ్రుతులన్నియు అభిప్రాయపడినవి ఉపాసకుఁడు తా బ్రహ్మము నను బ్రహ్మభావనతో శివు నుపాసించు

నెడ మోక్షము కరతలామలకంబగునది. అట్లు కానిచో సంసారము ఎన్నటికిని తొలగనిదగును.

కీటము- తన కీటత్వమును తొలగించుకొని భ్రమరత్వమును పొందుటకు నిరంతర భ్రమరాహంభావన ఉపయోగించునట్లు పశువగు జీవుఁడు నిరంతర శివాహంభావనచే పశుత్వమును విడనాడి సమస్త దోషములు బొత్తుగా లేనట్టి సకలకల్యాణ గుణముల యావిర్భావ మనఁదగు శివత్వమును పొందునని "దేవో భూత్వా దేవమప్యేతి" అను శ్రుతివాక్యము ఉద్ఘోషించుచున్నయది.

శుద్ధాద్వైతులైతేనో ఇట జీవేశ్వరైక్యమును ప్రతిపాదింతురు. అది సరి కాదు. జీవేశ్వరులకు విరుద్ధధర్మ సంయోగమునఁజేసి యవ్వారి ఐక్యము పొసగఁజాలదు. మఱియు పరమాత్మయే జీవుడనునెడ పరమేశ్వరుని అస్తిత్వము కొట్టుపడును. జీవుఁడే ఈశ్వరుఁడనునెడ శాస్త్రము చేయు నుపదేశమునకు పాత్రుఁడు లేకుండును. కావుననే వస్తుతః జీవేశ్వరులకు భేదంబనియు "అధికం తు భేదనిర్దేశాత్" ఇత్యాది సూత్ర భాష్యమున జీవేశ్వరాభేదము నిరాకరింపఁబడినదనియు సారాంశము-

## ప్రతీకాధికరణము

విశేషమును చెప్పుచున్నవారు.

సూ. "న ప్రతీకే న హి సః" 4-1-4

"మనో బ్రహ్మేత్యుపాసీత" ఇత్యాది శ్రుతులవలన మనస్సు మొదలగువాని యందు బ్రహ్మమును భావింపవలెనని విదిత మగుచున్నది.

అవ్వానిఁగూడ తానుగా నుపాసింపవలెనా? లేక వేరుగానా? అని సంశయము పొడముచున్నది.

ప్రశ్న: "మనో బ్రహ్మేత్యుపాసీత" "ఆదిత్యో బ్రహ్మేత్యుపాసీత" "మనస్సు బ్రహ్మంబని యుపాసింప వలెను" "సూర్యుఁడు బ్రహ్మంబని యుపాసింపవలెను" ఇత్యాది వాక్యములతో ఏర్పడుచున్న ప్రతీకోపాసనములయందు బ్రహ్మభావనతో సంస్కరింపఁబడిన మనస్సు మున్నగునవి ఉపాస్యములుగా కను

పడుచున్నవి. మఱియు నుపాసకుఁడు ప్రతీకమును బ్రహ్మముగా భావింపవలసి యందును కావున మనఃప్రభృతికము నహంభావనతో నుపాసించుటలో విరోధ మెట్టిది ?

ఉత్తరము : ప్రతీకములయందు ఆత్మగ్రహణము అనఁగా మన ఆది ప్రతీకము తానని భావించుట కూడదు. మరియు ప్రతీకములయందు బ్రహ్మమును సాక్షాత్తుగా నుపాసింపగూడదు. కాని బ్రహ్మ దృష్టితో శుద్ధ మనస్సు మున్నగునవి భావింపఁదగినవి. ఎందుకనఁగా ? మనస్సు మున్నగువానితో కూడి యుండు బ్రహ్మమే వస్తుతః ఉపాస్యంబగును. ఐనను మనః ప్రభృతులు బ్రహ్మముఁదగు గుణములు కాకుండుటను వికారములగుటఁజేసియు మన ఆది విశిష్టమగు బ్రహ్మము నందు ఆత్మగ్రహణము సరిపడకుండును. ఐతే సత్య సంకల్పత్వాది విశిష్టమగు బ్రహ్మమునందు మాత్రము ఆత్మగ్రహణము అనఁగా "శివోఽహం" భావన-విహితమగుచున్నది. ఒకవేళ అట్లు కాదనినచో మనః ప్రభృతికములు బ్రహ్మ వికారములు కావున నవ్వానియందు చేయఁబడు ఆత్మభావనయందు ఆత్మ అనఁగా తనలో నుండు పరమాత్మ- వికారాస్పదుఁడు కావలసివచ్చును.

ఇందువలన తేటపడినదేమనఁగా ? బ్రహ్మోపాసకులు మనః ప్రభృతికములను బ్రహ్మదృష్టితో భావింపవలెను కాని అయ్యవియే తానని భావింప కూడదనియు అవ్వానియందు పరమేశ్వరుని సాక్షాత్ ఉపాసింపకూడదనియు వివేకము.

## బ్రహ్మదృష్ట్యధికరణము

సూ. "బ్రహ్మదృష్టి రుత్కర్షాత్" 4-1-5

ప్రతీకోపాసనమున మనస్సు ఆదిత్యుఁడు మున్నగు ప్రతీకములయందు బ్రహ్మదృష్టి నుపాసకుఁడు చేయవలెనా ? లేక బ్రహ్మమునందు ప్రతీకభావనయా? అని సందేహము.

ప్రశ్న : బ్రహ్మమునందు మనః ప్రభృతికములను భావించుచు బ్రహ్మము నుపాసించుట విహితమని తోచెడిని. ఇట్లు చేయఁబడు ఉపాసనమే ఫలము నొసగును గదా !

ఉత్తరము : "విశ్వాధికో రుద్రో మహర్షిః" ఇత్యాది ప్రమాణములు

బ్రహ్మము సర్వోత్కృష్టమని తెలుపుచున్నందున నికృష్టములైన మనః ప్రభృతిక ములయందు ఉత్కృష్టమైన బ్రహ్మమును భావించుట యుక్తంబగును. తక్కువ వారైన భృత్యాదులయందు ఎగ్కువవారైన ప్రభువుల భావనతో ప్రభువులను వలె భృత్యాదులను సేవించుట లోకమున గానంబడుచున్నది కాని రాజుగారి యందు భృత్యదృష్టి గలవారై రాజుగారి నుపాసించుట లోకవిరుద్ధంబగును. ఎద్ది శ్రేష్ఠ మైనదో అద్దానినే అందరు నమస్కరింతురు గదా! ఇట్టి విధానమే మిక్కిలి సమం జసంబైనది. కావున పరబ్రహ్మము సర్వోత్కృష్టమైనదగుటఁజేసి సర్వనమస్కార విషయంబగుచున్నది.

"ఋతం సత్యం" అను మంత్రమునందు చెప్పఁబడిన విశేషణములతోకూడిన పరమాత్మ "విశ్వరూపాయ తస్మా ఏవ నమః" అనుచో చెప్పఁబడినట్లు సర్వనమ స్కార విషయంబగుచున్నవాడు. ఇతరు లెవ్వరికిని సర్వనమస్కారము చెందఁ జాలదు.

మఱియు పరబ్రహ్మము సర్వోత్కృష్టము కావుననే నమస్కారవిషయ మగుట లక్షణముగా కలదని తైత్తిరీయము చాటుచున్నయది.

"యస్మై నమ స్తచ్ఛిరో మూర్ధానం బ్రహ్మోత్తరాహను ర్యజ్ఞోఽధరా, విష్ణు ర్హృదయం, సంవత్సరః ప్రజననమ్" ఇత్యాది సందర్భమున సర్వోత్కృష్టుడైన శివుని హృదయాది స్వరూపులగు విష్ణ్వాదులనుండి వేరుగాను ప్రధానమగు శిరస్సు రూపముగాను "యస్మై నమ స్తచ్ఛిరః" నమస్కార విషయము లక్షణముగా గల వానిగాను విశదీకరింపఁబడినది.

చివరన "త్వం భూతానా మధిపతి రసి, త్వం భూతానాం శ్రేష్ఠోఽసి" అను వాక్యముతో పరమేశ్వరుఁడే సర్వభూతాధిపతియనియు సర్వశ్రేష్ఠుఁడనియు "నమస్తే నమః సర్వం తే నమః" అనుచో ప్రాణులందరికంటె నుత్కృష్టుఁడగుకతన సకల నమస్కార పర్యవసాన భూమి యగుననియు వక్కాణింపఁబడినది.

"నమస్తే రుద్ర మన్యవే" ఇత్యాది సర్వత్ర- శివుఁడు సర్వోత్కృష్టుఁడు కావుననే మాటిమాటికి శివునకు నమస్కారము ప్రతిపాదింపఁబడుచున్నది.

లోకమునందును శ్రీమంతము పాండిత్యము మున్నగు విశేషములు గల వారిని ఎక్కువగా నమస్కరింతురు గదా!

ఇట్లు సర్వనమస్కార విషయ మగుటచేసి సర్వశ్రేష్ఠంబును ఉమాసహితంబును విరూపాక్షంబును ఈశ్వర శబ్దైక విషయభూతంబు నగు పరబ్రహ్మము సర్వత్ర వ్యాపించువాడగుటచేసి మన ఆదిత్యాది ప్రతీకములన్నియు నుపాస్యంబులగుచున్నవి.

ఇందువలననే "శ్వభ్యః శ్వపతిభ్యశ్చవో నమః" ఇత్యాది వాక్యములయందు మిక్కిలినికృష్టములైన శునకచండాలాదులగూర్చియు సర్వోత్కృష్టమగు బ్రహ్మమందగు వ్యాపించు దృష్టితోడనే శ్రుతి- నమస్కారము నుపయోగించుచున్నది. కావున శ్రేష్ఠవస్తు సంబంధమునఁజేసి కనిష్ఠవస్తువులయందు ఉపచారము గానంబడుటచే విశ్వాధికబ్రహ్మదృష్టితో మనఃప్రభృతికముల నుపాసించుట యక్తతమంబగునని గ్రహింపవలెను.

## ఆదిత్యాదిమత్యకరణము

సూ. "ఆదిత్యాదిమతయ శ్చాంగ ఉపపత్తేః" 4-1-6

బ్రహ్మము సర్వోత్కృష్టమగుటచే ఆదిత్యాదులయందు బ్రహ్మదృష్టి నుపాసించుట తగునని పూర్వాధికరణమునందు చెప్పఁబడినది.

ఐతే "య ఏవాసౌ తపతి తదుద్గీథముపాసీత" "ప్రకాశించుచున్న సూర్యునుద్గీథముగా నుపాసింపవలెను. ఇత్యాదులైన కర్మాంగోపాసనల సందర్భమున ఆదిత్యాదులయందు ఉద్గీథాదిదృష్టి విహితమా? లేక ఉద్గీథాదులయందు ఆదిత్యాది దృష్టియా? అని సంశయము కలుగుచున్నది.

ప్రశ్న: ఉద్గీథము మున్నగునవి సూర్యుడు మొదలగునవియు కర్మాంగములగుటలో బ్రహ్మరూపములగుటయందు సమానములగుటచే ఒకానొక నియమము లేదు కావున రెండువిధముల నుద్గీథాద్యుపాసనమును చేయవచ్చును గదా?

ఉత్తరము : ఆదిత్యుడు మున్నగువారు కర్మలయందు ఆరాధింపఁబడువారగుటచేసి శ్రేష్ఠులగుదురు కావున కర్మాంగములైన ఉద్గీథాదులయందు ఆదిత్యాదులను భావించుట సమంజసంబగును. ఎందుకనఁగా? ఆదిత్యాదిదృష్టిచే

సంస్కరింపఁబడిన ఉద్గీథాది సుకృతము (కర్మ) వలన ఫలాతిశయము సంభ
వించును.

స్వయముగా వీర్యవంతమగు కర్మను గావించునపుడు ఉపాసనరూపమైన విద్య ననుసంధించునెడల అట్టికర్మము వీర్యవత్తరంబగునని దిగువశ్రుతివాక్యము వివరించినది.

"యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి" శ్రుతి.

ఇట్లు సూర్యాదులు ఉద్గీథాదులును బ్రహ్మాత్మకములైనను ఉద్గీథాదిక్రియలు ప్రేరేపింపఁబడుచు చేయఁబడుచున్నందున ఫలసాధనములగుచున్నవి. తద్భిన్న స్వభావముగల ఆదిత్యాదులు ఉద్గీథాదులవలె ఫలసాధనములు కానట్టివి.

ఇందువలన ఉద్గీథాదులగు కర్మాంగములయందు సూర్యాది భావనయే విహితంబగునని విదితమైనది.

## ఆసీనాధికరణము

సూ. "ఆసీనః సంభవాత్" 4-1-7

ఉపాసనఁదగు ప్రబంధము బాగుగా చెప్పఁబడినది. ఐతే ఇఁట ఉపాసనలో ఆసననియమము కలదా? లేదా? అని సందేహింపఁబడుచున్నది.

ప్రశ్న : "ఆసీన ఉపాసీత" "కూర్చుండియే బ్రహ్మము నుపాసింపవలె" నను నియమము వినఁబడకుండుటచేతను ఉపాసనము మానసవ్యాపార రూప మగుఁటజేసి సమస్తసమయములయందు సంభవించునదగుటవలనను ఉపాసకునకు ఆసననియమము లేదనియే చెప్పవలెను కాదా?

"వివక్తదేశే తు సుఖాసనస్థః — శుచిః సమగ్రీవశిరఃశరీరః,
అత్యాశ్రమస్థః సకలేంద్రియాణి-నిరుధ్య భక్త్యా స్వగురుం ప్రణమ్య॥
హృత్పుండరీకం విరజం విశుద్ధం-విచింత్య మధ్యే విశదం విశోకం,
అనంత మవ్యక్త మంచిత్యరూపం - శివం ప్రశాంత
మమృతం బ్రహ్మయోనిమ్॥

తథాఽఽదిమధ్యాంత విహీన మేకం - విభుం చిదానంద
మరూప మద్భుతం,
ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం – త్రిలోచనం నీలకంఠం
ప్రశాంతమ్ ॥
ధ్యాత్వా ముని ర్గచ్ఛతి భూతయోనిం - సమస్తసాక్షిం
తమసః పరస్తాత్ ॥

"ఏకాంతస్థలమున సుఖముగా కూర్చుండవలెను. స్నానాదులచే పరిశుద్ధుడై కంఠము శిరస్సు అనునవి సమానముగా నుండునట్లు శరీరమును కుదుట పఱచుకొనవలెను. అత్యాశ్రమ మనఁబడు పాశుపతదీక్షఁబడసి కర్మజ్ఞానేంద్రియముల నన్నిటిని నిరోధించి తన దీక్షాగురువునకు భక్తితో మ్రొక్కులిడవలెను. ఇట్టి విశేషములు గలవాడే కమలమువంటి తన హృదయమును రాగద్వేషాది మాలిన్యములేనిదానిగాను ఎట్టి వికారములు లేనిదానిగాను శోధించి అందు శివుని దిగువవిధము ధ్యానింపవలెను."

"అనంతుఁడనియు అవ్యక్తుఁడనియు చింతింపరాని స్వరూపము గలవాడనియు ప్రశాంతుఁడనియు అనాదిముక్తుఁడనియు వేదమునకు ప్రకృతికిని కారణుఁడనియు, ఆదిమధ్యాంతరహితుఁడనియు, ఏకైకస్వరూపుఁడనియు, సర్వవ్యాపకుఁడనియు, చిదానందమయుఁడనియు, రూపములేనివాడనియు, ఆశ్చర్యకరుఁడనియు, పార్వతీపతియనియు, గొప్ప ప్రభువనియు, త్రినేత్రుంచనియు, నీలకంఠుఁడనియు శుద్ధసత్త్వగుణ సంపన్నుఁడనియు, సమస్తప్రాణులకు తండ్రియనియు, జీవులందరిని ప్రేరేపించువాడనియు, మూలప్రకృతియనఁబడు తమస్సు నతిక్రమించినవాడనియు ధ్యానించునెడల దేహాంతమునందు శివసాయుజ్యమును పొందువాడగును"

సూ. "ధ్యానాచ్చ" 4-1-8

"ధ్యాత్వా ముని ర్గచ్ఛతి భూతయోనిమ్" "కారణం తు ధ్యేయః సర్వైశ్వర్య సంపన్నః సర్వేశ్వరః శంభు రాకాశమధ్యే" "ధ్యాన నిర్మథనా దేవ" ఇత్యాది శ్రుతి వాక్యములు సంసారపాశవిచ్ఛేదమునకు కారణమగు ఉపాసనము ధ్యానరూపమైనదని వక్కాణించుచున్నవి. ధ్యానమనఁగా "ధ్యాయతి ఒకో ధ్యాయతి ప్రోషితం బంధుః" ఇత్యాది శ్రుతివాక్యములయందు శరీరావయవములదఁగు చేష్టితములను

విరమించి ఒకానొకదానియందు మాత్రము తమ చూపు నెలకొలిపి ఒకే విషయమునందు చిత్తమును స్థిరపరచుట యని తెలియనగును.

మఱియు భిన్న జ్ఞానములకు తావీయనట్టిదియు తైలధారవలె ఎడతెగని తలచుటఁదగు పరంపరయే ధ్యాన మనఁబడును. ఇట్టి ధ్యానమునందు ఏకాగ్ర చిత్తము తప్పనిసరిగా ఏర్పడును. కావున ధ్యానము సిద్ధించుటకై ఆసననియమము అనివార్యంబగుచున్నయది.

ఇట్టి ఆసననియమమునందు అనారోగ్యము ముసలితనము మున్నగువాని వలన సామర్థ్యము లేనివారు - ఉపవిష్టస్థలమున గోడ మొదలువాని నానుకొని ఆసననియమమును సాగింపవచ్చునని వివేకము.

సూ. "అచలత్వం చాపేక్ష్య" 4-1-9

పృథివిమున్నగువాని అచలత్వమును పురస్కరించుకొని "ధ్యాయతీవ పృథివీ, ధ్యాయతీవాంతరిక్షమ్" ఇత్యాది ప్రయోగములను శ్రుతి నిరూపించినది. కావున ఆసీనుడయ్యే శివు నుపాసింపవలెననియు పృథివ్యాదులవలె స్థిరముగా కూర్చున్నవానికే ధ్యానపరంపర సిద్ధించుననియు తెలియుచున్నది.

సూ. "స్మరంతి చ" 4-1-10

శ్లో॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య - స్థిర మాసన మాత్మనః,
నాత్యుచ్ఛ్రితం నాతినీచం - చేలాజినకుశోత్తరమ్ ।
తత్రైకాగ్రం మనః కృత్వా - యతచిత్తేంద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుంజ్యా - ద్యోగ మాత్మవిశుద్ధయే॥

"శివధ్యానమును చేయువాడు పవిత్రప్రదేశమునందు దర్భలు పఱచియవ్వానిపై మృగచర్మ మునిచి యద్దానిపై పట్టుబట్ట నమర్చి స్థిరమైన ఆసనము నేర్పరచుకొనవలెను. ఆసనము మిక్కిలి ఎత్తుగానిదై ఎక్కువ క్రిందికి గాకుండ నుండవలెను. ఇట్టి ఆసనమునందధిష్ఠించి చిత్తమును ఇంద్రియవ్యాపారములను నియమించి మనస్సు నేకాగ్రముగా నొనర్చియు తన యౌన్నత్యమునకై శివధ్యాన యోగము నాచరింపవలెను.

ఇట్లు ఉపాసకులకు ఆసననియమమును స్మృతులు విధించుటఁజేసి ఆసీనుఁడయ్యే బ్రహ్మము నుపాసింపవలెనని భాష్యాంధ్రానువాద సమగ్రపాఠకులు గ్రహింతురు గాత!

## యత్రైకాగ్రతాఽధికరణము

సూ. "యత్రైకాగ్రతా తత్రావిశేషాత్" 4-1-11

శివు నుపాసించువానికి ఆసననియమము వలె దేశకాలనియమము కలదా లేదా? అని సంశయము.

ప్రశ్న: శివోపాసకుఁడు దేశకాలనియమమునుకూడా పాటింపవలసియుండును. ఎట్లు వేదచోదితమైన కర్మను గురించి దేశకాలదిఙ్నియమము విధింపఁబడినదో అట్లే బ్రహ్మోపాసనమునందును దిగాది నియమము తప్పనిసరి యగును కాదా?

ఉత్తరము: శివోపాసనయందు దిశానియమముగాని దేశకాలనియమముగాని లేవు. శివధ్యానమునకు కావలసినది ఏకాగ్రచిత్తముకావున నద్దానికి దేశకాలాదుల యవసరము లేదు. రాగద్వేషాది కల్మషములు లేనిచోట మనస్సు ఏకాగ్రంబగును. ఇదియే ధ్యానార్థ మపేక్షింపఁదగినది. ఉపాసనాస్థలము ఏకాంతమైయుండవలెను. "అనంతం శివసన్నిధౌ" ఇత్యాదివచనములు శివపంచాక్షర్యాది మహామంత్రములను జపించువిషయమై ప్రవర్తించునట్టివి. ధ్యానమునుగురించి మాత్రము శివాలయాదిప్రదేశముల యొక్కయు ప్రాతరాదికాలముల యొక్కయు ప్రాచ్యాది దిశల యొక్కయు నిర్బంధము లేదు. చిత్తైకాగ్రతకు విరుద్ధము కాకుండునెడల శివధ్యానమునకు గూడ (సామాన్యశాస్త్ర సిద్ధమగు) దేశకాలాదినియమమును పాటింపవచ్చును.

అనఁగా జపము పూజనము ఇత్యాదులను ప్రత్యేకముగా ఆచరించునపుడు దేశకాలాదినియమము అనివార్యంబైనట్లు పూజాజపాదిసహిత శివధ్యానమును గావించువారికి నేకాగ్రచిత్తానుకూలముగా దేశకాలాదికమును పాటించుట సువిహితంబే యగునని సారాంశము.

# ఆప్రాయణాధికరణము

సూ. "ఆప్రాయణా త్త్రాపి హి దృష్టమ్" 4-1.12

బ్రహ్మోపాసనముగురించి దేశకాలాదినియమము అవసరములేదని పూర్వాధికరణమునందు నిరూపింపఁబడినది. కాని యిట అట్టి శివోపాసనమును జీవితములో కొంతవరకు గావించి చాలింపవలెనా? లేదా? అని సంశయింపఁబడుచున్నది.

ప్రశ్న : ఉపాసకునకు ఎంతవరకు అభిరుచి యుండునో అంతవరకే బ్రహ్మము ఉపాసింపఁదగినదని చెప్పుట యుక్తము కాదా?

ఉత్తరము : జీవితాంతమువరకు బ్రహ్మమును ప్రతిదినము ఉపాసింపవలసినదేను; ఇందుకు ప్రమాణములు- "అహ రహ ర్వా ఏవంవిత్ స్వర్గం లోకమేతి'' ప్రతిదినము ఉపనిషద్విధానముగా బ్రహ్మము నుపాసించువాడు స్వర్గమును అనఁగా సర్వోత్తరమైన శివపదమును పొందువాడగును" "స ఖల్వేవం వర్తయన్ యావదాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే'' "ఉపాసకుఁడు తన ఆయుష్యమున్నంతవరకు ప్రతిదినము స్వసంప్రదాయానుగుణముగా శివు నుపాసించునెడల పునరావృత్తిరహిత శాశ్వతశివసాయుజ్యమును అనఁగా షడూర్మ్యాదిరహిత షట్స్థల పరబ్రహ్మనిర్వాణ సుఖసంపదను పొందువాడగును"

బ్రహ్మోపాసనము- బ్రహ్మస్వరూపము నాపాదించునదగుటచే జీవితమధ్యమునందద్దానిని విరమింపఁగూడదు. ఉపాసకులు బ్రహ్మమును స్వాభిన్నముగా నిరంతరము నియమిత సమయములయందు భావించునెడల అట్టివారి హృదయములయందు శివస్వరూపము ప్రకాశించుచుండును

ఇందువలన సర్వజ్ఞంబును నిత్యతృప్తంబును స్వయంప్రకాశ మానంబును స్వతంత్రంబును అనంతశక్తికంబు నగు పరబ్రహ్మముఁదగు స్వరూపము తమయందు ప్రకాశించుటకై ఉపాసకులు జీవితములో ప్రతిదినము విహితసమయములయందు తప్పనిసరి శివు నారాధింపవలెననియు ఆలస్యము జాడ్యము మున్నగు దోషముల వశుడుగాక జ్వరాదిసంకటములయందును శివారాధనమును విడనాడరాదనియు విశదమగుచున్నయది.

బ్రహ్మస్వరూపము శివోపాసకులయందు ప్రకాశించునని దిగువ శ్రుతియందు గాననగును.

"యా తే రుద్ర శివా తనూ రఘోరాపాపకాశినీ, తయా న స్తన్వా శంత మయా గిరిశంతాభిచాకశీహి" శ్రుత్యర్థము- సంసారరోగము- అనాదికాలమునుండి ప్రవర్తించు మలము అనఁగా అజ్ఞానము మరియు కర్మము అనువాని వాసనవలన ప్రబలముగా నాటుకొనియున్న దేహాదిశరీరాభిమానముఁదగు క్రమముచే ఏర్పడున దియు, ఆధ్యాత్మిక ఆదిభౌతిక ఆదిదైవికములను భేదములతో కూడినిదియు, సహింప రానిదియునై యుండును. ఇట్టి సంసారరోగము నుపాసకులకు పోఁగొట్టును కావున పరమాత్మ రుద్రుఁడనఁబడును. అందువలన పరమేశ్వరునకు రుద్రుఁడను నామ కరణము వేదలోకములయందు ప్రసిద్ధంబైనది. ఓ రుద్రుడా! ఏ నీయొక్క- మూర్తి -నిత్యసిద్ధములైన అపహతపాప్మత్వాదులతో పరమవిశుద్ధమై పరమమంగళ మయమై నిఃశ్రేయఃప్రదమై శివత్వయోగమున భక్తులందరి హృదయములయందు నివసించునదై అపాపులు అనఁగా- జ్ఞానాగ్నిచే నిఖిలపుణ్యపాపములను దహింపఁ చేసికొనిన ముక్తపురుషులు, అవ్వారియందు ప్రకాశించునట్టి నిరతిశయానంద లక్షణంబగు (నీ) స్వరూపముతో మహాకైలాసమునందు ఉపాసకులకు నిరతిశయ శివానందము నొసగు పరమేశ్వరా? మాకుగూడ సంసారనిమిత్తంబగు పుణ్యపాప సంచయమును పోఁగొట్టి సాక్షాత్తు మిగుల మాయందు ప్రకాశించుము !"

ఇట్లు శివోపాసకులు శివునిఁ ప్రార్థించుచుందురు. ఇందువలన తేటపడినదేమ నఁగా? ఉపాసకుల హృదయకమలమున బ్రహ్మస్వరూపము ప్రకాశించును గావున తత్ప్రకాశమును కలిగించు బ్రహ్మోపాసనము (పూజాజపధ్యానయుక్తమగు శివా రాధనము)ను యావజ్జీవము ప్రతిదినంబును ఆవశ్యము చేయవలసినదనియు ఒక ప్పుడును శివారాధనమును శరీరజాడ్యాదికారణమున విడువరాదనియు వివేకము.

## తదధిగమాధికరణము

సూ. "తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ
తద్వ్యపదేశాత్" 4-1-13

బొత్తుగా పాపములు లేనట్టి శివోపాసకులకు బ్రహ్మస్వరూపము గోచరించు నని పూర్వాధికరణమునందు సమర్థింపఁబడినది. కావున నీయధికరణమున నుపా సకునకు పాపక్షయము కలుగునా లేదా అని సందేహింపఁబడుచున్నది.

ప్రశ్న : "నాభుక్తం క్షీయతే కర్మ — కల్పకోటిశతై రపి" "తా చేసిన కర్మము - అనుభవింపనిది వందలకోట్లు కల్పముల కాలమునకైనను నశింపదు" అను ప్రమాణము ననుసరించి బ్రహ్మోపాసకులకు గూడ అనుభవములేనిది పాపక్షయము సంభవింపదనియే చెప్పవలెను. మరియు కర్మభోగమునకై శరీరము రాగా మఱల నా శరీరమునందు కర్మ నాచరించుట అనివార్యంబగుటచే ఎప్పటికిని కర్మ నిర్మూలము కాదు గాపున మోక్షమనునది దుర్లభమని తోచెడిని.

ఉత్తరము : శివోపాసకులకు పాపకర్మ తప్పక క్షీణించును. ఎట్లనఁగా? ఉపాసనము ప్రారంభింపఁబడుతఱి- అద్దాని దృఢత్వమువలననే పూర్వపాపములు నశించుటయు అనంతరపాపములు అంటకుండుటయు నెరవేరును. ఇందుకు శ్రుతి ప్రమాణము- "తద్యథైషీకాతూల మగ్నౌప్రోతం ప్రదూయేతైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే" "దూది అగ్నియందు వ్రేల్పఁబడిసచో దహించునట్లు ఉపాసకుని పాపములన్నియు నశించును. "తద్యథా పుష్కరపలాశ ఆపో నశ్లిష్యంతే ఏవ మేవంవిది పాపకర్మ నశ్లిష్యత ఇతి" "ఎట్లు తామరాకుయందు జలము అంటకుండునో అట్లే ఉపాసకుని పాపము స్పృశింపకుండును" పూర్వపాపవినాశమును మొదటి శ్రుతియు ఉత్తరాఘఅశ్లేషమును రెండవ శ్రుతియు విశదపఱచుచున్నందున ఉపాసకులు ప్రారంభించిన శివోపాసనము దృఢమగుతఱి పూర్వపాపములు నశించుటయు ఉపాసనజీవితమునందు ప్రమాదమున చేయబఁడు పాపములు అంటకుండుటయు సంభవించును. "నాభుక్తం క్షీయతే" అను ప్రమాణము అనుపాసకులకు చెందినదని గ్రహింపవలెను. ఇందు ఎట్టి విరోధంబును లేదు.

ఉపాసనాదార్ఢ్యము అనఁగా దశావధానసహిత మహాశివారాధనము సిద్ధించుతఱి తన హృదయమునందు బ్రహ్మదర్శనము అనఁగా భావలింగసాక్షాత్కారము సంభవించును. అప్పుడే పూర్వపాపములు బొత్తుగా నశించును. మరియు ఈ జన్మయందు చేయఁబడిన పాపములు బీజరూపములుగాక సాధకు నంటకుండునని వివేకము.

## ఇతరాశ్లేషాధికరణము

సూ. "ఇతరస్యాప్యేవ మసంశ్లేషః పాతే తు" 4-1-14

జ్ఞానికి అనగా దృఢమైన శివోపాసన గలవానికి పూర్వోత్తర పాపములు లేకుండునని నిరూపింపఁబడినందున నీయధికరణమునందు పాపవిరుద్ధములగు పుణ్యములు సంబంధించునా? లేదా? అని విచారింపఁ బడుచున్నది.

ప్రశ్న : పాపము ఉపాసనకు అనుకూలము కాకుండుటచే అద్ది క్షీణించునని చెప్పుట సమంజసమే కాని పుణ్యము నశింపదనుటయే సరిపడునని తోఁచెడిని. ఎందుకనఁగా? పుణ్యము విద్యాంగము గావున ఉపాసన దృఢపడుటకు ఉపయోగించును గదా!

ఉత్తరము : ఉపాసకునకు పుణ్యముగూడ అనిష్టఫలము నొనగూర్చునదగుటచే మోక్షవిరుద్ధంబగునది. కావున పూర్వపుణ్యము నశించుటయు ఉత్తర పుణ్యము అంటకుండుటయు గమనింపఁదగినవి. శివోపాసనకు శరీరారోగ్యాదులు అవసరము కావున ఆరోగ్యాదులను కలిగించు పుణ్యమైతేనో శరీరత్యాగమగునపుడు నశించును.

శివారాధనమునకు అంగముగా చేయఁబడు నిత్యనైమిత్తకాది కర్మలు కామ్యములు కాకుండుటచే అయ్యవియు ఉపాసకునకు సంబంధింపకుండును.

కావున జ్ఞానికి పుణ్యలేపంబును లేదని సిద్ధాంతము.

## అనారబ్ధకార్యాధికరణము

సూ. "అనారబ్ధకార్యే ఏవ తు పూర్వే తదవధేః" 4-1-15

పూర్వాధికరణమునందు పూర్వపాపపుణ్యములు నశించుననియు ఉత్తర పాపపుణ్యములు అంటకుండుననియు చెప్పఁబడినది. ఇఁట ప్రారబ్ధములైన పాప పుణ్యములు ఉపాసనాకాలమునందు ఉండునా ? లేదా ? అని సందేహము కలుగుచున్నది.

ప్రశ్న : "సర్వే పాప్మానః ప్రదూయంతే" అనుచో పాపములన్నియు నశించునని వినంబడుటచే శివారాధనము ప్రారంభించుటకు పూర్వము గల పుణ్య పాపములు రెండును పూర్తిగా నశించునని చెప్పవలెను కాదా ?

ఉత్తరము : శివోపాసనమునకు ముందు చేయఁబడిన పుణ్యపాపములలో

ప్రారబ్ధములుగా మారనట్టి పుణ్యపాపములే నశించును. ప్రారబ్ధములైన పుణ్య పాపములు మాత్రము ప్రస్తుతశరీరము లేక అనంతర శరీరములు ఒకటిరెండు మాత్రము నశింపగానే అంతరించును.

ఇందుకు "తస్య తావదేవ చిరం యావ న్నవిమోక్ష్యే, అథ సంపత్స్యే" "ప్రారబ్ధము నశించుటయే తడవుగా శివోపాసకుఁడు శివసాయుజ్యము నొందును" అను శ్రుతివాక్యము తార్కాణమగునది! కావున ప్రారబ్ధములైన పుణ్య పాపములు అనుభవముతోడనే అంతరించునని సారాంశము.

## అగ్నిహోత్రాద్యధికరణము

### సూ. "అగ్నిహోత్రాది తు తత్కార్యాయైవ తద్దర్శనాత్" 4-1-16

ఉపాసకుని పూర్వోత్తర పుణ్యపాపములు నశించుననియు అంటకుండు ననియు నిరూపింపఁబడినది. జీవితమున్నంతవరకు ప్రతిదినము బ్రహ్మోపాసన మును తప్పక చేయవలెనని చెప్పితిమి.

ఇఁక నిట అగ్నిహోత్రాదినిత్యకర్మలు శరీరపాత మగువరకు ఉపాస కుఁడు చేయవలసినవా ? కావా ? అని విచారింపఁబడుచున్నది.

ప్రశ్న : అగ్నిహోత్రము మొదలగు నిత్యకర్మలను జీవితాంతమువరకు ఉపాసకుఁడు ఆచరింపవలసిన యవసరము లేదు. ఒకవేళ చేసినను అయ్యవి నశించునని చెప్పితిరి గదా! ప్రయోజనములేనివానిఁ గూర్చి ఎట్టి మందమతియైనను ప్రవర్తింపఁజాలఁడు.

ఉత్తరము : అగ్నిహోత్రము మున్నగు సుకృతములను ఉపాసనాంగము లుగా అవసానమువరకు గావింపవలసినదేను; ఇందుకు శ్రుతిప్రమాణము

"తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసా ఽ నాశకేన"

"బ్రహ్మోపాసకులు వేదాభ్యాసముతోడను యజ్ఞదానములతోడను తపస్సు తోడను పరమేశ్వరుని తెలిసికొనగోరుదురు. ఐతే ఈ వేదాభ్యాస యజ్ఞదాన

తపంబులు ఫలాపేక్షారహితములై అనఁగా కామ్యములు కానియెడల అనాశ రంబులై నిత్యమైన మోక్షము నొసగునని భావము."

వేదాభ్యాసమనఁగా ? పరమేశ్వరప్రాప్తికి సాధనములగునవియు శ్రేష్ఠమైన దహరోపాసనాదికమునందభిరుచిని కలిగించునవియు పరమేశ్వరుని సచ్చి దానందమయత్వాది లక్షణములను ప్రతిపాదించునవియు నగు వేద మంత్రములను నిత్యము పఠించుట యగును. ఇవ్విషయమును జాబాలోపనిషత్తునందు గాన నగును. "అథ హైనం బ్రహ్మచారిణ ఊచుః భగవన్ కింజప్యేనామృతత్వం బ్రూహీతి" "బ్రహ్మచారులు యాజ్ఞవల్క్యుని - స్వామీ ? ఏద్దానిని జపించినచో అమృ తత్వము అనఁగా జరామరణరహితమైన శివసాయుజ్యము లభించునో చెప్పుడని యాజ్ఞవల్క్యుని ప్రశ్నించిరి".

"స హోవాచ యాజ్ఞవల్క్యః, శతరుద్రీయేణేతి, ఏతాని హ వా అమృతస్య నామధేయాని, ఏతైర్హ వా అమృతో భవతి".

"శతరుద్రీయము అనఁగా రుద్రాధ్యాయమును జపించుటతో అమృతత్వము చేకూడును. శతరుద్రీయమునందు చెప్పఁబడిన భవాదినామధేయములు అనాది ముక్తుండగు శివునివైయున్నవి. ఇవ్వానిని జపించుటవలన ముక్తుండగును అని యాజ్ఞవల్క్యమహర్షి నిరూపించెను".

కైవల్యోపనిషత్తునందును "యః శతరుద్రీయం బ్రాహ్మణో నిత్యమధీతే సోఽగ్నిపూతో భవతి. స వాయుపూతో భవతి, సురాపానాత్ పూతో భవతి, బ్రహ్మహత్యాయాః పూతో భవతి అ(ం)త్యాశ్రమీ సర్వదా సకృద్వా జపేత్, పరమం జ్ఞాన మాప్నోతి, సంసారార్ణవనాశనమ్".

"బ్రాహ్మణుఁడు - సన్న్యాసి గాని గృహస్థుడను లైనవాఁడు గాని ప్రతిదినము శుచియైయుండు ఎల్లవేళలందుగాని ఒక్క పర్యాయముగాని శతరుద్రీయమును పఠించునెడల అగ్నివలె తేజస్వియగును. వాయువువలె నిర్మలుండగును. మఱియు సురాపాన బ్రహ్మహత్యాది మహాపాపములనుండి విడిబడినవాడై సము ద్రమువంటి సంసారము నతిక్రమించు శివజ్ఞానము కలవాడగును."

ఇట్టి బ్రహ్మబోధకములు శతరుద్రీయ సంజ్ఞ కలవియు నగు మంత్ర ముల నభ్యసించుటవలన సంసారమును బోకార్చు పరమజ్ఞానము చేకూరుననియు

జ్ఞానవిరుద్ధ పాపములు క్షీణించుననియు విశదమగుచున్నది. "ఏతాని హ వా అమృతస్య నామధేయాని" అనుచో- అనాదిముక్తుఁడు (అమృతుఁడు) నగు శివుని నామధేయములగుటఁజేసి శతరుద్రీయమును జపించుటచే బ్రహ్మహత్యాది పాపములన్నియు నశించునని ప్రతిపాదించుటవలన పరమేశ్వరుని శివాదినామధేయముల నభ్యసించుట- ఉపాసనకు ప్రతికూలములగు పాపములన్నిటిని క్షీణింపఁజేయునని విదితమగుచున్నయది.

ముండకోపనిషత్తునందు శివనామస్మరణముఁ గూర్చి దిగువ విధము పేర్కొనఁబడినది.

"అపి వా య శ్చాండాలః శివ ఇతి వాచం వదేత్, తేన సహ సంవదేత్, తేన సహ సంవసేత్, తేన సహ భుంజీత"

ఇఁట బ్రహ్మబోధకమగు శివశబ్దము నుచ్చరించినంత మాత్రమున మిక్కిలి అపవిత్రుడైన పాపాత్మునకు గొప్ప పావిత్ర్యము సంభవించునని బోధపడుచున్నయది.

మఱియొకచో "యోఽథర్వ శిరసం బ్రాహ్మణో నిత్య మధీతే" అనునది మొదలుకొని అథర్వశిరమును పఠించువానికి పాపములన్నియు క్షీణించుననియు "సకృజ్జప్త్వా శుచిః పూతః కర్మణ్యో భవతి, ద్వితీయం జప్త్వా గాణపత్య మాప్నోతి, తృతీయం జప్త్వా దేవ మేవానుప్రవిశతి".

"ఒక పర్యాయము జపించినచో నిర్మలుఁడు పరిశుద్ధుఁడు కర్మయందు నిష్ఠ గలవాడు నగుననియు, రెండవతూరి పఠించినయెడల గణపతిభావమును పొందుననియు, మూడవపర్యాయము జపించునెడల పరమేశ్వరునే పొందుననియు" అథర్వశిరఃపఠనము మోక్షము నొసగునదిగా నిరూపింపఁబడినది.

"ఆత్మాన మరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్" ఇత్యాదివాక్యముల యందు ప్రణవాది శివపంచాక్షరీ మంత్రానుసంధానము - సంసారపాశవిచ్ఛేదమునకు హేతువగునని విశదీకరింపఁబడినది. ఇట్లే ఇతరశ్రుతులయందు గాననగును.

ఇందువలన పరమేశ్వరుని బోధించు వేదమంత్రములు పాపక్షయము ద్వారా పరమజ్ఞానహేతువులగుటఁజేసి మోక్షసాధనములగునని బోధపడుచుండుటచే

విద్యాసంపన్నుఁడును యావజ్జీవము శివప్రతిపాదక మహామంత్రముల నభ్యసించుట తప్పనిసరియగుచున్నది. ఇట్లే అగ్నిహోత్రాదియజ్ఞములు శివాజ్ఞారూపములగుటచే అవ్వాని ఫలమును పరమేశ్వరునకు సమర్పించి శివారాధనబుద్ధితోడ నాచరింప వలసి యుండును. ఇవ్విధముగానే దానము మొదలగు పుణ్యములను గావింప వలెను. అగ్నిహోత్రాదికర్మలు విద్యయనఁబడు శివోపాసనము సిద్ధించుటకై అనుష్ఠింపఁదగినవియేను.

ఈశ్వరోపాసనము - కర్మరూపముగాను తపోరూపముగాను జపరూపము గాను ధ్యానరూపముగాను జ్ఞానరూపముగా నుండునది.

అగ్నిహోత్రాదికము నాచరించుట కర్మోపాసనమగును. సోమవారవ్రత నక్తభోజనాది నియమము లేక ఉపవాస తీర్థయాత్రాదికంబైనను తపోరూపమైన ఉపాసనమగును. ప్రణవపంచాక్షరీ మంత్రాదుల నభ్యసించుట జపరూపమగు ఉపాసన మగును. ఇయ్యవి పాపశోషణముద్వారా మోక్షహేతువులగుననియు జ్ఞానము ధ్యానంబును బ్రహ్మస్వరూపమును త్వరలో నొసగునవగుటచే సాక్షాత్ మోక్షహేతువులగుననియు తెలియవలెను. కావున వీని నన్నిటిని ముముక్షువు తప్పక ఆచరింపవలసియుండును.

అగ్నిహోత్రాది సుకృతము జ్ఞానమును కలిగించునెడల ఉపాసనకుముందు చేయఁబడిన సుకృతము విద్యాప్రారంభ సమయమున నశించునెడలను "సుహృదః సాధుకృత్యామ్" "ఉపాసకుని పుణ్యమును స్నేహితులు స్వీకరింతురు"అను వాక్యమునకు విషయమెద్దియను ఆశంకకు సమాధాన మీ దిగువసూత్రము.

సూ. "అతోఽన్యాఽపి హ్యేకేషా ముభయోః" 4-1-17

"తస్య పుత్రా దాయ ముపయంతి, సుహృదః సాధుకృత్యాం ద్విషంతః పాపకృత్యామ్" "ఉపాసకుని ఆస్తిని కుమారులు గ్రహింతురు. పుణ్యమును మిత్రులు స్వీకరింతురు. పాపమును శత్రువులు తీసికొందురు'' అను శాట్యాయన శాఖవారి వచనమునకు - శివోపాసనదార్ఢ్యమునకై చేయఁబడు అగ్నిహోత్రాది సుకృతమునకంటె వేరైనదియు ప్రబలకర్మాంతరముచే అరికట్టఁబడిన ఫలము కలదియు ఉపాసనకు అనుకూలించు ఆహార ఆరోగ్య చిత్తశుద్ధ్యాదులు కలుగుటకై కావలసినదియు నగు సుకృతము విద్యాసుగుణఫలము కలదగుటచే ఉపాసనా

సమయమునను నశింపదు - అను సంశము విషయమగును. ఇట్టి సుకృత దుష్కృతములే ఉపాసకుని మిత్రులను శత్రువులను చెందునని పై వాక్యమునకు అర్థము.

పుణ్యము - విద్యాప్రారంభమునకన్న ప్రాచీనమైనదియు విద్యాప్రారంభానంతర క్రియమాణంబగునదియు రెండు తెఱఁగులు; ప్రాచీనపుణ్యంబును భుక్తఫలంబనియు అభుక్తఫలంబనియు ద్వివిధము; అభుక్తఫలంబును శివనామ సంకీర్తనాదులతో వినష్టంబగునదియు అవినష్టంబగునదియు అని రెండు విధంబులు; అవినష్టసుకృతంబు - ప్రారబ్ధఫలంబనియు అప్రారబ్ధఫలంబనియు ద్వివిధంబు;

సూ. "యదేవ విద్యయేతి హి" 4-1-18

"యదేవ విద్యయా కరోతి" అనుచో కర్మఫలమునకు ప్రతిబంధము లేకుండుట - ఉద్గీథవిద్యాఫలంబగునని చెప్పఁబడినట్లు ప్రబలమైన కర్మాంతరముచే ఇతర సుకృతములు ఫలించుటకు ప్రతిబంధము ఏర్పడునని బోధపడుచున్నయది.

ఇందువలన విద్యానుగుణకర్మలఁదగు ఫలమునకు ప్రతిబంధము లేకుండుటకైనను అగ్నిహోత్రాది కర్మలు అవశ్యము అనుష్ఠింపఁదగినవి అని విశదమైనది.

## ఇతరక్షపణాధికరణము

సూ. "భోగేన త్వితరే క్షపయిత్వాఽథ సంపద్యతే" 4-1-19

అధికారపదవి నధిష్ఠించియుండు బ్రహ్మోపాసకులకు అధికార వైభవము గాక ముక్తిఫలమనునది కలదా లేదా? అని సంశయము.

ప్రశ్న : అధికారిక పురుషులు తమ అధికార సమయమునకుఁదగు ప్రారబ్ధము ననుభవించుటకై అనేకజన్మల నొందునపుడు పూర్వజన్మమున గావింపఁబడిన శివోపాసనవలనైన విజ్ఞానము లోపించును. మఱియు ప్రకృతజన్మయందు నూతనముగా చేయఁబడుకర్మ - సుఖదుఃఖ ఫలభోగము నొసగును కావున నవ్వారికిని జన్మపరంపర తప్పనిసరి యగుటచే మోక్షము సంభవింపదనియే చెప్పవలెను కాదా ?

ఉత్తరము : ఆధికారిక పురుషుల ప్రారబ్ధకర్మము - కేవలము స్వఫలము

ననుభవింపఁజేయును. కాని పూర్వజన్మార్జిత విద్యావిజ్ఞానమును లోపింపఁజేయదు. కావున వారికి ప్రారబ్ధాంతమునందు మోక్షమే కాని జన్మపరంపర యుండునని చెప్పుటకు వీలులేదు. మఱియు ఒకే జన్మలో మోక్షము నొందువానికిని సుషుప్తిలో బ్రహ్మప్రాప్తియైనను ప్రారబ్ధవశమున జాగ్రద్దశ కలుగునట్లు ఆధికారిక పురుషులకు సంభవించు జన్మమరణవ్యవధానము విద్యాలోపమును కలిగింపదని సారాంశము.

ఇయ్యది
శ్రీ నీలకంఠ శివాచార్య విరచితంబైన
బ్రహ్మమీమాంసాసూత్ర భాష్యమునందు
నాలుగవ అధ్యాయముఁదగు మొదటిపాదము
శ్రీకంఠమణి ప్రభామయూఖంబను శాంకరీయ ఆంధ్రానువాదముతో
ముగిసినది.

---

# శ్రీ నీలకంఠ భాష్యము

ప్రాప్తిస్థానము - 184/ఎ, సర్వమంగళా సదనము, నెహ్రూనగర్,
సికింద్రాబాద్, 500 026, (ఆం. ప్ర.)

శ్రీ వ్యాసమహర్షికృత బ్రహ్మసూత్రములకు, శ్రీ నీలకంఠాచార్యకృత భాష్యమునకును శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి గారు చేసిన అనువాదమునందు చక్కని శివజ్ఞానము కలదు. శివపారమ్యమును ఇతరమత నిరాసము లేకుండా అనువాదమున మిగుల న్యాయము చేకూర్చినారు.

ఉదాహరణమునకు- "జన్మాది అస్య యతః" ఎద్దానినుండి ఈ ప్రపంచము యొక్క సృష్టిస్థితి లయాదులు సంభవించునో, అట్టిది బ్రహ్మమని - అనువాదకుల సరళమైన నిర్వచనము. సంస్కృతమున సమన్వయజ్ఞానము లేని జిజ్ఞాసువులకు ఈ అనువాదగ్రంథము ఎంతే నుపయోగించును. అనువాదకులు - సంస్కృతాంధ్రములయిందు చక్కని పరిశ్రమ చేసినవారని ఈ అనువాదము తెలుపుచున్నది.

ఆకాశవాణీ ప్రసారము, హైదరాబాద్, 9-12-1970.

శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య కృత

# శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

## చతుర్థాధ్యాయము

## ద్వితీయపాదము

## ఆంధ్రీకరణము

# వాక్సంపత్త్యధికరణము

సూ. "వాఙ్మనసి దర్శనా చ్ఛబ్దాచ్చ" 4-2-1

సూ. "అతఏవ చ సర్వాణ్యను" 4-2-2

పూర్వపాదమునందు ఉపాసకుని శివోపాసనము పునఃపునః ఆవృత్తి కలదనియు ఆసననియమాదులు కలదనియు నిరూపింపఁబడినది. ఈ రెండవ పాదమునందైతేనో ఉపాసకుఁడు తన శరీరమునుండి బయలుదేరు విధానము తెలుపఁబడుచున్నయది.

"అస్య సౌమ్య! పురుషస్య ప్రయతో వాఙ్మనసి సంపద్యతే, మనః ప్రాణే, ప్రాణ స్తేజసి, తేజః పరస్యాం దేవతాయామ్".

"సౌమ్యుడా ? శరీరమునుండి బయలుదేరువాని వాక్కు మనస్సునందు లయించును. మనస్సు ప్రాణమునందు, ప్రాణము జీవాత్మయందు, జీవాత్మ పరమాత్మయందు లయించును".

ఇట్లు వాగింద్రియాదులు మనస్సునందు లయించునని శ్రుతియందు బోధపడుచున్నందున ఇట్టి లయము పొసగునా ? లేదా ? అని విచారింపఁబడుచున్నది.

ప్రశ్న : ఘటము మృత్తికయందు వలె కార్యము స్వోపాదాన కారణము నందు లీనమగును గదా ! వాగాది ఇంద్రియములకు బ్రహ్మము ఉపాదాన మగును కాని మనస్సుకాదు కావున బ్రహ్మమునందే వాక్కుమున్నగు ఇంద్రియములు లయించునని చెప్పవలెను కాదా ?

ఉత్తరము : "అస్య సౌమ్య పురుషస్య ప్రయతో వాఙ్మనసి సంపద్యతే" "ఇంద్రియై ర్మనసి సంపద్యమానైః" అను వాక్యములయందు ఉత్క్రాంతిసమయమున మనస్సుకంటె ముందు వాగాది ఇంద్రియములు విరమించునని విదితమగుచున్నందున మొదట మనస్సునందు వాక్కు లయించుననియు పిమ్మట ఇంద్రియములన్నియు మనస్సున లీనమగుననియు గ్రహింపవలెను. "ఉపాదానమునందే కార్యము లయించు"నని చెప్పఁగూడదు. కార్యము స్వరూపముతో లీనమగుటకే ఉపాదాన మవసరము. వాక్కు మొదలగు ఇంద్రియములు మనస్సునందు స్వరూపలయముఁజెందవనియు వృత్తిలయముఁజెందుననియు ప్రతిపాదింపఁబడుచున్నది.

ఎట్లనఁగా ? అగ్నికణమును జలములో వేసినయెడల అద్ది తన ప్రకాశమున్నగు వృత్తిని గోల్పోవునట్లు ఉపాదానముకానట్టి మనస్సునందు వాగాది ఇంద్రియములు వృత్తిలయమును మాత్రము పొందును. వృత్తిగల వాగాదులు లయించునని చెప్పు శ్రుతికి - వృత్తిలయము కలవగుననియే అర్థముఁజెప్పవలెను. వృత్తికిని వృత్తిగలదానికిని భేదము గానరానందున వృత్తిలయము చెప్పఁబడినచోట వృత్తిమల్లయము పొడగట్టుచుండును కావున వృత్తిలయమే సమంజసంబైనదని సారాంశము.

## మనఃసంపత్త్యధికరణము

సూ. "తన్మనః ప్రాణ ఉత్తరాత్" 4-2-3

''మనఃప్రాణే" ఇత్యాది వాక్యమునందు "వాక్కు మొదలగు ఇంద్రియములన్నిటితో కూడిన మనస్సు ప్రాణమునందు లయించునని'' చెప్పఁబడిన యంశము ఎట్టిది అని సందేహము.

ప్రశ్న : వాక్కు మొదలగు ఇంద్రియములు తమకు ఉపాదానము కానట్టి

మనస్సునందు వృత్తిలయముఁజెందినను మనస్సుమాత్రము ప్రాణమునందు స్వరూపలయముఁజెందుననియే చెప్పవలెను. ఎందుకనఁగా ? మనస్సునకు ప్రాణము ఉపాదానమగునని దిగువ శ్రుతివాక్యమునందు గాననగును.

"అన్నమయం హి సౌమ్య మన ఆపోమయః ప్రాణః" శ్రు. అన్నమయమగుటచే పృథివీసంబంధమగు మనస్సునకు ప్రాణము జలమయమగుటచే ఉపాదానమగుచున్నది. ఇట్టి ప్రాణమునందు మనస్సు స్వరూపలయముఁ జెందుననుటలో విరోధమెద్దియు లేదు గదా ?

**ఉత్తరము :** వాగాదీంద్రియములవలె మనస్సుగూడ ప్రాణమునందు వృత్తిలయమును మాత్రము చెందును. మనస్సునకు ప్రాణము ముఖ్యమైన ఉపాదానము కాకుండుటను ప్రాణమునుండి మనస్సు ఉదయింపకుండుటను పై యంశము ధృవపడినదనియే గ్రహింపవలెను.

## ప్రాణసంపత్త్యధికరణము

సూ. "సోఽధ్యక్షేణ తదుపగమాదిభ్యః" **4-2-4**

సర్వేంద్రియయుక్తమగు మనస్సు ప్రాణమునందు లయించునని పూర్వాధికరణమునందు ప్రతిపాదింపఁబడినది ఇఁట అట్టి ప్రాణము ఎద్దానియందు లయించునని సందేహము.

ప్రశ్న : ''ప్రాణస్తేజసి"అను శ్రుతివాక్యముఁబట్టి ప్రాణము తేజస్సునందు లీనమగునని చెప్పవలెను కాదా ?

ఉత్తరము : ప్రాణము తనలో సర్వేంద్రియయుక్తమగు మనస్సును చేర్చుకొనిన తరువాత నధ్యక్షుఁడైన జీవునితో కలిసికొనును. కాని తేజస్సునందు ప్రాణము లీనము కాదు. ''ఏవమేవాత్మాన మంతకాలే సర్వే ప్రాణా అభిసమాయంతి" "మరణసమయమున ప్రాణము పంచభూతములున్ను జీవాత్మ నాశ్రయించును'' ఇత్యాది శ్రుతులయందు ప్రాణము జీవునిఁజెందియుండునని వినంబడుచున్నయది.

''ప్రాణస్తేజసి'' అను శ్రుతిక్రమముఁదగు విరోధమును దిగువ సూత్రమున పరిహరించుచున్నవారు.

సూ. "భూతేషు తచ్ఛ్రుతేః" 4-2-5

"ప్రాణస్తేజసి"అనుచో తేజస్సు - భూతాంతరములతో కూడినదిగా చెప్పఁబడుచున్నది. కావున యమునానది గంగానదితో కూడి సముద్రముఁజెందుచున్నను "యమున సముద్రమును పొందుచున్నది" అను వచనము పొసగునట్లు ప్రాణము జీవునితోగూడ తేజస్సు మొదలగు భూతములయందు కలియు ననుటలో విరోధమెద్దియు గానరాదని తెలియవలెను.

రాబోవు దేహము నారంభించు పంచభూతములు తేజఃశబ్దముచే నిర్దేశింపఁబడుచున్నవని వివేకము

సూ. "నైకస్మిన్, దర్శయతో హి" 4-2-6

తేజస్సునందే ప్రాణలయ మగునని చెప్పకూడదు. ఒక్కొక భూతము మూడిటితో కలుపఁబడునని త్రివృత్కరణ శ్రుతియు "సమేత్యాన్యోన్య సంయోగం. పరస్పర సమాశ్రయాః, మహదాద్యా విశేషాంతా - అండ ముత్పాదయంతి తే" "మహత్తు మొదలుకొని భూతవిశేషముల వరకు గల తత్త్వములు పరస్పరము కలిసికొని ఒండొరుల నాశ్రయించియు బ్రహ్మాండమును నిర్మించుచున్నవి" అను స్మృతియు విశదపరచుచున్నవి కావున ప్రాణము జీవునితో గూడ భూతముల యందు కలియునని చెప్పుట సర్వప్రమాణ సమ్మతంబగుచున్నది.

మఱియు జీవునకు గమనము సిద్ధించుటకై సర్వభూత పరిష్వంగము అనివార్యంబగునది.

## స్మృత్యుపక్రమాధికరణము

సూ. "సమానా చాసృత్యుపక్రమా దమృతత్వం చానుపోష్య" 4-2-7

ఈ సందర్భమున చెప్పఁబడిన జీవుని ఉత్క్రాంతి-అర్చిరాదిగతి ప్రారంభమునకు ముందు విద్వాంసునకు అవిద్వాంసునకును సమానమా? కాదా? అని సందేహము.

ప్రశ్న : అవిద్వాంసుఁడు సంసారలంపటుఁడై యుండును కావున అట్టి సంసార ఫలమునకు విద్వాంసుని మోక్షఫలమునకును మిక్కిలి వ్యత్యాసముండుటఁజేసి జ్ఞానికి అజ్ఞానికిని ఏర్పడు ఉత్క్రాంతి - సమానము కాదనియే చెప్పవలెను కాదా ?

ఉత్తరము : అర్చిరాదిమార్గము ప్రారంభము కాకమునుపు జ్ఞానికి అజ్ఞానికిని ఉత్క్రాంతి సమానంబేను; ఐతే ఈ ఇరువురి నిష్క్రమణ విషయమై నాడీభేదము పాటింపఁదగినది. జ్ఞానియైతేనో మూర్ధన్యనాడి ద్వారా నిష్క్రమించి అమృతత్వముఁ జెందును. అజ్ఞాని తదితర నాడుల ద్వారా బయలుదేరి ముక్తుడు కాజాలడు. ఇదియే ఇరువురికి గల వ్యత్యాసంబని తెలియవలెను.

ఇందుకు శ్రుతిప్రమాణము—

"శతం చైకా చ హృదయస్య నాడ్య - స్తాసాం మూర్ధాన మభినిఃసృతైకా, తయోర్ధ్వ మాయన్నమృతత్వ మేతి, విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి".

"హృదయములో నూటఒక్క నాడులుండును. అవ్వానిలో ఒక్కటి మాత్రము శిరస్సువరకు నెలకొని యుండును. అట్టి మూర్ధన్యనాడిద్వారా బయలుదేరు విద్వాంసుఁడు - అమృతుండగును. ఇతర నాడులు బద్ధజీవుల నిష్క్రమణ మార్గములగుచున్నవి."

ఇందువలన గతికంటె ముందు సంభవించు ఉత్క్రాంతి ఉభయులకు సమానంబే యని విశదమైనది.

## తదాపీత్యధికరణము

సూ. "తదాపీతేః సంసారవ్యపదేశాత్" 4-2-8

విద్వాంసునకు మూర్ధన్య నాడిద్వారా ఉత్క్రాంతి సంభవించునని బాగుగా నిరూపింపఁబడినది. ఐతే శరీరమునుండి వెడలిన జ్ఞానికి అర్చిరాదిగతి సరిపడునా? లేదా ? అని ఈ యధికరణమున విచారింపఁబడుచున్నది.

"యదా సర్వే ప్రముచ్యంతే- కామా యేఽస్య హృది శ్రితాః, అథ మర్త్యో

ఒమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే" "జీవుని హృదయములో నెలకొనియుండు కోరికలన్నియు అంతరించునెడ అట్టివాడు ముక్తుడై బ్రహ్మమును పొందును" అనుచో దేహవియోగము కాగానే నిష్కామ కర్మోపాసకుండగువానికి అమృతత్వము చేకూరుననియు "తేఽర్చిష మభిసంభవంతి" అనుచో అర్చిరాదిగతియు వినంబడు చున్నందున సందేహము కలుగుచున్నది.

ప్రశ్న : వాగాది ఇంద్రియములు బ్రహ్మమునందు లీనములై మరల నుద్భవింపకుండుట కారణముగా ముక్తజీవులకు అర్చిరాదిగతి సంభవింపదు గదా ?

ఉత్తరము : ముక్తునకు అర్చిరాది మార్గము ద్వారా బ్రహ్మమును పొందుటకు ముందు శరీర సంబంధముండుటంజేసి సంసారము తొలగదు. శ్రుతిలో అమృతుండగునని చెప్పుట - అమృతత్వము సమీపించి యున్నదను అభిప్రాయముతో నని తెలియవలెను. అందువలన శరీరమునుండి బయలుదేరిన పురుషునకు అర్చిరాది గమనము ఉపపన్నంబగునని విశదమైనది.

వాక్కు మొదలగు ఇంద్రియములు బ్రహ్మమునందు లీనములగును. కావున అర్చిరాది గతి సంభవింపదను ఆశంకకు సమాధానమీ దిగువ సూత్రము.

సూ. "సూక్ష్మం ప్రమాణతశ్చ తథోపలబ్ధేః" 4-2-9

శరీరమునుండి వెడలిన ముక్త పురుషునకును సూక్ష్మశరీరము అనువర్తించును. అట్లు కాదనినచో చంద్రసంవాదము మొదలగునవి ఉపపన్నములు కాకుండును.

దేవయాన మార్గమున విద్వాంసుడు చంద్రునితో సంవాదమును గావించునని పర్యంక విద్యయందు ప్రతిపాదింపఁబడినది.

"యే వైకే చాస్మాల్లోకాత్ ప్రయంతి, చంద్రమస మేవ తే సర్వే గచ్ఛంతి" "ఈ లోకమునుండి వెళ్ళువారందరు చంద్రుని చెంతకే వెళ్ళుదురు" అను వాక్యము మొదలుకొని "ఏతద్వై స్వర్గస్య ద్వారం యశ్చంద్రమాః, తం యః ప్రత్యాహ, తమ తిసృజతే, అథ య ఏనం న ప్రత్యాహ. తమిహ వృష్టి ర్భూత్వా వర్షతి, స ఇహ కీటో వా పతంగో వా శకునిర్వా శార్దూలో వా సింహో వా మత్స్యో వా పరస్వాన్ వా పురుషో వాన్యో వైతేషు స్థానేషు ప్రేత్యాజాయతే, యథాకర్మ యథా విద్యం, తమాగతం పృచ్ఛతి, కోఽసీతి, తం ప్రతిబ్రూయాత్"

"చంద్రుఁడు స్వర్గమునకు ద్వారమగువాడు, ఇట్టి చంద్రునకు సమాధానముఁ జెప్పినవాడు పై లోకముల నతిక్రమించి శివపదమునకు వెళ్ళఁజాలును. సమాధానము నొసగని వానిని చంద్రుఁడు వర్షముద్వారా భూలోకమునకు పంపును. అట్టి జీవుఁడు కీటకముగానో పక్షిగానో పక్షివిశేషముగానో వ్యాఘ్రముగానో సింహముగానో మత్స్యముగానో మృగవిశేషముగానో పురుషుఁడు గానో స్త్రీగానో పూర్వకృత కర్మననుసరించియు విజ్ఞానము ననుసరించియు ఆ యా స్థానముల యందు జన్మించును. ఐతే నీవు ఎవడవని వెళ్ళినవానిని చంద్రుఁడు ప్రశ్నించును. అట్టితఱి నేను శివోపాసకుడనని ధైర్యముతో సమాధానము నొసగవలెను" అను వాక్యమువరకు చంద్రసంవాదము నిరూపింపఁబడినది.

కావున శరీరమునుండి బయలుదేరిన విద్వాంసునకు అర్చిరాది గతి అనివార్యంబగునని తెలియవలెను.

సూ. "నోపమర్దేనాతః" 4-2-10

చంద్ర సంవాదాది న్యాయము వలన "అథ మర్త్యోఽమృతో భవతి" అనుచో అమృతత్వ (మోక్ష)ము దేహ సంబంధము విడిపోగానే సంభవించునని చెప్పఁబడలేదని గ్రహింపవలెను.

సూ. " అస్యైవ చోపపత్తే రూష్మా" 4-2-11

స్థూలదేహవియోగానంతరము సూక్ష్మశరీరము ఉపలభ్యమానంబగుచున్నది. ఎట్లనఁగా ? ఉత్క్రాంతిఁజెందు విద్వాంసునకు సూక్ష్మదేహముఁజెందిన ఆవిరి పొడగట్టుచున్నది. ఇట్టి ఆవిరి స్థూలదేహగుణము కాదు. సూక్ష్మదేహము దక్క తదితరమునందు ఆవిరి కనఁబడుటలేదు.

సూ. "ప్రతిషేధాదితి చేన్న, శారీరా త్స్పష్టో హ్యేకేషామ్" 4-2-12

ప్రశ్న :

బృహదారణక్యమునందు "తస్య హైతస్య హృదయస్యాగ్రం ప్రద్యోతతే, తేన ప్రద్యోతే నైష ఆత్మా నిష్క్రామతి, చక్షుషో వా, మూర్ధ్నో వా, అన్యేభ్యో వా శరీర

దేశేభ్యః, తముత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామతి. ప్రాణ మనూత్క్రామంతం సర్వే ప్రాణా అనూత్క్రామంతి"

"మరణించువాని హృదయాగ్రము ప్రకాశించును. అట్టి ప్రకాశముతోడనే జీవాత్మ- నేత్రమునుండి గాని శిరస్సునుండి గాని ఇతర శరీర ప్రదేశములనుండి గాని బయలుదేరును. ఇట్లు బయలుదేరు జీవాత్మననుసరించి ప్రాణవాయువు, ప్రాణము ననుసరించి సకలేంద్రియములును నిష్క్రమించును" ఇత్యాది వాక్యములతో అవిద్వాంసుని ఉత్క్రాంతి మున్నగు విధానమును వక్కాణించి "అథా కామయమానః, యోఽకామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామో, న తస్య ప్రాణా ఉత్క్రామంతి, బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" "ఇఁక కోరికలు లేనివానిఁ గూర్చి విచారింతము. బొత్తుగా కామ సంస్కారములు లేనివాడై నిష్కామ కర్మాచరణముఁ జేయుచు కోరికలన్నియు పొందినట్లు సంతృప్తిఁ జెందుచు ఆత్మారాముడైయుండు వాని ప్రాణములు ఉత్థితములు కావు. అట్టివాడు బ్రహ్మంబై బ్రహ్మములో కలియును." అనుచో విద్వాంసుని ఉత్క్రాంతిని శ్రుతి నిషేధించినది గదా !

ఉత్తరము : "న తస్య ప్రాణా ఉత్క్రామంతి" అను వాక్యమునకు - ఉత్క్రాంతిఁజెంది అర్చిరాది మార్గముగా పయనించు విద్వాంసుని ప్రాణములు ఆతని నుండి విడిబడవు-అను నర్థముఁ జెప్పవలెను. ఇందుకు ప్రోద్బలకముగా "యోఽకామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామో న తస్మాత్ ప్రాణా ఉత్క్రామంతి" అను వాక్యము మాధ్యందినుల శాఖయందు స్పష్టముగా చెప్పఁబడినది.

సూ. ''స్మర్యతే చ'' 4-2-13

విద్వాంసుని నిష్క్రమణము మూర్ధన్య నాడిద్వారా సంభవించునని దిగువ స్మృతియందు గాననగును.

శ్లో॥ ఊర్ధ్వమేకః స్థితస్తేషాం- యో భిత్వా సూర్యమండలం।
బ్రహ్మలోక మతిక్రమ్య- తేన యాతి పరాం గతిమ్॥

"హృదయనాడులలో ఒక్కనాడి సూర్యమండలమును భేదించి పైకి ప్రసరించునది కలదు. అట్టి నాడిద్వారా నిష్క్రమించు మహాపురుషుఁడు బ్రహ్మలోకము నతిక్రమించి పరమపదమును పొందును."

ఇందువలన ఉత్క్రాంతిఁజెందు విద్వాంసునకును అర్చిరాదిగమనము అని వార్యంబగుననియే విదితమైనది. "చక్షుషో వా మూర్ధ్నో వా" అనుచో చెప్పఁబడిన మూర్ధ శబ్దము - అవిద్వాంసుని విషయమున పుణ్యలోక పర్యంతవ్యాప్తి గల మూర్ధన్యనాడి యను నర్థముఁజెప్పును.

## పరసంపత్త్యధికరణము

4-2-14

సూ. "తాని పరే తథా హ్యాహ"

తేజస్సు మొదలగు భూతములయందు జీవుఁడు ప్రాణసహితుడై వృత్తి లయముఁ జెందునని ప్రాణ సంపత్త్యధికరణము నందు బాగుగా నిరూపింపఁ బడినది. ఐతే "తేజః పరస్యాం దేవతాయాం" అనుచో "భూతాంతరములతో జీవుని తోడను కూడియుండు తేజస్సు - పరదేవతయందు లయించును" అని బోధ పడుచున్నది. ఇట్టిది పరబ్రహ్మమునందు స్వరూపలయమా ? అవిభాగావత్తి మాత్రమగు లయమా ? అని సంశయము.

ప్రశ్న : స్వరూపలయ మనియే చెప్పవలెను. ఎట్లనఁగా ? "దేవాత్తల్" అను సూత్రముఁబట్టి దేవుఁడే దేవత యనఁబడును. పరశబ్దము - మహత్త్వముఁ జెప్పును. కావున పరదేవత యనఁగా? మహాదేవుఁడనఁబడును. "సేయం దేవ తైక్షత" "ద్యావాభూమీ జనయన్ దేవ ఏకః" ఇత్యాది వాక్యముల ననుసరించి ఆ మహాదేవుఁడే సకలభూత కారణమగు పరబ్రహ్మంబని విదితమగును. ఇందువలన అట్టి యుపాదానము (పరబ్రహ్మము) నందు జీవునితో కూడిన పంచభూతములు స్వరూపలయముఁ జెందుటయే యుక్తమగును కాదా ?

ఉత్తరము : ఉపాదానమగు బ్రహ్మమునందును భూతాంతర జీవయుక్త మగు తేజస్సు - స్వరూపలయముఁ జందకుండ వృత్తిలయమును మాత్రము చెందును. "వాఙ్మనసి సంపద్యతే" ఇత్యాదిని గల సంపత్తి వచనమునకు ఇంట స్వరూపలయము అని అర్థముఁ జెప్పుటలో ప్రమాణమేమియు గానరాదు. కావున మనస్సు మొదలగువానివలె తేజస్సు బ్రహ్మమునందు వృత్తిలయముఁ జెందునని చెప్పుటయే సమంజసంబని తెలియవలెను

4-2-15

సూ. "అవిభాగో వచనాత్"

సంపత్తివచనము - సుషుప్తియందు వలె మరణకాలంబునను భూతములు జీవయుక్తములై బ్రహ్మమునందు విశదీయరాని వస్తుస్థితిగా కలియునని - విశద పరచుచున్నయది.

## తదోకోఽగ్రాధికరణము

సూ "తదోకోఽగ్రజ్వలనం, తత్ప్రకాశితద్వారో విద్యాసామర్థ్యా
త్తచ్ఛేషగత్యనుస్మృతి యోగాచ్చ హార్దానుగృహీతః
శతాధికయా'' 4-2-16

"పరమేశ్వరుని స్థానమైన హృదయముఁదగు అగ్రభాగమునంచు ప్రకాశం బగును. అట్టి ప్రకాశముతో బ్రహ్మనాడీద్వారము వెలుగొందింపఁబడును. బ్రహ్మ నాడీద్వారము నాభిచక్రమునందు నెలకొనియుండును. (హృదయమునందు గాని హృదయముకన్న పైభాగమునంచుగాని యుండునది కాదు) నాభిమొదలుకొని శిరస్సువరకు బ్రహ్మనాడి వ్యాపించియుండును. ఇందువలన శివోపాసకుఁడు ప్రకాశించు హృదయాగ్రముతో చూపఁబడు బ్రహ్మనాడీద్వారమును ప్రవేశించి తత్పూర్వమే ఉపాసనాంగముగా అర్చిరాదిగమనమును భావించియుండుటఁజేసి పరమేశ్వరునిచే అనుగ్రహింపఁబడినవాడై నూటఒకటవ నాడిద్వారా బయలుదేరు" వని సూత్రార్థము.

ఇఁక భాష్యము- విద్వాంసునకు అవిద్వాంసునకు అర్చిరాదిగతి ప్రారంభ మగువరకు ఉత్క్రాంతి సమానమైనదని పూర్వము నిరూపింపఁబడినది. ఐతే ఇఁట శరీరమునుండి బయలుదేరునపుడు ఇరువురిలో విశేషమెద్దియైన కలదా లేదా అని విచారింపఁబడుచున్నది.

ప్రశ్న : "తేజః పరస్యాం దేవతాయాం'' అను వాక్యము ననుసరించి ఉపాసకుఁడు అనుపాసకుఁడును పరమాకాశరూపము పరమకారణము పరదైవంబు నగు పరబ్రహ్మమునందు విభాగరహితముగా క్షణకాలము విశ్రమించియుండు ననియు చెపఁబడినది కావునను వారిరువురికిని హృదయప్రకాశము మొదలగు నవి సమానములగుటచేతను ఉత్క్రాంతి ఏకరూపమైనదనియే చెప్పవలెను. ఇందుకు ప్రమాణము ''తస్య హైతస్య హృదయస్యాగ్రం ప్రద్యోతతే, తేన

ప్రద్యోతేనైష ఆత్మా నిష్క్రామతి చక్షుషో వా మూర్ధ్నోవా అన్యేభ్యో వా శరీర దేశేభ్యః'' శ్రు. "మరణించువాని హృదయాగ్రము ప్రకాశించును అట్టి ప్రకాశమును పురస్కరించుకొని జీవాత్మ నేత్రములనుండిగాని శిరస్సునుండిగాని ఇతర శరీర ప్రదేశములనుండిగాని బయలుదేరును'' ఇందువలన ఉపాసక అనుపాసకు లిరువురి కిని ఉత్క్రాంతి-సమానమగుటజేసి విశేషమెద్దియు లేదని విశదమగుచున్నది కదా?

ఉత్తరము. హృదయాంతర్వర్తియగు పరమేశ్వరుని ఆరాధించుటయను విద్యఁదగు సామర్థ్యముతో ఉపాసనాంగముగా అర్చిరాదిగతిని భావించుటవలన ప్రసన్నుఁడును సర్వానుగ్రాహకుఁడు నగు శివుని (స్వస్వరూపావరణమలమును పోగొట్టుటయందు సమర్థంబగు) అనుగ్రహదృష్టితో చూడబడినవాడై శివాను గ్రహమువలన బ్రహ్మనాడీప్రకాశము గలవాడై శతాధికంబగు మూర్ధన్యనాడి ద్వారా శివోపాసకుఁడు బయలుదేరును. అనుపాసఁకుడు ఉపాసకునివలె గాక ఇతరనాడులద్వారా బయలుదేరును. ఇందుకు శ్రుతిప్రమాణము-

''శతం చైకా చ హృదయస్య నాడ్య
స్తాసాం మూర్ధాన మభినిఃసృతైకా,
తయోర్ధ్వ మాయ న్నమృతత్వ మేతి
విష్వఙ్ఙ్న్యా ఉత్క్రమణే భవంతి"

''నూటయొక్కనాడులు హృదయము నానుకొనియుండును. అవ్వానిలో ఒక్కటిమాత్రము శిరస్సువరకు వ్యాపించునది. అట్టి నాడిద్వారా పైకి వెళ్లువాడు ముక్తుండగును. ఇతరనాడులు శరీరమంతట నుండునవై అనుపాసకుల ఉత్క్ర మణమునకు ఉపయోగించునవి" ఇదియే విద్వాంసుని ఉత్క్రాంతిలోగల విశేషమని తెలియవలెను.

మఱియు "రుద్రో జనానాం హృదయే సన్నివిష్టః" "హృత్పుండరీకం విర జం విశుద్ధమ్" ఇత్యాది శ్రుతివాక్యములయందు ''ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" ఇత్యాది స్మృతివాక్యములయందును పరమేశ్వరుఁడు సర్వ జనహృదయగతుండని విదితమగుచున్నది. జీవుఁడు ప్రతిదినము సుషుప్తిఁ (గాఢనిద్రఁ) జెందునపుడు తన ఇంద్రియ వ్యాపారములను విరమించి శివునితో

తాదాత్మ్యముఁబొందియు శివానందరసాస్వాదలేశముగ్దుండగును. "విశ్వాధికో రుద్రో మహర్షిః" అను వాక్యమునందు పరమేశ్వరుఁడు జగన్నిమిత్తమగుటచే విశ్వాధికుఁడనియు ''సర్వో వై రుద్రః అను వాక్యమునందు జగదుపాదానమగుటవలన విశ్వాత్మకుండనియు బోధపడుచున్నది. "ఏకో హి రుద్రో న ద్వితీయాయ తస్థుః'' అనువాక్యము శివునకు విశ్వాధిపత్యమును సూచించును. "శివ ఏకో ధ్యేయః" "యదా చర్మవదాకాశం" ఇత్యాదివాక్యములు శివుఁడుదక్క తదితరులు ముముక్షువులచే ధ్యానింపఁదగినవారు కారని తెలుపుచున్నయవి.

"అత్ర హి జంతోః ప్రాణేషూత్క్రమమాణేషు రుద్ర స్తారకం బ్రహ్మ వ్యాచష్టే; యేనాసా వమృతీభూత్వా" అనుచో ఉత్క్రాంతి సమయమున శివారాధకులకు శివుఁడు స్వరూపమును ప్రకాశింపఁజేయు ప్రణవపంచాక్షరీ మహామంత్రము నుపదేశించుననియు "ఆ వో రాజానం" ఇత్యాదిని శివుఁడు సర్వారాధ్యుడై యజ్ఞాధిపతి యగుననియు "ఉన్నో వీరా అర్పయ! భేషజేభి ర్భిషక్తమం త్వా భిషజాం శృణోమి" అనుచో సంసారరోగమును నివారించుటకు శివుఁడొక్కడే మహావైద్యుఁడనియు "మాయాంతు ప్రకృతిం విద్యా- న్మాయినంతు మహేశ్వరం" అనుచో సకలప్రపంచముఁదగు విచిత్రములైన మొగ్గలగుంపు నాశ్రయించునదియు మాయాస్వరూపిణియు నగు పరాశక్తి- మహేశ్వరుని స్వరూపములో ఏకదేశముగ నుండునదనియు విదితమగుచున్నది.

ఇట్టి శివుఁడు హృదయగతుడై హార్దబ్రహ్మమనఁబడును, మఱియు పరమమంగళ స్వరూఁపుడును ఉమాపతియు పరమాత్మయు నగు శివుఁడు తన యానతిరూపములైన వేదములచే ప్రేరేపింపఁబడుననియు శివారాధన రూపములు నగు అగ్నిహోత్రాదికర్మలయందు నిరతుఁడును నిషిద్ధకర్మల పూర్తిగా విడనాడినవాడును సకలకర్మఫలమును శివార్పితముఁజేయువాడును తన చిత్తమును శివాధీనము నొనర్చినవాడును శివజ్ఞానమనెడు అమృతముచే నిండినవాడును కామ్యఫలముల నన్నిటిని బొత్తుగా నిరసించినవాడును వివేకము మొదలగు సాధనచతుష్టయము గలవాడును శివభక్తియందు మాత్రము ఆసక్తి కలవాడును శివానుగ్రహమును త్రికరణశుద్ధిగా కోరువాడును శివాగమోక్తవిధిని శివుని దృఢముగ నుపాసించువాడు నగు భక్తు నవలోకించి భక్తుఁడు భౌతికకాయమును విడనాడు తఱి భక్తుని శివారాధనమువలన అనుగ్రహము కలవాడై సంసారమలకళంకమును

పోనాడు అనుగ్రహదృష్టిని భక్తునియందు నెలకొలుపును. అట్టి శివానుగ్రహ విశేషముతో భక్తుఁడు సాంసారిక మలమును పోగొట్టుకొని పరమాత్మచే ప్రకాశింప బడిన శుద్ధాత్మవలన ప్రకాశించు మూర్ధన్యనాడిద్వారా బయలుదేరి అర్చిరాదిమార్గము ననుసరించి అప్రాకృతంబును నిరతిశయానందస్వభావము గలదియు నగు శివుని పరమపదముఁజెంది శివస్వరూపుడై నిత్యనిరతిశయానందము ననుభవించువాడ గును.

కావున ఉపాసకుఁడు బయలుదేరు గమనము వేరనియు అనుపాసకుని గమనము వేరనియు చెప్పుటయే సమంజసంబైనది.

పరమేశ్వరునిచెంత నంతరంగసేవను గావించు గణనాథులు వీరులనఁ బడుదురు. ఇట్టి వీరులే పరమేశ్వరుని దివ్యస్థానములందంతటను నివసించుచుం దురు. ఇవ్వారితో కూడియుండునట్లు సర్వప్రపంచోపరి స్థితమగు శివపదమునందు మమ్ము ఉండఁజేయుమని "ఉన్నోవీరా" అను మంత్రమున కర్థము.

ప్రకృతము చెప్పఁబడినదంతయు విద్వాంసుని యుత్క్రాంతిఁజెందినదియు వర్ణాశ్రమధర్మముచే శివుని ఆరాధించువారి యుత్క్రాంతి యైతేనో పరమేశ్వరుని యనుగ్రహము పొందఁదగిన పుణ్యలోకముల కనుకూలించు నాడులద్వారా సంభ వించుననియు తెలియవలెను.

## రశ్మ్యనుసార్యధికరణము

సూ. "రశ్మ్యనుసారీ" 4-2-17

హృదయగతుడైన పరమేశ్వరునిచే అనుగ్రహింపఁబడిన సాధకుఁడు (శివోపాసకుఁడు) మూర్ధన్యనాడిద్వారా బయలుదేరునని పూర్వాధికరణమునందు నిరూపింపఁబడినది.

అట్లు బయలుదేరిన మహాపురుషుని ఊర్ధ్వగమనము- రాత్రి పగలున్ను సంభవించునా? లేదా? అని సంశయము.

ప్రశ్న : "యత్రైతదస్మాచ్ఛరీరా దుత్క్రామ త్యథైతై రేవ రశ్మిభి రూర్ధ్వ మాక్రమతి" అనువాక్యము- శరీరమునుండి బయలుదేరినవాడు సూర్యకిరణ

ముల ద్వారా పైకి వెళ్ళనని తెలుపుచున్నందున మరణించినవానికి సూర్యకిరణ సంబంధము పగలే సరిపడుననియు రాత్రివేళ సరిపడదనియు భావింపవలెను కాదా?

ఉత్తరము : ఉత్క్రాంతిఁజెందిన శివోపాసకుఁడు సూర్యకిరణసంబంధము తోడనే పై ప్రదేశమునకు వెళ్ళనను‌ట నిజమే; కాని అట్టి సంబంధము పగటియందు రాత్రియందును సంభవించును. ఎట్లనఁగా? వేసవికాలమున రాత్రులయందును వేడియుండుటను మనము చూచుచున్నాము. కావున అహోరాత్రముల రెంటియందును సూర్యకిరణముల ద్వారానే విద్వాంసుఁడు పైకి వెళ్ళునని సిద్ధాంతము.

మరియొక ఆశంకకు పరిహారము దిగువ సూత్రము.

సూ. "నిశి నేతి చేన్న, సంబంధస్య యావద్దేహభావిత్వా
ద్దర్శయతి చ" 4-2-18

ప్రశ్న : రాత్రియందు మరణించినవాడును సూర్యకిరణసంబంధముతో ఊర్ధ్వగామియై బ్రహ్మప్రాప్తుఁడగునని చెప్పిన యంశము సరియైనది కాదు. ఎందుకనఁగా?

శ్లో॥ దివా చ శుక్లపక్ష శ్చ – ఉత్తరాయణ మేవ చ,
ముమూర్షతాం ప్రశస్తాని - విపరీతం తు గర్హితమ్.

"పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణము అనునవి మరణించువారికి శ్రేయస్కరములు. రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనము అనునవి నికృష్టములు" అనుచో రాత్రిమరణము నిందింపఁబడినది గదా!

ఉత్తరము : శివారాధనమును ప్రారంభించిన దేహమున్నంతవరకే సంసార బంధముండునది. ఆ తరువాత సంసారబంధము విడిపోవును. ఐతే అనారబ్ధకార్యములు బంధహేతువులు నగు కర్మలన్నియు శివోపాసనముచే నశింపఁబడుటయు అనువర్తమానంబగు ప్రారబ్ధము గూడ అంతిమశరీరావసానమువరకే నుండుటయు ప్రారబ్ధంబును చరమదేహాంతమున నశించుటయు సంభవించుటఁజేసి బ్రహ్మప్రాప్తి విఘ్నరూపములైన రాత్రిమొదలగు హేతువులు మరల కలుగఁజాలవు.

ఇవ్విషయమును దిగువశ్రుతిగూడ నిరూపించినది.

"తస్య తావదేవ చిరం, యావన్న విమోక్ష్యేఽథ సంపత్స్యే''

"శివోపాసకుడు చరమదేహము నుండి విడిబడుటయే తడవుగా శివసాయుజ్యము నొందును"

రాత్రిమరణమును గురించిన నిందావాక్యము- అనుపాసకుల విషయము గలదని తెలియవలెను. మఱియు ఇష్టాపూర్తాదిపుణ్యకర్మల నాచరించిన శిష్ట శ్రేష్ఠులు రాత్రివేళలయందు మరణించునెడ- ప్రబలజన్మాంతర ప్రతిబంధము ఉన్నపుడే నవ్వారికి రాత్రిమరణము ఊర్ధ్వగమనము నీయజాలదనియు ప్రబల ప్రతిబంధము లేనిచో అనుపాసకులైన శిష్టులు రాత్రి మరణించినను సూర్యకిరణములద్వారా పై పుణ్యలోకములకు వెళ్ళుదురనియు పిమ్మట భూలోకమున జన్మింతురనియు వివేకము.

అందువలన రాత్రిమరణముఁజెందినను విద్వాంసునకు బ్రహ్మప్రాప్తియే సమకూరు ననుటలో ఎట్టి విరోధంబును లేదని భావము.

## దక్షిణాయనాధికరణము

సూ. ''అతశ్చాయనేఽపి దక్షిణే" 4-2-19

విద్వాంసుని మరణానంతరము సంసారబంధమునకు వలయు నిమిత్తములు లేవు కావుననే విద్వాంసుఁడు (శివోపాసకుఁడు) దక్షిణాయనమునందు మరణించి వను బ్రహ్మమును పొందఁజాలును.

సూ. ''యోగినః ప్రతి స్మర్యతే స్మార్తే చైతే" 4-2-20

ప్రశ్న: మరణించు ఉపాసకులను గురించియే- పునరావృత్తిజనకము గాను అపునరావృత్తికరముగాను కాలవిశేషము ఎగువ స్మృతియందు పేర్కొనఁబడినది.

శ్లో॥ యత్ర కాలే త్వనావృత్తి - మావృత్తిం చైవ యోగినః,
ప్రయాతా యాంతి తం కాలం - వక్ష్యామి భరతర్షభ ॥

"యోగులు ఏ సమయమునందు మరణించినచో జన్మరాహిత్యమునొందు

దురో ఏవేళ చనిపోయినయెడల పునర్జన్మము నొందుదురో అట్టి సమయభేదమును చెప్పగలను. భరతర్షభా! వినుము.

శ్లో॥ అగ్ని ర్జ్యోతి రహః శుక్లః - షణ్మాసా ఉత్తరాయణమ్,
తత్ర ప్రయాతా గచ్ఛంతి - బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥

అగ్నియజదు జ్యోతిస్సునందు నభిమానము గల దేవతలచేతను పగలు శుక్లపక్షము ఆరునెలలు పరిమితిగా గల ఉత్తరాయణము అనువానియందభిమానము గల దేవతలచేతను చూపబడు మార్గమునందు పయనించు శివోపాసకులు పరమేశ్వరుని పొందుదురు. అనఁగా- పునరావృత్తిరహిత శాశ్వత శివసాయుజ్యము గలవారగుదురని భావము.

శ్లో॥ ధూమో రాత్రి స్తథా కృష్ణః - షణ్మాసా దక్షిణాయనమ్,
తత్ర చాంద్రమసం జ్యోతి - ర్యోగీ ప్రాప్య నివర్తతే ॥

ధూమము, రాత్రి, కృష్ణపక్షము, షణ్మాసావధిగల దక్షిణాయనము అనువానియందభిమానము గల దేవతలచే ప్రదర్శింపఁబడు మార్గమునందు వెళ్ళు వారు స్వర్గలోకముఁజెంది యచట సుకృతఫలముల ననుభవించి భూలోకమునకు వచ్చువారు; అనఁగా- కర్మశేషము ననుసరించి బ్రాహ్మణాది జన్మముల నొందుదు రని భావము.

శ్లో॥ శుక్లకృష్ణే గతీహ్యేతే - జగతః శాశ్వతే మతే,
ఏకయా యాత్యనావృత్తి - మన్యయాఽవర్తతే పునః ॥

"శుక్ల కృష్ణగతులు రెండు జగమునకు శాశ్వతములుగ నభిమతములైనవి. ఇవ్వానిలో శుక్లగతిని వెళ్ళువాడు పునరావృత్తిరాహిత్యమును పొందును. కృష్ణ గతిని పోవువాడు మరల నీ లోకమునకు వచ్చును"

ఇందువలన తేటపడినదేమనఁగా? రాత్రిని దక్షిణాయనమును నిందించుట అనుపాసకులను గురించియని చెప్పుట సరిపడదను శంకకు సమాధానము పై సూత్రమగుచున్నయది.

అర్చిరాది గతి- విద్వాంసులకనియు, ధూమాదిగతి- అవిద్వాంసులకనియు

యోగులను గుఱించి యోగాంగములుగ దేవయానపితృయానగతులు ప్రతిదినము స్మరింపఁదగినవని "యత్రకాలే త్వనావృత్తిం" ఇత్యాది సందర్భమున చెప్పఁబడినది. కాని ఉపాసకుని గురించిన మరణకాల విశేషము చెప్పఁబడ లేదు.

శ్లో॥ నైతే సృతీ పార్థ జానన్ - యోగీ ముహ్యతి కశ్చన,
తస్మాత్సర్వేషు కాలేషు - యోగయుక్తో భవార్జున ॥

"పార్థా! యోగియగువాడు ఈ రెండుమార్గములను గుర్తించినచో మోహముఁ జెందడు కావున అర్జునా! అన్ని సమయములయందు యోగము నభ్యసించుచుండుము! ఇట్లు ఉపసంహారము చేయఁబడినది. మఱియు "అగ్ని ర్జ్యోతిః" "ధూమో రాత్రిః" అను రెండు శ్లోకములయందు దేవయానపితృయాన మార్గములు జ్ఞాపకము చేయఁబడినవని తెలియవలెను.

"యత్ర కాలే తు" అనుచో కాలశబ్దము- అతివాహికగణమగు కాలాభిమాని దేవతలఁ జెప్పును.

ఇందువలన విద్వాంసులు (శివోపాసకులు) బ్రహ్మమును (శివుని) పొందుటకై నిశా దక్షిణాయన కృష్ణపక్ష నిషేధము- ఏ విధంబుగ నుండఁజాలదనియు ఎప్పుడు శరీరము విడిబడునో అప్పుడే శైవులకు శివసాయుజ్యము చేకూరుననియు గ్రహింపవలెను.

ఇయ్యది
శ్రీ నీలకంఠ శివాచార్యవిరచితంబైన
బ్రహ్మమీమాంసా సూత్రభాష్యమునందు
నాలుగవ యధ్యాయముఁదగు రెండవ పాదము
శ్రీకంఠమణిప్రభామయూఖంబను శాంకరీయ ఆంధ్రానువాదముతో ముగిసినది.



శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

## చతుర్థాధ్యాయము

## తృతీయపాదము

## ఆంధ్రీకరణము

# అర్చిరాద్యధికరణము

సూ. "అర్చిరాదినా తత్ప్రథితేః" 4-3-1

ఉపాసకుఁడు హృదయగతుడైన పరమేశ్వరుని అనుగ్రహమువలన బయలు వెడలు త్రోవఁగనుగొని మూర్ధన్యనాడిద్వారా వెళ్ళునని పూర్వభాష్యమునందు బాగుగా చెప్పఁబడినది.

ఐతే ఇఁట ఇట్టివానికి అర్చిరాదిమార్గము తోడనే బ్రహ్మప్రాప్తియా? లేక ఇతరవిధముననా? అని విచారింపఁబడుచున్నది.

ప్రశ్న : "యత్రాసౌ కేశాంతో వర్తతే, వ్యపోహ్య శీర్షకపాలే, భూరిత్యగ్నౌ ప్రతితిష్ఠతి, భువ ఇతి వాయౌ, సువ రిత్యాదిత్యే, మహ ఇతి బ్రహ్మణి, ఆప్నోతి స్వారాజ్యమ్" "ఉపాసకుఁడు శిరస్సునందలి కపాలద్వయము మధ్య కేశాంతము అనఁగా తలకాయ పైభాగమునుండి బయలుదేరి "భూః" అధిదేవత యగు అగ్నిని "భువః" అధిదేవతయగు వాయువును "సువః" అధిదేవతయగు సూర్యుని, "మహః" అధిదేవతయగు బ్రహ్మమును ఆశ్రయించి స్వారాజ్యమును అనఁగా శివ సాయుజ్యమును పొందువాడగును" అనుచో అర్చిరాది మార్గము

లేకయే బ్రహ్మప్రాప్తి కలదని తెలియుచున్నది. కావున బ్రహ్మమును పొందుటకు అర్చిరాది మార్గము(దగు ప్రతి బంధము లేదనియే చెప్పవలెను కాదా ?

ఉత్తరము : బ్రహ్మము నుపాసించువాడు అర్చిరాదిమార్గముద్వారానే బ్రహ్మమును పొందునని "తేఽర్చిష మభిసంభవంతి" ఇత్యాదివాక్యములు చెప్పు చున్నవి కావున "అర్చిరాదిమార్గము బ్రహ్మప్రాపకము" అను సంశము పంచాగ్ని విద్యాదులయందు ప్రసిద్ధమైయున్నదని తెలియవలెను.

"భూరిత్యగ్నౌ" ఇత్యాదివాక్యములయందు చెప్ప(బడినది - బ్రహ్మప్రాప్తి మార్గము కాజాలదు. కాని నిష్క్రమించు జీవాత్మ ఆ యా స్థానములయందు ఆ యా దేవతల విభూతిని పొందునని గ్రహింపవలెను. అందువలన అర్చిరాది మార్గముగానే బ్రహ్మప్రాప్తియని సారాంశమును నిర్ణయింపనైనది.

## వాయ్వధికరణము

సూ. "వాయుమబ్దా దవిశేష విశేషాభ్యాం" 4-3-2

మఱియొక శ్రుతియందు చెప్ప(బడిన మార్గక్రమమును పూర్వోక్తమగు అర్చిరాది మార్గమునందు చేర్చవలెనా ? లేదా ? అని సంశయము.

ప్రశ్న : "తేఽర్చిష మభిసంభవ త్యర్చిషోఽహ, రహ్న ఆపూర్యమాణ పక్ష మాపూర్యమాణపక్షా ద్యాన్ షడుదఙేతి మాసాం స్తాన్, మాసేభ్యః సంవత్సరం, సంవత్సరా దాదిత్య మాదిత్యా చ్చంద్రమసం, చంద్రమసో విద్యుతం, తత్పురుషోఽమానవః స ఏనాన్ బ్రహ్మ గమయతి" "బ్రహ్మోపాసకులు మూర్ధన్య నాడిద్వారా బయలుదేరి వెలుగునందభిమానము గల దేవతలను తరువాత పగలు నందభిమానముగల దేవతలను అటనుండి శుక్లపక్షాభిమాని దేవతలను శుక్లపక్షము నుండి ఆరునెలలుగల ఉత్తరాయణమునందభిమానముగల దేవతలను ఉత్తరాయ ణమునుండి సంవత్సరాభిమాని దేవతలను సంవత్సరము నుండి సూర్యుని సూర్యు నుండి చంద్రుని చంద్రునుండి విద్యుత్పురుష నాశ్రయింతురు. అటుపిమ్మట ఆ దివ్యపురుషు(డు ఈ మహాపురుషులను బ్రహ్మము(దగు సన్నిధి(జేర్చును"అని ఛాందోగ్యమునందు అర్చిరాదిక్రమము వినంబడుచున్నది.

బృహదారణ్యకమునందైతేనో "యదా వై పురుషోఽస్మాల్లోకాత్ ప్రైతి స వాయు మాగచ్ఛతి, తస్మై సతత్ర విజిహీతే, యథా రథచక్రస్య ఖం, తేన స ఊర్ధ్వ మాక్రమతే స ఆదిత్య మాగచ్ఛతి" "పురుషుఁడు అనఁగా జీవాత్మ - ఈ లోకమునుండి బయలుదేరినపుడు మొదట వాయువు నాశ్రయించును. అట్టి తఱి వాయువు జీవాత్మను రథచక్రమునందలి బెజ్జమునువలె తలక్రిందులు చేసినను తట్టుకొని ఉపాసనాబలమున వాయువు నతిక్రమించి పైకి వెళ్ళి సూర్యునాశ్రయించును" అనుచో సంవత్సర ఆదిత్యులమధ్య వాయువు వినంబడుచున్నది.

అట్టి వాయువు సంవత్సరాదిత్యులమధ్య పూర్వోక్తశ్రుతియందు లేనందున చేర్పఁదగినది కాదు గదా ?

ఉత్తరము : గుణోపసంహారన్యాయము ననుసరించి సంవత్సరము తరువాత ఆదిత్యునకంటె ముందు వాయువు-అర్చిరాది మార్గమునందు చేర్పఁదగినది. బృహదారణ్యకమునందే మరియొకచో "మాసేభ్యో దేవలోకం, దేవలోకా దాదిత్యం" అని చెప్పఁబడిన అర్చిరాదిక్రమమునందు ఛాందోగ్యశ్రుతినుండి ఉపసంహరింపఁదగినదియు మాసాధిక కాలరూపమగుటచే మాసముల తరువాత చేర్పఁదగినదియు నగు సంవత్సరము తరువాత వినఁబడు దేవలోకశబ్దము - దేవతలకు ఆధారమైన లోకము అను వ్యుత్పత్తి ననుసరించి వాయువును సామాన్యముగా చెప్పుచుండుటఁజేసియు వాయుశబ్దము విశేషముగా వాయువాచకమగుటవలనను అవిశేష విశేషంబులగు దేవలోక వాయుశబ్దములను పురస్కరించుకొని అబ్దము అనఁగా సంవత్సరము తరువాత ఆదిత్యునికన్న ముందు వాయువే చేర్పఁదగినదని గ్రహింపవలెను.

"వాయు ర్దేవానా మాసనభూతః, "వాయువు దేవతలకు ఆధారమగు ప్రదేశమువంటిది" "యోఽయం పవత ఏష దేవానాం గ్రహః" "వీచుచున్న వాయువు దేవతలకు ఆలంబనము" అను శ్రుతివాక్యములు ఇందుకు ప్రోద్బలకములు.

## తటి దధికరణము

సూ. "తటితోఽధివరుణః సంబంధాత్" 4-3-3

"స ఏతం పంథాన మాపద్యాగ్నిలోక మాగచ్ఛతి, స వాయులోకం

స వరుణలోకం స ఇంద్రలోకం స ప్రజాపతిలోకం స బ్రహ్మలోకమ్" "ముక్తపురుషుఁడు అర్చిరాదిమార్గమునందు అడుగిడుటతోడనే అగ్నిలోకమును తరువాత వాయు వరుణ ఇంద్ర ప్రజాపతి లోకములను వరుసగా ఆశ్రయించి బ్రహ్మలోకమును అనఁగా పరమపదమును పొందును'' ఇఁట అగ్నిలోకశబ్దముతో చెప్పఁబడిన అర్చిస్సు మొదటిది అను నంశము విరుద్ధము కాజాలదు. శ్రుత్యంతరమునందు గల శ్రౌతక్రమముతో ఇచటి పాఠక్రమము బాధింపఁబడుటఁజేసి సంవత్సరము తరువాత క్రమముగా వాయువును సూర్యుని చేర్పవలెను. అటులే వినఁబడు వరుణుఁడు మున్నగువారు అర్చిరాది మార్గమునందు చేర్పవలసినవారు అగునా కాదా అని సంశయము.

ప్రశ్న : చేర్చుటకు చేర్పకుండుటకును ఎట్టి నియామకము లేనందున వరుణాదులు అర్చిరాది మార్గమునందు చేర్పఁదగినవారు కారనియే చెప్పవలెను కాదా ?

ఉత్తరము : విద్యుల్లోకముపై వరుణలోకముఁదగు సంబంధము ననుసరించి వరుణాదుల ఏర్పాటు చేయవచ్చును. మెరుపును పురస్కరించుకొని సంభవించు వర్షమువలననైన జలమునకు వరుణుఁడు అధిపతిగా ప్రసిద్ధుఁడు కావున విద్యుత్తునకు వరుణునకును సంబంధము సరిపడును. వరుణుని తరువాత మిగత ఇంద్రలోకము, ప్రజాపతిలోకంబును చేర్పఁదగినవని చెప్పుటలో ఎట్టి విరోధంబును లేదని సారాంశము.

## ఆతివాహికాధికరణము

4-3-4

సూ. "ఆతివాహికా స్తల్లింగాత్"

అర్చిరాదికములు - మార్గముఁదగు చిహ్నములగు స్థానభేదములా ? లేక ఉపాసకులను బ్రహ్మలోకమునకు గొంపోవు దేవతావిశేషములా ? అని సంశయము.

ప్రశ్న : మార్గమునందలి లాంఛనములుండుటఁజేసి అర్చిరాదులు స్థానభేదములని చెప్పవచ్చును. "గ్రామమునుండి వెళ్ళి నది నతిక్రమించి పల్లెటూరుఁ

జేరవలెను''అని లోకమున వ్యవహరింతురు. అటులే అర్చిరాదులు నని గ్రహింపవలెను కాదా?

ఉత్తరము : అర్చిరాదులు - విద్వాంసుల (ఉపాసకుల)ను బ్రహ్మలోకమునకు తీసికొనిపోవువారు మార్గమునందభిమానము గలవారు నగు దేవతావిశేషంబులే యగును. "తత్పురుషోఽమానవః స ఏనాన్ బ్రహ్మ గమయతి" అనుచో విద్యుత్పురుషునకు గమయితృత్వ లింగముండుటఁజేసి ఎట్టి విశేషము లేకుండ నిర్దేశింపఁబడినను అర్చిరాదులకు గమయితృత్వమే (ఉపాసకులతో సంబంధము) అను నిర్ణయము పొసగునది.

విద్యుత్పురుషుఁడు గమయిత యగునెడ వరుణాదులతో నవసరమేమి యను ఆశంకకు సమాధానము దిగువ సూత్రము.

సూ. "వైద్యుతే నైవ తత స్తచ్ఛ్రుతేః" 4-3-5

విద్యుత్పురుషుని తరువాత విద్యుత్పురుషుఁడే బ్రహ్మలోకమునకు ముముక్షువులను గొంపోవునని దిగువ శ్రుతివాక్యముద్ఘోషించుచున్నయది.

"తత్పురుషోఽమానవః స ఏనాన్ బ్రహ్మ గమయతి"

అట్టితఱి వరుణుఁడు మొదలగువారు విద్యుత్పురుషుని సహచరులుగా గమయితలు అగుదురని చెప్పుటలో విరోధమెద్దియు గానరాదు.

## కార్యాధికరణము

పూర్వపక్ష సూత్రములు.

సూ. "కార్యం బాదరి రస్య గత్యుపపత్తేః" 4-3-6

దివ్యపురుషుఁడు ఉపాసకులను సాక్షాత్తుగానే బ్రహ్మమును పొందఁజేయునా? లేక ఇతరదేవత నాశ్రయింపఁజేయునా? అని సందేహము.

ప్రశ్న : కార్యప్రథముఁడగు హిరణ్యగర్భుని చెంతకే దివ్యపురుషుఁడు ఉపాసకులను గొంపోవునని చెప్పుట సమంజసము. ఎందుకనఁగా? పరిచ్ఛిన్నప్రమాణుఁ

దగు చతుర్ముఖుఁడు గంతవ్యుడగుట పొసగును. సర్వవ్యాపియగు శివుఁడు (బ్రహ్మము) గంతవ్యుడు కాజాలడు గదా!

మరియొక ఉపపత్తిఁ జెప్పుచున్నవారు

సూ. "విశేషితత్వాచ్చ" 4-3-7

"ప్రజాపతేః సభాం వేశ్మ ప్రపద్యే" "చతుర్ముఖబ్రహ్మయొక్క సభలో ప్రవేశించి ఆతని సన్నిధిఁజేరుదునుగాక" అని ముక్తపురుషుఁడు భావింపఁదగినట్లు విశేషించి శ్రుతి చెప్పుటవలన ముక్తప్రాప్యము - హిరణ్యగర్భస్థానమే యని బోధపడును.

సూ. "సామీప్యాత్తు తద్వ్యపదేశః" 4-3-8

"బ్రహ్మ గమయతి" "బ్రహ్మమును పొందించును" అను వ్యపదేశమైతేనో పరబ్రహ్మము చేరువ నుండువాడగుటఁజేసి చతుర్ముఖుడే ప్రాప్యుండగునని తెలుపుటకే యని తెలియవలెను.

"హిరణ్యగర్భం పశ్యత జాయమానమ్" "పరమేశ్వరుఁడు ప్రప్రథమముగా జన్మించిన హిరణ్యగర్భుని సృష్టికార్యోన్ముఖునిగ నానర్చు అనుగ్రహదృష్టితో నవలోకించెను"అను శ్రుతివాక్యము - హిరణ్యగర్భుఁడు - పరమేశ్వరుని ప్రథమకార్యమగుటచే సమీపమునందుండువాడని విశదీకరించుచున్నది.

సూ. "కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పరమభిధానాత్" 4-3-9

మొదట హిరణ్యగర్భుని పదముఁ జెందినను అనావృత్తి శ్రుతికి ఎట్టి విరోధము లేదు. హిరణ్యగర్భుని లోకము నశించునపుడు లోకాధ్యక్షుఁడైన చతుర్ముఖునితో గూడ కార్యబ్రహ్మలోకము నతిక్రమించి పరమపదము (శివలోకము) నకు ముక్తపురుషులు వెళ్ళుదురు ఇందుకు "తే బ్రహ్మలోకే తు పరాంతకాలే- పరామృతాత్ పరిముచ్యంతి సర్వే" అను శ్రుతి వాక్యము ప్రోద్బలకమని భావింపవచ్చును.

సూ. "స్మృతే శ్చ" 4-3-10

శ్లో॥ బ్రహ్మణా సహ తే సర్వే - సంప్రాప్తే ప్రతిసంచరే।
పరస్యాంతే కృతాత్మానః - ప్రవిశంతి పరం పదమ్ ॥

"అవాంతర ప్రళయమువేళ బ్రహ్మలోకము అంతరించును. అట్టి తఱి బ్రహ్మదేవునితో గూడ ముక్తపురుషులు పరమపదముఁ బ్రవేశింతురు" అను స్మృతిఁబట్టియు పై యంశము ధృవపడుచున్నది కావున ప్రళయమువరకు చతుర్ముఖలోకప్రాప్తి యనియు ఆ తరువాత బ్రహ్మప్రాప్తి యనియు బాదరిమహర్షి యభిప్రాయము.

సూ. "పరం జైమిని ర్ముఖ్యత్వాత్" 6-3-11

హిరణ్యగర్భుని మించినట్టి నారాయణుని సన్నిధానమునకు అర్చిరాది మార్గము ముక్తపురుషుని గొంపోవుననియు పరబ్రహ్మముఁదగు ఉపాదాన స్థితిలో రెండవదశయగు నారాయణుని యందు బ్రహ్మవ్యపదేశము ముఖ్యమగుటఁజేసి పై యంశము సరిపడుననియు జైమిని మహర్షిగారు అభిప్రాయపడిరి.

ఇందుకు దిగువసూత్రము గూడ ప్రోద్బలకమగును.

సూ. "దర్శనా చ్చ" 4-3-12

"సోఽధ్వనః పార మాప్నోతి, తద్విష్ణోః పరమం పదమ్" "అర్చిరాది మార్గముఁదగు అవధియైన విష్ణువుయొక్క పరమపదమును ముక్తపురుషుఁడు పొందును" అను శ్రుతిప్రమాణ ముండుటఁజేసి నారాయణునే అర్చిరాదిమార్గము పొందించునని గ్రహింపవలెను.

మరియొక ఉపపత్తి సూత్రము

సూ. "న చ కార్యే ప్రత్యభిసంధిః" 4-3-13

"ప్రజాపతేః సభాం వేశ్మ ప్రపద్యే" అను వాక్యములోని ప్రజాపతి శబ్దమునకు హిరణ్యగర్భుడను అర్థముఁజెప్పక ప్రజలను పాలించువాడను అర్థమును పురస్కరించుకొని ప్రజాపతి యనఁగా నారాయణుడని చెప్పవలెను. మఱియు "తే బ్రహ్మలోకే తు" ఇత్యాదిని గల బ్రహ్మశబ్దమునకు నారాయణుడను అర్థముఁజెప్పి ముక్తపురుషులు నారాయణుని వైకుంఠమునందు నివసించి పశ్చిమ దేహావసానమున విశ్వాధికుడగు పరశివుని పొందుదురని చెప్పుటలో విరోధమేమియు లేదు.

"ఏతాని హ వా అమృతస్య నామధేయాని'' ఇత్యాదిని పరమాత్మ యగు శివుఁడు అమృత శబ్దాభిధేయుఁడనియు అనాది ముక్తుండనియు విశదీకరింపఁ బడినది కావున విష్ణుపదమునందు ప్రారబ్ధకార్యమగు దేహము అంతరించు తఱి ఉపాసకులు-పరామృతంబు విశ్వాధికంబు నగు బ్రహ్మమును (శివుని)పొంది ముక్తులగుదురని భావము.

ఇంతవరకు జైమినిగారి అభిప్రాయముగ పూర్వపక్షసూత్రములు ముగిసినవి. ఇఁక సిద్ధాంతసూత్రములు.

సూ. ''అప్రతీకాలంబనా న్నయతీతి బాదరాయణ
ఉభయథా చ దోషాత్తత్క్రతు శ్చ" 4-3-14

ఒకానొక చేతనుని గాని ఒకానొక అచేతనమును గాని బ్రహ్మదృష్టితో నిష్కామబుద్ధి నుపాసించువారు ప్రతీకోపాసకులనంబడుదురు. సకల చిదచిత్ప్రపంచ విశిష్ట స్వరూపము గల శివుని ఏకదేశమగు చేతనరూపముగాని అచేతన రూపముగాని ప్రతీక మనఁబడును. విశ్వాధికమైన బ్రహ్మమును సాక్షాదుపాసించువారు అప్రతీకోపాసకులగుదురు. సాక్షాత్ అనఁగా (పరంపరా సంబంధము లేకుండ) శివు నుపాసించువారిని దివ్యపురుషుఁడు సాక్షాత్తు శివునే పొందించును. విశ్వాధికంబు విరూపాక్షంబు కృష్ణపింగళంబు నగునదియే పరబ్రహ్మంబని తెలియునది.

"పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే"

''శివోపాసకుఁడు పరబ్రహ్మమును సమీపించి నిజరూపము గలవాడగును"

''ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం - త్రిలోచనం నీలకంఠం ప్రశాంతమ్
ధ్యాత్వా ముని ర్గచ్ఛతి భూతయోనిం - సమస్తసాక్షిం తమసః పరస్తాత్"

"మునిః అనఁగా నిరంతర శివారాధనాత్మక మననశీలుఁడు - పరమేశ్వరుని ఉమాసహాయుని గాను సర్వనియామకునిగాను త్రిలోచనునిగాను నీలకంఠునిగాను ప్రశాంతునిగాను సమస్త చేతనాచేతనుల ఉత్పత్తి స్థానముగాను సకలప్రాణి ప్రేర

కునిగాను సత్త్వరజస్తమోగుణాత్మక ప్రకృతి నధిగమించిన వానిగాను ధ్యానించు నెడ శివసాయుజ్యము నొందును'' ఇత్యాదిని బ్రహ్మోపాసకుఁడు-సాక్షాత్తు బ్రహ్మమునే పొందునని విశదమగుచున్నది.

పూర్వోక్తములగు రెండు పక్షములయందు శ్రుతి విరోధమునఁజేసి దోషము సంభవించును.

కావున శివోపాసకుఁడు నేరుగా శివపదమునే పొందును కాని హిరణ్యగర్భాది లోకములయందు జాగు సేయఁజాలడు. మధ్యన శివేతర లోకములలో ఆతనికి ఎట్టి ప్రయోజనంబును గానరాదు.

ఈ సందర్భమున ఇవ్విధముగా పరిష్కరింపనగును.

సకలకార్య సమష్టి స్వరూపుడగు హిరణ్యగర్భుని యుపాదానంబగు నారాయణుఁడు - చతుర్ముఖుని మించినవాడు. అట్టి నారాయణుని యధిష్ఠాతయగు శివుఁడు విరూపాక్షంబు పరబ్రహ్మంబనఁబఱిగినవాడై జగన్నిమిత్తుడై సర్వజ్ఞుఁడు, సర్వ శక్తిసంపన్నుఁడు, నిత్యతృప్తుఁడు, స్వతంత్రుఁడు, స్వప్రకాశుండునై నారాయణుని మించినవాడు. ఇట్లు చెప్పుటకు దిగువ శ్రుతివాక్యము ప్రోద్బలక మగుచున్నది.

"పరా త్పరతరో బ్రహ్మ-తత్పరా త్పరతో హరిః,
తత్పరా త్పరతో౽ధీశః" శివసంకల్పోపనిషత్తు.

మరియొకచో "నారాయణ వరంబ్రహ్మ" "బ్రహ్మము - నారాయణునకన్న పరమైనది'' అని చెప్పి బ్రహ్మము ఎట్టిది అని ఆకాంక్ష కలుగగా ''ఋతం సత్యం" అను మంత్రముతో - బ్రహ్మము సర్వజ్ఞమగుటచే మనోవాగ్వికారము లేనిదియు; స్వశక్తి కిరణములను జగమునంతట నింపునదియు; బ్రహ్మముతో ఎప్పుడు నెడఁబాయనిది, పరప్రకృతిరూపిణి, పరమానంద చిదేకరస పరమాకాశ స్వరూపిణి, తన యవస్థాభేదము పరమచేతనుఁడు నగు నారాయణునిచే ప్రారంభింపఁబడిన హిరణ్యగర్భాది సకలకార్య ప్రపంచము గలదియు నగు పరాశక్తి ఉమాదేవితో గూడి విచిత్రస్వరూపము గలదియు; నిర్వికారంబును; త్రిలోచనంబు నగు పరబ్రహ్మంబు సర్వోత్తరంబని- నిరూపింపఁబడినది.

"విశ్వాధికో రుద్రః" అను ప్రమాణము- రుద్రుఁడు (పరబ్రహ్మము) విశ్వాధికుండని చాటుచున్నయది.

అందువలన వైదికులు - ఇట్టి పరిశీలనమును గమనించి శివుఁడే సర్వాధికుండని గ్రహింపవలెను. శివుని మించిన దైవము మరియొకటి కలదని చెప్పఁ బూనుట అన్యాయంబె యగుచున్నది.

4-3-15

సూ. ''విశేషం చ దర్శయతి"

విశ్వాధికమగు బ్రహ్మమునకు - బ్రహ్మముఁదగు అవస్థాభేదము జగదుపాదానము నగు విష్ణువునకు- విష్ణుకార్యంబగు హిరణ్యగర్భునికిని - ''పరాత్పరతరో బ్రహ్మ" "హిరణ్యగర్భం పశ్యత జాయమానం" "పురుషో వై రుద్రః" ఇత్యాది శ్రుతి వాక్యములు - విశేషము కలదని చూపెట్టుచున్నవి. అందువలన దివ్యపురుషుఁడు- బ్రహ్మవిష్ణ్వాతీతుఁడు పరబ్రహ్మంబు పరమాకాశరూపుఁడు పరమానందమయుఁడు నగు శివుని స్థానమును పొందించునని చెప్పుటయే సమంజసంబగును.

"సోఽధ్వనః పార మాప్నోతి - తద్విష్ణోః పరమం పదమ్"

అను వాక్యమున పరమపదము విష్ణువుది అని అర్థముఁజేయగూడదు. ఇచటి విష్ణుశబ్దము పరబ్రహ్మవాచకంబని తెలియునది. ఎందుకనగా ? షడ్విధంబగు మార్గమునకు అంతంబును తదతీతంబు నగు పదము - విశ్వాధికుండైన శివునిదే కాదగును. ఇంతియేగాక - ప్రపంచాకారముగ నుండు విష్ణువుఁదగు శ్రేష్ఠమైన రూపము - పరమాకాశాత్మకంబనియు పరమానంద లక్షణంబనియు అదియే పరబ్రహ్మంబగు శివునిదనియు వివేకము.

అట్టి శివపదమునందు తన యంతఃకరణమును నెలకొలిపియుండు తటి విష్ణువు - ప్రపంచాకారుఁడైనను స్పందింపఁజాలడు కావున ఎట్టి విరోధము లేదు.

ఇఁట కొందరి యభిప్రాయము.

''పరాంతకాలే పరామృతాత్ పరిముచ్యంతి సర్వే" అను శ్రుతిని పురస్కరించుకొని విష్ణువు - పరబ్రహ్మమగు శివుని పరమవిభూతియని భావించి విష్ణువు నుపాసించువారు బ్రహ్మవస్థాభేదంబగు విష్ణువుఁదగు లోకమును పొంది విష్ణువుఁదగు విభూతి గలవారై చరమదేహాంతమున పరామృతుండగు శివునిఁజెంది ముక్త

లగుదురని చెప్పుట వలన పాంచరాత్ర పద్ధతిని గాక వైదికరీతిని విష్ణువు నుపాసించు వారు అర్చిరాదిమార్గముగా వైకుంఠము న్నాశ్రయించి ఆలస్యముగా శివపదముః ప్రవేశింతురని చెప్పుటలో ఎట్టి లోపము సంభవింపదని విశదమైనది.

ఇయ్యది
శ్రీ నీలకంఠ శివాచార్య విరచితమైన
బ్రహ్మ మీమాంసా సూత్ర భాష్యము నందు
నాలుగవ అధ్యాయముఁదగు మూడవ పాదము
శ్రీ కంఠమణి ప్రభా మయూఖ మను శాంకరీయ ఆంధ్రానువాదముతో
ముగిసినది.

---

# శివాధిక్య ప్రమాణములు

సూతసంహిత. యజ్ఞవైభవ ఖండము- సప్తవింశాధ్యాయము. పుట-411

శ్లో॥ విశ్వాధికస్య రుద్రస్య-కారణస్య శివస్య చ,
పరత్వం యే న జానంతి-రాక్షసాస్తే న సంశయః. 16
మహాపాపవతాం నృణాం-రుద్రాధిక్యం న భాసతే,
అనేకజన్మసిద్ధానాం-శ్రౌతస్మార్తానువర్తినాం,
రుద్రాధిక్యం స్వతో భాతి-ప్రమాణై రపి తర్కతః. 21
రుద్రః సంసారమగ్నానాం-సాక్షాత్సంసార మోచకః.
అతః సర్వం పరిత్యజ్య-శివా దన్యత్తు దైవతం,
శివ ఏకః సదా ధ్యేయః-లింగరూపీ ముముక్షుభిః. 23

సూతసంహిత- సూతగీత, ఉపరిభాగము, షష్ఠాధ్యాయము.

శ్లో॥ విహీనం వా సమం వాపి-హరిణా బ్రహ్మణా హరం,
యే పశ్యంతి సదా తే తు-పచ్యంతే నరకానలే. 21
హరిబ్రహ్మాది దేవేభ్యః-శ్రేష్ఠం పశ్యంతి యే హరం,
తే మహాఘోరసంసారా-న్ముచ్యంతే నాత్ర సంశయః. 22

శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య కృత

# శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

## చతుర్థాధ్యాయము

## నాలుగవ పాదము

### ఆంధ్రీకరణము

# సంపద్యావిర్భావాధికరణము

4-4-1

సూ. "సంపద్యావిర్భావః స్వేన శబ్దాత్"

ఉపాసకులైన విద్వాంసులు - హిరణ్యగర్భుని యొక్కయు నారాయణుని యొక్కయు స్థానములకు పై నుండునదియు పరమసుఖరూపంబగుటచే స్వర్గ మనదగినదియు నగు పరమశివుని పదమును పొందెదరని పూర్వ పాదమునందు బాగుగా నిరూపించితిమి.

"అస్మాచ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభి నిష్పద్యతే" అనుచో పరంజ్యోతిఃస్వరూపుడు గొప్ప ప్రకాశము గలవాడు నగు పరమేశ్వరుని పొందినవానికి స్వరూపము ఆవిర్భవించునని చెప్పఁబడినది.

ఐతే ఇట్టి స్వరూపము ముక్తునకు తాత్కాలికమా? లేక పూర్వసిద్ధంబైనదా ? అని సంశయము.

ప్రశ్న : ముక్తునకు ముక్తిదశలో ఏర్పడు స్వరూపము పూర్వసిద్ధము కాజా లదు. ఎందుకనఁగా ? శ్రుతివాక్యమున "అభినిష్పద్యతే" అభినిష్పత్తి యనఁగా కలుగుట యను నర్థము కావున స్వర్గమువలె ఆగంతుకమైనదనియే చెప్పవలెను.

ఒకవేళ జీవుని నిజరూపము పూర్వసిద్ధంబే యని చెప్పనెడ సంసారమెందుకు సంబంధించును ?

ఉత్తరము : బ్రహ్మమును పొందిన జీవునకు - పూర్వము మలత్రయముచే కప్పఁబడినదియు బ్రహ్మగుణములతో సమానములైన సర్వజ్ఞత్వాది గుణములు కలదియు పూర్వము ఉన్నదియు నగు స్వరూపము మలావరణములు తొలగును గావున ఆవిర్భవించునని ''స్వేన రూపేణ'' అను శబ్దమును పురస్కరించుకొని చెప్పవలసియుండును. ఒకవేళ అట్లు కాదందురేని అగంతుకమగు రూపము స్వకీయము కానందున "స్వేన'' అను విశేషణము నిరర్థకంబగును.

వస్తుతః- జీవాత్మ నిరతిశయానంద ఘనుఁడై యుండువాడు. ఇట్టి నిరతిశయిమగు స్వరూపానందమున గల విశేషములు మల మాయా కర్మ దేహేంద్రియావరణములతో కప్పఁబడియుండును. ఐనను సామాన్యముగ అనువర్తించు ఆనందము- సంసారదశయందును ఎల్లకాలము ఆత్మయందు ప్రేమరూపముగ కనఁబడుచుండును.

శ్రవణమననాదికము నాచరించి నిదిధ్యాసనముఁ జేయువానికి యోగభూమికలయందు ఒక్కొక్క ఆవరణశక్తి క్షీణించుచుండును. ఆ యా ఆవరణములలో మరుగుపడిన ఆనందవిశేషములు క్రమముగ ప్రకాశించును.

లోకమున అజీర్ణవ్యాధి నిండు గలవానికి చికిత్సా విశేషములతో కొద్ది కొద్ది వ్యాధి తగ్గుచుండ భోజ్యములయందు రోచకత్వము కలుగునట్లు శివయోగమును ప్రారంభించినది మొదలుకొని ముక్తిదశ సంభవించువరకు సర్వజ్ఞత్వాది గుణములు ఉపాసకునకు క్రమముగ ఏర్పడుచుండును.

సర్వానుగ్రాహకుఁడగు శివుని కరుణా విశేషంబున నిజరూపమును మఱుగుపఱచిన ఆవరణములన్నియు తొలగగా శివసదృశగుణంబగు ఆత్మస్వరూపము ఆవిర్భవించును అనఁగా పూర్వమువలె ప్రకాశించును. కర్మఫలము వలె క్రొత్తగా ఉదయించునది కాదు. ఆవరణములు అనాదులగుటఁజేసి సంసారము పునః పునః ఏర్పడుచున్నయది.

ఇందువలన విశదమైన దేమనఁగా ? ముక్తుని స్వరూపము స్వాభావికమగుటయే గాక చిదానందఘనంబు సర్వజ్ఞత్వాది విశిష్టంబునై ఆవిర్భంచునని సిద్ధాంతము.

4-4-2

సూ. "ముక్తః ప్రతిజ్ఞానాత్"

జీవునకు సంసారదశయందును గోచరించు ఆత్మస్వరూపము పూర్వసిద్ధమైనను- కర్మబంధము లేనట్టి అపరిచ్ఛిన్న జ్ఞానానందములు కలిగినట్టియు స్వరూపము- ముక్తదశయందు ఆవిర్భవించునని యుద్దేశించి దేవేంద్రునకు ప్రజాపతి- పునః పునః ప్రబోధించుటచే - ముక్తపురుషుడే ఇచట నిర్వచింపఁదగిన వాడని విదిత మగుచున్నది.

4-4-3

సూ. "ఆత్మా ప్రకరణాత్"

"భూయోఽను వ్యాఖ్యాస్యామి" అనుటచే అపహత పాప్మత్వాది గుణములు గల ముక్తాత్మయే ఇచట ప్రతిపాదింపఁబడుచున్నదని - ప్రకరణము వలన గానగును. ముక్తాత్మయొక్క స్వరూపమెట్లుండునని శంకించి - పాపములు బొత్తుగా లేకుండుట మొదలగు దివ్యగుణములు గలవాడు ముక్తాత్మయని ప్రశంసించి "భూయః....మరల, అను వ్యాఖ్యాస్యామి = ముక్తాత్మను గురించి చెప్పగల"నని ప్రజాపతి పలుకుటచే ఈ ప్రకరణము ముకాత్మదేయని గుర్తింపవలెను.

## అవిభాగాధికరణము

4-4-4

సూ. "అవిభాగేన దృష్టత్వాత్"

పూర్వాధికరణమునందు - ముక్తపురుషునియొక్క గుణములు స్వరూపంబు పరమేశ్వరుని గుణములతో స్వరూపముతోడను సమానములగునని నిరూపింపఁబడినది. ఈ యధికరణమునందు - ముక్తపురుషునకు బ్రహ్మముతో సమాన భావము సరిపడునా లేదా ? అని సంశయించి ప్రశ్నోత్తరములతో ముక్తునకు శివ సాదృశ్యము- సంభవించునని ప్రతిపాదింపఁబడుచున్నయది.

బ్రహ్మసామ్యమును విధించునవి కొన్ని, నిషేధించునవి మరికొన్ని ప్రమాణములు గానంబడుట- సంశయబీజము.

ప్రశ్న : "ఏకో రుద్రో న ద్వితీయాయ తస్థౌ"

"రుద్రుఁడొకఁడే యుండువాడు - రెండవవాడు ఉన్నాడని చెప్పఁబడుట

కొరకు మరియొక వ్యక్తి లేకుండెను" ఇత్యాది వాక్యములయందు బ్రహ్మసదృశుఁడగు రెండవవాడు లేడని విదితమగుచుండుటచే జీవాత్మ - ముక్తుఁడైనను బద్ధుఁడైనను బ్రహ్మముతో సమానుఁడు కాజాలడు గదా ?

ఉత్తరము : ముక్తుఁడు బ్రహ్మముతో సమానుఁడేను; ఎట్లనఁగా ? "నిరంజనః పరమం సామ్య ముపైతి" "ముక్తః శివసమో భవేత్" "ముక్తపురుషుఁడు బ్రహ్మగుణ స్వరూపములతో విభాగ (పృథక్ భావ)ముఁ జెందక బ్రహ్మముతో సమానుఁడగు ననుట"- శ్రుతిస్మృత్యాదులయందు కనుగొనఁబడినది. అందువలననే "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" అను వాక్యము - ముక్తపురుషుఁడు- శివసమానుఁడగునని ఘంటాఘోషముగ నుడువుచున్నదని గుర్తెరుగవలెను. "బ్రహ్మైవ" అనుచో గల "ఏవ" అను దానికి -ఇతరప్రమాణములవలన ఇవార్థముఁజెప్ప వలసియుండును.

ముక్తపురుషుఁడు - పరమేశ్వరునితో సమానుఁడై శివతత్త్వాంతర్భూతుఁడునై శివునితో వేరుగ నుండక నిజరూపము నావిష్కరించుకొని శివానందము ననుభవించువాడగును. "ఏకో రుద్రో" ఇత్యాది వాక్యమున జగన్నిర్మాణదక్షుఁడగు మరియొక వ్యక్తి యుండడని తెలుపఁబడినది కాని ముక్తునకు శివసాదృశ్యము లేదని చెప్పఁబడలేదు. బోగమాత్ర సామ్యమును మున్ముందు శ్రీ వేదవ్యాసుఁడు "భోగమాత్ర సామ్యలింగాచ్చ" అను సూత్రమునందు వివరించును. గాన బ్రహ్మమునకు వలె ముక్తపురుషునకు సకలకామావాప్తిరూపమగు బ్రహ్మసాదృశ్యము సంఘటించునని తెలియవలెను.

"సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రోద్బలక మగును.

శ్రుత్యర్థము— సః = శాంభవదీక్షితుఁడై శివునారాధించి శమదమాది సంపన్నుఁడై శివధ్యానయోగ సిద్ధిచే ముక్తుఁడగు మాహేశ్వరుఁడు; "విశేషేణ పశ్యంతీ చిత్ యస్య తేన" అను వ్యుత్పత్తిని విపశ్చితా = సర్వజ్ఞుడైన; బ్రహ్మణా సహ = పరమేశ్వరునితో కూడ; సర్వాన్ కామాన్ = కోరికలన్నిటి కూడిక యగు బ్రహ్మానందమును; అశ్నుతే = అనుభవించును.

ఇఁట "సహ" అను దానికి "కూడ" అను నర్థమును నిరూపించుటయే

సమంజసమగునది. "యుగపత్" "ఏకకాలమునందు" అను నర్థముఁజెప్పునెడ ముక్తపురుషునకు బ్రహ్మసాదృశ్యము భంగపడును గాన బ్రహ్మముతో కూడ ముక్త పురుషుడు- సర్వకామావాప్తి రూపమగు బ్రహ్మానందము ననుభవించునని యంగీకరింపవలెను.

## బ్రహ్మాధికరణము

పూర్వపక్ష (అథవా) మతాంతర సూత్రములు.

సూ. "బ్రాహ్మేణ జైమిని రుపన్యాసాదిభ్యః" 4-4-5

తనంతట తాను ప్రకాశించునదియు అపహతపాప్మత్వము మొదలగు దివ్యగుణములతో కూడినదియు బ్రహ్మగుణరూప సదృశంబు నగు స్వరూపము- ముక్తపురుషునకు ఆవిర్భవించునని పూర్వాధికరణమునందు చెప్పఁబడినది గదా! అట్టి స్వరూపము సంఘటించునా లేదా అని శంకించి మతాంతరము ననుసరించి పూర్వపక్షము నిర్దేశింపఁబడుచున్నది.

ప్రశ్న : శ్రుతియందు "స్వేన రూపేణ" అని చెప్పఁబడుటచే- బ్రహ్మగుణములగు అపహతపాప్మత్వాదులు గల రూపము ముక్తునకు ఆవిర్భవించునని నిరూపింపవలసియుండును. ఎందుకనఁగా? "య ఆత్మాఽపహతపాప్మా" "జక్షన్ క్రీడన్ రమమాణః" ఇత్యాది శ్రుతివాక్యములయందు బ్రహ్మగుణములు- ముక్తాత్మయందు గలవని ఉపన్యసించుటఁజేసి ముక్తపురుషునకు బ్రహ్మగుణసామ్యమే కాని బ్రహ్మగుణరూపసామ్యము రాదని జైమిని మహర్షిగారి యభిమతము.

సూ. "చితిమాత్రేణ తదాత్మకత్వా దిత్యౌడులోమిః" 4-4-6

"సయథా సైంధవఘనోఽనంతరోఽబాహ్యో కృత్స్నో రసఘన ఏవం వా అరేఽయ మాత్మాఽనంతరోఽ బాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ"

ఉప్పుకణిక = లోపల వెలుపలను ఉప్పురసముతో నంతట నిండియుండునట్లు ఈ ముక్తాత్మగూడా బయట లోన అంతటను తెలివితో నిండియుండువాడేను"

"విజ్ఞానఘన ఏవ" అనుచో గల "ఏవ" కారమువలన విజ్ఞానమున

మాత్రము ముక్తునకు బ్రహ్మముతో సమానత్వము ఏర్పడునని ఔడులోమి గారి యభిమతము.

జైమినిమతమున- ముక్తపురుషుఁడు సగుణుఁడనియు, ఔడులోమిమతమున నిర్గుణుఁడు ముక్తాత్మయనియు, తేటపడుచున్నందున ఒకప్పుడు గుణసామ్యము మరియొకతూటి విజ్ఞానసమత్వము నని మతాంతరప్రతిపాదనముగ చేయఁబడిన పూర్వపక్షమునకు దిగువసూత్రము సిద్ధాంతప్రబోధకమని తెలియవలెను.

సూ. ఏవ మప్యుపన్యాసాత్ పూర్వభావా దవిరోధం
బాదరాయణః" 4-4-7

బ్రహ్మమునకు అపహతపాప్మత్వాది గుణములు, స్వయం ప్రకాశమాన మగు స్వరూపంబు పరస్పరవిరోధము లేనివగుటచే "విజ్ఞానఘన ఏవ" "య ఆత్మా అపహతపాప్మా" అనువాక్యములు బ్రహ్మమునందు సగుణత్వము జ్ఞానమయత్వంబు నను రెండు నొకే కాలమున నుండు ననుటను సమర్థించుచున్నవని గుర్తింపవలెను. సగుణత్వమునకు నిర్గుణత్వమునకు విరోధముగలదని భావింప వీలులేదు గాన లక్షణద్వయము బ్రహ్మమునందు ఉపపన్న మగుటఁజేసి కాల భేదమును పాటింపవలెనని బాదరాయణుఁ (వేదవ్యాసు)డు సిద్ధాంతీకరించెను.

## సంకల్పాధికరణము

సూ. "సంకల్పాదేవ తు తచ్ఛ్రుతేః" 4-4-9

స్వయంప్రకాశమానుఁడగు ముక్తాత్మకు సత్యసంకల్పత్వము అపహతపాప్మత్వము మొదలగు గుణములుండునని బ్రహ్మాధికరణమునందు చెప్పఁబడినది.

ఈ యధికరణమున ముక్తపురుషునకు సత్యసలకల్పత్వాదికము ఉపపన్నమగునా లేదా అని సంశయము.

ప్రశ్న : ముక్తపురుషుఁడు అనుభవింపఁదగిన వస్తువుల విషయమై సంకల్పమే కారణము కాదని తోచెడిని. బాహ్యవస్తువుల నాశ్రయింపనిది సంకల్ప

మాత్రమున భోగ్యములు అనుభవింపఁబడుట లోకమున గానంబడుట లేదు
గదా!

ఉత్తరము : ముక్తపురుషుఁడు- సంకల్పించినంత మాత్రమున భోగ్యము
లగు వస్తువులు లోకములు వ్యక్తులు నుపస్థితములై అనుభవింపఁబడునని "స
యది పితృలోకకామో భవతి, సంకల్పాదేవాస్య పితరః సముత్తిష్ఠంతి" ఇత్యాది
శ్రుతివాక్యములు ప్రతిపాదించుచున్నవి.

అందువలన ముక్తపురుషని సంకల్పమే- సకలభోగ్యవస్తు సంపాదనహేతు
వగుననియు. సర్వజ్ఞత మున్నగు ఆరు గుణములు, అపహతపాప్మత్వాది గుణాష్ట
కంబు ముక్తపురుషుఁడు కలిగినవాడై సిద్ధసంకల్పుఁడుగ నుండుననియు సారాం
శము.

4-4-9

సూ. "అత ఏవ చానన్యాధిపతిః"

ముక్తపురుషుఁడు- అపహతపాప్మత్వాది గుణములు కలిగి బ్రహ్మసమానుఁ
డైనందువలననే స్వతంత్రుఁడగుననియు ఎప్పుడును కర్మకు లొంగువాడు కాడనియు
గుర్తింపవలెను. ముక్తుడు బద్ధదశయందు గావించిన కర్మయంతయు నశించు
టచే పరమేశ్వరుఁడు ముక్తుని నియమించువాడు కాడు. "ఇదం కురు" "ఇదం
మాకురు" అను విధినిషేధశాస్త్రము- పరమేశ్వరుని అజ్ఞారూపమగుటచే అద్ది
ప్రవాహరూపము కావునను అట్టి విధినిషేధశాస్త్రమునకు ముక్తపురుషుఁడు కట్టుబడి
యుండడు గదా! ఎందుకనఁగా? అజ్ఞానరూపమగు పాశముచే సంభవించు పశు
త్వము తొలగుటఁజేసి శివత్వము కలవాడగును.

శివత్వమనఁగా? ఆణవ మాయిక కార్మిక మలములయొక్క సంబంధము
లేనట్టి మిగుల గొప్పవైన మంగళగుణములు శివునితో సమానమగు స్వభావంబు
కలిగియుండుట యగును. సర్వజ్ఞత్వము మొదలగు గుణములు కలిగియుండుటయే
శివుని స్వభావ మగును.

ఇందువలన శివసమానుఁడగు ముక్తపురుషునకు- సర్వజ్ఞత, అనాది ప్రబోధము
నిత్యతృప్తి, స్వతంత్రత, సర్వశక్తిసంపన్నత, అలుప్తశక్తిమత్త్వము, అనంతశక్తి
త్వంబు ననునవి సమకూరును. శివజ్ఞానముయొక్క సంకోచమే సంసారము గదా!

సంకోచ(ముకుళీభావ)మునకు కారణంబగు మలము తొలగినయెడలనే ముక్తపురుషునకు సర్వజ్ఞత్వమేర్పడును. సంసారనిదానమగు అజ్ఞానము- సర్వజ్ఞత కారణముగనే- నిర్మూలమగును. అజ్ఞానము బొత్తుగా లేకుండుటవలన ముక్తపురుషుడు- పరిచ్ఛిన్నములు (మేరగలవి) అపరిచ్ఛిన్నములు (మేరలేనివి)నగు మానవ దేవతా శరీరములు మున్నగువానిపై అభిమానమనఁదగు భ్రాంతి లేనివాడగును. భ్రాంతిరాహిత్యముచేతనే జరామరణశోకములు లేనివాడై కర్మవశ్యుఁడు కానట్టి ముక్తపురుషుఁడు- స్వతంత్రుఁడగు ననుట- వింత కాదు. నిరతిశయము స్వరూపంబునగు ఆనందము ననుభవించుటలో నిమగ్నుఁడై రసికుఁడు నగు ముక్తుఁడు స్వాత్మారాముఁడగుటఁజేసి- నిత్యతృప్తుఁడగుచున్నవాడు. ఇందువలననే అతఁడు ఆకలి దప్పి మున్నగు వికారములు లేనివాడగును. ముక్తపురుషుని శక్తి (సామర్థ్యము) లోపింపదు గావుననే సత్యకాముఁడు సత్యసంకల్పుఁడు నగువాడు. అందువలన ముక్తుఁడు పరమేశ్వరుఁడును అపహతపాప్మత్వాది గుణాష్టకము గలవారుగా శ్రుతులయందు ప్రశంసింపఁబడుచున్నవారు. అందువలన శివసదృశుఁడగు ముక్తునకు స్వాతంత్ర్యము యుక్తంబేనని తెలియవలెను.

కర్మాధీనమగు పరతంత్రభావము తొలగును కాని యంతర్యామియగు పరశివుని ప్రేరణము ననుసరించుట మాత్రము ముక్తపురుషునకు తప్పదని రహస్యార్థము.

## అభావాధికరణము

సూ. "అభావం బాదరి రాహ హ్యేవమ్" 4-4-10

ముక్తపురుషుఁడు- స్వయంప్రకాశమానుఁడై సత్యసంకల్పత్వాది గుణములతో కూడియుండునని సంకల్పాధికరణమునందు ప్రతిపాదింపఁబడినది.

ఇఁక నీ యధికరణమునందు ముక్తపురుషునకు శరీరముండునా? లేదా? అని సంశయము.

ప్రశ్న : "నిష్కళం నిష్క్రియం" "బ్రహ్మస్వరూపము- కళలులేనిదియు క్రియలు లేనిదియు" ఇత్యాదిసందర్భము ననుసరించి- శరీరము ఇంద్రియములు మున్నగు నుపకరణములు లేనివాడు ముక్తపురుషుఁడని బాదరి బావించును గదా!

సూ. "భావం జైమిని ర్వికల్పామ్నానాత్" 4-4-11

"స ఏకధా భవతి త్రిధా భవతి" "ముక్తపురుషుఁడు- ఒక విధముగా నుండును. నానావిధములుగా నుండును" ఇత్యాదిశ్రుతివాక్యములఁబట్టి ముక్తపురుషుడు- దేహేంద్రియాది సంబంధమున వివిధరూపములు గలవాడని తెలియుచుండుటచే శరీరము గలిగియుండునని జైమిని మహర్షి- నిరూపించెను. ఇట్లు శరీరముండుననియు శరీరముండదనియు శ్రుతులు వక్కాణించుచున్నందున ఇందు ఎద్ది నిజము? అను సంశయము పొడముచున్నది.

ప్రశ్న : "మనసైతాన్ పశ్యన్ రమతే య ఏతే బ్రహ్మలోకే" "ముక్తపురుషులు— పరమపదమునందు— మనస్సుచేతనే కోరికలు ననుభవింతురు" అను శ్రుతి ననుసరించి బాహ్యములగు ఇంద్రియాదులు లేనివారు ముక్తులని చెప్పవలెను గదా! "సత్యాత్మ ప్రాణారామం మన ఆనందం" ఇత్యాది శ్రుతివాక్యమున బ్రహ్మము సత్యరూపమై తనయందు తాను విహరించునదియు, మనస్సులోనే ఆనందము ననుభవించునదియు నని విదితమగుచుండుటఁజేసి బ్రహ్మముతో సమానుఁడగు ముక్తపురుషుడు— లేకుండునని యంగీకరింపవలెను. శరీరముండునని నిరూపించు శ్రుతివాక్యముల ననుసరించి ఉపాసనాభేదముచే బ్రహ్మలోకాదులఁజెంది యుండువారు సశరీరులని నిరూపింపవలసియుండును గదా :

ఉత్తరము :

సూ. "ద్వాదశాహవ దుభయవిధం బాదరాయణోఽతః" 4-4-12

శరీరముండుననియు లేదనియు నిరూపించు ఉభయశ్రుతులున్నందున ముక్తపురుషుఁడు- స్వేచ్ఛావశమున శరీరధారిగా నశరీరిగా నుండువచ్చునని పూజ్యుఁడగు బాదరాయణుఁడు (వేదవ్యాసుఁడు) నిశ్చయించెను.

ద్వాదశాహ్నిక క్రతువు- ప్రధానముగాను పుత్రకామేష్టికి నంగముగాను పూర్వమీమాంసయందు ఉభయవిధముగ నిర్ణయింపఁబడినట్లు- ముక్తులు సశరీరులుగ అశరీరులుగ నుండఁగలుగుదురని వివేకము.

ఇందుకు దిగువ పురాణశ్లోకములను ప్రోద్బలకములుగ గానవగును.

శ్లో॥ నర్వజ్ఞాః సర్వగాః శుద్ధాః - పరిపూర్ణాః స్వభావతః ।
శివతుల్య బలోపేతాః - పరమైశ్వర్యసంయుతాః ॥

సదేహాశ్చ విదేహాశ్చ - భవంత్యాత్మేచ్ఛయా పునః ॥

ముక్తపురుషులు- సర్వజ్ఞులు, సమస్తమును వ్యాపించువారు, పరిశుద్ధ స్వరూపులు, పరిపూర్ణులు, శివునితో సమానమగు సామర్థ్యము సహజముగ గలవారు, శ్రేష్ఠాతిశ్రేష్ఠమగు ఐశ్వర్యము గలవారు, శరీరధారులు అశరీరులుగను స్వేచ్ఛాపరవశులైయుందురు.

సూ. "తన్వభావే సంధ్యవ దుపపత్తేః" 4-4-13

ముక్తపురుషుఁడు తన యిష్టముతో అనేక శరీరములను కల్పించుకొని యవ్వానిలో చొఱఁబడి విహరించును. ఒకప్పుడు శరీరము లేనివాడై- స్వప్నమునందు బద్ధపురుషుఁడు పరమేశ్వరునిచే కల్పింపపడు దృశ్యములఁ గాంచుచు సుఖదుఃఖముల ననుభవించునట్లు- శివప్రదత్తమగు ఆనందరసమునే అనుభవించును. సంసారియగు జీవాత్మ- స్వప్నమునందు- శరీరము ఇంద్రియములు మొదలగు వాని సంబంధము లేకయే మనస్సుతోడ పరమేశ్వర సృష్టములగు విషయముల ననుభవించునట్లు- ముక్తాత్మ అశరీరస్థితియందు ప్రాకృతముగానట్టి మనస్సుతోడనే బ్రహ్మానందము ననుభవించునని సారాంశము.

సూ. "భావే జాగ్రద్వత్" 4-4-14

స్వేచ్ఛచే కల్పింపఁబడు శరీరాది ఉపకరణములు కలిగియున్నతఱి "బద్ధపురుషుఁడు- జాగ్రద్దశయందు కామ్యములను వలె" ముక్తపురుషుఁడు- సమస్త కామముల ననుభవించును.

ప్రశ్న: ముక్తపురుషుఁడు ప్రాకృతములగు వస్తువుల ననుభవించు నెడ- ప్రాకృతప్రపంచమునే గుర్తించువాడగుటఁజేసి సంసారముఁజెందియుండు దుఃఖముల సంబంధము గలవాడగును గదా!

ఉత్తరము: ముక్తపురుషుఁడు- ప్రపంచమును ప్రకృతిమయముగ గాంచనివాడై శివమయముగ చూచువాడగును.

"ఏతత్తతో భవతి ఆకాశశరీరం బ్రహ్మ, సత్యాత్మ, ప్రాణారామం, మన ఆనందం, శాంతిసమృద్ధ మమృతమ్"

"ఆప్నోతి స్వారాజ్యం ఆప్నోతి మనసస్పతిమ్"

"వాక్పతి శ్చక్షుష్పతిః శ్రోత్రపతి ర్విజ్ఞానపతిః"

ముక్తపురుషుఁడు- వాక్కు నేత్రములు శ్రోత్రాదీంద్రియములు బుద్ధి యను
వానిని స్వేచ్ఛాధీనములుగ పొందువాడగుటచే వాగాదులకు ప్రభువుగ వ్యవహరింప
బడును. ఇట్టి ముక్తాత్మ- స్వర్గమనఁబడు పరమపదమునందు విరాజిల్లు పరమేశ్వ
రుని స్వరూపము- పరమాత్మయొక్క జ్ఞానశక్తి యనఁదగు మనస్సున కధిపతియగు
పరమాత్మను పొందియే- నిజరూపముగ గలవాడగును. పరప్రకృతియనఁదగు
ప్రకాశానందసమరసీభూతమగు పరాశక్తి- శివునకు స్వరూపమగుటచే పరమాకాశ
ముగ చెప్పఁబడును. ఈ పరమాకాశమే పరమేశ్వరునకు ముక్తపురుషులకును
సాక్షాత్తు అర్థక్రియాహేతువు (అనఁగా? వస్తువుల నుపయోగించుటకు నవకాశము
కల్పించునది) అగునది. ఇతరులగు సంసారి జీవులకు పరమాకాశము- పరంప
రయా అర్థక్రియా హేతు వగునది. "ఈ పరమాకాశము ఆనందము కానిచో ఎవడు
జీవించును? ఎవఁడు చక్షురాదీంద్రియములను ప్రవర్తింపఁజేయును?" ఈపరమా
కాశమే జీవులను సుఖపెట్టుచున్నయది. "ఆనందము అభిరుచికి ఆశ్రయమగునది.
అభిరుచి నాశ్రయించి ఆనందము గలవాడగును" ఇత్యాది శ్రుతివాక్యార్థములు-
పరమాకాశమనఁబడు పరప్రకృతియే జీవాత్మలందరి యనుభవములో విషయ
మగుచున్నయది. ఎట్లనఁగా "స ఏకో మానుష ఆనందః" అను వాక్యము మొదలు
కొని "స ఏకో బ్రహ్మణ ఆనందః" అను వాక్యమువరకు మానవుఁడు మొదలు
కొని బ్రహ్మమువరకు గల ఆనందానుభవములో తారతమ్యము నిరూపింపఁబడినను
బ్రహ్మము ముక్తపురుషుఁడును ఉపాధిలేనివారగుటచే ఆనందము ఇరువురియం
దును పరిపూర్ణముగ నుండును. స్వవర్ణాశ్రమధర్మముల నీశ్వరార్పణబుద్ధి నాచ
రించుచు శివు నుపాసించు శ్రోత్రియుఁడు- అకామహతుఁడనఁబడును. అట్టి
శ్రోత్రియునకు గల చరమదేహము విడిపోగానే సంసారబంధవిముక్తి లభించును.
అట్టి ముక్తునకు పరమేశ్వరునకు గల ఆనందము సమానమైనది. శివధ్యానయోగా
తిశయమున ఆ యా భూమికల నధిష్ఠించువానికి పూర్వపూర్వ భూమికలయందలి
అభ్యాసము స్వల్పమగును. అటులే బ్రహ్మానందము- మానుషానందాదిరూపమై-
అకామహతుఁడగు మాహేశ్వరునకు మనుష్యగంధర్వాదిభూమికలయందు గూడ
పరిపూర్ణముగనే లభించును. ఒక్కొక భూమిక నతిక్రమించుచు అకామహతుఁడు-

ప్రతిభూమికయొక్క పరిధి ననుసరించి బ్రహ్మానందమును నిండుగ ననుభవించువాడగును. అనఁగా? నిరుపాధికమగు బ్రహ్మపదమునందు (బ్రహ్మపదము పరిచ్ఛిన్నము (పరిధిగలది) గాకుండుటచే) నిరతిశయమగు బ్రహ్మానందమును పరిపూర్ణముగ ననుభవించు స్థితిని ముక్తపురుషుఁడు పొందునని భావము.

ఇట్టి పరమానందమే పరప్రకృతియనియు పరమాకాశమనియు పేర్కొనఁబడును. పరమానందముతో పరమాత్మకు భేదము లేకుండుటచే "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" "ఆనందము బ్రహ్మంబని గుర్తింపవలె" నని శ్రుతి ఉదాహరించినది. ఇంతియేగాక ఆనందమే జగత్కారణంబనియు శ్రుతులయందు గాననగును. జ్ఞానమంతయు ఆనందమునందే అభివ్యక్తమగునని తెలియవలెను.

అందువలన ప్రాకృతప్రపంచము ముక్తులకు పరమపదప్రవేశానంతరము పరమానందరూపమగు పరమాకాశము శరీరముగా గల బ్రహ్మముగ గోచరించును. బ్రహ్మమునకు వలె పరమపదప్రవిష్టులగు ముక్తపురుషులకు ఎట్టి దుఃఖానుషంగము ఉండజాలదనియు, పరమసత్త(ఉనికి)యేస్వరూపముగాగల బ్రహ్మము-స్వప్రాణమగు చిదంబరశక్తియందు విహరించునదై మనస్సులోనే ఆనందము ననుభవించునదై శాంతిసమృద్ధంబునై అమృతంబుననియు, అట్టివాడే ముక్తపురుషుండనియు సారాంశము.

## ప్రదీపవదావేశాధికరణము

సూ. "ప్రదీపవ దావేశ స్తథా హి దర్శయతి" 4-4-15

ముక్తాత్మ- స్వేచ్ఛవలన అనంతశరీరములను పరిగ్రహించు సామర్థ్యము గలవాడై విభువగునని పూర్వాధికరణమునందు సూచింపబడినది. అట్టి విభుత్వము సరిపడునా? లేదా? అని సంశయము.

ప్రశ్న : "సర్వేషు లోకేషు కామచారో భవతి" "లోకములన్నిటియందు స్వేచ్ఛగ సంచరించువాడు ముక్తపురుషుఁడు" "ఇమాన్ లోకాన్ కామాన్నీ కామరూప్యను సంచరన్" "ఈ లోకములయందు ఇష్టములగు భోగ్యముల ననుభవించుటకు వలయు రూపములఁదాల్చి ముక్తుఁడు సంచరించును" ఇత్యాది శ్రుతి వాక్యములఁబట్టి ముక్తపురుషుఁడు పరిచ్ఛిన్నములగు శరీరములతో సంచరించు

నని తెలియుచుండుటచే ముక్తునకు విభుత్వము (సర్వవ్యాపకత్వము) లేదని యంగీకరింపవలెను గాన నానావిధ శరీరములను ముక్తపురుషుఁడు క్రమముగానే స్వీకరించుననియు ఒకేసారి బహుశరీర ప్రవేశమును చేయఁజాలడనియు తేటపడును గదా!

ఉత్తరము : ఒకానొకచోట నుండు దీపము - ఘటాదులయందు పెట్టబడి పరిచ్ఛిన్నముగ నగుపడినను ఘటాదులను తొలగించిన యెడల (ప్రదీపము = పెద్ద దీపము) గృహము మొదలగు ప్రదేశములను తన కాంతిచే వ్యాపించునట్లు ముక్తపురుషునకు - తనశక్తిని మఱుగుపఱచు మలము దూరమగును గాన నాతఁడు స్వశక్తిచే విశ్వమును వ్యాపించు విభుత్వము గలవాడగును.

ఇవ్విషయమును దిగువ నుదాహరింపఁబడు శ్రుతివాక్యము సమర్థించుచున్నయది.

"స నో బంధుర్జనితా స విధాతా ధామాని వేద భువనాని విశ్వా, యత్ర దేవా అమృత మానశానా స్తృతీయే ధామాన్య భ్యైరయంత".

"పరిద్యావా పృథివీ యంతి సద్యః పరిలోకాన్ పరిదిశః పరిసువః, ఋతస్య తంతుం వితతం విచృత్య తదపశ్య త్తదభవత్ ప్రజాసు".

శ్రుత్యర్థము - "ఏష హి దేవః" అనువాక్యముతో విశ్వాత్మకుఁడగు మహాదేవుని ప్రశంసించు ప్రకరణమునందు పై వాక్యములు పొందుపరుపఁబడినవి గాన నిట "సః"అనుదానికి పరమేశ్వరుఁడు అని చెప్పవలెను.

సః = మహాదేవుఁడు; నః = మాకు, బంధుః = చుట్టము, మరియు జనితా = జనకుఁడు, సః = శివుఁడు, విధాతా = శ్రేయస్సులన్నిటి నొనఁగూర్చువాడు, ధామాని = తేజోమయములగు, విశ్వాభువనాని = అప్రాకృత స్థానములన్నిటిని, వేద = గుర్తెరిగియుండువాడు: బంధువు జనకుఁడు శ్రేయఃప్రదాత యగువాడు పరమేశ్వరుఁడని గుర్తించుటకు దివ్యపదపరిజ్ఞానమునకును ప్రయోజనము నిరూపింపఁబడుచున్నది.

యత్ర = ఏ స్థానమునందు మహాదేవు నాశ్రయించి, అమృతం = కైవల్యలక్ష్మిని, ఆనశానాః = అనుభవించు, దేవాః = మహాదేవసదృశులగు ముక్తపురుషులు, తృతీయే = మాయా మిశ్రపదముల రెంటికన్న మూడవదగు పరమపదము

నందు, ధామాని = తేజోమయములు స్వాభిమతములునగు స్థానములను, అభ్యైర యంత = స్వీకరించుచున్నవారు.

బంధువువలె జనకునివలెను సమస్తహితముల నొనఁగూర్చు పరమాత్మ యగు మహాదేవుఁడు ప్రసన్నుఁడై పాశబంధమును తొలగించి అమృతభావమును ముక్తపురుషులకు ప్రసాదించును. అట్టివారు పరమాకాశంబగు శివపదమున ప్రకాశమానములు శివకల్పితములు నగు స్థానములయందు రాణించుచుందురని సారాంశము. ఐనను (తథాపి) ముక్తపురుషులు - ద్యావాపృథివీ=భూమ్యాకాశములను, పరియంతి = వ్యాపించువారు, (మరియు) లోకాన్=హిరణ్యగర్భాదిలోకములను, దిశః= దశదిశలను, సువః = స్వర్గమును, సద్యః = సంకల్పించిన వెనువెంటనే, పరియంతి=వ్యాపించువారు, మరియు నా ముక్తపురుషులు - ఋతస్య= కర్మయొక్క, వితతం = విశాలమగు, తంతుం = అనుభవాత్మకమగు తంతువు (దారము)ను, విచృత్య=ఛేదించి, పుణ్యపాపవినిర్ముక్తులై ప్రజాసు = ప్రాణులందరిలో, తత్ = మహాదేవాఖ్యమగు పరబ్రహ్మమునే, అపశ్యత్ = అవలోకింతురు, తత్ = సర్వాత్మకులగుటచే పరబ్రహ్మముగానే, అభవత్=అగుచున్నవారు.

ఇందువలన తేటపడునదేమనఁగా ?

ముక్తపురుషులు - శివానందము ననుభవించుటయందే లోలురై యుండుటతన సర్వవ్యాపకులుగ నుండఁజాలుదురనియు, మహాదేవునితో సమానులగుటచే ముక్తులగు జీవాత్మలు - దేవశబ్దవాచ్యులగుదురనియు, విశదమైనది

"యే దేవా దివిషదః" ఇత్యాది సామవేదవాక్యము - ముక్తులు స్వర్గాది ప్రదేశములయందు ఏకకాలమునందే సంచరింపఁగలుగుదురని తెలుపుచున్నది.

"తే హి సాక్షా ద్దివిషద - స్త్వంతరిక్షసద స్తథా,
పృథివీషద ఇత్యేతే - దేవా దేవవ్రతే స్థితాః"

అను పురాణవాక్యంబు పై విషయమునే సమర్థించుచున్నది. ఇఁట (ఈ శ్లోకమున) పృథివీపదమునకు - పదునాలుగు లోకముల బ్రహ్మాండమనియు,అంతరిక్ష పదమునకు - బ్రహ్మాండమును మించిన మాయాపదమనియు, ద్యౌఃపదము

నకు - మూడవది పరమాకాశ మనఁదగునది శుద్ధశక్తిరూపంబు నగు శివపద మనియు నర్థములఁజెప్పవలెను.

ఈ సందర్భమున ముఖ్యాంశము - ముక్తపురుషులు - పరమేశ్వరునివలె విభువులగుదురనునది - యని గమనింపవలెను.

సూ. "స్వాప్యయ సంపత్త్యో రన్యతరా పేక్ష మావిష్కృతం హి" 4-4-16

ప్రశ్న : "ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేద నాంతరం" అను శ్రుతివాక్యము - బ్రహ్మప్రాప్తుఁడగు ముక్తపురుషుఁడు అంతర్జ్ఞానమును బహిర్జ్ఞానమును గోలుపోవు - నని తెలుపుచున్నది కావున నాతనికి శక్తిరూపమగు జ్ఞానముతో సర్వవ్యాపకత్వము సరిపడదని యంగీకరింపవలెను కాదా ?

ఉత్తరము : సుషుప్తి (గాఢనిద్ర) యందుగాని మరణమునందు గాని జీవాత్మ - తెలివిలేనివాడగునని పై శ్రుతివాక్యము విశదీకరించుచున్నదని దిగువ శ్రుతివాక్యములవలన తేటపడును.

"నాహం ఖల్వయ మేవం సంప్రత్యాత్మానం జానాతీత్యయ మహ మస్మీతి, నో ఏవేమాని భూతాని"

"సుషుప్తియందు జీవాత్మ - దేహేంద్రియాదులతో కూడియున్నానను జ్ఞానము లేనివాడై తానుమాత్రమున్నానని మాత్రము గుర్తించును. తదితర జగమును గుర్తింపడు."

"ఏతేభ్యో భూతేభ్యః సముత్థాయ తాన్యేవానువినశ్యతి, న ప్రేత్య సంజ్ఞాఽస్తి".

"మరణించుతఱి జీవాత్మ - ఇంద్రియములతో అంతఃకరణములతోడను పంచభూతములనుండి శరీరమునుండియు విడిబడి యవ్వానితో గూడ నిష్క్రమించును. (చూపరులకు అచ్చోట లేని వాడగునని "వినశ్యతి"అని చెప్పఁబడినది ) మరణించినవేళ తెలివి యెంతమాత్రముండదు."

ఇవ్విధము శ్రుతులు - జీవాత్మకు జ్ఞానము లేమి - సుషుప్తి మరణములలో

ఏదే నొకదానియందు కలుగునని ఆవిష్కరించినవి. అందువలన - ముక్తిదశయందు సుషుప్తి మరణములకు భిన్నముగా అజ్ఞత్వాదులు ఉండవనియు ఆణవిక మాయిక కార్మిక మలములు అను ఆవరణములు తొలగుటచే ముక్తపురుషునకు సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్త్వము సంభవించుననియు జ్ఞానాదినిషేధము కుదురదనియు విశదమైనది.

## జగద్వ్యాపారాధికరణము

సూ. "జగద్వ్యాపారవర్జం ప్రకరణా దసన్నిహితత్వాచ్చ" 4-4-17

ముక్తపురుషులు - స్వప్రకాశత్వము, వ్యాపకత్వము, సర్వజ్ఞత్వము మొదలగు వానితో బ్రహ్మసమానులగుదురని పూర్వాధికరణమునందు నిరూపింపఁబడినది.

"పరమం సామ్య ముపైతి" అను శ్రుతివాక్యమునందు గల "పరమం" అను పదము అత్యంత సామ్యమును చెప్పుచున్నందున జగమును పుట్టించుట మున్నగు వానియందు గూడ బ్రహ్మసమానత్వము ముక్తపురుషునకు కలదని పొడగట్టును. జగత్స్రష్ట్యాదులను ముక్తులు చేయగలరనునెడ పరమేశ్వరులు అనేకులు కలరని స్ఫురించుటఁజేసి "శివుఁడు - అద్వితీయుఁడు" అను వాక్యార్థము భంగపడును.

అందువలన పరమేశ్వరునితో ముక్తపురుషులకు ఎట్టి సామ్యము నంగీకరింపవలెనని సంశయము.

ప్రశ్న : "స యది పితృలోకకామో భవతి" ఇత్యాది శ్రుతి వాక్యములయందు - ముక్తపురుషుఁడు సంకల్పించినంత మాత్రమున పితృలోకాదులను నిర్మించు సామర్థ్యము గలవాడగునని తేటపడుచున్నది. మరియు "ఇమాం ల్లోకాన్ కామాన్నీ కామరూప్యనుసంచరన్" ఇత్యాదులయందు ప్రపంచము నందంతట - ముక్తుఁడు సంచరించుచు ఆ యా భోగముల ననుభవించునని తెలియుచున్నది.

అందువలన ముక్తుఁడు - కొన్ని అంశములలోనే పరమేశ్వరునితో సమానుఁడగుననుట యుక్తము కానిదగుటచే జగత్స్రష్ట్యాదులఁ గూడ నొనర్చు సామర్థ్యము కలిగియుండునని యంగీకరింపవలెను గదా ?

ఉత్తరము : ముక్తపురుషునకు చెప్పఁబడిన పరమేశ్వర సమానత్వము - జగత్సృష్ట్యాది వ్యాపారము లేనిదై సమస్త భోగ్యముల ననుభవించు సామర్థ్యము గలిగియుండును. ఎందుకనఁగా ?

"యతో వా ఇమాని భూతాని జాయంతే" ''ద్యావాపృథివీ జనయన్ దేవ ఏకః" ఇత్యాది శ్రుతులయందు- దేవుఁడొకఁడే జగమును నిర్మించువాడని - నిరూపింపఁబడుటచే ప్రకరణముఁ బట్టి పరమేశ్వరుఁడే జగత్కర్త యగునని విశదమగుచున్నది.

జీవాత్మ - ముక్తుఁడైనను సృష్ట్యాది వ్యాపారమునకు దూరముండువాడు. గాన ముక్తపురుషుఁడు జగత్కర్త కాజాలడని సారాంశము.

సూ. "ప్రత్యక్షోపదేశా దితి చే న్నాధికారిక మండలస్థోక్తేః" 4-4-18

ప్రశ్న : "ఇమాంల్లోకాన్ కామాన్నీ కామరూప్యనుసంచరన్" ఇత్యాది వాక్యములయందు - ముక్తుఁడు స్వేచ్ఛారూపములను కల్పించుకొని లోకములందంతట నభీష్టములగు భోగముల ననుభవించు - నని చెప్పఁబడుటచే ముక్తపురుషుఁడు జగత్సృష్ట్యాదుల సంబంధము గలవాడని తెలియుచున్నది గదా ?

ఉత్తరము : ''కామాన్నీ'' ఇత్యాది శ్రుతివచస్సులు- ముక్తులు కామ్యముల ననుభవింతురని చెప్పుచుండుటచే కామభోగ సంబంధము గల బ్రహ్మాదులయొక్క మంశల (లోక)ముల యందలి భోగముల సంబంధము గలవారనియే నిరూపింపవలెను. అందువలన ముక్తపురుషుఁడు స్వతంత్రుఁడైనను జగద్వ్యాపారము నొనర్పఁజాలడని తేటపడుచున్నయది.

సూ. "వికారావర్తి చ తథాహి స్థితి మాహ'' 4-4-19

ప్రశ్న : ముక్తపురుషుఁడు వివిధ లోక భోగముల ననుభవించునెడ ఇంద్రియ వికారములకు లోనగును గదా ?

ఉత్తరము : ముక్తపురుషునిచే అనుభవింపఁబడు సుఖము-ఇంద్రియ మనో వికారము లేనిదై విశుద్ధంబు పరిపూర్ణము బ్రహ్మస్వరూపంబు నగు. ముక్తానుభావ్య

సుఖము అట్టిదే నని "రసో వై సః, రసగ్ హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి" అను శ్రుతి వాక్యమునందు గాననగును. బ్రహ్మస్వరూపము ఎట్టిదనఁగా ?

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" "బ్రహ్మము సత్యస్వరూపమై జ్ఞానమయంబు అపరిచ్ఛిన్నంబు నగు" "ఆనందో బ్రహ్మ" "పరమాత్మ- ఆనందపరిపూర్ణుఁడు" ఇత్యాది శ్రుతులయందు ఆవిష్కరింపఁబడిన స్వరూపము బ్రహ్మంబుదే నగును.

అందువలన మోక్షసుఖము - పశు సుఖమువలె నింద్రియవికారము గలది కాదని విశదమైనది.

ఈ చెప్పఁబడిన సందర్భముయొక్క సారాంశమేమనఁగా ? ముక్తపురుషుఁడు- బ్రహ్మలోకము మొదలుకొని సదాశివుని లోకమువరకు గల స్థానములయందు స్వేచ్ఛగా సంచరించుచు అభీష్టభోగముల ననుభవించుచు మనుష్యాది దేహాభిమానము లేనివాడై సంకుచితము కానట్టి ఇచ్ఛాజ్ఞానక్రియా శక్తిత్రయ వ్యాపారము గలవాడై - పరమానంద ప్రకాశ విభూతిమయము శక్తి శివసమరసంబు నగు బ్రహ్మస్వరూపముఁదగు ఒకేవిధమైన ఆనందరసము యొక్క నంశంబగు ప్రపంచమునందు పరిపూర్ణ అహంభావము గలవాడై "శివుఁడే నే"నను తాదాత్మ్యముతో విహరించును.

ఇట్లు చెప్పుటవలన - "అహమన్న మహ మన్న మహమన్నం - అహ మన్నాదోఽహ మన్నాదోఽహ మన్నాదః" ఇత్యాది శ్రుతి వాక్యములఁబట్టి- భోజ్యము భోక్త మొదలగు సమస్త ప్రపంచము తానే నను పరిపూర్ణాహంభావము ముక్తపురుషన కుండునని తేటపడినది. ఇఁట చెప్పఁబడిన అహంకారము - సంసారికి చెందనిదై ప్రపంచమునంతటఁ జెందియుండునదగుటచే- పరిపూర్ణంబని తెలియవలెను. అట్టి అహంభావమే ముక్తస్వభావంబు నగునది. అందువలననే "నేను దేవతను మనుష్యుఁడను" అని దేవాది శరీరములఁ జెందినట్టి పరిచ్ఛిన్నమగు సాంసారిక అహంభావమునకంటె నిద్ది విలక్షణమైనదనియు ప్రాకృతమగు అహంకారము యొక్క సంబంధము ముక్తపురుషునకుండదనియు నీ సందర్భమున బాగుగా నిరూపింపఁబడుచున్నది.

ఇంతియే గాక - "అహం" అనునది - శక్తి విశిష్ట శివాత్మకమగు బ్రహ్మంబని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ అనుత్తర విసర్గాంతః-శివశక్త్యద్వయాత్మనః।
పరామర్శో నిర్గుణత్వా-దహ మిత్యుచ్యతే విభోః॥

హృద్యకారో ద్వాదశాంతే-హంకార స్తదిదం విదుః।
అహ మాత్మక మద్వైతం-యత్రప్రకాశాత్మ విశ్రమః॥

ఏద్దానికంటె నుత్తరము (శ్రేష్ఠము) లేదో నద్ది అనుత్తరమనంబడును. అనుత్తర మనఁగా ? అకారము; విసర్గమనఁగా ? చివర; అక్షరములన్నిటి చివర నుండు హకారము- విసర్గాంత మనఁబడును. విసర్గాంతమనఁగా ? హకారము;"అ" "హ" అనువాని మేళనము - అహంకారమై శివశక్తులు వేరుకానట్టి రూపము గల పరమేశ్వరుని పరామర్శించునది. అద్ది- సత్త్వరజస్తమో గుణముల నతిక్రమించున దగుటఁజేసి నిర్గుణమనఁబఱఁగును. కావున "అహం" అనునది - శక్తివిశిష్ట శివుఁ డని తెలుపుచు శివశక్తుల నపృథక్ స్థితిని సూచించుచున్నది. హృదయమునందు అకారమును, ద్వాదశాంతము నందు (అనఁగా ? బ్రహ్మరంధ్రముపైన) హంకార మును భావించునెడ - ప్రకాశాత్మకమగు శివశక్తిమేళనమును చెప్పునట్టి అహం పదమునందు విశ్రాంతి కలుగును.

ఈ సందర్భమున సర్వోత్తరము, శివానందరూపమునగు పరమపదముఁ బ్రవేశించినట్టి ముక్తపురుషుఁడు - సమస్తప్రపంచ స్వరూపుఁడగు శివునిఁ జెప్పున దగు ప్రాసాదాక్షర (అహ)మును గానముఁ జేయవలెనని విధింపఁబడుట లేదు. కాని శివానందాస్వాదమువలన కలుగు పరమోల్లాసమును స్ఫురింపఁజేయుటకు- "ఏతత్సామ గాయన్నాస్తే" ఇత్యాది వాక్యములతో ముక్తపురుషుని ఆనందాతి శయము ప్రశంసింపఁబడినదని గుర్తింపవలెను.

కాని ముక్తపురుషులు - బ్రహ్మానందానుభవ వ్యాపారము దక్క సృష్ట్యాది వ్యాపారమును స్వేచ్ఛగా చేయువారు కారని సారాంశము.

సూ. "దర్శయత శ్చైవం ప్రత్యక్షానుమానే" 4-4-20

ప్రత్యక్ష మనఁగా ? శ్రుతి; అనుమానమనఁగా ? స్మృతి;

"తస్మా ద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః" ఇత్యాది శ్రుతియు, "అవ

ఏవ ససర్జాదౌ" ఇత్యాది స్మృతియు ఈవరకు చెప్పఁబడిన "పరమాత్మ యొకఁడే జగత్కర్త" యను విషయమును చూపెట్టుచున్నవి.

అందువలన బ్రహ్మమునకే జగత్కారణత్వము ఉపపన్నంబగునని విశదమైనది.

సూ. "భోగమాత్ర సామ్యలింగాచ్చ" 4-4-21

ప్రశ్న : పరమేశ్వరుఁడే జగత్కర్త యగును కాని ముక్తపురుషుఁడు జగత్కర్త కాడనునెడ "యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం - కర్తార మీశం పురుషం బ్రహ్మయోనిమ్, తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ- నిరంజనః పరమం సామ్యముపైతి" "ఉపాసకుఁడు - బంగారువన్నె గలవాడు జగత్కర్తయు జగచ్ఛాసకుఁడు ప్రకృతికారణుఁడు నగు పరమపురుషుని శివపదము నందు దర్శింపగానే పుణ్యపాపములఁ బోగొట్టుకొని విజ్ఞానము గలవాడై పుణ్యపాప లేపరహితుఁడునై బ్రహ్మముతో నత్యంతమగు సమానత్వము నొందును." "ముక్తః శివసమో భవేత్" ఇత్యాది ప్రమాణములయందు ముక్తపురుషునకు పరమేశ్వరునితో పరమసాదృశ్యము నిరూపింపఁబడుటచే ముక్తుఁడు- జగత్స్రష్ట్యాదికముఁ గూడ నెరవేర్చునని విదితమగుచున్నది. అట్లు కానిచో పరమసాదృశ్యము భంగపడును గదా ?

ఉత్తరము : ముక్తుఁడు శివునితో సమానుఁడగు నను నంశము - సమస్త కామ్యముల ననుభవించుటయందు వర్తించును కాని జగత్స్రష్ట్యాదికమునందు వర్తింపదు. ముక్తుఁడు గూడ జగత్కర్తయగు ననునెడ పరమేశ్వరులనేకు లుండగలరని యంగీకరింపవలసివచ్చును.

ఇందుకు దిగువ శ్రుతివాక్యమును ప్రోద్బలకముగ గానననగును.
"సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహబ్రహ్మణా విపశ్చితా" "వివిధముగ విమర్శించు జ్ఞానశక్తితో కూడి యుండు బ్రహ్మము "విపశ్చిత్" అనఁబడును. అట్టి బ్రహ్మముతో కూడ ముక్తపురుషుఁడు - కామ్యముల నన్నిటి ననుభవించును. పరమేశ్వరుని జ్ఞానశక్తి - స్వాభావికమై హృదయమునై శ్రేష్ఠమగు సత్త (ఉనికి) యొక్క స్ఫురించుటయు నగునది.

ఇట్టి జ్ఞానశక్తితోడనే దేశకాలవిశేషము లేనట్టి బ్రహ్మము (శివుఁడు) సర్వజ్ఞముగాను సర్వకారణముగాను సర్వాత్మకముగాను సర్వశక్తిమంతముగాను

అలుప్తశక్తికముగాను స్వతంత్రముగాను నిత్యతృప్తముగాను [illegible] సంపన్నముగాను సర్వానుగ్రాహకముగాను సర్వముక్త భోగ్య[illegible] గాను సంసిద్ధమగుచున్నయది. ముక్తపురుషుడు [illegible] మనస్సుతో కామితములనన్నిటి నవలోకించుచు రమించువాని [illegible] ఇందుకు "మనసైవైతాన్ కామాన్ పశ్యన్ రమతే" "[illegible]" అను శ్రుతివాక్యములు ప్రమాణములగుచున్నవి.

"సత్యాత్మ ప్రాణారామం మనఆనందం" అనుచో బ్రహ్మము మనస్సు లోనే ఆనందము ననుభవించుననియు, బాహ్యేంద్రియముల [illegible] బ్రహ్మమునకు ముక్తపురుషునకును లేదనియు, విశదమగుచున్నది.

బ్రహ్మము ముక్తపురుషుడును శరీరేంద్రియాదులను [illegible] విహరింప నైచ్ఛికముగా పరిగ్రహింతురు గాన శరీరేంద్రియాదికృత దోషముల వ్వారి నంటజాలవు.

ఇందువలన తేటపడినదేమనగా ?

పరమేశ్వరుడెట్లు కామ్యములనన్నిటి ననుభవించునో ముక్తపురుషుడట్లే ననుభవించుటజేసి పరమేశ్వరునకు ముక్తునకు భోగమాత్రసామ్యముండు ననుట-సమంజసమగును. మరియు లోకమున - కొన్ని ధర్మముల సంబంధముచేత్తే-దేవదత్తుడు సింహ - మను వాడుక చెల్లునట్లు "ముక్తుడు శివసముడు" అనుటయు పొసగునని వివేకము.

## అనావృత్త్యధికరణము

సూ. "అనావృత్తిః శబ్దా దనావృత్తిః శబ్దాత్" 4.4.22

సర్వకామావాప్తిరూపమగు ఆనందభోగము, స్వాతంత్ర్యము, స్వేచ్ఛా రూపములతో సదాశివాది లోక సంచారము, సర్వజ్ఞత్వము మొదలగు ధర్మము లతో ముక్తపురుషులు బ్రహ్మముతో సమానులై శివసాయుజ్యము పొందుదురని పూర్వాధికరణములయందు బాగుగా సమర్థింపబడినది.

అట్టి విశేషములు గల ముక్తులకు ఒకప్పుడైనను సంసారమునందు మరల పరంపర తారసిల్లునా లేదా అని సంశయము.

ప్రశ్న : "కామాన్నీ కామరూప్యనుసంచరన్'' ఇత్యాది వాక్యములయందు ముక్తులు బహుశరీర సంబంధము గలిగి యుందురని నిరూపింపఁబడినది గదా! శరీరసంబంధమువలన పుణ్యపాపకర్తృత్వము అనివార్యమగును. పూర్వకృతమగు బ్రహ్మోపాసనము అనేకవిధ సుఖభోగముతో క్షీణించుతఱి అనంతశరీరములతో చేయఁబడిన కర్మయొక్క భోగముగ హీనసుఖము గల సంసారమునందు జన్మింపవలసివచ్చును.

లోకమున - ఇంద్రాదిపదవుల నధిష్ఠించినవారు - స్వకృత పుణ్యాతిశయము క్షీణించుటతోడనే పునరావృత్తిఁజెంది బ్రాహ్మణాదిశరీరముల నొందుట గమనింపఁదగియున్నది.

గాన బ్రహ్మపదముఁజేరిన ముక్తులుగూడ భోగ్యముల నవలోకించుట అనుభవించుట మున్నగు ధర్మములు గలవారగుటఁజేసి భోగము - పుణ్యాతిశయమును క్షీణింపఁజేయునదగుటఁజేసియు పునరావృత్తులై సంసారులగుదురని చెప్పవలెను గదా ?

ఉత్తరము : శివుని సాక్షాత్కరించుకొని శివపదముఁ బ్రవేశించినట్టి ముక్తపురుషులకు సంసారమునందు పునరావృత్తియుండఁజాలదు. ఎందుకనఁగా ? "స ఖల్వేవం వర్తయన్ యావదాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే, నచ పునరావర్తతే, నచ పునరావర్తతే" ఇత్యాది శబ్ద ప్రమాణములఁబట్టి బ్రహ్మవిష్ణ్వాదులయొక్క దివ్యలోకములను మించినట్టి శివపదము— బ్రహ్మవిష్ణ్వాదిపదములకన్న విలక్షణమైనదనియు, అద్దానిఁబ్రవేశించినవారికి పునరావృత్తి లేదనియు విదితమగుచున్నయది.

ఇందుకు దిగువ నుదాహరింపఁబడు శివధర్మోత్తరాది పురాణవాక్యములను గమనింపవలెను.

శ్లో॥ దినకృత్కోటి సంకాశం- స్థాన మాద్య ముమాపతేః ।
సర్వకామసమాయుక్తం - విశుద్ధం నిత్య మక్షయమ్ ॥

సంప్రాప్య తత్పదం దివ్యం - సమస్తక్లేశవర్జితాః ।
సర్వజ్ఞాః సర్వగాః శుద్ధాః - పరిపూర్ణా భవంతి చ ॥

విశుద్ధకార్యకరణాః - పరమైశ్వర్యసంయుతాః ।
సదేహాశ్చ విదేహాశ్చ - భవంత్యాత్మేచ్ఛయా పునః ॥

యే సంప్రాప్తాః పరం స్థానం - జ్ఞానయోగరతా నరాః ।
న తేషాం పున రావృత్తి - ర్ఘోరే సంసారమండలే ॥

అర్థము- ''పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభి నిష్పద్యతే" అను శ్రుతి వాక్యమందు – పరంజ్యోతి యనఁగా? ముక్తప్రాప్యుఁడు ఉమా సహితుఁడు నగు పరమేశ్వరుఁడని నిర్ణయింపవలసియుండును. సూర్యాదుల తేజస్సులను మించునదియు మహాప్రకాశము గలదియునగు మహాతేజస్సుయొక్క కాంతితో సమస్తంబు వెలుగొందునదని దిగువశ్రుతివాక్య ముదాహరించినది.

"న తత్ర సూర్యో భాతి, న చంద్రతారకం, నేమా విద్యుతో భాంతి, కుతో ఽయ మగ్నిః; తమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతి"

"పరమేశ్వరోఽహం, పుష్కరమహం, పవిత్ర మహ మగ్రంచ మధ్యంచ, బహిశ్చ పురస్తాత్ జ్యోతి రిత్యహమేకః, సర్వేచ మామేవచ, మాం యోవేద, స సర్వాన్ దేవాన్ వేద"
అథర్వశిరస్సు

శ్రుత్యర్థము- "నేను పరమేశ్వరుఁడను, ఆకాశము నేనే, ఉదకము నేనే; మొదట నడుమ వెలుపల ముందర నుండువాడను నేనే; వెలుఁగు నేనే; ఇట్లు నేనొకఁడనే అన్నిరూపముల నుండువాడననియు, జీవాత్మలందరు నన్నే ఆశ్రయించువారనియు, నన్నెవఁడు గుర్తెరుగునో వాడే హరిబ్రహ్మాది దేవతలందరిని తెలిసికొనినవాడగును"

శ్లో॥ సర్వతః పాణిపాదాబ్జం - సర్వతోఽక్షి శిరోముఖం ।
సర్వ మావృత్య తిష్ఠంతం - తేజోరాశిం శివం స్మరేత్ ॥

"అంతట కమలములవంటి హస్తములు పాదములును గలవాడు, ప్రపంచమునందంతట కన్నులు తలలు మొగములు గలవాడు, సర్వమును వ్యాపించి యుండువాడు తేజస్సుల ప్రోగు నగు శివుని స్మరింపవలెను" అనుస్మృతివాక్యంబు పై విషయమును సమర్థించుచున్నయది.

పరంజ్యోతిః స్వరూపుఁడు, ఉమాసహితుఁడు, పరబ్రహ్మంబునగు శివునిచే నధిష్ఠింపఁబడిన పదము- నిరతిశయ తేజస్సుమాత్రము స్ఫురించుట గలదగుటఁ జేసి దినకృత్ (సూర్య) కోటి సంకాశమై అత్యంత నిర్వికార సుఖాస్పదమగుటచే- "స్వర్గో లోకో జ్యోతిషాఽఽవృతః" "దేవా హ వై స్వర్గం లోక మగమంస్తే దేవా రుద్ర మపృచ్ఛన్" "తేజోమయ స్వరూపుఁడగు పరమాత్మచే స్వర్గలోకము నిండియున్నది" "దేవతలు స్వర్గలోకమునకు వెళ్ళిరి. ఆ దేవతలు పరమేశ్వరుని "నీవు ఎట్టివాడ"వని ప్రశ్నించిరి." ఇత్యాది శ్రుతివాక్యములఁబట్టి- స్వర్గ మనఁ బడును.

ఇట్టి పరమపదము- తురీయాతీత మగుటఁజేసి ఆద్య మనఁబడుఁగుచున్న యది. ఇందుకు "తుర్యంచ తురీయాతీతం చ శివస్థాన మనామయం" అను ఉత్తర గీతావాక్యము ప్రోద్బలకమగును. లోకముల నన్నిటి నతిక్రమించునది, జగత్కారణము నగుటచే శివపదము "ఆద్యము" అని వ్యవహరింపఁబడుచున్నయది.

"శివలోకా దృహి ర్జ్ఞేయా-న్యండస్యావరణాని చ" ఇత్యాది వాక్యములు- బ్రహ్మాండముయొక్క సప్తావరణములు-శివలోకమునకు వెలుపలను క్రిందిభాగమునను కలవని తెలుపుచున్నవి.

"పరా త్పరతరో బ్రహ్మా- తత్పరాత్ పరతో హరిః,
తత్పరా త్పరతోఽపీశః" అను శ్రుతివాక్యము-

ప్రకృతికంటె పరుఁడు బ్రహ్మదేవుఁడు, అతని మించినవాడు శ్రీహరి, శ్రీహరికన్న నధికుఁడు మహేశ్వరుఁడు నని ప్రతిపాదించుటచే మహేశ్వరుని స్థానము విశ్వోత్తీర్ణము గాన ఆద్యమని చెప్పవచ్చును.

పరబ్రహ్మంబగు శివుఁడు- ఉమాసహాయుఁడు, పరమేశ్వరుఁడు, ప్రభువు ననియు; పరమేశ్వరుఁడు- నీలకంఠుఁడుగాను, త్రిలోచనుఁడుగాను, ధ్యానింపఁ దగినవాడనియు; తమస్సనఁబడు ప్రకృతిని మించినవాడగుటచే ముముక్షుప్రాప్యుఁ డనియు; "ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుమ్" ఇత్యాది శ్రుతివాక్యము తేటపఱచుచున్నయది.

మరియు "సర్వో వై రుద్రః" అనువాక్యము మొదలుకొని శివుఁడు సర్వాత్మకుఁడని నిరూపించి "హిరణ్యబాహవే హిరణ్యరూపాయ హిరణ్యపతయేఽంబికా

పతయ ఉమాపతయే" అను ఉపసంహారవాక్యమునందు - పరమేశ్వరుఁడు-సువర్ణ కాంతిగల దివ్యశరీరముతో ఉమాపతిగ నుండునని ప్రతిపాదింపఁబడినది.

ఓంకారములోని-అ. ఉ. మ్. అను అక్షరములలో "ఉ" మొదలుకొని యేర్పడు "ఉమా"శబ్దము- పరప్రకృతియగు పరాశక్తిఁజెప్పునది. "కృష్ణపింగళం బ్రహ్మ" అనుచో కృష్ణవర్ణము పరాశక్తి సూచక మగుటచే పరాశక్తిసమరసీభావము గల బ్రహ్మంబని తెలియుచున్నందున పరమపదము- ఉమాపతియగు పరమేశ్వరునిదే నని నిర్ణయింపవలెను.

అట్టి శివలోకము- "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విప శ్చితా" అనువాక్యము ననుసరించి- ముక్తపురుషులకు సకలకామావాప్తిరూపమగు బ్రహ్మానందము నొదవఁజేయునదగుటయే గాక "సమస్తసాక్షిం తమసః పరస్తాత్" "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" ఇత్యాది శ్రుతులఁబట్టి ప్రకృతి (తమో) వికారములగు రాగద్వేషలోభాదులను కలుగఁజేయనిదగుటచే విశుద్ధంబునని చెప్పఁబడుచున్నది.

ఇట్లు చెప్పుటచే శివలోకము- శివతత్త్వమును ప్రకాశింపఁజేయు మహానందముతో నిండియుండు పరమాకాశముఁదగు స్వరూపము గలదని తేటపడుచున్నయది. ప్రకృతిఁజెందిన సత్త్వరజస్తమోగుణవికారములే జగత్సృష్ట్యాదుల నొనర్చునవి గాన నట్టి వికారములకు లోను గానిదగుటచే శివపదము- నిత్య మన బఱఁగుచున్నయది. భూతాకాశము మున్నగునవియే సృష్టిలో చేరునవిగాని పరమాకాశరూపమగు శివపదము- సృష్ట్యాదులకు గురికానిదని తెలియవలెను.

"యదా తమ స్తన్నదివా నరాత్రి - ర్నసన్నచాస చ్ఛివ ఏవ కేవలః"

ఎప్పుడు ప్రళయమో, అప్పుడు పగలు రాత్రి సత్తు అసత్తు నుండవు. శివుఁ డొక్కఁడే నుండు" నని వినఁబడుటవలన. శివుఁడు దక్క- నితరులగు సూర్యాదులకు ప్రళయము సంభవించునని విదితమగును.

ప్రశ్న : మహాప్రళయమునందు శివుఁడొక్కఁడే యుండునెడ - ముక్తపురుషులుండరనియే చెప్పవలెను గదా !

ఉత్తరము : ముక్తపురుషులు - శివలోకంబు శివతత్త్వములో చేరియుం

డును గాన నిత్యనిర్మల విశుద్ధతయందు శివుఁడు — ముక్తపురుషులును సమానులే యగుదురు. శివత్వమనఁగా ? సృష్టిస్థిత్యాది చక్రమునందు ప్రవేశించినట్టి పశు పాశములకన్న విలక్షణ మగునది. ఇంకను శివపదము - క్షయవృద్ధులు లేనట్టిది గాన "అక్షయ" మనఁబడును. కర్మఫలాతిశయము కర్మఫలక్షయమున్ను గల స్వర్గాది లోకముల కంటె వేరై యవ్వానిపై నుండు శివలోకము నిత్యము కాదను టకు వీలులేదు. ఎందుకనఁగా? "సోఽధ్వనః పార మాప్నోతి- తద్విష్ణోః పరమం పదమ్" "కళా తత్త్వ భువన వర్ణ పద మంత్రములయొక్క- షడ్విధములగు మార్గ ముఁదగు అవసానప్రదేశమైనట్టి నారాయణుని మించినట్టి పరమాకాశ రూపమునగు శివపదమును మాహేశ్వరుఁడు పొందు"నను శ్రుతివాక్యముఁబట్టి శివస్థానము - వైకుంఠము నతిక్రమించి చేరఁదగినదనియు, బ్రహ్మలోక మనఁబఱఁగు ననియు గుర్తింపవలెను. "బ్రహ్మలోక మభిసంపద్యతే, న చ పునరావర్తతే, న చ పునరా వర్తతే" అనుచో- పునరావృత్తి (సంసారమున జన్మపరంపరలోనికి వచ్చుట)లేనట్టి బ్రహ్మలోకము- శివలోకమేనని నిర్ణయించుట- సమంజస మగుచున్నయది.

"సంప్రాప్య తత్పదం దివ్యం- సమస్తక్లేశ వర్జితాః" అను వాక్యము - శివ సమానులగు ముక్తపురుషుల లక్షణముఁజెప్పునది. మహాదేవుని స్వరూపము దివ్యము అవాఙ్మనస గోచరమునగు పరమపదమును-శివ సంబంధమగు దీక్షఁబరిగ్రహించి శివాగమోక్తరీతిని శివు నారాధించుట యను జ్ఞానయోగమున - పొందినవారు-భవ బంధ వినిర్ముక్తులై అవిద్యా రాగాది క్లేశములు లేనివారై యుందురు. ఇట్లు చెప్పు టలో- ముక్తపురుషులు రాగద్వేషాది తుచ్ఛగుణములు లేకుందురను సారాంశమును గాననగును. ఇఁక కల్యాణగుణములు ముక్తులకుండునని నిరూపింపఁ బడుచున్నది. శివత్వముఁజెందిన ముక్తులు - జ్ఞానావరణమగు మలమును పోగొట్టుకొనినవారగు టచే సర్వజ్ఞులగుదురు. అవ్వారి జ్ఞానశక్తి - సమస్తముఁ జెందియుండును. గాన సర్వగులగుదురు. అజ్ఞానమలము తొలగుటచే శివభావము ప్రాదుర్భవించుటఁజేసి శుద్ధాకాశస్వరూపులై ప్రజ్ఞానఘనులగుదురు. అందువలననే వారు శుద్ధులని చెప్పఁ బడుదురు.

"ప్రదీపవదావేశః" "పూర్వభావా దవిరోధం బాదరాయణః"అను సూత్రాధి కరణములయందు- ముక్తులు స్వయంప్రకాశమానులనియు, సత్యసంకల్పత్వాదులు గలవారనియు విశదీకరింపఁబడినది.

మరియు ముక్తపురుషులు - నిరతిశయానంద స్వరూపులై అవాప్త సకల కాములై ఎట్టివికారము లేనట్టి శివానందము ననుభవించుచు నిత్యతృప్తులైయుందురు గాన ''పరిపూర్ణు''లని వ్యవహరింపఁబడుదురు. "వికారావర్తి" అను సూత్రముఁ దగు అధికరణమున నివ్విషయము నిరూపింపఁబడినది.

వికారములు లేనట్టి శరీరేంద్రియములు ముక్తులకు సమకూరుచుండునని "స ఏకధా భవతి" ఇత్యాది శ్రుతియందు నిరూపింపఁబడుటచే ముక్తపురుషులు- పరాశక్తినిష్పన్నంబులగు శరీరేంద్రియాదుల నైచ్ఛికముగా పరిగ్రహించువారని గుర్తింపఁబడుచున్నది. ఆశ్రయముయొక్క వికారములకు లోను గాకుండుట-విశుద్ధ భావమగును.

''ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే"అను శ్రుతివాక్యము - పరమేశ్వరుఁడు- మహామాయాశక్తులచే నీలకంఠత్వము మొదలగు లక్షణములు గల బహుశరీరములను పరిగ్రహించునని వక్కాణించుటయే గాక "స్థిరేభి రంగైః పురురూప ఉగ్రః" పరమేశ్వరుని శరీరేంద్రియములు ప్రాకృతములు కావనియు, విశుద్ధ విద్యామయములై స్థిరములగుననియు మంత్రభాగము విశదీకరించినది.

పరమేశ్వరుని వలె ముక్తపురుషులును విశుద్ధములగు పెక్కు శరీరముల నింద్రియములను పరిగ్రహింతురని సారాంశము.

ముక్తులు— తమ ప్రవర్తనమును స్వాధీనముగ నుంచుకొని పరులచే నియమింపఁబడుట యను దీనత్వము లేనివారై గొప్ప ఐశ్వర్యము గలిగి యుందురు. "అత ఏవ చానన్యాధిపతిః" అను నధికరణమునందు ముక్తులు కర్మవశ్యులు గాకుండుటచే పరమస్వతంత్రులని చెప్పఁబడినది. తమ యిష్టముతోడనే శరీరధారులుగ నుండు ముక్తపురుషులు - ఒకప్పుడు విదేహులై సహజసిద్ధమగు మనస్సుతోడనే సకలకామముల ననుభవింతురు.

ఇందుకు "మన సైతాన్ కామాన్ పశ్యన్ రమతే" అను శ్రుతియు "ద్వాదశాహవ దుభయవిధమ్" అను సూత్రంబు "విరూపేభ్యో విశ్వరూపేభ్యశ్చ నమో నమః" ఇత్యాది ప్రమాణము లాధారములగుచున్నవి.

పరమేశ్వరుని స్వరూపములఁబోలిన శరీరములను ముక్తపురుషులు వరి

గ్రహింతురని "నీలగ్రీవాః శితికంఠాః" ఇత్యాది శ్రుతి వాక్యముల ననుసరించి భావింపవచ్చును.

వేద వేదాంత శివాగమజన్యమగు జ్ఞానాత్మకమైన ఉపాసన యందు యమ నియమాద్యంగ సహితమగు శివధ్యాన యోగమునందు ఆసక్తితో ఆరితేరినవారై, శివపదముఁ బ్రవేశించిన వారికి-నిరతిశయ తాపరూపమగుటచే ఘోరమగు సంసార మండలము నందు పునరావృత్తి యుండఁ జాలదు. "న చ పున రావర్తతే" ఇత్యాది శ్రుతి వాక్యమిందుకు ప్రోద్బలకమని పూర్వము చెప్పఁబడినది గదా!

సర్వజ్ఞుఁడు సర్వ శక్తిమంతుఁడు సర్వైశ్వర్య సంపన్నుఁడు సర్వాను గ్రాహకుఁడు సర్వకర్మ సమారాధ్యుఁడు సమస్తదోష కళంకములు లేనివాడు నిరతిశయ మంగళగుణ రత్నాకరుఁడు విరూపాక్షుఁడు పరబ్రహ్మంబు నగు ఉమా పతియొక్క - అవధిలేని ఆనందమును వెదజల్లునది నిత్యము అక్షయము నగు-లోకముఁజెందిన ముక్తపురుషులు - సర్వజ్ఞత్వాది దివ్యగుణ సంపన్నులై పునరా వృత్తిరహితులునై శివ లోకమునందు విలసిల్లుచుందురు.

"యత్ర దేవా అమృత మానశానా స్తృతీయే ధామాన్యభ్యైరయంత"

నిరతిశయానంద ప్రకాశఘనుఁడగు శివునితో సమరసభావమును పొందిన ముక్తపురుషులు- ప్రకాశించు మేను గలవారై సర్వజ్ఞులుగ, సర్వగతులుగ, శాంత స్వభావులుగ, నిత్యపరమైశ్వర్య సంపన్నులుగను, సర్వవిధ మలావరణములు బొత్తుగా లేనివారుగను, అంతట శివు నవలోకించు వారుగను, శివాత్మకులుగను, పరమాకాశ లక్షణమగు శివలోకమునందు - స్వాభిమతములగు స్థానములఁ బ్రవే శించి తమకు అభిరుచి గల కోరికల నన్నిటి ననుభవించుచు పరమేశ్వరునితో కూడ ఎల్లకాలము అంతట రాజించుచుందురు.

ఇవ్విధము సమస్తము సమంజసంబేను ;

శ్లో॥ శ్వేతాచార్య పదద్వంద్వ- శుశ్రూషా ద్యోతితాధ్వనా ।
కృత మేత న్మయా భాష్యం- కేవలం భక్తిమాత్రతః ॥

"శేతాచార్యుల పాదపద్మముల నారాధించుటచే మోక్షమార్గమును పరిశీ లించు శక్తి గలిగిన నేనీ సూత్రభాష్యమును కేవలము భక్తిచేతనే రచించితి" నని శ్రీ నీలకంఠ భగవత్పాదాచార్యులు వాక్రుచ్చిరి.

ఇయ్యది
శివయోగి శ్రీ నాగలింగ శివారాధ్యకృతి యగు
శివ చింతామణిప్రభ ననుసరించి యథామతి యథావకాశము
శ్రీ నీలకంఠ భగవత్ పాదీయమగు బ్రహ్మసూత్ర భాష్యముఁదగు
"శివ చింతామణి ప్రభామయూఖము" అను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనము సర్వంబు సమాప్తము.

---

శ్రీ మహాగణాధిపతయే నమః

ఈ గ్రంధ ముద్రణకై సహకరించిన సంస్థలు. మరియు మహోదారులు.

1. శ్రీ తిరుమలతిరుపతి దేవస్థానము, తిరుపతి.

2. శ్రీ రాజరాజేశ్వర దేవస్థానము, వేములవాడ.

3. లోకారాధ్యులు, శివశ్రీ॥ కందుకూరి శివానందమూర్తిగారు.
శైవమహాపీఠ ఉపాధ్యక్షులు.
భీమునిపట్నం, ఆనందవనం, బ్యాంక్ కాలనివద్ద, విశాఖజిల్లా, 531 163.
(వీరు ఆయాచితముగ గొప్ప విరాళం సమర్పించిన మహోదయులు)

4. మహారాజశ్రీ॥ మడూరి కోటిలింగం గారు, సౌ. విజయాదేవి.
రిటైర్డ్ డిప్యూటీ ఎక్జిక్యూటివ్ ఇంజనీయర్.
8/122, చౌరస్తా, ఆర్.ఎన్.టి. రోడ్, వరంగల్ 506 002.
(వీరు గూడ అయాచితముగ విరాళం సమర్పించిన మహాశయులు)

5. లో. శివశ్రీ. నాగారపు కోటిలింగం ఆరాధ్యులు
కొండూరువారి వీధి, వరంగల్.
(అయాచితముగ తమ వాగ్దానమును అమలుచేసిన మాహేశ్వరప్రవరులు)

6. మహారాజశ్రీ. కొండూరు బసవరాజం గారు,
8-8-48, గిర్మాజీపేట, వరంగల్.
(పరమ శివభక్తులు, సరసహృదయులు, విశ్వాసపాత్రులును)

7. లో. శివశ్రీ. తాడికొండ వీరభద్రయ్య గారు,
అడ్వకేట్, 3-6-668, హిమాయత్‌నగర్, హైదరాబాద్.
(వీరు అగర్భశ్రీమంతులు, స్పష్టవాదులు, నిష్కపట హృదయులును)

8. లో. శివశ్రీ. కొంపల్లి శంకరరావు గారు,
6-42 సిండికేట్ బ్యాంక్ కాలనీ, సరూర్‌నగర్, హైదరాబాద్-35,
(వీరు ఈ గ్రంథ సహకారమునకై ముందంజ వేసిన మహానుభావులు)

9. లో. శివశ్రీ. కాశీనాథుని ఆనందభైరవ ప్రసాద్‌గారు,
లలితానగర్, జామే ఉస్మానియా స్టేషన్ ఎదురు,
ప్లాట్ నెం. 178, 12-11-1595/13, హైదరాబాద్ 500 046,
(వీరు విద్వన్మాహేశ్వర పోషకులు, శైవసారస్వతప్రియులును)

10 లో. శివశ్రీ. ముదిగొండ ఉమాశంకర్ గారు.
402/4 సెంట్రల్ రెవిన్యూక్వార్టర్స్, అన్నానగర్,
వెస్ట్ మద్రాస్, 600 040.
(వీరు వయసున చిన్నవారైనను గంభీరహృదయులు, ఉత్తములును)

11. బ్రహ్మశ్రీ. బత్తేపూడి రామారావు గారు.
36/58 డిఫెన్స్‌కాలనీ, సైనిక్‌పురి, సికింద్రాబాద్, 500 594
(వీరు స్మార్తశైవులైనను లింగధారులై అఖండ శివభక్తితో తమ జన్మ సార్థకత నాపాదించుకొనుచున్న శ్రోత్రియులు).

12. సర్వశ్రీ. నడిపినేని సూర్యనారాయణ గారు.
తెలుగు లెక్చరర్, కందుకూరు. 523 105.
(వీరు నా లేఖినితో ప్రసన్నులై సహకరించిన సారస్వతప్రియులు)

13. మహారాజశ్రీ॥ వెలుగూరి శరభయ్యగారి కుమారుఁడు
శ్రీ విజయ వెంకట లక్ష్మీనారాయణ గుప్తగారు.
సత్తెనపల్లి (మండలం) 522403, గుంటూరుజిల్లా,
(వీరు ప్రథమపరిచయములోనే తమ శివభక్తి పరిపూర్ణతతో సహకరించిన సద్గుణ సంపన్నులు).

14. లో. శివశ్రీ॥ మహాబలేశ్వరశర్మగారు (శ్రీ పంచాక్షరీభవనము)
కీ శే. మల్లంపల్లి లింగమూర్తి ఆరాధ్యులమధ్యమపుత్రులు.
మైలార్‌గడ్డ, 11-1-348/1/ఎ. సికిందరాబాద్.
(వీరు పరోపకార పారీణులు, సర్వజనప్రియులు, ఆరాధ్యయాజ్ఞికులును)

16. మహారాజశ్రీ॥ నేతికార్ మదన్‌లాల్‌గారు
కీ.శే. నేతికార్ కిషన్‌లాల్‌గారి జ్ఞాపకార్థము గొప్పవిరాళం సమ
ర్పించిన మహావ్యక్తి; 12-14-360, లాలాపేట్, సికిందరాబాద్.

15. లో. శివశ్రీ॥ ముత్యంపేట రాజేశ్వరశర్మగారు.
కవాడిగుడ- శంకరారాధ్య మఠం, సికిందరాబాద్.
(వీరు చిన్నవారైనను గొప్ప మనస్సు గలవారు)

17. బ్రహ్మశ్రీ॥ పత్రి వెంకటసత్య నరసింహమూర్తిగారు.
క్వార్టర్ 186, స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా కాలనీ,
గాంధీనగర్, హైదరాబాద్ 500 360,
(వీరు స్నేహపాత్రులు, మితభాషణులు, సమయోచిత ప్రజ్ఞులును)

18. మహారాజశ్రీ॥ అరుణార్తుల శంకరయ్య శ్రేష్ఠిరత్నంగారు,
వెండి బంగారు వర్తకం, జనరల్ బజారు, సికిందరాబాద్.

వీరు కళత్ర పుత్ర పుత్రికాది సత్కుటుంబము, అగర్భ శ్రీమంతము మహాలక్ష్మి కటాక్షము,, న్యాయసంపాదన, మంచిపేరు. శాంతస్వభావము ఇత్యాది సద్గుణములు గల పుణ్యాత్ములు.

నా యాచనను అవధరించి సర్వాధికముగ గొప్ప విరాళం సమర్పించిన వణిక్ వరిష్ఠులు.

19. లో. శివశ్రీ॥ విద్వాన్, కామర్సు చంద్రమౌళి శాస్త్రిగారు,
దుబ్బాక లచ్చుపేట, మెదక్ జిల్లా;

(వీరు సంస్కృతాంధ్ర భాషాకోవిదులు, పురాణార్థ ప్రవచన దక్షులు, ఆప్త బంధు ప్రవరులు, తలవనితలంపుగా గొప్ప విరాళం అందఁజేసిన ఆరాధ్య శేఖరులును).

20. లో. శివశ్రీ॥ శివదేవుని వీరభద్ర అయ్యవార్లంగారు, వరంగల్
(వీరు వయోజ్ఞానవృద్ధులు, సహజపాండిత్యపూర్ణ కవిశేఖరులు, శైవ సంప్రదాయాభిజ్ఞులు, అయాచితముగ విరాళమును అందజేసిన అమృత హృదయులు).

21. లో. శివశ్రీ॥ ముదిగొండ నాగభూషణశాస్త్రిగారు వరంగల్
(కీ. శే. ముదిగొండ మల్లికార్జునశాస్త్రిగారి జ్ఞాపకార్థము గొప్ప విరాళం సమర్పించిన సరసహృదయులు.)

22. లో. శివశ్రీ॥ ముదిగొండ విద్యాసాగర్‌గారు,
సౌ॥ పర్వత వర్ధనమ్మగారు,
22-97, సరస్వతీనగర్‌కాలనీ, రోడ్ నెం॥ 2 హైదరాబాద్-500 660.

(వీరు నా అభ్యర్థనను మనసార అంగీకరించి ఏతెంచి గొప్ప విరాళం సమర్పించిన శైవాభిమాన పరిపూర్ణులు, మరియు ఇష్టప్రాణ భావలింగాత్మకుఁడైన పరశివుఁడే సర్వవ్యాపియను విశాల భావనతో పంచమహాభూతాత్మక శివలింగములను పంచారామశివక్షేత్రములను సప్త ముక్తిక్షేత్రములను ద్వాదశజ్యోతిర్లింగములను అష్టాదశ దేవీపీఠములను సకుటుంబముగ దర్శించి తరించిన ఆరాధ్య ప్రవరులు.)

23. లో. శివశ్రీ॥ శివలెంక అమరవీరేశ్వరశాస్త్రిగారు,
2 B. శివరామకృష్ణకాలనీ, వెస్ట్ మారేడుపల్లి, సికిందరాబాద్.

సర్వేశ్వరాలయకమిటీ అధ్యక్షులు, సమున్నత ఉద్యోగ పదవీ మండితులు నగు వీరు— సహజమైన ఔదార్యముతో స్వహస్త పరహస్తములతో సహకరించి ముద్రణవ్యయభారమును తగ్గించిన శైవారాధ్యవతంసులు.)

24. లో. శివశ్రీ॥ ఘట్టేపల్లి శరభయ్య ఆరాధ్యులు, సిద్దిపేట.
(వీరు గతానంతర వైశాఖమున శరభేశ్వరాలయప్రాంగణమున శైవసభలు జరిపించి గొప్ప వాగ్దానమును చేయుటేగాక స్వయంగా గొప్ప విరాళమును సమర్పించిన శ్రౌతశైవాగ్రగణ్యులు.)

శ్రీ మహాగణాధిపతయే నమః

# తప్పొప్పుల పట్టిక

| | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ఉపోద్ఘాతము | 3 | 25 | ముక్తిపాధనము | ముక్తిసాధనము |
| ప్రథమాధ్యాయము | 11 | 5 | వలయ | వలయు |
| జిజ్ఞాసాధికరణము | 33 | 4 | మిచ్చే | మిచ్ఛే |
| " | 38 | 12 | సమిత్స | సమిత్ప |
| " | 82 | 4 | బ్రహ్వ | బ్రహ్మ |
| సమన్వయాధికరణము | 96 | 4 | నిరాకరించుటకు | ప్రధానమును నిరాకరించుటకు |
| ఈక్షత్యధికరణము | 97 | 7 | అవ్యయ | అవ్యయ |
| " | 113 | 18 | ప్రస్తుతః | వస్తుతః |
| ఇతరానుపపత్త్యధికరణము | 127 | 10 | నిద్ర | నింద్ర |
| ఇంద్రప్రాణాధికరణము | 131 | 22 | ప్రేత్ర | ప్రేత్య |
| సర్వత్రప్రసిద్ధాధికరణము | 134 | 22 | మహేశ్వద | మహేశ్వర |
| " | 152 | 22 | స్వభూతిలో | స్వవిభూతిలో |
| గుహాఽధికరణము | 153 | 19 | సంభవించుదని | సంభవించునదని |
| " | 155 | 24 | అమృత్వాది | అమృతత్వాది |
| " | 163 | 4 | అనుపపత్తేషు | అనుపపత్తేశ్చ |
| అంతర్యామ్యధికరణము | | | | |

| | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| వైశ్వానరాధికరణము | 167 | 5 | 1-2-26 | 1-2-25 |
| " | 168 | 9 | గరవార్తై | గలవార్తై |
| " | " | 11 | వైశ్వానరుఁని | వైశ్వానరుఁ |
| " | 170 | 10 | జఠ్ఠరాగ్ని | జఠరాగ్ని |
| భూమాధికరణము | 179 | 16 | 1-3-9 | 1-3-8 |
| అక్షరాధికరణము | 181 | 21 | మూత్రము | సూత్రము |
| దహరాధికరణము | 196 | 12 | 1-7-21 | 1-3-21 |
| " | 197 | 8 | 1-6-22 | 1-3-22 |
| దేవాధికరణము | 203 | 12 | మును | ముస |
| అర్థాంతరత్వాదివ్యపదేశాధికరణము | 216 | 24 | ముత్తై | ముత్తై |
| సంఖ్యోపసంగ్రహాధికరణము | 225 | 8 | 1-4-18 | 1-4-13 |
| [illegible]ంచిత్వాధికరణము | 230 | 15 | గాంచకుండుఁటి | గాంచకుండుతటి |
| వాక్యాన్వయాధికరణము | 232 | 8 | అంతర్మహి | అంతర్బహి |
| సర్వవ్యాఖ్యానాధికరణము | 254 | 5 | విద్యాసాన | విద్యాస్థాన |
| " | 260 | 13 | సర్గాధి | సర్గాది |
| " | " | 17 | నిర్ణముంచి | నిర్ణయించి |
| " | 271 | 14 | ఇత్యాని | ఇత్యాది |
| " | 274 | 23 | తర | శివేతర |

ద్వితీయాధ్యాయము

| | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| కృత్స్నప్రసక్త్యధికరణము | 25 | 1 | లోకాపత్తి, లీలాకైవల్యాదికరణము | |
| పాంచరాత్రాధికరణము | 65 | 14 | సంద్యమును | సందర్భమును |
| " | " | 21 | చెప్పుటనే | చెప్పుటచే |

| | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| వియదధికరణము | 67 | 17 | పఠించినచా | పఠించినచో |
| " | 68 | 14 | - | 2.3.3 |
| కర్త్రధికరణము | 87 | 8 | సూ. కర్తాశాస్త్రార్థవత్త్వాత్ | 2.3.33 |
| అంశాధికరణము | 96 | 10 | 2.5.50 | 2.3.50 |
| త ఇంద్రియాధికరణము | 106 | 21 | ప్రాణమునంటె | ప్రాణముకంటె |
| సంజ్ఞామూర్తిక్లుప్త్యధికరణము | 109 | 27 | నేర్పరచువాడు | నేర్పరచువాడు |
| " | 113 | 1 | అంశాధికరణము | సంజ్ఞామూర్తిక్లుప్త్యధికరణము |
| **తృతీయాధ్యాయము** | | | | |
| కృతాత్యయాధికరణము | 121 | 3 | ద్రాహ్మణ | బ్రాహ్మణ |
| అనిష్టాదికార్యధికరణము | 126 | 6 | 3-1-20 | 3-1-19 |
| " | " | 16 | 3-1-21 | 3-1[illegible] |
| తత్స్వాభావ్యాధికరణము | 127 | 3 | 3-1-22 | [illegible] |
| నాతిచిరాధికరణము | " | 24 | 3-1-23 | 3-1-22 |
| అన్యాధిష్ఠితాధికరణము | 128 | 16 | 3-1-24 | 3-1-23 |
| " | 129 | 6 | 3-1-25 | 3-1-24 |
| " | " | 21 | 3-1-26 | 3-1-25 |
| ఫలాధికరణము | 163 | 10 | 3-2-37 | 3-2-27 |
| " | 164 | 15 | 3-2-38 | 3-2-28 |
| " | 166 | 3 | 3-2-39 | 3-2-29 |
| " | " | 11 | 3-2-40 | 3-2-30 |

| | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| అనియమాధికరణము | 190 | 14 | 3-3-34 | 3-3-33 |
| " | " | 24 | 3-3-35 | 3-3-34 |
| అంతరాభూతగ్రామాధికరణము | 191 | 22 | 3-3-36 | 3-3-35 |
| సత్యాధికరణము | 192 | 5 | 3-3-37 | 3-3-36 |
| కామాధికరణము | " | 19 | 3-3-38 | 3-3-37 |
| అలోపాధికరణము | 195 | 22 | 3-3-36 | 3-3-38 |
| " | 197 | 2 | కాంతి | శాంతి |
| " | " | 15 | మూర్థన్య | మూర్ధన్య |
| తద్వచనాధికరణము | 198 | 22 | 3-3-40 | 3-3-39 |
| " | 199 | 11 | నిరంజనః | "నిరంజనః" |
| తన్నిర్ధారణానియమాధికరణము | 200 | 7 | 3-3-41 | 3-3-40 |
| ప్రదానాధికరణము | 201 | 3 | 3-3-42 | 3-3-41 |
| లింగభూయస్త్వాధికరణము | 202 | 3 | 3-3-43 | 3-3-42 |
| " | " | 14 | పూర్వాధికరము | పూర్వాధికరణము |
| పూర్వవికల్పాధికరణము | 204 | 10 | 3-3-44 | 3-3-43 |
| " | " | 20 | 3-3-45 | 3-3-44 |
| " | " | 23 | 3-3-46 | 3-3-45 |
| " | 205 | 2 | 3-3-47 | 3-3-46 |
| " | " | 7 | 3-3-48 | 3-3-47 |
| " | " | 14 | 3-3-49 | 3-3.48 |
| " | " | 21 | 3-3-50 | 3-3-49 |

| | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| శరీరేభావాధికరణము | 206 | 4 | 3-3-51 | 3-3-50 |
| " | " | 14 | 3-3-52 | 3-3-51 |
| అంగావబద్ధాధికరణము | 207 | 5 | 3-3-53 | 3-3-52 |
| " | 209 | 14 | 3-3-54 | 3-3-53 |
| క్రతువజ్జ్యాయస్త్వాధికరణము | " | 21 | 3-3-55 | 3-3-54 |
| నానాశబ్దాద్యధికరణము | 211 | 17 | 3-3-56 | 3-3-55 |
| వికల్పాధికరణము | 212 | 11 | 3-3-57 | 3-3-56 |
| యథాకామాధికరణము | 213 | 6 | 3-3-58 | 3-3-57 |
| యథాశ్రయాధికరణము | " | 23 | 3-3-59 | 3-3-58 |
| " | 214 | 6 | 3-3-60 | 3-3-59 |
| " | " | 10 | 3-3-61 | 3-3-60 |
| " | " | 13 | 3-3-62 | 3-3-61 |
| " | " | 17 | 3-3-63 | 3-3-62 |
| " | " | 23 | 3-3-64 | 3-3-63 |
| చతుర్థాధ్యాయము | | | | |
| " | 266 | 5 | యత్రైకాగ్రతాధికరము | యత్రైకాగ్రతాధికరణము |
| తదోకోఽగ్రాధికరణము | 289 | 16 | యనుగ్రహము | యనుగ్రహమును |
| సంపద్యావిర్భావాధికరణము | 306 | 16 | ఒక్కొక్క | ఒక్కొక |
| " | " | 23 | తొలగగా | తొలుగగా |
| " | 307 | 14 | ముకాత్మదేయవి | ముక్తాత్మదే నని |

181.48
NGE
Acc No. 21803



| | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| సంకల్పాధికరణము | 310 | 18 | 4-4-7 | 4-4-8 |
| " | 311 | 9 | వగుననియుః | వగుననియు |
| జగద్వ్యాపారాధికరణము | 323 | 4 | ద్వాతశాంతే | ద్వాదశాంతే |
| " | " | " | న్త | స్త |
| అనావృత్త్యధికరణము | 325 | 27 | తాతసిల్లువా | తారసిల్లునా |
| — | 332 | 12 | నగు- | నగు |
| — | 333 | 11 | దేవస్థారము | దేవస్థానము |
| — | 335 | 3 | ఆరాధ్యులమధ్యమ | ఆరాధ్యుల మధ్యమ |
| గ్రంథారంభంముందు | 48 | 10 | దిగంబరం | చిదంబరం |

(స్వ విషయము నందలి 9వ పేజీ తరువాయి)

శివానుగ్రహపరంపరగా తలవని తలంపుగాను విరాళాలు పంపిన
మరికొందరు ఉదార స్వభావులు

4. శివశ్రీ॥ కొడిమేల దుర్గాప్రసాద్ గారు వరంగల్.
5. శివశ్రీ॥ రామగిరి నాగయ్యగారు తెలుగు పండితులు జనగామ వరంగల్ జిల్లా
6. శివశ్రీ॥ వెలగడప చండికేశ్వరశర్మగారు తెలుగుపండితుడు వరంగల్.

వదాన్యులు, మాన్యులు-సంస్కృతాంధ్రవిద్వద్వరేణ్యులు నగు-

7. శ్రీ ఉ. వే. శ్రీమాన్, యస్. యల్. నరసింహాచార్యులు గారు
ప్రిన్సిపాల్-శ్రీ విశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాల, వరంగల్.
విశిష్టాద్వైత సిద్ధాంతైక్యం పురస్కృత్య ఏతై రుదారాశయై రేతద్భాష్య గ్రంథముద్రణార్థం మహాన్ ఆర్థిక సహకారః కృతః-ఇత్యతః మే మహతీ తుష్టిః పుష్టిశ్చ॥ ని. శం.

8. సిద్దిపేట ఆరాధ్యులు, వైశ్యవతంసులును ఇందుకు సహకరించినారు.

9. శ్రీ తేలుకుంట నారాయణరావు, అశోక్‌కుమార్, నరసింహారావుగారలు,
శ్రీ విజయలక్ష్మి సిల్క్స్ జనరల్‌బజార్, సికిందరాబాద్.

శ్రీరస్తు

## శ్రీ నీలకంఠీయ బ్రహ్మసూత్ర భాష్యాంధ్రానువాద సమగ్ర ముద్రణ పరిసమాప్తి శుభసందర్భమున

శ్రీమల్లికార్జున పండితారాధ్య వంశీయులు, శ్రీ కంఠ విద్యాభూషణ, సంస్కృత సాహిత్యరత్న, ఆంధ్రానువాద కుశలాద్యనేక బిరుదాంకితులు! అర్ధ శతాధిక గ్రంధకర్తలు! శ్రౌతశైవసంఘ అధ్యక్షులునైన శివశ్రీ॥ నిర్మల శంకర శాస్త్రి ఆరాధ్యులవారికి వి. చండికేశ్వరశర్మ అనేక శరణులు సమర్పించి, అందఁజేయు "అభినందనము".

శ్రీ మాతా శ్రితభక్తపాలనకరీ శ్రీచక్రసంచారిణీ
శ్యామాభా కులయోగినీ భగవతీ సంపత్కరీ శాంకరీ
కామాక్షీ భువనేశ్వరీ త్రిణయనీ కామేశ్వరీ భ్రామరీ
శ్రీ మాహేశ్వరి కెల్లవేళ్ళగృహమౌ శ్రీ శంభుదివ్యాకృతిన్॥ 1

లింగదయాంతరంగమును లీల సమస్తముఁ దెల్యఁజేయగా
జంగమవేదవిజ్ఞులును జాలరటంచన నంతులేని యా
జంగమమూర్త్యుదంతమును జాటగఁబూనిన నిర్మలాంగ! స
త్సంగతిఁ గూడియున్న తవ సాహసమత్యభినందనీయమౌ! 2

శైశవదశనున్న శైవమతంబును
నుద్ధరింపఁదలచి వృద్ధశివుఁడు
శివభట ముఖ్యులఁజేరగాఁ బిలిచి యా
భూతలమున నంత బుట్టుడనగ
ద్వాదశారాధ్యులై భరతఖండముపైనఁ
గ్రమముగనుదయించి క్రమముగను
సిద్ధత్రయాచార్య చెన్నయారాధ్యులున్

"పండితత్రయము"లై పాటుపడిరి!
శ్రౌతశైవబాల శాంభవదీక్షతో
దినదినప్రవర్ధమానయయ్యె!
కాలమహిమ విషపుఁగాటును వేయగా
నామె చిక్కి నేలనంటియుండ! 3

ఆ పరమేశు సేవలకు
నంకితదేహులు! శ్రౌతశైవదీ
క్షాపరతంత్రమానసులు!
శైవవిశిష్టవిశేషసాహితీ
వ్యాపక ధర్మకంకణులు!
పావనశైవమతాలివేణి దు
ర్వ్యాపిత దీర్ఘరోగముఁ
బాపెడి శ్రీశివయోగవైద్యులున్!
గౌతమ గోత్రసంభవులు!
గౌరవశైవుల సంఘకోటికిన్
నేతలు! సద్గురూత్తములు!
నిక్కపుముక్తిద గ్రంథవిత్త సం
ధాతలు! పండితోత్తము లు
దాత్తతనిండిన భక్తిభావనా
దాతలు! శంకరాఖ్యులు! వి
ధాతయొసంగుత మీకుసౌఖ్యముల్!
భాగ్యనగరాన శైవసౌభాగ్యగరిమ
నియమనిస్వార్థ సేవాపరాయణతను!
నీలకంఠుని భాష్యాల నియతిఁదెలుపు
శంకరా! శివభక్తివశంకర! ధర!
జయతుజయతు జయజయోస్తు జాగృతికర!
భవతుభవతు శుభం భవ భవ్యచరిత!

వెలగడప–చండికేశ్వరశర్మ–వరంగల్.